అనువాద వాఙ్మయము - 47
వ్యాకరణ శాస్త్రము

# మహాభాష్య వివర్తము

## (నవాహ్నికము)

మూలకర్త :
**పతంజలి**

అనువాదకుడు, వివరణకర్త :
**శ్రీమాన్ శరి రామానుజాచార్యులు,** పి.ఒ.ఎల్.
వ్యాకరణ శిరోమణి
రిటైర్డ్ పండిట్, సంస్కృతశాఖ, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు.



తెలుగు అకాడమి
హైదరాబాదు
1983

Translation - mahaabhaashya vivartamu (Mahabhashya Vivartamu) Sanskrit Original : Patanjali; Telugu Translation ; Sriman Kari Ramanujacharyulu, First Edition : 1983; pp. iv+636



*First Edition, 1983*
*Copies : 1000*

Published by TELUGU AKADEMI, Hyderabad-500 029 (Andhra Pradesh), Under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional Languages at the University Level, of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



*Price : Rs.* 34-50

---

Printed in India
at Chary & Company, Secunderabad-500 025
Andhra Pradesh

# ప్రస్తావన

తెలుగు అకాడమి ఇంతవరకు ఇంటర్మీడియట్ స్థాయిలో పాఠ్య గ్రంథాలను, డిగ్రీ స్థాయిలో పఠనీయ గ్రంథాలను ప్రచురించింది. శాస్త్ర గ్రంథ ప్రచురణలో ఇది మొదటి దశ. రెండో దశలో కొన్ని ప్రామాణిక గ్రంథాలకు అనువాదాలను, ఆయా శాస్త్రాంశాలమీద వాటి వాటి ప్రాముఖ్యాన్ని పురస్కరించుకొని మోనోగ్రాఫ్‌లను ప్రచురించదలచింది. ఇందువల్ల విద్యార్థులకూ ఉపాధ్యాయులకూ పాఠ్య గ్రంథాలే కాక ఆయా పాఠ్యాంశాలమీద విస్తృతాధ్యయనానికి సహాయపడే విషయ ప్రధాన రచనలు కూడా లభిస్తాయి. అంతేకాదు. ఉన్నత విద్యా బోధనభాషగా తెలుగు సుప్రతిష్ఠితమై తెలుగు అకాడమి పాత్ర మరింత సుసంపన్నం కాగలదు.

ప్రామాణిక గ్రంథానువాదాలలో ఇది ఒకటి. వేదకాలంనుంచీ భారతదేశంలో వ్యాకరణ శాస్త్ర సంప్రదాయమొకటి అనూచానంగా వస్తున్నది. పాణిని అష్టాధ్యాయికి ఎంతో ప్రశస్తి లభించింది. "మహారాజ్యం వా పాలయేత్ మహాభాష్యం వా పాఠయేత్" అని చెప్పుకోదగ్గ మహాభాష్యం పతంజలి రచన. అందులో నవాహ్నికానికి ఎక్కువ ప్రచారం ఉంది. ఆ నవాహ్నికమే ఇప్పుడు "మహాభాష్య వివర్త"మనే పేరుతో ప్రచురితమైంది. ఇది వ్యాకరణ పాఠకులకెంతో ప్రయోజనకరం.

విజయనగరం మహారాజావారి సంస్కృత కళాశాలలో ఎన్నో సంవత్సరాలు పఠన పాఠనాలు సాగించిన సుప్రసిద్ధ పండితులు శ్రీమాన్ కరి రామానుజాచార్యులు దీనికి వివరణ వ్రాశారు.

గుణగ్రహణ పారీణులయిన పాఠకులు ఈ గ్రంథాన్ని అభిమానించి ఆదరిస్తారని ఆశిస్తున్నాం. సహృదయ విమర్శకులు ఇచ్చే సూచనలను పునర్ముద్రణలో తప్పక పరిశీలించగలం.

# విషయ సూచిక

# మహాభాష్య వివర్తము

## పస్పశాహ్నికము

### అథ శబ్దానుశాసనమ్

శబ్దానుశాసనము ప్రస్తావింపబడుచున్నది.

'అథ' - అను శబ్దమునకు అధికారమర్థము. అధికారమనగా ప్రస్తావము, ప్రారంభమనుట. "శబ్దానుశాసనము" అను శాస్త్ర మారంభింపబడినదని యెఱుంగునది.

వ్యాకరణమునకు 'శబ్దానుశాసన'మని అన్వర్థనామము. అసాధుశబ్దముల నుండి వేరుపరచి సాధుశబ్దముల ననుశాసించునది గనుక శబ్దానుశాసనము. వ్యాకరణమునకి శబ్దానుశాసనమే సాక్షాత్ప్రయోజనము. స్వర్గము, అపూర్వము మున్నగు అదృష్ట ప్రయోజనము అందుత్తమాధికారులకు విశ్వాసమున్నను మధ్యమాధికారులు సాక్షాత్ప్రయోజనమునే కోరుదురు. కావున వారి ప్రవృత్తికి, ప్రరోచకముగ 'శబ్దవ్యుత్పత్తి' అను ప్రత్యక్ష ప్రయోజనము చెప్పబడినది. ప్రయోజన ప్రయోజనములగు 'రక్ష', 'ఊహ' మున్నగునవియు ముందు చెప్పబడును.

ఈ యనుశాసన మేశబ్దములకు ? శబ్దములనగా - వీణతీగల వలన పుట్టునదియు శబ్దమే. పక్షుల ధ్వనులును శబ్దములేగదా ?

వైదిక శబ్దములకును, లౌకిక శబ్దములకును ఇది యనుశాసనము. వ్యాకరణము వేదాంగము. పదరూపములును, వాక్యరూపములును అగు వేదశబ్దముల కిది అనుశాసనము. లోకమునందు ప్రయోగములలో ప్రసిద్ధములయిన శబ్దములు లౌకికములనబడును.

అందు, 'గౌః' 'అశ్వః' 'పురుషః' 'హస్తీ' 'శకునిః' 'మృగః' 'బ్రాహ్మణః' మున్నగునవి లౌకికశబ్దములు.

ఇంక 'శంనో దేవీరభిష్టయే', 'ఇషే త్వోర్జే త్వా', 'అగ్నిమీళే పురోహితం', 'అగ్న ఆయాహి వీతయే'—మున్నగునవి వైదికశబ్దములు. వేదమునందు ఉదాత్తానుదాత్త స్వరిత స్వరముల కాదరముగలదు. అవి తప్పక వేదమునందు పాటింపబడును. అచట పదముల స్వరవిశేషము పదాన్తర సమభివ్యాహారమువలన నిర్ణ

యింపబడుచుండును. కావున నుదాత్తాది స్వర సహితములైన పదముల సమూహరూపములగు వాక్యము లుదాహరింపబడినవి. లోకముననుస్వరము లేకపోలేదు. కాని దాని కంతయాదరము లేనందున పదములు మాత్రమే లౌకికశబ్దముల కుదాహరణములుగా చూపబడినవి.

'గౌః' అనుచో శబ్దమనునది ఏది ? లోకమునందు శబ్దమును, అర్థమును నభిన్నముగా వ్యవహరించుటకలదు. ఇదియేమి? అని ప్రశ్నించినప్పుడు 'ఇది గోవు' అని సమాధానము చెప్పుట చూచుచున్నాము. అచట 'ఈ వ్యక్తికి వాచకమగు శబ్దమేది?' అని ఆ ప్రశ్నకు తాత్పర్యము. సమాధానమునందలి 'ఇది' అను పదమునకు ఆ వ్యక్తి యర్థము. 'గోవు' అను పదమునకు శబ్దమర్థము. కాగా శబ్దమును నర్థమును నొక్కటియే యనునట్లుండుటచేత అందేది శబ్దము యొక్క స్వరూపమో నిర్ధారించుకొనుటకే ప్రశ్న.

'గోవు' అనుమాట వినినతోడనే కలిగెడి జ్ఞానమునందు (1) శబ్దము, (2) జాతి, (3) వ్యక్తి, (4) గుణము, (5) క్రియ,- అనునవి భాసించును. అందు శబ్దమనునది యేది ?

గంగడోలు, తోక, మూపురము, గిట్టలు, కొమ్ములు గలదిగా తోచు నదియా శబ్దము ?

కాదు. అది ద్రవ్యము. అది చతురింద్రియముచే గ్రహింపబడునది. అది శబ్దమెట్లగును ? శబ్దము చెవితో వినబడునదిగదా? ఇది శబ్దానుశాసన ప్రస్తావముగాని ద్రవ్యానుశాసన ప్రస్తావముగాదు.

అట్లయిన ఆ గోవు యొక్క రోమాంచాదులును, శరీర పరిస్పందమును, కన్నులు మూయుట, తెఱచుట మున్నగు అఖీవ్యాపారమును శబ్దమగునా ?

కావు. అవిక్రియలు. శ్రోత్రేంద్రియగోచరము శబ్దము. అట్లైన ఆ గోవు యొక్క తెలుపు, నలుపు, కపిలవర్ణము, లేదా చిత్రవర్ణము—ఇది శబ్దమా?

కాదండీ. అవి గుణములు.

పోనిండు. వ్యక్తులు వేరువేరు అయినను తానొక్కటియేయయి యుండునది, తన ఆశ్రయము నశించినను తాను నశింపనిదియు అగు ఆ గోవ్యక్తి యందుండు సామాన్యమనునది శబ్దమా ?

కాదండి. అది ఆకృతి. అనగా జాతి, లేదా అవయవ సంస్థానము.

ఇక శబ్దమనగానేమి? గంగడోలు, తోక, మూపురము, గిట్టలు, కొమ్ములును గల వ్యక్తియొక్క ప్రతీతి, అనగా జ్ఞానము, శరీరమందలి మారుతము చేత నభిహతములయిన కంఠాదిస్థానములందభివ్యక్తమైన దేనిచే కలుగునో అది శబ్దము. వైయాకరణుల సిద్ధాన్తమున నది స్ఫోటరూపము, వ్యంగ్యము. దానికి వ్యంజకము ఉచ్చారితమగు శబ్దము.

లేదా, శబ్దమనగా ధ్వనియే. లోకమునందదియే శబ్దమని వ్యవహరింప బడుచున్నది. వ్యవహర్తలందరును అర్థబోధకములగు ధ్వనులనే శబ్దమని వ్యవహరింతురుగదా! 'శబ్దముచేయుము' అని యనిన "ధ్వని చేయుము" అని యర్థము. శబ్దముచేయకు మనిన ధ్వనిచేయకుము అని గ్రహింతురు. "ఈ పిల్లవాడూరక శబ్దము చేయుచుండును" అని ధ్వనిచేయువాని నుద్దేశించియే యనుచున్నారు. కావున ధ్వనియే శబ్దము. అది వర్ణరూపము. వ్యంజకమగుదానినే వ్యంగ్యముగా వ్యవహరింతురు.

## శబ్దానుశాసన ప్రయోజనాధికరణము

సంధ్యోపాసనాదులవలె వ్యాకరణాధ్యయనము గూడ నిత్య కర్మయా? లేక కామ్యకర్మయా? కామ్యమైన దీనివలన కలుగు ప్రయోజనములేవి?

రక్ష, ఊహ, ఆగమము, లఘువు, అసందేహము - అనునవి శబ్దానుశాసనమునకు ప్రయోజనములు.

### రక్ష

రక్ష అనగా వేదరక్ష. వేదమును సంరక్షించుటకు వ్యాకరణాధ్యయనము చేయవలెను. వర్ణలోపము, వర్ణముల యాగమము, వాని వికారము వీనిని దెలిసినవాడు బాగుగ వేదములను రక్షింపగలడు. లౌకిక సంస్కృత భాషలో లోపాదులుండని పదములకు వైదిక భాషలో నవియగపడుచుండును. అట్టి పదముల నందుచూచి, వ్యాకరణాధ్యయనము చేయనివాడు వానిని ప్రమాదములని తలంచి, వానిని దిద్ది పాఠాన్తరములను గూడ కల్పింపవచ్చును. అది భ్రమ.

వైయాకరణుడైన వాని కాభ్రమకలుగదు. అతడు వేదార్థము నెరింగి, దోషరహితముగ మంత్రముల నుచ్చరించుచు కర్మానుష్ఠానము చేయును. దాని వలన స్వర్గాది ఫలముల నందును.

ఉదాహరణమును బరికింపుడు. వేదమునందు "దేవా అదుహ్ర" అని యున్నది. "అదుహ్ర" అనిన "అదుహత-పితికిరి" అని యర్థము. అదుహత అను లౌకిక రూపమునందు, "లోపస్త ఆత్మనేపదేషు (7-1.41) అను సూత్రమువలన తకారలోపమును,"బహులం ఛందసి" (7-1.8)అను సూత్రముచే రుడాగమమును రాగా "అదుహ్ర" అని రూపమేర్పడినది. వైయాకరణుడు ఈ విషయమును తెలిసిన వాడు గాన అతడది యపరూపమని భ్రమపడి దిద్దుబాటు చేయక వేద స్వరూపమును యథాతథముగ సంరక్షించును.

ఇంకొక యుదాహరణము, "ఉద్గ్రాభంచ నిగ్రాభంచ" అనునది. ఇట హ కారమునకు భ కారము వర్ణ వికారము. "హ్యగ్రహోర్భశ్ఛన్దసి వక్తవ్యః" అను వార్తికముచేత వచ్చినది. ఈ విధముగ వేదరక్షణము మొదట సాక్షాత్ప్రయోజనము.

## ఊహము

'ఊహము' ఊహమనగా మార్పు. వేదములో మన్త్రములు, ఏదియో ఒక లింగమును, విభక్తియు, వచనమును గల పదములతో నుచ్చరింప బడి యున్నవి. సర్వలింగ విభక్తి వచనయుక్తముగ పఠింపబడి యుండలేదు. వానిని యజ్ఞముల నాచరించు పురుషుఁడు యథాయథముగ మార్చుకొని పఠింపవలెను. యాగములు ప్రకృతి యాగములనియు, వికృతి యాగములనియు నిరుతెరగులు. సమగ్రాంగోపదేశముగల యాగములు ప్రకృతి యాగములు. సకలాంగోపదేశము వికృతియాగములందుండదు. ఆగ్నేయయాగము ప్రకృతి యాగము. అందు "అగ్నయేత్వాజుష్టంనిర్వపామి" అని అగ్నికి మంత్రము పఠింపబడి యున్నది. ఈ మంత్రము నుచ్చరించుచు అగ్ని దేవతకు, చరునిర్వా పము చేయవలెను.

సౌర్యయాగము వికృతియాగము. ఇట సూర్యునకు చరునిర్వాపమును బోధించు మంత్రము పఠింపబడి యుండలేదు. దానిని ఇచట కల్పించుకొన వలెను. అదియే ఊహ, ఊహము అనబడును. ఆ కల్పనకు ప్రమాణము "ప్రకృతి వద్వికృతిః కర్తవ్యా" అను అతిదేశము. ప్రకృతియాగమును వలెనే వికృతియాగమును సకలపదార్థ సహితముగ అనుష్ఠింపవలెనని అర్థము "సౌర్యం చరుం నిర్వపే ద్బ్రహ్మవర్చసకామః"అని చరునిర్వాపము వికృతియాగమున విధింప బడినది. బ్రహ్మవర్చసమును గోరువాడు సూర్యదేవతాకమగు చరువును నిర్వా పము చేయవలెనని ఉన్నది. పై అతిదేశమువలన నిట సూర్యమంత్రమును కల్పింప వలసి యున్నది. అగ్నిశబ్దస్థానమున సూర్యశబ్దమునుంచి తదనుగుణముగ విభక్తి ప్రత్యయమును మార్పుచేసి 'సూర్యాయత్వాజుష్టం నిర్వపామి' అని పఠింపవలె ననుట. ఈ మార్పే ఊహ. తత్తద్విభక్తివచనజ్ఞానము వ్యాకరణాధ్యయనము నకు ఫలము.

## ఆగమము

వ్యాకరణాధ్యయనమునకు ఆగమము గూడ ప్రయోజనము. ప్రయోజన శబ్దమునకు, ఫలమనియు, కారణమనియు అర్థములు. ఇట ప్రయోజన మనఁగా ప్రయోజకము. అనగా గారణము. ఆగమమనగా వేదము. ఆ వేదము, "బ్రాహ్మణేన నిష్కారణోధర్మః షడంగో వేదోఽధ్యేయోజ్ఞేయశ్చ" అని బోధించు చున్నది. బ్రాహ్మణుడు దృష్ట ప్రయోజనము నపేక్షింపకయే షడంగ సహిత వేదాధ్యయనము చేసి దాని యర్థపరిజ్ఞానమును గూడ సంపాదింపవలెను అని యర్థము. షడంగ సహిత వేదము నధ్యయనముచేయవలెననుటచే, అంగాధ్యయ నమును కర్తవ్యము. అందును ఆరంగములందును ముఖ్యమగునది వ్యాకర ణము. ప్రధానమునందు జేయబడు యత్నము ఫలవంతమై ధర్మపురుషార్థము లభింపజేయును. కాగా ఆగమము, శబ్దానుశాసనమునకు కారణము.

## లఘువు

లఘ్వర్థమును వ్యాకరణమధ్యేయము. లఘువనగా లఘూపాయము. సాధుశబ్దములను తెలిసికొనుటకు లఘువగు నుపాయము, వాని శాస్త్రీయ ప్రక్రియను తెలిసికొనుట. ఇది వ్యాకరణాధ్యయనసాధ్యము. "బ్రాహ్మణేనావశ్యం శబ్దాః జ్ఞేయాః" బ్రాహ్మణుడై నవాడవశ్యము సాధుశబ్దపరిజ్ఞానము కలవాడు కావలెను. అతని కధ్యాపనము ధర్మము. సాధుశబ్దపరిజ్ఞానము లేని గురువును శిష్యులు చేర రాదు. సాధుశబ్దపరిజ్ఞానమునకు కోశాదులందు ప్రతిపదపాఠము లఘూపాయము గాదు. ప్రకృతి ప్రత్యయ విభాగముచేసి శబ్దముల నన్వాఖ్యానము చేసిన వ్యాకరణమే తేలిక ఉపాయము. తత్పరిజ్ఞానమును శబ్దానుశాసన ప్రయోజనములలో నొకటి.

## అసందేహము

అసందేహమనగా సందేహము కలుగకుండుట, సందేహప్రాగభావము. సందేహము కలిగి పిదపనది నివృత్తమయిన నది సందేహ ప్రధ్వంసాభావమగును. సందేహప్రాగభావపరిపాలనమే వైయాకరణునకు కర్తవ్యము. తదర్థమై వ్యాకరణ శాస్త్రాధ్యయనము చేయవలెనని ఫలితము.

ఉదాహరణము : "స్థూల పృషతీ మాగ్నివారుణీ మనడ్వాహీ మాలభేత" అని యాజ్ఞికులు పఠింతురు. ఇట 'స్థూలపృషతి'అననేమి? 'స్థూలాచాసౌపృషతీచ' అని కర్మధారయ సమాసమయిన యెడల, స్థౌల్యము గలదియు, చుక్కలు శరీరమునగలదియు నగునదియని యర్థమగును. అట్టి గోవునాలంభముచేయ వలెను 'స్థూలానిపృషన్తియస్యాస్సా' - అని బహువ్రీహి సమాసమయిన పెద్ద పెద్ద చుక్కలుగల యావునని యర్థమగును. ఇందేయర్థము గ్రాహ్యము ? అను సందేహము వైయాకరణులు కానివారికి గలుగును. ఈ సందేహము స్వరపరిజ్ఞానముగల వారికి కలుగదు. ఇచట, స్థూల శబ్దాకారముదాత్తముగా వినబడు చున్నదా ? పృషతీశబ్దమునందలి ఈ కారముదాత్తముగా వినబడుచున్నదా యని చూచి, పూర్వపదాన్తవర్ణముదాత్తముగా వినబడుచున్నందున, నిదిబహువ్రీహియేయని నిర్ణయమును వైయాకరణుడు చేసికొనును. "బహువ్రీహౌ ప్రకృత్యా పూర్వపదమ్"(6-2.1) అనునది పూర్వపదాన్తోదాత్త విధాయకము. "సమాసస్య"(6-1.223)అనునది సమాసమున కంతోదాత్తవిధాయకము. కాగా నిట స్వరమును బట్టి సందేహము కలుగనే కలుగకుండుట వ్యాకరణాధ్యయన ప్రయోజనము.

## ఆనుషంగిక ప్రయోజనములు

ఆనుషంగిక ప్రయోజనములు పదుమూడు. అవి : (1) తేఽసురాః॥ (2) దుష్టః శబ్దః॥ (3) యదధీతమ్॥ (4) యస్తు ప్రయుంక్తే॥ (5) అవిద్వాంసః॥

(6) విభక్తిం కుర్వన్తి॥ (7) యో వా ఇమామ్॥ (8) చత్వారి॥ (9) ఉత త్వః॥ (10) సక్తుమివ॥ (11) సారస్వతీమ్॥ (12) దశమ్యాం పుత్రస్య॥ (13) సుదేవో అసి వరుణ॥ అనునవి. ప్రయోజనములనగా-ప్రవర్తకములును, ఫలములును. ఏత దాది వాక్యములు ప్రవర్తకములు. ఆ వాక్యములచే బోధ్యములు ఫలములు.

## (1) "తేఽసురాః"

ఇది ప్రతీకము. తదాదివాక్యము, "తేఽసురా హేఽలయో హేఽలయ ఇతి కుర్వన్తః పరాబభూవుః। తస్మాద్బ్రాహ్మణేనన మ్లేచ్ఛితవై నాపభాషితవై, మ్లేచ్ఛో హ వా ఏష యదపశబ్దః॥" అనునది. ఇది బ్రాహ్మణ గ్రంథమునందలి నిందాపరమగునర్థ వాదము.

ఆ రాక్షసులు "హేఽలయః, హేఽలయః" అని ప్రయోగించుటచే, పరాభ వమునందిరి. అపశబ్దము మ్లేచ్ఛము - అనగా నింద్యము. కాన బ్రాహ్మణు డపశబ్ద ప్రయోగమును జేయరాదు. మనము నింద్యులముకాకుండుటకు వ్యాక రణాధ్యయనము చేయవలెను. ఇట "హే అరయః" - అని ప్లుత ప్రకృతిభావము లతో, బ్రయోగింపకుండుటయు, రేఫస్థానమున లకారమును పలుకుటయు, అపశబ్దనము. పదములకు ద్విత్వమును జేయక వాక్యమునకు ద్విర్వచనమును జేయుటయు తప్పుగా నుచ్చరించుటయే. "తేఽసురాః" (1)

## (2) "దుష్టః శబ్దః"

"దుష్ట శ్శబ్దః స్వరతో వర్ణతో వా
మిథ్యా ప్రయుక్తో న తమర్థ మాహ ।
స వాగ్వజ్రో యజమానం హినస్తి
యథేన్ద్రశత్రుః స్వరతోఽపరాధాత్ ॥"

అపశబ్ద ప్రయోగమువలన ప్రత్యవాయము కలుగునని ప్రతిపాదించు శిక్షా వాక్యమిది. స్వరముగాని వర్ణముగాని తప్పుగా నుచ్చరించిన ఆ శబ్దమప ప్రయోగమగును. అట్టి శబ్దము అభిమతార్థమును బోధింపజాలదు. అంతియ కాక యిది వాగ్రూపమగు వజ్రాయుధమై యజమానుని జంపును. 'ఇంద్రశత్రుః' అను పదము స్వరదోషమువలన యజమానుని హింసించినదిగదా! ఈ వృత్తాం తము, తైత్తిరీయ సంహితలో, ద్వితీయకాండమున, పంచమప్రపాఠకమునందు గలదు.

త్వష్టకుమారుడు విశ్వరూపుడనువాడు. వానినింద్రుడు చంపెను. అందువలన కుపితుడైన త్వష్ట, ఇంద్రుని జంపగల శక్తి గలిగిన వేరొక కుమా రుని పొందతలంచి అభిచార హోమము నారంభించెను. అపుడాహవనీయాగ్నిని

ప్రార్థించుచు, "ఓ అగ్నీ ! నీకు స్వాహుతము. నీవు ఇంద్రుని బరిమార్చునట్టి యొక పురుషుడవై వర్ధిల్లుము" అను నర్థముగల "స్వాహేంద్ర శత్రుర్వర్ధస్వ" అను మంత్రమూహింపబడినది. అందలి శత్రుపదమునకు 'శాతయిత' = నాశకుడు అని యర్థము. 'ఇంద్రస్య శత్రుః' అని తత్పురుష సమాసము అభిప్రేతము. కావున నా పదమును అంతోదాత్తముగ నుచ్చరింపవలసియుండ ఆద్యుదాత్తముగా ఋత్విజుడుచ్చరించెను. అది మహాపరాధమై బహువ్రీహి సమాసార్థమగు ఇంద్రుడునాశకుడుగా కలవాడవయి యుద్భవింపుమను నర్థమును స్ఫురింపజేయుటచే, నపుడు పుట్టిన వృత్రున కింద్రుడే నాశకుడాయెను. కాన నీవిధముగ దుష్టములగు శబ్దములను మనము ప్రయోగింపకుందుముగాక యని వ్యాకరణాధ్యయనము చేయవలెను. "దుష్టః శబ్దః" (2)

## (3) "యదధీతమ్"

"య దధీత మవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే ।
అనగ్నావివ శుష్కైధో న త జ్జ్వలతి కర్హిచిత్" ॥

అనునది నిందార్థవాదము.

"ఏది అధీతమైనను అర్థపరిజ్ఞానము లేనందున, శబ్దపారమాత్ర పర్యవసితమయి యుండునో అది, అగ్నిలేనిచోట బడవేయబడిన కట్టె ఎందుదైనను, మండనట్లు, ఎందును ప్రకాశింపదు" అని యర్థము. కావున మన యధ్యయనము నిష్ఫలమైనది కాకుండుటకు వ్యాకరణమును బఠింపవలెను. "యదధీతమ్" (3)

## (4) "యస్తు ప్రయుంక్తే"

"యస్తు ప్రయుంక్తే కుశలో విశేషే
శబ్దాన్ యథావ ద్వ్యవహారకాలే ।
సోఽనన్త మాప్నోతి జయం పరత్ర
వాగ్యోగవి ద్దుష్యతి చాపశబ్దైః ॥ "

"ఎవడు వ్యాకరణాధ్యయనముచేసి, శబ్దముల నాయా యర్థములందు, లక్షణస్మరణపూర్వకముగ, వ్యవహారకాలమున ప్రయోగించునో, అట్టి వాగ్యోగవేత్త, ప్రకృతి ప్రత్యయ విభాగ జ్ఞానపురస్సరముగ నాయా శబ్దముల యర్థవిశేషముల నెఱింగినవాడగుటవలన, పరలోకమున నభ్యుదయమునందును. అపశబ్ద ప్రయోగమును చేసినచో దోషమునందును" అని యీ శ్లోకమునకు భావము.

"దుష్యతి చాపశబ్దైః"— అపశబ్ద ప్రయోగమువలన దోషమును బొందునదియెవడు ? అనగా, వాగ్యోగవేత్తయే.

వాగ్యోగము నెరింగిన జ్ఞానికదా యాతనికి దోషమేల కలుగును ? అనిన- సాధుశబ్దముల నెరింగినవా డసాధుశబ్దములను గూడ నెరిగియే

యుండును. కావున శబ్దజ్ఞానమువలన ధర్మము కలిగినట్లే, అపశబ్దజ్ఞానమువలన నధర్మమును గల్గును అది తప్పదు. పైగా నధర్మమే అధికముగా గలుగు ననవలె. సుశబ్దముల కంటె నపశబ్దములే అధికసంఖ్యలో నుండును గదా! ఒక సుశబ్దమున కెన్నియో అపభ్రంశ శబ్దములుండును. "గౌః" అనుశబ్దమునుజూడుడు. దానికి-గావీ, గోణీ, గోతా, గోపోతలికా - మున్నగునవి ఎన్నియో యప భ్రంశములు!

వాగ్యోగవేత్త కానిచో నవి యపశబ్దములని వానికి దెలియదుగాన, పులి బ్రాహ్మణుని జంపినను, దానికి బ్రహ్మహత్యాదోషమంటనట్లు, అజ్ఞానమే రక్షకమగును. కావున వ్యాకరణజ్ఞునకే అపశబ్ద జ్ఞానదోషము కలుగును.

ఓహో! కాని మీ యుపన్యాసము వస్తుస్థితికి భిన్నముగనున్నదే!

శాస్త్రాజ్ఞానము సర్వథా శరణము కాజాలదు. తిర్యగ్జంతువులకు విధి నిషేధములను దెలిసికొను యోగ్యతలేదు కావున వానికి అజ్ఞానము రక్షకమైన కావచ్చును. పురుషులకు విధి నిషేధములయం దధికారము గలదు. వారు విధి నిషేధ శాస్త్రజ్ఞానమునకై ప్రయత్నింపవలెను గాని, మాకా విషయము తెలియదనిన మాత్రమున దోషము తప్పునదికాదు. ఒకానొకడు, బ్రహ్మహత్య దోషజనకమని తెలియక, బ్రహ్మహత్యచేయుననుకొనుడు. వానికిని పాతిత్యము తప్పదు. కాని తాను చంపిన వ్యక్తి బ్రాహ్మణుడని తెలియక ఆ పని చేసినచో నపుడు, పాపము కొంత తగ్గిన తగ్గవచ్చును. అట్లే సురాపానముచేసి "అది తప్పుపని యని నే నెఱుగ" ననినను పాతిత్యము తప్పునదికాదు.

అటులైన నీ శ్లోకము నీవిధముగ వ్యాఖ్యానింతము:

"సోఽనన్త మాప్నోతి జయంపరత్ర వాగ్యోగవిత్"— అనునంతవఱ కొక వాక్యము—ప్రకృతి ప్రత్యయముల విభాగమును, వాని సంస్కారమును దెలిసిన వాగ్యోగవేత్త, తన కభిమతమయిన అర్థమునందు సాధు శబ్దములను బ్రయోగించి పరలోకమునందు జయమునందును అని దాని యర్థము.

"దుష్యతి చాపశబ్దైః" అనునది వేఱువాక్యము. అపశబ్ద ప్రయోగముచే దోషమునుబొందునది యెవరు? అని ప్రశ్న కలుగగా, అవాగ్యోగవేత్తయే (వాగ్యోగవేత్త కానివాడు) కర్తగా నన్వయించును. వాగ్యోగజ్ఞుడు, శబ్దములను అపశబ్దములను నెఱింగినను సుశబ్దములనే ప్రయోగించును. ఆ వాగ్యోగ జ్ఞానమే, సాధుశబ్దములనే ప్రయోగించునట్లు చేసి యాతని కభ్యుదయము ఘటించును. అయిన నీశ్లోక మెచ్చట వర్ణింపబడినది?

'భ్రాజలు' అను శ్లోకములు కొన్ని గలవు. అవి కాత్యాయనునిచే రచింపబడినవి. ఇది వానిలోనొకటి. ఓహో శ్లోకములుగూడ ప్రమాణమా? అటులైన

నీ క్రింది శ్లోకము గూడ, ప్రమాణము కావలసియుండును—

"యదుదుంబర వర్ణానాం ఘటీనాం మండలం మహత్ ।
పీతం న గమయేత్స్వర్గం కిం తత్క్రతుగతం నయేత్॥"

"పెద్దపెద్ద కడవలలో నిండుగనున్న మద్యమునంతను ద్రాగినను లభింపని స్వర్గము 'సౌత్రామణి' అను యాగములో ఒక చిన్న గ్రహపాత్రలోనున్న యల్పాల్పమగు సురాద్రవ్యమును ద్రాగిన లభించునా?" అని యీ శ్లోకమున కర్థము. కావున "సౌత్రామణి యాగమును మాని, పానశాలలో మద్యమునే సేవింపుడు" అని భావము. ఈ శ్లోకమును ప్రమాణమగునా?

పూజ్యుడగు నీశ్వరుడు, తనకు దైత్యుల యందుగల ద్వేషముచే, తనకుగా వేదముల విషయమున విప్రతిపత్తి లేకున్నను, దానినారోపించుకొని గానముచేసిన శ్లోకమిది. కనుక అప్రమాణము అప్రమత్త గీతములు శ్లోకములైనను ప్రమాణములగును. భ్రాజశ్లోకమట్టిది అందెట్టి విప్రతిపత్తియులేదు, అయ్యది "ఏకః శబ్దః సమ్యక్ జ్ఞాతః శాస్త్రాన్వితః సుప్రయుక్తః స్వర్గేలోకే కామధుగ్భవతి" అను శ్రుతి వచనము అనుగ్రాహకముగాగలది. ఏ శబ్దమైనను వ్యాకరణ జ్ఞానపూర్వకముగ బ్రయోగింపబడవలెను. అపుడది సుప్రయుక్తమును, శాస్త్రాన్వితమును నగుటచే స్వర్గలోకమున నభీష్టఫలముల నొసంగును అని శ్రుత్యర్థము. "యస్తు ప్రయుంక్తే" అను శ్లోకమును నీశ్రుత్యర్థమునే చెప్పుచున్నది కాన సర్వథా ప్రమాణమే. "యస్తు ప్రయుంక్తే" (4)

## (౫) "అవిద్వాంసః"

"అవిద్వాంసః ప్రత్యభివాదే నామ్నో యే న ప్లుతిం విదుః ।
కామం తేషు తు విప్రోష్య స్త్రీష్వివాయ మహం వదేత్"॥

అభివాద విషయమున స్త్రీసామ్యము మనకు కలుగకుండుటకై వ్యాకరణాధ్యయనము మనము చేయవలెను

శిష్యుడు ప్రవాసమునుండి తిరిగివచ్చి గురువునకు నమస్కారము చేయవలెను. నమస్కారమనగా శాస్త్రీయ ప్రక్రియలో "అభివాదయే భారద్వాజగోత్రః కృష్ణశర్మాహం భోః" అని నామగోత్రోచ్చారణ పూర్వకముగ పాదోపసంగ్రహణమును జేయుట. అపుడు గురువు ప్రత్యభివాదమును జేయును. అనగా నాశీర్వచనమనుట. ఆ ప్రత్యభివాదవాక్యమునందు, అభివాదకుని నామాంతమున ప్లుతమునుచ్చరించి "ఆయుష్మానేధి కృష్ణశర్మా౩న్" అని యీతీరున ఆ వాక్యమును బలుకవలెను.

వ్యాకరణ శాస్త్రజ్ఞానములేని గురువులైన, నామాంతమును ప్లుతముగానుచ్చరింపవలెనని యెఱుంగరు. అట్టివారికి శిష్యుడభివాదమును జేసినపుడు, "అయమహంనమామి" ('అయ్యా, నమస్కారమును జేయుచున్నాను') అని మాత్రమే, స్త్రీలకు నమస్కారము చేసినపుడువలె, తన యంజలిని హృదయ దేశమునునుంచి, అభివాదన భ్రాంతినిగలిగించి సంతోషింపజేయునే గాని శాస్త్రీ

యాభివాదనమును జేయడు. అది చూచి యా గురువు తన శాస్త్రాజ్ఞానము వలనగదా తనకిట్టి యవమానము కలిగినదని బాధపడును. అట్టి దురవస్థను వారించుకొని తమకు స్త్రీసామ్యభావనకు ప్రసక్తి లేకుండ జేసికొనవలెనని వ్యాకరణమధ్యేయము. "అవిద్వాంసః" (5)

## (6) "విభక్తింకుర్వన్తి"

'విభక్తులను జేర్పవలెను' అని ఈ ప్రతీకమునకర్థము.

"ప్రయాజాః సవిభక్తికాః కార్యాః" అనునది యాజ్ఞిక పఠితమగు మంత్రము. ఇయ్యది ఆథేయేష్టియందామ్నాతము. ప్రయాజలను విభక్తులతో ఉచ్చరింపవలెనని అది అర్థరహితమగును ప్రయాజలనగా యాగములు. కాగా ఇచ్చట, ప్రయాజమంత్రములని యర్థము. ప్రకృతియాగమున ఆ మంత్రములు విభక్తి సహితములుగనే పఠింపబడియున్నవి. కాని వికృతి యాగమునందు-అతిదేశము వలన అగ్నిశబ్దమునూహించి, విభక్తులనుగూడ నూహచేసి మంత్రములను పఠింపవలెను. "త్వమగ్నే ప్రయాజానుయాజానాం పురస్తాత్, త్వం పశ్చాత్" అను మంత్రవర్ణము వలన, అగ్నిశబ్ద ప్రకృతికములగు విభక్తులనే 'ఊహ' చేయవలెను. వ్యాకరణజ్ఞానము లేనిచో, నామంత్రములందు అగ్నిశబ్ద ప్రకృతిక విభక్త్యన్త పదములను గల్పించిపఠించుట శక్యముకాదు. కాన వ్యాకరణాధ్యయన మావశ్యకమగునని భావము. "విభక్తింకుర్వన్తి" (6)

## (7) "యోవాఇమామ్"

**"యో వా ఇమాం పదశః స్వరశోఽక్షరశశ్చ వాచం విదధాతి స ఆర్త్విజీనో భవతి।"** అను నిదియొక మంత్రము.

"ఎవడీ వేదరూపమగు వాక్కును, ప్రతి పదముననను, ప్రత్యక్షరముననను, ఉదాత్తాదిస్వర విషయముననను, సశాస్త్రముగ సంస్కరించునో అట్టివాడే ఆర్త్విజీనుడగును" అని యర్థము.

ఋత్విజమర్హతి = ఆర్త్విజీనః। యజ్ఞమును చేయుటకును, చేయించుటకును అధికారార్హతలు గలవాడని భావము.

'విద్వాన్యజేత', 'విద్వాన్యాజయేత్'— అని చెప్పియుండుటచే యజన యాజనములందు విద్వాంసులకే అధికారము. విద్వాంసుడనగా వేదార్థము నెఱింగినవాడు. ఆతడే యష్టయు, యాజకుండును కాదగినవాడు. కనుక మనమును, ఆర్త్విజీనులమగుట కర్హతను సంపాదించుటకై వ్యాకరణాధ్యయనము చేయవలెనని తాత్పర్యము. "యోవాఇమామ్" (7)

## (8) "చత్వారి"

ఈ ప్రతీక మాదిని గల మంత్రము :

**"చత్వారి శృఙ్గా త్రయో అస్యపాదా**
**ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య।**

త్రిధా బద్ధో వృషభో రోరవీతి
మహో దేవో మర్త్యాన్ ఆవివేశ॥" (ఋగ్వేద సంహిత; 4-58-3.)

అనునది. ఈ ఋఙ్మంత్రము వ్యాకరణాధ్యయనము మోక్షసాధనమని బోధించుచున్నది. ఇందు శబ్దము వృషభముగా రూపింపబడినది. ఈ శబ్దవృషభమునకు నాలుగు కొమ్ములు. మంత్రమునందలి 'శృఙ్గా' అను పదము 'శృంగాణి' అనుదానికి వైదికరూపము. ఈ వృషభమునకు పాదములు మూడు. తలలు రెండు. చేతులు ఏడు. లోకమునందలి వృషభమునకు కంఠమునందు మాత్రమే బంధముండునుగాని, ఇది ఉరము, కంఠము శిరము-అను మూడు స్థానములందు బంధింపబడినది. వృషభము అను పదమునకు 'వర్షించునది' అని యర్థము. ఈ శబ్దవృషభము కామములను వర్షించును. "స్వర్గేలోకే కామధుగ్భవతి" అని శ్రుతి.

నాలుగు కొమ్ములనగా నాలుగు విధములయిన పదములు. అవి: పర, పశ్యన్తి, మధ్యమ, వైఖరి. అనువాక్కులు అనియు, లేదా ఆఖ్యాతములు, నామలు, ఉపసర్గలు, నిపాతలు-అనునవి యనియు చెప్పవచ్చును.

మూడు పాదములనగా, భూతభవిష్య ద్వర్తమానములను మూడు కాలములు. రెండు తలలు, రెండు శబ్దములు. అనగా నిత్యమగు వ్యంగ్యశబ్దము, అనిత్యమగు వ్యంజకశబ్దము. ఏడు చేతులు, ఏడు విభక్తులు. కాగా నిది ద్విశృంగము, ద్విపాదము, ద్వికరము, కంఠమాత్ర బద్ధమునగు లౌకిక వృషభము కంటె విలక్షణము.

శబ్దశాస్త్ర ప్రతిపాద్యమగు ఈ వృషభాకార శబ్దమిట్లు ఘోషించును. 'రోరవీతి' అనగా మిక్కిలి ఘోషించుచున్నది అని యర్థము. 'రు'ధాతువునకు శబ్దించుట అర్థముగదా!

ఏమని ఇది శబ్దించుచున్నది? అనిన,—
మహః = మహాన్ = పరబ్రహ్మస్వరూపమగు, దేవః = అంతర్యామి శబ్దము, మర్త్యా = మర్త్యాన్ = మరణధర్మలగు మనుష్యులను, ఆవివేశ = ఆవేశించి యుండెను,-అని ఘోషించుచున్నది.

ఆయావేశమునకు ఫలము ఆ మహాదేవునితో మనకు సాయుజ్యము కలుగుట. వాగ్యోగవేత్త శాస్త్రనిష్పన్న శబ్ద జ్ఞానపూర్వకముగ. శబ్దములను ప్రయోగించునుగాన, అందు మూలమున నాతని పాపములు నశించి, అహంకారగ్రంథులు సడలి, బ్రహ్మస్వరూపమగు నాశబ్ద వృషభసాయుజ్యము నందును. కావున వ్యాకరణాధ్యయనము కర్తవ్యము.

గ్రంథాన్తరములందీ మంత్ర మగ్నిపరముగా వర్ణింపబడినను, ఇటనిది వాగ్విషయముగ వ్యాఖ్యానింపబడినది.

కేవల వాగ్విషయకమగు వేఱొక ఋఙ్మంత్రముగూడ "చత్వారి" అను పదమాదిగా గలదియే యుపలబ్ధమగుటచే నదియు వ్యాఖ్యానింపబడుచున్నది.

"చత్వారి వాక్పరిమితా పదాని
తాని విదుర్బ్రాహ్మణా యేమనీషిణః ।

గుహా త్రీణి నిహితా నేఙ్గయంతి
తురీయం వాచో మనుష్యా వదన్తి ॥" (ఋ. సం. 1-164-45)

వాక్పరిమితా = వాచఃపరిమితాని = ఇన్నిమాత్రమేయని పరిచ్ఛిన్నములైన, పదాని = శబ్దజాతములు, చత్వారి = నాలుగు పరాపశ్యన్తీ మధ్యమా వైఖరులనునవియు, నామాఖ్యాతోపసర్గనిపాతములను నవియు నను వీనిలో నొకొక్క తెరగు నాలుగంశములు గలది. మనస్సును విషయాంతరములనుండి మరలించి, బ్రహ్మాత్మకమగు వేదమును సాంగోపాంగముగ తెలిసికొనినవారు-అనగా వైయాకరణులు, సమగ్రముగ తెలిసికొందురు. వారికి గుహాంధకారమును ఛేదింపగల శాస్త్రబలము కలదు.

అజ్ఞానమను గుహయందు నిహితములైయున్న ఆ పదజాతములయొక్క మూడు భాగములు వైయాకరణులు కానివారికి స్ఫురింపవు. స్ఫుటముగ భాసింపవు. వాని నాలుగవభాగము మాత్రమే వారికి గోచరమగునది. అంత మాత్రమునే వారు వ్యవహరింపగలరు కాబట్టి, సకలపదజ్ఞానముకొఱకు వ్యాకరణాధ్యయనము కర్తవ్యము, అని భావము. "చత్వారి" (8)

(9) "ఉత త్వః"

ఇదియు ఋఙ్మన్త్ర ప్రతీకమే. ఏతదాది మంత్రమిది:
ఉత త్వః పశ్యన్న దదర్శ వాచముత త్వః శృణ్వన్న శృణోత్యేనామ్।
ఉతో త్వస్మై తన్వం విసస్రే జాయేవ పత్య ఉశతీ సువాసాః ॥"
(ఋ సం 10-71-4)

ఉత=మరి, త్వః = ఒకడు, వాచమ్ = వాక్కును, పశ్యన్ = చూచుచున్నవాడయ్యును, నదదర్శ=చూడడు. ఉత=మరియు, త్వః=ఒకడు=, శృణ్వన్=వినుచున్నవాడయ్యును, ఏనామ్ = ఈవాక్కును, నశృణోతి = వినడు.

ఒకానొకడు, తనతో నధ్యయనము చేయువారందరితోనితరాంశములందు సమానుడైయుండి బాగుగ నధ్యయనమును జేయుచున్నను, అర్థపరిజ్ఞానము కలుగనందున నధ్యయనముచేయనట్లే పర్యవసించును. వేరొక్కడు ఆ శబ్దములను వినుచున్నను, విననట్లేయగును అర్థజ్ఞానముకలిగిన గదా శ్రవణము సార్థకమగునది! ఇంతదనుక నీయర్ధర్చము (ఋగర్ధము) అవిద్వాంసునకు నింద్యతను దెలుపునది. ఉత+ఉ = ఉతో = మరియు, తస్మై = వేరొకనికొఱకు, తన్వంఉత=శరీరమునుగూడ, విసస్రే=వివిక్తముగజూపును. ఎవరు? వాక్కు. ఎవరివలె? (ఉశతీ సువాసాః జాయా ఇవ పత్యే) "భర్తకొఱకపేక్షగలదియై, సూక్ష్మమగు వస్త్రమును ధరించి వేచియున్న భార్యవలె".

వైయాకరణునకు, వాగ్దేవి తన శరీరమగు నర్థమును బాగుగా ప్రకాశింపజేయును. వాగ్యోగవేత్తయగు వైయాకరణుడును, శబ్దరూపమగు నీవాక్కును ప్రకృతి ప్రత్యయవిభాగపురస్సరముగ విశదపరచి, దాని యర్థమును దెలిసికొనును. ఆ వాక్కును, అట్టివానికే తనను వివరించును. కావున,

వాక్కు మనకు ప్రసన్నమై తనను విశదముగ దెలియపరచుటకొరకు వ్యాకరణాధ్యయనము కర్తవ్యమని భావము "ఉత త్వః" (9)

(10) "సక్తుమివ"—ఇదియు నింకొక ఋఙ్మంత్ర ప్రతీకము.

"సక్తుమివ తితఉనా పునన్తో యత్ర ధీరా మనసా వాచ మక్రత ।
అత్రా సఖాయ స్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధివాచి ॥"
(ఋ సం. 10-71-2)

"ఎవరు వ్యాకరణ శాస్త్ర విషయమున విశేషధ్యానము గలవారై, జల్లెడతో పేలపిండిని జల్లించినట్లు, ధ్యానయుక్తమగు మనస్సుతో వాక్కును శోధించి, అసాధుశబ్దములనుండి వేఱుపరచిరో, వారా కారణమువలన చిత్తశుద్ధినంది, వ్యాకరణ శాస్త్ర ప్రతిపాద్యమగు బ్రహ్మాత్మక శబ్దమునందు, బ్రహ్మైకత్వజ్ఞానము గలవారగుదురు. పిదప నాదృష్టాంతముచేతనే సకల పదార్థములందును బ్రహ్మభేదజ్ఞానమునంది సాయుజ్యమును బొందుదురు. ఏలయన-వీరి వాక్కులందు, స్వప్రకాశబ్రహ్మరూపమగు లక్ష్మి, అధికముగా నిహితమైయుండును," అని ఋగర్థము.

ఇందు సక్తుశబ్దము 'షచ-సేచనే' అను ధాతువునుండి నిష్పన్నమయినను, 'షచ-సమవాయే' అను ధాతువునుండి నిష్పన్నమయినను గావచ్చును. అందు ధాతువు దుశ్శోధమను నర్థమును బోధించును. ప్రత్యయము ఔణాదికమగు తున్ప్రత్యయము, కర్మార్థకము. లేదా, వికాసార్థకమగు 'కస'ధాతువునుండి వర్ణవ్యత్యయముచే నేర్పడినదనియు చెప్పవచ్చును. ఈ పక్షమున వికసితమయినది, అని యర్థము.

ఇంక 'తితఉ' శబ్దమిందుగలదు ఇది 'తనోతేర్డఉః సన్వచ్చ' అను 'ఉణాది' సూత్రముచే నిష్పన్నము. తన్‌ధాతువు, డఉ ప్రత్యయము. ఉలోపము ద్విత్వము మున్నగు కార్యములు ప్రవర్తించి 'తితఉ'అని యేర్పడినది. బాగుచేయునది, జల్లెడ అనియర్థము. లేదా తతముగలదిగాన 'తితఉ' అనియు జెప్పనగును. తతమనగా విస్తారము. లేదా తున్నములుగలది గనుక 'తితఉ'. తున్నములనగా ఛిద్రములు=కంతలు. ఆయర్థమున 'తుథ-వ్యథనే' అను ధాతువు మూలము కానగును. చాల చిల్లులుగలది జల్లెడ.

ఇందు 'ధీరాః' అను పదము 'ధ్యై-చింతాయామ్'అను ధాతువునందుండి నిష్పన్నమగుటచే 'ధ్యానవంతులు' అను నర్థముగలది. ధ్యానమనగా వ్యాకరణ విషయకము. కాగా వైయాకరణులని తాత్పర్యము. మనసా = మనోవ్యాపారమైన ప్రజ్ఞానముచేత, వాచమ్ = శుద్ధమైన వాక్కును, అక్రత = అక్రృషత=చేసిరో= వేఱుపరచిరో, అత్రా = ఈ బ్రహ్మమార్గమునందు (దీర్ఘము ఛాందసము), సఖాయ =సమానజ్ఞానము కలవారై, అనగా భేదభావన తొలగుటచే సర్వమునేకమేయను తలంపుగలవారలై, సఖ్యాని = సాయుజ్యములను,

జానతే=పొందుదురు అని తాత్పర్యము. 'అత్రా=ఇచ్చట' అనఁగా నెచ్చట? జ్ఞానైక గమ్యమయిన, వాగ్విషయ దుర్గమ మార్గమునందు. ఎవరు పొందుదురు? వైయాకరణులు వారేయనుట యెట్లు? వీరి వాక్కునందు భద్ర యగు లక్ష్మి నివసించియుండునుగాన. అనగా నీ ధీరుల వాక్కునందు (వేదశబ్ద రూపమగు దానియందు) సర్వభాసక బ్రహ్మరూపమగు లక్ష్మి, అధికముగా= విశేషముగా, కృతప్రతిష్ఠయై యున్నది కాబట్టియని భావము.

లక్ష్మిపదము, 'లక్ష-దర్శనాంకనయోః' అను ధాతువునకు 'ఈ' ప్రత్యయ మును ముడాగమమును గలుగగా నిష్పన్నమగుటచే ప్రకాశింపజేయునది యని దాని యర్థము. లక్షణమనగా భాసనము.

పరిబృఢాభవతి=ప్రభ్వీభవతి. అజ్ఞానమును నివర్తింపజేయుటలో సమర్థు రాలగుచున్నది అని యర్థము.

"చత్వారి శృఙ్గా", "చత్వారి వాక్పరిమితా", "ఉతత్వః పశ్యన్", "సక్తుమివ తిత ఉనా" అను నీనాలుగు ఋక్కులును, వ్యాకరణ శాస్త్రమునకు మోక్షజనకత్వ మును బ్రతిపాదించుచు తదధ్యయనమున కావశ్యకతను బోధించుచున్నవని స్పష్టము. "సక్తుమివ" (10)

## (11) "సారస్వతీమ్"

"ఆహితాగ్నిరపశబ్దం ప్రయుజ్య ప్రాయశ్చిత్తీయాం సారస్వతీమిష్టిం నిర్వ పేత్" అని యాజ్ఞికులు పఠింతురు.

అన్వాధానముచేసిన పురుషుఁడు క్రతుమధ్యమున నపశబ్ద ప్రయోగము చేసినచో నందులకు, ప్రాయశ్చిత్తముగా సరస్వతి దేవతాకమగునొక "ఇష్టి"ని చేయవలెను, అని దాని యర్థము. మనమునునట్లు ప్రాయశ్చిత్తీయులము కాకుండుటకై వ్యాకరణాధ్యయనమును జేయవలెను.

పాపశోధనమునకై శ్రుతిస్మృతులలో విధింపబడిన కర్మలను జేసికొన వలసిన నిమిత్తములను మనకు మనము కలుగజేసికొనకుందుము గాక యనుట. "సారస్వతీమ్" (11)

## (12) "దశమ్యాంపుత్రస్య"— ఇదియు నింకొక యాజ్ఞికపాఠము.

"దశమ్యుత్తరకాలం పుత్రస్య జాతస్య నామ విదధ్యాత్, ఘోషవదాద్యన్తరన్తస్థ మవృద్ధం త్రిపురుషానూక మనరి ప్రతిష్ఠితం । తద్ధి ప్రతిష్ఠితతమం భవతి । ద్వ్యక్షరం చతు రక్షరం వా నామ కృతం కుర్యాన్న తద్ధితమ్ ॥"

ప్రయోజన స్వరూపగణన ప్రసంగమున "దశమ్యాంపుత్రస్య" అని గలదు. కాని 'దశమ్యుత్తరకాలం' అని యాజ్ఞికపాఠము. 'దశమ్యాం' అనగా, కుమారుడు కలిగిన పదియవరోజున అని యర్థము. ఆ దినమున నామకరణము చేయుట కుదురుపడదు. నాడుగూడ, తండ్రికి జాతాశౌచముండును. కావున, పదియవరోజునకు తరువాత, పదునొకండవరోజున, ఆకుమారునకు నామకరణము చేయవలెను. కావున, 'దశమ్యాం' అనుచో సప్తమి సామీపికాధికరణ బోధకమని వ్యాఖ్యానింపనగును. కనుకనే, గృహ్యసూత్రకారులు "దశమ్యాం పుత్రస్య" అని పఠించినను, 'దశమ్యాం' అను పదమునకు పైరీతిగనే వ్యాఖ్యానము చేయవలెను. కాబట్టి, 'దశమ్యుత్తరకాలం' అను యాజ్ఞికపాఠము యుక్తమే.

ఆ పెట్టబడు పేరు మొదటి యక్షరము, శిక్షలలో, ఘోషవంతములుగా జెప్పబడిన వర్ణములలో నొకటిగా నుండవలెను. ఆ పేరు మధ్య య,ర,ల,వ- అనునక్షరములలో నొకటి యుండవలెను. మఱియును, ఆ నామము, వృద్ధసంజ్ఞ గల పదము కారాదు. అనగా పదమందలి యచ్చులలో మొదటిది 'వృద్ధ్యక్షరమై' యుండరాదు. నామకరణమునకధికారియగు తండ్రియొక్క పితృ, పితామహ, ప్రపితామహులలో నొకరి పేరయి యది యుండదగును. అది మనుష్యుల పేరుగా నుండరాదు. లేదా, అది శత్రువు పేరుకారాదు. పైనజెప్పిన లక్షణములుగల నామమైననే యయ్యది సుప్రతిష్ఠితమగును.

మరియునది రెండక్షరములుగల పేరుగా గాని నాలుగక్షరములు గలదిగాగాని యుండవలెను. కృత్ప్రత్యయాంతమే కావలెనుగాని యది తద్ధితాన్తముకారాదు, అనియర్థము.

వ్యాకరణాధ్యయనము చేయనిచో నియ్యవి కృత్ప్రత్యయములు, ఇవి తద్ధితములు అని తెలిసికొనుట సాధ్యపడదుగాన వ్యాకరణాధ్యయన మావశ్యకమని భావము. "దశమ్యాంపుత్రస్య" (12)

**(13) "సుదేవోఅసి" - ఇదియు వేఱొక ఋఙ్మంత్ర ప్రతీకము.**

"సుదేవో అసి వరుణ యస్య తే సప్తసింధవః ॥
అనుక్షరన్తి కాకుదం సూర్మ్యం సుషిరా మివ" ॥ (ఋ.సం. 8-69-12)

బార్హస్పత్య ప్రగాధమునందు పఠింపబడిన వరుణస్తుతిరూపమగు మంత్రమిది. అనృతము రెండు విధములు: అర్థానృతము, శబ్దానృతము. సీసమును వెండియని తాను భ్రమపడిగాని, ఇతరులను మోసగింపవలెనని గాని, దానిని వెండిగాదానముచేయుట అర్థానృతము. అది అనర్థము నుత్పాదించును. అట్లే సాధు శబ్దస్థానమున అసాధు శబ్దమును బ్రయోగించుట శబ్దానృతము. దాని వలనను దోషము వాటిల్లును.

వరుణుడు వ్యాకరణ శాస్త్రజ్ఞానము బాగుగ గలవాడు. అతడెపుడును నపశబ్ద ప్రయోగమును జేయలేదు. కావున నతనికి సత్యదేవుడని వ్యవహారము కలిగినది. సత్యముచే ప్రకాశించువాడని యర్థము. సత్యమనగా సాధు శబ్ద ప్రయోగము.

"ఓవరుణుఁడా ! నీవు సత్యదేవుడవు. సప్తసింధువులనదగిన ఏడు విభక్తులును నీ తాలు స్థానమునుబొంది ప్రకాశించుచున్నవి. ఛిద్రములుగల యొక చక్కని ఇనుప బొమ్మలో అగ్ని ప్రవేశించి, అటనున్న మలమును భస్మముచేసి, ప్రతిమను పరిశుద్ధమునుగా జేయునట్లు, నీతాల్వాది స్థానములందభివ్యక్తము లయిన విభక్త్యన్త శబ్దములు శారీరమగు పాపమునుబోగొట్టును. అందువలన, చిత్తశుద్ధిగలిగి స్వర్గమును బొందనగును" అని ఋగర్థము.

కాకుదము = తాలువు. కాకు=జిహ్వా. ఆ జిహ్వా దీనియందు, పైకెత్త బడును గాన నది కాకుదము. 'కాకుః అస్మిన్నుద్యతే' ఇతి కాకుదమ్. కాకు + ఉద = కాకుద.

సుషిరామ్=ఛిద్రసహితామ్, సూర్మ్యమ్=సు + ఊర్మిమ్=సూర్మ్యమ్. శోభనమగు, అయః ప్రతిమను 'అగ్ని దానిని శోధించినట్లు' విభక్త్యన్తశబ్దములు తత్తత్ స్థానములను శోధించును. అందువలన వరుణుడు సత్యదేవుడాయెను. మనమును సత్యదేవులమగుటకై వ్యాకరణాధ్యయనమును జేయవలెనని తాత్పర్యము. "సుదేవోఽసి" (13)

అథశబ్దానుశాసనమ్" — అని ప్రారంభమయిన, వ్యాకరణశాస్త్రమునకు సాక్షాత్ప్రయోజనము శబ్దముల యనుశాసనమని చెప్పబడినది. అపశబ్దములనుండి వేఱుపఱచి, ప్రకృతి ప్రత్యయ విభాగపురస్సరముగ, సుశబ్దములను సంస్కరించుటయే అనుశాసనము.ఆ విధమగు అనుశాసనము చేయుశాస్త్రముగూడ శబ్దానుశాసనమనబడును. ఈ యర్థమునందనుశాసనపదము కరణసాధనము

శబ్దానుశాసన ప్రయోజనములు ముఖ్యములును, నానుషంగికములునునని యిరుదెఱంగులు. అందు ముఖ్యములు; (1) వేదరక్ష (2) ఊహ (3) లఘూపాయజ్ఞానము, (4) సందేహము కలుగకుండుట.

ఆగమముగూడ ప్రయోజనముగా జెప్పబడినది. కాని అది ప్రయోజకము ప్రవర్తకమనుట. ప్రయోజనముల మధ్యమున పఠింపబడుటచే దానిని ప్రయోజనమందురు

ఇక నానుషంగిక ప్రయోజనములు పదుమూడు చూపబడినవి. అయ్యవి 'తేఽసురాః'-ఇత్యాదిగా, ప్రతీకధారణముచే సూచింపబడినవి.తేఽసురాః ఇత్యాదులు ప్రయోజకములు తత్ప్రతిపాద్యములగు నర్థములు ప్రయోజనములు.

(1) అసురులవలె నపశబ్ద ప్రయోగముచే పరాభవమునంది నింద్యులము కాకుండుట మొదటి ప్రయోజనము.

(2) స్వరవర్ణ దుష్ట శబ్దములను ప్రయోగింపకుండుట రెండవది.

(3) మనము చేయు నధ్యయన మనర్థకము కాకుండుట మూడవది.

(4) సుశబ్దములను జ్ఞానపూర్వకముగ బ్రయోగించుటవలన నభ్యుదయము నాల్గవది.

(5) శిష్యులు మనకభివాదమును జేసినపుడు, మనలను వారు స్త్రీలవంటి వారలనుగా భావింపకుండుట అయిదవ ప్రయోజనము.

(6) ప్రయాజ మంత్రములందు, ప్రకృతులకుదగిన విభక్తులను కూర్పగలుగుటకై ఆవశ్యకమగు విభక్తి పరిజ్ఞానము ఆరవది.

(7) మనకు యజ్ఞములందు, యజమానత్వయాజకత్వములు లభించి ఆర్త్విజీనులము కాగలుగుట ఏడవది.

(8) శబ్దబ్రహ్మసాయుజ్యము, సకల పదజ్ఞానము, మనీషిత్వసిద్ధి అను ప్రయోజనజాతము ఎనిమిదవది.

(9) వాక్కు మనకు, తన స్వరూపమును గోచరింపజేయుట తొమ్మిదవ ప్రయోజనము

(10) సర్వశబ్దములందును బ్రహ్మబుద్ధి కలిగి, ఆ దృష్టాంతముచే సర్వపదార్థములందును బ్రహ్మైకత్వజ్ఞానము దశమ ప్రయోజనము.

(11) క్రతుమధ్యమున నపశబ్ద ప్రయోగముచేసి ప్రాయశ్చిత్తార్హతను బడయకుండుట పదునొకండవది.

(12) కుమారుని నామకరణ ప్రసంగమున తద్ధితాన్తములను వర్జించి కృదన్తనామములనే యేర్పరించుటకై కృత్తద్ధిత పరిజ్ఞానము, పండ్రెండవది.

(13) వరుణుడు శబ్దాన్వితమును వర్జించి సత్యదేవుండను పొగడ్తను గనినట్లు మనమును సత్యదేవుల మనిపించుకొనుట పదమూడవ ప్రయోజనము

ఇది, ముఖ్యానుషంగిక ప్రయోజనముల సంగ్రహ సమీక్ష

ఇంక నీ ప్రయోజనాన్వాఖ్యానమునకు ఉపపత్తులు ఆక్షేపసమాధాన పూర్వకముగ వివరింపబడును.

వ్యాకరణ శాస్త్రాధ్యయనమునకు బ్రయోజనములు చాల జెప్పబడినవి. ప్రవృత్తికి, ప్రయోజన ప్రతిపత్తి ప్రరోచకము గాన నయ్యది ఆవశ్యకమే. కాని వ్యాకరణాధ్యయనము చేయదలంచిన వారలకు మాత్రమే యీ ప్రయోజనాన్వాఖ్యాన మేల చేయవలెను ?. వేదాధ్యయనము చేయువారలకును తత్ప్రయోజనములు ఏల చెప్పబడలేదు ? వారు ప్రయోజనజ్ఞానము లేకున్నను. ఆచార్యుడు 'అధీష్వ' అనిన వెంటనే, 'ఓమ్' అని 'శంనో దేవీ రభిష్టయే' అని

యారంభించి, ప్రపౌరకములకు ప్రపౌరకములుగా వేదశబ్దముల నధ్యయనము చేయుచున్నారే. వారల కొరకును ప్రయోజనోపన్యాసము ఏల చేయబడ లేదు ? అనిన వినుడు. వెనుకటి యుగములో నిట్లుండెను— ఉపనయన సంస్కారానంతరము, బ్రాహ్మణులు, ముందుగా వ్యాకరణము నధ్యయనము చేయుచుండెడివారు. ఆ తరువాత వేదాధ్యయనమును జేసెడివారు. వ్యాకర ణాధ్యయన కాలమున, వారు ప్రయోజన ప్రశ్న చేయుటకు వలయు వయః పరి పాకము కలవారు కాకుండుటచే, వారడుగను లేదు, ఆచార్యుడు ప్రయోజనాన్వాఖ్యానమును చేయను లేదు. వారు వ్యాకరణమును జదివి, ఆయా వర్ణముల యుత్పత్తిస్థానములను, అభ్యన్తర ప్రయత్నములను, నాదాది బాహ్య ప్రయత్నములను, వర్ణోచ్చారణ ప్రకారమును బాగుగ నెరింగియున్న వారగుటచే, వారికి వేదశబ్దముల నా పిదప నుపదేశించెడివారు. ఆ ప్రౌఢదశలో నైనను, వేదాధ్యయనము తమకు నిత్యము, దానికి ఫలము కర్మానుష్ఠానము, అనెడి భావముతో, ప్రయోజనప్రశ్న చేయలేదు. అందువలన, ప్రయోజనోప దేశమునకు ప్రసక్తి కలుగలేదు.

కాని నేటికాలమున నట్లుగాదు. వేదాధ్యయనము ముగించి, వివాహోదు లందు త్వరగలవారై, 'వేదాధ్యయనమువలన మాకువైదిక శబ్దములు తెలిసినవి. లోకవ్యవహారమువలన లౌకిక శబ్దపరిజ్ఞానము కలిగినది. కావున నిక వ్యాకర ణాధ్యయన మనర్థకము' అని వారిప్పుడనుచున్నారు.

అట్లు విప్రతిపన్నబుద్ధులగు నధ్యేతలకు, సుహృద్భావముతో శాస్త్రాధ్యా పకుడగు నాచార్యుడు, 'వ్యాకరణాధ్యయనమునకు ఈ ప్రయోజనములున్నవి. కనుక నయ్యది యవశ్యాధ్యేయము' అని ప్రయోజనాన్వాఖ్యానము చేయ వలసి వచ్చినది.

విషయము, ప్రయోజనము, సంబంధము, అధికారి అను అనుబంధ చతుష్టయము శాస్త్రారంభ ప్రయోజకము.

వ్యాకరణ శాస్త్రమునకు విషయము శబ్దము. అయ్యది లౌకికము, వైదికమునని రెండు విధములు. 'గౌః' మున్నగునది లౌకికము. 'శంనో' మున్నగునది వైదికము అనియు, 'గౌః' అనుచో 'శబ్దమననెయ్యది' అని ప్రశ్నించి,'అర్థమును బోధించునది''శబ్దము' అని తత్స్వరూపమును, తద్జ్ఞానము నకు ప్రయోజనములును చెప్పబడుటచే, విషయ ప్రయోజనములు ఉపదిష్ట మైనవి. ఇక ప్రతిపాద్యప్రతిపాదకభావమను సంబంధమును, గ్రహణధారణా సమర్థుడైన జిజ్ఞాసువనునధికారియు చెప్పబడినట్లేయయినది. కాగా అను బంధ చతుష్టయము కలదు గాన ఈ శాస్త్రము ప్రారంభింపదగినదైనది.

"ప్రయోజనమనుద్దిశ్యనమందోపిప్రవర్తతే" అని అభియుక్తుల సూక్తి. ఏప్ర వృత్తికైనను ప్రయోజనముద్దేశ్యముకాకతీరదు. గ్రంథకర్తల గ్రంథప్రణయ ప్రవృత్తికిని అది అపరిహార్యము.

కృతి సాధ్యత్వజ్ఞానమును, ఇష్టసాధనత్వజ్ఞానమును ప్రవృత్తికావశ్యక

ములని శాస్త్రకర్తల సిద్ధాన్తము. గ్రంథారంభమున అనుబంధ చతుష్టయ ప్రదర్శనము వలన, నేనీగ్రంథమును గ్రహించి ధరింపగలను నాకీకృతి సాధ్యము అనియు, ప్రయోజన ప్రదర్శనమువలన నియ్యది నాకు అభీష్టమును సాధించును గాన ఇష్టసాధనము అనియు తెలిసికొని అధ్యేత అధ్యయనమున బ్రవర్తించుట కనువు కలుగును. విషయ ప్రదర్శనము గ్రంథారంభమున జేయుటవలన నీ విషయము మనకింతకుబూర్వము జ్ఞాతము కాదు, ఇది జ్ఞేయము అని తెలిసికొని ప్రవర్తింతురు. ప్రయోజన ప్రదర్శనము సాక్షాత్తుగానే ప్రవర్తకము. అధికారి ప్రదర్శనమువలన నధ్యేతలకు ఈ కృతి సాధ్యమను జ్ఞానము కలుగును. ఇక సంబంధ ప్రదర్శనము, ఇది ఇష్టసాధనమను జ్ఞానము కలిగించుటలో వ్యక్తమగును. కనుక అనుబంధ చతుష్టయప్రదర్శన మిందు జేయబడినది.

## శాస్త్రనిర్మాణరీతి నిరూపణాధికరణము

కాగా శబ్దానుశాసన మవశ్య కర్తవ్యమని సిద్ధము. ఇకనది ఎట్లు చేయ వగును? అనునది ప్రశ్న.

సుశబ్దములనన్నింటిని ప్రతిపదపాఠముగ నుపదేశింపవలెనా? లేక అపశబ్ద ముల నా విధముగ పాఠము చేయవలెనా? లేక ఉభయోపదేశము చేసినయెడల 'ఇవి ఉపాదేయములు, ఇయ్యవి హేయములు' అను ప్రతిపత్తి స్పష్టముగాగలు గును గాన ఆ విధముగ సుశబ్దాపశబ్దములను రెండింటిని నుపదేశించుటయా?

ప్రతిపత్తిలో స్పష్టతయున్నను, ఉభయోపదేశము గౌరవ భూయిష్ఠము గాన ఏదోయొక దాని నుపదేశము చేసిన జాలును. భోజ్యపదార్థములలో గొన్నింటిని జూపి ఇవి భక్ష్యములను నియమమును జేసిన, భక్ష్యములు కాని వానిని వేరుగజెప్పకున్నను వాని భక్షణప్రతిషేధము గమ్యమగును. "పంచపంచనఖాభక్ష్యాః" అనియొకవిధి. విధులు మూడు విధములు. అపూర్వ విధులు, నియమవిధులు, పరిసంఖ్యావిధులు ఇది అపూర్వ విధియయినచో భక్షణ మునకు 'అప్రాప్తి'యుండవలెను. అదిలేదుగదా! రాగము వలన భక్షణము ప్రాప్తము రాగమనగా భక్షింపవలెనను నిచ్ఛ. అది సహజముగనే కలుగునది. కావున నిది అపూర్వవిధికాదు.

ఇక నియమవిధి కావలెను. పంచనఖములనిన- అయిదేసిగోళ్లుగల జంతువులు అందొక అయిదు భక్షణీయములు- అని ఈ విధికర్థము. ఆ ఐదును (1) శశకము=చెవులపిల్లి (2) శల్యకము = ఏదుపంది (3) గోధ = ఉడుము (4) కూర్మము=తాబేలు (5) శ్వావిధము=ఖడ్గమృగము అనునవి.

వాల్మీకి రామాయణమున, వాలి, శ్రీరామచంద్రునితో నరణ్యములో నిట్లు చెప్పెను.

> "పంచ పంచనఖాభక్ష్యాః బ్రహ్మక్షత్రేణ రాఘవ ।
> శల్యకః శ్వావిధో గోధా శశః కూర్మశ్చపంచమమ్"॥

ఈ "పంచపంచనఖాభక్ష్యాః" అమనది ఆ శ్లోకభాగము.

ఇట, పంచనఖభక్షణ రాగమువలన ప్రాప్తమైనను, మరల 'పంచపంచ నఖాభక్ష్యాః' అని శబ్దముచే బోధించుటవలన నయ్యాది సామర్థ్యమువలన, ఆ అఘుదు పంచనఖములు తప్ప యితరములగు పంచనఖము భక్షణీయములు కావని బోధించి, వాని భక్షణమునుండి పురుషుని నివర్తింపజేయును. అన్య నివృత్తి గమ్యమనుట

ఈ విధముగ అన్యనివృత్తి గమ్యమగు విధులను, మీమాంసకులు పరిసంఖ్యా విధులందురు.

ఒక పక్షములో మాత్ర మప్రాప్తిగల విధులను వారు నియమవిధులందురు. "వ్రీహీనవహన్తి" అను విధివాక్యమును జూడుడు. వడ్లను దంపి, బియ్యముచేసి ఆ బియ్యముతో, పురోడాశమును వండవలెనని యర్థము. గోళ్లతో ధాన్యమును ఒలిచి బియ్యమును దీసినను దీయవచ్చును. కాని యట్లు చేయరాదు. అవహన నమే చేయవలెను. అవహననమును, నఖదలనమును ప్రాప్తములే. కాని నఖ విదలనమును జేసి బియ్యమును దీసినపుడు, అవహననమునకు ప్రాప్తిలేదు. అవహన పక్షమున నఖవిదలనమునకు ప్రాప్తిలేదు ఈ విధముగ నొక పక్షమున మాత్ర మున ప్రాప్తిగల విధి కావున నిది నియమ విధియని వారి నిరూపణము. 'అవహన్తి' అనగా దంపుటయే చేయవలెను అని ఫలితము. ఒక పక్షమున నప్రాప్తమగు నంశమును పూరించుట నియమవిధికి ఫలము. అన్యనివృత్తి ఫలముగాగలది పరిసంఖ్య. అందు పాక్షికాప్రాప్తాంశపూరణముండదు. పంచ నఖముల భక్షణమును, అపంచనఖముల భక్షణమును యుగపత్ప్రాప్తములే గదా!

ఇట్లు, నియమపరిసంఖ్యావిధులకు భేదమున్నను, అప్రాప్తాంశమును పూరించుట అను ఫలమును బోధించుటద్వారముగ అన్యనివృత్తి, నియమవిధి యందును ఫలితమగుటచే, నియమపరిసంఖ్యల క భేదమును భావించి పరిసంఖ్యనే నియమమని వైయాకరణులు వ్యవహరింతురు. "భక్ష్యనియమేన అభక్ష్యప్రతిషేధో గమ్యతే" అనుచో, 'భక్ష్యనియమేన' అనగా భక్ష్యముల పునర్విధానముచే ననుట.

ఇట్లే నిషేధ్యములను నియమించుటవలన నుపాదేయముల ప్రతీతి కలుగును.. అది "అభక్ష్యోగ్రామ్యకుక్కుటః", "అభక్ష్యోగ్రామ్యసూకరః" అనుచోట నగపడుచున్నది. గ్రామమ లందలి కోళ్లను, పందులను దినరాదనిన, అరణ్య ములలోని వానిని భక్షింపవచ్చునని గమ్యమగును.

ఈ విధముగనే ప్రకృతమునను, శబ్దోపదేశమే చేయదగునందురా, 'గౌః' అను పదమునుపదేశించిన 'గావీ', 'గోణీ' మున్నగునవి అపశబ్దములనిగమ్య మగును. అపశబ్దముల ప్రతిపద పాఠమును జేయుదుమా గావ్యాదుల నుపదేశింప, తదన్యమగు 'గౌః' అనునది సుశబ్దమని గమ్యమగును.

ఉభయోపదేశము గురుభూతముగాన నది పరిగ్రాహ్యముకాదు. అన్య తరోపదేశమే ప్రశస్యము. అందును శబ్దోపదేశాపశబ్దోపదేశములలో నేది ప్రశస్య తరమందురు?

శబ్దోపదేశమే లఘుభూతముగాన ప్రశస్యతరము. ఒక సుశబ్దమునకు సమానార్థకములగు నపశబ్దము లెన్నియేని యుండును. 'గౌః'అను శబ్దమునకు గావీ, గోణీ, గోతా, గోపోతలికా మున్నగునవి అపశబ్దములు (అపభ్రంశములు). శబ్దోపదేశమునకు లాఘవ మొక్కటియే ప్రయోజనముగాదు. ఆవశ్యకతయు గలదు. అధ్యాపకులకును, అధ్యేతలకును సాధు శబ్దప్రయోగమువలననేగదా ధర్మావాప్తికలుగునది. అన్వాఖ్యానమును ఇష్టాన్వాఖ్యానమగును. ఉపాదేయ ములను ఉపదేశించుటవలన అధ్యేతలకు ప్రతిపత్తియును సుకరమగును

సరి. శబ్దోపదేశమే కర్తవ్యమని నిర్ధారితము. అనగా 'గౌః అశ్వః పురుషః', 'హస్తీ', 'శకునిః', 'మృగః', 'బ్రాహ్మణః'-ఇట్లు ప్రతి పదమును, పఠింప వలెనందురా?

కాదు. ప్రతిపదపారము శబ్దప్రతిపత్తికభ్యుపాయముకాదు. వేదమున నిట్లు గలదు-చూడుడు.

"బృహస్పతి రింద్రాయ దివ్యం వర్షసహస్రం ప్రతిపదోక్తానాం
శబ్దానాం శబ్ద పారాయణం ప్రోవాచనాన్తం జగామ"

బృహస్పతిశ్చ ప్రవక్తా, ఇంద్రశ్చాధ్యేతా, దివ్యంవర్ష సహస్ర మధ్యయనకాలః, నచాన్తంజగామ। కింపునరద్యత్వే । యస్సర్వథాచిరంజీవతి, వర్ష శతం జీవతి॥

"బృహస్పతి ఇంద్రునకు వేయి దివ్యవత్సరములు, ప్రతిపదోక్తశబ్దముల, శబ్దపారాయణమును ప్రవచనము చేసెనట. శబ్దపారాయణమనగా ప్రతి పద పఠితశబ్దములుగల యొక గ్రంథము. కాని అప్పటికిని నది సమాప్తముకాలేదు." అని ఆ యర్థవాద వాక్యమున కర్థము. ప్రవక్త బృహస్పతియా? అధ్యేత ఇంద్రుడా? అధ్యయనకాలము వేయి దివ్యవత్సరములా? విశిష్టుడగు వక్త, విశిష్టశ్రోత, విశిష్టమగు కాలమును సమకూడినను సమాప్తము కాలేదనిన నేటి కాలమున ఏమి చెప్పవలెను? అందఱికంటె ఎంత ఎక్కువకాలము జీవించినను ఎవ్వడైన వందసంవత్సరములు గదా జీవించును. విద్య ఉపయోగపడు కాల ములు నాలుగు. అవి విద్యాగ్రహణకాలము, గ్రహించిన ఆ విద్యను ఆవృత్తి చేసి మననము చేయుకాలము, అధ్యాపనకాలము, యజ్ఞకర్మలందు ఉపయో గించు కాలమును.

అందు గ్రహణకాలమునను, మననకాలమునను "ఈ విద్యార్థి బుద్ధి మంతుడు" అని యాదరముతో నన్నవస్త్రాదులను ఆతని కందరు నిత్తురు. అది ఆ కాలమందలి యుపయోగము. ఇంక, ప్రవచనకాలమున ప్రతిష్ఠ, సచ్ఛిష్యలాభము, అర్థప్రాప్తి మున్నగునవి విద్యవలని యుపకారములు, యజ్ఞాదులం దపశబ్ద ప్రయోగమూలకమగు ప్రాయశ్చిత్తము లేకుండుట, కర్మ సాంగత, దక్షిణాలాభము, ప్రతిష్ఠ మున్నగునవి, వ్యవహారకాలమున విద్యోప యోగములు. ఇన్ని విధములగు విద్యోపయోగము సర్వాధ్యయనము వలననే కలుగునుగాని యత్కించిదధ్యయనమువలన కలుగదు.

ఆ నాలుగు కాలములలో, ప్రతిపదపాఠ ప్రక్రియను స్వీకరించిన వక్తల కును శ్రోతలకును గూడ నాయుర్దాయమెల్ల పరిసమాప్తమగును. అయిన గానిమ్మందుమా? ఫలములేని విద్యయగుటచే నది విచ్ఛిన్నము కావలసివచ్చును. యజ్ఞాదుల యనుష్ఠానమునకు ప్రసక్తియే కలుగదు. అపుడు ప్రాయశ్చిత్త విధులు వ్యర్థములగును. అందువలన శబ్దప్రతిపత్తికి ప్రతిపదపాఠమెంతమాత్రమును అభ్యుపాయము గాదు.

అట్లైన సుశబ్ద జ్ఞానోపాయమిక నేది? అనిన-సామాన్యసూత్రములును, విశేష సూత్రములునుగల లఘుభూతమగు లక్షణము నొకదానిని ప్రవర్తింప జేయవలెను. అపుడాలఘూపాయముచే పెద్దపెద్ద శబ్దసమూహములను అధ్యేతలు గ్రహింపగలుగుదురు.

ఆ సామాన్య విశేషశాస్త్రము లెట్లుండును?

సామాన్యములనగా ఉత్సర్గశాస్త్రములు. విశేషములనగా అపవాద శాస్త్రములు.

ఉత్సర్గమనగా నెట్టిది? అపవాదమనగా నెటువంటిది?

సామాన్యరూపముగ నుండునది ఉత్సర్గశాస్త్రము. "కర్మణ్యణ్"(3-2.1) అను సూత్రము ఉత్సర్గము. కర్మవాచక శబ్ద ముపపదముగా నున్నపుడు ధాతు మాత్రమునకు పరముగా 'అణ్' ప్రత్యయము వచ్చును. 'కుంభ', 'నగర' 'సూత్ర', 'భాష్య'- మున్నగుకర్మవాచకములు సమీపోచ్చారితములయినపుడు ఈ సూత్రము కృధాతువునకు పరముగా అణ్ప్రత్యయమును విధించినపుడు, 'కుంభకారః', 'నగరకారః', 'సూత్రకారః', 'భాష్యకారః','పదకారః','వాక్యకారః' మున్నగు అణ్ప్రత్యయాన్తరూపము లనేకము లొక ఉత్సర్గసూత్రమను అల్ప యత్నముచే, పాణినికి సిద్ధించుచున్నవి.

ఇక 'గాం దదాతి' అను నర్థమున, 'కుంభం కరోతి' అను విగ్రహమున, కుంభపద ముపపదమయియుండ, కృధాతువున కణ్ప్రత్యయమువచ్చి 'కుంభకార' అను రూపమేర్పడినట్లు 'గోదాయః' అని రూపము కాదగియున్నది. అది యనిష్టము. 'గోదః' అని కావలెను. కావున నట్టిరూపములనెల్ల గమనించి, ఉపసర్గరహితమగు నాకారాన్తధాతువునకు, కర్మవాచక ముపపదమగునపుడు, సామాన్య సూత్రప్రాప్తమగు అణ్ప్రత్యయమున కపవాదముగా, "ఆతోఽనుప సర్గేకః"(3-2 3)అను సూత్రముచే'క'అను ప్రత్యయము విధింపబడినది. ఈశాస్త్ర మపవాదశాస్త్రము. 'నగరకారః' ఇత్యాదులందు 'కృ'ధాతువు ఋకారము వృద్ధిచే 'ఆర్' అయినది. 'దా' ధాతువుయొక్క ఆకారము లోపించినది. ఈ ప్రకారముగా, 'గోదః', 'కంబలదః' 'జ్ఞానదః'— మున్నగు శబ్దౌఘములను దెలిసి కొనుటకు అల్పయత్నముచే సాధ్యపడుచున్నది.

ఈ తీరుగా సామాన్య విశేషసామాన్యశాస్త్రములతోగూడిన లక్షణమును ప్రవర్తింపజేసి సాధుశబ్ద ప్రతిపత్తిని సుకరము చేయనగును. అంతేగాని ప్రతిపద పాఠప్రభృతుల కుపాయముగాదు,

# జాతి వ్యక్తి పదార్థ నిర్ణయము

ఉత్సర్గశాస్త్రములును, అపవాద శాస్త్రములును, పదసమూహాత్మక వాక్యరూపములు. అందలి పదములకు అర్థము, ఆకృతియా? లేక ద్రవ్యమా? అని విచారింపగా రెండును, పదార్థములేయని చెప్పనగును. అది యెట్లు తెలియ నగుననిన, సూత్రకారుడు, ఆకృతి ద్రవ్యములు రెండును పదార్థములేయను నాశయముతోనే సూత్రములను రచించియున్నాడు.

"జాత్యాఖ్యాయామేకస్మిన్ బహువచనమన్యతరస్యామ్" (1-2.59) అని యొక సూత్రము. ప్రధానముగా జాతిని బోధింపదలచినపుడు 'గోత్వము', 'బ్రాహ్మణ త్వము', అని త్వప్రత్యయాంతముల నుపయోగింతురు. "తస్యభావస్త్వతలౌ" (5-1. 119) అను సూత్రము, భావ ప్రత్యయములగు 'త్వ', 'తల్' అనువానిని ప్రకృత్యర్థమున ప్రకారమైన ధర్మమును బోధించుటకు విధించుచున్నది.

కాని గోజాతి పూజనీయము, బ్రాహ్మణజాతి పూజనీయము అను నర్థమును వివక్షించి "గౌః పూజ్యా", "బ్రాహ్మణః పూజ్యః" అని యనుటయుగలదు. జాతియనునది ఒక్కటియే గనుక ఏకవచనమే అట నుచితమైనది. కాని "గావః పూజ్యాః", "బ్రాహ్మణాఃపూజ్యాః" అని బహు వచనాన్త పదములనుగూడ వాడుదురు. కాగా ఇట్టియెడ ఏకవచన బహువచనములు రెండింటికిని సాధు త్వమును బోధించుటకు "జాత్యాఖ్యాయమ్" ఇత్యాది సూత్రము రచింపబడినది.

జాత్యాఖ్యాయామ్ = జాతిని ప్రధానముగా చెప్పుటలో, ఏకస్మిన్ = ఏకా ర్థమునందు వర్తమానమగు శబ్దము, బహు = అనేకార్థకములకు, వచనమ్ = బోధ కమగును అని యర్థము. సూత్రమున 'అన్యతరస్యామ్' అను పదముండుటచే, గోజాతి పూజనీయమను వర్థమును వివక్షించినపుడు 'గౌః పూజ్యా' అనియు, "గావః పూజ్యాః" అనియు ప్రయోగములు సాధువులు. "సంపన్నో వ్రీహిః", "సంపన్నా వ్రీహయః"— అను ప్రయోగములు నిట్లే సాధువులు.

వ్యక్తిమాత్రమే పదార్థమయినయెడల గోవ్యక్తులనేకములు గనుక బహువచన ప్రయోగము సిద్ధమేగదా! దానిని సాధించుటకీ సూత్రముతోనేమి పని?- కావున జాతి (ఆకృతి) పదముల కర్థమని పాణిని తాత్పర్యముగా దేలుచున్నది.

ఆకృతి పదార్థమను నభిప్రాయముతో పై సూత్రమును రచించినట్లే ద్రవ్యము పదార్థమను తలంపుతో రచించిన సూత్రము "సరూపాణామేకశేష ఏకవిభక్తౌ" (1-2.64) అనునది.

'రామకృష్ణులు వచ్చిరి' అని చెప్పదలంచినపుడు, రామ బోధకముగ రామ శబ్దమును, కృష్ణ బోధకై కృష్ణ శబ్దమును ఇద్దరకును బోధకమగు

ద్వివచనముతో "రామకృష్ణౌ ఆగతౌ" అనుచున్నాము. కాని ఇద్దరు రాములను చెప్పదలంచినపుడు, రెండు రామ శబ్దములను ద్వివచనాంతముగా 'రామ రామౌ' అని ప్రయోగించుటలేదు. రెండు ఘటములను జెప్పుటకు 'ఘట ఘటౌ' అనుటయు లేదు. 'ప్రత్యర్థం శబ్దనివేశః' అనునది న్యాయము. ఒక ద్రవ్యమును బోధించుటకొక శబ్దమును ప్రయోగింపవలెను, ఎన్ని ద్రవ్యములు బోధింపదలచిన నన్ని శబ్దముల నుచ్చరింపవలెనని దాని భావము. ఆయాపత్తిని, 'సరూప' సూత్రము వారించును.

'ఆకృతియే పదార్థము, ద్రవ్యము కాదు' అన్ని ఘటవ్యక్తులందును ఉండునట్టి ఆకృతి ఒక్కటియే కావున, ఒక ఘటపదమే అనేక ఘటములందున్న ఆకృతిని బోధించును గనుక, 'ఘటౌ', 'ఘటాః' అనియే సిద్ధించును గాని, 'ఘట', 'ఘటౌ';'ఘట', 'ఘట','ఘటాః' ఇత్యాది ప్రయోగములకు ప్రసంగమే కలుగదు. ఏకశేష సూత్రారంభము వ్యర్థమేయగును. కావున, ద్రవ్యముగూడ కొన్ని తావుల పదార్థమగునని పాణిని తాత్పర్యముగా స్పష్టమగుచున్నది.

లక్ష్యసిద్ధి ననుసరించి, ఒకచో నొక పక్షమును, వేఱొకచో పక్షాంతరమును నాశ్రయింపవలసి యుండును.

శబ్దము లర్థములను బ్రతిపాదింపవలెననిన వానికా యర్థములతో సంబంధ ముండి యుండవలెను. అది మనకు గృహీతమై యుండవలెను. 'జాతి', పదార్థ మను పక్షమున ఆ జాతియనునది ఒక్కటే కాన దానితో ఆ పదమునకు గల సంబంధము సుగ్రహము. ఏ వ్యక్తు లెన్ని యయినను వానియందుండు ధర్మము ఒక్కటియేయని, 'ఇది ఘటము, ఇదియు ఘటము' అని ఏకాకారమగు ప్రతీతి కలుగుచుండుటచేత, ఆ ప్రతీతికి కారణ మా వ్యక్తులయందుండు ధర్మైక్యమని గ్రహింపవలెను. అదియే జాతి, లేదా ఆకృతి.

ముందుగా, శబ్ద మా జాతినే బోధించును. పిదప నట్టిజాతి వ్యక్తులం దావేశించి యుండుటచే వ్యక్తి ప్రతీతి కలుగును. జాతి, గుణ, క్రియా, సంజ్ఞా శబ్దములలో దేనికైనను జాతియే వాచ్యము. ఇది జాతివాదుల వాద స్వరూప సంగ్రహము.

ఇక వ్యక్తివాదులు శబ్దమునకు వ్యక్తియే అర్థమందురు. వ్యక్తు లనంత ములు గదా, వానితో నెల్ల పదమునకు సంబంధగ్రహణ మెట్లు సాధ్యము? అసంబద్ధార్థమును శబ్దము బోధించుననిన ఏ శబ్దమైనను ఏ యర్థమునైనను బోధింపవలసివచ్చును. కావున జాతి ఉపలక్షణముగా నాశ్రయింపబడును.

అనగా శబ్దమునకు వ్యక్తియే శక్యము. జాతి శక్యతావచ్ఛేదకము. శక్యమునందు విశేషణమై యుండునది శక్యతావచ్ఛేదకము. ఘటము శక్యము. ఘటత్వము శక్యతావచ్ఛేదకము. ఘటమనగా ఘటత్వముగలది యని యర్థము. అందు 'ఘటత్వము' అను ధర్మము విశేషణము. అది కలది విశేష్యము. కాగా,

ఘటత్వోపలక్షితమగు ఘటము, ఘటపదమునకును, గోత్వముచే నుపలక్షితమగు 'గోవు' గో పదమునకును శక్యార్థములు. ఇది వ్యక్తివాదముయొక్క సంగ్రహ స్వరూపము. ఈ జాతి వ్యక్తి పదార్థవాదములు రెండును పాణిని సమ్మతము లేయని గ్రహింపదగును.

## శబ్ద నిత్యత్వానిత్యత్వ విచారము

ఇక శబ్దములు నిత్యములా? కార్యములా? నిత్యములనగా ఉత్పత్తి వినాశములు లేనివి. కార్యములనగా ఉత్పాదనీయములు. కుండను, కుమ్మరి తయారుచేసినట్లు, తయారుచేయదగిన వస్తువయిన నది కార్యమనబడును.

శబ్దము, ఉత్పాదనీయమైన, అందులకు వ్యాకరణశాస్త్ర మావశ్యకము. అది నిత్యమైనచో వ్యాకరణశాస్త్రముతో పని లేదు.

అది నిత్యమని కొందరును, కార్యమని మరికొందరును శాస్త్రకారులే తలంచుచుండుటచే సంశయము.

ధ్వనులచే వ్యంజనీయమగు వర్ణాత్మకశబ్దము నిత్యము. పదమును, వాక్యమును గూడ వర్ణసమూహరూపములే అని మీమాంసకులందురు.

శబ్దము వర్ణాత్మకము కాదు. వర్ణములకంటె వ్యతిరిక్తమయిన స్ఫోట రూపమగు శబ్దము వేరుగా నున్నది. 'ఘటః' అను పదమొక్కటి, 'గౌః' అనునది ఒకపదము అని వ్యవహరించుచున్నాము. అది వర్ణరూపమేయయిన, వర్ణములనేకములు గాన 'ఒకటి' అను వ్యవహారము సంభవముకాదు మొదటి వర్ణము నుచ్చరించిన తరువాత ద్వితీయ వర్ణోచ్చారణము చేయునప్పటికి మొదటి వర్ణము నశించునుగాన వాని సమూహము దురుపపాదము. కనుక స్ఫోటమను శబ్దము వేరుగా గలదు, అది నిత్యము అని వైయాకరణుల సిద్ధాన్తము

అందును, అఖండవాక్యస్ఫోటమే నిత్యశబ్దమని వైయాకరణులలో ప్రముఖులయినవారి సిద్ధాన్తము. పదములందు వర్ణములు కల్పితములయినట్లు, వాక్యమునందు పదములును కల్పితములే. వాని యర్థములును కల్పితములేకాని వాస్తవికములు కావు. అఖండ వాక్య, వాక్యార్థములే నిత్యములు సత్యములు అని ఇదియొక కోటి.

ధ్వనివ్యంగ్యమగు, మీరు చెప్పిన స్ఫోటమను శబ్దమేదియు లేదు. ధ్వనియే శబ్దము. అది వ్యక్తము, అవ్యక్తము అని రెండు విధములు. వ్యక్తశబ్దము వర్ణరూపము. అవ్యక్తము ధ్వనిరూపము. ఈ రెండు శబ్దములును కార్యములే. నిత్యములు కావు. కంఠతాల్వాదులు ఆశబ్దమునకు కారణములయినట్లు, శాస్త్రముకూడ, ఆ శబ్దమునకు ఉత్పాదకముగా కారణమగును. కావున శాస్త్ర మావశ్యకమని వేరొక కోటి.

ఈ కోటి ద్వయాత్మకమగు సంశయమునకు సమాధానము వ్యాడిమహర్షి రచించిన, లక్ష శ్లోకములుగల గ్రంథమగు, 'సంగ్రహము' అను దానియందు

నిరూపింపబడియున్నది. అందు శబ్దనిత్యత్వ కార్యత్వములు పరీక్షింపబడి, దోషములును, ప్రయోజనములును వర్ణింపబడినవి.

శబ్దము నిత్యమైనచో, దానికి వికారముండదుగాన, "ఇకుకు స్థానమునందు యణ్ణు వచ్చును" అని యిట్లు చెప్పుట పొసగదు. నిత్యమనగా మార్పు లేనిది గదా! ఇకారము నిత్యము. అది పోయి దాని స్థానమున యకార రూపమగు వికారము కలుగుట ఎట్లు ?

ఇక, కార్యము శబ్దమందుమా? ఉచ్చరించిన మరుక్షణముననే నశించునది యనుటగదా? అపుడును, ఇకారాదులకు యకారాద్యాదేశములు సంభవింపవు. ఇకారమునకు అచ్చు పరమగునపుడు యకారాదేశము రావలెను. అపుడే సంహిత సంభవించును. వర్ణముల ఆనన్తర్యమే సంహిత. ఇకారము, ఉకారోచ్చారణ కాలమున లేనే లేదాయె. ఇక సంహిత ఎక్కడిది?— ఈ మున్నగునవి దోషములు.

స్ఫోటశబ్ద మఖండము, అందు వర్ణములు లేవు కాని వ్యంజకములగు ధ్వనుల ధర్మము నారోపించి సాధుత్వజ్ఞానము కొరకు తదన్వాఖ్యానము చేయవలెను. "ఇకోయణచి" (6-1 77) మున్నగు శాస్త్రములు చేయునది అచ్చు పరముగాగల ఇకారమున కుచ్చారణము ప్రసక్తమైనపుడు, అచ్చరక యకారోచ్చారణము సాధువగును' అని యిట్లు సాధుత్వ మాత్రమే బోధింపబడును. స్థానాన్యాదేశభావమనగా బుద్ధి విపరిణామ మాత్రమే. ఇగ్బుద్ధికి ప్రసంగము కలిగినపుడు యణ్ బుద్ధి అచట కర్తవ్యము. అంతేకాని ఉన్న ఇకారము నశించుట, దాని స్థానమున యకారము క్రొత్తది వచ్చుట అని అర్థమేకాదు. ఈ విధముగా నిత్యత్వపక్ష ప్రయోజనములును ఉపపాదింపబడినవి. ఆ 'సంగ్రహ'మను వ్యాడి గ్రంథమున నిట్లు నిర్ణయము చేయబడినది. "నిత్యమా? కార్యమా? శబ్దమను విచారము నిష్ఫలము. ఏ పక్షమునందైనను, సాధుత్వ జ్ఞానమునకై శాస్త్ర మావశ్యకమేయగును" అని వ్యాడి తాత్పర్యము.

పాణిన్యాచార్యుని శబ్దానుశాసనమను లక్షణము ఎట్టి తాత్పర్యముతో ప్రవర్తించినది? అని ప్రశ్న. దానికి వార్తికకారుని సమాధానము "సిద్ధే శబ్దార్థ సంబంధే" అని. శబ్దములును, అర్థములును, ఆ శబ్దార్థముల పరస్పర సంబంధములును నిత్యములేగాని కార్యములుగావను తాత్పర్యము తోడనే శాస్త్రము ప్రవర్తింపజేయబడినది. పాణిని, శబ్దార్థ సంబంధముల సృజింపలేదు. వానికాయన స్మర్తమాత్రమే.

శబ్దము, పదవాక్య స్ఫోటరూపము. అది నిత్యమే. దాని యర్థము జాతిరూపమగుటచే నదియు నిత్యమే. పదార్థము ద్రవ్యమను పక్షమందైనను, అసత్యమగు నుపాధితోగూడిన బ్రహ్మతత్త్వమే ద్రవ్యము గనుక నదియు సిద్ధమే. లేదా ద్రవ్యమునకు నిత్యత్వము ప్రవాహనిత్యత్వము వంటిది. ఆ శబ్దార్థముల సంబంధమే 'శక్తి'. ఆ సంబంధము, వ్యవహార పరంపరగా అనాదియగుటచే నదియు నిత్యమే. ఈ ప్రకారముగా శబ్దార్థసంబంధములు మూడును సిద్ధములే

అను దృష్టితోనే శాస్త్రమారంభింపబడినది.

వార్తికమునందలి సిద్ధశబ్దమున కేమి యర్థము?

సిద్ధమనగా నిత్యమని యర్థము. "స్వర్గము సిద్ధము", "భూమి సిద్ధము", "ఆకాశము సిద్ధము" అని యిట్లు నాశముగాని దేశాంతరప్రాప్తిగాని లేనిభావము లందు సిద్ధశబ్దప్రయోగము వ్యవహారమునందుండుటచేత అది తెలియును.

ఏమండీ! "అన్నము సిద్ధము", "పప్పు సిద్ధము", "గంజి సిద్ధము" — అని క్రియానిష్పన్నములయిన వానియందుగూడ సిద్ధశబ్దము ప్రయోగింపబడు చున్నదే! అట్టియెడ నిత్యపర్యాయవాచి కేగాని, క్రియానిష్పన్నార్థ బోధక సిద్ధ శబ్దమునకు గ్రహణము లేదనుట ఎట్లు?

అనిన వినుడు. 'సంగ్రహ'మను గ్రంథమునందు, శబ్దము కార్యమా? సిద్ధమా? అని పక్షద్వయము విచారింపబడినది. ఆ ప్రసంగమున, కార్య ప్రతిపక్షమగు నర్థమును జెప్పునదిగా సిద్ధశబ్దము వ్యవహరింపబడినది. కావున ఆ శబ్దము నిత్యపర్యాయవాచియని గ్రహింపదగినది. వ్యాకరణశాస్త్రము నందును సిద్ధశబ్దమున కదియే యర్థము. లేదా- 'ఏవ' శబ్దము లేకున్నను ఒక్క పదమే అవధారణమును బోధించుట 'అబ్భక్షుడు', 'వాయుభక్షుడు' ఇత్యాదు లందు చూతుము. 'ఉదకమునే భక్షించువాడు', 'వాయువునే భక్షించువాడు' అని గమ్యమగుచున్నదిగదా! అట్లే శబ్దార్థసంబంధము సిద్ధమే యయినపుడు శాస్త్ర మారంభింపబడినది, సాధ్యమైనపుడుగాదు అని యర్థము.

లేదా- ఇంకొక తీరుగను జెప్పవచ్చును. 'సిద్ధే'- అనుచోట పూర్వ పదమునకు లోపము వచ్చినది. అది సమానపదము. 'అత్యన్తసిద్ధే'- అను పదము నందలి పూర్వ మదగు 'అత్యంత' అను పదమునకు లోపము వచ్చినది. 'దేవ దత్త' అను పదమున 'దేవ' పదమును లోపింపజేసి 'దత్త' అను పదముతో మాత్రము వ్యవహరించుటయుగలదు. అట్లే 'సత్యభామ'ను, 'భామ' యని వ్యవహరించుటయుగలదుగదా! ఆ విధముగనే అత్యంత సిద్ధము అను నర్థమున సిద్ధశబ్దము ప్రయోగింపబడినది. ఇదియు శాస్త్రీయమగు వ్యవహారమే. "వినాపి ప్రత్యయం పూర్వోత్తర పదయోర్లోపో వక్తవ్యః అను వార్తికము లోపమునకు ప్రమాణము.

లేదా- వ్యాఖ్యానమువలన విశేషార్థ ప్రతిపత్తి కలుగును గాన ఈ సిద్ధ శబ్దమును నిత్యపర్యాయవాచిగా వ్యాఖ్యానింతుము. వృద్ధ వ్యవహారమువలన శబ్దార్థసంబంధములు నిత్యములని సంగ్రహాది గ్రంథములం దుపపాదింపబడి యున్నది. సందేహము కలిగినపుడు వ్యాఖ్యానమువలన విశేషనిర్ణయము చేయ వలెను. సందేహముకలిగినంత మాత్రమున లక్షణ మలక్షణముగాదు. "వ్యాఖ్యా నతో విశేష ప్రతిపత్తి ర్నహిసందేహాదలక్షణమ్" అని శాస్త్రకర్తల సిద్ధాన్తము.

ఇటనొక యాక్షేపమున కవకాశము గలదు, ఏమియన, సిద్ధశబ్దము

నుచ్చరించుటయేల? మహాప్రయత్నముతో దానిని నిత్యార్థకముగ వ్యాఖ్యా నించుట యేల? ఎగ్గరగా పెద్ద కంఠముతో "నిత్యేశబ్దార్థ సంబంధే" అనియే ఏల వార్తికమును రచింపలేదు? అటులైన సందేహమే కలిగెడిది కాదుగదా! అనిన అభీష్టార్థసిద్ధికొరకై తన మహాశాస్త్రమునకు ఆదిని మంగళమును జేయ దలంచి, వార్తికాచార్యుడు, మంగళార్థమగు సిద్ధశబ్దమును ప్రయోగించినాడు. శాస్త్రములు మంగళములతో నారంభింపబడిన అధ్యయనము విచ్ఛేదము లేకుండగ విలసిల్లును. శ్రోతలును శత్రువులచే పరాభవమునందని వీరులగుదురు. శాస్త్రానుష్ఠానమువలన ధర్మోపచయముగలిగి ఆయుష్మంతులగుదురు. అధ్యేతలు అధ్యయన పరిసమాప్తిరూపమగు సిద్ధార్థత నందుదురు.

అంతియగాక ఈ నిత్యశబ్దము వినాశరహితములును, దేశాంతరప్రాప్తి లేనివియును నగు భావములను మాత్రమే బోధింపదు. బాహుల్యార్థమునను దీనికి ప్రయోగము గలదు. ఎట్లన- "ఈతడు నిత్యప్రహసితుడు. నిత్యప్రజల్పి తుడు" అందురు. 'అట బహుళముగ నవ్వువాడు, అధికముగ భాషించు వాడు' అనియే అర్థముగాని పుట్టినగడియలును నవ్వుచుండువాడని గాదు. కాగా నిత్యశబ్దముగూడ సందిగ్ధమేయగును ఇక నది యిట అభీక్ష్ణ్యాద్యర్థకము గాదు, నిత్యపర్యాయ వాచియేయని నిర్ణయించుటకు వ్యాఖ్యానము శరణము కాక తప్పదు. కావున వార్తికాచార్యుడు, మంగళార్థమైన సిద్ధశబ్దమును గ్రహించి నను, దానిని తాను నిత్యపర్యాయవాచిగా వర్ణింపగలుగునని తలంచి వార్తికా రంభమున సిద్ధశబ్దమును గ్రహించెను.

పదార్థ మాకృతియనియు, ద్రవ్యమనియు రెండు విధములుగా వెనుక చెప్పబడినది. 'శబ్దార్థ సంబంధే', అను సమాసపదమునకు, 'శబ్దే, అర్థే, సంబంధేచ సిద్ధేసతి' అని యిట్లు విగ్రహము చెప్పబడినది. ఈ విగ్రహము, జాతి పదార్థ మను పక్షమునకా? వ్యక్తిపదార్థమను పక్షమునకా? పొసగునది? అనిన ఆకృతి పదార్థమను పక్షముననే ఎందువలన అనగా, ఆకృతినిత్యము. ద్రవ్యమనిత్యము. ద్రవ్యము పదార్థమను పక్షమున ఎట్లు విగ్రహము చేయవలెను? అపుడు శబ్దమును, అర్థసంబంధమును సిద్ధమైనపుడని చెప్పవలెను అర్థవంతములగుశబ్దము లకు వాని యర్థముతో సంబంధము నిత్యముగదా! ఆకాశమువలె ఆకాశ నిష్ఠమగు శబ్దమును నిత్యము. బాహ్యమగు నర్థము అనిత్యమైనను, బుద్ధి ప్రతిభాస రూపమగు నర్థమును, దానితోడి తాదాత్మ్యమను సంబంధమును శబ్దమునకు నిత్యమని భావము.

లేదా, ద్రవ్యమే పదార్థమను పక్షమునందును ఈవిగ్రహముపపన్నమే. ద్రవ్యమే నిత్యము. ఆకృతియే అనిత్యము. చూడుడు. మట్టియే ఒక ఆకృ తితో నున్నపుడు (పిండము)మంటిముద్ద అనబడుచున్నది. ఆ యాకృతిని పోనడచి కుండలు చేయబడుచున్నవి. వాని ఘటికాకృతిని పోనడచి, చిన్న పిడతలు చేయబడుచున్నవి.

అట్లే బంగారమొక ఆకృతిలో ముద్దగానుండిన ఆ యాకృతి నడచి

రుచకములును, రుచకాకృతిని పోగొట్టి కటకములును, ఆ కటకాకృతినిమార్చి స్వస్తికలును చేయబడుచున్నవి. మరల అవృత్తమైన ఆ బంగారు ముద్ద, వేరొక సంస్థానముతో గూడి చంద్రకట్టుల బొగ్గు నిప్పుతో సమానమైన వర్ణము గల కుండలములుగా మారుచున్నది.

ఆత్మైకత్వ విజ్ఞానము కలిగిన పిదప, బ్రహ్మమొక్కటియే సత్యము. తదతిరిక్తములెల్ల నసత్యములే. కాగా, ఘటత్వ గోత్వాది జాతులును అసత్యములే. ఆ జాతులనే ఉపాధులందురు. అసత్యములగునట్టి ఉపాధులతో గూడిన బ్రహ్మతత్త్వమే ద్రవ్యశబ్దార్థము. కావుననది నిత్యము. ఆకృతియనగా సంస్థానము (అవయవ సన్నివేశము). సంస్థాన వ్యంగ్యము జాతి. కావున జాతి వేరు. ఆకృతి వేరు. గౌతమమహర్షి కూడ "జాత్యాకృతివ్యక్తయః పదార్థః" అను సూత్రముచే జాత్యాకృతులకు భేదమును సూచించినాడు. కాని యీ ప్రకరణమునగల ఆకృతి శబ్దమునకు వ్యంగ్యవ్యంజకములు రెండును అర్థము. సంస్థానము వ్యంజకము. జాతివ్యంగ్యము.

సిద్ధే శబ్దే, అర్థే, సంబంధేచ అను నీవిగ్రహ మాకృతిపక్షమునందును ఉపపన్నమగును.

ఆకృతి అనిత్యమంటివిగదా! అపుడా విగ్రహమెట్లు పొసగును? అనిన, ఆకృతి అనిత్యముగాదు. నిత్యమే. దాని కనిత్య ముపపాదింపబడినది గదా యనిన, ఆ ఆకృతి ఒకచోట ఉపరతమైన, అంతటను ఉపరతముగాదు. అది ద్రవ్యాంతరమునందుండియే తీరును. ఉపరతమగుటయనగా అభివ్యక్తము కాకుండుట, నశించుటగాదు. ఆకృతియనగా జాతి. 'ఇది గోవు', 'ఇది గోవు' 'ఇయ్యదియు గోవు'- అని ఈ తీరున ఏకాకారమగు పరామర్శ మనుభవ సిద్ధము. దానికి కారణము 'గోత్వ' మను జాతి. పరమార్థదృష్టిలో సర్వమును అనిత్యమైనను, వ్యవహారదృష్టిలో జాతి నిత్యమే. అదియు నపుడు, ధ్రువము. కూటస్థము, అవిచాలి, అపాయోపజన వికారములు లేనిది. జన్మ, సత్త, వృద్ధి, పరిణామము. అపచయము, వినాశము- అను ఆరు భావవికారములును జాతికి లేవు. కావున అది నిత్యము.

లేదా- నిత్యమనగా ధ్రువము, కూటస్థము, అవిచాలి, అపాయోపజన వికార రహితము, ఉత్పత్తి వృద్ధిక్షయాదులు లేనిదియు మాత్రమే కాదు. ఎయ్యది విహతమైనను, దానియందలి తత్త్వము విహతముగాదో అదియు నిత్యమే.

తత్త్వమనగానేమి?

తద్భావము తత్త్వము. ఆకృతి నశించినను, తత్త్వము విహతముకాలేదు. అవయవ సంస్థానము మారునుగాని తద్వ్యంగ్యమగు తద్వృత్తిధర్మము నశింపదు. ప్రవాహమునకు విచ్ఛేదము లేదుగదా. ఇదియే ప్రవాహనిత్యత.

లేదా- ఇట్టిది నిత్యము, ఇట్టి దనిత్యము అను విచారముతో మనకేమి

పని? ఏది నిత్యమైన అది యేశబ్దమున కర్థమని తలంచి 'శబ్దే, అర్థే, సంబంధే' అని విగ్రహము చేయబడిన దందము. శబ్దముచ్చరింపబడినంతనే అర్థాకారమగు బుద్ధి కలుగుచుండును. అదియే బుద్ధిప్రతిభాసమగు బౌద్ధార్థము దానికి ప్రవాహనిత్యత కలదు.

సరి- ఈ శబ్దార్థ సంబంధములు నిత్యములని మనకెట్లు తెలియును? **"లోకతః"** లోకమువలన.

లోకవ్యవహారమువలన ఆయా వస్తువులను బుద్ధిలో నూహించి, శబ్దములను ప్రయోగింతురు. ఆ శబ్దము లెవ్వరిచేతను తయారుచేయబడలేదు. వానిని తయారించుట కెవ్వరును యత్నింపరు. అనిత్యములయిన ఘటాది పదార్థముల నిష్పాదనమునకు యత్నము చేయుదురు. కుండతో జలానయనాధికార్యములను జేయదలంచినవాడు కుమ్మరి యింటికిబోయి,' ఘటము నొకదానిని జేయుము దానితో బనికలదు' అని యడుగును. శబ్దములను ప్రయోగింపదలచిన పురుషుడు, ఆ విధముగ వైయాకరణుని యింటికిబోయి, 'శబ్దములను తయారు చేసి యిమ్ము. వానిని నేను బ్రయోగింపవలసి యున్నది' అని యడుగుటలేదు. ఆ పదార్థమును తన మనమున నిరూపించుకొని శబ్దములను తానే ప్రయోగించును. కాగా శబ్దములు నిత్యములే.

ఈ శబ్దార్థ సంబంధముల విషయమున లోకము ప్రమాణమైనచో ఒక శాస్త్రముతో నేమి పని? అనిన,

**"లోకతోఽర్థప్రయుక్తే శబ్దప్రయోగే శాస్త్రేణ ధర్మనియమః"**

అర్థబోధకొరకు లోకమున, శబ్దములు ప్రయోగింపబడుచున్నవి. శాస్త్రము చేయునది అట ధర్మనియమము.

ధర్మనియమ మనగానేమి?

ధర్మము కొరకైన నియమము, లేదా ధర్మార్థమగు నియమము, లేదా ధర్మప్రయోజనమగు నియమము- ధర్మనియమము.

అర్థబోధకై శబ్దప్రయోగము లోకసిద్ధమే. శాస్త్రము, ప్రకృతి ప్రత్యయ విభాగ జ్ఞానద్వారముగ, సాధువులగు గవాదిశబ్దములే ప్రయోగింపదగినవిగాని గావ్యాదులు కావు అను నియమమును బోధించును. అసాధుశబ్ద ప్రయోగము వలన అధర్మము కలుగును గనుక దానిని వారించి ఈ నియమము, ప్రత్యవాయ పరిహారరూపమగు ధర్మమును గలిగించును. ఇది 'ధర్మాయ నియమః = ధర్మనియమః'- అను వివరణ తాత్పర్యము.

ఇక, 'ధర్మార్థో వా నియమః = ధర్మనియమః'. ధర్మార్థమగు నియమ మనగా, యజ్ఞార్థమగు నియమము. ధర్మమనగా యజ్ఞము. యజ్ఞము నందు అపశబ్దభాషణము చేసినచో క్రతువునకు వైగుణ్యము కలుగునుగాన ఈ సాధుశబ్ద ప్రయోగ నియమము యజ్ఞాంగము, అని తాత్పర్యము.

ఇక ధర్మప్రయోజన నియమమునగా- ధర్మముచే ఆతిప్తమగు నియ

మము. "ప్రయుజ్యతే ఇతి ప్రయోజనః" కర్మార్థముగ ల్యుట్ప్రత్యయము. నియమమనగా అసాధునివృత్తి. ధర్మమనగా అపూర్వము. లిఙాదివాచ్యమగు అపూర్వమగు కార్యము, పురుషుని నియోగించునదిగాన నియోగమనబడును. ఈ విధమగు ధర్మనియమముకొరకు శాస్త్రమావశ్యకము.

ఇటుల శాస్త్రము ధర్మనియమమును జేయుట ఎచ్చటనైనగలదా యనిన, "యథా లౌకిక వైదికేషు" అని వార్తికకారుని సమాధానము. లోకమునందును, వేదమునందును గూడ గలదు. ఇట వార్తికమునందు 'లోకే వేదేచ' అనియే వచియింపదగియుండ, తద్ధితాంతపదములగు 'లౌకిక' 'వైదిక' అను పదములను ప్రయోగించుట దాక్షిణాత్యులకు తద్ధితాంత పద ప్రయోగములందు ప్రీతి మెండని సూచించును. వార్తికకారుడు దాక్షిణాత్యుడని తాత్పర్యము.

లేదా తద్ధితాంత పదప్రయోగమును సార్థకమే యనవచ్చును. లోక భవములును, వేదభవములునగు సిద్ధాంతములందు ఈ విధమగు ధర్మనియమ మగపడుచున్నదని, వార్తికకారుని తాత్పర్యము.

లోకములో, "గ్రామములలోని కుక్కుటములును, సూకరములును భక్ష్యములు కావు" అనుచున్నారు. ఆకలిని దీర్చుకొనుట కేదేని భక్ష్యము తీసికొనబడును. ఈ ఆకలిగొన్నవాడు కుక్కమాంసమునో ఇక దేనినో తిని ఆకలిని తీర్చుకొనవచ్చును. అట్టియెడ, పై, "అభక్ష్యో గ్రామ్యకుక్కుటః" ఇత్యాది శాస్త్రము ఇది భక్ష్యము, ఇది అభక్ష్యము అని నియమమును బోధించుచున్నది.

అట్లే స్త్రీలయందు ప్రవృత్తి కామమువలనగలుగును. ఆ కామము గమ్యయందు ప్రవర్తించినను, అగమ్యయందు ప్రవర్తించినను నివృత్తమగును. ఇట్టి సందర్భమున ఈమెగమ్య, ఈమె అగమ్య అని నియమము శాస్త్రకృతమై కనబడుచున్నది.

వేదమందును ఇట్టినియమమును జూతుము. ఎట్లనగా "పయోవ్రతో బ్రాహ్మణో, యవాగూవ్రతో రాజన్యః, ఆమిక్షా వ్రతోవైశ్యః" అని చెప్పబడుచున్నది. వ్రతమనగా తీసికొను నాహారము. "బ్రాహ్మణునకు పాలు, క్షత్రియునకు గంజి, వైశ్యునకు ఆమిక్షయు వ్రతము" అనిన నవియే వారివారి కభ్యవహార్యములనియు, శాలి మాంసాదులను వారు తీసికొనరాదనియు నియమము చేయబడుచున్నది.

అట్లే, "బైల్వః ఖాదిరో వా యూపో భవతి" అని చెప్పబడియున్నది. యూపమనగా యజ్ఞమునందు, వధ్యపశువును కట్టుటకైన కంబము. ఆ పశువును కట్టుటకు ఏదియో ఒక కఱ్ఱను, దానిని చెక్కించి, నునుపుచేసిగాని, చెక్కించకయేగాని, పాతి గాని పాతకుండగనే గాని ఎట్లో పడవేసి దానికి పశువును గట్టవచ్చునుగదా; అట్టి స్థితిలో, పై శాస్త్రము, ఆయూపస్తంభము మారేడు కఱ్ఱతోగాని, చండ్రకఱ్ఱతోగాని చేయబడినది కావలెనని నియమ

మును బోధించుచున్నది.

అట్లే "అగ్నౌకపాలాన్యధిశ్రిత్య అభిమంత్రయతే", "భృగూణా మంగిరసాం ఘర్మస్యతపసాతప్యధ్వమ్" అను మంత్రము నుచ్చరించి కపాలముల నగ్నియందు వెచ్చజేయవలెనని శాస్త్రము చెప్పుచున్నది. అగ్నికి దహించుట వ్యాపారము. మంత్రము నుచ్చరింపకుండగ, కపాలముల నగ్నియందుంచినను నవి వెచ్చబడును. అట్టియెడ, మంత్రముతో తపింపజేసిననే అభ్యుదయము కలుగునను నియమమును ఈవైదిక సిద్ధాన్తము ప్రదర్శించుచున్నది. ఆ విధముగనే ప్రకృతమునను, సుశబ్దోచ్చారణమువలనను, అపశబ్దోచ్చారణవలనను అర్థజ్ఞానము కలుగుట తుల్యమే అయినను, సుశబ్దములచేతనే అర్థములను బోధింపవలెను. అపశబ్దముచే బోధింపరాదు. అట్లయిననే అభ్యుదయము కలుగును. కాకున్న గలుగదు- అని ఇట్లు ధర్మనియమమును శాస్త్రము బోధించునని గ్రహింపదగును.

## అనుపలబ్ధప్రయోగ శబ్దసాధకశాస్త్రసార్థక్య నిరూపణము

"లోకతోఽర్థప్రయుక్తే శబ్దప్రయోగే శాస్త్రేణ ధర్మనియమః" అని యుపపాదించుటచే, ప్రయోగములందుగల సాధుశబ్దాన్వాఖ్యానమును శాస్త్రము చేసి, ధర్మనియమమును బోధించుచున్నదని తెలియవచ్చినది. కాని అప్రయుక్తములగు సాధుశబ్దములుగూడ శాస్త్రముచే అన్వాఖ్యానముచేయబడుచున్నవి. వానికి ప్రయోగముపలబ్ధము కాకుందువలననే అవి యసాధువులని వ్యక్తమగుచున్నది. వ్యాకరణస్మృతి ప్రయోగమూలము. అది అప్రయుక్తములకుగూడ సంస్కారమును బోధించిన, అప్రమాణముగాదా? అను శంకను మనమున నిడికొని వార్తికకారుడు "అస్త్యప్రయుక్తః" అని యొక వార్త్తికమునవతరింపజేసెను. అప్రయుక్తములగు—ప్రయోగములందగపడని శబ్దములు గూడ గలవు గదా యని యర్థము. అయ్యవి 'ఊష', 'తేర', 'చక్ర', 'పేచ' అనునవి.

ఉండనిమ్ము అవియుండిన నేమి ప్రమాదము?

మీరు శబ్దములకు సాధుత్వమును నిర్ణయించునది ప్రయోగమునుబట్టి గదా. కాగా, ప్రయోగములందగపడని శబ్దములసాధువులే కావలెను. వాని అన్వాఖ్యాన మప్రామాణ్యాపాదకముగదా ? అనిన;—మీమాటయే పరస్పర విరుద్ధము; శబ్దములు కలవు అనుచున్నారు. కలవనగా ప్రయోగమునందు గలవనియే గదా అర్థము. అప్రయుక్తములనిన లేవనియే తేలును. మీ నోట మీరే కొన్ని పదములను ప్రయోగించుచు అవి అప్రయుక్తములనుచున్నారు. ఇట్టి విరుద్ధ భాషణమునకు మీరే తగియున్నారుగాని ఇంకెవరర్హులగుదురు? శబ్దప్రయోగమున మీకంటె సాధువెవరు?

నాది విరుద్ధ భాషణముకాదు, ఈశబ్దములను శాస్త్రకారులు శాస్త్రముచే అనుశాసించుచున్నారుగాన ఆ శబ్దములున్నవంటిని. 'నీవే ప్రయోగించుచు

చున్నవి లేవనుట ఏమి యోగ్యత' అని పరిహసించితిరి. ప్రయోగింపలేదని యనుటలేదు. లోకులు ప్రయోగింపలేదని అప్రయుక్తములంటిని.

నీవును లోకులలో జేరినవాడవేగదా? నేను లోకులలోని వాడ నగుదును గాక, నేనే లోకముగాదు, అర్థబోధకొరకై శబ్దములను ప్రయోగించునది లోకము. నేనిపుడాశబ్దముల స్వరూపమును దెలియజేయుటకే ప్రయోగించితినిగాని, అర్థబోధకై ప్రయోగింపలేదు అని నా అభిప్రాయము.

ఎటులైనను అప్రయుక్తములగు శబ్దములు నుండుననుట యుక్తముగా దోచదు. శబ్దములను ప్రయోగించునది యర్థబోధ కొరకుగదా? అర్థము లుండిన శబ్దములునుండియే తీరును అను నభిప్రాయముతో వార్త్తికకారుడు, **"అస్త్యప్రయుక్త ఇతిచేన్నార్థేశబ్ద ప్రయోగాత్"** అనువార్త్తికమును పఠించెను.

**"అప్రయోగః ప్రయోగాన్యత్వాత్"** అని వార్త్తికాంతరము. కాని, ఊష తేర, చక్ర, పేచ, అనువానికి ప్రయోగములు లేకుండుటకు కారణమును గలదు. వాని యర్థములను బోధించుటకై వేరు శబ్దములు భాషలో నుండుటచే వానిని ప్రయోగించుటలేదు. కావున వాని అప్రయోగము న్యాయ్యమే. "ఊష" అను పదము యొక్క అర్థమున "క్వయూయ ముషితాః" (ఎచ్చట మీరు నివసించితిరి?) అనియు, "తేర" అను పదము నర్థమునందు "క్వయూయం తీర్ణాః" (మీ రెచ్చట దాటితిరి?) అనియు, "చక్ర" అను పదము నర్థమునందు "క్వయూయం కృతవన్తః" (మీరెచ్చట చేసితిరి?) అనియు, "పేచ" అను దాని యర్థమున, "క్వయూయం పక్వవంతః?"(మీరెచ్చట వండితిరి?) అనియు నిట్లితర శబ్దములను లోకమునందు ప్రయోగించుచున్నారు అందువలన నవి ప్రయోగములందు లేవనుటయు పొసగును. కాని ప్రకృతకాలమున నవి అప్రయుక్తములయినను, పూర్వము ప్రయుక్తములై యుండుటచే వాని కనుశాసనము చేయవలసియే యుండును.

**"అప్రయుక్తే దీర్ఘసత్రవత్"** అని వార్త్తికము.

దీర్ఘకాల సాధ్యములగు యజ్ఞములకు లక్షణములను, వేదము బోధించు చున్నది అను నభిప్రాయముతో యాజ్ఞికులు కల్పసూత్రముచే ఆ సత్రముల నన్వాఖ్యానము చేయుచున్నారు. ఆ యజ్ఞములు వంద సంవత్సరము లాచరింప వలసినవియు, వేయిసంవత్సరములాచరింపవలసినవియు గలవు. ఈనాడు వాని నెవ్వరును నాచరింపలేరు. అప్పటికిని వానికి లక్షణ ప్రణయన మావశ్యకమయి నట్లు, నేటికాలమున నప్రయుక్తములగు శబ్దములకుగూడ లక్షణానువిధాన మపరిహార్యమని భావము.

**"సర్వేదేశాన్తరే"** అని యనంతర వార్త్తికము. మరియు నా శబ్దము లన్నియు దేశాంతరమున ప్రయోగములందు గలవని యర్థము.

అట్లైన నుపలబ్ధములు కాలేదే యనిన, నందులకు యత్నము నాచరింపుడు. శబ్దప్రయోగ విషయ మతి విశాలము. ఒక భూమండలమే యేడు ద్వీపములు గలది. దాని పారమునే చేరలేరు. అందును భూలోకము, భువర్లోకము,

స్వర్లోకమునని మూడు లోకములు నాలుగు వేదములు, ఆరంగములు, ఉపని షత్తులు, స్మృతులు మున్నగు రహస్యగ్రంథములు అనేక భేదములు కలవి. యజుర్వేదమునకు వందశాఖలు. సామవేదము వేయిశాఖలు గలది. ఋగ్వేద మిరువదియొక్క భేదములు గలది. అథర్వణవేదము తొమ్మిది విధములుగా నున్నది. ఆ పైన, వాకోవాక్యములను ఉక్తి ప్రత్యుక్తిరూపములగు గ్రంథ ములు. ఇతిహాసములు, పురాణములు, వైద్యాది శాస్త్రగ్రంథములు.

ఇంత విశాలమగు శబ్దప్రయోగ విషయమును గమనింపక, దేశాన్తర, శాస్త్రాంతర, వేదాన్తరములను బరికింపక, అప్రయుక్తములగు శబ్దములును గలవనుట కేవలము సాహసమే.

ఈ మహత్తర శబ్దప్రయోగ విషయమునందును, ఆయా శబ్దప్రయోగము లకు విషయ నియతియు నగపడుచున్నది. శవధాతువు గత్యర్థకము. అది ఆ యర్థమున కంబోజ దేశమునందు మాత్రమే వాడబడుచున్నది. ఆర్యులా ధాతువును 'శవము' అను కృదన్తరూపమునందు మాత్రమే ఉపయోగించు చున్నారు. ప్రాణియొక్క మృతావస్థ వికారము. ఆ వికారార్థమున మాత్రమే ఆర్యుల వాడుక. సురాష్ట్రదేశమునందు గత్యర్థమున 'హమ్మ' ధాతువును, ప్రాచ్య మధ్యదేశములందు ఆ యర్థముననే 'రంహ' ధాతువును వాడుదురు. ఆర్యులా యర్థమున 'గమ్' ధాతువును వాడుదురు దాత్రమనగా కోయునది. కొడవలి యనుట. ఉత్తరదిశయందలి దేశములలో దాత్రమనియే యందురుగాని తూర్పు దేశములలో 'దాతి' యందురు.

మరియు, నీవు ప్రయుక్తములుకాని శబ్దము లివియనిన ఆ శబ్దములకు గూడ ప్రయోగ మగపడుచున్నది సుమా!

ఎచ్చట? అందువా? వేదమునందు.

ఎట్లనగా జూడుము- "సప్తాస్యే రేవతీ రేవదూష" "యద్వో రేవతీ రేవత్యం తదూష". "యన్మేనరః శ్రుత్యం బ్రహ్మచక్ర" "యత్రా నశ్చక్రా జరసం తనూనామ్" అని.

## శబ్దజ్ఞానమునకు ధర్మజనకత్వ నిరూపణము

సాధుశబ్దముల జ్ఞానమాత్రమున ధర్మము కలుగునందురా? లేక వాని ప్రయోగమువలనగలుగునా? యని విచారము.

ఎట్లైననేమి? జ్ఞానమాత్రమువలన ధర్మము గలుగుననిన, అధర్మముగూడ ప్రాప్తించును. ఎట్లన సాధుశబ్దముల నెరింగినవానికి అపశబ్దములును దెలియును. కావున శబ్దజ్ఞానమువలన ధర్మము కలిగినట్లు, వాని యపశబ్దజ్ఞానము వలన నధ ర్మమును గలుగ తప్పదు. పైగా అధర్మమే అధికముగాగలుగును గూడ. ఏల యన అపభ్రంశము లధికములును, సుశబ్దము లల్పములునుగా నుండును గదా. ఒక 'గౌః'అను శబ్దమునకు 'గావీ' 'గోణీ, 'గోతా',గోపోతలికా'-మున్నగునవి

ఎన్నియో అపభ్రంశములున్నవి. **"జ్ఞానే ధర్మ ఇతిచేతదాధర్మః"** అని వార్తికము.

**"ఆచారే నియమః"** అని వేరొక వార్తికము. వేదము, శబ్దముల ప్రయోగమునందే ధర్మనియమమును బోధించుచున్నది. ఆచారమనగా ప్రయోగము. "తేసురా హేలయో హేలయ ఇతి కుర్వన్తః పరాబభూవుః" అను వేదవచనము, అసురులు, "హే అరయః" అని ప్రయోగించుటకు బదులు "హేలయః" అనుటచే పరాభూతులయిరని గదా చెప్పుచున్నది. కావున జ్ఞానము వలన ధర్మము కలుగుననుట వేదవిరుద్ధము.

అటులైన, ప్రయోగమువలననే ధర్మాధర్మములగుగాక. 'ప్రయోగమున ధర్మము కలుగుననిన, ఎల్లరకును అభ్యుదయము కలుగవలసి వచ్చును' అని **"ప్రయోగే సర్వలోకస్య"**అను వార్తిక మాక్షేపమును జెప్పుచున్నది. శాస్త్ర పరిశ్రమ చేసినవారికిని చేయనివారికిని ప్రయోగమాత్రమున నభ్యుదయము సిద్ధించునని యాక్షేప తాత్పర్యము.

అందరకును నభ్యుదయము కలిగిన గలుగనిమ్ము నీకేల మత్సరము? అనిన-మత్సరమేమియు లేదు. కాని శాస్త్రాధ్యయన ప్రయత్నము వ్యర్థ మగును. ప్రయత్నము చేసినవారికే ఫలము కలుగవలెను. ప్రయత్నమునకు ఫలసంబంధము లేకుండ జేయరాదు. యత్నము చేయకున్నను ఫలము సిద్ధించిన నాడు, యత్నము నికనెవ్వరు చేయుదురు? వ్యాకరణాధ్యయనమే వ్యర్థ మగును.

ఎందులకు వ్యర్థము కావలెను? వ్యాకరణ శాస్త్రాధ్యయనము చేసినవా రధికముగ సాధుశబ్దములను బ్రయోగించి యధికాభ్యుదయము నందవచ్చును గదా? యనిన అందులకు వ్యతిరేకముగూడ అగపడుచున్నది. ప్రయత్నమును బాగుగజేసినవారైనను ప్రతిభ లేనందున, ప్రవీణులు కాజాలరు. వ్యాకరణ శాస్త్రాధ్యయనము చేయనివారైనను కొందరు ప్రత్యుత్పన్నబుద్ధులు ప్రయోగ కుశలులగుచుండుట చూచుచున్నాము. కావున ఫలవ్యతిరేకమును సంభావితమే.

అటులైన, జ్ఞానమాత్రముననను ధర్మము కలుగదు. ప్రయోగ మాత్రమునను అది కలుగదు. శాస్త్రజ్ఞానపూర్వక ప్రయోగమువలన నభ్యుదయముకలుగునని సిద్ధాన్తము. **"శాస్త్రపూర్వకే ప్రయోగేభ్యుదయ స్తత్తుల్యంవేదశబ్దేన"** అని వార్తికము. వేదశబ్దములు గూడ నిట్లు చెప్పుచున్నవి. "ఎవ్వాడు అగ్నిష్టోమమును చేయునో, అద్దాని నాచరింపవలెనని వేదవచనముల వలననే తెలిసికొనునో" అనియు, "ఎవడు నాచికేతాగ్ని చయనము నాచరించునో, అట్లు చేయవలెనని వేదశబ్దములవలన దెలిసికొనునో" అనియు నిట్లు జ్ఞానపూర్వకానుష్ఠానము ఫలప్రదమని చెప్పుచున్నది. వార్తికమునందలి- **"తత్తుల్యం వేదశబ్దేన"** అనుచో వేదశబ్దమనగా, వేదము శబ్దము = బోధకముగాగల లేదా ప్రమాణముగా గలయర్థమని భావము. లేదా; 'తత్తుల్యం వేదశబ్దేన' వార్తికభాగమునకు వ్యాఖ్యా

వ్త్రరమును జేయవచ్చును. వేదశబ్దము లెట్లు నియమపూర్వకముగ నధీతములై నసే ఫలవంతములగునో అట్లే లౌకికశబ్దములుగూడ శాస్త్రజ్ఞానపూర్వకముగ ప్రయోగింపబడిననే అభ్యుదయసాధకము లగునని ద్వితీయవ్యాఖ్యా తాత్పర్యము.

లేదా- అట్లు సిద్ధాన్తీకరించుటలో వినిగమకను లేనందున, జ్ఞానమాత్రము ననే ధర్మము కలుగుననుడు. దోషమేమి?

అట్లైన ధర్మమువలె నధర్మము గూడ ప్రాప్తించునంటివిగదా? యనిన నీ దోషము తగులునది కాదు. అధర్మము ప్రాప్తింపదు. మాకు శబ్దము ప్రమాణము. వేదశబ్దము "ఏకః శబ్దః సమ్యగ్ జ్ఞాతః, శాస్త్రాన్వితః, సుష్ఠుప్రయుక్తః స్వర్గేలోకే, కామధుగ్భవతి" అనునది సాధుశబ్దము. సాధుశబ్ద జ్ఞానమువలన ధర్మము కలుగును అనియే చెప్పినది గాని అపశబ్ద జ్ఞానమువలన అధర్మము కలుగునని చెప్పలేదు. అపశబ్దముల ప్రయోగమువలన నధర్మము కలుగునని చెప్పినది. అపశబ్దజ్ఞానమువలన అధర్మము విహితమునుగాదు, ప్రతిషిద్ధమునుగాదు. కావున వానివలన దోషమును లేదు, అభ్యుదయమును గలుగదు. అది యెట్లన, 'హిక్కిత, హసిత, కండూయిత'ములను క్రియలు విహితములునుగావు, నిషిద్ధములును గాలేదు. కావున వానివలన దోషమును లేదు, అభ్యుదయమును కలుగదు

లేదా- ఇట్లును జెప్పవచ్చును. అపశబ్దజ్ఞానము శబ్దజ్ఞానమున కుపాయమే. ఎవ్వడు అపభ్రంశము లసాధువులని యెరుంగునో వాడే సాధుశబ్దములను, సుశబ్దములనుగా గ్రహించును. కాగా, అపశబ్దముల జ్ఞానము నాంతరీయకము గాన నాంతరీయకములకు పృథక్ఫలముండదు. ఆ కారణమున, జ్ఞానమువలన ధర్మమనువారికి అపశబ్దజ్ఞాన పురస్సరముగ సుశబ్దములనుటయే ధర్మజనకమని యర్థసిద్ధము.

లేదా- ఇట్లు సమాధానాంతరమును జెప్పనగును. ఈ అపశబ్దజ్ఞానము గలవాడు, నూతిని ద్రవ్వువానితో దుల్యుడు. కూపఖానకుడు, కూపఖనన సమయమున, ధూళి, మట్టి మున్నగునవి తన శరీరమున కంటుకొనినను, నీరు పడిన తరువాత దానితో నా ధూళి మున్నగువానిని శోధించుకొనును. కూప ఖననమువలన లభించు నభ్యుదయమును బొందును. ఆ విధముగనే, ప్రకృతమునందును, అపశబ్దజ్ఞానమువలన అధర్మము ప్రాప్తమైనను, శబ్దజ్ఞానజన్యధర్మముచే ఆ స్వల్పదోషము నిహతమగును. ఉత్కృష్టధర్మఫలావాప్తియు గలుగును అని భావము.

"ఆచారే నియమః" అని సుశబ్దాపశబ్దములకు నియమము ప్రయోగమునందే అని చెప్పినదియు, యజ్ఞకర్మయందే వాని ప్రయోగాప్రయోగములవలన ధర్మాధర్మోత్పత్తి అను నభిప్రాయముచేతనే. యజ్ఞమునకు బయట ఆ నియమము లేదు. "యర్వాణస్తర్వాణో నామ ఋషయో బభూవుః ప్రత్యక్ష ధర్మాణః పరావరజ్ఞాః విదిత వేదితవ్యాః అధిగతయాథాతథ్యాః" అను శ్రుతియు నీ విషయమునే చెప్పుచున్నది. యోగాభ్యాసమువలన గలిగిన జ్ఞాన విశేషముచే సర్వమును దెలిసికొనిన వారును, విద్య - అవిద్యా విభాగజ్ఞులును,

శ్రవణమననాది ఆధ్యాత్మికసంపద కలవారును, పరబ్రహ్మ సాక్షాత్కారము నొందినవారును నగు కొందరు ఋషులు, "యద్వావ_ర్తతామ్-, తద్వావ_ర్తతామ్ నః కిమ్?" "ఏమట కానిమ్ము మనకేల?" అని చెప్పదలంచి, యద్వానః" అనుటకు బదులుగా 'యర్వాణః' అని అనిరట. అందువలన వారికి యర్వాణ ఋషులు అనియు, 'తద్వానః' అనుటకు, 'తర్వాణః' అనుటచే వారికి 'తర్వాణ ఋషు'లనియు, పేర్లు వచ్చినవి. వారందరును మహామహులు. ఎపుడును యజ్ఞములయందపభాషణము చేయలేదు. ఇక అసురులో, వారు యజ్ఞము నందే, 'హేరయోనశ్యధ్వమ్' అనుటకు మారుగా, 'హేలయః హేలయః'అనుటచే పాపసాధనమగు నపశబ్దోచ్చారణము మూలమున పరాభవము నందిరి. కాగా 'శబ్దజ్ఞానము ధర్మజనకము' అను సిద్ధాన్తము నిరాక్షేపము.

## వ్యాకరణ పదార్థ నిరూపణము

వ్యాకరణమను పదమున కేమియర్థము?

'వ్యాకరణమనగా సూత్రము' అని సమాధానము. అట్లైన 'వ్యాకరణస్య సూత్రమ్' ఇది వ్యాకరణముయొక్క సూత్రము అను వ్యవహారమునందు షష్ఠ్యర్థ ముపపన్నము గాదు. వ్యాకరణమనినను, సూత్రమనినను నొకటియే గదా! సూత్రముకంటె భిన్నమైన వ్యాకరణమనునది వేరుగ నుండినగదా దానికిది సూత్రమగునది? 'వ్యాకరణం సూత్రమ్' అని సమాప్రయోగ ముపపన్నముగా వచ్చును గాని వ్యధికరణప్రయోగమున కుపప_త్తి దుర్లభము.

ఇక, వ్యాకరణమనిన అష్టాధ్యాయీ సూత్రసముదాయమనియు, సూత్రమనగా, తదేకదేశమగు నొకసూత్రమనియు జెప్పిన కుదురునందుమా? అపుడును నేకదేశమగు సూత్రముగూడ నెట్లో వ్యాకరణమే యగును గాన అనుపప_త్తి తప్పదు. ఈయర్థము **"సూత్రే వ్యాకరణేషష్ఠ్యర్థోఽ నుపపన్నః"**అను వా_ర్తికముచే సూచింపబడినది.

**"శబ్దాప్రతిపత్తిః"** అని ఆక్షేపా_న్తర వా_ర్తికము. "వ్యాకరణము వలన సుశబ్దములను దెలిసికొనుచున్నాము" అని వ్యవహారము గలదు. వ్యాకరణమనిన సూత్రము మాత్రమే యయిన, సూత్రమాత్రమున శబ్దజ్ఞానము కలుగలేదు గదా? సూత్రము, దాని వ్యాఖ్యానము, వానివలన గదా శబ్దజ్ఞానము కలుగునది? అనిన-వ్యాఖ్యానమనిన నేమి? ఆ సూత్రములందలి పదముల విభాగమేకదా! అందురేమో. "వృద్ధిః, ఆత్, ఐచ్" అని పదవిభాగము చేయుట మాత్రమే వ్యాఖ్యానము కాదు. మరియేమి? ఉదాహరణము, ప్రత్యుదాహరణము, వృ_త్తిలోనున్న సూత్రమునందు లేని, పదముల అనువృ_త్తి- ఈ మొ_త్తమంతయు వ్యాఖ్యానమనబడును.

అటులైన వ్యాకరణమనగా 'శబ్దము అందుము. **"శబ్దే ల్యుడరః"**

అనునది యాక్షేపవార్తికము.

వ్యాకరింపబడునది వ్యాకరణము. అనగా అష్టాధ్యాయీ సూత్ర లక్ష్యము. ఇపుడు షష్ఠ్యర్థమున కనుపపత్తి లేదు. కాని 'శబ్దాప్రతిపత్తి' అను దోషమీ పక్షమునను అపరిహృతమే. లక్ష్యములవలన లక్ష్యప్రతిపత్తి యెట్లు కలుగును?

మరియు 'వ్యాకరణమ్' అను పదమునందలి 'ల్యుట్' అను ప్రత్యయ మున కర్థము పరిపడదు. వ్యాకరణమనగా వ్యాకృతికి సాధనము. ల్యుట్ప్రత్య యము కరణార్థకము. లక్ష్యము వ్యాకృతికి సాధనము గాదు గదా? శబ్దము వ్యాకృతి యగును.

ఇంకొక యాక్షేపము, "భవేచతద్ధితః"అను వార్తికముచే జెప్ప బడినది. "వ్యాకరణే భవో యోగః వైయాకరణః" అనుచున్నారు. వ్యాకర ణము నందున్న యోగముగాన నిది వైయాకరణము అని యర్థము. వ్యాక రణమన, శబ్దమైన, నందు సూత్రముండుట యసంభవము. యోగమనగా సూత్రము. సూత్రములుండునది అష్టాధ్యాయియందురు. ఇటనొక ప్రశ్న కలుగ వచ్చును. శబ్దమనగా లక్ష్యముగదా. లక్ష్యములందును సూత్రములు తత్సా ధకములుగా నుండవచ్చును, అనునది ప్రశ్న.

కాని, మీమాంసాసూత్రములుగూడ వేదశబ్దములను విచారించునవిగా వానియందుండును గాన శబ్దభవములగుటచే వానిని గూడ వైయాకరణ సూత్రములని వ్యవహరింపవలసివచ్చును. కావున నా ప్రశ్న యసమంజసము.

"ప్రోక్తాదయశ్చ తద్ధితాః" అనియు నాక్షేపాన్తర వార్తికము. ప్రోక్తాద్యర్థములందు విహితములగు తద్ధిత ప్రత్యయములును ఉపపత్తి రహిత ములు గావలెను.

"పాణిని ప్రోక్తము పాణినీయము, ఆపిశలిప్రోక్త మాపిశలము, కాశకృత్స్నిప్రోక్తము కాశకృత్స్నము" అని యీ విధముగా వ్యవహారము కలదు. పాణినిచే ప్రవచింపబడినవి శబ్దములుకావు. సూత్రములు గదా!

వార్తికకారులు, 'భవేచతద్ధితః' అనువార్తికముచేత వ్యాకరణ శబ్దా ర్థము శబ్దమైన, భవార్థమున, తద్ధిత ప్రత్యయమున కనుపపత్తి నాక్షేపించి,మరల "ప్రోక్తాదయశ్చతద్ధితాః"అని ప్రోక్తార్థక తద్ధితముల కనుపపత్తిని రెండవ యాక్షే పముగా సూచించెను."ప్రోక్తాద్యర్థకతద్ధిత ప్రత్యయము లనుపపన్నములగునని చెప్పుటచేతనే, ఆదిపదమువలన భవార్థకతద్ధితా నుపపత్తియు శంకింపబడినట్లే గదా!

రెండాక్షేపములుగా జెప్పుట అభిహితాభిధానమగునే యనిన, భవార్థక తద్ధితా నుపపత్తిమొదట గమనింపబడుటచే వార్తికాచార్యులు ముందు ఆయనుప పత్తిని శంకించెను. పిమ్మట ప్రోక్తాద్యర్థకతద్ధితలయనుపపత్తి గూడ తట్టుటచే నదియు శంకింపబడినది. ఆచార్యులు సూత్రముల నొకసారి రచించి, మరల వానిని రద్దుపరుపరుగదా! "నహేదానీ మాచార్యాః సూత్రాణి కృత్వా నివర్త

యన్తి" పాణిని సూత్రములు సామాన్య సూత్రములు, విశేష సూత్రములు అని యున్నట్లే వార్తికములును, సామాన్యములు, విశేషములుగానుండవచ్చును. ఇట్లు రచించుట వ్యుత్పాదనార్థమేగనుక అభిహితాభిధానముదోషముగాదు.

వ్యాకరణపదార్థము శబ్దమనిన, ఆపదమునందలి ల్యుట్ప్రత్యయమున కర్థము కుదురుపడదు. అది కరణార్థకము. శబ్దము వ్యాకరణమునకు కరణము గాదు అని మీమొదటి యాక్షేపము. కాని యది దోషముకాదు. ల్యుట్ప్రత్యయ మొక కరణార్థముననే విధింపబడి యుండలేదు. 'ప్రస్కందనమ్', 'ప్రపతనమ్' మున్నగు పదములం దది అపాదానాదితర కారకములందును విహితమై యున్నది. "కృత్యల్యుటో బహులమ్" (3-3.113) అను సూత్రము ఇతర కారకములందు ఆ ప్రత్యయ విధానమునకు ప్రమాణము. కావున'వ్యాకరణమ్' ను పదమునందలి కర్మకారకమునందది విధింపబడినదనవచ్చును. అపుడు వ్యాకరింప బడునది గనుక శబ్దము వ్యాకరణము అనుటలోఅనుపపత్తియేదియులేదు.

లేదా, కరణార్థముననే ల్యుట్ప్రత్యయము వచ్చినదనినను అనవగును. శబ్దములచేతను శబ్దములు వ్యాకృతములగును. ఎట్లందురా? గంగడోలు మున్నగునవిగల వ్యక్తిని జూచి, 'ఇది గోవు' అందుము. దానివలన నది గోవే గాని, గుఱ్ఱముకాదు, గాడిదయు కాదు అను నిశ్చయము కలిగి సందేహము లన్నియు తొలగుచున్నవి. 'ఇట్టివి గోవులు' అని సదృశవ్యక్తి సంగ్రహమును గలుగుచున్నది. వ్యాకృతి అనగా నిదియే. అనగా, విపరీతనివృత్తియు సదృశసంగ్రహముననే వ్యాకృతి యందురు. శబ్దముచే శబ్దము వ్యాకరింపబడుట యనగా నిదియే.

అట్లైనను, భవార్థప్రోక్తాద్యర్థ తద్ధితానుపపత్తి పరిహృతము కాలేదు. అందువలన లక్ష్యలక్షణములు రెండును గలసి వ్యాకరణమగునని చెప్పుదుమని వార్తికకారుడు, **"లక్ష్యలక్షణే వ్యాకరణమ్"**అను సిద్ధాన్తవార్తికము నవతరింపజేసెను. లక్ష్యమననేమి? లక్షణమననేమి?శబ్దము లక్ష్యము. సూత్రము లక్షణము.

అట్లయినను ఈ దోషము తప్పదు. లక్ష్యలక్షణముల సముదాయమును బోధించు వ్యాకరణశబ్దము, లక్షణమాత్రార్థకమగు సూత్రమను నేవయవము నందు వర్తింపదు. సూత్రములను మాత్రము పఠించువానిని గూడ వైయా కరణుడనుట సమ్మతమాయె. అది యెట్లు పొసగును? అనిన, ఇది దోషము కాదు. సముదాయబోధక శబ్దములు అవయవమునుగూడ బోధించుట కొన్ని చోట్ల గలదు. 'పంచాల' శబ్దమును జూడుడు. అది పూర్వోత్తర పంచాలదేశము లను రెండింటిని చెప్పునది. అయినను, ఒక్క తూర్పుభాగమును బోధింప దలచి నపుడు, 'పూర్వ పంచాలము' అనియు ఉత్తర పంచాలదేశభాగమును బోధింప

దలచినపుడు, 'ఉత్తర పంచాలము' అనియు వ్యవహరించుచున్నారు.

ఇట్లే ఘృతతైలముల కొలదిభాగము ఔషధ సంస్కృతము. దానిని మాత్రమే భుజించినవానిని గూడ ఘృతమును భుజించినవాడు, తైలమును భుజించినవాడు అనుచున్నారు. సముదాయ బోధకశబ్దము అవయవమును మాత్రము బోధించుట ఇక్కడ సుస్పష్టము. 'శుక్లః పటః' ఈ వస్త్రము తెల్లనిది. లేదా 'నీలః' నీలిరంగుది. లేదా 'కపిలః' గోరోజనపురంగుది. లేదా 'కృష్ణః' నల్లనిది, అందురు. పటైకదేశ మాయారంగులు లేనిదయినపుడు అట్టి వ్యవహారము గలదు. వనైకదేశము పుష్పించినను వనము పుష్పించినదందురు. ఇటులనే సముదాయ బోధకమైనను వ్యాకరణశబ్దము తదవయవములగు సూత్రములను గూడ బోధింపవచ్చును.

లేదా- 'వ్యాకరణమనగా సూత్రము' అనియే యనుడు. అటులనిన 'వ్యాకరణముయొక్క సూత్రము' అనుట కుదరదంటిరే యందురేమో? దానికేమి లెండు. వ్యపదేశివద్భావముచే దానిని గుదర్చవచ్చును.

వస్తువొక్కటియే యయినను, శబ్దమును అర్థమును వేరువేరుగా దీసికొని, ఆ వస్తువునకు భేదమును వ్యవహరించుట వ్యపదేశివద్భావమందురు. "రాహువుయొక్క శిరస్సు" అని వ్యవహారము కలదు. ఇట రాహువును, శిరస్సును వేరుగా లేవు. రాహుగ్రహము శిరోమాత్రమే. అయినను, అనేకావస్థలయందలి శిరస్సు రాహుశబ్దమున కర్థమనియు, అందొక యవస్థయందలి శిరస్సు మాత్రమే శిరశ్శబ్దమున కర్థమనియు జెప్పి, అట్టి ఆ రాహువునకి శిరస్సు అవయవమనియు భేదమును గల్పించి ఆ వ్యవహారమున కుపపత్తి గల్పింపబడినది. ఆ విధముగనే సూత్రమనగా అష్టాధ్యాయీసముదాయ రూపము. వ్యాకరణమనగా, వ్యాకృతిక్రియకు సాధనమగు దాని అవయవము. వ్యాకృతి క్రియాకరణమగు దానికి సంబంధించిన అష్టాధ్యాయిసూత్రమనబడును. కావున నెట్టి యనుపపత్తియు లేదు.

సరి. వ్యాకరణమనగా సూత్రము. కాని సూత్రమాత్రమువలన శబ్దప్రతిపత్తి కలుగలేదు. వ్యాఖ్యానముగూడ అందుల కావశ్యకము అని యాక్షేపమును సూచించితిమిగదా యనిన, ఆ సూత్రమే విగ్రహింపబడిన, వ్యాఖ్యానమగును గాన దోషములేదని పరిహరింపబడినది గదా? అనిన, విగ్రహమాత్రము = 'వృద్ధిః', 'ఆత్', 'ఐచ్' అనునది వ్యాఖ్యానము గాదు. ఉదాహరణ ప్రత్యుదాహరణములన్నియు గలసి వ్యాఖ్యానమగునని ఆ పరిహారమునకు బాధకమును సూచించితిమే? ఆ విధమగు వ్యాఖ్యానము మందబుద్ధియగు వానికి ఆవశ్యకముగావచ్చును. పదచ్ఛేదాదులచే సూత్రముల యర్థమే వ్యక్తపరుపబడును. కాగా శబ్దప్రతిపత్తి కలుగునది సూత్రములవలననే. సూత్రముల నుల్లంఘించి స్వకపోల కల్పనగా వచింపబడిన యర్థము నెవ్వరును గ్రహింపరు. వృత్తియందును వార్త్తికములందును జెప్పబడు నర్థము సూత్రాను

గృహీతము కావలెనని చెప్పుదురు. అందువలన సూత్రమే శబ్దప్రతిపత్తి కారణము. కాగా వ్యాకరణమనగా అష్టాధ్యాయీ సూత్రరూపమని సిద్ధాన్తము.

## వర్ణోపదేశ ప్రయోజన నిరూపణము

లోకమున, అ, ఆ, ఇ, ఈ, ఇత్యాదిగా మాతృకాపాఠము వర్ణములకు ప్రసిద్ధమయియున్నది. అయ్యది యున్నను, వర్ణజ్ఞానమునకై మరల "అ ఇ ఉ ణ్" ఇత్యాది వర్ణోపదేశ మెందులకు? వర్ణోపదేశము వలన సాధుశబ్దాన్వాఖ్యాన మేమియు జేయబడలేదుగదా యనిన, వృత్తిసమవాయార్థము వర్ణోపదేశము. "వృత్తి సమవాయార్థ ఉపదేశః" అని వార్తికము.

వృత్తిసమవాయార్థమనగానేమి? వృత్తికొరకైన సమవాయము అనిగాని, వృత్త్యర్థమగు సమవాయమనిగాని, వృత్తి ప్రయోజనమగు సమవాయముగాని వృత్తి సమవాయము. అది ప్రయోజనముగాగలదియని యర్థము.

వృత్తియననేమి? వృత్తియనగా శాస్త్రప్రవృత్తి.

సమవాయమననేమి? అ, ఇ, ఉ, మున్నగు వర్ణముల నొక క్రమములో నుంచుట. ఉపదేశమనగానేమి? ఉపదేశమన నుచ్చారణము. ఉపదేశపదమున కుచ్చారణ మర్థమనుట కేమి ప్రమాణము? ఆ పదమునందలి 'దిశ' ధాతు ఉచ్చారణవాచి. వర్ణముల నుచ్చరించి 'ఈ వర్ణము లుపదిష్టములు' అని యనుచున్నారు. కావున నుపదేశమన నుచ్చారణము. శాస్త్రప్రవృత్తికి, క్రమ విశిష్ట వర్ణోచ్చారణ ముపయుక్తమగును. అది అక్షర సమామ్నాయోపదేశము వలన గలుగును. 'అక్' 'ఇక్' 'ఉక్'- మున్నగు సంజ్ఞల ద్వారా, లఘూపాయముచే శాస్త్రము ప్రవర్తించుట మొదటి ప్రయోజనము. ఒక క్రమములో వర్ణముల నుచ్చరించుటవలన 'ఇగ్యణస్సంప్రసారణమ్' (1-1-45) మున్నగు స్థలములందు యథాసంఖ్యశాస్త్రము, వర్ణసన్నివేశమాత్రము నాశ్రయించి వర్తించును. ఇది 'వృత్త్యర్థమగు సమవాయము వృత్తి సమవాయము' అను విగ్రహమునకు ప్రయోజనము.

మరియు నీ సమవాయము పరంపరగా శాస్త్రప్రవృత్తి కంగము. వర్ణ సమామ్నాయోపదేశమువలన ఇత్సంజ్ఞ, పిదప 'ఆదిరన్త్యేన సహేతా (1-1-71) అని ప్రత్యాహారము, తరువాత 'ఝలో పేత్యాది' శాస్త్రప్రవృత్తియు కలుగును. పరంపర యనగా నిది. సమవాయ మీవిధముగ వృత్తికి ప్రయోజకము.

"అనుబంధకరణార్థశ్చ" అని ప్రయోజనాంతర వార్తికము. అనుబంధ కరణముగూడ వర్ణోపదేశ ప్రయోజనము. వర్ణోపదేశము లేనియెడల 'అఇఉ' ఇత్యాది సముదాయములకు 'ణ్' మున్నగు ఇత్సంజ్ఞకములను జేర్చుట శక్యము కాదు. కాగా వర్ణోపదేశమునకు, వృత్తిసమవాయము, అనుబంధ కరణమును ప్రయోజనములు. ప్రత్యాహారనిష్పత్తి వానికి ప్రయోజనములు. ప్రత్యాహారములు లఘువుగా శాస్త్రము ప్రవర్తించుటకు సాధనములు,

మహేశ్వరుడు, పాణినికి, అ, ఇ, ఉ—ఋ, ఌ—ఏ, ఓ—ఐ, ఔ—హ, య, వ, ర—ల—ఞ, మ, ఙ, ణ,న-ఝ, భ-ఘ, ఢ,ధ-జ,బ, గ, డ, ద-ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త—క, ప—శ, ష, స—హ—అను నానుపూర్విగల శ్రుతిని, ణ్, ల్, మున్నగు ననుబంధములను జేర్చి, వృత్తిసమవాయార్థమై= (లఘూపాయమున వ్యాకరణశాస్త్రము నాతడు రచించుటకనువుగా) ఢక్కానాదముచే నభివ్యక్త పరచెను. 'అ ఇ ఉ ణ్' ఇత్యాది సూత్రములు మహేశ్వర ప్రసాదముగా పాణినికి లబ్ధములు. పాణిని రచించిన వ్యాకరణశాస్త్రమున కారంభసూత్రము "వృద్ధి రాదైచ్"(1-1-1) అనునదియే. "మాంగలిక ఆచార్యః మహతః శాస్త్రౌఘస్య మంగళార్థం వృద్ధిశబ్దమాదితః ప్రయుఙ్క్తే" అని వేరొక భాష్యకృద్వచనముచేత అక్షరసమామ్నాయము పాణిని శాస్త్రాన్తర్గతముగాదని వ్యక్తమగుచున్నది. ప్రకృత ప్రఘట్టకమున నెచ్చటను, వర్ణోపదేశము మహేశ్వరకృతమని కంఠతః చెప్పబడలేదు.

**"ఇష్టబుద్ధ్యర్థశ్చ"**అని ప్రయోజనాన్తర వార్తికము. దోషరహితములగు వర్ణములే ప్రయోగార్హములని బోధించుటకును వర్ణోపదేశ మావశ్యకము. వర్ణములనుపదేశించిన, ఉపదిష్టములగు నీ వర్ణములవంటి నిర్దోషవర్ణములే ప్రయోజ్యములని తెలియనగును. లోకమునందలి మాతృకా పాఠమువలన, వర్ణజ్ఞానము కలిగినను, ఇష్టవర్ణబోధనమునకై వ్యాకరణాధ్యేతల కొరకు వర్ణోపదేశము ఆవశ్యకము. మాతృకాపాఠముతో వారికి పని లేదు.

**"ఇష్టబుద్ధ్యర్థశ్చేతి చేదుదాత్తానుదాత్తస్వరితానునాసికదీర్ఘప్లుతానామ ప్యుపదేశః"**అని యాక్షేపవార్తికము. వార్తికోక్తములగు ఉదాత్తాదిగుణములు గల వర్ణములు గూడ ఇష్టములేగాన వాని నుపదేశింపకుండుట న్యూనతయగును. వానిని గూడ నుపదేశించుట అవసరప్రాప్తము అని యాక్షేపతాత్పర్యము.

**"ఆకృత్యుపదేశాత్సిద్ధమ్"** అని సమాధాన వార్తికము. అక్షరసమామ్నాయమునందు, అవర్ణాదుల ఆకృతి మాత్రమే ఉపదేశింపబడినది. ఆకృతి యనగా జాతి. జాతి, వ్యక్తిలేనిచో నుచ్చరింప నసాధ్యమయినది. కనుక, నాంతరీయకముగ (తప్పక వ్యక్తి యుచ్చరింపబడినను) నది వివక్షితముగాదు. జాత్యుపదేశమే ప్రమాణము. ఉపదేశింపబడిన ఆ అవర్ణాకృతి, అవర్ణకులము నంతను గ్రహించును అట్లే, ఇవర్ణోవర్ణాకృతులును వాని వాని కులములను గ్రహించును. కావున నుదాత్తాదులను వేరుగ నుపదేశింపబనిలేదు.

**"ఆకృత్యుపదేశాత్సిద్ధమితి చేత్సంవృతాదీనాం ప్రతిషేధః"** అని దానిపైన నాక్షేపవార్తికము. సంవృతము, కలము, ధ్మాతము, ఏణీకృతము, అంబూకృతము, అర్ధకము, గ్రస్తము, నిరస్తము, ప్రగీతము, ఉపగీతము, క్ష్విణ్ణము, రోమశము—ఇవి సంవృతాదులని యొక పాఠము. వేరొక పాఠము నిట్లు కలదు: "గ్రస్తం నిరస్తమవలంబితం నిర్హతమంబూకృతం ధ్మాతమథో వికంపితమ్। సందష్టమేణీకృతమర్ధకం ద్రుతం వికీర్ణమేతాః స్వరదోషభావనాః॥" అనునది. ఇవి స్వరవర్ణముల దోషజాతులు. ఇవి అశక్తి ప్రమాదములవలన

గలుగును. వ్యంజనదోషములును వేరుగా నుండును. ఈ దోషములు గలవర్ణము లకుగూడ ఆకృతి గ్రహణమువలన గ్రహణము ప్రాప్తించుచున్నది. అది అని ష్టముగాన దానివి నిషేధింపవలెను.

(1) వివృతములుగానుచ్చరింపదగిన దీర్ఘాదులను 'సంవృతములు'గాబలుకుట దోషము.

(2) ఒక స్థానమునబుట్టిన వర్ణమును వేరొక స్థానమునందు బుట్టిన ట్లుచ్చరించుట 'కల'యనునది.

(3) హ్రస్వమును దీర్ఘమువలె నుచ్చరించిన నది 'ధ్మాత'మనబడుదోషము.

(4) ఇది ఓ కారమా? ఔ కారమా? అని సందేహింపదగియుండి నది 'ఏణీకృతము'.

(5) వ్యక్తమయినదైనను, అస్ఫుటముగ నోటిలో నమలినట్లుచ్చరింప బడినది 'అంబూకృతము'.

(6) దీర్ఘమైనను హ్రస్వమువలె పలుకబడినది 'అర్ధకము'

(7) నాలుక మొదట పట్టుకొనినట్లు పలుకబడినది 'గ్రస్తము'.

(8) నిష్ఠురముగా నుచ్చరింపబడినది 'నిరస్తము'.

(9) 'ప్రగీత'మనగా సామవలె పాటపాడినట్లుచ్చరింపబడినది.

(10) 'ఉపగీత'మనగా, దగ్గరనున్న వర్ణము యొక్క గీతిచే ననురక్తమైనది.

(11) 'క్ష్విణ్ణ'మనగా వణకుతో నుచ్చరింపబడినది.

(12) 'రోమశ'మనగా గంభీరము.

(13) వర్ణాంతరముతో సంభిన్నముకానిది 'అవిలంబితము'

(14) 'నిర్హతము' అనగా రూక్షమైనది.

(15) 'సందష్టము' అనగా పెంచబడినది వలెనుండునది.

(16) 'వికీర్ణము' అనగా వర్ణాంతరమునందు బ్రసరించినది.

ఇట్టి వర్ణములకు గ్రహణమును ప్రతిషేధించుట కర్తవ్యమని ఆక్షేప్త తాత్పర్యము.

"గర్గాదిబిదాదిపాఠాత్సంవృతాదీనాంనివృత్తిః" అని సమాధానము. ఇది దోషముకాదు. 'గర్గాదిగణము, బిదాదిగణము' అని కొన్ని గణములు కలవు. అందు 'గర్గ', 'బిద'మున్నగు ప్రాతిపదికములను పాణిని తన నోటనే పఠించియుండెను. ఆతడపుడు సంవృతాది దోషరహితములయిన వర్ణములనే ఉచ్చరించును గదా! ఆ పాఠమువలన, "గర్గబిద మున్నగు శబ్దములందలి వర్ణములెట్లు నిర్దోషములో అట్టి వర్ణములే యంతటను సాధువులు" అని బోధింప బడును గాన సంవృతాదులను బ్రతిషేధింపనక్కరలేదు అని సమాధాన తాత్పర్యము.

కాని దీనిపైన నొక యాక్షేపమును గలదు. గర్గాదిబిదాదిపాఠమునకు

ప్రయోజనము, గర్గాది ప్రకృతికములగు యఞాద్యన్తములు సాధువులగునని బోధించుటయే. ఆ పాఠము ప్రత్యయ విధానార్థమైనను ప్రసంగవశమున సముదాయసాధుత్వబోధనార్థమును నగును. అంతియగాని ఆ పాఠము ఆపదములందలి వర్ణముల కలాది దోషనివృత్తి నెట్లు బోధింపగలదు ? కాన తన్నివృత్తియు యత్నాన్తరసాధ్యమేయగుననిన-శాస్త్రాన్తమున అవర్ణమునకు, కలాది దోష రహితమగు అష్టాదశభేదభిన్నమయిన, ప్రత్యాపత్తిని జెప్పెదముగాన నిది దోషముగాదు. అష్టాధ్యాయి చివరి సూత్రము "అ అ"(8-4-68) అనునది. దానిచే వివృతమగు నకారమునుద్దేశించి, సంవృతాకారము విధింపబడినది. దానికే ప్రత్యాపత్తియని పేరు. ఆ ప్రత్యాపత్తిని అకారమునకు జెప్పినట్లే సర్వ వర్ణములకును జెప్పెదము. కాగా, ఆ ప్రత్యాపత్తివలన, కలాది దోషనివృత్తి కలుగవచ్చును.

అపుడా ప్రత్యాపత్తినపూర్వముగ జెప్పుటయే దోషము కాదా ? అని శంకించి,సమాధానముగ"**లింగార్థాతు ప్రత్యాపత్తిః**"అని యొక సమాధానవార్తిక మవతరించినది. ఈ యాహ్నికముననిది చివరి వార్తికము. ప్రత్యాపత్తివచనము కలాది లింగముల నివృత్తికొరకును నగునుగాన గౌరవదోషము ప్రసక్తము గాదు. ఆకృతి నిర్దేశమువలన కలిగిన దోషమును పరిహరించుటకేగాక లింగములను దోషములను తొలగించుటయు దానికి ప్రయోజనము కలదు.

'ఏధ' ధాతువునందకారమనుబంధము 'శీఙ్' ధాతువునందు ఙకారము. వానికి ఇత్సంజ్ఞా లోపములు విహితములు. అందువలన మొదటిది అనుదాత్తేత్తు రెండవది ఙిత్తు. "అనుదాత్తఙిత ఆత్మనేపదమ్"(1-3-12) అనిఆత్మనేపద ప్రత్యయములు వానికి పరముయి వచ్చును. ఇపుడు ఆ అనుబంధ వర్ణములను దీసివేసి, వానికి బదులుగా, 'కల' అనుదోషమును జేర్చి 'కలాదాత్మనేపదమ్' అని సూత్రమును రచింపవచ్చును. ఆ 'కల' అను దోషమునకు ఈ ప్రత్యాపత్తివచనమువలనదరువాత నివృత్తి కలుగును.

స్వరితేత్తులును ఞిత్తులునునగు ధాతువులందు, ఇద్వర్ణములకు బదులుగా 'ధ్మాత'మను లింగమును జేర్చి "ధ్మాతాత్కర్త్రభిప్రాయే క్రియాఫలే" అని సూత్రమును రచింపవచ్చును.

ఇట్లే, టిత్తులును, కిత్తులును, మిత్తులునగు నాగమములందు, టకార కకారములకు బదులుగా, కలధ్మాతములను దోషములను దగిలించి, 'ఆద్యన్తౌ కలధ్మాతౌ' అనియు, మిత్తులలో మకారమునకు బదులుగానే 'గ్రస్తమను దోషమునో'దగిలించి, 'గ్రస్తోచోన్త్యాత్పరః' అని యనవచ్చును.

ధాతువులందు 'ఞి, టు, డు' మున్నగు నిద్వర్ణములను దీసివైచి, అర్ధకాదులను జేర్చి, "అర్ధకాత్ క్త్రిః" "నిరస్తాదథుచ్" అని యీ మాదిరిగా సూత్రముల మార్చవచ్చును. ఈప్రక్రియవలన, వందలకొలది ఇత్సంజ్ఞవర్ణముల నుచ్చరించుట, వానికిత్సంజ్ఞను లోపమును విధించుట, మున్నగు వానితో బనియుండదు. ఇక నిద్వర్ణములే యుండవుగాన "ఆదిరన్త్యేన సహేతా"

అను సూత్రమునకు బదులు, 'అదిః క్వాలైన్సహ' అని పఠింపవచ్చును. 'అణ్, అక్, అచ్'-ఇత్యాది ప్రత్యాహారములను, 'అఉ' ప్రత్యాహారము, 'అఌ' ప్రత్యాహారము, 'అఔ' ప్రత్యాహారముగా మార్పవచ్చును. ఆయా పదముల యను వృత్తి కొరకు స్వరితత్వమను దోషము నాశ్రయించినట్లే యీ దోషముల నాశ్రయించినను ప్రత్యాపత్తివలననవి తొలగును. అనుబంధ శతములక్కరలేదు. కనుక లాఘవము. ఈలాఘవ దృష్టిలో ప్రత్యాపత్తి వచన గౌరవము పరిగణనీయముకాదు. కాగా, ఆకృతి నిర్దేశము సమర్థనీయమే.

ఈ ప్రకారముగా నంతయు సిద్ధించుననుకొనుడు. కాని యిదంతయు అపాణినీయమగును. ఒక దోషమును బరిహరించుటకు వ్యాఖ్యాన సాపేక్షము లగు మార్గాన్తరములనవలంబించి శాస్త్రమునంతను మార్పుచేయుట, తేలుకుట్టు నను భయముతో, పరుగెత్తి పామునోటంబడుట వంటిది యగును.

పోనిమ్ము. యథాస్థితముగనే యుంచనిమ్ము.

ఆకృతి నిర్దేశమయిన సంవృతాదులను నిషేధింపవలసియుండునని యాక్షేపించితిరిగదా ? గర్గాదిబిదాదిపాఠమువలననవి నివర్తించునని చెప్పి ఆ యాక్షేపమును బరిహరించితిమి.

ఆ పాఠములకు సముదాయ సాధుత్వ బోధనము ప్రయోజనము వేరొకటి కలదంటివి గదా ? అవును. అదియు ప్రయోజనము కావచ్చును. గర్గాది శబ్దములందలి వర్ణములవలె నిర్దోషములగు వర్ణములే ప్రయోజ్యములని బోధించుటయు ప్రయోజనమే.

ఒక యత్నముచే రెండు ప్రయోజనము లెట్లు లభించును ? లభించును. ఒక క్రియవలననే రెండుపనులు సమకూరుటయు గలదు. "ఏకా క్రియాద్వ్యర్థకరీ బభూవ"అందురు."ఆమ్రములును సిక్తములగును పితరులును ప్రీణితులగుదురు". ("ఆమ్రాశ్చసిక్తాః పితరశ్చప్రీణితాః") మామిడి గున్నల పాదులలో తర్పణము లను జేయుట యను నొక క్రియయే ఆ మొక్కలను తడుపుట, పితరులకు ప్రీతిని గలుగజేయుట, అను రెండు ప్రయోజనములను సిద్ధింపజేసినది.

అటులనే ద్విష్ఠములగు వాక్యములును ప్రయోగములందు కలవు. ద్విష్ఠములనగాఅర్థద్వయ బోధకములు. చూడుడు ఏది ? ఏ రంగుది పరుగెత్తుచున్నది? అను తాత్పర్యముతో ప్రశ్నించిన ప్రశ్నకు "శ్వేతోధావతి"- అను వాక్యమొక్కటియే సమాధానము. ఏది ? అను ప్రశ్నకు 'శ్వా' అని పదచ్ఛేదముచే సమాధానము. ఏ రంగు గలది? యను ప్రశ్నకు 'శ్వేతః' అను సమగ్ర పదముల సమాధానము. ఏ దేశమునకు బోవువాడు? అని యొక ప్రశ్న. సమర్థుడెవ్వడు? అని వేరొక ప్రశ్న. రెండు ప్రశ్నలకును సమాధానముగా "అలంబుసానాం యాతా' అను వాక్యము వ్యవహారమునకలదు. అందు మొదటి ప్రశ్నకు 'అలంబుస'దేశమునకు బోవు వాడని; రెండవదానికి (బుసానాం = పలాలవర్ణానామ్)ఎండు గడ్డి దంగులను సంపాదించినవాడు సమర్థుడు.(అలమ్ = సమర్థుడు) అను నర్థమునను ఆ వాక్యమే సమాధానము.

లేదా, సంవృతాది దోషయుక్త వర్ణములను నిషేధింపవలసియుండునని యాపాదించిన వానిని, ఈ సంవృతాదిదోషము లెందు వినబడవలసివచ్చునయ్యా? అని అడుగవలసియున్నది.

ఆగమములందందురా? అవి శుద్ధములైనవే పఠింపబడియున్నవిగదా. వికారములందందురా? అవియు శుద్ధములే పఠింపబడినవాయె. ప్రత్యయములందనిన నవియు నట్టివియే.

ఇక ధాతువులును, ప్రాతిపదికములును దోషరహితవర్ణసహితములే పఠింపబడియున్నవి.

ఇక కార్యవిధాయక శాస్త్రములందెచ్చటను గ్రహింపబడియుండని డిత్థ' మున్నగు అగ్రహణ ప్రాతిపదికములందు, కలాది దోషయుక్త వర్ణములు వినబడవలసివచ్చునందు రేని అవియు, ఉణాది సూత్ర నిష్పన్నములై శిష్ట ప్రయుక్తములు గానున్నందున శుద్ధములే,

ఇక నట్టివిగాని ప్రాతిపదికములేవేని యున్న, వానికిగూడ సందేహ నివృత్తికొరకు అనగా 'శశ' అనుదానిని 'షష' అనియు, 'పలాశ' అనుదానిని 'పలాష' అనియు, 'మంచక' అనుదానిని 'మంజక' అనియు నిట్లుచ్చరింప కుండుటకై - "ఙ్యాప్ ప్రాతిపదికాత్" (4-1-1) ఇత్యాదిసూత్రములందు అనువాద రూపముగు గ్రహణము కర్తవ్యము.

కాగా, వర్ణోపదేశమునకు, వృత్తి సమవాయమును, అనుబంధకరణమును అను నీ రెండే ప్రయోజనములు.

పస్పశాహ్నిక వివర్తము ముగిసినది.

# ప్రత్యాహారాహ్నికము

## ॥అఇఉణ్॥

**"అకారస్య వివృతోపదేశ ఆకారగ్రహణార్థః"** అని యీ సూత్రమునందలి మొదటి వార్తికము.

అకారము, ఆకారమును సవర్ణగ్రహణముచే గ్రహించుటకై యీ సూత్రమునందకారము వివృతగుణము కలదిగానుపదేశింపబడవలెను.

అకారమాకారమునేల గ్రహింపదు? వికారభేదమువలన. అనగా ఆకారము వివృతముగదా, హ్రస్వమగు అకారము సంవృతగుణము గలది. ఇట్లాభ్యన్తర ప్రయత్న భేదమువలన అకార-ఆకారములకు సవర్ణ సంజ్ఞ లేనిచో గ్రాహక సూత్రము ప్రవర్తింపదు.

అది ప్రవర్తింపకుండుటకు వికారభేదము మాత్రమే కారణమననేల? కాలభేదముగూడకలదు గదా. ఏకమాత్రకాలము హ్రస్వము. ద్విమాత్రికము దీర్ఘము. ఇట్లు కాలభేదమును కలదిగదా అనిన, సత్యమే. కాని "తుల్యాస్య ప్రయత్నంసవర్ణమ్" (1-1.9) అను సూత్రమునందలి 'ఆస్య' అను పదము, ఆస్యమునందలి స్థానప్రయత్నము లే వర్ణములకు సమానములో, అవియే సవర్ణములగునని బోధించును. ఆ విషయ మాసూత్రమును విచారించిన ప్రసంగమున వివరింపబడును. ఓష్ఠములు మొదలు కాకలము వరకును నుండు భాగమాస్యము. అందలి స్థానములు కంఠతాల్వాదులు. అచట ప్రయత్నములు- స్పృష్టత, ఈషత్ స్పృష్టత, వివృతత, సంవృతత-అనువవి. కాలము ఆస్యము నందలిది గాదు. దానికి బయటది. అందుచే కాలభేదమువలన భిన్నములగు వర్ణములకు గ్రహణము కలుగును. కానీ ఆభ్యన్తరప్రయత్న భేదభిన్నములకు కలుగదు. కావున అకారము వివృతమని చెప్పవలెను.

ఇటనొక ప్రశ్న కలుగుచున్నది. 'అఇఉణ్' "సూత్రమున సూత్రకారుడు అకారమును వివృతముగానుపదేశించెను. కాని అకారము ప్రత్యక్షముగా శ్రుతమైనను అందలి వివృతత్వాదులు శ్రోత్రేంద్రియ గ్రాహ్యములు కావు గాన, వార్తిక కర్త. వివృతగుణోపదేశమునకు, ప్రయోజనము ఆకారగ్రహణమని వ్యాఖ్యానించెను" అని గ్రహింపవలెనా? లేక, "సూత్రమున సంవృతోపదేశమే చేయబడినది. కాని ఆకారగ్రహణము కొరకు వివృతోపదేశము కర్తవ్యము" అని వార్తిక తాత్పర్యమునుగా గ్రహింపవలెనా? అని.

దీనికి సమాధానము-వివృతమే ఉపదేశింపబడినది. దానికి, ప్రయోజనా వ్యాఖ్యానమే వార్తిక తాత్పర్యవిషయము- అని.

అది యెట్లు తెలియుననిన-

శాస్త్రాన్తమున, "అ అ" (8-4 68) అను సూత్రముచే వివృతాకారము నకు సంవృతము విధింపబడినది దానివలన అకారము వివృతమని తెలియును. అక్షరసమామ్నాయికాకారము సంవృతమే అయినచో, సంవృతమునకు సంవృత విధానము వ్యర్థమగును. దీనిని ప్రత్యాపత్తి అందురు. ప్రత్యాపత్తి అనగా స్వరూపమునుండి ప్రచ్యుతమైన దానికి మరల పూర్వరూపము నాపాదించుట.

కావున, 'అఇఉణ్' సూత్రమునందు సూత్రకర్తచే ఉచ్చారితమయిన అకారము వివృతము. దానికి ప్రయోగదశలో సంవృతశ్రవణమునకై ప్రత్యాపత్తి ఆపాదింపబడినది. కాగా నది, వివృతోపదేశమే కృతమనుటకు జ్ఞాపకము అని తాత్పర్యము.

ఈ ప్రత్యాపత్తి వచనమునకు వేరు ప్రయోజనము కలదు గాన నిది జ్ఞాపకము కాజాలదని మరల యాక్షేపము.

ఆ ప్రయోజన మేమనిన—

"అతిఖట్వః", "అతిమాలః" ఇత్యాది ప్రయోగములందు, చివరి అకారము "గోస్త్రియోరుపసర్జనస్య" (1.2.48) అను సూత్రముచే, దీర్ఘాకార స్థానమున విధింపబడిన హ్రస్వము. అయ్యది, వివృత స్థానమున వచ్చినదగుటచే ఆంతర్యము వలన వికృతము కావలసి వచ్చుచుండ ఈ ప్రత్యాపత్తి, దానికి సంవృతను సంపాదించుటకు సార్థకముగా పైన చెప్పినట్లు జ్ఞాపకము కాజాలదు.

జ్ఞాపకమన్యథా సిద్ధముగాదు. లోకమునందుగాని, వేదమునందుగాని ఆకారము వివృతముగా లేదు. అది సంవృతమే కలదు. ఏది కలదో అదియే వచ్చును. కాన ప్రత్యాపత్తివచనము జ్ఞాపకము కావచ్చునని సమాధానము.

వివృతోపదేశమునకు, ప్రయోజన మన్వాఖ్యాతమనిన నేమి? సంవృతోపదేశము చేయబడినది. వివృత ముపదేశింపబడవలెను అని వార్తికమున కర్థమనిన నేమి? ఆ వికల్పమున నేమి విశేషము గలదు అనిన,-

విశేషమేమియు లేదు. సంవృత ముపదిష్టము, కాని వివృతముపదేశ్యము అని మీరహంభావముతో నంటిరి. అట్లు కాదు. సూత్రమున వివృతమే ఉపదిష్టము. అనగా ప్రతిజ్ఞాతము. దానికి ఆకారగ్రహణము ప్రయోజనము అని మేమంటిమి. అంతే. వార్తికమునందు 'కర్తవ్యము' అని గాని 'కృతము' అని గాని ప్రత్యాహారము చేయుటలో విశేషమేమియు లేదు.

**"తస్య వివృతోపదేశాదన్యత్రాపి వివృతోపదేశః సవర్ణగ్రహణార్థః"** అని యీ సూత్రమున రెండవవార్తికము.

'అఇఉణ్' సూత్రమునందలి అకారమును కార్యార్థము, వివృతమునుగా ప్రతిజ్ఞచేసినపుడు; ధాతు, ప్రాతిపదిక, ప్రత్యయ,నిపాతములందున్న అకారమును వివృతమని చెప్పవలసియున్నది. ఎందుకన, సవర్ణగ్రహణము కొరకే. సవర్ణగ్రహణమేల కలుగదు? అనిన ప్రయత్నభేదమువలననే. గ్రాహకము వివృతమై, గ్రాహ్యము సంవృతమైన ప్రయత్నభేదము ప్రకటమేగదా! అని వార్తికార్థము.

ప్రయత్నభేదమున్నను, అఇఉణ్ సూత్రమునందలి అకారము ధాత్వాదుల యకారమును గ్రహించునని, పాణిన్యాచార్యుని ప్రవృత్తి తెలియజేయుచున్నది గనుక అచ్చట వివృతోపదేశ మనావశ్యకమని సమాధానము. "అకః సవర్ణేదీర్ఘః" (6-1-101) అను సూత్రము, అక్కునకు సవర్ణమైన అక్కుపరమగునపుడు దీర్ఘమును విధించిన సంగ్రాహకలక్షణము. అందు 'అక్' అని కకారఘటితముగ గ్రహించుట పై విషయమునకు జ్ఞాపకము.

అదియెట్లనగా-ఆ పదమున క్, అను చిహ్నమువలన ఆ అకారము అక్షరసమామ్నాయికమని గ్రహింపవచ్చును. కాని ప్రయోగములందు దానికి పరముగానుండునదియు అక్షరసమామ్నాయికము కాజాలదు. రెండు అక్షరసమామ్నాయికము లొక్కసారిగా నుండవు గదా. అందువలన సవర్ణము కాకున్నను, అత్వజాతి కలదియగుటచే నయ్యది దీనిచే గ్రహింపబడుననవలెను. కాగా ధాత్వాధిస్థమునకు వివృతత్వ ప్రతిజ్ఞతో పని లేదని తేలుచున్నది. కాని తత్ప్రతిజ్ఞ అవసరమే.

'అకఃసవర్ణే' అను సూత్రమున అక్పదము వ్యర్థమైనగదా జ్ఞాపకమగునది. అది వ్యర్థము గాదు. దానికి ప్రయోజనాంతరము గలదు. అక్షరసమామ్నాయికాకారము దేనిని గ్రహించునో యది పరమగునపుడు దీర్ఘమును విధించి యది సార్థకమగును. ఎట్లనిన- 'ఖట్వా + అఢకమ్', 'మాలా + అఢకమ్' అనుచోట, రెండకారములును దీర్ఘములే, వివృతములే. అట దీర్ఘవిధానార్థమది సార్థకము. కావున నది జ్ఞాపకము కాజాలదు. కావ వివృతోపదేశము ధాత్వాదులందలి వానికి కర్తవ్యమే

ఒక శంక- ధాత్వాదులు పఠితములే గదా. ఆ పాఠములో వానియందలి అకారమును వివృతమునుగా గాని సంవృతముగా గాని పఠించుటలో యత్నవిశేషమక్కరలేదుగదా. వివృతముగనే పఠింపుదుడు. అంతియ కదా. 'దానిని వివృతముగా బఠింపవలెను' అనియొక యత్నసాధ్యమగు పనియగునట్లు చెప్పుదు రేల?

ఈ శంకకు సమాధానము- ధాత్వాదులు పఠింపబడినను, పఠింపబడని అగ్రహణప్రాతిపదికములును గలవు. వానిలోని అకారమును వివృతమునుగా బఠింపవలసియున్నది. అది గురుభూతమగు కార్యము. కావున ధాత్వాదులందు సంవృతముగా బఠింపబడిన అకారమునకు వివృతత్వ ప్రతిజ్ఞానమువలన నది వివృతము వలె కార్యమును బొందునని యతిదేశించినట్లగును. అందులకీ యత్నమంతయు జేయబడినది.

**"దీర్ఘప్లుతవచనే చ సంవృతనివృత్త్యర్థః"** అని ప్రయోజనాంతర వార్తికము. అకారమునకు దీర్ఘప్లుతములు విధింపబడినచోట, సంవృతస్థానమున సంవృతదీర్ఘప్లుతములు ప్రాప్తించుచున్నవి. వృక్ష + భ్యామ్ అనుచో ప్రకృత్యకారమునకు సుపిచ (7-3.102) అను సూత్రముచే దీర్ఘము విహితము. ఏహి 'దేవదత్తా౩' అను దూరాత్సంబోధనమునందు సంవృతాకార స్థానమున ప్లుతము విహితము,

వివృతత్వప్రతిజ్ఞానము లేనిచో నయ్యవి సంవృతములుగా నుచ్చరింపబడవలసి వచ్చును. తద్వారణము వివృతత్వ ప్రతిజ్ఞకు ప్రయోజనమని వార్తిక తాత్పర్యము.

లోకమునగాని, వేదమునందుగాని దీర్ఘప్లుతములు సంవృతములెచ్చటను లేవు. వివృతములే కలవు. ఏవికలవో యవియే వచ్చును. కావున నిది ప్రయోజనముకాదు.

యవలలనునాసికములు లేకున్నను, స్థానియగు ననుస్వారము తన స్థానమున వచ్చిన యవలలను, ఉ॥ సయ్ యన్తా, సవ్ వత్సరః, యల్ లోకమ్ అనురూపములలో అనునాసికములనుగా గల్పించినట్లు సంవృతమగు స్థాని సంవృతదీర్ఘ ప్లుతులను గల్పించుననిన, కాదు.

మీ దృష్టాంతోపన్యాసము విషమము.

య,వ,ల,లు సానునాసికములును, నిరనునాసికములును, ప్రసిద్ధములై యున్నవి కావున నయ్యవి యనుస్వారస్థానమునవచ్చును వానికి, కల్పన మక్కరలేదు. దీర్ఘ ప్లుతములు సంవృతములెచ్చటను లేనేలేవు. వానిని సంవృతములుగా నుచ్చరించుట యశక్యము. వివృతములే కలవు. అవియే వచ్చును. అందువలన నిట కల్పనకవకాశము లేదు.

సరి. కానిమ్ము. అట్లైనను, స్థానైక్యమును, ప్రయత్నభేదములును గల దీర్ఘప్లుతములే యేల రావలెను? ప్రయత్నసామ్యమును స్థానభేదమును గల ఈకార ఊకారములు సంవృతాకార స్థానమున నేల రారాదు. ఛందోగులలో గొందరు ఈకారోకారములకు సంవృతత్వము నంగీకరించిరి గదా యనిన,

కాదు. "స్థానేన్తరతమః"(1-1 10) అను సూత్రము, సదృశతమాదేశమే స్థానికివచ్చును అని చెప్పుచున్నది. అచట స్థానపదమునకు ప్రసంగమర్థము. ఆ సూత్రమునకు బూర్వసూత్రమగు, "షష్ఠీస్థానేయోగా" (1-1.9)అను సూత్రము నుండి 'స్థానే' అను పదమనువర్తింపవచ్చును. కావున నీ సూత్రమున మరల స్థానపదముతో బనిలేదు ఈ స్థానపదమునకు వేరొక ప్రయోజనము పాణిని హృదయమునగలదని ముందు నిరూపింపబడును. 'ఒకస్థానికి బహువిధాన్తర్యములవలన విభిన్నములగునాదేశములు ప్రసక్తములైనపుడు స్థానప్రయుక్తమగు నాంతర్యమే బలీయము'-అన నది యా ప్రయోజనము. కావున ప్రయత్నకృతాంతర్యమూలకములగు ఈకార ఊకారములు సంవృత స్థానమునరాజాలవు.

**"తత్రానువృత్తినిర్దేశే సవర్ణాగ్రహణ మనణ్త్వాత్"** అని ఒక యాక్షేప వార్తికము. అ ఇ ఉ ణ్ సూత్రమున అకారమునకు వివృతత్వ ప్రతిజ్ఞవలన సవర్ణగ్రహణము సిద్ధించినను, అనువృత్తి నిర్దేశములందలి వర్ణములు అణ్ణులు కావు గాన సవర్ణగ్రహణము ప్రాప్తించుటలేదు. "అస్యచ్వౌ" (7-4.32) "యస్యేతిచ" (6-4 148) అనునివి అనువృత్తి నిర్దేశములు. వృత్తి = శాస్త్రమునకు లక్ష్యమునందు ప్రవృత్తి దాని ననుసరించిన నిర్దేశ మనువృత్తి నిర్దేశము. అనగా ప్రత్యాహారద్వారముగా కాక సాక్షాత్తుగ లక్ష్యములను సంస్కరించు

నిర్దేశమనుట 'అస్య' 'యస్య' అనునవి యట్టివి. అచట అకారము అ ఇ ఉ ణ్ సూత్రమున నుచ్చరింపబడినదిగాదు. కావున, ఆకారమువలె నదియును అణ్ణు గాదు. 'అకః' ఇత్యాది పదములందలి అకారము, అక్షరసమామ్నాయికాకారమున కనుకరణముగా వచ్చును కాని అనువృత్తి నిర్దేశములందలివి అణ్ణులు గావని భావము.

"ఏకత్వాదకారస్యసిద్ధమ్"- అని యొక సమాధానము అనగా నెచ్చట నున్న అకారమైనను నదియొక వ్యక్తియేగాన అనువృత్తి నిర్దేశములందలి యకారము గూడ అణ్ణగునుగాన సవర్ణగ్రహణమునకు ప్రతిబంధము లేదని భావము.

కాని ఈ ఏకత్వపక్షమునందు శాస్త్రీయ కార్యవిరోధరూఢమగు దోషము కలదు. "**అనుబంధ సంకరస్తు**" అని వార్తికము. "కర్మణ్యణ్" (౩-2.1) అను సూత్రము కర్మవాచక శబ్దముపపదముగా నున్నపుడు, ధాతువునకు పరముగా 'అణ్' అను ప్రత్యయమును విధించుచున్నది. అచట ణకారమనుబంధను. అనగా నిత్సంజ్ఞకము. దానికి ప్రయోజనము "కుంభకారః" అనుచోట ధాతువునందు వృద్ధి సిద్ధించుట.

ఇట్లే, "ఆతోఽనుపసర్గేకః" (3-2.3) అను సూత్రము, తదపవాదముగ, 'గోదః' ఇత్యాదులందు 'క' అను ప్రత్యయమును విధించును. అకారము ప్రత్యయము. కకార మనుబంధము. దానికి ఫలము ధాతువునందలి అకారమునకు లోపము. ఇవుడు పై సూత్రములచే విధింపబడిన రెండకారములును నొక వ్యక్తియే అయినచో ణిత్కార్యములగు వృద్ధ్యాదులు కప్రత్యయము పరమగునపుడును, కిత్కార్యములగు లోప, గుణవృద్ధి ప్రతిషేధాదులు అణ్ ప్రత్యయము పరమగునపుడును ప్రవర్తింపవలసియుండును. ఈ విధముగ అనుబంధ కార్యసంకర మీ పక్షమున గల దోషము.

"**ఏకాజనేకాజ్గ్రహణేషుచానుపపత్తిః**" అని ఆక్షేప వార్తికాంతరము. 'ఏకాచ్' అను పదమును విగ్రహించి విధించిన కార్యముల విషయముననుу, అనేకాచ్ కార్యముల విషయముననుу ఇష్టమగు వ్యవస్థకు అనుపపత్తి కలుగును అని వార్తికార్థము.

"సావేకాచస్తృతీయాదిర్విభక్తిః" (6-1.168) అను సూత్రముచే, సప్తమీ బహువచన ప్రత్యయము పరమగునపుడు ఏకాచ్చుగా నుండు ప్రాతిపదికము కంటె బరమగు తృతీయాదివిభక్తికి ఉదాత్త స్వరము విధింపబడినది. 'వాచా' అనునది యుదాహరణము. 'వాచ్' అను ప్రాతిపదికము సుప్పరత్వమున నేకాచ్చు.

ఈ స్వరము 'కిరిణా', 'గిరిణా' అనుచో ప్రవర్తింపదు. ఇట, ప్రాతిపదిక మేకాచ్చుకాదు. కాని ఏకత్వపక్షమునందు ఇకారములు రెండును నొక్కటియే గాన నదియు నేకాచ్చేయగును. కావున నటవిభక్తి ప్రత్యయమున కుదాత్త స్వరాపత్తికలుగుచున్నది.

ఇక 'ఘటకః' అను రూపమునందు, ఘటముతో దాటుచున్నాడు, (ఘటేన తరతి) అనునర్థమున, "నౌద్వ్యచష్ఠన్" (4-4-7) అను సూత్రముచే ఠన్ అను ప్రత్యయము ప్రవర్తించినది. 'ఘట' అను ప్రాతిపదికము రెండచ్చులు గలది. కాని అందుగల రెండకారములును నొక అకారవ్యక్తియే అనునీపక్షమున నయ్యదిసిద్ధింపకపోవును. ఇదియు ననుపపత్తియే.

"ద్రవ్యవచ్చోపచారాః" అని తృతీయాక్షేపవార్తికము. అనగా వ్యవహారముగూడ ద్రవ్యములందువలెనే వర్ణముల విషయముననుజేయవలసి వచ్చును. ఘటమను ద్రవ్యముతో ననేకులొక్కసారి జలాహారణమును జేసికొనుట సాధ్యపడనట్లు అకారమను వర్ణమును గూడ ననేకులొక్కసారి యుచ్చరింపక పోవలసివచ్చును. ఇట్లు వ్యవహార విరోధము గూడ నీ యేకత్వ పక్షమున గానవచ్చుచున్నదని యాక్షేపము.

**"విషయేణ తు నానాలింగకరణాత్సిద్ధమ్"** అని మొదటి యాక్షేపమునకు సమాధాన వార్తికము.

విషయముతో నానాలింగములను జేయుట యనగా, పాణిని, అకారమును భిన్నభిన్న విషయములందనేక లింగములతో నుచ్చరించుట. అందువలన అనుబంధ కార్యసాంకర్యము ప్రసక్తముగాదు. "కర్మణ్యణ్" (3 2 1) అను సూత్రమున ణకారానుబంధరూపమగు లింగమును, "ఆతోఽనుపసర్గేకః" (3-2.3) అను సూత్రమునందు, కకారరూపలింగమును జేర్చి అకారమును వేరువేరుగ నుచ్చరించుటవలన ననుబంధ కార్యసంకరము కలుగదని తెలియబడుచున్నది. అట్లు కాకుండిన, "కర్మణి కణ్ టట్"-అని కిత్త్వ, ణిత్త్వ, ఉత్త్వములు మూడును గల అకార మొక్కదానినే యుచ్చరింపవచ్చునుగదా?

కాని యీ జ్ఞాపకము కుదురదు. 'కర్మణికణ్టట్'- అని సూత్రమును జేయవచ్చుననిన నందు మొదటి కకారమునకును, "లశక్వతద్ధితే" అను సూత్రముచేతను (1-3.8) చివరి టకారమునకు, 'హలన్త్యమ్' (1-3 3) అను సూత్రము వలనను నిత్సంజ్ఞలు సిద్ధించినను, మధ్య ణకారమున కయ్యది దుర్లభము. ఆ సంజ్ఞకు ప్రాప్తి రెండువర్ణములందే గదా? వేనియందు? ఆద్యన్తములందే. కావున పదుపందికి ముండ్లవలె, అనుబంధవర్ణముల నంతటను గూర్చి అకారము నుచ్చరించుట శక్యముగాదు. అందువలన నట్లు చేయలేదు.

ఓహో ! అట్లైన "విషయేణ తు నానాలింగకరణాత్సిద్ధమ్" అను పాఠమును మార్చి "విషయేణతు పునర్లింగకరణాత్" అని పఠించి అకారమును మరల మరల నదియే లింగమును జేర్చి, "ప్రాగ్దీవ్యతోఽణ్" (4-1.83)అని "శివాదిభ్యోఽణ్" (4-1-11 2) అనియు నిట్లు పఠించుటచేత ననుబంధకార్య సంకరములేదని వ్యాఖ్యానింపవచ్చును. అనుబంధకార్యము లన్ని అకారములకును ప్రాప్తించిన, 'శివాదిభ్యోఽఅణ్' అని పఠింపబనిలేదు. 'శివాదిభ్యః అః' అనియే పఠింపనగును.

లేదా వార్తికమునందలి మొదటి పాఠమునే గ్రహించి నానాలింగ కరణమువలననే అనుబంధ కార్యసాంకర్యమును వారింపవచ్చునని చెప్పవచ్చును.

ఇత్సంజ్ఞా సిద్ధికై నానాలింగకరణము సార్థకమగును గాన జ్ఞాపకము కాజాలదంటిరిగదా. సర్వానుబంధ సహితముగ నకారము నుచ్చరింపవలెనని తాత్పర్యముకాదు. ఎచ్చట నే లింగముతో నది యుచ్చరింపబడినదో, అట నా లింగముకలదిగనే ఉపస్థితమగును. అది లోకస్థిరమగు విషయము. ఎట్లనగా-

ఒక ప్రభువు, తన గూఢచారి నొకనిని బిలిచి, 'అబ్బా! నీవూరిలో తిరిగినపుడు ముండితముండుడవై సంచరింపుము. ఇంకొక యూరిలో జటలను ధరించి తిరుగుము. వేరొక యూర శిఖతో నుండుము' అని యాజ్ఞాపించిన నా దేవదత్తుడు, ఆయా లింగములు గలిగియే యచ్చటచ్చట నుపస్థితుడగును గాని సర్వచిహ్నములతో నుపస్థితుడు గాడు. అట్లే అకారము సర్వలింగములు గలదియైనను, అచ్చటచ్చట నాయా టిత్త్వ, కిత్త్వాది ప్రత్యేక లింగములు గలదిగనే యుపస్థితమగును. తత్ప్రయుక్తకార్యములే వానివాని ప్రకృతులకు సిద్ధించును.

ఇక "ఏకాజనేకాచ్వదములను గ్రహించిన కార్యముల విషయముస జూపబడిన యనుపపత్తియు, "**ఏకాజనేకాజ్గ్రహణేషుచావృత్తిసంఖ్యానాత్**" అను వార్తికముచే బరిహరింపబడినది. 'ఘటకః' అనుచో ద్వ్యచ్కత్వప్రయుక్తమగు ష్ఠన్ ప్రత్యయమును, అకారవ్యక్తి యొక్కటియే అయినను, దానికే పునరుచ్చారణమువలన, సంపాదింపనగును. ఇది శ్రౌతప్రక్రియలో ప్రసిద్ధము. "సప్తదశసామిధేన్యోభవన్తి" అని సామిధేనీ ఋక్కులకు, సప్తదశత్వము వికృతియాగమునందు విధింపబడినది. ఆ ఋక్కులు పదుమూడు మాత్రమే. కాని "త్రిః ప్రథమామన్వాహ। త్రిరుత్తమామ్" అనిఆవృత్తిని మొదటి దానికిని చివరి దానికిని జేసి వానిని పదునేడు చేయవచ్చునని చెప్పబడినది.

ప్రకృతమునను, ఆ ప్రక్రియచే ఘట శబ్దము ద్వ్యచ్కమగును. కావున, కార్యము సిద్ధించును. దూషణము పరిహృతమగును. కాని 'కిరిణా' 'గిరిణా' అనుచోటను, ఆవృత్తిచే ద్వ్యచ్త్వము సిద్ధించినను, ముఖ్యమగు నేకత్వ సంఖ్య తొలగదుగాన, ఏకాచ్త్వప్రయుక్తమగు నంతోదాత్తస్వరాపత్తి వారింపబడలేదే యనిన నదియు సిద్ధించును. ఎట్లందురా? లోకవ్యవహారము వలననే. లోకమున నుత్తరసంఖ్య, పూర్వసంఖ్యను బాధించుట చూచుచున్నాము. కాన, ఆవృత్తికృతద్విత్వమేకత్వమును బాధించును.

వేయిమంది ఋషులు ఒక్కటే కపిలగోవును వేయి పర్యాయములు దానముచేసి, ఆ యొక్క గోవుచేతనే వారందరును నొకొక్కరు వేయి గోదానములను జేసినవారనిపించుకొనిరి. "ఋషిసహస్రమేకాంకపిలామేకైకశః సహస్రకృత్వోదత్త్వా తయా సర్వేతే సహస్రదక్షిణాః" అని స్మార్త వ్యవహారము. ఆ ఋషులకా 'గోసహస్రసత్రమువందు, గోసహస్ర దానఫలమే లభించెను గాని ఏకగోదాన మాత్రఫలముగాదు.' "గౌణీముఖ్యావా ఉత్తరాసంఖ్యా పూర్వాం సంఖ్యాం బాధతే".

ఇక "ద్రవ్యవచ్చోపచారాః" అను తృతీయాక్షేపమునకు సమాధానము,

వీలుగాని పనిని అనేకు లొకదానితో నొక్కసారి చేయలేకపోవచ్చును. సంభవము గల పనియయినచో నట్లు చేయనగును. ఉదకాహారణ మసంభవము కాని ఆ ఘటము ననేకులు ఒక్కసారి చూడవచ్చును. తాకవచ్చును. దర్శన స్పర్శన ములు సంభవముగల పనులు. అకారము నుచ్చరించుటయను కార్యమును నట్టిదే. కాబట్టి అనేకులు దాని నొక్కసారిగా నాచరింపవచ్చును.

ఇట్లు కారమున కేకత్వము సమర్థింపబడినను, నిక న్యాయముచే అకార మునకు భేదమే సాధింపదలంచి వార్తికకారుడు **"అన్యభావ్యంతు కాలశబ్దవ్య వాయాత్"** అను వార్తికము నవతరింపజేసెను.

'కాలముతోడను, శబ్దముతోడను వ్యవధాన మగపడుచుండుటవలన అకా రమున కాన్యభావ్యమే న్యాయ్యము' అని వార్తికార్థము. అన్యభావమనియే ఆన్యభావ్యమను శబ్దమున కర్థము. 'దండ + అగ్రమ్' అనుచోట దండశబ్దాంతా కారమును, అగ్రశబ్దాద్యకారమును భిన్నములు. కాలముతో వ్యవధానమువలన. దండశబ్దమునందే ఆద్యాంత్యాకారములు, శబ్దవ్యవధానముచే భిన్నభిన్నములు. 'అ' అని కేవలాకారము నుచ్చరించినపు డచట, పైనజెప్పిన వ్యవధానము లేదు. కావున నది ఏకము. కాగా న్యాయతః అకారమున కనేకత్వమే సిద్ధము.

**"యుగపచ్చ దేశపృథక్త్వదర్శనాత్"** అని నానాత్వహేతు వార్తికము. ఒక్కసారిగా వేరువేరు ప్రదేశములం దగపడుచుండుటవలన అకారవ్యక్తి భిన్నమే యని తలంతుము. దేశములనగా 'అర్కః', 'అశ్వః', 'అర్థః' మున్నగు శబ్దములు. అకారమొక్కటి కాదు గనుకనే ఒకేసారి భిన్నశబ్దములందుపలబ్ధమగుచున్నది. దేవదత్తుడను నొకే వ్యక్తిని స్రుఘ్నమునందును, మధురలోను నొకేసారి కనుగొనుచుండుట లేదు గదా!

ఈ విధముగ పరులు సాధించిన వర్ణనానాత్వమును దూషించి తదేకత్వ వాది వార్తికకారుడు శకుని దృష్టాంతముచేతను, ఆదిత్య దృష్టాంతముచేతను తదేకత్వమును,నిత్యత్వమును స్థాపించుటకు **"శకునివత్స్యః"**, **"ఆదిత్యవత్స్యః"** అని రెండు వార్తికములను పఠించెను.

ఈ వర్ణములు శకునితుల్యములనిన, పక్షి ఆశుగామి యగుటచే, మును ముందు పంక్తికి మొదటనేయుండి ఎగిరినను, అపుడపుడే ఆ పంక్తి చివరను గనబడినట్లు, అకారముగూడ 'ద' అనుచో నగపడి వెనువెంటనే 'డ' అనుచోటను నగపడవచ్చును అని భావము.

కాని యట్లు చెప్పినచో వర్ణముల కేకత్వము సిద్ధించినను, అనిత్యత్వము ప్రాప్తమగును. శబ్దములు నిత్యములనునది గదా సిద్ధాంతము. అపుడయ్యవి అపాయము, ఉపజనము, వికారమును లేనివై కూటస్థములై, వినాశరహితములై యుండదగును. అకారము, 'ద' కారమునందు దృష్టమై మరల 'డ' అను చోట నగపడుచున్నదనిన నది కూటస్థము గాజాలదు.

పోనిండు, ఆదిత్యదృష్టాంతముచేత నేకత్వనిత్యత్వములను సాధింప వచ్చును. ఎట్లనగా- ఆదిత్యుడొక్కడే. అతడు భిన్నప్రదేశములందుండి ఒక్క

సారిగనే యందరకును నగపడుచుండునుగదా. ఆదిత్యున కేకత్వము నిర్వివాదము. అనేక దేశోపలంభమును ప్రత్యక్షసిద్ధము.

'శబ్దముల కాదిత్యదృష్టాన్తోపన్యాసమసంగతము. అనేక స్థలములందుండు ఆదిత్యుని, ఒకడే ద్రష్ట భిన్నభిన్నదేశములందు చూచుటలేదు. అకారమును భిన్నదేశములందు ఒకేవ్యక్తి కనుచున్నాడు' అని యాక్షేపమును నానాత్వవాది చేయగా దానికి ఏకత్వవాది, 'అకారమునుగూడ నట్లు కనుగొనలేదు. దానికేమి కారణమనగా శబ్దమున కుపలబ్ధి శ్రోత్రమునందే కలుగును. ఆకాశము గదా శబ్దమున కునికిపట్టు. శ్రోత్రమును నాకాశమే. కర్ణశష్కుల్యవచ్ఛిన్నమగు నాకాశమేగదా శ్రోత్రము. అచటశబ్దము పూర్వపూర్వధ్వనులవలన నభివ్యక్తమై, దానివలన సంస్కారముల పరంపర యేర్పడి, దానివలన పరిపక్వమైన, అంతిమవర్ణజ్ఞానముచే ఆ శబ్దము గ్రహింపబడును. దాని కాశ్రయమగు నాకాశ మొక్కటియే గావున, తదాశ్రితమగు శబ్దమును నేకమే' అని సమాధానమును జెప్పును.

తదుపరి నానాత్వవాది, 'ఆకాశమును నొక్కటిగాదు. దానికిని ఔపాధికమగు భేదము తప్పదు. పృథివియన్తయు నొక్కటియే యందురు. కాని 'ఇది స్రుఘ్నము', 'అది మధుర'-అనియు ననుచుందురు. ఆ వ్యవహారము ఎట్లు ఉపాధికృతమో, ఆ విధముగనే ఆకాశసంయోగి ఘటమఠాదులనుబట్టి 'ఘటాకాశము', 'మఠాకాశము' అని ఆకాశమును భిన్నభిన్నముగా వ్యవహరింతురు. కనుక ఆకాశదేశములుగూడ ననేకములే. తదాశ్రితములగు వర్ణములును అనేకములే' అని నిర్ధారించెను.

ఇంతదనుక నుపపాదించిన రీతిగా వర్ణవ్యక్తులు అనేకములే అయినను, "అస్యచ్వౌ" (7-4-32) మున్నగు అనువృత్తి నిర్దేశస్థలములందు సవర్ణాగ్రహణ రూపదోషమును వారించుటకు, వార్తికకారుడు **"ఆకృతి గ్రహణాత్సిద్ధమ్" "తద్వచ్చతపరకరణమ్", "హల్గ్రహణేషుచ", "రూపసామాన్యాద్వా"** అని నాలుగు వార్తికములను పఠించి 'అఇఉణ్' సూత్రమును ముగించెను. అందు మొదటి వార్తికమునకు, అక్షరసమామ్నాయమునను, 'అస్యచ్వౌ' ఇత్యాదులందును అంతటను ఆకృతియే నిర్దేశింపబడినది. ఉపదిష్టమైన ఆ అవర్ణాకృతి అవర్ణకులమునంతను గ్రహించును. అట్లే ఇవర్ణ ఉవర్ణ ఆకృతులును వానివాని కులములను గ్రహించును.' అని యర్థము.

ఇట్లంతటను ఆకృత్యుపదేశముచేత నతిప్రసంగము కలుగుచుండ, 'అతోభిసఐస్'(7-1-9) మున్నగుచోట్ల, తత్పరిహారార్థము అకారాదులు తపరములుగా నుచ్చరింపబడుచున్నవి.

తపరకరణమ్=వర్ణములను తపరములుగా నుచ్చరించుట. తద్వత్=ఆకృతిపక్షము మనమున గలదియే అని రెండవ వార్తికమున కర్థము. అణుదిత్సూత్రమున అణ్గ్రహణము ప్రత్యాఖ్యానము చేయబడినది, కావున అతిప్రసక్తి **తన్మూలకము గాదు.**

"హల్లులు గ్రహింపబడిన సూత్రములందును, ఆకృత్యుపదేశమువలననే ఇష్టము సిద్ధము" అని "హల్గ్రిహణేషుచ" అను వార్తికమున కర్థము. "ఝులో ఝులి" (8-2-26) అని యొక సూత్రము. 'అవాత్తామ్', 'అవాత్తమ్' 'అవాత్త' ఉదాహరణములు ఒక ఝల్వర్ణముకంటె బరమయిన సకారమునకు కింకొక ఝల్వర్ణము పరమైనపుడు లోపమువచ్చును. 'అవాత్ స్ తామ్' అనుచో నా లోపము ప్రవర్తించును. ఇట ఝల్లనగా తకారము.

అక్షర సమామ్నాయమునందు, తకారము "ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, తవ్" అను సూత్రమున నుపదేశింపబడినది. వ్యక్తిపక్షమున, అవకాశమేదియో యొక తకారవ్యక్తికే అనుకరణము కావలెను. కాగా రెండు తకారములు ఝల్లులు కానేరవు. 'అభిత్ స్ థాః' అను లక్ష్యమున నొకటి తవర్గ ప్రథమమును, రెండవది తవర్గ ద్వితీయమును గాన నట లోపము ప్రవర్తించి సార్థకమగును. 'అణుదిత్సవర్ణ స్యచాప్రత్యయః' (1-1-69) అను సూత్రముచే సవర్ణగ్రహణము, తకారమణ్ణు కాదు కావున, ప్రాప్తింపదు కావున ఆకృతిపక్షము ఝల్లుల విషయమున నవశ్యగ్రాహ్యము.

"రూపసామాన్యాద్వా" అనునది చివరి సిద్ధాన్త సమాధానవార్తికము. లోకములో "తానేవ శాటకా నాచ్ఛాదయామః యే మధురాయామ్" (మధురలో కప్పుకొను దుప్పట్లనే యిచ్చటను గప్పుకొనుచున్నాము) అనియు, "తానేవ శాలీన్ భుఞ్జ్మహే యే మగధేషు" (మగధదేశమున దినిన వరిధాన్యమునే యిట తినుచున్నాము) అనియు "తదే వేదం భవతః కార్షాపణం య న్మధురాయాం గృహీతమ్" (మధురలో నీవద్ద అప్పుతీసికొనిన ఆకార్షాపణ మిది గొనుము) అని వ్యవహరించుచున్నారు. వేరువేరు వస్తువు లయినను రూపసాదృశ్యమువలన, 'ఇవియ వియే' అను భావము కలుగును.

పాణిని, సూత్రరచనను గమనించిన నాతనికి జాతి వ్యక్తిపక్షములు రెండును సమ్మతములేయని తెలియవచ్చును. కావున ప్రత్యాహారమున 'ఆకృతి నిర్దేశము చేయబడలేదు వ్యక్తియే నిర్దిష్టము' అను పక్షమునందును, వ్యక్తుల భేదమును పట్టించుకొనక, వాని రూపసాదృశ్యమును గమనించిన, 'ఆ వర్ణమే ఇయ్యది' అను ప్రత్యభిజ్ఞ, 'ఆ దేవదత్తుడే ఈతడు' అనునట్లు కలుగుచున్నందున, వర్ణముల కభేద వ్యవహారము లోకమునందువలె శాస్త్రమునందును సంభవింపవచ్చును.

అల్పఘటమును మహాఘటమును గూడ ఘటమని వ్యవహరింతుము. 'ఇది ఘటము' ఇదియు ఘటమని ఏకాకార ప్రతీతియు మనకు కలుగుచున్నది. అట్టి ప్రతీతి వ్యవహారములకు జాతియే కారణమనసక్కరలేదు, సాదృశ్యముచే నవి యుపపన్నములని భావము. 'అఇఉణ్'

## ॥ ఋ ఌ క్ ॥

అక్షరసమామ్నాయమున ఌకారోపదేశమున కేమి ప్రయోజనము? ఇతర వర్ణముల యుపదేశమునకు బ్రయోజనము నడుగక ఌకారోప

దేశమునకు మాత్రమే ప్రయోజనము ప్రశ్నింపబడుచున్నదేమి? అకారాది వర్ణముల యుపదేశమునకు ప్రయోజనముండిన నది ఌకారోపదేశమునకును గలుగును. అందు విశేషమేమి ?

ఇది విశేషము ఌకారమునకు భాషలో, ప్రయోగము ఋవర్ణముకంటె అల్పము. ఆ స్వల్పప్రయోగమయినను 'క్లృప్' ధాతువునందలి ఌకారమునకే. ఆ ధాతువు ఉపదేశావస్థలో 'కృప్' అని ఋకారోపధము. ఆ ఋకారము రేఫగా మారినపుడు, ఆ రేఫకు లత్వమును, దానిద్వారా ఋకారమునకు ఌకారాదేశమును "కృపోరోలః" (8-2-18) అను సూత్రముచే విధింపబడినవి. ఆ సూత్రము త్రిపాదస్థము. అచ్కార్య విధాయకశాస్త్రములకంటె పరము. కావున వాని దృష్టిలో అసిద్ధము. కాగా ఌకారమునందు 'ఋకారమిది' యను బుద్ధిచే నాయాకార్యములు ప్రవర్తించును. కావున ఌకారము నక్షరసమామ్నాయమున నుపదేశింపకున్నను ననుపపత్తి లేదను **తాత్పర్యముతో**, దాని యుపదేశము ప్రశ్నింపబడినది

ఈ ప్రశ్న కుత్తరముగా **"ఌకారోపదేశోయదృచ్ఛాశక్తిజానుకరణప్లుత్యాద్యర్థః"** అను వార్తికము పఠింపబడినది.

యదృచ్ఛాశబ్దములందలి ఌకారము నందచ్కార్యములు ప్రవర్తించుటకును, అశక్తిజానుకరణమున నవి ప్రవర్తించుటకును, ఌకారమునకు, ప్లుత్యాదులు సిద్ధించుటకును ఌకారోపదేశమావశ్యకమని భావము.

యదృచ్ఛాశబ్దములనగా 'డిత్థః' మున్నగునవి. ప్రయోక్త, స్వేచ్ఛచేనొకానొక వ్యక్తికి సంకేతముగా నేర్పరచు శబ్దము యదృచ్ఛాశబ్దము. జాతిశబ్దములు గుణశబ్దములు, క్రియాశబ్దములు, యదృచ్ఛాశబ్దములును నని శబ్దములు నాలుగు విధములు. "ఌతకః" అని యొకనికి, తండ్రి పేరు పెట్టుకొనెను. 'వానికి పెరుగు పోయుము', 'వానికి తేనియ నిమ్ము' అని చెప్పదలంచినపుడు, "దధ్య్ఌతకాయదేహి", "మధ్వ్ఌతకాయదేహి" అని చెప్పును. అందికారోకారములకు ఌకారము పరమగనపుడు యణాదేశము దానికి అచ్త్వముండిననే లభించును. ఋఌక్ సూత్రమున తదుపదేశము లేనిచో అది సిద్ధింపదు.

మరియు, 'ఌతకుడుత్తరముగా బోయెను, పడమటదిక్కుగా బోయెను' అని చెప్పదలంచి, 'ఉదఙ్ ఙ్ఌతకోగమత్' 'ప్రత్యఙ్ ఙ్ఌతకోగమత్' అని ప్రయోగించినపుడు "ఙమోహ్రస్వాదచిఙముణ్నిత్యమ్" (8-3-32) అను సూత్రముచే ఌకారమునకు 'ఙుట్' అనునాగమము రావలెను. అందులకును అచ్త్వమావశ్యకము.

ఇట్లు యదృచ్ఛాశబ్దార్థ మావశ్యకమయినట్లు, అశక్తిజానుకరణార్థమునను ఌకారోపదేశము కర్తవ్యము.

ఒక బ్రాహ్మణి, లేదా కుమారి 'ఋతకః' అని అనుటకు బదులు 'ఌతకః' అని ఒకానొక వ్యక్తిని చెప్పినది. ఆమె పలికిన ఆ పదము నింకొక రనువదించి

'బ్రాహ్మణ్యౡతకఇత్యాహ', 'కుమార్యౡతకఇత్యాహ' అని యణాదేశ ఘటితముగ బ్రయోగించుట కనుచున్నాము. ఇట అనుకర్త యుచ్చరించిన ౡతకశబ్దము నందలి ౡకార మచ్చుకానిచో యణాదేశము రాదు. అచ్త్వముపదేశసాధ్యము. బ్రాహ్మణి పలికిన ౡతకశబ్దము అశక్తిజము అనుకర్త యుచ్చరించినది అశక్తిజానుకరణము. అనుకరణశబ్దములు జాతిశబ్దముల క్రిందకు వచ్చునుగాని యదృచ్ఛాశబ్దములు కావు. కాన అశక్తిజానుకరణములందు ౡకారమున కచ్త్వము సిద్ధించుటకును ౡకారోపదేశము

ప్లుత్యాద్యర్థమునగూడ దత్రాప్త మావశ్యకము. ప్లుత్యాదులనగా- ప్లుతము ద్విర్వచనము, స్వరితము.

"హే౩ౡప్తశిఖ!" అను సంబోధన పదమునందు ౡకారమునకు "గురోరనృతోఽనన్త్యస్యాప్యేకైకస్య ప్రాచామ్" (8-2-86) అను సూత్రముచే ప్లుతము రావలెను. అందుల కచ్త్వమును, తదర్థ మక్షరసమామ్నాయమున నుపదేశమును నావశ్యకములు.

"క్లృప్తః"- అనునదిక్తాన్తము. అట ౡకారమునకు, పరమైన పకారమునకు అచ్చుకంటె పరమైన యర్రుగా ద్విత్వము రావలెను. "ప్రక్లృప్తః" అను పదమునందు ౡకారమునకు "ఉదాత్తాదనుదాత్తస్యస్వరితః" (8-4-66) అని స్వరిత స్వరము రావలెను. ఉదాత్తానుదాత్త స్వరితములు అజ్ధర్మములు గాన ౡకారమున కచ్త్వ మావశ్యకము ఇది ఋకారము కాదుగాన 'అనృతః' అని ప్లుతప్రతిషేధము లేదు.

ఇట్లు మూడు ప్రయోజనములు చూపబడినవి. కాని అవి ప్రయోజనములు కావు. అందు ప్రథమప్రయోజనప్రత్యాఖ్యానవార్తికము, **"న్యాయ్యభావాత్కల్పనం సంజ్ఞాదిషు"** అనునది.

తండ్రి కుమారునకు బెట్టు పేరు న్యాయమైనదిగా శాస్త్రీయముగా, శిష్టప్రయుక్తమయినదిగా నుండవలెను అట్టిది లభించినపుడు తత్కల్పనమే సాధువుగా దలంపబడును. 'ఋతకః' అను సంజ్ఞాశబ్దము శాస్త్రాన్వితము గాన సాధువు. ఋత్ అనునది పాణినీయ సౌత్రధాతువు. 'అక' అనునది ఔణాదికమగు 'క్వున్' ప్రత్యయము పేర్లను బెట్టినపుడు కృదన్తశబ్దములనే పెట్టదగునని స్మృతులు బోధించుచున్నవి. కావున ఆ బాలునకు 'ఋతకః' అనియే నామధేయము చేయబడినదిగాని 'ౡతకః' అని గాదు, లేదా అది 'ఋతక'శబ్దమున కపభ్రంశమే. ఉచ్చారణావయవముల అపాటవమువలన నట్లుచ్చరింపబడుచున్నది. అది అసాధువే అనియు ఈ వార్తికమును వ్యాఖ్యానింపవచ్చును.

పోనిమ్ము. 'ౡఫిడః', 'ౡఫిడ్డః'- అని రెండు సంజ్ఞాశబ్దములు కలవు. ౡతక శబ్దమునకు, శాస్త్రాన్వితమగు ఋతకశబ్దము నివర్తకమగునంటివి. ఈ శబ్దముల కట్లు నివర్తకములగు ఋఫిడ, ఋఫిడ్డ శబ్దములు లేవుగదా. ఇందలి ౡకారమున కచ్త్వసిద్ధితదుపదేశమునకు బ్రయోజనమనవచ్చును గదా! అనిన ఇవియున్న

యదృచ్ఛాశబ్దములు కావు. క్రియాశబ్దములే. 'ఋఫిడః, ఋఫిడ్డః' అనునవి యేకరణాపాటవమువలననట్లుచ్చరింపబడుచున్నవి. అందు 'ఋ' అనునది ధాతువు. అయ్యదియే ఫిడ, ఫిడ్డ ప్రత్యయములకు ప్రకృతి. ఇక నా ప్రత్యయములు బాహులకసిద్ధములు. వానికి 'ఌ' అని వేరు ప్రకృతిని గల్పింపనక్కరలేదు. సంజ్ఞాశబ్దములును లోకమున గలవను పక్షమునను శాస్త్రాన్వితములకే సంజ్ఞలుగా వినియోగము న్యాయ్యము.

బాగుగ బరిశీలించిన యదృచ్ఛాశబ్దములు లేనేలేవు. శబ్దప్రవృత్తి మూడు ప్రకారములు గలది మాత్రమే. జాతి గుణ క్రియాశబ్దములేగాని నాలుగవ ప్రకారము లేనే లేదు. ఈ కాలమునందును పుట్టిన పిల్లలకు, పేర్లు పెట్టినపుడు ప్రశంసనీయమగు నొక గుణమునో లేదా క్రియనో ఆ బాలునియం దారోపించి ఆ నామమేర్పరుపబడుచుండును. కావున నామములన్నియు వ్యుత్పన్నములగు క్రియాశబ్దములే.

ప్రయోజనవాది ఆక్షేప మొకటి యిట గలదు. సంజ్ఞాశబ్దములును గలవను పక్షమున ఌకారోపదేశమునకు బ్రయోజనము చెప్పబడినది. అనగా నవ్యుత్పత్తిపక్షము నాశ్రయించి ప్రయోజనాన్వాఖ్యానము చేయగా, వ్యుత్పత్తి పక్షమున దత్పరిహారము, యదృచ్ఛాశబ్దములు లేనేలేవని చెప్పబడుచున్నది. ఇదియెట్లుపపన్నమగును?అర్థసామ్యమున్నపుడు శాస్త్రాన్వితమగు శబ్దము శాస్త్రాన్వితము కానిదానికి నివర్తకమగుననుట యుక్తము దేవదత్త శబ్దము దేవదిణ్ణ శబ్దమును నివర్తింపజేయును గాని గావీశబ్దము నెట్లు నివర్తింపజేయును? ఌతక శబ్దము సంజ్ఞ అయినపుడు దానికి ప్రవృత్తి నిమిత్తము శబ్దరూపమే. ఋతక శబ్దము సంజ్ఞ అయిన తత్ప్రవృత్తి నిమిత్తము క్రియయగును. ఇట్లువిభిన్న రూపము లయినపుడు ఋతకశబ్దము ఌతకశబ్దమునకు నివర్తకము గాజాలదు గదాయని యాక్షేపము.

పక్షాంతరముల నాశ్రయించియు బరిహారముల నుపపాదింపనగును. జాతి వ్యక్తి పక్షములలో వ్యక్తిపక్షమును మనమున నిడికొని, "సరూపాణామేకశేష ఏకవిభక్తౌ" ( -2-64) అను సూత్రము రచింపబడగా, జాతిపక్షాశ్రయణముచే నయ్యది ప్రత్యాఖ్యానము చేయబడెను. కాగా యదృచ్ఛాశబ్దములకొరకు ఌకారోపదేశ మావశ్యకము కాదు.

ఇక ఒక బ్రాహ్మణియో లేక కుమారియో 'ఋతకః' అనజాలక, 'ఌతకః' అని పలుకగా, ఆ మాట ననుకరించి, 'బ్రాహ్మణ్యౢతక ఇత్యాహ', 'కుమార్యౢతక ఇత్యాహ' అనుచోట యణాదేశమునకై యత్వము సిద్ధించుటకు ఌకారోపదేశ మావశ్యక మంటిరిగదా. అదియు బ్రయోజనముగాదు ఈసందర్భమున పఠింపబడిన ప్రత్యాఖ్యాన వార్తికము, "అనుకరణంశిష్టాశిష్టాప్రతిషిద్ధేషుయథాలౌకికవైదికేషు" అనునది- అనుకరణమనునది, విహితమయిన క్రియకుగాని, అశిష్టాప్రతిషిద్ధమునకు గాని, అనగా విధినిషేధములు రెండును లేని క్రియకుగాని సంభవించును. అందు విహితానుకరణము సాధువే. ఇక విధినిషేధములు రెండునులేని దాని యను

కరణము దోషజనకమునుగాదు అభ్యుదయ జనకమునుగాదు. ఈ ప్రక్రియ, లౌకిక వైదిక వ్యవహారములం దగపడుచున్నది. లోకమున నొకడు దానము చేయును, యజ్ఞము చేయును, అధ్యయనము చేయును. వాని ననుసరించి వేరొకడును ఆ పనులు చేయుననుకొనుడు. అది అనుకరణము. ఈ అనుకర్తయు అనుకార్యునివలె నభ్యుదయమునందును. ఇక వైదికవ్యవహారమును జూతము. "యఏవంవిశ్వసృజః సత్రాణ్యధ్యాసతే" అని పఠింపబడియున్నది. ఆ ప్రకారము వారి ననుసరించి సత్రాధ్యాసనమును నొకడు చేయవచ్చును. అతనికిని అభ్యుదయము కలుగును. అశిష్టా ప్రతిషిద్ధమునకు లౌకికోదాహరణము. "ఈ విధముగా ఏ ఈతండు త్రేన్చునో, నవ్వునో, గోకుకొనునో" అనుచు నింకొకడు తానును త్రేన్చవచ్చును, నవ్వవచ్చును, గోకుకొనవచ్చును. దానివలన దోషము లేదు. అభ్యుదయమును గలుగదు.

కాని ఒకడు బ్రహ్మహత్యచేసిన, వాని ననుకరించి వేరొకడు తానును బ్రాహ్మణహననము చేసినపుడుగాని, ఒకడు సురాపానము చేయగ జూచి, వేరొకడు వాని ననుకరించి తానును ఆ పని చేసినపుడుగాని, ఆతడును పతితు డగునని యే తలంతుము. అనుకార్యము దుష్టమయినచో అనుకరణమును దుష్టమగును అని యర్థసిద్ధము.

ఇక ప్రయోజనవాది యిట్లనును. "మీదృష్టాన్తోపన్యాసము విషమము. మొదట హత్యచేసిన వ్యక్తియు, వానిని అనుకరించి హత్యచేసిన వ్యక్తియు హన్తలే. అట్లే ముందు సురాపానము చేసిన వ్యక్తియు, వాని ననుకరించి అనుపానము చేసినవాడును ఇద్దరును త్రాగినవారే యగుదురు. కాని ఒకడు బ్రాహ్మణుని జంపగా జూచి, వాని ననుకరించుచు దానొక యరటిచెట్టును, అతిప్రకటముగ, స్నాతాను లిప్తుడై, పూలదండను వేసికొని నరకుననుకొనుడు. వాడు పతితుడు గాడు వాడిట్లు సురాపానము చేసెననుచు వాని ననుకరించుచు వేరొకడు తాను క్షీరపానము చేయుననుకొనుము. ఈతడు పతితుడు గాడు. కాగా, అనుకార్యము దుష్టమైనంత మాత్రమున ననుకరణము దుష్టముగాదు. ప్రకృతమున 'ఌతక' శబ్దము 'ఋతక' శబ్దార్థమునందు ప్రయోగింపబడిన అపశబ్దమగును. అనుకార్య మాత్రబోధకమైనచో సాధువేయగును. కాగా అనుకరణార్థమై ఌకారోపదేశ మావశ్యకమనుట.

అటులైన, ఒక డపశబ్దమును ప్రయోగించెను. వాని ననుకరించి వేరొకడును 'ఇట్టిత డపశబ్దమును బ్రయోగించినాడు' అని యనుచు నా యపశబ్దమును బ్రయోగించుననుకొనుము. అపుడా యనుకర్త అపశబ్ద ప్రయోగ ప్రయుక్తమగు ప్రత్యవాయము నొందును. 'గావీ' అనునది అపశబ్దము. 'వాడు 'గావీ' అనెను' అను వాక్యమునందలి 'గావీ' అనునది అనుకరణము. దాని యనుకర్తగూడ అనుహనన, అనుపానములు చేసినవానివలె దోషభాక్కు కావలసియుండును, కాగా అనుకరణ మపశబ్దముగాన శాస్త్రవిషయముగాదు. తదర్థ

ముపదేశ మనావశ్యకము అను తాత్పర్యముతో ప్రయోజన ప్రత్యాఖ్యానవాది శంక.

ఇది అపశబ్దము గాదు. సుశబ్దమే. దీనికి బోధ్యమపశబ్దము. ఇట్టి అనుకరణములందు ఌకారమున కచ్త్వసిద్ధికై ఉపదేశము కావలెను. అపశబ్ద బోధకములైన శబ్దములెల్ల అపశబ్దములగుచో, "అపశబ్దము" అనునదియు నప శబ్దము కావలసివచ్చును. అది అపశబ్దము కాదుగదా!

మఱియు 'సాధ్వౢకారమధీతే' 'మధ్వౢకారమధీతే' అందురు. ఇట ఌకార పద మనుకరణము. అది సాధ్వనుకరణమే తదర్థ ముపదేశ మపరిహార్యము. ఎక్కడి ఌకారమున కిది యనుకరణము? 'క్లృప'ధాతువునందున్న ఌకారమునకు. అట్లైన నా ధాతువునందలి ఋకారమునకు విధింపబడిన ఌకారము సిద్ధము గాన 'నిది ఋకారమే' అను భావముతో అచ్కార్యములు ప్రవర్తించునుగదా ఇక నుపదేశమెందులకు?

'క్లృప'ధాతువునందలి ఌకారము 'కొరకు ఌకారోపదేశ మనావశ్యకమని యనవచ్చు ననుకొనుడు. కాని దాని యనుకరణమైన ఌకారము కొరకది యావశ్యకమే. ప్రయోగమునందున్న క్లృపధాతు ఌకారమున కిది యనుకర ణము. అనుకరణ ప్రయోగము విషయమున 'పూర్వత్రాసిద్ధత్వ'ముండదు. శాస్త్ర దృష్ట్యాగాని, తదీయ కార్యదృష్టిలోగాని పరమున కసిద్ధత్వము సంభవించును. అట పౌర్వాపర్యమునకు సంభవము గలదు. ప్రయోగ విషయమున నది యసంభవము గదా.

అనుకరణ ఌకారమున కచ్కార్యసిద్ధికై కూడ ఉపదేశ మక్కరలేదు. "ప్రకృతి వదనుకరణం భవతి" అని అనుకరణమునకు ప్రకృతి సాదృశ్యము నతిదే శింపక తప్పదు. లత్వమసిద్ధమగుటవలన ఋకారబుద్ధిచే ఌకారమునందు అచ్కా ర్యముసిద్ధించినట్లు అనుకరణమునకును సిద్ధింపవచ్చును. అదియు ప్రకృతివంటిదే గదా! ఇకపై అతిదేశ మత్యావశ్యకము. ఎలయన- ఒకడు 'పచంతు పచంతు' అనెను. వాని ననుసరించి వేరొకడీతడు 'ద్విఃపచన్త్విత్యాహ' అనెననుకొనుడు. అట "తిఙ్ఙతిఙః" (8.1-28) అను సూత్రముచే అనుదాత్తస్వరము 'పచన్తు' అను తిఙన్తమునకు సిద్ధింపవలెను. కాని ఈ పదమిచట క్రియాసాధనాదులను బోధింప లేదు గాన తిఙన్తముగాదు. కాని స్వరము రావలె. అందులకై తిఙన్తత్వాతి దేశ మావశ్యకము. అట్లే "అగ్నీ ఇత్యాహ" అనునదియు ననుకరణము. అట "అగ్నీ" అనునది యనుకరణ మాత్రమే కాని ద్విత్వసంఖ్యావిశిష్టార్థబోధకము కాదుగాన ప్రగృహ్యత్వము దానికి ప్రాప్తింపదు అది లేనిచో, ప్రకృతిభావము దుర్లభము. కాగా దానికిని ప్రకృతివద్భావాతిదేశ మావశ్యకము. కాగా సాధ్వనుకరణార్థమై ఌకారోపదేశ మనావశ్యకము

అట్లైన, 'కుమార్యౢతక ఇత్యాహ', 'బ్రాహ్మణ్యౢతక ఇత్యాహ' అనుచోట ఌతక

శబ్దమపశబ్దమేయగును దాని ప్రకృతి అపశబ్దమేగదా. కాగా అశక్తిజానుకరణము కొరకును తదుపదేశమనావశ్యకమే యగును; అనిన అపశబ్దము ప్రకృతి కానేరదు. అపశబ్దములకు ఉపదేశము లేదుగదా. శాస్త్రీయమగు ప్రకృతియొక్క శాస్త్రనిబంధనమగు కార్యమే అనుకరణమునందు అతిదేశింపబడును. అపశబ్దము శాస్త్రీయమగు ప్రకృతిగాదు. అపశబ్దత్వము, శాస్త్రీయ కార్యమును గాదు. కాగా అశక్తిజానుకరణములకై ఌకారోపదేశము కావలెనని పర్యవసానము.

"ఏకదేశవికృతస్యానన్యత్వాత్ ప్లుత్యాదయః" అనునది తృతీయ ప్రయోజన ప్రత్యాఖ్యానవార్తికము.

ఒకచోట వికృతి కలిగినంత మాత్రమున నొక వస్తువు వస్త్వంతరమువంటిది గాదు. వస్త్వంతర మసలేగాదు అని 'ఏకదేశవికృతమనన్యవత్' అను న్యాయమున కర్థము. ఋకారమునందలి రేఫభాగమునకు లకారము ఆదేశముగా వచ్చినను 'ఇది ఆ ఋకారమే' అని గుర్తించుట కనువుపడును గాన ప్లుత్యాదులు సిద్ధింపవచ్చును. తదర్థమై ఌకారోపదేశముతో బనిలేదు అని వార్తికాశయము.

ఏకదేశ వికృతన్యాయమును స్వీకరించినచో 'రాజకీయమ్' అను పదమునందు జకారాకారమునకు లోపము రావలసియుండును. అట "రాజ్ఞః కచ" (6-2-140) అను సూత్రముచే రాజన్ శబ్దమున నకారస్థానమున కాదేశము వచ్చును. 'రాజక్' అనునదియు 'రాజన్' అను అన్నంతమేయగునుగాన "అల్లోపోఽనః" (4-4-134) అను సూత్రముచే అకారలోపము రావలసియుండునని ఆక్షేపము.

షష్ఠ్యంతపద నిర్దిష్టమున కాదేశమైన ఏకదేశ వికారమునకే అన్యవాద్భశ్య నిషేధము. రాజ్ఞః కచ అనుచో రాజన్ శబ్దము షష్ఠీనిర్దిష్టమైనను, 'అన్' అనునది షష్ఠీనిర్దిష్టము కాలేదు. కకారరూపమగు నాదేశముచే 'అక్' అని వికృతమైనదానికి 'అన్' అనురూపము ఏకదేశ వికృతన్యాయముచే సంపాదనీయము. ఆ రూపముగలదానికి, ఆ వికార విధాయకమున షష్ఠీనిర్దేశము లేదు కాన నీ యాక్షేపము లేదు అనిన, 'కౢప్తశిఖ'అనుచో ప్లుతము ప్రాప్తింపదు. లత్వవిధిలో ఋకారము షష్ఠీనిర్దిష్టము కాలేదు. రేఫమే షష్ఠీనిర్దిష్టము ఈ యాక్షేపమును వారించుటకు, "కృపోరోలః" (8-2-18) అను సూత్రమున ఋకారముగూడ షష్ఠీనిర్దిష్టమే. ఎట్లనగా కృప అనునది విభక్తిరహితముగా నిర్దేశింపబడినది. దానికి 'కృపస్య' అని యర్థము 'కృప, ఉః, రః, లః' అని ఛేదము. 'కృపధాతువుయొక్క రేఫకు లకారమగును. తదవయవ ఋకారమునకునులకారఘటిత మాదేశమగును అని యర్థము' అని చెప్పవచ్చును.

లేదా 'షష్ఠీనిర్దిష్టస్య' అని, 'ఏకదేశవికృతమనన్యవత్' అనున్యాయమునందు చేర్పనక్కరలేదు. అన్యాయము యథాశ్రుతముగనే యుండనిండు. "రాజ్ఞః కచ- రాజకీయమ్" అనుచోట 'అల్లోపోఽనః' అని అకారలోపము ప్రాప్తించుచున్నదంటిరిగదా యనిన, ఆ దోషము అన్యథా వారింపబడును. "శ్వయువమఘోనామ

తద్ధితే" (6-4-133) అను సూత్రమున వార్తికాచార్యుడు, "శ్వాదీనాం సంప్రసారణే నకారాన్తగ్రహణమనకారాన్తప్రతిషేధార్థమ్" అని చెప్పును. ఆ నకారాన్తపదము త్తరసూత్రమైన "అల్లోపోఽనః"(6-4.134)అను సూత్రములోనికి అనువర్తించును. 'రాజకీయమ్' అనుచోట నాదేశము వచ్చిన తరువాత నది, ఏకదేశ వికృత న్యాయముచే రాజన్ శబ్దమయినను, నకారాన్త మనిపించుకొనదు. తోక తెగినను కుక్కయందురుగాని పుచ్ఛవంతము (తోకగలది) అనరుగదా.

ఇట్లు లౌకికమగు నేకదేశ వికృతన్యాయముచే ప్లుత్యాదులు సిద్ధించుననిన, ఆదిపదగ్రాహ్యములగు ద్వివ్వచనస్వరితములు సిద్ధించినను, ప్లుతము సిద్ధింపదు. ౡకారమున కా న్యాయముచేత అచ్త్వము లభించినట్లు ఋకారత్వమును లభించును. కావున "క్లృ౩ప్తశిఖ" అనుచోట, "గురోరనృతోఽనన్త్యస్యాప్యేకైకస్య ప్రాచామ్" (8-2-86) అను సూత్రముచే విధింపబడిన ప్లుతమునకు, ఆ సూత్రమునందున్న 'అనృతః' అను ప్రతిషేధము ప్రాప్తించుచున్నది. అందువలన, అశక్తిజానుకరణ స్థలమున, ౡకారమున కచ్త్వమునకై ఉపదేశ మావశ్యకమయినట్లు, 'ఏహిక్లృ౩ప్తశిఖ' అనుచోట ప్లుతముకొరకుగూడ నది యావశ్యకమే అను ప్రయోజనవాది శంకకు వార్తికకారుని సమాధానవార్తికము "రవత్ప్రతిషేధాచ్చ" అనునది.

'గురోరనృతః' ఇత్యాది సూత్రమున 'అనృతః' అను పదమును దొలగించి, దాని స్థానమున 'అరవతః' అను పదమును జేర్చి, 'రేఫవత్తుకు ప్లుతము రాదు' అని చెప్పెదను. ఏకదేశ వికృతన్యాయముచే ఋకారత్వ మతిదేశింపబడును. రేఫవత్తు అను వ్యవహారము, ఛిన్నపుచ్ఛశునకమునకు పుచ్ఛవంతమిదియను వ్యవహారమువలెనే దానికి దుర్లభమే యగును. కాగా దానికి ప్లుతము సిద్ధింపవచ్చును ఉపదేశమనావశ్యకమని వార్తికభావము.

దీనిపైనను దోషము కలదు. హోతృ+ఋకారః = హోతౄకారః అని యగును గదా. అట ౠకారమునకు ప్లుతమిష్టము. 'అనృతః' అను పదము సూత్రమున నున్నపుడది దీర్ఘముగాని ఋత్తుకాదుగాన ప్రతిషేధము ప్రసక్తముగాదు. 'అరవతః' అనున్యాసమున నది యనివార్యము. ఈ దోషమును బరిహరించుటకు "గురోరరవతో హ్రస్వస్య" అని మార్చెదను అని వార్తికకారుని తాత్పర్యము కావలెను. కాని అట్లు గురున్యాసముచే, ౡకారోపదేశమును ప్లుత్యాద్యర్థ మావశ్యకమగుదానిని ప్రత్యాఖ్యానముచేయుట, పెద్ద వెదురుపొద నెక్కి దాని చివర నున్న యొక చిన్నపిట్టను లాగుటయే యగును. బహ్వాయాసముచే అల్పఫలమును సాధించుట.

ఋౡక్

## ॥ ఏ ఓ ఙ్, ఐ ఔ చ్ ॥

ఏ, ఓ, ఐ, ఔ అను నీ నాలుగు వర్ణములకును సంధ్యక్షరములని పూర్వాచార్యుల సంజ్ఞ. ఇది అన్వర్థ సంజ్ఞ. 'అఇఉణ్' ఇత్యాది సూత్రములం దుపదేశింపబడిన అకారాది వర్ణములతో దుల్యములగు వర్ణముల సంధానమువలన

'రమేశః', 'గంగోదకమ్', 'దేవైశ్వర్యమ్', 'కృష్ణౌత్కంఠ్యమ్' ఇత్యాది ప్రయోగము లందవి నిష్పన్నములు. వీనిలో నట్టి యవయవములు భాసించుటవలన నెచ్చట నున్నవయినను వానికి సంధ్యక్షరములనివ్యవహారము. ఇట్లే "అ, ఇ, ఉ, ఋ, ఌ" అను వీనికి సమానాక్షరము లనియు పూర్వాచార్యసంజ్ఞయే.

ఈ సంధ్యక్షరముల నక్షర సమామ్నాయమునందు, తపరములుగా "ఏత్, ఓత్,ఙ్" అనియు, "ఐత్,ఔత్,చ్" అనియు నుపదేశించి యుండిన యుక్తముగ నుండెడిదా? లేక యథోచ్చారితముగ అతపరములుగనే యుపదేశించినను సరి పడునా? అని విచారింపబడుచున్నది.

అందేమి విశేషము గలదు? కార్యవైలక్షణ్యమేమియుండునా? **"సంధ్యక్ష రేషు తపరోపదేశశ్చేత్తపరోచ్చారణమ్"** అని తపరపక్షదూషణ వార్త్తికము.

సంధ్యక్షరములను దపరములుగా నుపదేశించుటకు ఫలమేమైన నుండి యున్న నట్లుపదేశింపబడి యుండెడివే. కాని ఫలమేమియు లేనందున నట్లు చేయలేదు అని వార్త్తిక తాత్పర్యము.

**"ప్లుత్యాదిష్వజ్విధిః"** అనునదియు దూషణ వార్త్తికాంతరము. ప్లుతి అనగా ప్లుతము. దానియందు అజాశ్రయమగు కార్యము తపరములనుగా వాని నుచ్చ రించిన, సిద్ధింపకపోయెడిది. ఎట్లన- ప్లుతము మూడు మాత్రలు గలది. వార్త్తి కమునందలి ఆదిపదము చతుర్మాత్రికము లను గూడ బోధించును.

'గో౩త్రాతః', 'నౌ౩త్రాతః' అను సంబోధనాంతములలో, గో నౌ శబ్దముల ఓకారౌకారములు 'గురోరనృత'ఇత్యాది సూత్రముచే ప్లుతములు.అట నా రెండు వర్ణములకును అచ్త్వము కావలెను. వాని అక్షరసమామ్నాయమున, తపర ములుగా నుపదేశించినచో ద్విమాత్రికములగు వానికే 'అచ్' సంజ్ఞ కలుగును గాని, త్రిమాత్ర చతుర్మాత్రికముల కది సిద్ధింపదు. 'గోత్త్రాతః నౌత్త్రాతః' అను పదములందు, ఓకారౌకారములకు బరమగు తకారమునకు "అనచిచ" (8-4-47) అను సూత్రముచే, 'అచ్చుకంటె, పరమగు యర్గునకు ద్విత్వమువచ్చును' అని విధింపబడిన ద్విత్వము ప్రాప్తింపకపోవును. మఱియు, ప్రత్యఙ్+ఐతికాయనః = ప్రత్యఙ్ఙైతికాయనః, ఉదఙ్+ఔపగవః = ఉదఙ్ఙౌపగవః అనుచోట్ల, అచ్చునకని చెప్ప బడిన ఙముడాగమము ఐకారౌకారములకు, ప్రాప్తింపకపోవును.

**"ప్లుతసంజ్ఞాచ"** అను వార్త్తికముచే దూషణాన్తరమును చెప్పబడినది. ఐ౩తికాయన!' 'ఔ౩పగవ!' అను పదమునందు ఐకారౌకారములు త్రిమాత్రికము లుగా వినబడుచున్నవి. వానికి ప్లుతసంజ్ఞ రావలెను. ఐ, ఔ వర్ణములు తపరోప దేశమువలన ద్విమాత్రికములే గాన నవి త్రిమాత్రికములను గ్రహింపవు. వాని కచ్త్వము లభింపదు. అచ్త్వములేనిచో ప్లుతసంజ్ఞయు దుర్లభము. ఇక ఐచ్చు లకు ప్లుతము విధింపబడినపుడు, అందలి ఇకారోకారములచే గ్రహింపబడిన ఈకార ఊకారములు రావలసివచ్చును.

అట్లైన సంధ్యక్షరముల తపరములే యుపదిష్టములు గానిమ్మ అనిన

అతపరపక్షమున, రెండు దూషణవార్తికములు పఠింపబడినవి. అందు మొదటిది "**అతపరఏచఇగ్ఘ్రస్వాదేశే**" అనునది. వానిని, తపరములుగా నుపదేశింపకుండిన, ఏచ్చులకు హ్రస్వములు విధింపబడినచోట్ల, ద్విమాత్రికములగు వీనిచేత అనగా ఏ కారౌకారములచేత మాత్రికములగు అర్ధ-ఎకార, అర్ధ-ఒకారములకు గ్రహణముగలిగి వానికి హ్రస్వములుగా నాదేశవిధానము ప్రాప్తించును. ఇకారోకారములే ఏచ్చులకు హ్రస్వాదేశములుగా సమ్మతములైనవి. అందులకై "ఏచ ఇగ్ఘ్రస్వాదేశే" (1-1-48) అను సూత్ర మావశ్యకమగును. తపరోపదేశ పక్షమున నవి గ్రహింపబడవు గాన వానికి ప్రాప్తిలేదు. ఇది ఈ పక్షమునందలి గౌరవరూపమగు దోషము.

ఏమయ్యా! ఎవ్వని తలంపులో అవి తపరములుగా నుచ్చరింపబడవలెనో ఆతనికిని 'ఏచఇక్' అను నియమసూత్రము తప్పదే. ఏచ్చులు నాలుగింటిలో, ఐచ్చులు రెండును సమాహారవర్ణములు. అనగా- అ+ఇ=అఇ=ఐ, అని అకార ఇకారముల సమాహారము ఐకారమనియు, అ+ఉ=అఉ=ఔ, అని అకార ఉకారముల సమాహారము ఔకారమనియు, భావము. అందు అ వర్ణమున కొక మాత్రయు, ఇవర్ణోవర్ణములకు ఒక మాత్రయు మొత్తము రెండు మాత్రలు ప్రమాణము. అట్టివానికి హ్రస్వ మాదేశింపబడిన సందర్భములలో ఒక పర్యాయ మకారమును ఇంకొక పరి ఇకారోకారములును రావలసివచ్చును. ఇకారోకారములే సమ్మతములు. అకార మెపుడును రారాదు. అందులకై ఆ సూత్రము తప్పదు. కాకున్న 'ఏచఇక్' అనుటకు బదులు 'ఐచఇక్హ్రస్వాదేశే' యనియైనను జెప్పక తీరదు. సూత్రన్యాసమున భేదమున్నను గురులాఘవకృత భేదమేదియు నగపడదు. ఏ ఓలు సంశ్లిష్టావర్ణములు. అనగా నందవర్ణము స్ఫుటముగ నుపలభ్యముగాదు. వాని విషయమున అవర్ణప్రాప్తియుండదు. ఇక అరఏకారము, అరఓకారమును తపర నిర్దేశపక్షమున నచ్చులే కావుగాన హ్రస్వత్వమే వానికి లేదు అని అతపర పక్షదూషణమునకు, ప్రతిబంది సమాధానమును శంకింప, 'ఐజ్విషయక' మగు ఏచఇగితి సూత్రము "**ఐచోశ్చోత్తరభూయస్త్వాత్**" అను వార్తికముచే ప్రత్యాఖ్యానము చేయబడునని చెప్పి ఆ సమాధానము నిరాకరింపబడినది.

ఐ, ఔ వర్ణములం దుత్తరభాగ మధికము. అందర్ధమాత్ర అవర్ణమునకును, మాత్రన్నర ఇవర్ణోవర్ణములకును బ్రమాణముగా నిర్ణయింపబడినది. కాగా నిట్టి ఉత్తరభూయస్త్వమువలన, ఇవర్ణోవర్ణములే హ్రస్వాదేశములుగా బ్రాప్తించును. అవర్ణమునకు బ్రాప్తియే లేదు అని తాత్పర్యము.

ఓహో! ప్రత్యాఖ్యాన, పక్షమును గ్రహించిన, ఏ ఓల విషయమునను ఆ సూత్రము ప్రత్యాఖ్యాతమే. కాగా అతపరపక్షమున సూత్రారంభరూప గౌరవము లేనే లేదు.

"సిద్ధమేఙః సస్థానత్వాత్" (1-1-48) అని అచటి వార్తికము. ఏకార ఓకారములు తాలవ్యములు గాన వానితో సమాన స్థానములైన ఇకార ఉకారములే వాని స్థానమున హ్రస్వములుగా వచ్చును. అకారము రానే రాదు. అందువలన 'ఏచఇక్' అను సూత్రమక్కరలేదని భావము.

అర ఏకారమును, అర ఓకారమును సస్థానతరములుగదా యందురేమో! అవి లేనేలేవు. అవి యుండినచో అక్షరసమామ్నాయమున వానినే యుపదేశించి యుండునుగదా. అందు లాఘవమున్ను గలదు. వానిచే దీర్ఘప్లుతములకు గ్రహణమును కలుగవచ్చును.

అర్ధైకారౌకారములు లేనే లేవని యెట్లందురు? సామవేదులలో సాత్యముగ్రిరాణాయనీయశాఖలవారు 'సుజాతే ఎశ్వసూనృతే', "అధ్వర్యో ఒద్రిభిస్సుతమ్", "శుక్రంతే ఎన్యత్", "యజతంతే ఎన్యత్" అని యిట్లు అర్ధఎకార ఒకారములను పఠించుచున్నారే? అందురేని వినుడు. వారి పరిషత్తు ప్రత్యేకమైనది. ఏకార ఓకారములకు, గీతివశమున నట్టి యుచ్చారణము ఆ పరిషత్తునందు మాత్రమే ప్రసిద్ధము. లోకమునగాని ఇతర వేదములందుగాని అవి లేవు. కావున సర్వశాఖా సాధారణమగు వర్ణసమామ్నాయమునందు అర్ధైకారౌకారముల నుపదేశించుట యుక్తముగాదు.

ఇక, అతపరపక్షమున ద్వితీయదూషణవార్తికము, **"ఏకాదేశేదీర్ఘగ్రహణమ్"** అనునది. 'ఆద్గుణః' (6-1-87) "వృద్ధిరేచి" (6-1-88) మున్నగు ఏకాదేశ విధాయక సూత్రములందెల్ల 'ఆద్గుణోదీర్ఘః', వృద్ధిరేచిదీర్ఘః' అని పఠింపవలసి యుండును. ఎందుకనగా- స్థానులయిన వర్ణములు మూడు మాత్రలు గలవిగాని నాలుగు మాత్రలుగలవిగాని యయినపుడు, వాని స్థానమునందు ఆంతరతమ్యమువలన, త్రిమాత్రచతుర్మాత్రాదేశములు రాకుండుటకు అచ్చట గూడ ద్విమాత్రికాదేశములే ఇష్టములు. ప్రత్యాహారసూత్రములందు, తపర నిర్దేశము లేనియెడల దీర్ఘగ్రహణ మావశ్యకమగును. ఉ॥ 'ఖట్వా+ఇంద్రః = ఖట్వేన్ద్రః॥ 'ఖట్వా+ఉదకమ్ = ఖట్వోదకమ్'॥ ఇట స్థానులు రెండును గలసి త్రిమాత్రికములు. 'ఖట్వా+ఈషా=ఖట్వేషా'॥ ఖట్వా+ఊఢా=ఖట్వోఢా'॥ ఖట్వా+ఏలకా = ఖట్వైలకా॥ ఖట్వా + ఓదనః = ఖట్వౌదనః॥ ఖట్వా + ఐతికాయనః = ఖట్వైతికాయనః॥ ఖట్వా+ఔపగవః = ఖట్వౌపగవః॥- ఇందు స్థానులు చతుర్మాత్రికములు.

అటులైన దీర్ఘగ్రహణ మధికముగా జేయవలెనుగదా యనిన అక్కరలేదు. పైన 'అకస్సవర్ణేదీర్ఘః' (6-1-101) అను సూత్రమున 'అకస్సవర్ణే' అని యొక సూత్రమును, 'దీర్ఘః' అని వేరొక సూత్రమును విభజింపవచ్చును. 'అక్కునకు సవర్ణము పరమగునపుడు, పూర్వపరవర్ణములకు ఏకాదేశమగును' అని మొదటి సూత్రమున కర్థము. తరువాతి "దీర్ఘః" అనుదానికి, 'పూర్వపర

వర్ణముల కేకాదేశముగ విధింపబడిన యా దేశములెల్ల దీర్ఘములేయగును' అని అర్థము. కావున గుణవృద్ధులు దీర్ఘములేయగును గాని త్రిమాత్ర చతుర్మాత్రములు ప్రసక్తములు గావు.

అట్లైన 'పశుమ్' అనుచోట "అమిపూర్వః" (6-1-107) అను సూత్రముచే విధింపబడిన పూర్వరూపమును, 'విద్ధమ్' అనుచోట, ఇకారాకారముల స్థానమున "సంప్రసారణాచ్చ" (6-1-108) అని విహితమైన పూర్వరూపమును, 'పచన్తి' అను స్థలమునందు, శప్ప్రత్యయ, అంతి, ప్రత్యయాకారములకు, 'అతోగుణే' (6-1-97) అని విధించిన పరరూపమునుగూడ దీర్ఘములే కావలసియుండునే యనిన- ఈ దూషణముల కుద్ధారము గలదుగాన నివి దోషములు గావు. 'పశుమ్' అనుచోట నాపాదింపబడిన యతి ప్రసంగమును జూతము. అట 'అమిపూర్వః' (6-1-107) అనిగదా పూర్వరూపము. ఆ సూత్రమును, 'అమి' అని మాత్రమే రచించినను, అమ్మ పరమగునపుడు పూర్వాపరముల కేకాదేశమగునని యర్థమగును. అయినను, 'పూర్వః' అను పూర్వగ్రహణము చేయుటలో పాణిని కేదియో యర్థవిశేషము మనస్సులో నుండియుండును. పూర్వస్థాని, అచట, ఏ జాతికి సంబంధించినదో తజ్జాతీయమే ఏకాదేశము కావలెనని యాతని తలంపు. 'పశుమ్' అనుచోట పూర్వస్థాని హ్రస్వజాతీయము. కావున నదియే యేకాదేశమగును గాని దీర్ఘముగాదు. కాగా ఆ అతిప్రసంగము వారితము.

ఇక 'విద్ధమ్' అనునది. ఇట 'వ్యధ్' ధాతువులోని యకారమునకు సంప్రసారణ మికారము. దానికి అకారముతో పూర్వరూప మేకాదేశముకాగా ఇకారహ్రస్వమే వచ్చును. లేదా ఇట్లును జెప్పనగును. పాణిని, "హలః" (6-4-2) అను సూత్రముచే హల్లునకు బరమైన సంప్రసారణమునకు, 'జీనః' మున్నగు రూపములలో దీర్ఘమును విధించుచున్నాడు. ఏకాదేశమెల్ల దీర్ఘమే యగుచో నచటి పూర్వరూపమును దీర్ఘమేయగును గాన మరల దీర్ఘవిధానము వ్యర్థమగును. కనుక "ఏకఃపూర్వపరయోర్దీర్ఘః" అని చెప్పిన దీర్ఘమిచట రాదని తెలియుచున్నది.

ఇక 'పచన్తి' అను స్థలమునను నేకాదేశము దీర్ఘము కాదు. అచట పరరూపము రాదగినది. పరస్థాని హ్రస్వరూపము గనుక నదియే వచ్చును. పరరూపవిధాయకసూత్రమునందలి పరరూపపదమున, రూపపదమునుగూడ గ్రహించుటవలన, పాణినికి, పరస్థానియొక్క రూపమెట్టిదియో తజ్జాతీయమే యుభయస్థానులకును నేకాదేశము కావలెను అని అభిప్రాయము అని స్పష్టము గాన నెట్టి యతిప్రసంగమును లేదని తాత్పర్యము.

కాని 'ఖట్వా + ఋశ్యః = ఖట్వర్శ్యః' అనుచో గుణము, రపరమగుహ్రస్వాకారము గదా రావలెను. ఏకాదేశమెల్ల దీర్ఘమేయగుననుటచే హ్రస్వము

ప్రాప్తింపదు. ఇక నేకారముగాని ఓకారముగాని వచ్చుట అంతరతమ పరిభాషావిరుద్ధముగాన నవి రావు. కాగా నచట 'ఖట్వాఋశ్యః' అని విగ్రహీతముగ నుచ్చరింపవలసి వచ్చును, అని యాక్షేపింపవచ్చును. కాని సమాధానము గలదు.

దీర్ఘగ్రహణము నెచ్చటచేసిన దోషము ప్రాప్తించునో అచట జేయుమని మేము చెప్పుటలేదు. ఎచ్చటచేసిన ఏ దోషమును ప్రసక్తముగాదో అచట జేయుడు.

ఎచటచేసిన దోషముండదు? సంజ్ఞావిధిలో చేసిన దోషముండదు. 'ఏకాదేశే' అను వార్తికమునందలి పదమునకు, 'ఏకాదేశమునకు మూలమయిన సంజ్ఞావిధిలో' అని యర్థము వివక్షితము. అనగా "వృద్ధిరాదైచ్ దీర్ఘః" "అదేఙ్ గుణో దీర్ఘః" అని యీ విధముగా ననుట.

అట్లైన నట నధికముగా దీర్ఘపదము నుచ్చరింపవలసివచ్చునే? అక్కర లేదు. త్రిమాత్రచతుర్మాత్రికస్థానులకు, త్రిమాత్రచతుర్మాత్రాదేశములు ఏల రావు? అందు రేమో?

రావు. గుణవృద్ధులు రెండును తపరములు. తపరశబ్దముచే నిర్దిష్టమగు స్థానులైన ఐచ్, ఏఙ్ అను సంజ్ఞలందు గుణవృద్ధిసంజ్ఞలు ప్రవర్తించును. కావున నవి తత్కాలమునకే సంజ్ఞలగును.

తపరమనగా, తకారము పరముగా గలదియని కదా యర్థము? అంతే కాదు. తకారముకంటె పరమైనదియు తపరమేయగును. 'ఏ ఓ ఐ ఔ లు' ఆ సూత్రములందు తకారమునకు బరమై యున్నవి.

అట్లైన "ఋూదోరప్" (3-3-57) అను సూత్రమున దోషము కలుగును. 'ఋూత్ చ, ఉచ అనయోస్సమాహారః=ఋూదు తస్మాత్ = ఋూదోః' అని విగ్రహము. దీర్ఘఋుకారాన్త ధాతువులకంటెను, హ్రస్వదీర్ఘోభయోకారాంతముల కంటెను బరముగా 'అప్' అను ప్రత్యయమగునని ఆ సూత్రమున కర్థము. 'కరః, గరః యవః లవః స్తవః' మున్నగునవి యుదాహరణములు. తపరపదమున, తత్పురుష సమాసమునుగూడ ఆశ్రయించిన పక్షమున 'ఉ' అనునది తకారమునకు బరముగా నున్నందున, హ్రస్వోకారాన్తములగు, 'యు', 'స్తు' ధాతువులకు అప్ప్రత్యయము సిద్ధించినను, 'లవః' 'పవః అనుచోట దీర్ఘోకారాన్తములకు సిద్ధింపకపోవును అను నాక్షేపము కలుగును. దానికి 'ఆ సూత్రమున అది తకారముగాదు, దకారము' అని కేవల బహువ్రీహివాది సమాధానము.

దకారోచ్చారణమున కేమి ప్రయోజనము? అనిన, తకారోచ్చారణమునకు మాత్ర మేమి? అని సమాసద్వయవాది ప్రశ్న. తపరపదమున బహువ్రీహి

మాత్రమే సమాసమను పక్షమునందు, 'ఋూత్' అను పదమున దీర్ఘ ఋకారము అణ్ణు కాదుగాన సవర్ణ ప్రసక్తియే లేదు. అట్టియెడ తకార మసందేహార్థమో ముఖసుఖార్థమో అనియే అనవలెను. ఉభయసమాసవాదికిని, దకారోచ్చారణ మున కదియే ప్రయోజనమగును.

కాగా సంధ్యక్షరములు అతపరములుగనే ఉపదేశింపబడినది.

## వర్ణైకదేశములకు స్వతంత్రవర్ణములుగా గ్రహణము కలుగునా ? లేదా ? అను విచారము

దీర్ఘాకారాదులలో, హ్రస్వాకారాదులవంటి అవయవములు కలవు. ఋకారమునందు రేఫసదృశమగు నవయవ వర్ణము గలదు. ఌకారమున, లకారసదృశమున్నది. సంధ్యక్షరములందును, అకార, ఇకార, ఉకార సదృశము లగు వర్ణములు కలవుగదా. వానికి కేవలవర్ణములకుగల ప్రతిపత్తియు, తత్ప్ర యుక్త కార్యములును వచ్చునా? రావా? అను విషయము విచారింపబడును.

ఈ విచారణమున కేమి ప్రసంగమనిన- వర్ణసమామ్నాయమునందు, ఋ, ఌ, ఏ, ఓ, ఐ, ఔ- అను సముదాయములును నుపదేశింపబడినవి. అ, ఇ, ఉ, ర, ల- అను అవయవములును ఆయా ప్రత్యాహారసూత్రములచే నుపదే శింపబడియున్నవి. అవయవముల నుచ్చరింపక అవయవి నుచ్చరించుట శక్యము గాకుండుటచే సముదాయమునందవయవములును జేరియుండును. కాని అచట నవి తిరోహితములై యుండుటవలనను, సముదాయ కార్య పరతంత్రములగుట చేతను, స్వాశ్రయకార్యములను బొందవు. వృక్షము చలించినపు డవయవము లతో గలసియే చలించునుగదా. అట్టి వర్ణములలో సముదాయాంతర్గతావ యవమునకు, కేవల వర్ణముగా గూడ గ్రహణము యుక్తమా? కాదా? అని విచారణము.

ఎట్లైన నేమి విశేషము? అనిన,

**"వర్ణైకదేశాః వర్ణగ్రహణేనచేత్ సంధ్యక్షరే సమానాక్షర విధి ప్రతి షేధః"**— అని, గ్రహణపక్షమున ప్రథమాక్షేప వార్తికము.

వర్ణైకదేశములు వర్ణగ్రహణముచే గ్రహింపబడునను పక్షమున, సంధ్య క్షరములందు సమానాక్షరములకు రాదగిన విధులు రావని చెప్పవలసియుండును. ఉ॥ **'అగ్నే + ఇన్ద్రః'** అని యున్నదనుకొనుము. ఇట ఏకారమునందు ఇకారము గూడ కలదుగాన, దానికిని, ఇంద్రశబ్దమునందలి ఇకారమునకును, **"అకః సవర్ణే దీర్ఘః"** (6-1-101) అని దీర్ఘము ప్రాప్తించుచున్నది. దానిని నిషేధింపవలసి యుండును. ఇట్లే **"వాయో + ఉదకమ్"**- అనుచో గూడ దానిని నిషేధింప వలయును.

"దీర్ఘే హ్రస్వవిధి ప్రతిషేధః"- అని ఆక్షేపవార్తికాంతరము. దీర్ఘము లందు హ్రస్వాశ్రయములగు కార్యములు ప్రాప్తించుచున్నవి. తత్ప్రతిషేధ మును నావశ్యకము. ఎట్లన- 'ఆలూయ', 'ప్రలూయ' అనునవి ల్యబన్తములు. దీర్ఘోకారమునందలి హ్రస్వమును స్వతంత్రోకారముగ దీసికొనిన నట "హ్రస్వస్య పితికృతితుక్" (6-1-71) అను సూత్రముచే, తుగాగము ప్రాప్తించుచున్నది. అదియు ప్రతిషేధ్యము.

ఈ దోషమును జ్ఞాపకముచే పరిహరింపవచ్చును. ఎట్లన, దీర్ఘమునకు ఛకారము పరమగునపుడు, "ఛేచ" (6-1-73) "దీర్ఘాత్" (6-1-75) తుగాగమ మును, పాణిని విధించియున్నాడు. దీర్ఘములందు హ్రస్వాశ్రయ విధులు ప్రవ ర్తించిన యెడల నయ్యది యనావశ్యకము. కాగా ఆ విధానము, దీర్ఘములందు హ్రస్వాశ్రయకార్యములు ప్రవర్తింపవనుటకు జ్ఞాపకము కావచ్చును అని యనుట కవకాశము కలదుగాని "పదాన్తాద్వా" (6-1-76) అను నుత్తరసూత్రమునం దను వర్తించుటకై యది సార్థకము. కావున జ్ఞాపకము కాజాలదు. 'దీర్ఘాత్' అనునది లేనిచో కుడ్యచ్ఛాయా అనుచోట గూడ వికల్పము రావలసివచ్చును అందు రేని, యోగవిభాగము జ్ఞాపకము కావచ్చును. -"దీర్ఘాత్పదాన్తాద్వా" అని యొకటే సూత్రముగా జెప్పవచ్చునుగదా? కాగా యోగవిభాగము జ్ఞాపకమనవచ్చును.

కాని జ్ఞాపకములు సజాతీయాపేక్షములు. కాని దీర్ఘమునందలి హ్రస్వ మును స్వతంత్రహ్రస్వముగా గ్రహించి, తుగాగమును బ్రవర్తింపజేయరా దనుటకు మాత్ర మయ్యది జ్ఞాపకమయినను, 'ఖట్వాభిః', 'మాలాభిః' అనుచో, "అతోభిసఐస్" (7-1-9) అను సూత్రముచే 'భిస్' ప్రత్యయస్థానమున 'ఐస్' ఆదేశము ప్రాప్తించును.

అపుడు తపరకరణము వ్యర్థమగునుగదా, తపరకరణ సామర్థ్యమువలన రాదందుము. అనిన-

'యాతా', 'వాతా'- అనుచోట, 'అతోలోపః', "ఆర్ధధాతుకే" (6 - 4 - 48, 6-4-46) అని ఆర్ధధాతుకమైన తృచ్ప్రత్యయము పరమగునపుడు, ధాత్వవయ వాకారమునందలి హ్రస్వమునకు లోపము రావలసియుండును.

ఇచట గూడ, తపరకరణ సామర్థ్యమువలననే రాదనవచ్చునుగదా? అనిన, తపరకరణమున కిట ప్రయోజనాంతరము గలదు. అది లేనిచో. అకా రము సవర్ణమగు దీర్ఘాకారమును గూడ గ్రహించును. అపుడు ఆకారమున కంతకును లోపము ప్రసక్తమగును. దానిని వారించుటకు తపరకరణము సార్థకము..

తపరకరణము "అతోలోపః" అను సూత్రమున నున్నప్పటికిని, ఆకారము నందు రెండు అకారములు కలవు గదా. అందు ముందుగా పర అకారమునకు

లోపము వచ్చినపిదప మరల పూర్వహ్రస్వాకారమున కేల లోపము రారాదు? అనిన,

'పరాకార లోపమునకు స్థానివద్భావముగాని, ఆభీయాసిద్ధత్వముగాని వచ్చును. అపుడు దానితో వ్యవధానముండును గాన, పూర్వాకారమునకు లోపము రాదు' అని చెప్పి సర్వలోపమును వారింపవచ్చును.

అటులైన, దీర్ఘాకారముననున్న హ్రస్వాకారమునకు లోపము రాదని ఆచార్యప్రవృత్తి జ్ఞాపనము చేయును. "ఆతోఽనుపసర్గేకః" (3-2-3) అను సూత్రమును బరిశీలింపుడు. అయ్యది కప్రత్యయవిధాయకము. ప్రత్యయమునందలి కిత్త్వమునకు, 'గోదః' 'కంబలదః' అను లక్ష్యములందు 'దా' ధాతువు నాకారమునకు "ఆతోలోపఇటిచ" (6-4-64) అను సూత్రముచే లోపము సిద్ధించుట ప్రయోజనము. ఆకారావయవమగు హ్రస్వాకారమునకును, వేరుగ లోపము, "అతోలోపః" (6-4-48) అను సూత్రముచే గలుగునెడల, పరాకారము లోపించిన వెనుక పూర్వాకారమునకును, ప్రత్యయసంబంధి అకారమునకును పరరూపముచే, 'గోదః' మున్నగు రూపములు సిద్ధించునుగాన అనుబంధమైన కకారముతో బనిలేదు. ఆకారమునందలి అకారమునకును, "అతోలోపః" అని లోపము రాదని, ఆచార్యుడు గమనించినాడు. అందుకని కకారము ననుబంధముగా జేర్చినాడు. కిత్త్వమువలన, "ఆతోలోపఇటిచ" అని ఆకార లోపముచే రూపము సిద్ధింపవలెనని తాత్పర్యము.

కాని యీ కిత్త్వము, ఉత్తర సూత్రమయిన "తున్దశోకయోః పరిమృజాపనుదోః" (3-2-5) అని విధింపబడిన కప్రత్యయమున సార్థకము. అట గుణవృద్ధి ప్రతిషేధములును, కిత్త్వఫలములును గలవు. ఈ సూత్రమును 'ఆతోఽనుపసర్గేఽః' అని పఠించి, పై సూత్రమును 'కః' అని పఠించిన గౌరవము. కాగా జ్ఞాపకము కాజాలదనిన, లోపమాత్ర ప్రయోజనకమును, అనన్యార్థమునగు "గాపోష్టక్" (3-2-8) అను సూత్రముచే విధింపబడిన టక్ప్రత్యయ కకారము జ్ఞాపకమగును.

"ఏకవర్ణవచ్చ"- అని ఆక్షేపవార్తికాంతరము. 'దీర్ఘ మొకచే వర్ణము వంటిదగును' అనియు జెప్పవలసియుండును. దీర్ఘ మొకచే వర్ణము గదా. అతిదేశ మెందులకు? అనిన, వాక్ శబ్దమున అవయవసంఖ్యనుబట్టి యా పదము రెండచ్చులు గలది యగునేని "వాచాతరతి" అను నర్థమున "నౌద్వ్యచష్ఠన్" (4-4-7) అను సూత్రముచే 'ఠన్' అను ప్రత్యయము ప్రాప్తించుచున్నది. అట్లే, 'వాచోనిమిత్తమ్' అను నర్థమున, 'గోద్వ్యచోఽసంఖ్యాపరిమాణాశ్వాదేర్యత్' (5-1-39) అను సూత్రముచే 'యత్' ప్రత్యయము ప్రాప్తము. వానిని వారించుటకు దీర్ఘమునకే కవర్ణతదతిదేశము ఆవశ్యకము అని వార్తికాశయము.

కాని, వర్ణావయవాశ్రయ కార్యము లెవ్వియు, స్ఫుటప్రతిభాసములేని వర్ణావయవములందు ప్రవర్తింపవని, పై రెండు సూత్రములందలి గో, నౌ, గ్రహ

ణము జ్ఞాపకము. ఓకార, ఔకారములందును రెండక్షరములు కలవుగదా. ద్వ్యజ్గ్రహణము చేతనే సిద్ధింప, వానిని మరల గ్రహించుట వ్యర్థము. కావున నయ్యది యే సామాన్యాపేక్ష జ్ఞాపకము. కాగా దీర్ఘమునందలి హ్రస్వములు రెండింటిని వేరుగా గ్రహించి కార్యములు ప్రవర్తింపవు. అతిదేశ మనావశ్యకమే.

"నావ్యపవృక్తస్యావయవే తద్విధిర్యథా ద్రవ్యేషు" అను నది సర్వాక్షేపములకును బరిహారమును బోధించు వార్తికము.

వ్యపవృక్త మనగా భేదము. భేదములేనిది అవ్యపవృక్తము. ఏకత్వాలంబన జ్ఞానగ్రాహ్యము. అనగా నిది ఏకవస్తువే యని దలంపబడునది. దాని అవయవమునందు, వేరువేరుగానుండు వర్ణములకు కలుగు కార్యములు ప్రవర్తింపవు. ద్రవ్యములు దృష్టాంతము. "సప్తదశసామిధేన్యోభవన్తి" అని యొక విధి. అగ్నిసమింధనమునకై పఠింపబడు ఋక్కులకు సామిధేనులని పేరు. ఆ ఋక్కుల నుచ్చరించుచు, అగ్నియందు సమిధల నుంతురుగాన, సాహచర్యము వలన నిట సామిధేనులనగా సమిధలు. అట్టి సమిధలను, పదునేడింటిని ఆధానము చేయవలెనని యర్థము. పదునేడు మూరలో బారలో గల యొక సమిధలోనే పదునేడు సమిధలు కలవు గదా యని తలంచి, యొకేయొక సమిధ అట్టిది ఆధానము చేయబడుట లేదుగదా యని వార్తిక తాత్పర్యము.

అట్లు చేయబడకుండుటకు, సంభవము లేకుండుట గూడ కారణము. కావున దృష్టాంతము విషమము. ఒక్కొక్క ఋక్కు ననుసంధించుచు ఒక్కొక్క సమిధ నాధానము చేయవలసియున్నది. ఒకే సమిధ యయిన నయ్యది కుదురుపడదు. ఆహితపునరాధానము నిషిద్ధము. అంతియగాక, అగ్నివేది మూడున్నర హస్తములు మాత్రమే ప్రమాణము గలది. మరియు, అంతపెద్దది ఒకే సమిధ అగ్నియందును, వేదియందును నిముడదు. దానికి అగ్నివేది బహిర్భావము నిషిద్ధము కాగా పై దృష్టాంతము సరిపడదు అనిన నింకొక ద్రవ్య దృష్టాంతమును జూడుడు. "సప్తదశ ప్రాదేశమాత్రీరాశ్వత్థీస్సమిధోఽభ్యాదధీత" అని వేరొక విధి. ఒక లొడిత (జుట్టెవి) ప్రమాణముగల పదునేడు రావి సమిధల నాధానము చేయవలెనని దాని యర్థము. ఇట ప్రమాణ మల్పముగనుక అసంభవము లేదు. అయినను, పదునేడు ప్రాదేశములు ప్రమాణముగాగల యొకే సమిధ వ్రేల్వబడుట లేదు.

ఈ దృష్టాంతమును విషమమే. ఇటగూడ నొక్కొక్కసారి ప్రణవానుసంధానము చేయుచు నాధానము చేయవలెను. సమిధ అగ్నివేదియం దిముడకుండుట గూడ సంభవింపవచ్చును అనిన- "తైలం నవిక్రేతవ్యమ్", "మాంసం నవిక్రేతవ్యమ్" అను దృష్టాంతములను జూడుడు. 'నూనె నమ్మరాదు', 'మాంసమును విక్రయింపరాదు' అనిన; విడివిడిగా, తైలమును మాంసమును అమ్ముట లేదు గాని అవ్యపవృక్తతైలమాంసములుగల సర్షపములును, గోవులును (ఆవా

లును, ఎద్దులును) అమ్మబడుచునేయున్నవిగదా.

అట్లే, "లోమనఖంస్పృష్ట్వాశౌంచంకర్తవ్యమ్" కేశములను గోళ్లను దాకిన, స్నానము చేయవలెను అని విధింపబడియున్నది. అచటగూడ వ్యవవృక్త లోమనఖస్పర్శమునందే శౌచము లోకమున నాచరింపబడుచున్నది గాని శరీరస్థ లోమనఖములను స్పృశించినపుడు శౌచాచరణమున కామచారమే.

పోనిమ్ము. ఎచట వ్యవవర్గముండునో యచట ప్రత్యేక వర్ణములుగా వానికి గ్రహణము కలుగునా? యని ప్రశ్న. ఎచ్చట నట్టిది కలదనిన, సంధ్యక్షరములందు గలదు. అందు ఐ, ఔ లు, శ్లిష్టావర్ణములు. అట అకార ప్రతిభాసము స్ఫుటముగదా.

ఈ ప్రశ్నకు వార్తికకారుని సమాధానము "సంధ్యక్షరేషువివృతత్వాత్" అనునది. సంధ్యక్షరముల విషయమున, వివృతత్వమువలన దోషము లేదు. వీని యందలి అవర్ణము ఇతరములగు అవర్ణములకంటె వివృతతరము. ఇందుండు, ఇకార ఉకారములు గూడ, ఇతర ఇవర్ణోవర్ణములకంటె వివృతతరములు. కావున ప్రయత్నభేదము మూలమున, సావర్ణ్యము లేనందున, అక్షరసమామ్నాయము నందలి అకారము సంధ్యక్షరావయవాకారమును గ్రహింపదు. ఆకారాదులందలి అకారమునకు, పృథక్ ప్రతిభాసమే లేదు. ఋకారాన్తర్గత రేఫము స్ఫుటప్రతిభాసము కలది గావున, 'ఆనృజే' అనుచో, నుడ్విధియు, 'చక్ల్పే' అనుచో లత్వమును, 'మాతౄణామ్' అను స్థలమున ణత్వమును సిద్ధించును. కావున సముదాయస్థమగు నవయవ వర్ణమునకు, ప్రత్యేకవర్ణముగా గ్రహణము కలుగునను పక్షమున నెట్టి యనుపపత్తియు లేదు.

అథవా- లేదా- అగ్రహణపక్షమును నిర్దోషమే. వర్ణైకదేశములు స్వతంత్ర వర్ణములుగా గ్రహింపబడవు అనియే యందను. సముదాయవర్ణములైన సంధ్యక్షరాదులు అఖండములే, అందు భాగములున్నట్లగపడుట సాదృశ్య మూలకమగు ప్రతీతి మాత్రమే. నరసింహ శరీరమునందు నరసింహత్వము జాత్యన్తరమే గాని నరత్వసింహత్వ సమూహరూపముగాదు. గవయమృగమునకు గోసాదృశ్యము కలదు. అంతమాత్రమున గోత్వజాతి గవయమునందు లేదు. ఆ విధముగనే సంధ్యక్షరాదుల యవయవములందును అత్వజాతి యుండదు. సాదృశ్యముండిన నుండవచ్చును. ప్రత్యేకాకారాదు లెట్లు ఏకవర్ణములో సంధ్యక్షరాదులును నట్లే యేకవర్ణములే యనుట యుక్తిసిద్ధముగూడ నగును. ఏ వర్ణముల యుచ్చారణమైనను, ఇచ్ఛాపూర్వక ప్రయత్నజన్యము. ఐకారాదుల నుచ్చరించు వ్యక్తి, వాని నుచ్చరించుటకు తాను, రెండిచ్ఛలను, రెండు యత్నములును జేయునట్లు భావింపడు. అందు భాగభ్రాంతి మాత్రమేగాని వస్తుతః అవి సభాగములు కావు. పదమును వర్ణసమూహరూపమని తలంచినట్లు

వాని నెవ్వరును వర్ణసమూహ రూపములనుగా దలంపలేదు.

**"అగ్రహణం చేన్నుడ్విధిలాదేశవినామేషు ఋకారగ్రహణమ్"** అను వార్త్తిక మీ పక్షమునందు దూషణ వార్త్తికము.

వర్ణైక దేశములకు స్వతంత్రవర్ణములుగా గ్రహణములేనిచో నుడ్విధి, లాదేశము, వినామము (ణత్వము) వీనిలో ఋకార గ్రహణము చేయవలసి యుండును. "తస్మాన్నుడ్ ద్విహల."(7-4-71) అను సూత్రము, రెండు హల్లులు గల ధాతువుల దీర్ఘభూతమగు అకారమునకు బరమగు దానికి నుగాగమమును చెప్పుచున్నది. 'ఆనర్చ,' 'ఆనర్ధ' ఇత్యాదు లుదాహరణములు. అవి రెండు హల్లులు గలవి. ఆ సూత్రమున 'ఋకారేచ' అనియు జెప్పవలసియున్నది. 'ఋధ్' అను ధాతువునందు ధకారమొక్కటి హల్లు. 'ఆనృధతుః' అనుచో నుగాగమము ఈ వచనము లేనియెడల సిద్ధింపకపోవును. ఋకారైక దేశమగు రేఫమును గూడ నొక హల్లుగా గ్రహించిన వారి మతముననైన, సూత్రము నందలి 'ద్విహలః' అను దానిచేతనే సిద్ధించును.

పై దూషణము నిట్లుద్ధరింపవచ్చును. ఆ సూత్రమున 'ద్విహలః' అను పదమే గ్రహింపబడదు. కావున అగ్రహణవాది మతమునను నీ దోషములేదు. దీర్ఘీభూతమగు అకారమునకు బరమయిన దాని కే ధాతువునందైనను నుడాగమ మగును.

అట్లైన 'ఆటతుః', 'ఆటుః' అనుచో అట ధాతువునందును రావలసి యుండును గదా యనిన - 'అశ్నోతేశ్చ' (7-4-72) అను ననంతర సూత్రము నియమార్థమగుటచే నటనుడాగమాపత్తి లేదు. అశూవ్యాప్తౌ అను ధాతువునకు లిడ్రూపము 'ఆనశే' అనునది. అందులకై 'అశ్నోతేశ్చ' అను సూత్రముచే నుడాగమము విధింపబడినది. పూర్వ సూత్రమున 'ద్విహలః' అనునదిలేని పక్షమున నది నియమవిధియగును. 'తస్మాన్నుట్'—అను సామాన్య సూత్రను చేతనే నుగాగమము సిద్ధించుచుండగ నారంభింపబడిన విధి గనుక నియమవిధిగా నేర్పడి, అకారోపధ ధాతువులందు నుడాగమము రావలసిన నది అశ్ ధాతువునందు మాత్రమే ప్రవర్తించును అని నియమించును గాక, 'ఆటతుః' 'ఆటుః' అనుచో నుడాగమాపత్తి లేదు. కాగా నుడ్విధిలో, వచనముతో పని లేదని పర్యవసితము.

ఇక లాదేశ విధాయక సూత్రమగు "కృపో రో లః" (8-2-18) అను సూత్రమున, 'ఋకారస్యచ' అను వచనమావశ్యమగునని గ్రహణ వాది యభిప్రాయము. 'క్లృప్త' 'క్లృప్తవాన్' అనుస్థలములందు ఋకారస్థానమున ఌకారాదేశము రావలెను. ఆ సూత్రమునందు 'రః' అనియే యున్నది. వర్ణైకదేశము లకును వర్ణములుగా గ్రహణము కలుగునను పక్షమున, 'ఋకారస్యచ' అను వచనముతో బనియుండదు-అని యాక్షేప్తభావము.

గూడ గ్రహించుట ససంభవము, ఋకారాన్తర్గతమగు రేఫ అట్ప్రత్యాహారా న్తర్గత మయినట్లు. ఈ అజ్భక్తి కూడా, అఇఉణ్ సూత్రమునందలి అకార ముచే గ్రహింపబడవచ్చును. కాగా తద్వ్యవధానమున ణత్వము సిద్ధించును.

అజ్భక్తితో వ్యవధానమున్నపుడది సిద్ధింపదని మరల యాక్షేపము. ఎందు వలన ననగా—వర్ణైక దేశములయినను నెట్టివి స్వతంత్ర వర్ణములుగా గ్రహింపబడును? ఎయ్యవి వ్యపవృక్తములుగానున్నపుడు స్వతంత్ర వర్ణము లుగా ప్రతిపన్నములో అవి. ఈ అజ్భక్తి స్వతంత్ర వర్ణప్రతిపత్తి కలది గాదు కదా? దానికి స్ఫుటప్రతిభాసము లేనందున ఏ యచ్చును దానిని గ్రహింపదు.

అటులైన యోగ విభాగముచే నీ దోషము నుద్ధరింపవచ్చును. "రషా భ్యాంనోణః సమాన పదే" అను సూత్రమునకు తరువాత 'వ్యవాయే' అని సూత్రము. వ్యవధానమునందును ణత్వము వచ్చును అని యీసూత్రము చెప్పును. మూడవ సూత్రము, 'అట్కుప్వాఙ్నుమ్' అనునది. ఇది లుప్తతృతీ యాంతము. 'వ్యవాయే' అను రెండవ సూత్రముచే సర్వవర్ణ వ్యవధానమున ణత్వము ప్రాప్తించుచుండగా నియ్యది, అట్, కు, పు, ఆఙ్, నుమ్మలతో మాత్రము వ్యవధానముననే ణత్వమగును. ఇతరములగు నాక్షర సమామ్నాయి కముల వ్యవధానమున రాదు అని నియమించును. దీర్ఘాకారాదు లక్షర సమా మ్నాయమున పఠింపబడకున్నను, పఠింపబడిన వానిచే బ్రత్యాయితములు గాన నవియు నాక్షర సమామ్నాయికములేయగును. అజ్భక్తి ప్రత్యాయ్యమునుగాదు, ప్రత్యాయకమును గాదు. కావున నియమ నివర్త్యముగాదు అని గ్రహణవాది వాదము.

గ్రహింపబడవను వానికిని నియ్యదిదోషముకాదు: పాణిన్యాచార్యుని ప్రవృత్తివలన ఋకారమునకు బరమైన నకారము ణత్వమును పొందునని జ్ఞాపిత మగుచున్నది. "క్షుభ్నాదిషుచ" (8-4-39) అను సూత్రము. క్షుభ్నాది గణ పఠితములకు ణత్వమును నిషేధించుచున్నది. అందు నృనమన శబ్దమును పాణిని పఠించియున్నాడు. ఋవర్ణము కంటె, బరమగు నకారమునకు ణత్వప్రాప్తి యే లేనిచో ఆ గణమున ఆ శబ్దమునకు పాఠము వ్యర్థముగదా అనిన, కాదు. నృనమనుని కుమారుడు 'నార్నమని' యగును. అట రేఫయే ణత్వ నిమి త్తముగాన ణత్వము సూత్రప్రాప్తము. తద్వారణమునకై గణ పాఠము చరితా ర్థము గాన జ్ఞాపకముకా జాలదు.

అటులైన, తృప్నోతి శబ్దపాఠము జ్ఞాపకమన వచ్చును. అది తిజన్తము. నృనమన శబ్దపాఠమును జ్ఞాపకమేయన వచ్చును. 'నార్నమని'ః అనుచో ఆదివృద్ధి వచ్చినపుడు ణత్వవారణమున కావశ్యకమంటిరి గదా?

అశక్యత లేదు. బహిరంగ పరిభాషచే నట ణత్వమును వారింపవచ్చును.

వృద్ధి బహిరంగము. ణత్వ మంతరంగము. అంతరంగము ణత్వము కర్తవ్య మగునపుడు వృద్ధి అసిద్ధమగును గాన రేఫ లేనందున ణత్వము ప్రాప్తింపదు.

లేదా- "ఛందస్యృదవగ్రహాత్" (8-4.26) అను సూత్రమునందు యోగ విభాగము చేయబడును. దానివలన ఋకారముకంటె బరమగు నకారమునకు ణత్వము సిద్ధించును. అవగ్రహయోగ్యమగు ఋదన్తపూర్వపదము కంటె బరమైన నకారమునకు ణత్వమును ఛందస్సునందు ఆ సూత్రము విధించును. 'నృమణాః' అని యుదాహరణము. ఆ సూత్రమున మధ్యమపదమగు 'ఋత్' అను దానిని వేరుచేసి 'ఋతః' అని యొక సూత్రముగా బరింతుము. 'ఋకారమునకు పరమైన నకారమునకు సామాన్యముగ ణత్వము ప్రవర్తించును' అని దాని కర్థము. తరువాత, 'ఛన్దస్యవగ్రహాత్' అని వేరొక సూత్రము. అంది 'ఋతః' అనున దనువర్తించును. ఈ పదమునందలి తకారము ముఖసుఖార్థము. కావున, వినామమున ఋకార గ్రహణాపత్తి లేదు.

అగ్రహణ పక్షమున గౌరవమును సూచించు వేరొక వార్తికము. **"ప్లుతావైచ ఇదుతౌ"** అనునది.

ప్లుతావైచ ఇదుతౌ" (8-2.106) అనునది యొక సూత్రము. దూరాహ్వానమున విధింపబడిన ప్లుతము ఐచ్చులకు ప్రసక్తమయినపుడు తదవయవములగు ఇకార ఉకారములు ప్లుతములగునని సూత్రార్థము. వర్ణైకదేశములు వర్ణములుగా గ్రహింపబడవను పక్షమున నీ సూత్ర మావశ్యకమగును. అయ్యది ఆ పక్షమున గల గౌరవము. గ్రహణపక్షమున, 'గురోరనృత' ఇత్యాది సూత్రముచేతనే ఐకారౌకారముల 'టి' భాగములగు ఇకార ఉకారముల కది సిద్ధించును గాన తత్సూత్రాకరణలాఘవము స్పష్టము.

కాని అగ్రహణ వాదికైనను నిది దోషముగాదు. ఏలయన, ఆ సూత్రము అవశ్యకర్తవ్యమై యుండనే యున్నది. ఐకార, ఔకారములందలి ఇకార ఉకారభాగములు వ్యపవృక్తములే అయినను, వివృతతరములు గాన ప్రయత్న భేదమువలన అక్షర సమామ్నాయి కేకారోకారములచే గ్రహింపబడవు. అందువలన నవి యచ్చులే కావు. తన్మూలకమగు టి సంజ్ఞయు వానికి లభింపదు. కాగా సూత్రమవశ్యకర్తవ్యము.

అగ్రహణ పక్షమున దూషణాన్తరమును సూచించు వార్తికము **"తుల్యరూపే సంయోగే ద్వివ్యంజనవిధిః"** అనునది.

తుల్యరూపమగు సంయోగమనగా ఏకరూపములగు నవయవములుగల సంయోగ సంజ్ఞార్హము. అట్టిది యేకవర్ణమే యగును గాన, అటవ్యంజన ద్వయాశ్రయవిధియగు సంయోగసంజ్ఞ, సిద్ధించుటలేదు గాన విధేయమగునని యాక్షేపము.

'క క్కుటః' 'పిప్పలీ' 'పిత్తమ్'- ఉదాహరణములు. వర్ణైకదేశములును వర్ణములుగా గ్రహింపబడునను పక్షమున నట నున్నవి రెండు కకారములు, రెండు పకారములు, రెండు తకారములే యగును గాన దోషము లేదు.

అగ్రహణవాదికిని నయ్యది, రెండు కకారములు, రెండు పకారములు, రెండు తకారములునే యగును. ఏకత్వభ్రాన్తి ఆశూచ్చారణమువలన కలుగు నది. ఇట సంయోగము మాత్రాకాల ప్రమాణముకలదిగా నగపడుచున్నది. మాత్రికమగు వ్యంజన మెచ్చటను లేదు. అక్షరసమామ్నాయమున నుపదిష్టము కాలేదు. అనుపదిష్టమును విద్యమానముగా నెట్లు గ్రహింపనగును? అసత్తును అంగీకరించుటయు నెట్లు కుదురును? అనిన,

పై యుదాహరణములందు కకార పకార తకారములు అప్రత్యాహార వర్ణములు కావుగాన నట్లు చెప్పుట శక్యము కావచ్చును. అవి సవర్ణగ్రాహక ములు కావు. కాని "సయ్యన్తా" "సవ్వత్సరః" "యల్లోకమ్" "తల్లోకమ్" అనుచోట నెట్లు? యకార వకార లకారములణ్ణులుగాన గ్రహణక శాస్త్ర మచట సవర్ణగ్రహణమును బోధించునుగాన నవి యేకవర్ణములు కావచ్చును. కావున ద్వివ్యంజనాశ్రయవిధియగు సంయోగసంజ్ఞ సిద్ధింపదు అను నాక్షేపము నకు సమాధానమిట్లు చెప్పనగును :

ఈ సంయోగము మాత్రాకాలికముగ నగపడుచున్నది. అది యొకే వర్ణ మయిన మాత్రికమగు వ్యంజనము కావలెను. మాత్రికవ్యంజనము లుపదిష్టము లును గావు, గ్రహణకశాస్త్రగ్రాహ్యములును గావు. ఇట సానునాసిక నిరనునాసికవర్ణములు రెండు స్పష్టములు. అణుదిత్సూత్రము విద్యమానము లును, లోకసిద్ధములునునగు సవర్ణములనే గ్రహించునుగాని, అప్రసిద్ధ సవర్ణ కల్పకము గానేరదు. కావున అసత్ప్రతిపత్తి అశక్యము. 'ఏఓఙ్, ఐఔచ్'

## ॥హయవరట్॥

### హకారద్విరుపదేశవిచారము

అక్షరసమామ్నాయమునందు అకారాది వర్ణములన్నియు నొక పర్యా యమే-ఉపదేశింపబడినవి. కాని యీ హకారము, హయవరట్ సూత్రమున ముందును, చివర హల్సూత్రమునందును, రెండుసారు లుపదేశింపబడినది. ముందో వెనుకనో యొక సూత్రమున నొక పర్యాయమే యుపదేశించియుండిన సరిపడదా? రెండుసారు లుపదేశించుటలో నేమి విశేషము గలదు?

హాకారమునకు పరోపదేశము మాత్రమే చేసియుండిన, అట్ ప్రత్యాహార ఘటిత సూత్రవిధేయములగు కార్యములు హాకారమునకు సిద్ధింపవు. అందు

హాకారగ్రహణము కూడ చేయబడవలసియుండును అని "**అకారస్య పరోపదేశే అడ్గ్రహణేషుహగ్రహణమ్**" అను వార్తికము దూషణమును సూచించినది.

"ఆతోఽటినిత్యమ్" (8-3-3), 'శశ్ఛోఽటి' (8-4-63), 'దీర్ఘాదటి సమానపాదే' (8-3-9) మున్నగు సూత్రములచే విధింపబడిన కార్యములు. హాకారము పరమైనపుడును ప్రవర్తింపవలెను. "మహాఁహిసః" అని యుదాహరణము. ఇట, నకారమునకు 'దీర్ఘాదటి' యను సూత్రముచే రుత్వమును 'ఆతోఽటి' అను సూత్రముచే, ఆకారమున కనునాసికాదేశమును, అంతకు పూర్వమే రుత్వమునకు ఇట్టి లోపములును వచ్చినవి. అట్ప్రత్యాహారమున హాకారమునకు గ్రహణము లేనిచో రుత్వానునాసికములు సిద్ధింపకుండును.

"**ఉత్త్వేచ**"— అనునదియు నింకొక దూషణవార్తికము. అప్లుతమగు అత్తునకు బరమగు రుత్వస్థానమున 'హశ్' ప్రత్యాహారవర్ణము పరమయినపుడు విధింపబడిన ఉత్త్వము హాకారము పరమయినపుడును వచ్చునని వేరుగ చెప్పవలసి యుండును. 'పురుషో హసతి', 'బ్రాహ్మణో హసతి' మున్నగునవి ఉదాహరణములు. ఇవి పరోపదేశపక్షమున దోషములు.

అట్లైన పూర్వోపదేశమే చేయనగును. "**పూర్వోపదేశే కిత్త్వక్సే డ్విధయోర్ఝల్గ్రహణానిచ**" అనునది పూర్వోపదేశపక్ష దూషణవార్తికము. ఆ పక్షమున, కిత్త్వము, క్స ప్రత్యయము, ఇడాగమమును, రల్, శల్, వల్ ప్రత్యాహారములందు హాకారము చేరనందున, అపూర్వముగ విధేయములు కావలసి వచ్చును. "స్నిహిత్వా, స్నేహిత్వా॥" "సిస్నిహిషతి, సిస్నేహిషతి॥" అను స్థలములందు, రలన్తధాతువుకంటె పరములైన క్త్వాసన్ప్రత్యయములకు విధింపబడిన కిత్త్వ వికల్పము సిద్ధించుటకు, "హాకారాన్తధాతువుకంటె బరమైనపుడును" అని వేరుగ జెప్పవలయును.

'అధుక్షత్', 'అలిక్షత్' అను, రూపములందు, 'దుహ్' 'లిహ్' ధాతువుల హాకారము శల్ప్రత్యాహారమున జేరనందున "శల ఇగుపధాదనిటఃక్సః" (3-1-45) అను సూత్రముచే, 'క్స' ప్రత్యయాదేశము ప్రాప్తింపదు. అది, హాకారాన్తముకంటె పరమయినపుడును వచ్చును అని చెప్పవలయును.

'రుదిహి'— ఇట, వలాదిత్వప్రయుక్తమగు ఇడాగమము 'హి' అనుదానికిని సిద్ధించుటకు అపూర్వవిధాన మావశ్యకమగును.

ఇట్లే, ఝల్ప్రత్యాహారములును హాకారరహితములగును. అందువలన 'అదాగ్ధామ్' అనుచోట హాకారముమీది సకారమునకు లోపము ప్రాప్తింపక పోవును. అందువలన, 'హయవరట్', 'హల్' అను రెండు సూత్రములందును హాకారోపదేశము కర్తవ్యము.

వర్ణముల యుపదేశమునకు స్వరూప ప్రతిపత్తి మాత్రమే ఫలముకాదు, శాస్త్రీయ ప్రయోజన సిద్ధియు ఫలమే. హాకారోపదేశమునకు, ఇంకను ఎచట

ఎచటనైన ప్రయోజనము గోచరించిన నచటను నుపదేశము చేయబడియుండెడిది. అట్టి దెద్దియు గోచరింప నందున నా రెండు సూత్రములందు మాత్రమే తదుపదేశము చేయబడినది.

## రేఫోపదేశ స్థానవిచారము

'హయవరట్' సూత్రమున నాల్గవ వర్ణముగనుపదేశింపబడిన రేఫకు, యకారవ కారములకు ముందు రెండవ యక్షరముగ 'హరయవట్' అని ఉపదేశము యుక్తమగునా? లేక యథాన్యాసముగ నుపదేశమే యుక్తమా? అని విచారింపబడుచున్నది. విశేషమేమియేని కలదా?

**"రేఫస్య పరోపదేశ అనునాసిక ద్విర్వచన పరసవర్ణప్రతిషేధః"**- అని యథాన్యాసోపదేశ దూషణ వార్తికము.

**'స్వర్ణయతి', 'ప్రాతర్ణయతి'** అను చోట్ల రేఫ యర్ప్రత్యాహార ఘటకమగును గాన "యరోఽనునాసికేఽనునాసికో వా" (8-4-45) అను సూత్రముచే అనునాసికాదేశము ప్రాప్తించుచున్నది. 'మద్రహ్రదః', 'భద్రహ్రదః' అనుచోట "అచోరహాభ్యాం ద్వే" (8-4-46) అని ద్విత్వము ప్రాప్తించుచున్నది.

**'కుండంరథేన', 'వనంరథేన'** అనుచో, అనుస్వారమునకు, యర్ప్రత్యాహార ఘటకమగు రేఫ పరమగునపుడు పరసవర్ణము, "అనుస్వారస్యయయిపరసవర్ణః" (8-4-58) అను సూత్రముచే ప్రాప్తము.

అటులైన, **'హరయవట్'** అని పూర్వోపదేశమే కానిమ్ము. **"పూర్వోపదేశే కిత్త్వప్రతిషేధో వ్యలోపవచనం చ"** అని దూషణ వార్తికము.

**'దేవిత్వా', 'దిదేవిషతి'** అను రూపములలో ధాతువకారము ఈన్యాసమున, రల్ప్రత్యాహారఘటకమగును గాన, "రలో వ్యుపధాద్ధలాదేః సంశ్చ" (1-2-26) అని క్త్వా, సన్ప్రత్యయములకు, కిత్త్వము ప్రాప్తమై తత్ఫలితముగ గుణనిషేధము రావలసి వచ్చెడిది. కావున ఆ కిత్త్వమును ప్రతిషేధింపవలసియుండును అనిన, ఆ యక్కర యుండదు. ఆ సూత్రమున 'రలః వ్యుపధాత్' అని కాదు. అన్వయము. మరేమి? రలః అవ్ వ్యుపధాత్" అని ఛేదము. 'అవ్ వ్యుపధాత్' అననేమి? 'అవ్' అనునది లుప్తపంచమీకము. వకారాంతము కానిదియును, ఇకారోకారములుపధగా గలదియును నగు రలంతధాతువునకు పరమైన క్త్వా, సన్ప్రత్యయములు కిత్తులగునని యర్థము. 'దివ్' ధాతువు వకారాంతముగాన పై దోషము లేదు.

కాని వ్యలోపవచనము దోషము. అనగా "లోపోవ్యోర్వలి" (6-1-66) అని **'గాధేరః', 'పచేరన్', 'యజేరన్', 'జీరదానుః'** అను స్థలములందు, యకార వకారములకు రేఫ పరమగునపుడు లోపము రావలెను. జీరదాను పదము జీవధాతువునకు రదానుప్రత్యయము చేరగా నేర్పడినది. **'హరయవట్'** అను న్యాసమునందు, రేఫ వల్లుకాదు గాన నది ప్రాప్తింపదు అనిన ఇదియు దోషము గాదు.

సూత్రమున నిమిత్తముగ రేఫ కూడ నిర్దేశింపబడియున్నది. 'లోపః, వ్యోః, ర్వలి' అని భేదము. 'ర్వలి' యనగా, 'రేఫయు వల్లును బరములైనపుడు' అని యర్థము. కావున, పూర్వోపదేశమును సమర్థనీయమే. అయినను, యథాన్యాయముగ, పరోపదేశమే యుండుగాక."

రేఫకు పరోపదేశమున, అనునాసిక ద్విర్వచనపరసవర్ణ ప్రతిషేధము కర్తవ్యమగునని యాక్షేపింపబడినదిగదా?

రేఫకును, ఊష్మలకును, విజాతీయములగు సవర్ణములు లేవు. 'స్వర్ణయతి' 'కుండంరథేన'- అను స్థలములందు, రేఫకు ణకారముగాని, అనుస్వారమునకు, రేఫగాని, అంతరతమములు కావు. కాన ప్రసక్తములు కావు. కాగా దోషము లేదు.

ఇక ద్విర్వచనము విషయమునను నిట్లు చెప్పవచ్చును. 'మద్రహ్రదః' 'భద్రహ్రదః' అను స్థలములందు రేఫకు ద్విత్వాపత్తి కలుగదు. 'అచోరహాభ్యామ్' అనుచో రహాలు ద్విత్వమునకు స్థానులు కావు. నిమిత్తములు మాత్రమే యగును. హకారము యర్ప్రత్యాహారఘటకము కాదుగదా. అందువలన నది కార్యికానట్లు, రేఫ యర్రయినను నిమిత్తమేగాని కార్యిగాదు. ఎట్లనగా :

"బ్రాహ్మణులందరును భోజనము చేయుదురు. మాఠరుడును, కౌండిన్యుడును వడ్డన చేయుదురు" అని చెప్పినపుడు, మాఠర కౌండిన్యులును బ్రాహ్మణులే కావున వారికిని భోజనము ప్రాప్తము. అయినను, వారు వడ్డన చేయవలెనని విశేషముగ చెప్పుటచే, వడ్డనసమయమున వారికి భోజనము బ్రాహ్మణులందరితోపాటుగ నుండదు. అనగా పరివేషణవిధి భోజనవిధికి బాధకము. ఆ విధముగనే రేఫకు చెప్పబడిన ద్విత్వనిమిత్తత్వము కార్యిత్వమునకు బాధకమగును. కావున రేఫకు ద్విత్వాపత్తిలేదు.

## అయోగవాహోపదేశ విచారము

ఈ అయోగవాహములు అక్షరసమామ్నాయమునం దెచ్చటను నుపదేశింపబడలేదు. ప్రయోగములందును, సూత్రములందును వినబడుచున్నవి. కావున వానికి కార్యార్థ ముపదేశము కర్తవ్యమై యున్నది.

అయోగవాహము లననేవి?

విసర్జనీయము, జిహ్వామూలీయము, ఉపధ్మానీయము, అనుస్వారము, నాసిక్యము, యమములును అయోగవాహములు.

ఇవి అయోగవాహము లెట్లగును? అనగా శబ్దప్రవృత్తి నిమిత్తమేమి? అయోగములును, అనగా నక్షరసమామ్నాయముతో సంబంధము లేనివియును, వాహములును అనగా, ప్రయోగ నిర్వాహకములుగా నున్నవియును గాన నవి

అయోగవాహములు. అయిన, వీని కతురసమామ్నాయమున నెచట నుప దేశము చేయవలసి యుండును?

"అయోగవాహానామట్సు ణత్వమ్" "శర్షుజశ్భావషత్వే"- అని ప్రయో జన వార్త్తికములు

వీనికి ణత్వము కొఱకు, అట్టులందును, జశ్త్వషత్వములు సిద్ధించుటకు శర్రులందును నుపదేశము కర్తవ్యము అని తాత్పర్యము. 'ఉరఃకేణ' అని యొక తృతీయాంతము. ఇది విసర్జనీయ ఘటితము. 'ఉరఃపేణ' అని వేరొకటి. ఇది ఉపధ్మానీయము కలది. 'ఉరఃకేణ, ఉరఃపేణ' అనునవియు, క్రమముగ జిహ్వా మూలీయ విసర్జనీయ ఘటితములు. 'ఉరఃకాయతీతి = ఉరః కః, ఉరఃపాతీతి ఉరఃపః అని విగ్రహములు. ఇందు రేఫ కంటె బరమైన తృతీయా విభక్తి ప్రత్యయ నకారమునకు ణత్వము రావలెను. అది అట్ప్రత్యాహార వర్ణములతోడను, కప వర్గీయములతోడను వ్యవధానమున విహితము. విసర్గ జిహ్వామూలీయోపధ్మా నీయములు అట్ప్రత్యాహార ఘటకములైన నయ్యది సిద్ధించును. అందులకై వానికి 'అఇఉణ్' సూత్రమునందు, అకారము (మీద ఇకారమునకు) ముందు ఉపదేశమును జేయవలెను.

అటులనే శర్రులందును వానికి బాఠమావశ్యకము. అపుడు వానికి ఝల్త్వము సిద్ధించి "ఝలాంజశ్ ఝశి" (8-4-53) అని జశ్త్వములు వచ్చును. 'ఉబ్జితా' 'ఉబ్జితుమ్' అనునవి యుదాహరణములు. ఈ ఉబ్జ ధాతువు, ఉపదేశమున ఉపధ్మానీయముపధగా గలది. అనగా ఉఃజ అని పఠింపబడినది. దాని ఉపధ్మా నీయమునకు జశ్త్వము చేయగా బకారము సిద్ధించును. అది ఝల్త్వాధీనము.

ఉబ్జ ధాతువుపధ్మానీయోపధముగ బఠింపబడిన, 'ఉబ్జి జిషతి' అని కావలసిన రూపము సిద్ధింపదు. అది సన్నంతము. అట ద్విత్వము ఉకారము తరు వాతి ద్వితీయైకాచ్చుకు "అజాదేర్ద్వితీయస్య" 6-1-2 అనుటచే, రావలసి యుండును. అపుడు 'ఃజి' అనునది ద్వితీయైకాచ్చగును. దానికి ద్విర్వచనము వచ్చిన 'ఉబిబ్జిషతి' అని కావలసి వచ్చుచున్నది. ఆ ధాతువు దకారోపధమనిన, "నన్ద్రాః సంయోగాదయః" 6-1-3 అని అచ్చుకు పరమైన సంయోగాది దకార మునకు ద్విర్వచనము నిషిద్ధమైనందున జిస్ శబ్దమునకు ద్విర్వచనము సిద్ధించును. వక్ష్యమాణరీతిగా దకారమునకు బకారమగును.

దకారోపధముగ బఠింపబడిన, 'ఉబ్జితా' 'ఉబ్జితుమ్' అనురూపము లెట్లు సిద్ధింపవలెను ? అనిన,

అసిద్ధకాండమున, అనగా, త్రిపాదిలో, "స్తోశ్చునాశ్చుః" 8-4-40 అను సూత్రమునకు తరువాత 'భఉద్జః'- అని చెప్పెదను. ఉద్జధాతువునకు, చవర్గ సంయోగమున, భకార మాదేశమగునని దాని కర్థము. గావున నా రూపములు సిద్ధింపగలవు.

అటులైన 'ఖఉద్ఞః' అని యపూర్వముగ జెప్పవలసివచ్చుటయే గౌరవ మగునుగదా యనిన,

చెప్పనక్కరలేదు. నిపాతమువలన నది సిద్ధించును.

ఏ నిపాతమువలన ? "భుజన్యుబ్జౌపాణ్యుపతాపయోః"17-3-61 అను నిపాతనువలన. న్యుబ్జ శబ్దమునందు, జకారమునకు, కుత్వము రాకుండుటకై ఆ సూత్రమున నా శబ్దము నిపతింపబడినది. అందు బకారమును పాణిని యుచ్చరించుటచే దకార స్థానమున బకారమాదేశముగా వచ్చినదని గ్రహింపదగినది.

అట్లైన 'అభ్యుద్గః' 'సముద్గః' అను రూపములందు గూడ దకారమునకు' బకారము రావలసియుండునే ? అనిన,

అనిపాతనము, కుత్వమునకు విషయముగాని స్థలముననే పై రూపములలో జకారము కుత్వముచే, దకారమయినదిగదా.

లేదా, ఇవి ఉబ్జధాతురూపములే కావనవచ్చును. అభి + ఉద్, సం + ఉద్, అను నుపసర్గలుగల 'గమ్' ధాతువువలన నిష్పన్నములయినవగును. 'అభ్యుద్గః' అనిన 'అభ్యుద్గతః' అనియు, 'సముద్గః' అనిన 'సముద్గతః' అనియు నర్థము.

కాగా అయోగవాహములకు శర్రులలో నుపదేశమునకు ప్రయోజనము వార్తికకృత్సమ్మతమైనదయినను అన్యథా సిద్ధముగాన, జశ్ భావరూప ప్రయోజనము లేదని తాత్పర్యము.

అయోగ వాహములకు శర్రులందుపదేశమునకు షత్వముగూడ ప్రయోజనము. 'సర్పిఃషు', 'ధనుఃషు' - అనురూపములలో, సప్తమీ బహువచన ప్రత్యయ సకారమునకు "నుమ్విసర్జనీయశర్వ్యవాయేపి" 8-3-58 అను షత్వము శర్వ్యవాయము కలదు గాన సిద్ధించింది. అందు విసర్జనీయ పదమును గలదు గదా యనిన, నదియూ సూత్రముననవావశ్యకము. పాణినిని దానినందు చెప్పనక్కరయే లేదు.

అట్లైన 'నుమ్' అను పదమును నందనావశ్యకమేయగును గదాయనిన, 'సర్పీంషి', 'ధనూంషి' సిద్ధించుట యెట్లు ? నుమ్మునకారమునకు అనుస్వార ప్రవర్తించిన తరువాత, నదియు శర్రగును గాన 'శర్వ్యవాయే' అనియే సిద్ధించును గదా.

కాని నుమ్గ్రహణము అవశ్యకర్తవ్యము. అది అనుస్వారకు విశేషణము కావలెను. అనగా నుమ్మున్థానమున వచ్చిన యనుస్వారముతో వ్యవధానమున నే షత్వమిష్టముగాని మకారస్థానికానుస్వార వ్యవధానముననగూడ వచ్చుట సమ్మతముగాదు. 'పుంసు' అనుచో షత్వము సమ్మతముగాదు.

లేదా, ప్రయోజనవిశేషమును నిర్దేశింపక సకల ప్రయోజనోద్దేశముతో,

నెచ్చటెచ్చటనుపదేశించిన నాయా ప్రయోజనములు సిద్ధించునో యచ్చటనెల్ల నీ అయోగవాహములకుపదేశము చేయనగును.

అట్లుచేయుటకు ప్రయోజనవిశేషమేమి ?

**"అవిశేషేణసంయోగోపధా సంజ్ఞాఅలోన్త్యద్విర్వచన - స్థానివద్భావ ప్రతిషేధాః" - అని వార్తికము.**

అవిశేషోపదేశమునకు, సంయోగసంజ్ఞయు, ఉపధాసంజ్ఞయు, అలోన్త్య విధియు, ద్విర్వచనమును, స్థానివద్భావ ప్రతిషేధమును ప్రయోజనములు.

'ఉ౩బ్జక' అని సంబోధనాంతము. అట ఉపధ్మానీయజకారములకు "హలోనన్తరాః సంయోగః" 1.1.7 అని సంయోగసంజ్ఞయు, "సంయోగే గురు 1.4.12 అని ఉకారమునకు గురు సంజ్ఞయు, "గురోరనృతోనన్త్యస్యాప్యేకస్య ప్రాచామ్" 8 2.86 అని దానికి ప్లుతమును సిద్ధించుట ప్రయోజనము. ఉ కారము గురువగుటకు, ఉపధ్మానీయ జకారములకు సంయోగసంజ్ఞ కలుగ వలెను.

ఉపధాసంజ్ఞ సిద్ధించుటయు నవిశేషోపదేశమునకు ప్రయోజనము. ఉపధ యనగా జివరి యల్లునకు వెనుకనున్న వర్ణము. దుః + కృతమ్ అనుచోట, ఉకా రముపధగాగల విసర్గకు షత్వము వచ్చును. 'దుష్కృతమ్' అని యగును. ఉపధయనగా చివరి అల్లునకు వెనుకదిగదా. చివరిది అల్ప్రత్యాహారఘటకమైన దానివెనుక వర్ణ ముపధయగును. అందులకై అయోగవాహమైన విసర్గకు, ఉప దేశమావశ్యకము. ఇట్లే 'నిష్కృతమ్', 'నిష్పీతమ్', 'దుష్పీతమ్' అనునవియు నుదాహరణములు.

"ఇదుదుపధస్యచాప్రత్యయస్య" 8 3.41 అను సూత్రమునందలి 'ఇదుదుప ధస్య' అనుపదముచే విసర్జనీయముగాదు. విశేషింపబడునది. ఇకనేది ? అనిన, సకారము విశేషింపబడును. 'ఇదుదుపధమైన సకారముయొక్క విసర్గకు' అని యర్థము వివక్షితము.

లేదా ఆ సూత్రమునందు ఉపధాపదమే లేకుండజేసి ఇదుత్తులకంటెబర మగు విసర్జనీయకు షత్వమగునని, ఇదుత్తులచే విసర్జనీయమునే విశేషింప జేయుదుము. కాగా నిది ప్రయోజనముగాదు.

ఇక 'అలోన్త్యవిధి' రూప ప్రయోజనమును జూతము. వృక్షః + తరతి, ప్లక్షః + తరతి, అనుచోట్ల 'విసర్జనీయాన్తమగు పదమునకు సత్వము వచ్చును' అని విధింపబడిన సత్వము చివరి అల్లునకు,"అలోన్త్యస్య" 1.1.52అను సూత్ర ముచేరావలెను. విసర్జనీయమునకల్త్వము లేనిచో నది సిద్ధింపదు. అందులకై అవి శేషోపదేశము.

కాని యిదియు ప్రయోజనముకాదు. ఆదేశములు సూత్రములందు నిర్దిశ్యమానమైన వానికే ప్రవర్తించును. "విసర్జనీయస్యసః" - 8.3.34 అను సూత్రమున నుచ్చారితమైనది విసర్జనీయపదమే కావున దానికే సత్వము వచ్చును.

ఇక ద్విర్వచన ప్రయోజనము. "ఉరఁల్కకః", "ఉరఁప్పపః" - అనురూపము లలో, జిహ్వామూలీయోపధ్మానీయులకుద్విత్వము కలిగినది. 'అనచిచ' అను 8 4.47 వ సూత్రము అచ్చుకంటెబరమయిన యర్రునకు ద్విత్వమును బోధించు చున్నది. జిహ్వామూలీయోపధ్మానీయములకు ద్విత్వము యర్త్వాధీనముగాన వానికి యరన్తత్వావ సిద్ధికొఱకు ఉపదేశమావశ్యకమని భావము. వానికి ద్విరుచ్చారణములో విశేషము ఏమియు నగపడదు. ఉచ్చారణము సాధ్య మునుగాదు. కాగా శాస్త్ర ప్రాప్తి మాత్రముచేత ద్విర్వచనము ప్రయోజన మనదగును.

స్థానివద్భావ ప్రతిషేధమును వీని యుపదేశమునకు ప్రయోజనము. 'ఉరఃకేణ' 'ఉరఃపేణ' అనుచోట్ల విసర్గ వ్యవధానమున, 'అడ్వ్యావాయేపి' అని ణత్వము ప్రవర్తించినట్లు 'వ్యూఢోరస్కేన' 'మహోరస్కేన' అనుచోటను విసర్గ స్థానిక సకారమునకు, స్థానివద్భావముచేత, అట్త్వము లభించునుగాన ణత్వము ప్రాప్తించుచున్నది. "అనల్విధౌ"- అలాశ్రయవిధి కర్తవ్యమయినపుడు స్థానివద్భావము ప్రవర్తింపదు. అను నిషేధము వలన నది ప్రవర్తింపదు. అని చెప్పి దానిని వారింపవలెను. అల్లనగా ఇచట విసర్జనీయము, తదాశ్రయవిధి ణత్వము. అది కర్తవ్యముగాన స్థానివద్భావము నిషిద్ధము. ఈ ప్రతిషేధసిద్ధి అయోగవాహముల యుపదేశమునకు ప్రయోజనమని పర్యవసితము.

వార్తికకర్తచే <u>ఫలపంచకము అయోగవాహోపదేశమునకు చెప్పబడినది</u>. అందు మొదటిది 'ఉబ్బ' ధాతువు దకారోపధమను పక్షమున ఫలముకాదు ద్విర్వచనమును నంత విశేషఫలము గాదు. ఇకనొక స్థానివద్భావ ప్రతినిషేధమే ప్రయోజనమని తేలినది.

## "వర్ణముల అర్థవత్తా విచారము"

'అ ఇ ఉ ణ్'- ఇత్యాది సూత్రములచే నుపదేశింపబడిన యీ వర్ణము లర్థవంతములా ? అనర్థకములా ? అని విచారము.

(1) "అర్థవన్తోవర్ణ ధాతు ప్రాతిపదిక ప్రత్యయ నిపాతానా మేకవర్ణానా మర్థదర్శనాత్"

(2) "వర్ణవ్యత్యయేచార్థాన్తర గమనాత్"

(3) "వర్ణానుపలబ్ధౌ చానర్థగతేః"

(4) "సంఘాతార్థవత్త్వాచ్చ"- అను నీనాలుగు వార్తికములు అర్థవత్తా సాధకములు.

"సంఘాతస్యైకార్థ్యాత్సుబభావో వర్ణాత్" అను వార్తికము అర్థవత్తా పక్షమున దోషనిరాకరణ వార్తికము.

(1) "అనర్థకాస్తు ప్రతివర్ణమర్థానుపలబ్ధేః

(2) "వర్ణవ్యత్యయాపాయోపజనవికారేష్వర్థదర్శనాత్"- అను నీ రెండు వార్తికములును అనర్థకతా సాధక వార్తికములు.

వర్ణములర్థవంతములే. ఎందువలన ? ధాతువులు, ప్రాతిపదికములు, ప్రత్యయములు, నిపాతములు - ఇవి ఏకవర్ణాత్మకములయినవిగూడ అర్థము కలవిగా నగపడుచున్నవిగనుక.

'ఏతి', 'అధ్యేతి', 'అధీతే' - ఇందు ఇకారమాత్రమే ధాతువు. అది అర్థవంతము.

'ఆభ్యామ్', 'ఏభిః', 'ఏషు' - ఈ పదములలో ప్రాతిపదికము 'అ' అను వర్ణమాత్రము. ఇది 'ఇదమ్' అను ప్రాతిపదికమునందు శేషించినది. ఇదియు నర్థవంతము.

'ఔపగవః', 'కాపటవః' - ఇందు 'అ' అను అకారమాత్రము ప్రత్యయము. అది యర్థవంతము.

'అ అపేహి' 'ఇ ఇంద్రం పశ్య' 'ఉ ఉత్తిష్ఠ' 'అ అపక్రామ' - ఇందు ఏకవర్ణనిపాతలగు 'అ' 'ఇ' 'ఉ' అనునవి అర్థవంతములుగానున్నవి. ఇట్లు ధాతుప్రాతిపదిక ప్రత్యయనిపాతములకేకవర్ణముల కర్థము కనబడుచుండుటవలన వర్ణములు అర్థవంతములని తలంతుము.

మఱియు, ఒక వర్ణము తొలగి వేఱొక వర్ణము కనబడినపుడు అర్థాంతరము ప్రతీతమగుటవలనను, వర్ణములర్థవంతములని తలంతుము. కూప, సూప, యూప శబ్దములను జూడుడు. ఈ మూడు శబ్దములందును 'ఊప' అను భాగము సమానము. ఆ 'ఊప' అనునది కకారసహితమయినపుడు 'నుయ్యి' అనునర్థము గలది. అదియే కకారము తొలగి సకారము చేరినపుడు 'పప్పు' అనునర్థము నిచ్చుచున్నది. అందుకకారసకారములు రెండును తొలగి, యకారము చేరగా నది 'యూపస్తంభము' అనునర్థమునుపస్థాపించుచున్నది.

దానివలన, కూపపదమునందలి 'నుయ్యి' అనునర్థము, కకారవాచ్యము అనియు, సూపపదము బోధించు 'పప్పు' అనునర్థము సకారవాచ్యమనియు, యూపపదార్థమగు 'యూపస్తంభము' యకారవాచ్యమనియు దలంచుచున్నాము.

ఆ యా వర్ణములు లేనపుడు, అర్థావగతి లేనందునను, వర్ణములే యర్థవంతములని దలంచుచున్నాము 'వృక్షః' 'ఋక్షః' 'కాణ్డీరః' 'ఆండీరః' అను పదములను జూడుడు. 'వృక్షః' అను పదము వకారముతో గూడియున్నపుడు, 'చెట్టు' అనునర్థమును బోధించుచున్నది. అదియే, వకారము తొలగినపుడా యర్థము నీయలేదు. అట్లే, 'కాణ్డీరః' అనుపదము కకారసహితమయినపుడు, 'బాణధారి' అనునర్థము గలది. అది లేనపుడు 'అండముగలది' యనునర్థము నిచ్చునుగాని ఆ యర్థమునీయదు.

ఆ వర్ణముపలబ్ధముకానపుడర్థావగతి లేదందువేమి? లేకపోలేదే చక్కగ నర్థస్ఫూర్తి కలుగుచునేయున్నదే? అనిన, ఆ వార్తికమును, "వర్ణానుపలబ్ధౌ చాతదర్థగతేః" అని పఠింపదగును.

'అతదర్థగతేః' - అనగానేమి ?

దాని యర్థము = తదర్థము, తదర్థము యొక్క గతి = తదర్థగతి; తదర్థగతి లేకుండుట అతదర్థగతి, దానివలన = అతదర్థగతేః॥ లేదా, ఆ అర్థము = తదర్థము, దాని గతి = తదర్థగతి, అది లేకుండుట = అతదర్థగతి, దాని వలన - అనియును విగ్రహింపవచ్చును. 'ఆ వర్ణము యొక్క అర్థము, లేదా ఆ ప్రకృతార్థము ప్రతీయమానము కాకుండుటవలన' అని తాత్పర్యము.

అటులైన వార్తికన్యాసమున ఆ విధముగ మార్పవలయునన్నమాట. అక్కఱలేదు. ఆ శబ్దమున నుత్తరపదమునకు లోపముకలిగినదని భావింపవలెను. 'ఉష్ట్రముఖః' 'ఖరముఖః' - అని వ్యవహరించుచున్నారు. 'ఒంటెముఖమువంటి ముఖము కలవాడు', 'గాడిదముఖము వంటి ముఖము కలవాడు' అనిగదా యర్థము. గతార్థమగుటవలన నట రెండవ ముఖశబ్దము ప్రయోగింపబడలేదు. ఆ విధముగనే, 'అనర్థగతేః' అనుపదమున, తచ్ఛబ్దమునకు అప్రయోగమెఱుంగదగినది.

మఱియు ఏ వర్ణములసంఘాతములర్థవంతములో, వాని యవయవములును నర్థవంతములగునని తలంతుము. వేని యవయవములు అర్థవిరహితములో వాని సముదాయములును నట్టివే. ఎట్లనగా - కన్నుగల యొకడు చూడగలుగుచున్నాడనిన అట్టివారు వందమందియయినను దర్శనసమర్థులే. ఒక నువ్వులగింజ నూనెగలదియయిన, నట్టిగింజలు పుట్టెడుకూడ తైలదానసమర్థము లగును. వేని యవయవములనర్థకములో వాని సముదాయములును ననర్థకములెట్లనగా, ఒక అన్ధుడు దర్శనాసమర్థుడు. అట్టి అంధులు వందమందియునంతే. ఒక ఇసుకరేణువును తైలమునీయలేదు. ఆ రేణువులు నూరుపుట్లైనను చమురు నీయలేనివే. కాగా వర్ణముల సముదాయము అర్థవంతములుగానున్నందున, వాని యవయవములగు ప్రత్యేక వర్ణములును నర్థవంతములే యనవచ్చును.

వర్ణములును నర్థవంతములయినవానికిని అర్థవంతములకు గలుగు కార్యములు రావలసియుండునే ?

ఆ కార్యములేయవి ?

'అర్థవత్ ప్రాతిపదికమ్' - అనిచెప్పిన ప్రాతిపదికత్వము 'ప్రాతిపదికాత్' - అని దానికంటెబరముగా స్వాదిప్రత్యయములు పుట్టుట, తదన్తమునకు 'సుబన్తంపదమ్' అని పదసంజ్ఞయు ఆ కార్యములు.

అయినగానిమ్ము. దోషమేమి ?

'ధనమ్' 'వనమ్' మున్నగు శబ్దములందు, 'పదస్య' అని పదమునకు విహితమయిన నలోపము మున్నగు కార్యము వర్ణమునకుగూడ రావలసి వచ్చును.

ఈ యాక్షేపమునకు సమాధానము "సంఘాతస్యైక కార్థ్యాత్ సుబభావో వర్ణాత్" అను వార్తికము.

'వృక్షః' - మున్నగు పదములందు విభక్తి, ఏకత్వసంఖ్యను బోధించుచున్నది. అచటగల సంఖ్య ఏకత్వమొక్కటియే. దానిని దెలియజేయుటకొక యేకవచనమే చాలును. సంఘాతమునకుగూడ నేకత్వమర్థము. కాగా విభక్తి సముదాయమునకంటె బరముగనేవచ్చునుగాని అవయవవర్ణములకు బరముగా రాదు.

ఇట్లనుమానప్రమాణముచేత వర్ణములకర్థవత్త్వమును సాధించినను ప్రత్యక్షవిరోధమువలన నయ్యది యనర్థకముతేయని చెప్పవలసియుండును.

వర్ణములర్థవిరహితములే. అర్థవంతములుకావు. ఎందువలన ? ప్రతివర్ణమును అర్థోపలబ్ధి లేనందున. అక్షరమక్షరమునకును నర్థముపస్థితమగుటలేదు గదా ?

"ప్రతివర్ణమ్" అనగానేమి ?

వీప్సార్థమునందది అవ్యయీభావసమాసము. కాగా, 'ప్రత్యేకవర్ణములకు' - అని యర్థము.

మఱియు, వర్ణముల వ్యత్యయము, అపాయము, ఉపజనము, వికారము - ఇవి కలిగినను, అవి కలుగనపుడున్నయర్థమే కనబడుచుండుటవలన వర్ణములనర్థకములని తలంతుము.

వర్ణవ్యత్యయము - 'కృతీఛేదనే', 'కృతీవేష్టనే' అను ధాతువులవలన నిష్పన్నమయిన 'తర్కుః' అను పదమునందును, 'కసగతౌ' అను ధాతువున నిష్పన్నమయిన 'సికతా' శబ్దమునందును, 'హిసి = హింసాయామ్' అను

ధాతువున నిష్పన్నమయిన 'సింహః' అనుపదమునందును నగపడుచున్నది. అటనర్థవ్యత్యయములేదు.

అపాయమనగా లోపము – 'హతః', 'ఘ్నన్తి', 'ఘ్నన్తు', 'అఘ్నన్' ఈ పదములందు వర్ణములో లోపించినను, అర్థమున మార్పులేదు.

ఉపజననమనగా ఆగమము. ఉప = సమీపే, జాయతే అని వ్యుత్పత్తి. 'లవితా' 'లవితుమ్' అను పదములందికారముపజనము. కాని అర్థమునందాధికల్ మగపడదు.

వికారమనగా అన్యథాభావము. మార్పు. ఆదేశమనుట. 'ఘాతయతి' 'ఘాతకః' – అను పదములందు, హకార నకారములు ఘకారతకారములుగా మారినను, అర్థమునందు మార్పులేదు. వర్ణములర్థవంతములయినయెడల, వానికి వ్యత్యయాదులు కలిగినపుడు, అర్థమునకుగూడ నవి కలుగవలెను. అట్లు కలుగుటలేదు. అందువలన వర్ణములు అనర్థకములని తలంతుము.

సరి. వర్ణముల విషయములో, అవి యర్థవంతములనియు, కావనియు రెండుపక్షములును నుపపాదింపబడినవి. అందేదిన్యాయ్యము ?

రెండుపక్షములును న్యాయయుతములే. ఏలయన, అయ్యది స్వాభావికము.

కొన్నివర్ణము లర్థవంతములగుట వానికి స్వభావము. అట్లే కొన్ని యర్థవంతములు కాకుండుటయు స్వభావమే. కార్యసాధనమునకై యత్నించు వారందఱును తుల్యరూపమగుయత్నమునే జేయుదురు. అధ్యయనము చేయు వారును ఏకరూపముగనే చేయుదురు. కాని కొందఱకే ఫలసిద్ధికలుగుచున్నది. ఇతరులకు గలుగలేదు. ఒకడు సఫలుడైన నందఱును సఫలులగుట శక్యము గాదు. ఒకని యత్నము ఫలింపకుండిన నందఱియత్నములును ఫలింపకుండ నుండవలెనను నియమములేదు. ఏకవర్ణములగు ధాతుప్రాతిపదికప్రత్యయ నిపాతము లర్థవంతములుగానుండి తదితరము లర్థవిరహితములుగనున్నవివిన, మనమేమి చేయగలము ? అది స్వాభావికమాయె.

అట్లైన, ఏకవర్ణములయిన ధాతుప్రాతిపదికప్రత్యయనిపాతము లర్థవంతములుగనుకను, వర్ణవ్యత్యయములందర్థాంతరప్రతీతివలనను, ఆ వర్ణము లేనపుడాయర్థముగాక వేఱొకయర్థము ప్రతీతమగుటవలనను, సంఘాతము లర్థవంతములగుటవలనను – అని యీరీతిగా, వాని యర్థవత్తకు హేతువులను మీరెట్లుపదేశించితిరి ?

సమాధానము – 'కూపః' 'సూపః' 'యూపః' అనునిట్టివి, అర్థాన్తర బోధకములగు వేఱువేఱుసంఘాతములే. అట్లుగాక వర్ణవ్యత్యయమువలన నట నర్థాంతరప్రతీతియనిన, సూపపదమునందు, కూపపదార్థమధికముగనుండవలెను.

అట్లే, సూపార్థము కూపపదమున, కూపార్థము యూపపదమున, యూపార్థము కూపపదముననను, సూపార్థము యూపమున, యూపార్థము సూపమున నుండ వలెను. 'ఊప' అను నధికభాగమన్నిపదములందును తుల్యముగదా. సూపార్థము యూపమునందుగాని, యూపార్థము కూపమునగాని, కూపార్థము యూపమున గాని, సూపార్థము కూపమునగాని, కూపార్థము సూపమునగాని, యూపార్థము సూపమునగాని కొంచెముకూడ లేనందున, నివి వేఱుసంఘాతములే తత్తదర్థ బోధకములని తలంచుచున్నాము.

మఱియు, వర్ణములర్థవంతములని హేతువులచే సాధించుచునే మీరు వాని అనర్థకత్వమునుగూడ బాగుగ వ్యక్తముచేయుచున్నారు. కూపపదము నందలి కూపార్థము కకారమాత్రవాచ్యమే, సూపపదమునందలి సూపార్థము సకారమాత్రవాచ్యమే, యూపపదసంబంధి యూపరూపార్థము యకారమాత్ర వాచ్యము అనితలంచువానికి, ఊపశబ్దమనర్థకమేగదా.

సరి. 'సంఘాతములర్థవంతములుగాన నవయవములును నర్థవంతములే' యనుచో జెప్పబడినహేతువు పరిహృతముకాలేదే ?

దీనికిని పరిహారమును, ప్రాతిపదికసంజ్ఞాసూత్రమునందు వార్తికకర్త చెప్పగలడు.

"దృష్టోహ్యతదర్థేన గుణేనగుణినోర్థభావః సురాంగవత్రథాంగవచ్చ" - అని యచట వార్తికము.

రథచక్రములకు ప్రత్యేకముగ వ్రజిక్రియాసామర్థ్యము లేదు. సముదాయ మునకుమాత్రమేకలదు. ఆ విధముగనే, సురావయవములకు ప్రత్యేకముగలేని మాదకత్వము సముదాయమునకుగలదు. కావున సముదాయమర్థవన్తమైన నవయవములుగూడ నర్థవంతములుకావలెననుమాట వ్యభిచరితము.

### "ప్రత్యాహారములందిత్సంజ్ఞకవర్ణములకు గ్రహణములేదు"

"అఇఉణ్" "ఋౡక్" "ఏఓఙ్" "ఐఔచ్" - అజ్బోధకసూత్రములయిన పై నాలుగుసూత్రములందలి అనుబంధవర్ణములయిన చివరి ణ్, క్, ఙ్, చ్ - అను వర్ణములకు 'అచ్' పదఘటితసూత్రములందచ్చులుగా గ్రహణమేలలేదు ?

శ్లోకవార్తికము - "ప్రత్యాహారేనుబంధానాం కథమజ్గ్రహణేషు న ?"

గ్రహణముండిననేమగును? 'దధి + ణకారీయతి' 'మధు + ణకారీయతి' అనుచోట, "ఇకోయణచి" 6.1.77 అను సూత్రముచేత యణాదేశము రావలసి యుండును.

శ్లో. వార్తికఖండము - "ఆచారాత్" అనునది, ఆచారమువలన నిత్సంజ్ఞ కములకు ప్రత్యాహారములందు గ్రహణము లేదని చెప్పుచున్నది ఆచారమనగా

క్షేమి ? ఆచార్యుల వ్యవహారము. ఇవిపరములయినపుడాచార్యులు "తృషిమృషి కృషేః కాశ్యపస్య" ఇత్యాదులందు యణాదేశమును ప్రవర్తింపజేయలేదు.

శ్లో. వార్తికఖండము - "అప్రధానత్వాత్" అప్రాధాన్యమువలనను వానికందు గ్రహణములేదు. దీనికి అచ్ప్రత్యాహారబోధకసూత్రములందు ప్రధానముగా ఉపదేశముచేయబడలేదుగదా.

ఇకనెచ్చట వానికి ప్రధానోపదేశము చేయఁబడినది ?

హల్లులలో, ఎందువలననట్లు తలంపవలెను ?

తుల్యజాతీయములను, తుల్యజాతీయములలో నుపదేశించుట, ఆచార్యుని శైలిగా నగపడుచున్నది. అనగా అచ్చులందచ్చులను, హల్లులందు హల్లులను సమవధానముతో నాచార్యులుపదేశించిరి కాగా నా నాలుగుసూత్రములందును నిత్సంజ్ఞకవర్ణములప్రధానముగ నిర్దిష్టములగుటచే వానికి అజాదిసంజ్ఞలు ప్రవర్తింపవు.

మఱియు, వానికి లోకము బలవత్తరము. "లోపశ్చబలవత్తరః" అని శ్లోకవార్తికచతుర్థపాదము. "తస్యలోపః" 1.3.9 అను సూత్రముచే విధింపబడిన లోపము, ఇద్వర్ణములకు, ఇతర సంజ్ఞలకంటె ముందుగ ప్రవర్తించును. కావున "ఆదిరన్త్యేనసహేతా" 1.1-71 అను సూత్రముచే, అచ్సంజ్ఞప్రవర్తించుకాలమున నవి యందుండనేయుండవుగాన నా ణకారాదులకచ్సంజ్ఞాప్రాప్తియేలేదు.

ఇట వార్తికాన్తరము - "ఊకాలోజితివాయోగః । తత్కాలానాం యథాభవేత్ । అచాంగ్రహణమచ్కార్యం । తేనైషాం నభవిష్యతి ॥"

"తత్కాలనములైన యచ్చులకే అచ్పదముచే గ్రహణము కలుగుటకై "ఊకాలోచ్" అని యోగ విభాగము నయిన జేయవచ్చును. ఉ, ఊ ఊ౩ అను వర్ణముల యుచ్చారణ కాలముతో సదృశమయిన యుచ్చారణ కాలము గలవి యచ్చులగును" అని యర్థము. ఉపదేశమువలనను గ్రహణక శాస్త్రము వలనను, అకారాదుల కచ్త్వము సిద్ధించునుగాన నీ విభక్తసూత్రము కాలవిశేష పరిచ్ఛిన్నములకే యచ్త్వమును నియమించును. అనుబంధములు ఏకద్విత్రి మాత్రికములు గావుగాన ణకారాదుల కచ్కార్యప్రసక్తి లేదు. ఆ ఊ కాలము క్రమముగ హ్రస్వము దీర్ఘము ప్లుతము నగునని "హ్రస్వదీర్ఘప్లుతః" అను సూత్ర భాగము బోధించును.

అయినను, "కుక్కుటః" అను పదమునందు, కకారద్వయము మాత్రిక వర్ణముగదా దానిని 'ఋలక్' సూత్రమునందలి కకారము జాతి నిర్దేశముచే గ్రహించిన, అది యచ్చగును. కాగా నట యణాదేశము రావలసియున్నది' అనిన, దీనికి పరిహారము పూర్వము చెప్పబడినది. అనగా మాత్రికములయిన వ్యంజనములు లేవు అనుట. కావున నీ దోషము లేదు.

ఈయర్థమే మఱియొకతీరుగా వార్తికకారునిచేత, 'అపర ఆహ' ఇంకొక వార్తికకర్త యిట్లు చెప్పెను అనుచు, "హ్రస్వాదీనాం వచనాత్ర్యాగ్యావత్తావ దేవయోగోస్తు । అచాఽకార్యాణి యథాస్యుస్తత్కాలేష్వతుకార్యాణి" అను వార్తికముచే బోధింపబడెను.

'హ్రస్వదీర్ఘప్లుతః' అను పదమునకుపూర్వము, సూత్రమున నెంతవఱకు గలదో యంతభాగమే సూత్రమగుగాక.

అనగా "ఊకాలోచ్" అనునది వేఱుసూత్రమగును. దానికి ఫలము, అజ్నిమిత్తకకార్యములు తత్కాలాచ్చులయందే ప్రవర్తించుట. అనగా హ్రస్వదీర్ఘప్లుతములగునవి అచ్చులు, దానివలన, వ్యంజనములట్టివికావుగాన ణకార కకారాదులకచ్త్వముకలుగదు.

"ఇట అంతస్థాక్షరోపదేశఫలవిచారము"

య, ర, ల, వ అను అంతస్థాక్షరములకు అణ్వర్ణములనడుమ నుపదేశమునకేమిఫలము ? అని ప్రశ్న. అవి 'ఇణ్' ప్రత్యాహారగ్రాహ్యములగుటకు ఇట పాఠము అవశ్యకర్తవ్యమే. అయినను, వానికి అణ్ ప్రత్యాహారబోధ్యత్వ మెందులకు? గ్రాహకసూత్రమున నణ్పదముచే వీనికి గ్రహణము లేకున్న నేమి ? అట 'అజాదిత్సవర్ణస్య' అనియే పఠింపవచ్చునుగదా ? అని ప్రశ్న తాత్పర్యము.

ప్రయోజనము కలదు. 'సయ్య్యన్తా' 'సవ్వ్వత్సరః' 'యల్ల్లోకమ్' 'తల్ల్లోకమ్' - ఈ రూపములను జూతము. 'సమ్' అనునది యుపసర్గము. దాని మకారమునకనుస్వారాదేశము. దానికి పరసవర్ణము వచ్చుటకుముందుగనే ద్విత్వమువచ్చును. పరసవర్ణమసిద్ధమగునుగదా ! రెండను స్వారలలో రెండవయనుస్వారమునకు పరసవర్ణములైన 'యవల'లు వచ్చును. తదుపరి పూర్వానుస్వారమునకు, "అనుస్వారస్యయయిపరసవర్ణః" 8 4.58 అని అనునాసిక యవలలు రావలెను. ఇందులకు ద్వితీయానునాసిక యవలలు 'యయ్' లు కావలయునుగదా. ఈ సూత్రమునందలి యవలలు, గ్రాహకశాస్త్రముచే వానిని గ్రహింపవలెను.

ఈ ప్రయోజనము సిద్ధించుటకై 'యవల' లకు అణ్త్వము లభించుటకు, అణ్గ్రాహక సూత్రముల నడుమ నుపదేశమును, గ్రాహకసూత్రమునందు అణ్పదమును ఆవశ్యకములు.

ఇది ప్రయోజనము కాదు. 'పరసవర్ణమసిద్ధమగునుగాన అనుస్వారము నకే ద్విర్వచనము వచ్చును' అని గదా దోషాపాదనము. "ద్విర్వచనము కర్తవ్యమయినపుడు పరసవర్ణమును సిద్ధమేయగును" అని ముందు జెప్పబడును. సిద్ధమే గనుక నదియే ముందు బ్రవర్తించును.

కానిమ్ము, పరసవర్ణము చేయబడిన తరువాత నా పరసవర్ణమునకు ద్విర్వచనము రావలెను గదా. అందులకై దానికి యర్గ్రిహణముచే గ్రహణ మావశ్యకము. కాగా నపుడు ద్విర్వచనసిద్ధియే ప్రయోజనమగును.

ద్విర్వచనము రాకపోయిన నేమి ? అది రానేవలదు.

ద్విర్వచనము వచ్చి నపుడు మూడు యకారములు గలదియు, లేనపుడు రెండు యకారములు గలదియు గదా రూపము వినబడును. ఇట్లు శ్రుతికృత మగు భేదము స్పష్టము గదా.

ఆ భేదముండదు. ద్విర్వచనము వచ్చినను రెండు యకారములుగల రూపమే యుండును. ఎట్లన "హలోయమాంయమిలోపః" 8-4-64 అని యొక యకారమునకు లోపము వచ్చును.

అయినను భేదము తప్పదు. ద్విర్వచనము వచ్చినపుడు, ఒకసారి రెండు యకారములు గలదియు వేరొకసారి మూడు యకారములు గలదియు రూప ముండును. ద్విర్వచనము లేనపుడు, రెండు యకారములు గలదే యుండును. అది భేదమెందుకుగాదు ? లోపము నిత్యమగుచో అది భేదము కాకుండెడిది. ఆ లోపము వికల్పమాయెగదా !

అటులైన భేద మెట్లు లేకుండునో యట్లే కానిమ్ము. విభాషాపదము ఆ సూత్రములోని కనువర్తింపకుండుగాక.

"అనువర్తతే విభాషా శరోచి యద్వారయత్యయం ద్విత్వమ్" అని సమాధాన వార్తిక పూర్వార్ధము.

'శరోచి' 8-4-49 అను సూత్రముచేత, అచ్చు పరమగునపుడు శర్రులకు ద్విత్వమును నిషేధించుటచే "ఝరోఝరి సవర్ణే" 8-4-65 అను సూత్రములోనికి విభాషాగ్రహణమనువర్తించునని చెప్పక తప్పదు. 'హలోయమాం' అను సూత్ర మును మధ్యనుండుటచే నందును ననువర్తించును.కాగా నదియు వైకల్పికము. కావున 'యవలల లోపము వైకల్పికము'.

"నిత్యే హితస్యలోపే ప్రతిషేధార్థేన శశ్చిత్ స్యాత్" "ఉత్తరార్థము. శరోచి" అనునది యెట్లు జ్ఞాపక మగును? అనిన జూడుడు. "అచ్చు పరమగు నపుడు శ, ష, స లకు ద్విత్వమురాదు' అని యా సూత్రమున కర్థము. 'కర్షతి' 'వర్షతి' మున్నగునవి యుదాహరణములు. అచట, "అచో రహాభ్యాం ద్వే" 8-4-46 అని ద్విత్వము షకారమునకు బ్రాప్తించుచుండ నీ సూత్రముచే నిషే ధింప బడినది. ద్విత్వము ప్రవర్తించినను, "ఝరోఝరి సవర్ణే" 8-4-65 అను సూత్రముచే లోపము వచ్చునుగాన నిషేధము వ్యర్థము. కావున ఆ లోపము వైకల్పికము. అందు విభాషా పదమనువర్తించును, అని గమనించి పాణిన్యా

చార్యుడు ద్విత్వ నిషేధమును శాసించి యున్నాడు. కావున నట్లది జ్ఞాపకము.

కాదు. వ్యర్థమయిన గదా జ్ఞాపకమగునది? లోపము నిత్యమయినను, ప్రతిషేధ మవశ్య వక్తవ్యము. లోపము నిత్యమయిన, ద్విత్వమునకు శ్రవణమే సంభవింపదుగాన నయ్యదివ్యర్థముకాకుండుటకు లోపమునకు 'అచో రహాభ్యామ్' అను ద్విర్వచనమపవాదమని గ్రహింపబడును. ఎట్లనఁగా యమ్రులకు గదా ద్విత్వమువచ్చునది. యమ్రులనగానేవి? యమ్ములును ఝమ్రులునుగలసి యమ్ప్రత్యాహార వర్ణము లగును. ఇట లోపము వచ్చిన, ద్విర్వచనమనర్థకమే యగును గదా?

అపుడా యోగములకేమి యుదాహరణముకావలెను? ద్విర్వచనము లేకయే మూడు వ్యంజనములుగల సంయోగ ముదాహరణమగును. 'ప్రత్తమ్' 'అవత్తమ్' 'ఆదిత్యః' - 'ప్రత్తమ్' 'అవత్తమ్' అనుచోట 'దా' ధాతువు ఆకారమునకు "అచ ఉపసర్గాత్తః" 7-4-47 అను సూత్రముచే, 'క్త' ప్రత్యయము పరమగునపుడు తకారము విధింపబడినది. ధాతు దకారము చర్త్వముచే తకారమగును. క్త ప్రత్యయ తకారము మూడవది. ఇట్లు ద్విత్వము లేకున్నను మూడు తకారముల సంయోగమట సంభవము. అట నడిమి తకారమునకు లోపమును సాధించుటకు "ఝరోఝరి సవర్ణే" 8-4-65 అను సూత్రము ప్రవర్తించును.

'ఆదిత్యమ్' అనునది ణ్యప్రత్యయాంతము. ఆదిత్యుడు దేవతగాగల హవిస్సు అని యర్థము. అట ణ్యప్రత్యయ యకారమను యమ్మపరమగునపుడు, ఆదిత్యశబ్దావయవయకారమునకు "హలోయమాంయమిలోపః" 8 4 64 అని లోపము ప్రవర్తించును. అదియు ద్విత్వములేని త్రివ్యంజనసంయోగమే. కాగా 'కర్తా' 'హర్తా' 'కర్షతి' 'వర్షతి' మున్నగు స్థలములందు ద్విత్వముకలిగిన నది వ్యర్థముకాకుండుటకై లోపము ప్రవర్తింపదు. అందువలన 'శరోచి' యను ద్విత్వనిషేధము జ్ఞాపకముకాజాలదు.

లోపము నిత్యమయినను నిషేధమావశ్యకముగాన, 'అన్యతరస్యామ్' అనునిది యనువర్తించుట మిక్కిలి సందిగ్ధమైయున్నది. ఆచార్యోపదేశపారంపర్యమువలన నది యనువర్తించునని తెలియవచ్చుచున్నది. కాబట్టి, త్రివ్యంజన సంయోగము వినబడుటకు, 'అణుదిత్సూత్రమున', 'అజుదిత్సవర్ణస్య' అని రచింపక ణకారముతో ప్రత్యాహారము చేయబడినది. అది అంతస్థలకుగూడ సంగ్రాహకమగునని తాత్పర్యము. "హయవరట్"

"లణ్"

ఇందు ణకారము, పూర్వము "అఇఉణ్" సూత్రమునందును అనుబంధింపబడినది. రెండు సూత్రములందును ణకారమే ఇత్సంజ్ఞకవర్ణముగా గ్రహింపబడుటవలన, 'అణ్' 'ఇణ్', ప్రత్యాహారములుగల సూత్రములందు, పూర్వ

ణకారముతో ప్రత్యాహారమా ? పర ణకారముతోడనా ? అని సందేహము కలుగుచున్నది.

ఏ అణ్గ్రహణమున సందేహము ?

"ఢ్రలోపేపూర్వస్యదీర్ఘోణః" 6.3 111 అనుచోట సందేహము. దీనికి సమాధానవార్తికఖండము "అసందిగ్ధం పరాభావాత్" అనునది నిస్సందేహముగ, పూర్వణకారముతోడనే గాని పరణకారముతో గాదు. ఎందువలననగా - పరణకారకృత ప్రత్యాహారముచే సంగ్రాహ్యములు, పూర్వసూత్రోపాత్తాన్యములు లేవుగనుక. ఢకార రేఫలలోపమునకు నిమిత్తమయినది పరమైనపుడు, పూర్వాణ్ణులకంటె వేరయినవి లేవుగదా.

"ఆతృఢః" 'అవృఢః'- అను రూపములలో ఋకారము పరాణ్ణు కలదు గదా యనిన, సామర్థ్యమువలన పూర్వ ణకారము తోడనేగాని పరణకారముతో గాదని గ్రహింపనగును. పరణకారముతో నయిన నా సూత్రము నణ్పదముతో బనియే లేదు. "ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోచః" అనియే సూత్రమును రచించి యుండును. లేదా 'అచః' అనియు ననవక్కఱలేదు. హ్రస్వదీర్ఘప్లుతములు వచ్చునది అచ్చులకేగదా.

అటులైన "కేఽణః" 7-4-13 అను నీ సూత్రమునందలి అణ్పదమునందు సందేహము కలుగుచున్నది.

అచటను నసందేహముగ పూర్వ ణకారముతోనేగాని పర ణకారముతో గాదు. ఎందువలననగా, పరములయిన అణ్ణులు లేనందుననే. కప్రత్యయము పరమగునపుడు పరాణ్ణులు లేవుగదా.

'గోకా', 'నౌకా' అనుచో ఓకారాకారములు పరాణ్ణులు కలవు గదయ్యా ! అనిన, సామర్థ్యమువలన, పూర్వణకారముతోడనే ప్రత్యాహారము పరణకారముతోనయిన, అణ్పదమే అందక్కఱలేదు. 'కేఽచః' అనినను జాలును. అదియు అక్కరలేదు. హ్రస్వదీర్ఘప్లుతములు అచ్చునకే గదా వచ్చునది.

అటులైన "అణోప్రగృహ్యస్యానునాసికః" 8.4.57 అను సూత్రమునందలి అణ్పదమున సందేహము. అనిన, అచటను అసందిగ్ధముగ పూర్వణకారముతోడనే గాని పరణకారముతో గాదు. ఎందువలననగా - పరాణ్ణులు లేవు గనుకనే. పదాన్తములగు పరాణ్ణులు అనునాసికప్రాప్తియోగ్యములు లేవుగదా.

'కర్తృ' 'హర్తృ' అనుచోట కలవుగదయ్యా ? ,

అటులైన నచ్చటను సామర్థ్యమువలననే పూర్వాణ్ణులతో ప్రత్యాహారము. అది పూర్వాణ్ణుతోనైన 'అచోప్రగృహ్యస్యానునాసికః' అనియే చెప్పి

యుండెడిని. అచ్చులకే ప్రగ్రహ్యములగునుగాన, అందు అచః అనియు నన నక్కరలేదు.

అయైన "ఉరణ్రపరః" 1.1.51 అను సూత్రమున అణ్ పదమునందు సందేహము. అనిన, నిస్సందేహముగ అటను పూర్వణకారముతోనే ప్రత్యాహారము. ఎందువలన? పరాణ్ణులు లేవుగదా? ఋకారస్థానమున నాదేశములుగా వచ్చు పరాణ్ణులు లేనేలేవు.

'కర్త్రర్థమ్' "హర్త్రర్థమ్"- ఇట ఋకారస్థానమున ప్రవర్తించిన పరాణ్ణు రేఫ కలదిగదా యనిన, ఇట రపరత్వము వచ్చిన నేమగును? రెండు రేఫలు వినబడవలసి వచ్చును. రాదు. అందొక రేఫకు "హలోయమాంయమి లోపః" 8-4-64 అని లోపము కలుగును.

ఆ లోపము వైకల్పికము. కావుననొకపక్షమున రేఫ వినబడవలసి వచ్చునే? "రోరి" 8.3.14 అనులోపము నిత్యము. అదివచ్చును, గనుక నా దోషములేదు.

ఆ 'రోరి' లోపము 'పదాన్తస్య' అని, పదముచివరి రేఫకే వచ్చును. ఇచటనది అట్టిదికాదు.

అది పదాన్తమునకే వచ్చుననుట శక్యముగాదు. అయైన, 'అజర్ఘాః' 'అపాస్పాః' అనుచోనది సిద్ధింపకపోవును. యఙ్లుగన్తమగు గృధధాతువుయొక్క లఙ్మధ్యమపురుషైకవచనాన్త రూపము 'అజర్ఘాః' అనునది. అట్లే యఙ్లుగన్తస్పర్ధ ధాతులఙ్మద్యమైకవచనాంతము 'అపాస్పాః' అనునది. యఙ్లుగన్తగృధధాతువునకు, అభ్యాసమునందు రుగాగమము. లఙ్, సిప్, శబ్లుక్, గుణము, రపరత్వము, సిబ్లోపము, ఛష్భావము, రుత్వము, రలోపము, పూర్వాణ్ణుకు దీర్ఘము - ఈ కార్యములు ప్రవర్తింపగా ఆ రూప మేర్పడుచున్నది. ఇందు, 'అజర్ఘర్ర్' అనునవస్థలో రేఫకు 'రోరి' లోపమువచ్చును. పదాన్త రేఫమునకే ఆ లోపమనిన నిచట రాకపోవును. ఇట్లే 'అపాస్పాః' అను స్థలమునను నయ్యది ప్రవర్తింపకపోవును.

సరి. పోనిండు. 'మాతౄణాం' 'పితౄణామ్' అను స్థలములందు, ఋకారస్థానమున, "నామి" 6-4-3 అను సూత్రముచే రాదగిన దీర్ఘ ౠకారము రపరమై రావలసివచ్చును. అది ఋస్థానికమగు పరాణ్ణుగదా? అనిన, పాణిన్యాచార్యుని ప్రవృత్తి, అచట రపరత్వమునకు ప్రసక్తిలేదని తెలియచేయును. "ౠతఇద్ధాతోః" 7-1-100 అనుసూత్రమునందలి ధాతుగ్రహణము అందులకు జ్ఞాపకమగును, అనుటు.

అదియెట్లనగా - "ౠతఇద్ధాతోః" 7.1.100 అను సూత్రముచే ౠకారాన్తధాతువుల ౠకారమునకికారమును, పాణిని విధించియుండెను.

'కీర్యాత్' 'గీర్యాత్' ఇత్యాదులుదాహరణములు. 'మాతౄణామ్' ఇత్యాదులందలి ౠకారమునకిత్వమునువారించుటకాసూత్రమున 'ధాతోః' అను పదము గ్రహింపబడినది. ఇట ౠకారము పరాణ్ణు, "నామి" 6.4.3 సూత్రముచే హ్రస్వఋకార స్థానమున వచ్చినది ఇదియు రపరముగ ప్రవర్తించినచో ౠకారమన్త్యవర్ణముగాదుగాన నట నిత్వమునకుప్రాప్తియే లేదాయె. అట్టియెడ ధాతుగ్రహణమెందులకు? కాగా, పాణిన్యాచార్యుడు, ఇటువంటి స్థలములందు రపరత్వము ప్రవర్తింపదని గమనించియే ధాతుగ్రహణ మాసూత్రమున జేసియున్నాడని స్పష్టము.

అట్లైన,'చికీర్షతి' 'జిహీర్షతి' అను రూపములందును 'ౠత ఇద్ధాతోః' 7.1.100 అనునది ప్రాప్తింపకుండునే? 'కృ', 'హృ' ధాతువుల హ్రస్వ ఋకారమునకు "అజ్ఝనగమాం సని" 6.4.16 అని దీర్ఘము రాగా దానికి, ప్రకృత సూత్రముచే నిత్వము వచ్చినది. ఈ దీర్ఘమును రపరమే యయిన ౠకారము అంత్యము కాదుగదా? అనిన, పోనిమ్ము. "ఉపధాయాశ్చ" 7.1.101 అను సూత్రముచేత నట ఇత్వము రావచ్చును. దానిని వారించుటకు 'ధాతోః' అనునది ఆవశ్యకము. ఇట్లు సప్రయోజనమగుటచే నయ్యది జ్ఞాపకము కాదు. "మాతౄణామ్" "పితౄణామ్" అనుచోట "ఉపధాయాశ్చ" 7.1.101 అను నిత్వమును ధాతుపదము వారింపవలెను గదా?

అటులైన 'ఉరణ్' సూత్రమున, సామర్థ్యమువలన, పూర్వ ణకారము తోనేగాని పరణకారముతోం బ్రత్యాహారము గాదని చెప్పవచ్చును. పర ణకారముతోనైన, 'ఉరప్రపరః' అనియే సూత్రమును రచింపవచ్చును అని సమాధానము.

అపుడు, "అణుదిత్సవర్ణస్యచాప్రత్యయః" 1.1.69 అను సూత్రము నందలి 'అణ్' పదమునందు సందేహము నెట్లు వారింపవలెను?

నిస్సందేహముగ పరణకారముతోడనే యిట ప్రత్యాహారము. ఎట్లనగా "సవర్ణేణ్ తు పరంహ్యుర్‌ఋత్" అని వార్త్తికసమాధానము.

సవర్ణే = సవర్ణగ్రాహకసూత్రమునందు. అణ్ యు = అణ్ప్రత్యాహారము మట్టుకు. 'పరంహి' = పరణాకారముతోడనే చేయదగినది. ఎందువలన ననగా- "ఉర్‌ఋత్" 7.4.7 అను సూత్రమున ఋకారము తపరముగా నుచ్చరింప బడుటవలన.

'అచీకృతత్' అను రూపము, 'కౄత' సంశబ్దనే అను ధాతువులు ప్రథమపురుషైక వచనాంతము. ధాతువులందలి దీర్ఘ ౠకారము స్థానమున ఆన్తరతమ్యము వలన దీర్ఘమే యాదేశము కావలసియుండ, హ్రస్వము సమ్మతమగుటచే సూత్రమున, తపరకరణము చేయబడినది.

గ్రాహక సూత్రమునందు, పూర్వ ణకారముతో ప్రత్యాహారమైన, ఋకారమణ్ణుకాదుగాన, స్థానిగాని ఆదేశముగాని భిన్నకాలములకు గ్రాహకమే కాదు. కాగా ఋకారము స్థానియే కాదు, ఆదేశముగను ప్రాప్తింపదు. తపరకరణముతో బనియేమి ? కావున నా తపరకరణము పరణకారముతో ప్రత్యాహారమనుటకు జ్ఞాపకమగును.

ఇక ఇణ్వ్రదముగల సూత్రములందును నీ సందేహము కలుగునని యాక్షేపము. అసందిగ్ధముగ పర ణకారముతోడనే, పూర్వ ణకారముతో ఎంతమాత్రమును గాదు. ఏలయన, "య్వోరన్యత్రపరేణేణ్ స్యాత్" అని వార్తికకారుని సమాధానము.

పూర్వ ణకారముతో ప్రత్యాహారము కావలసిన స్థలములందు అట్లుం ప్రత్యాహారనిర్దేశమును జేయక, పాణిని, "అచిశ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ" 6.4 77 మున్నగు సూత్రములలో, 'య్వోః' అని నిర్దేశించి యుండెను. అది 'ఇణః' అను నిర్దేశముకంటె గురుభూతము. 'య్వోః' అనునది మూడున్నరమాత్రలు గలది. 'ఇణః' అను పదము మూడుమాత్రలు మాత్రమే కలది. కావున "అచిశ్నుధాతుభ్రువాం 'ఇణః' ఇయఙువఙౌ" అని రచించినచో లఘుభూతమైన న్యాసము కుదురుపడుచున్నను, గురుభూతయత్నము నాచరించుటచేత, ఇణ్వ్రదములందు పరణకారముతోనేగాని, పూర్వ ణకారముతో నెచ్చటను ప్రత్యాహారము సమ్మతముగాదని పాణిని జ్ఞాపకము చేయుచున్నాడని తాత్పర్యము.

ఇచ్చట నొక ఆక్షేపము సంభవింపవచ్చును. 'అణ్' 'ఇణ్' గ్రహణ స్థలములందు, పూర్వోక్తములయిన గురుభూతయత్నములచే సందేహపరిహారము కలుగవచ్చుననుకొనుము. కాని ప్రతిపత్తిగౌరవ మధికముగదా ? అనుబంధముగా జేర్చుటకిక వర్ణములు ణకారము తప్ప లేనేలేవా ? ఈ సూత్రమున వేఱొకవర్ణమనుబంధింపబడవచ్చునే ? అనునది ఆయాక్షేపము.

దానికి సమాధానమగు వార్తికచతుర్థపాదము, 'వ్యాఖ్యానాచ్చ ద్విరక్తితః' - అనునది. ఇంతకుపూర్వము ఖండఖండములుగ వ్యాఖ్యానింపబడిన వార్తికము యొక్క సమగ్ర స్వరూపము- "అసందిగ్ధం పరాభావాత్। సవర్ణేణ్ణు పరం హ్యుర్ ఋత్॥ య్వోరన్యత్ర పరేణేణ్ స్యాత్। వ్యాఖ్యానాచ్చ ద్విరుక్తితః॥" అనునది.

'అ ఇ ఉ ణ్' సూత్రమునందేగాక 'లణ్' సూత్రమునందును ణకారమునే అనుబంధముగా జేయుటవలన, ఆచార్యుడు, "వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిర్న హి సందేహాదలక్షణమ్." అను ప్రసిద్ధ విషయమును స్వవ్యవహారముచే బోధించుచున్నాడు. జ్ఞాపకముల వలనగాని, సామర్థ్యమువలనగాని, ఉపదేశ పరంపరవలనగాని సందేహ నిర్ణయమున కవకాశమున్నను, జ్ఞాపకాద్వ్యా

శ్రయణక్లేశము నుజ్జగించి, వ్యాఖ్యానము వలన, విశేషార్థ నిశ్చయమును జేయ వలెనుగాని సందేహమును సందేహముగనే వదలి, 'అట్టి సందేహము కలిగిన శాస్త్రము ప్రవర్తకముగాదు' అని తలంపరాదు. అని పై 'వ్యాఖ్యానతః' ఇత్యాది పరిభాషకర్ధము, శాస్త్రమునకు ప్రయోజనము అనందిగ్ధార్థానుష్ఠానము. కావున వ్యాఖ్యానము వలన సందేహ నివృత్తి అవశ్యకర్తవ్యము. అందును 'వ్యాఖ్యానము వలననే' అనియు వార్తికము నందలి 'ద్విరుక్తితః' అను పదము వలన దెలియ బడుచున్నది. కాగా, అణుదిత్సూత్రమునదప్ప తదితరాణ్వద ఘటిత సూత్రములందు బూర్వణకారముతోననియు, ఇణ్ప్రత్యాహారములన్నియు పరణకారముతోడనే ప్రత్యాహారమనియు, వ్యాఖ్యానింతుము.

"లణ్"

"ఞ మ ఙ ణ న మ్. ఝ భ ఞ్"

చతుర్దశ సూత్రిలో నీ సూత్రములు సప్తమాష్టమ సూత్రములు. వీనిలో చివర యథాక్రమముగ, మకారమును ఞ కారమును అనుబంధములుగా గూర్చబడినవి. ఇవి ముఖనాసికా వచనములు. రెండు సూత్రములను గలిపి, ఞ కారమును మాత్రమే అనుబంధము జేసి, "ఞ మ ఙ ణ న ఝ భ ఞ్"అని యేల ఉపదేశించి యుండలేదు ?

మకారముతో గావలసిన ప్రత్యాహారము లెట్లగును?

ఞ కారముతోనే కానిండు.

"హలో యమాం యమిలోపః "8-4-64 ఇది యెట్లు ?

"హలో యఞాం యఞిలోపః" అని ఞ కారముతోనే యగును.

అట్లు కుదురదే. ఝకార భకారములు పరము గాగల ఝకార భకారము లకు గూడ నపుడు లోపము ప్రసక్తమగును. ఝకార భకార పరకములగు ఝకార భకారములు ఎచటను సంభవము కలవికావు. అప్రహిత హల్మాత్రానుకరణము సూత్రములందప్ప భాషలో నుండదు

"పుమః ఖయ్యంపరే" 8-3-6 అనునది యెట్లు ?

పుమః ఖయి అఞ్పరే' అనియే యగును

అది కుదురదు. ఝకార భకారములు పరముగాగల ఖయ్యులు పరమైనపుడు గూడ రుత్వము రావలసి వచ్చును

ఝకార భకారములు పరముగాగల ఖయ్యున కెచ్చటను సంభవము లేదు.

"ఙమో హ్రస్వాదచి ఙముణ్నిత్యమ్" 8-3-32 ఇది యెట్లు ?

"జ ఞో హ్రస్వాది జఞణ్నిత్యమ్" అనియే కానిమ్ము.

అది కుదురదు. పదాన్తములగు ఋకార ఌకారములకు బరమైన అచ్చుకు గూడా ఋకార ఌకారములాగమములుగా కావలసి వచ్చును.

పదాన్తములగు ఋకార ఌకారము లుండవు. అయినను నింకొకదోషము తగులును. ఈ న్యాసమునందు ఆగమము లేదు. ఆగమములు మూడునగుటచే, వైషమ్యమువలన లత్వ సంస్కార కాలమున వానికి సంఖ్యాసామ్యము లేనందున 'యథా సంఖ్య' శాస్త్రము ప్రవర్తింపక పోవును.

ఇది దోషముగాదు. ఏ ఆగమములకాగమములు సంభవించునో అచటనే సూత్రము ప్రవర్తించును పదాన్తములగు ఋకారఌకారములు లేవుకాబట్టి అట నాగమములుగూడ రావు. మఱియు, ప్రతిపత్తి కాలమున గల సంఖ్యా సామ్యము వలన యథాసంఖ్యశాస్త్రము ప్రవర్తింపవచ్చును. లత్వసంస్కార కాలమున నయ్యది లేకున్నను, బాధకలుగదు. కాగా అనుబంధద్వయఘటనము స్పష్టప్రతిపత్తికొఱకుమాత్రమే॥

## అక్షరశబ్దార్థ నిరూపణము

"యోవా ఇమాం పదశః స్వరశోక్షరశశ్చవాచం విదధాతిస ఆర్త్విజీనో భవతి" అను మంత్రమున నక్షరశబ్దము కలదు. 'అక్షరసమామ్నాయము' - అని వ్యవహారమును గలదు. అట, అక్షరశబ్దమునకు ప్రవృత్తినిమిత్తమైన వస్తువును దెలిసికొనదలంచి, అక్షరమననేమి ? అని ప్రశ్నింపగా, తత్సమాధానముగ, "అక్షరం నక్షరం విద్యాత్। అశ్నోతేర్వాసరోక్షరమ్॥ వర్ణం వాహుః పూర్వసూత్రే"- అను వార్తికమవతరించినది. అందు మొదటి పాదము "అక్షరం నక్షరం విద్యాత్" 'అక్షరమనగా నాశము లేనిది' అని తెలిసికొనదగినది.

"నక్షీయతే ఇత్యక్షరమ్" లేదా 'నక్షరతీత్యక్షరమ్'. అనశ్వరము, నిత్యమని ఫలితము. అట్టిది బ్రహ్మతత్త్వమే యగును. కాగా, అక్షరమనగా బ్రహ్మ తత్త్వము.

"అశ్నోతేర్వాసరోక్షరమ్" - లేదా, 'అశూవ్యాప్తౌ' అను ధాతువునకు పరముగా సరన్ ప్రత్యయము రాగా నేర్పడిన రూపమది. 'వ్యాపకము' అనుట.

"వర్ణం వాహుః పూర్వసూత్రే"

పూర్వుల సూత్రమునందు, అనగా వ్యాకరణ గ్రంథములందు, వర్ణము నక్షరమని వ్యవహరించిరి. కనుక వర్ణమునకక్షరమని రూఢిసంజ్ఞ. "వర్ణాః అక్షరాణి" పూర్వవ్యాకరణసూత్రము. కాగా, అక్షరసమామ్నాయమన, నిత్యము, వ్యాపకమునగు వర్ణసంఘాతమని తాత్పర్యము.

## అక్షరసమామ్నాయోపదేశప్రయోజన నిరూపణము

అక్షరమిత్యాదిశ్లోకవార్తిక చతుర్థపాదము.

"కిమర్థముపదిశ్యతే" అనునది. ఇది అక్షరసమామ్నాయోపదేశప్రయోజన ప్రశ్నపరము.

"వర్ణజ్ఞానం వాగ్విషయో యత్రచ బ్రహ్మవర్తతే ।
తదర్థమిష్టబుద్ధ్యర్థం లఘ్వర్థంచోపదిశ్యతే"

అనునది సమాధాన శ్లోకవార్తికము.

వర్ణములు, ఏ శాస్త్రముచే తెలియబడుచున్నవో ఆ శాస్త్రము, అనగా, చతుర్దశసూత్రి, 'వర్ణజ్ఞానము'. అది వాగ్విషయము, అనగా వాక్కునకు బంధనము. విషయపదము, విపూర్వకమగు షిఞ్ బంధనే అను ధాతువునుండి నిష్పన్నము. అనగా ప్రతిపాదకమనుట.

యత్రచ బ్రహ్మవర్తతే = ఏ వాక్కునందు = వేదపురాణాదిరూప వాఙ్మయమునందు, బ్రహ్మబోధ్యముగానున్నదో, ఆ వాక్కునకు శాస్త్రము ప్రతిపాదకము. తదర్థమ్ = శాస్త్రప్రవృత్తికొఱకును, ఇష్టవర్ణబోధనము కొఱకును, లఘువుగ శాస్త్రము ప్రవర్తించుటకును, వర్ణోపదేశము చేయబడినదని తాత్పర్యము.

అట్టి, ఈ వాక్సమామ్నాయము, అనగా వాక్కునకంతకును సంగ్రాహకోపాయమగునది, భాషావ్యవహారమునకంతకును మూలమై యున్నది.

ఇయ్యది, దృష్టఫలమగు, ఏతన్మూలక వ్యాకరణశాస్త్రాధ్యయనముచేతను, గాని, అభ్యుదయలాభముచేతనుగాని పూవులు దొడిగియున్నది. తదర్థభావనచే గలిగిన తత్త్వజ్ఞానమువలన ఫలితమయినది. చంద్రునివలెను, తారకలవలెను, నిత్యమై యలరారుచున్నది. ఇది బ్రహ్మప్రతిపాదక వర్ణరాశి యని తెలిసికొనదగినది. బ్రహ్మతత్త్వమే శబ్దరూపమున భాసించుచున్నదనుట.

సర్వవేదములను నధ్యయనము చేసినందువలన గలిగెడు పుణ్యఫలము, ఈ అక్షరసమామ్నాయజ్ఞానమువలనను, దన్మూలకవ్యాకరణాధ్యయనమునను గలుగును.

మఱియు నేతచ్ఛాస్త్రాధ్యేతల మాతాపితరులు, స్వర్గలోకమునందు బూజితులగుదురు.

## ప్రత్యాహారాహ్నికము ముగిసినది

# "నందికేశ్వరుని చతుర్దశ సూత్రీ వ్యాఖ్య"

'అ ఇ ఉ ణ్' ఇత్యాది చతుర్దశ సూత్రికి నందికేశ్వరుడు, బ్రహ్మపర ముగ వ్యాఖ్యానము చేసెను. సర్వవర్ణములును మహేశ్వర రూపములనియు, వర్ణముల నుండియే, మహదాది తత్త్వములు సృజింపఁబడిన వనియు నీ చతుర్దశి బోధించునని యాతని సమన్వయము. నందికేశ్వరుని ఆ గ్రంథము శ్లోక రూప ముగ నున్నది. అందిరువది యేడు శ్లోకములు మాత్రము గలవు. వానికి 'ఉప మన్యువు' అను నాతడు టీక వ్రాసెను. దానిపేరు తత్త్వ విమర్శిని.

సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు మున్నగు సిద్ధులును, నంది కేశుడు, పతంజలి, వ్యాఘ్రపాదుడు, వసిష్ఠుడు మున్నగు మహర్షులును, పాణి న్యాదులును, స్వస్వ ప్రత్యేక ప్రయోజనములకై సకల లోకనాయకుడును, పరమేశ్వరుడునునగు పరమశివు నుద్దేశించి తపస్సుచేయగా నాతడు సుప్రీతుడై నాట్యము చేసెనట. మఱియు నృత్తావసానమున ఆ నటరాజరాజు, పదునాలుగు పర్యాయములు ఢక్కను ప్రయోగించెను. ఆ నాదమే పదునాలుగు శివసూత్ర ములుగా నేర్పడెను. ఆత్మ తత్త్వము వాఙ్మనస గోచరముకాదు. గాన ఢక్కా నినాద వ్యాజమున దాని నుపదేశించెను.

పిదప నా మునీంద్రు లెల్లరు నా సూత్రజాల తత్త్వార్థము నెఱుంగ గోరి దానిని బాగుగ తెలిసికొనుటకు నందికేశ్వరుడొక్కడే సమర్థుడని నిశ్చయించి, యాతని నమస్కరించి ప్రశ్నింపగా నాతడు కారికా రూపమున నా సూత్రముల నుపదేశించెను.

(1) "నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచ వారమ్.

ఉద్ధర్తు కామస్సనకాదిసిద్ధా నేతద్విమర్శే శివసూత్ర జాలమ్"

అనునది మొదటి కారిక.

ఈ శివసూత్ర జాలమును, నేను 'విమర్శే - విచారించి. స్పష్ట పఱచె దను' అని చెప్పి, రెండవ కారికచే, నాతడు, పాణిన్యాదుల కభీష్టమయిన, ధాతు మూలక శబ్దశాస్త్ర ప్రవృత్తి కనువు పడునట్లు ఈ సూత్రములకు చివర పదునాలుగు వర్ణములను అనుబంధములుగా జేర్చితినని వివరించెను.

(2) అత్ర సర్వత్ర సూత్రేషు అంత్యం వర్ణచతుర్దశమ్। ధాత్వర్థం సము పాదిష్టం పాణిన్యాదీష్ట సిద్ధయే" అనునది ద్వితీయ కారిక॥

తరువాత, 'అ ఇ ఉ ణ్' అను ప్రథమ సూత్రము నర్థము 3, 4, 5, 6, 7, 8, 9 - కారికలచే వివరింపఁబడెను.

శ్లో॥ (3) అకారో బ్రహ్మరూపః స్యాన్నిర్గుణః సర్వవస్తుషు ।
చిత్కలా మిం సమాశ్రిత్య జగద్రూప ఉణీశ్వరః ॥

అకారార్థము బ్రహ్మ, ఆ బ్రహ్మ నిర్గుణము. అయ్యది, ఇకారార్థమయిన చిత్కల నాశ్రయించి, సకల వస్తువ్యాపక సగుణ బ్రహ్మాత్మకమగు నీశ్వరుడాయెను. అని కారికార్థము.

"అః = నిర్గుణః పరమేశ్వరః ఇం = మాయ నాశ్రయించి,

ఉః- వ్యాపకుడును సగుణుడును నగు పరమేశ్వరుడు. ణ్ -అయెను." అని సూత్రార్థమని సూచితము.

"సృష్టికి పూర్వము నిర్గుణమగు బ్రహ్మమే యుండెను. ఆ బ్రహ్మనుండి సగుణబ్రహ్మ ఆవిర్భవించెను" అని, "అసద్వా ఇదమగ్ర ఆసీత్ తతో వై సదజాయత" అను శ్రుతి ప్రతిపాదించిన యర్థము నీ సూత్రము బోధించెనని భావము.

శ్లో॥ (4) "అకారస్సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమశ్శివః।
ఆద్యమన్త్యేన సంయోగా దహమిత్యేవజాయతే"॥

"సర్వ వర్ణములకును మొదటిదగు అకారము. అక్షర సమామ్నాయము నందలి చివరి హకారముతోకూడి 'అహ' మగుచున్నది. అకారాదిహకారాన్త వర్ణములును నా పరమాత్మ సంభూతములని కారికా తాత్పర్యము"

శ్లో. (5) "సర్వం పరాత్మకం పూర్వం జ్ఞప్తిమాత్ర మిదం జగత్।
జ్ఞప్తే ర్బభూత పశ్యన్తీ మధ్యమా వాక్ తతఃస్మృతా॥"

(6) "వక్త్రే విశుద్ధచక్రాఖ్యే వైఖరీ సా మతాతతః।
సృష్ట్యావిర్భావమాసాద్య మధ్యమా వాక్సమా మతా॥"

ఈశ్వరుడు నిర్విశేష చిన్మాత్ర స్వరూపుడయ్యును, జీవుడను నుపాధి నాశ్రయించి యున్న అనాది కర్మవశమున, అతనియందు ప్రాణవాయు సంచలన రూపమగు వ్యాపారము కలుగును. తరువాత నాభి ప్రదేశమునందు, 'పరా' అను మాయా పరిణామమునొందును. పిదప నా వాయువు హృదయము నందు, 'పశ్యన్తీ' అను వ్యవహారము గలదిగా పరిణమించును. పిమ్మట నది విశుద్ధచక్రమునందు 'మధ్యమా' అను నాఖ్యతో బరిణమించును. చివర నా ఈశ్వరుడే వక్త్రమునందు 'వైఖరీ' అను నామముతో, వేదపురాణాది వాక్స్వరూపుడుగ బరిణమించుచున్నాడు." వాగేవ విశ్వా భువనాని జజ్ఞే" "వాక్కే సకల జగత్తులుగ బరిణమించెను".

"వాచైవ విశ్వం బహురూపం నిబద్ధం తదేవైకం ప్రవిభజ్యోపభుంక్తే"

"వాక్కుచేతనే జగత్తు బహురూపముగ జేయబడినది. దానిచేతనే నిబద్ధమై యున్నది. అయ్యది ఏకమైనను దానిని ఆ వాక్కుచేతనే విభజించి, అవిద్యచే దానిని అనేకముగ దలంచును" అని వ్యాఖ్యాతలు. ఈ శ్రుతివాక్యములును పై విషయమును వ్యక్తము చేయుచున్నవి.

శ్లో. (7) "అకారం సంనిధీకృత్య జగతాం కారణత్వతః
ఇకారః సర్వవర్ణానాం శక్తిత్వాత్కారణం మతమ్"

(8) "జగత్స్రష్టుమభూదిచ్ఛాయదాహ్యాసీత్తదాభవత్ ।
కామబీజమితిప్రాహు ర్మునయో వేదపారగాః"

(9) "అకారోజ్ఞప్తిమాత్రంస్యా దికారశ్చిత్కలామతా ।
ఉకారోవిష్ణురిత్యాహు ర్వ్యాపకత్వాన్మహేశ్వరః"

"ఈ మూడు కారికలును, ఇకారమునకే స్వాతన్త్ర్యమును బోధించు చున్నవి. జగత్తును సృజింపవలెనని ఇచ్ఛ కలిగినపుడు, అకారమును దన సమీప మున నిడికొని, ఇకారమే ఆ కార్యమును నిర్వర్తించును. ఇకారార్థము శక్తి. అదియే సర్వవర్ణములకును గారణము. దానికే చిత్కల యని పేరు. అకారార్థము జ్ఞప్తిమాత్రమే. అనగా జ్ఞానరూపముమాత్రమే. ఆ జ్ఞానస్వరూపుడగు పరమశివుడు, ఇకారార్థమగు మాయయొక్క బలమున, విష్ణువై, అనగా వ్యాపకుడై యుండెనని వేదపారగులగు మునులు వచించిరి" అని భావము.

## ఋ ఌ క్

'ఋ' = పరమేశ్వరుడు. 'ఌ' = మాయారూపమగు మనోవృత్తిని, 'క్' = ప్రదర్శించెను, అని యర్థము.

మాయగూడ ఆ పరమేశ్వరుని మనోవృత్తియే గనుక అద్వైతమునకు హానిలేదు. ఆ వృత్తి నాశ్రయించి, తన సంకల్పముచే, జగత్తును బరమేశ్వరు డుద్భవింపజేసెను.

ఈ రెండవ సూత్రముయొక్క తత్త్వార్థము మూడు కారికలచే వివరింప బడినది.

శ్లో. (10) "ఋ ఌ క్-సర్వేశ్వరో మాయాం మనోవృత్తి మదర్శయత్
తామేవ వృత్తి మాశ్రిత్య జగద్రూప మజీజనత్॥"

(11) "వృత్తి వృత్తిమతోరత్ర భేదలేశో న విద్యతే।
చంద్ర చంద్రికయోర్యద్వద్యథావాగర్థయోరపి"

(12) "స్వేచ్ఛయా స్వస్యచిచ్ఛక్తౌ విశ్వమున్మీలయత్యసౌ।
వర్ణానాం మధ్యమంక్లీబంఋఌ వర్ణద్వయంవిదుః"

వృత్తియగు మాయకును, వృత్తిమంతుడగు పరమేశ్వరునకును వాస్తవ భేదములేశమైనను లేదు. తానే బహు పదార్థ రూపముగ గావలెనని సంకల్పించె నని, "సోకామయత బహుస్యాం ప్రజాయే యేతి" అను శ్రుతి బోధించు చున్నది గదా.

## "ఏ ఓ జ్"

పరమేశ్వరుఁడీ విశ్వము నుద్భవింప జేసెననుచో నాతడు జనకుడనియు విశ్వము జన్యమనియు భేదము గోచరమగుట లేదా యనిన లేదు. జన్య జనక భావమనగా నిట దానే యా రూపమున నుండుట. "తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్" అనుశ్రుతి, పరమేశ్వరుడు జగత్తును సృజించి, తానే యందు ప్రవే శించెనని చెప్పుటచే, సర్వమును దద్రూపమేగాన నద్వైతమునకు భంగము కలు గదు. ఈ విషయమునే యీ సూత్రము బోధించుచున్నది.

శ్లో. (13) "ఏ ఓ జ్ = మాయేశ్వరాత్మైక్య విజ్ఞానం సర్వ వస్తుషు।
సాక్షిత్వా త్సర్వ భూతానాం స ఏవ ఇతి నిశ్చితమ్॥"

అ + ఇ = ఏ॥ అకార ఇకారముల సంయోగమున ఏకార మేర్పడు చున్నది. అకారార్థమైన పరమేశ్వరుఁడొక్కడే ఇకారార్థమైన మాయతోగూడి ప్రజ్ఞాన స్వరూపమున, సాక్షిగ, "జ్" - ఉన్నాడు. అనికారికార్థము. ఇక, 'ఓ' అనువర్ణము అ + ఉ = ఓ, అని అకార ఉకార సంయోగ జన్యము. ఇంద కారార్థము నిర్గుణ బ్రహ్మము. ఉకారము సగుణ బ్రహ్మబోధకము. సగుణ నిర్గుణముల నైక్యమును ఈ వర్ణము తెలియజేయును. ఆ దృష్టాంతమున, అంతటను నైక్యబుద్ధి కలుగవచ్చును గాన నద్వైతమునకును భంగము రాదు.

## ఐ ఔ చ్

శ్లో. (14) "ఐఔచ్ బ్రహ్మస్వరూపః సన్ జగత్ స్వాన్తర్గతం తతః ।
ఇచ్ఛయావిస్తరంకర్తుమావిరాసీన్మహామునిః"

తరువాత తనలోనున్న జగత్తును విస్తరింపదలంచి, పూర్వ సూత్ర ప్రతిపాదితుడగు నా పరబ్రహ్మయే ఐ ఔ వర్ణములుగ నావిర్భవించెను. దీర్ఘా కారము, దీర్ఘ ఈకారము - వీని సంయోగముననే 'ఐ' అను వర్ణమేర్పడు చున్నది. 'ఆఈ' = ఐ, అట్లే, ఆఊ = 'ఔ' గా వినబడుచున్నది. కాని అవి ఏకైక వర్ణములే. తనలో ఉన్న జగత్తును విస్తరింపజేయుటకై, అకార, ఇకార, ఉకారములు దీర్ఘములు కలసిన వర్ణములగు 'ఐ ఔ' లుగా, ఆ ప్రజ్ఞానస్వరూపు డావిర్భవించెను' — అని యీ సూత్రార్థ మీ కారికచే వివరింపబడినది.

"హయవరట్"

శ్లో॥ (15) "భూతపంచకమే తస్మాత్", హయ, వరణ్మహేశ్వరాత్ ।
వ్యోమవాయ్వమ్బు వహ్న్యాఖ్య భూతాన్యాసీత్స ఏవహి ॥

ఈ మహేశ్వరునినుండియే భూతము లయిదును నుద్భవించినవి. ఆకాశము, వాయువు, ఉదకము, వహ్ని - అను భూతములు నాతడేగదా. "తస్మాద్వాఏ తస్మాదాత్మనః ఆకాశః సంభూతః ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః । అగ్నే రాపః । అద్భ్యః పృథివీ" - అ, ఈ పరమాత్మనుండియే ఆకాశ ముద్భవించినది. ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్ని నుండి ఉదకము, ఉదకము నుండి పృథివియు, పుట్టినవని శ్రుతి బోధించుచున్నది.

శ్లో॥ (16) హకారాద్వ్యోమ సంజ్ఞంచ, యకారాద్వాయురుచ్యతే ।
రకారాద్వహ్ని స్తోయంతు వకారాదితి సైవవాక్ ॥

హకారమున కర్థ మాకాశము. అది హకారమునుండియు, యకారము వలన వాయువును, రకారమునుండి వహ్నియు, వకారమునుండి ఉదకము నుద్భవించినవని పై శ్రుతి ప్రతిపాదితార్థమునే యీ కారిక వ్యక్తపరుచుచున్నది. జగత్కారణమైన ఆకాశాది భూతపంజరము, ఆ పరమాత్మనుండి యుద్భవించినదని చెప్పబడినది. ఆ ప్రకృత సూత్రమునందు హ, య, వ, ర,- అను నాలుగు వర్ణములే కలవు, అవి ఆకాశాది భూతచతుష్కమునే చెప్పును.

"లణ్"

శ్లో॥ (17) "ఆధార భూతం భూతానా మన్నాదీనాంచ కారణమ్,
అన్నాద్రేత స్తతోజీవః । కారణత్వాల్లణీరితః".

అను నీ కారిక ప్రాణిజాతమునకు ప్రధానాధారమగు పృథివి, అన్నపానాదులకు గారణమని లణ్సూత్ర తత్త్వార్థమును బోధించుచున్నది. కాగా 'హయవరట్' 'లణ్' అను సూత్ర ద్వయము భూత సృష్టి ప్రతిపాదకమని గ్రహింపదగును.

"॥ఞ, మ, ఙ, ణ, న, మ్॥"

శ్లో॥ (18) "శబ్దస్పర్శౌ రూపరసగన్ధాశ్చ ఞ మ ఙ ణ న మ్।
వ్యోమాదీనాం గుణాహ్యేతే, జానీయాత్సర్వవస్తుషు॥"

ఆకాశము, వాయువు, అగ్ని, ఉదకము, పృథివి- అను భూతము లయిదింటికిని కారణములయిన- శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల తన్మాత్రలు, ఈ సూత్రమునందలి అయిదు వర్ణముల చేతను జెప్పబడును. సర్వజగత్కారణ

భూతుడగు వర్ణ రూప పురుషునియొక్కయు, సర్వ వస్తువుల యొక్కయును గుణములియ్యవి' అని వ్యాఖ్యాతలు.

ఝ భ ఞ్ - ఘ ఢ ధ ష్

శ్లో॥ (19) "వాక్పాణీ చ ఝ భ ఞ్ ఆసీద్విరాడ్రూపచిదాత్మనః।
సర్వ జన్తుషు విజ్ఞేయం స్థావరాదౌ న విద్యతే॥
వర్గాణాంతుర్యవర్ణాయే కర్మేన్ద్రియమయాహితే,

శ్లో॥ (20) "ఘ ఢ ధష్ సర్వభూతానాం పాదపాయూ ఉపస్థకః।
కర్మేన్ద్రియగణా హ్యేతే జాతాహిపరమార్థతః॥"

విరాడ్రూపుడగు శివునకును, సకల ప్రాణిజాతమునకును, వాక్కును హస్తములును, ఝకార భకారములు. ఈ విరాడ్రూపము, స్థావరాదులందు దప్ప జంగమ పదార్థములందెల్లయెడ గలదు.

పరమశివునివలననే, కర్మేంద్రియములగు వాక్పాణి పాదపాయూ పస్థలు పుట్టినవి కాగా, ఘఢధలు మూడును సర్వభూతములకును పాద, పాయు, ఉపస్థలు. ఇట్లు వర్గచతుర్థములయిన, ఝ, భ ఘ ఢ ధ- అనునైదు వర్ణములను, పైనజెప్పిన కర్మేన్ద్రియములనుట.

జ బ గ డ ద శ్

ఇవి వర్గల మధ్యమవర్ణములు. వీనివలన. త్వక్, చక్షుస్సు, శ్రోత్రము జిహ్వా, ఘ్రాణము- అను జ్ఞానేన్ద్రియములుద్భవించినవి. "వర్గాణాం మధ్య వర్ణోత్థో జ్ఞానేన్ద్రియగణః స్మృతః"-

శ్లో॥ (21) "శ్రోత్రత్వఙ్నయన ఘ్రాణ జిహ్వేత్విన్ద్రియపంచకమ్.
సర్వేషామపి జంతూనా మీరితం జబగడదశ్॥"

సర్వ ప్రాణుల జ్ఞానేంద్రియములకును నీవర్ణములు జనకములనుట.

ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త, వ్

శ్లో॥ (22) "ప్రాణాదిపంచకంచైవ మనోబుద్ధి రహంకృతిః।
బభూవకారణత్వేన, ఖ, ఫ ఛ ఠ థ చ ట త వ్ ;

శ్లో॥ (23) వర్గ ద్వితీయ వర్ణోత్థాః ప్రాణాద్యాః పంచవాయవః।
మధ్య వర్గత్రయాజ్జాతాః అంతఃకరణ వృత్తయః"

ప్రాణము, అపానము, ఉదానము, వ్యానము, సమానము- అనునివి అయిదు వాయువులు. మనస్సు, బుద్ధి అహంకారము- అనునివి అంతఃకరణ వృత్తులు, ఈ ఎనిమిదింటికి, గారణములుగా ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త-

అను వర్ణములేర్పడినవి. దీనిచేత, ప్రాణాదిపంచకమును, మనోబుద్ధ్యహంకార ములును జగత్కారణములుగా సంభూతములని కారికా వ్యాఖ్యాత వివరణము.

## క, ప య్

శ్లో॥ (24) "ప్రకృతిం పురుషం చైవ సర్వేషామేవ సమ్మతమ్ ।
సంభూతమితి విజ్ఞేయం కపయ్స్యాదితి నిశ్చితమ్ ॥"

కకార పకారముల నుండి ప్రకృతి పురుషులు యథాక్రమముగ నుద్భ వించిరని ఈ సూత్రార్థము, ప్రకృతకారికచే దెలుపబడినది.

## శ ష స ర్

శ్లో॥ (25) "సత్వం రజస్తమ ఇతి గుణానాం త్రితయంపురా ।
సమాశ్రిత్య మహాదేవః శషసర్ క్రీడతి ప్రభుః॥"

శ్లో॥ (26) శకారా ద్రాజసోద్భూతిః షకారాత్తామసోద్భవః ।
సకారాత్సత్వ సంభూతి త్రిగుణసంభవః॥"

'సృష్టికి బూర్వము, శ, ష స అను మూడు వర్ణముల నుండియు, ఉద్భ వించిన, రజస్సు, తమస్సు, సత్వము అను గుణముల నాశ్రయించి పరమ శివుడు సర్వభూతము లందును గ్రీడించుచున్నాడు' అను నర్థ మీకారికా ద్వయముచే బోధింపబడినది.

## "హల్"

శ్లో॥ (27) "తత్త్వాతీతః పరః సాక్షీ సర్వానుగ్రహ విగ్రహః ।
అహమాత్మా పరో హల్స్యా మితి శంభుస్తిరోదధే ॥"

"సర్వతత్త్వముల నుద్భవింప జేసిన వాడును, తాను తత్త్వాతీతుడును, సర్వసాక్షియు, సర్వానుగ్రహమే తనకు స్వరూపముగాగల వాడును నగు పరమ శివుడు తానే హాకారమున కర్థమని ఢక్కానినాద వ్యాజమున మునిజనులకు తత్త్వోపదేశము నీసూత్రముచే జేసియంతర్ధానమునొందెను" అని చివరి ఇరువది యేడవ కారికయర్థము.

(1) "నిర్గుణ పరబ్రహ్మము మాయనాశ్రయించి సగుణ మాయెను."

(2) "పరమేశ్వరుడు మాయయను దన మనో వృత్తిని బ్రదర్శించెను."

(3) "మాయి మాయల కభేదమును, సగుణ నిర్గుణుల కైక్యమును గలిగెను."

(4) "పరమేశ్వరునకు జగద్విస్తరణ సంకల్పము జనించెను."

(5) "అతని నుండి, ఆకాశ, వాయూదకాగ్నులు నాలుగు నుద్భవించినవి."

(6) "పృథివి సకల భూతాధారముగ నేర్పడెను."

(7) "భూతకారణములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధతన్మాత్ర లుద్భవించెను."

(8) ఝ, భలు విరాట్పురుషుని వాక్ప్రాణులు అయెను."

(9) "ఘ, ఢ ధ లు, అతని పాద పాయూపస్థలుగా నేర్పడెను."

(10) "జ, బగడదలు, శ్రోత్ర, త్వక్ చక్షుః ఘ్రాణ జిహ్వలాయెను."

(11) "ఖ, ఫ ఛ ఠ థ చ ట తల నుండి, ప్రాణాపాన సమానోదాన వ్యానములును, మనో బుద్ధ్యహంకారములను నంతఃకరణ వృత్తులను క్రమముగ నుద్భవించెను.

(12) క, వ ల వలన, క్రమముగ, ప్రకృతియు, పురుషుడును జనించెను.

(13) శ, షసలు క్రమముగ, రజస్త మస్సత్త్వ గుణత్రయ కారణములాయెను.

(14) పైన జెప్పిన ఇరువది నాలుగు తత్త్వములకును నతీతుడనై నేను సాక్షిగనున్నాను."

ఇయ్యాది చతుర్దశ సూత్రికి తత్త్వ పరమగునర్థముగా నందికేశ్వరకాశికా తద్వ్యాఖ్యానముల వలన సంగ్రహముగ దెలియనగును.

వర్ణజ్ఞానమిత్యాది వార్తికమునందు, "యత్రతత్ర బ్రహ్మవర్తతే" అను వాక్యముచే నీయర్థమే సూచితము.

# వృద్ధ్యాహ్నికము

## వృద్ధిరాదైచ్

### కుత్వప్రసంగ విచారము

"పదస్య" (8.1.16) అను నధికారమునందు బఠింపబడిన "చోఃకుః" (8.2.30) అను సూత్రముచే 'ఐచ్' పదమునందలి చకారమునకు కకారాదేశమేలరాలేదు? అని ప్రశ్న.

ఆ పదము భసంజ్ఞకలది గాని పదసంజ్ఞకలది గాదు. అందువలన రాలేదు. భసంజ్ఞ యెట్లు?

"అయస్మయాదీనిఛందసి" (1.4.10) అను సూత్రము వలన. అట 'ఛందసి' అని కలదుగదా? సూత్రము ఛందస్సు కాదే? సూత్రములు ఛందస్తుల్యము లగును.

"వృద్ధిరాదైజదేఙ్గుణః" అని సంహితాపాఠమున చకారస్థానమున జశ్త్వముచే జకారాదేశమగపడుచున్నదిగదా. భసంజ్ఞకమనిన నది యెట్లు పొసగును? జశ్త్వమునకుభత్వ మపవాదముగదా?

వైదికపదములందు రెండు సంజ్ఞలును ఉండవచ్చును. "ఉభయసంజ్ఞాన్యపిఛందాంసి దృశ్యన్తే" "ససుష్టుభా స ఋక్వతాగణేన" అను చోట, 'ఋక్వతా' అను పదమునందు, చకారమునకు పదసంజ్ఞాకార్యమగు కుత్వమును, భసంజ్ఞ యుండుటవలన జశ్త్వాభావమును నగపడుచున్నట్లు, ఇట, పదత్వము వలన జశ్త్వమును భత్వమువలన కుత్వాభావమును ఉపపన్నములగును.

### తద్భావితా తద్భావితపక్ష విచారము

ఈ సూత్రమున, ఆకార, ఐకార, ఔకారములకు, తద్భావితములకే గ్రహణమా? అనగా 'వృద్ధి' శబ్దముచే విధింపబడిన వర్ణములకే ఆ సంజ్ఞ కలుగునని తాత్పర్యమా? లేక ఆ దైజ్మాత్రమునకు కలుగవచ్చుననియా?

ఎట్లైననేమి? తద్భావితములకే గ్రహణమనిన, 'శాలా' 'మాలా' శబ్దముల ఆద్యాకారము వృద్ధిశబ్దభావితము కాదు కావున, వానికి వృద్ధిసంజ్ఞ లేనిచో, ఆద్యాచ్చు వృద్ధివర్ణమగు ప్రాతిపదికమే 'వృద్ధ' సంజ్ఞకము గాన,

'శాలీయః' 'మాలీయః' అను స్థలములందు, "వృద్ధాచ్ఛః" (4.2.114) అను సూత్రముచే విధింపబడిన ఛప్రత్యయము సిద్ధింపకుండును.

అట్లే, 'ఆమ్రమయమ్' 'శాలిమయమ్' అను స్థలములందు "నిత్యంవృద్ధ శరాదిభ్యః" (4.3.144) అని వృద్ధలక్షణమగుమయట్ప్రత్యయము రాకపోయెడిది. 'ఆమ్రగుప్తాయనిః', 'శాలగుప్తాయనిః' అనుచోట్ల "ఉదీచాంవృద్ధాదగోత్రాత్" (4.1.57) అను సూత్రముచే రాదగిన వృద్ధిలక్షణమగు 'ఫిఞ్' అను ప్రత్యయమును రాకుండెడిది.

ఇక ఆదైజ్మాత్రమునకు గ్రహణమందుమా, 'సర్వభాసః' అను కర్మధారయపదమున నుత్తర పదమగు భాసశబ్దమునందలి యాకారము వృద్ధి వర్ణమగుటచే నాపదము వృద్ధ సంజ్ఞకమైనందున, "ఉత్తరపద వృద్ధౌ సర్వంచ" (6.2.105) అని సర్వ శబ్దమునకంతోదాత్తము రావలసియుండును.

'తావతీ భార్యా యస్యసః తావద్భార్యః' ఇత్యాది స్థలములందు తావతీ శబ్దమునందలి ఆకారమును వృద్ధి సంజ్ఞకవర్ణమగును. అట 'వతుప్' అను తద్ధితప్రత్యయము, ఆ ఆకారమునకు నిమిత్తము కావున నది వృద్ధి నిమిత్త తద్ధితమగుటచే, "వృద్ధి నిమిత్తస్య చతుర్ధితస్యా రక్త వికారే" అను సూత్రముచే పుంవద్భావ ప్రతిషేధము ప్రసక్తమగును.

అట్లైన ఆదైజ్మాత్రమునకే గ్రహణమగుగాక

సర్వోభాసస్సర్వభాసః అనుచోట 'ఉత్తరపద వృద్ధౌసర్వంచ' అను విధి ప్రవర్తింప వలసి వచ్చునంటిరిగదా.

ఆ దోషము కలుగదు. 'ఉత్తర పదమునందు వృద్ధ్యక్షరముండిన నంతోదాత్తమగును' అని యాసూత్రమున కర్థము చెప్పము.

మరి ఎట్లు ? "ఉత్తర పదస్య" (7.3.10) అను నధికారమునందు విహితమగు వృద్ధి వర్ణముగల యుత్తర పదము పరమగు నపుడు' అని వివక్షింతుము. అట్లే తప్పక వివక్షింపవలెను. తద్భావితములకే వృద్ధి సంజ్ఞ కలుగునను పక్షమునందును, 'సర్వశ్చా సౌకారకశ్చ' 'సర్వ కారకః' అనుచోట నుత్తర పదమునందలి అకారము వృద్ధి శబ్ద భావితమే యగుట చేత అట సర్వ శబ్దమునకంతోదాత్తత్వము వచ్చెడిది.

ఇక 'తావతీభార్యా యస్య తావద్భార్యః' యావద్భార్యః' మున్నగు చోట్ల 'వృద్ధి నిమిత్తస్య' అని పుంవద్భావ ప్రతిషేధము ప్రాప్తించునంటిరే, అదియు దోషము కాదు. 'వృద్ధి నిమిత్తస్య' అనగా' వృద్ధికి నిమిత్తమైన' అను నర్థమును గ్రహింపము. మరి యెట్లు ? 'వృద్ధికి నిమిత్తమైనది యెందు గలదో ఆ తద్ధితమ'ని వివక్షింతుము. వృద్ధికి నిమిత్తమైనదేది? క కారమో, ఞ కారమో, ణ కారమో వృద్ధికి నిమిత్తమైన వర్ణము. వతుప్ ప్రత్యయమున నవిలేవు.

లేదా - వృద్ధికి నిమిత్తమనగా, "వృద్ధీనాంనిమిత్తమ్ = వృద్ధినిమిత్తమ్" అనిచెప్పి, ఎయ్యాది వృద్ధివర్ణములయిన ఆకార, ఐకార, ఔకారములు మూడింటి కిని (అనగా కృత్స్నవృద్ధికినిననుట) - నిమిత్తమో అట్టి తద్ధితమని యర్థము. వతుప్పను నీ తద్ధితమొక్క ఆకారమునకే నిమిత్తము. కాగా నీ సూత్రమున, అతద్భావితములకును గ్రహణము సమ్మతము

## ఈ సూత్రమునకు సంజ్ఞాసూత్రత్వసాధనము

"సంజ్ఞాధికారస్సంజ్ఞా సంప్రత్యయార్థః" అని ఆక్షేపవార్తిక ప్రథమ ఖండము.

"అథ సంజ్ఞాః" అని ముందుగనొక యధికార సూత్రమును రచించి 'వృద్ధిః' 'గుణః' మున్నగు శబ్దములను, పాణిని పఠించియుండదగినది ఎందుల కనగా, సంజ్ఞాసంప్రత్యయముకొరకు. వృద్ధిశబ్దము, గుణశబ్దము మున్నగునవి సంజ్ఞాశబ్దములని తెలియుటకట్లు చేయదగినది.

"ఇతరదా హ్యసంప్రత్యయోయథాలోకే" అని ద్వితీయ ఖండము. సంజ్ఞాధి కారమును చేయకుండిన, వృద్ధ్యాదిపదములు సంజ్ఞాపదములని తెలియకపోవును

అపుడు చాల సూత్రము లర్థవిరహితములు కావలసివచ్చును.

అయిన గానిమ్ము. అనర్థకములయిన నెట్లు ? లోకమునందువలె ననర్థక ములు శాస్త్రమునందును నుండును. దానికేమి ? లోకములో, కొన్ని అర్థ వంతములగు వాక్యములును, మరికొన్ని అర్థరహితములును గబడుచున్నవిన గదా.

"దేవదత్తుడా ! నీవా తెల్లయావు నీకఱ్ఱతో దోలుము. ఆ నల్లయావును దీనితోదోలుము" అని చెప్పదురు. ఆ వాక్యము లర్థముగలవి. అనర్థకములగు వాక్య ములు నుదశదాడిమాది వాక్యములవంటివి గలవు." దశదాడిమాని, షడపూపాః, కుణ్డమజాజినమ్. పలలపిండః అధరోరుకమేతత్కుమార్యాః, స్పైఫయకృతస్య పితాప్రతిశీనః" అనునది. ఇందలి పదములన్నియు నర్థవంతములే. ప్రత్యేక ప్రత్యేకముగ క్రియల నధ్యాహారముచేసి యా పదార్థములకు సంసర్గమును గల్పింపవచ్చును. కాని మహావాక్యమున కర్థములేదు. 'పది దానిమ్మపండ్లు, ఆరపూపములు, ఒక కుండము, మేకతోలు, మాంసపు ముక్క, చడ్డీ, ఇది కుమారి యొక్క, స్పైఫయకృతుని తండ్రి, రోగముచే నవయవములు ముడుచుకొని పోయినవాడు. ఈ విధముగ పదముల కర్థమున్నను, మొత్తము వాక్యమర్థరహితము. పదార్థములకు సమన్వయము లేదుగదా. కాగా శాస్త్రము నందు గూడ, అర్థవిరహితములగు సూత్రములుండ వలసివచ్చును.

"సంజ్ఞా, సంజ్ఞ్యసందేహశ్చ" అని ఆక్షేపాన్తరవార్తికము. 'అథసంజ్ఞా' అని సంజ్ఞాధికారమును జేసినను, ఇది సంజ్ఞా పదము, ఇయ్యది సంజ్ఞ బోధకము

అని అసందిగ్ధముగ దెలియుటకు "పరాసంజ్ఞా" అనియు జెప్పవలసియుండును. లేనిచో, వృద్ధి శబ్దము సంజ్ఞా శబ్దము, ఆదైచ్చులు సంజ్ఞులు అనియే యేలదలంపవలెను ? 'ఆదైచ్చులే సంజ్ఞలు. వృద్ధి శబ్దమే సంజ్ఞ,' అని యెందులకనుకొనరాదు ?

ఇక నాక్షేపములకు సమాధానములు- 'సంజ్ఞా సంప్రత్యయమునకై 'సంజ్ఞా' అని యధికారమును జేయవలసి యున్నది' అంటిరే ? వినుడు. అక్కర లేదు.

"ఆచార్యాచారాత్సంజ్ఞాసిద్ధిః" అని వార్తికకారుని సమాధానము ఆచార్యుల ఆచారమువలన నది సిద్ధింప గలదు. ఆచార్యుల ఆచారమననేమి ? ఆచారమన నుపచారము. అనగా వ్యవహారమనుట. శక్తిగ్రాహక శిరోమణియగు వ్యవహారమువలన శక్తి గ్రహము కలుగునని భావము.

"యదా లౌకిక వైదికేషు" అని వార్తిక ద్వితీయ ఖండము. లౌకిక వైదిక నిర్ణయములందు వలెనే, ఆచారము వలన సంజ్ఞా సిద్ధి కలుగవచ్చును. లోకమున, తల్లిదండ్రులు, తమ పుట్టిన పిల్లవానికి 'దేవదత్తు'డనియు, 'యజ్ఞదత్తు డనియు నిట్లు రహస్యముగ దమ తమ యిండ్లలో నామకరణము చేసికొందురు. పిదప వారి వ్యవహారము వలన ఇతరులును 'ఇయ్యది వీనికి పేరు' అనిగ్రహించు చున్నారు. వేదము నందు యజ్ఞకాండ ద్రష్టలు, స్ఫ్యః, యూపః, చషాలః అని యజ్ఞ సాధనములకు సంజ్ఞల నేర్పరచుకొందురు. స్ఫ్యః అనగా చంద్ర కర్రతో చేసిన కత్తివంటి యొక పనిముట్టు. యూపమనగా యజ్ఞపశువును గట్టు కంబము. చషాల మనగా యూపాగ్రమున నుంచెడి వలయము వారా పని ముట్లను ఆ పేర్లతో వ్యవహరించుటచేత ఇతరులు కూడ వీని కివి సంజ్ఞలని తెలిసికొనుచున్నారు.

అట్లే శాస్త్రమునందును దెలిసికొనవచ్చును. ఇచ్చటనే కొందరు వ్యాఖ్యాతలు 'వృద్ధి శబ్దము సంజ్ఞాశబ్దము. ఆదైచ్చుల సంజ్ఞులు' అని చెప్పియున్నారు. మరికొందరు "నిచివృద్ధిః పరస్మైపదేషు" (7-2-1) అను సూత్రముచే వృద్ధి వచ్చును అని చెప్పి లక్ష్యములం దాకారైకారౌకారముల నుదాహరించు చున్నారు. అందువలన, 'దేనిచే ప్రత్యాయ్యములో అది సంజ్ఞ. ఎయ్యవి ప్రతీయమానములో అవి సంజ్ఞులు' అని తలంతుము.

ఇక సంజ్ఞాధికారమును జేసినను, సంజ్ఞాసంజ్ఞుల కసందేహము గూడ వక్తవ్యమగునంటిరే, అదియు నక్కర లేదు.

"సంజ్ఞాసంజ్ఞ్యసందేహాశ్చ" అని సిద్ధాంతవార్తికము. సంజ్ఞాసంజ్ఞుల యసందేహమును సిద్ధమే. ఎట్లు ? ఆచార్యాచారమువలననే. ఆచార్యాచార మననేమియో జెప్పితిమి.

"అనాకృతిః" అని సిద్ధాంతి హేతువార్తికఖండనము. లేదా ఇట్లు చెప్ప వచ్చును- ఆకృతి లేనిది సంజ్ఞ, ఆకృతిగలవి సంజ్ఞులు అనగా అభిన్నమయినది సంజ్ఞయు, భిన్నములయినవి సంజ్ఞులును గాదగును. వృద్ధిశబ్ద మొక్కటియే గనుక నది సంజ్ఞ. ఆదైచ్చు లనేకములు గాన నవి సంజ్ఞులు. లోకమునందును నట్లే కనబడుచున్నది. మాంసపిండము ఆకృతి మంతము. దానికి 'దేవదత్తుడు' అని సంజ్ఞ చేయబడుచున్నది. ఆకృతి పదమునకు భేదము అని లాక్షణికార్థము. సంజ్ఞులను జేయుట లాఘవముకొరకు గాన ఏకవ్యక్తి సంజ్ఞయనియు, అనేక వ్యక్తులు సంజ్ఞాశ్రయములనియు సిద్ధించును.

"లిఙ్గేనవా" అనునది హేతువార్తిక ద్వితీయఖండము. లేదా- లింగము చేత ఆ సందేహము తీరవచ్చును. కలాది వర్ణదోషరూపమగు నొక లింగమును దేనినైన, సంజ్ఞాపదమునందు జేర్చి, ఇట్టి గురుతుగలది సంజ్ఞ అని చెప్పెదను. ఆ గురుతును వృద్ధిశబ్దమునందే చేర్పబడును గాని ఆదైచ్ఛబ్దమునందు జేర్ప బడదు.

ఆచార్యాచారమువలన సంజ్ఞాసిద్ధి కలుగునంటిరే మీరు. అనగా వార్తిక కారులు, ఆ మాట యుక్తము గాదు.

అందేమి యుక్తముకానిది?

మూలభూతుడగు సూత్రకారుని, 'అయ్యా! నీ సూత్ర మర్థబోధకము కాలేదు' అని దూషించి, మరల, తదీయులగు వృత్తికారులనే ప్రమాణముగా దీసికొనుట యెట్లుపపన్నమగును? 'ఆచార్యాచారమువలన' అని చెప్పిన పరిహారము యుక్తముగా లేదను అపరితోషమువలననే మీరును, మరల "అనాకృతి ర్లిఙ్గేనవా" అని పరిహారాంతరమును జెప్పిరి. కాగా ఆచార్యవ్యవహారమును బ్రమాణముగా మీరును గ్రహింపరనుటయే గదా. పాణిని దూషించినవారికి పాణినీయులే మరల నెట్లు ప్రమాణమగుదురు?

మరియు ప్రతి సంజ్ఞాపదమునందును లింగాసంగ్రమును జేయుట, 'ఇట్టి గురుతుగలది సంజ్ఞ' అని చెప్పుట, అపూర్వముగ కర్తవ్యములగును. ఆకృతి రహితము సంజ్ఞయని చెప్పినను నయ్యది లాఘవన్యాయసిద్ధమే గాన నది అపూర్వవక్తవ్యము కాదు. 'లింగేనవా' అనునది యపూర్వము కాక తప్పదు. దానివలన గౌరవమును తప్పదు అనిన,

అట్లు కాదు, ఇందును లాఘవము కలదు. అది అపూర్వవచనసాధ్యమే అయినను, నీ పక్షమున, ఇత్సంజ్ఞాలోపములను జెప్పనక్కర లేదు. సంజ్ఞాలింగము అను, అనుబంధములందే కూర్పవచ్చును. దానికి నివృత్తిని వేరుగ జెప్పనక్కర లేదు. స్వభావముచేతనే సంజ్ఞ సంజ్ఞిని బోధించి, తానే నివర్తించును. అను బంధములకును నివృత్తి కలుగును. అది యెట్లనగా- 'శీఙ్' అను ధాతువు కలదు గదా. ఇందలి ఙకారమునందు, సంజ్ఞాలింగముగ ఏ 'కల'నో పెట్టవచ్చును.

దానివలన 'ఆవర్ణములు సంజ్ఞలు' అని తెలియును. 'జిత ఆత్మనేపదమ్' అను సూత్రమునకు బదులుగా 'జా హాత్మనేపదమ్' అని సూత్రమును రచింపవచ్చును సంజ్ఞలయిన జకారాదులు సంజ్ఞిని బోధించి నివర్తించును. అట్లు నివర్తించుట వానికి స్వభావము. కాగా, ఇత్సంజ్ఞా లోపములను విధింప పనిలేకుండుటయను లాఘవాతిశయ మీ పక్షమున గలదు.

ఇట్లు సిద్ధింపవచ్చుననుకొనుడు. కాని ఆ కల్పనమంతయు అపాణినీయ మగును. మరియు ననేక స్థలములందు దోషములతో గూడిన వర్ణముల నుచ్చ రించుట, అనునాసిక్యమువలె నది ప్రతిజ్ఞాగమ్యమగుట, అ ఇ ఉ ణ్ ఆది ప్రత్యా హార సూత్రములందలి యంత్యవర్ణముల నివృత్తికై వానిని గూడ దోషవిశిష్ట ముగ బఠించుట. తన్మూలమున గలుగు ననేకానిష్టములకు పరిహారములను గల్పించుకొనుట, ఇత్సంజ్ఞను జెప్పనక్కరలేదను లాఘవమునకు లోభించి, 'ట్వితోఽథుచ్' (3-3-89) మున్నగు సూత్రములను, 'టోరథుచ్' అను మున్నగు రీతిలో మార్చి పఠించుట. 'ఆదిరన్త్యేనసహేతా' అను సూత్రమును" ఆదిఃకలాది నాన్త్యేన" అని మార్చుట- మున్నగు నెన్నియో గౌరవపరాహతములగు కృత్యములను జేయవలసివచ్చును. తన్మూలమున గలుగు బహుదోషములకు అనంతములగు ప్రతివిధానములను గల్పించుటయు నావశ్యకమగును, ఇట్లంతయు నపాణినీయమగు స్వకపోలకల్పనమగును. అందువలన యథాన్యాసముగ నుండు టయే యుక్తము.

'అపుడు సంజ్ఞాసంప్రత్యయార్థమై, 'అథసంజ్ఞాః' అను నధికారమును జేయవలెను. లేకున్న లోకమునందువలె సంజ్ఞాత్వ నిశ్చయము కలుగనందున బహుసూత్రము లనర్థకములు కావలసి వచ్చును' అని యాక్షేపించితిరి గదా! అనిన,

లోకమునందువలె వ్యాకరణమునందు గాదు. ఏలయన ప్రమాణభూతు డగు నాచార్యుడు, దర్భ పవిత్రమును జేత బెట్టుకొని పరిశుద్ధ ప్రదేశమునందు తూర్పు ముఖముగ గూరుచుండి, బహుతర మనః ప్రణిధానముతో సూత్రము లను రచించినాడు. అందొక యక్షరమైనను బొల్లుకా పీలుపడదు. అట్టియెడ నింక సూత్రమెట్లు వ్యర్థమగును?

అవును. అశక్యమే. దాన బ్రకృతమున నేమి?

కావున నీ సూత్రమునందలి పదములు సంజ్ఞాసంజ్ఞి బోధకములే.

లోకమునందు వక్తలకు, భ్రమ, ప్రమాదము, విప్రలిప్స, అనగా మోస గింపవలెనను నిచ్ఛ. కరణముల అపాటవము మున్నగు దోషములు సంభావిత ములు గాన, దశదాడిమాదివాక్యములవంటి యనర్థక వాక్యము లుండిన నుండ వచ్చును. పరమాస్తికులును, అత్యంత ప్రమాణభూతులును నగు మహర్షు లకు భ్రమప్రమాదాదులుండుట కవకాశము లేదుగదా! కావున వారు రచిం

చిన సూత్రములు అర్థవిరహితము లెంతమాత్రమును గాజాలవని భావము.

ఈ సూత్రమునందలి పదములు రెండును నొక్కటి సంజ్ఞాపదమనియు నింకొక్కటి సంజ్ఞిబోధకపదమనియు, కాగా నిది సంజ్ఞాసూత్రమనియే యేల నిర్ణయింపవలె. వ్యాకరణశాస్త్రము సాధుత్వము ననుశాసించునది గాన, "ఉయ్యజయ్యౌశక్యార్థే" (6-1-81) మున్నగు సూత్రములవలె నిది వృద్ధిపదమునకును, ఆదైచ్ పదమునకును సాధుత్వమును విధించునది, అని యేల చెప్పరాదు? అను ఆక్షేపమునకు సంభవముగలదు.

కాని వీనికి సాధుత్వము లక్షణసంపన్నమయియే యున్నది. అలాక్షణిక కార్యముగదా నిపాతనముచే సాధింపవలసినది?

ఎట్లు? ధాతుపాఠమున "వృధువృద్ధౌ" అను ధాతువు సామాన్యముగ, సాధు శబ్ద బుభుత్సువునకై యుపదిష్టమయియున్నది. దానికి బరముగ, "స్త్రియాం క్తిన్"(3-3-94) అని క్తి ప్రత్యయమును జేసికొనవచ్చును. ఇక ఆకారమును, ఐ, ఔ లును అక్షరసమామ్నాయమున నుపదేశింపబడినవి గదా. తపర సూత్రముచేతను 'ఆదిరన్త్యేన' సూత్రముచేతను వానికి 'ఆత్' 'ఐచ్' అను సంజ్ఞలు చేయబడినవి. ద్వంద్వశాస్త్రముచే, ఆదైచ్ పదము సాధువగుచున్నది. ఇట్లీ రెండు పదములకును సాధుత్వము సిద్ధమయియేయున్నది. కాగా నిది సాధుత్వ విధాయకశాస్త్రము కాదు. సంజ్ఞాసూత్రమే.

పోనిమ్ము. ప్రయోగనియమ బోధనార్థ మీ సూత్ర మనరాదా? వృద్ధి శబ్దమునకు పరముగనే ఆదైచ్ శబ్దము ప్రయోగింపబడవలెను. 'ఆదైజ్వృద్ధిః' అని యీ సూత్రము నియమించునని పాణిని తాత్పర్యమనవచ్చునుగదా అనిన, లోకమున ప్రయుక్తములగు స్వతంత్ర పదములకు, పౌర్వాపర్య నియమమ్ము నీశాస్త్రము బోధింపదు. పదములను సంస్కరించి సాధుత్వాన్వాఖ్యానముచే వానిని లోకమున వదలిపెట్టుటయే యీ శాస్త్రమునకు బని. వానికి పౌర్వాపర్య సంబంధము వక్తల వివక్షానుగుణముగ నుండవచ్చును. అది యెట్లనగా, 'ఆహర పాత్రమ్' అనియు ప్రయోగింపవచ్చును. 'పాత్రమాహర' అనియు ననవచ్చును. అంతే.

పోనిమ్ము. వృద్ధిశబ్దమున కాదైచ్చులు ఆదేశములగునని యర్థమన రాదా? అనిన, ఈ సూత్రమున షష్ఠ్యంతపదము లేదుగదా. షష్ఠీనిర్దిష్టమున కాయె ఆదేశములు విధింపబడునది.

వృద్ధిశబ్దమున కాదైచ్చు లాగమములగునని దీని కర్థమేల జేయరాదు? అందురా, ఆగమములును షష్ఠీనిర్దిష్టములకే వచ్చును. మరియు, నవి లింగముతో గూడి యుండును. అవి చేరునట్టి ప్రదేశమును సూచించు టిత్త్వమో, కిత్త్వమో, మిత్త్వమో అందుండును. ఇట షష్ఠియు లేదు- ఆగమలింగమును ఏదియు నగపడదు. కాగా నిది ఆగమవిధాయకమనుట కుదురదు.

మరియు నిందలి పదములకు ఇంకనొక విశేషము కలదు. అది సామానాధికరణ్యము, ఏకవిభక్తిత్వమును. ఇయ్యది రెండింటికి సంభవించునది. దేనికి? విశేషణ విశేష్యములకు గాని, సంజ్ఞాసంజ్ఞులకు గాని, దీనిని విశేషణవిశేష్యము లందుమా? అది కుదరదు. లోకమునందు, ప్రతీతపదార్థకములయినవానికే విశేషణవిశేష్యభావముండును. 'నీలముత్పలమ్' అనుచో, నీలోత్పల శబ్దార్థములు రెండును ప్రతీతములు. ఇట నాదైచ్ఛబ్దమునకు లోకప్రసిద్ధమగు నర్థము, వృద్ధి శబ్దార్థముతో నన్వయింపదగిన దేదియు లేదుగదా. కావున, పరిశేషమువలన, నీ పదములు సంజ్ఞాసంజ్ఞి భూతములేయని సిద్ధించుచున్నది.

ఇక నందేది సంజ్ఞి ? ఏది సంజ్ఞ ? అని సందేహము కలుగవచ్చును· అదియు నెచ్చట గలుగును? ఎచట, విధేయబోధకపదమును, అనువాద్యబోధకపదమును సమానాక్షరములై యుండునో యచట నట్టి సందేహమున కవకాశముండును. ఎచట నందొకటి, అల్పాక్షరమయియుండునో యట నది సంజ్ఞాపదమగును. బహ్వక్షరము సంజ్ఞి యగును. ఎందువలననందురా? లాఘవము కొరకే గదా సంజ్ఞలను చేసికొనుట.

మరియు నీ వ్యాకరణ సూత్రకర్తయు, అధ్యేతయు గురులఘు భావమును మాత్రమే నిర్ణాయకముగా స్వీకరింపరాదు. అనాకృతిత్వమును గూడ, పూర్వము చెప్పబడినదానిని, దీసికొనవలెను. లోకమున ఆకృతిమత్తగు మాంస పిండమునకు దేవదత్తాదిసంజ్ఞల గడపటంజేసి ఆకృతిరహితమయినది సంజ్ఞ యనియు, ఆకృతిమంతములు సంజ్ఞులనియు, నిర్ణయింపవలెను. లాఘవ మొక్కటియే నిర్ణాయకము గాదు.

లేదా - విధి ప్రదేశములందు, ''మృజేర్వృద్ధిః'' (7.2.114) మున్నగు చోట్ల, మరల మరల నుచ్చరింపబడు పదములు సంజ్ఞలు. సంజ్ఞి అట్లుచ్చరింపబడదు. కావున ఆవర్తింపబడునవి సంజ్ఞా పదములు అని చెప్పవచ్చును.వృద్ధ్యాదిశబ్దములకే ఆవృత్తి గలదు. లోకమునందును దానాదిక్రియలందు, దేవదత్తుడను సంజ్ఞి దూరస్థుడైనను, 'దేవదత్త' అను సంజ్ఞను ఆవర్తించుట కనబడుచున్నది. అసంనిహిత సంప్రదానకదానములును నామోచ్చారణమాత్రముచే, జేయబడవచ్చునని స్మృతులు బోధించుచున్నవి అట్టిచోట్ల సంజ్ఞలే గదా ఆవృత్తి.

లేదా - ముందుచ్చరింపబడినది సంజ్ఞి, తరువాత నుచ్చరింపబడినది సంజ్ఞ. ఎందువలననగా, కార్యి బుద్ధిస్థమైనగదా దానికి గార్యము ప్రవర్తించునదౌ లోకమునందును, మాంస పిండము బుద్ధిస్థమైన వెనుక, దానికి దేవదత్త సంజ్ఞ చేయబడుచున్నది.

అటులైన, 'వృద్ధిరాదైచ్' (1.1.1) అను సూత్రమున నెట్లు? అందు పూర్వోచ్చారితమే సంజ్ఞ గదా?

ఈ సూత్ర మొక్కచోటనే సంజ్ఞాశబ్దము ముందు ప్రయోగింపబడుట శంతవ్యము. మంగళము కొరకట్లు చేయబడినది పాణిన్యాచార్యుడు, తన మహా శాస్త్రమునందలి సూత్ర సముదాయమునకు మంగళము కలుగుట కొరకు వృద్ధి శబ్దమును మొదట ప్రయోగించినాడు. ఆదిని మంగళము నాచరించి రచించబడిన శాస్త్రములు ప్రథితములై సమాప్తి నందగలవు. శ్రోతలు వాద ప్రతివాదములందెతరులచే, పరాజితులు గాక వీర పురుషులయి యుందురు. వారు శాస్త్రార్థానుష్ఠానమువలన ధర్మోపచయము గలిగి ఆయుష్మంతు లగుదురు. ఆ శాస్త్రాధ్యేతలును వృద్ధియుక్తులగుదురు ఇట్టి తలంపుతో, నాతడు సంజ్ఞాపదమైనను వృద్ధిపదమును ముందు ప్రయోగించెను. వ్యాకరణ శాస్త్రమున నిది తప్ప, 'అదేఙ్గుణః' (1.1.2) ఇత్యాదులందంతటను పూర్వోచ్చారితము సంజ్ఞి. పరోచ్చారితమే సంజ్ఞ.

'ఆర్ధధాతుకమ్' 'కృత్' మున్నగు సంజ్ఞలను విధించిన సూత్రములందు వ్యత్యాస మున్నను నట శాబ్దక్రమమును మార్చి, శాబ్దబోధానుగుణమగు నర్థక్రమమును గల్పించుకొనవలెను; అని తాత్పర్యము.

సంజ్ఞాధికారమును జేసిన దోషము గూడ ప్రాప్తము. అష్టమాధ్యాయమునందుమ కొన్ని సంజ్ఞలు 'తస్యపర మామ్రేడితమ్' (8.1.2) మున్నగునవి పఠింపబడినవి. ఈ అధికార మచ్చటకును ననువర్తింపవలసి యుండును. సంజ్ఞా సంబంధము లేని అనేక సూత్రములతో వ్యవధాన ముండునుగాన నది శక్యము గాదు.

లేదా-వస్తుతః ఈ యత్న మనవసరముగ జేయబడుచున్న దనదగును. ఈ సంజ్ఞా కరణము, లోక వ్యవహారము కంటె విలక్షణమయినది కాదు లోక వ్యవహారము వేరు ఇది వేరు నయిన, సంజ్ఞాధికార రూపయత్న మావశ్యకమయ్యెడిది. ఎట్లన ఒకనికి గోవు అనగా నేదియో తెలియదు. వానికింకొకడు, ఒక ఆవును, దాని ఊరుప్రదేశముననో కర్ణముననో పట్టుకొని చూపించి, 'ఇది ఆవు' అని చెప్పును. వాని కది యావని అంతమాత్రమున దెలియును. 'ఆవని దీనికి పేరు' అని కూడ ఆ గోవు నెరుగని వానికీతడు చెప్పుటలేదు కనుక లోక వ్యవహారము నందువలెనే సంజ్ఞా సంజ్ఞి సంబంధము సిద్ధింపవచ్చును గాన సంజ్ఞాధికార మనర్థకము.

అయిన నచ్చట పూర్వ వ్యవహర్తల చేతనా సంజ్ఞా సంజ్ఞి భావ సంబంధము కల్పితమయియే యున్నదనవచ్చును

అపుడిచటను పూర్వులచే సంబంధము కృతపూర్వమే. ఏ పూర్వుల చేత నందురా? ఆచార్యులచేత, కాగా నుపదేశము సుకరమనుట.

ఇక నెవ్వని కిపుడుపదేశించుచున్నారో వానికది చేయబడలేదు. అనగా వానికది తెలియదు గదా. అతడెట్లు ఆ సంబంధమును దెలిసికొనవలెను? అని

యనవచ్చును.

అట్లైన, లోకమున గూడ ఉపదేశోద్దేశ్య భూతున కది చేయబడలేదు. ఇక 'ఇది గోవు' అను సామానాధికరణ్యముచేత నయ్యాది యనుమితమగునవిన నిచటను దుల్యమే.

## అన్యోన్యాశ్రయ పరిహారము

**"సతోవృద్ధ్యాదిషు సంజ్ఞాభావాత్ తదాశ్రయ ఇతరేతరాశ్రయత్వాదప్రసిద్ధిః"** అని అన్యోన్యాశ్రయాక్షేపవార్తికము. సతః = నిష్పన్నస్య, సంజ్ఞాభావాత్ = సంజ్ఞాయాః సంబంధాత్॥ తదాశ్రయే = సంజ్ఞాశ్రయే = సంజ్ఞి ఃధాయకే మృజేర్వృద్ధిరిత్యాదౌ శాస్త్రే॥ వృద్ధ్యాదిషు = వృద్ధిః ఇత్యాదిపదేషు అప్రసిద్ధిః = వాక్యార్థాప్రసిద్ధిః అని అన్వయము.

నిష్పన్నములైయున్న ఆదైచ్చులకు గదా వృద్ధ్యాదిసంజ్ఞలను జేయునది. "మృజేర్వృద్ధిః" (7-2-114) ఇత్యాది శాస్త్రము, సంజ్ఞాపదమగు వృద్ధ్యాది పదముచేతనే ఆదైచ్చులను విధించుచున్నది. అట్టిచోట్ల సంజ్ఞాసంజ్ఞులు పరస్పరాశ్రయములగుటచే వాక్యార్థము సిద్ధింపదు అని వార్తిక తాత్పర్యము.

అచ్చట ఇతరేతరాశ్రయత యనగా నెట్టిదన, ఆదైచ్చులు నిష్పన్నములయిన పిదప వానికి సంజ్ఞ కలుగవలెనుగదా, అట్టిస్థితిలో నిట 'వృద్ధి' అను సంజ్ఞచేతనే ఆదైచ్చులు నిష్పాదింపబడుచుండెను. కాబట్టి సంజ్ఞాసంజ్ఞిద్వయమితరేతరాశ్రయమగుచున్నది. ఇట్లితరేతరాశ్రయములగు కార్యము లెవ్వియు సిద్ధింపవు. చూడుడు. నావ నడుపువాడులేని రెండు నావలను ఒకదానితోనొకటి గట్టి, నదిలో వదలిన, ఆ నౌద్వయము అవతలి యొడ్డును జేరగలుగునా? మధ్యమార్గమున ప్రమాదము సంభవించిన నదొకటి రెండవదానిని రక్షింపగలుగునా? లేదు.

ఆర్యా! అట్లందురేమి? ఇతరేతరాశ్రయములగు కార్యములు గూడ లోకమున గనబడుచున్నవే? నావ శకటమును, శకటము నావను వహించుటలేదా? వహనక్రియలో నితరేతరాపేక్షవానికి లేకున్నను నభిమతదేశమునకు జేరుటలో నితరేతరాశ్రయత గలదు గదా. అనిన- ఈ దృష్టాంతము సరిపడదు. అచట నితరేతరకార్యసిద్ధికి వేరు కారణము గలదు. నీరో నేలయో యటనున్నది. నేలను శకటము నావను మోసికొనిపోవుచున్నది. నావ నీటిలో శకటమును జేరవేయుచున్నది.

పోనిండు- త్రివిష్టబ్ధకమితరేతరాశ్రయము. త్రివిష్టబ్ధకమనగా ఒకదానితో నొకటి చేర్చిపెట్టి, కాటా కట్టి తూకముచేయు మూడు బొంగు వెదురులు.

అచటను గారణాంతరము కలదు. అది సూత్రకము. అనగా మేకో పగ్గమో. మేకును బిగించి గాని, త్రాటగట్టి గాని దానిని నిలుపుదురు. "మృజే

ర్వృద్ధిః" (7-2-114) అనుచోట నన్యోన్యాశ్రయత తప్పదు.

"సిద్ధంతు నిత్యశబ్దత్వాత్" అనునది పరిహారవార్తికము.

శబ్దములు నిత్యములు. శాస్త్రకల్పితములు కావు. ప్రయోగములందున్న ఆదైచ్చులకు 'వృద్ధి' అని సంజ్ఞచేయబడుచున్నది. అంతే సంజ్ఞచేతనే ఆదైచ్చులు కల్పింపబడుటలేదు. "మృజేర్వృద్ధిః" (7-2-114) అను సూత్రమునకు 'మార్ష్టి' మున్నగు ఆకారఘటిత రూపములును సాధువులు' అని సాధుత్వాన్వాఖ్యానమే తాత్పర్య విషయము గాని, అపూర్వమగు ఆకారమును విధించుట గాదు అని భావము.

శబ్దములు నిత్యములైన నిక శాస్త్ర మెందులకు ? అను నాక్షేపమునకు సమాధానవార్తికము- "కిమర్థం శాస్త్రమితిచేన్నివర్తకత్వాత్సిద్ధమ్" అనునది.

నిత్యశబ్దత్వపక్షమునందైనను శాస్త్రము వ్యర్థము కాదు. నివర్తకముగ నది యావశ్యకమే. అనగా నెట్లన-

సాధుశబ్ద బుభుత్సువులకు శాస్త్రముపదేశింపబడినది. పాణిని, ధాతుపాఠమునందు, 'మృజూశుద్ధౌ' అని 'మృజ్ః అను ధాతువు నుపదేశించుటచేత నిది యే ప్రత్యయముతో గూడినను ఋకారఘటితముగనే యుండును' అను నభిప్రాయము కలుగుచున్నది. అపుడు, 'మృజేర్వృద్ధిః' అను నీ సూత్రముచేత నా యభిప్రాయమును నివర్తింపజేసి, ఈ ధాతువునకు, కిత్తులును జిత్తులును గాని ప్రత్యయము బరమైనపుడు, 'మృజ్' అనుదానికి బదులుగా 'మార్జ్' అనునది సాధువగునని బోధింపబడుచున్నది. ఇదియే శాస్త్రమునకు కృత్యము

## 'సముదితములకు సంజ్ఞ కాదు' అను నిర్ణయము

"వృద్ధిగుణసంజ్ఞయోః ప్రత్యేకంవచనమ్"- అని యాక్షేపవార్తికము 'వృద్ధిరాదైచ్' 'అదేఙ్గుణః'- అను సూత్రములందు, 'ప్రత్యేకం' అను పదముండవలెను. గుణవృద్ధి సంజ్ఞలు, ప్రత్యేకముగ నాయావర్ణములకు వచ్చునని చెప్పవలెను. ఎందులకనిన, ఆదైచ్సముదాయమునకు వృద్ధిసంజ్ఞయు, అదేఙ్సముదాయమునకు గుణసంజ్ఞయు రాకుండుటకై యట్లుచెప్పనగును. లేకున్న ఆదైచ్, అదేఙ్ పదములు ద్వంద్వ నిర్దిష్టము లగుటవలన శతదండనన్యాయము చేతను, 'మృజేర్వృద్ధిః' (7 2.114)' 'మిదేర్గుణః' (7 3 82) అని విధింపబడిన వృద్ధి గుణములు, లక్ష్యములందు, ఆదైచ్ సముదాయమును, అదేఙ్సముదాయమును రావలసివచ్చును.

"అన్యత్ర సహవచనాత్సముదాయే సంజ్ఞాప్రసంగః" అని, ఆక్షేప నిరాకరణ వార్తికము.

సముదాయ ప్రతిపత్తి యత్నసాధ్యము. యత్నము లేనిచో నది కలు

గదు. ప్రత్యేక ప్రతిపత్తియే కలుగును. సముదితములను కార్యము సాధింప దలచినపుడు, "సహసుపా" (2.1 4) "ఉభేత్యస్తం(సహ)"(6.1.5) ఇత్యాది స్థలము లందు 'సహ' అను పదమును, సూత్రకారుడు, చేర్చియున్నాడు. ప్రకృతమున నట్టి యత్నవిశేషము లేనందున సముదాయ ప్రతిపత్తి కలుగదు. ప్రత్యేక ప్రతిపత్తియే కలుగును. సమాన సంజ్ఞాఖ్యాస్త సంజ్ఞలు, సముదాయమున ప్రవర్తించుట సమ్మతము. కావున నట సహగ్రహణము చేయబడినది. కాన, ప్రత్యేక వచనమనావశ్యకము.

"ప్రత్యవయవంచ వాక్యపరిసమాప్తేః" అని ఆక్షేపకారక వార్తికాన్తరము. మరియు, వాక్యార్థ పరిసమాప్తి, సముదాయావయవములందు, ప్రత్యేకముగనేయనుభవగోచరమయి యున్నది. వాక్య పరిసమాప్తి యనగా వాక్యార్థ ఫల సంబంధము. "దేవదత్త యజ్ఞదత్త విష్ణుమిత్రాః భోజ్యన్తామ్" 'దేవదత్త యజ్ఞదత్త విష్ణుమిత్రులకు ముప్వురకును భోజనమును బెట్టుడు' అని చెప్పినపుడు, ముప్వురకును నొక భోజన మీయబడ లేదు. ప్రత్యేకముగనని చెప్పకున్నను, ముప్వురకును మూడు భోజనములు పెట్టబడుచున్నవి. భోజనక్రియా పరిసమాప్తియట, ప్రతి వ్యక్తియందే యగపడుచున్నది గదా.

సముదాయమునందే వాక్యార్థ పరిసమాప్తికిని, దృష్టాంతము "గర్గాః శతం దణ్డ్యన్తామ్" అనునదియు కలదే? 'గర్గులనుండి నూరు బంగారు ముద్రలు వసూలు చేయుడు' అని యర్థము. దండించుటయనగా, వస్తు విధించి తీసికొనుట గాని, శరీర దండనము గాదు. రాజులకు గావలసినది హిరణ్యము దాని వలన వారి కది లభించును. ఇట గర్గులనేకులున్నను, వారి మొత్తమునుండి యొక్క శతమే గ్రహింప బడుచున్నది-

సత్యమే, ఈ దృష్టాంతమును గలదు. ఇది యున్నను నచట సహగ్రహణ మవసరమయిన నిచట ప్రత్యేక మను వచనమును నావశ్యకమగును శతదండన న్యాయమువలన, సముదాయమునందే సమాఖ సంజ్ఞ సిద్ధించును గాన సహ గ్రహణము యోగవిభాగార్థమేకాని సముదాయ ప్రతిపత్తి కొరకు కాదనిన, నిట, ప్రత్యేక మను వచనమును నిష్ప్రయోజనము, అర్ధజరతీయ మనుచితము.

## తపరకరణ ప్రయోజన విచారము

ఈ సూత్రమున ఆకారము తపరముగా నెందుల కుచ్చరింపబడినది? "ఆకారస్య తపరకరణం సవర్ణార్థమ్" అని సమాధానవార్తికము. ఆకారమునకు తపరకరణము చేయబడుట ఎందులకనగా, సవర్ణములనది గ్రహించుటకు. "తపరస్తత్కాలస్య" (1.1.70) అని తత్కాలములగు సవర్ణములకు గ్రహణము సిద్ధింపవలెను, అవి ఎయ్యవి? ఉదాత్తము, అనుదాత్తము, స్వరితమునగు ఆకారములు.

లేకున్నను గ్రహణమేల కలుగదు? గుణములు వ్యక్తికి భేదమును గల్పింపవుగదా? ఒకడు ముండిత శిరస్కుడై యున్నపుడు దొంగతనమును జేసెను. వాడు కొన్ని దినములకు దరువాత కుంతలములు గల వాడగును, అపుడును వానిని దొంగయనియే యందురు. కాగా గుణముల మార్పు వ్యక్తికి మార్పును జేయవు. ఉదాత్తాదులును గుణములే.

అట్లు కాదు. స్వరములు భేదకములే. "భేదకత్వాత్స్వరస్య" అని వార్తికము. ఉదాత్తాదులు ఉపాత్త విజాతీయములకు నివర్తకములని యెట్లు తెలియబడుచున్నది?

లోకమున నట్లగపడుచుండుటవలన దెలియుచున్నది.

అథర్వణవేదమున 'ఖండికలు' అని కొన్ని భాగములు కలవు. వానిని సంతచెప్పునపు డుపాధ్యాయుడు, శిష్యుడుదాత్తమును బలుకవలసినచోట, అనుదాత్తము నుచ్చరించిన, అరే! నీ వొకస్వరమును బలుకవలసియుండ నింకొక స్వరమును బలుకచుంటివా ? యని చెంపదెబ్బ కొట్టును. ఉదాత్తాదులు భేదకములు కానిచో నాతడెందులకట్లు కొట్టవలె?

అయిన, తపరకరణమునకి ప్రయోజనము గలదందువు? అనక యేమి? కలదని నిశ్చయముగ దెలిసికొనుము.

'భేదకత్వాత్స్వరస్య' అను వార్తికమునకు న్యాసాంతరము, "భేదకత్వాద్గుణస్య" అనునది. అట్లా వార్తికమును మార్చవలసి యున్నది. ఎందుల కనగా - అనునాసిక్యము, గుణము. అది స్వరము కాదు. ఆ గుణముచే వేర యినదానికి గూడ సవర్ణమునకు గ్రహణ మావశ్యకము. ఎందుకు కలుగదనిన, గుణము భేదకమగుటవలననే ప్రాప్తించుటలేదు. ఇవి భేదకములని యెట్లు తెలియుచున్నదనిన - లోకమున నిట్లగపడుచున్నది. చూడుడు ఒక పాత్రలో నున్న ఉదక ద్రవ్యమంతయును నేకమేగదా. అయినను, శీతోష్ణ గుణకృతమగు భేదమువలన 'నీ నీరు చల్లనిది.' 'ఇది వేడి నీరు' అని భిన్నద్రవ్యముగా వ్యవహరించుట కనుచున్నాము గదా. కాగా అనునాసిక్యముగల ఆకారమునకును గ్రహణము సిద్ధించుట తపరకరణమునకు ప్రయోజనము.

ఏమండీ! గుణము భేదకము కాకుండుట గూడ లోకమున కానబడు చున్నదే? ఎట్లందురా చూడుడు. దేవదత్తుడు శిఖగల్గియున్నను, జటలు పెంచుకొని యున్నపుడును, లేదా, పూర్తిగ ముండనము జేసికొనియున్నపుడైనను 'దేవదత్తుడు' అను తన పేరును వదిలిపెట్టుటలేదు కదా! ఇట్లే ఎద్దుకు, బలివర్దము అను పేరు, అది లేతదిగనున్నపుడును, ముదురదయినను, ముసలిదయినను, దూడఅయినను, దుక్కిదయినను మారలేదు. కావున గుణభేదమున్నను, 'అదియే యిది' అను ప్రత్యభిజ్ఞచేత వ్యక్తికి ఐక్యమేగాని భేదము లోక వ్యవహారమునందు కానరాదు.

సరి ఈ దృష్టాంతమువలన గుణముల విషయమున భేదాభేదములు రెండును 'బఠిపాఠింపబడినవి. అందేపక్షము శాస్త్రమునందు గ్రహింపదగినది? అనిన,

'<u>గుణములు భేదకములు కావు</u>' అను పక్షమే న్యాయ్యము. వేద శబ్దముల నుదాత్తానుదాత్త స్వరితములతో నుచ్చరింపవలెనను నియమము గలదు. కనుక వేదమున గుణములు భేదకములే యనక తీరదు. లోకమున నుభయవిధ వ్యవహారము నగపడుచున్నది. గోపిండమును, వత్సత్వాద్యవస్థలందు దానికి మూల్యభేదమగపడుచుండుటవలన, భిన్నముగను, 'ఆగోవేయిది' అను ప్రత్యభిజ్ఞచే నభిన్నముగను వ్యవహరించుచున్నాము శాస్త్రమునందు మాత్రము గుణముల భేదకము లనుటకు జ్ఞాపకము కలదు. "అస్థిదధిసక్థ్యక్ష్ణామనఙుదాత్తః" (7-1-75) అను సూత్రము, అస్థి, దధి, సక్థి, అక్షి శబ్దములకు తృతీయాద్యజాది విభక్తులు పరమగునపుడు 'అనఙ్' అను నాదేశము వచ్చుననియు, అది ఉదాత్త స్వరముగలది యగుననియు బోధించుచున్నది. సూత్రమున పాణిని 'ఉదాత్తః' అను పదమును గూడ జేర్చెను. ఆ యాదేశము నాతడు, ఉదాత్తముగా నుచ్చరించిన జాలును గదా? తానట్లు చేయక అయ్యది నుదాత్తముగ నుచ్చరింపబడవలెనని కంఠోక్తిగ శాసించుటలో నాతని యాశయమేమయియుండునని పరిశీలించిన, "అట్లుచ్చారణ మాత్రమున పనిగాదు ప్రయత్న విశేషము లేకుండగ నూరక యొక స్వరముతో నుచ్చరించిన మాత్రమున నయ్యది భేదకము కాజాలదు." అని జ్ఞాపన చేయుట కుదాత్తపదోచ్చారణమను యత్నమును జేసి ఉదాత్తస్వరమును శాసించుట యావశ్యకమని యాతని భావముగా దెలియవచ్చుచున్నది. కనుక నది గుణాభేదకత్వజ్ఞాపకము.

'ఓహో! అటులైన నొక యాక్షేపము కలదు. "అనుదాత్తాదేరఞ్" (4-2-44), "బహ్వ్రీహేశ్చాంతోదాత్తాత్" (4-1-52) మున్నగు శాస్త్రములచే జెప్పబడిన కార్యవిశేషములు, స్వరితాది ప్రాతిపదికములకంటెను, స్వరితాంతముల కంటెను గూడ నేల ప్రవర్తింపరాదు? గుణములభేదములే గదా? అను నాక్షేపమునకు సమాధానమును వినుడు.

శబ్దతః గాని, నిపాతనరూపమున గాని యాశ్రయింపబడిన గుణము భేదకమే యగును. ఏలయన- "శుక్లమాలభేత", "కృష్ణమాలభేత" అను విధులలో శబ్దప్రతిపాదితములైన శుక్లకృష్ణగుణములు భేదకములే గాని అభేదకములు కావు. శుక్లగవాలంభమునకు మారుగా కృష్ణగవాలంభమును జేసినయెడల వారు యథాశాస్త్రముగ ననుష్ఠించినవారు గారు. కాగా నాక్షేపము సమాహితమైనది. తపరకరణ మనావశ్యకమనియు ఫలితము.

అటులైన సందేహము కలుగకుండుటకై తపరకరణము చేయబడినదందుము. తకారము లేనిచో 'వృద్ధిరైచ్' అనియే సూత్రమును బఠింపవలెను.

అపుడు అ + ఐచ్ = ఐచ్, అని వృద్ధిచే నిట ఆకారము గూడ నిర్దేశింపబడినదా? లేక ఐ, ఔ లు మాత్రమే నిర్దిష్టములా ? అని సందేహము కలుగవచ్చును.

ఓహో ! సందేహమాత్రమేకదా ! సందేహములు కలిగినచోట్లనెల్ల 'వ్యాఖ్యానమువలన సందేహ నివృత్తిని జేసికొని, అన్యతరార్థనిశ్చయమును బడయనగును గాని, సందేహజనకమయిన లక్షణ మలక్షణమని విడువరాదు'. 'వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిర్న హి సందేహాదలక్షణమ్' అను పరిభాష ఉపస్థిత మగును. 'ఆకారమునకును, ఐకారమునకు, ఔకారమునకును- మూడింటికి నీ సూత్రమున గ్రహణము కర్తవ్యము' అని వ్యాఖ్యానింతుము. ఇతరత్ర, ఇట్టి సందేహముల కవకాశముగల, "ఔతోమ్శసోః" (6-1-93) మున్నగు సూత్రము లందు, యత్నవిశేషమేదియు సందేహనివృత్తికై చేయబడలేదు.

అటులైన ఆకారాంశమున తపరకరణమునకు ప్రయోజనము లేకున్నను, 'ఐచ్' అనుచోట నది సార్థకమగును. ఉత్తరసూత్రమున ఏజంతము అనునది సప్రయోజనము. స్థానులు త్రిమాత్రికములుగాని చతుర్మాత్రికములు గాని యయినపుడు, ఆంతరతమ్యమువలన నాదేశములును అట్టివి ప్రసక్తము లగును. "ఖట్వా + ఇన్ద్రః = ఖట్వేన్ద్రః; ఖట్వా + ఉదకమ్ = ఖట్వోదకమ్; ఖట్వా + ఈషా = ఖట్వేషా; ఖట్వా + ఊఢా = ఖట్వోఢా-అనుచోట త్రిమాత్ర చతుర్మాత్రస్థానులకు, అట్టి గుణవర్ణములను వారించుటయు, 'ఖట్వా' అను పదమునకు, 'ఏలకా', 'ఓదనః'. 'ఐతికాయనః', 'ఔపగవః' - అను పద ములు పరములగునపుడు. త్రిమాత్రచతుర్మాత్రాదేశములను వారించుటయును దానివలన సిద్ధించును. తకారమాసూత్రములందు జేయబడినను, త్రిమాత్ర చతుర్మాత్రాస్థానులకట్టి యాదేశములెట్లు వారింపబడును ?

"తపరస్తత్కాలస్య" (1.1.70) అను నియమమువలన వారింపబడును. తపరమనగా 'తకారము పరముగాగలది' అని యర్థముగదా ?

అదియే అర్థముగాదు. తకారముకంటె బరముగానున్నదియు దపర మగును. అట్లైన, "ఋదోరప్" (3.3.57) అను సూత్రముచే విహితమైన 'అప్' ప్రత్యయము 'యవః' 'స్తవః' అనుచోటనేగాని, దీర్ఘోకారాన్తములగు 'లూ' 'పూ' ధాతువులకు 'లవః' పవః అనుచోట రాకపోవునె ?

అటనది తకారము కాదు. మరియేమి ? దకారమది. దకారోచ్చా రణమునకేమిప్రయోజనము ?

తకారోచ్చారణమునకు మాత్రమెయ్యది ప్రయోజనము ? తపరపదమున పంచమీతత్పురుష నంగీకరింపనివారికదియు వ్యర్థమేగదా. వారు, 'తకారము మాకు అసందేహార్థము' అనవలె. అప్పుడు దకారమును అసందేహార్థమేయగును. ముఖసుఖార్థమందురా ? దకారమునకు నుచ్చారణ సౌకర్యముననే యగును.

తకారమైజర్థమనియే పాణిని తాత్పర్యము. ఆనుషంగికముగ నది ఆకారార్థము నగును. జ్ఞాపకాదులవలన నిట ఆకారము గూడ ప్రశ్లిష్టమైయున్నదని తెలిసికొనుటలో గౌరవము కలదు తకారమున్నపుడాకారమునకు స్వరూప ప్రతిపత్తి స్పష్టము. అది పూర్వశేషమే. ఆత్, ఐచ్, అనియే విభాగము. ఆ, దైచ్ అని కాదు. కనుకనే ఐశ్త్వము సిద్ధించినది.

"వృద్ధిరాదైచ్"

## ॥ఇకోగుణవృద్ధీ॥

### యోగవిభాగ ప్రయోజన విచారము

ఈ సూత్రమున, 'ఇకః' అను పదమెందులకు? సమాధాన వార్తికము- "ఇగ్గ్రహణమాత్సంధ్యక్షరవ్యంజననివృత్త్యర్థమ్"- అనునది.

ఇగ్గ్రహణమును జేయుట యెందులకనగా ఆకారమునకును, సంధ్యక్షరములకును, వ్యంజనములకును గుణవృద్ధిస్థానిత్వమును నివర్తింపజేయుటకు.

అందాకారనివృత్త్యర్థమనగా- 'యాతా', 'వాతా' అను 'యా' 'వా' ధాతువుల తృజన్తరూపములందు, ధాత్వాకారమునకు, "సార్వధాతుకార్ధధాతుకయోః" (7-3-84) అను సూత్రముచే గుణము ప్రాప్తించుచున్నది. దానిని నివారించుట కిందు 'ఇకః' అనునది యావశ్యకము.

అట్లే, 'గ్లాయతి', 'మ్లాయతి' అను రూపములలో, 'గ్లై', 'మ్లై' ధాతువుల ఐకారమునకు, ఏకారము గుణముగా రాకుండుటకును ఇగ్గ్రహణము.

'ఉమ్భపూరణే' అను ధాతువునకు, 'ఉమ్భితా', 'ఉమ్భితుమ్', 'ఉమ్భితవ్యమ్' అనునవి- తృచ్, తుమున్, తవ్యప్రత్యయాంతరూపములు. ప్రకృత సూత్రమునందిగ్గ్రహణము లేనిచో నీ రూపములలో, ధాతుభకారస్థానమున, ఓష్ఠ్యమగు ఓకారము గుణముగా రావలసివచ్చును. తద్వారణమును ప్రయోజనము. అందువలననే "న ధాతులోపఆర్ధధాతుకే" (1-1-4) అను సూత్రముతో గలిపియే యీ సూత్రమును బఠింపలేదు.

### ప్రయోజన నిరాకరణము

ఆకారమునకు గుణస్థానిత్వవ్యావృత్త్యర్థమిగ్గ్రహణ మావశ్యకముగాదు' పాణిన్యాచార్యుని ప్రవృత్తివలన ఆకారమునకు గుణమురాదని మనకు దెలియుచున్నది. ఆతడు "ఆతోనుపసర్గే కః" (1-2-3) అని యొక సూత్రమును రచించి, దానిచే, 'గోదః' కంబలదః మున్నగు స్థలములందు ధాతువునకు పరముగా కప్రత్యయమును విధించియున్నాడు. అట, ప్రత్యయ స్వరూపము 'అ'కారము మాత్రము. కకారము ధాతువునందలి యాకారమునకు లోపము కలుగుటకై

అనుబంధముగా జేర్చబడినది. అజాదియు కిత్తునునగు ఆర్ధధాతుకము పరమగు నపుడు, ఆకారమునకు లోపము విధింపబడినది. ఈ కకారము లేకుండిన ఆ లోపము రాదు. రూపము సిద్ధింపదు', అని ఆశయము. ఆకారమునకు గుణ వర్ణము లాదేశముగ వచ్చుట యాతని కిష్టమైన, నిట దా ధాతువునందలి ఆకారమునకు, సార్వధాతుకగుణము అకార మాదేశమయి, ప్రత్యయాకారముతో పరరూపము కాగా, 'గోదః' మున్నగు రూపములు సిద్ధించునుగదా. కకారాను బంధ మెందులకు ? అనగా, ఆకారమునకు గుణము రాదని పాణిని దృష్టియని వ్యక్తము.

ఇక సంధ్యక్షరమునకు గుణమును వారించుటకును ఇక్పదమక్కర లేదు. 'గ్లై' 'మ్లై' మున్నగు ధాతువులందు, ప్రక్రియాలాఘవమునకై ఏకారమునే యుపదేశింపవచ్చునుగదా. అట్లు చేయక ఐకారోపదేశము చేయుటవలన సంధ్యక్షరమునకు గుణము రాదని యాశయము.

వ్యంజనమునకు గుణవృద్ధిస్థానిత్వవారణమును ప్రయోజనము కాదు. వ్యంజనములకు గుణము రాదనియు నాచార్యప్రవృత్తివలననే తెలియును. ఎట్లనిన 'జనీప్రాదుర్భావే' అను ధాతువునకు పరముగా 'డ' అను ప్రత్యయము విధింపబడినది. ప్రత్యయమునందు డిత్త్వము, టి లోపము కొరకై యేర్పడినది. 'ఉపసరజః', 'మందురజః' ఉదాహరణములు ధాతువుయొక్క 'టి' భాగమును అన్ ' కు లోపము రావలెనని తలంపు.

వ్యంజనములకును గుణవర్ణాదేశము వచ్చునెడల, నకార స్థానమున గుణ వర్ణము హ్రస్వాకారము రాగా మూడకారములకును బరరూపముచేత నా రూపములు సిద్ధించునుగదా ? డిత్త్వమునకు బనియేమి ?

## జ్ఞాపక నిరాకరణము

ఇవెవ్వియు జ్ఞాపకములు కావు కిత్త్వమువలన, ఆకారమునకు గుణము రాదను నంశము జ్ఞాపిత మగునంటిరే యది కుదురదు. ఉత్తర సూత్రము నను వర్తించుట కది యావశ్యకము గాన వ్యర్థము గాదు. "ఆతోఽనుపసర్గేకః (3-2-3) అను సూత్రమునుండి "తుందశోకయోః పరిమృజాపనుదోః" (3-2-5) అను నుత్తర సూత్రమునందికప్రత్యయ మనువర్తింపవలెను కిత్త్వమునకట, 'తుందపరిమృజః' 'శోకాపనుదః' అను లక్ష్యములందు గుణవృద్ధి నిషేధము ప్రయోజనము కలదు గాన నయ్యది జ్ఞాపకము కాజాలదు.

పోనిమ్ము. "గాపోష్టక్" అను సూత్రమున, టక్ప్రత్యయమునందలి కిత్త్వము జ్ఞాపకము కావచ్చును. అచట కిత్త్వమునకు వేరు ప్రయోజనము లేదు.

ఉపదేశ సామర్థ్యమువలన సంధ్యక్షరమునకు గుణము ప్రవర్తింపదుగనుక

సంధ్యక్షరమునకు స్థానిత్వనివృత్త్యర్థమను ఇక్పద మావశ్యకము కాదంటిరే? అదియు గుదురని మాట. సంధ్యక్షరములకు ప్రాప్తించుచున్నట్టి ఉపదేశ సామ ర్థ్యము వలన బాధింపబడుననిన ఆయాద్యాదేశములు ప్రాప్తింపకపోవును.

అది అనుపపత్తి కాదు ఏ కార్యమున కుపదేశ మనర్థకమో ఆ కార్యము బాధింపబడును. గుణము వచ్చినయెడల 'గ్లె', 'మ్లె' అని ఐకారాంతోపదేశమనర్థ కము, 'గ్లె', 'మ్లె' అనియే ధాతుపాఠమున నుపదేశింపవచ్చునుగదా. ఇక నే విధికి ఐకారోపదేశము నిమిత్తమేయగునో యది బాధింపబడదు. ఆయాదుల కైకారోపదేశము నిమిత్తమే ఆయె. 'గ్లాయ్' అని పఠించుట సాధ్యపడదుగదా. అట్లు పఠించిన, భావార్థక ప్రయోగమున 'గ్లాయతే' అని రూపము కావలసి వచ్చును.

"జనిప్రామ ర్ఘావే" అను ధాతువునకు డ ప్రత్యయమును విధించుట, వ్యంజనమునకు గుణము రాదనుటకు జ్ఞాపకమనుటయు బొసగునది కాదు. 'మందురజః' ఇత్యాదులందు గుణముచే నిర్దేశించిన గదా, సిద్ధించినను, ఆరం భింపబడినది గనుక 'డ' విధానము జ్ఞాపకమగునసుట. ఆ గుణము అకార స్థానమున, అకారమే వచ్చుననుట యెట్లు? ఏకారముగాని ఓకారముగాని ఏలరాదు? అనిన,

వ్యంజన మర్ధమాత్రికము. దాని స్థానమున వచ్చు గుణమును ఈషత్సా మ్యమువలన, మాత్రికమైన హ్రస్వాకారమే వచ్చును. కాగా నది వ్యంజనము నకు గుణము రాదనుటకు జ్ఞాపకము కావచ్చునని సమాధానము.

అయినను అనునాసికమగు అకారము ప్రాప్తించునుగదా? కానిమ్ము. ప్రాప్తించిననేమి? తరువాత పరరూపముచే నది శుద్ధమగును. కాగా జ్ఞాపకము సుస్థము అని పర్యవసించును.

డ ప్రత్యయమునందు డిత్త్వము లేనిచో నుపపన్నముగాని ప్రయోగ ములు కలవు. అవి సిద్ధించుటకు డిత్త్వము సార్థకమగును గాన జ్ఞాపకము కాజా లదు. "సప్తమ్యాంజనేర్డః" (3-2-97) అను సూత్రమునుండి; "అన్యేష్వపి దృశ్యతే" (3-2-101) అను సూత్రము ననువర్తించు 'డః' అనునది డ ప్రత్యయమును గమ్ ధాతువుకుగూడ విధింపవలెను. అటు గుణముచే గుదురదు. గుణమువచ్చిన మకార స్థానమున, ఆన్తరతమ్యమువలన ఓకారమోష్ఠస్థానికము ప్రాప్తించును. అందువలన ప్రత్యయమునందు, టి లోపసంపాదనమునకై కిత్త్వము తప్పదు. కాగా వ్యంజనమునకు గుణస్థానిత్వ నివృత్తికొరకు పృథక్సూత్రమావశ్యకము' అని తేలినది.

## 'ఇకః' అను పదమునకు స్థాపనమేది?

ఈ సూత్రమున ఇకః అను పదమున్నపుడు, "దివఔత్" (7-1-84), "పథిమథ్యృభుక్షామాత్" (7-1-85), "త్యదాదీనామః" 7-2-102) అను సూత్రము

లచే విధింపబడిన ఔకార, ఆకార, అకారాదేశములు గూడ గుణవృద్ధివర్ణము లగుటంజేసి, ఆ సూత్రమునందును 'ఇకః' అను పదమగును గాన, 'ద్యౌః' 'పన్థాః' 'సః' 'ఇమమ్' అను నుదాహరణములందు ఇక్కు స్థానముననే రావలసి యుండును. ఇక్కు లేనిచోట రానే రాకపోవును. ఇది దోషముగదా? అను వాక్షేపమునకు సమాధానవార్తికము— "సంజ్ఞయావిధానేనియమః" అనునది.

గుణసంజ్ఞా, వృద్ధిసంజ్ఞా పదముల నుచ్చరించి విహితములయిన గుణవృద్ధి-వర్ణముల విషయమునందే, ఈ పరిభాషారూపమగు నియామకశాస్త్రము ప్రవర్తించును. కావున నా దోషము తగులదు. లేనియెడల 'ద్యౌః' అనుచో ఔత్వమికారస్థానమునను, పథిన్‌లో ఆత్వమును నికారస్థానమునకు, ఇదమ్‌లో అత్త్వము నికారస్థానముననే వచ్చెడివి. 'తద్' శబ్దములో నిక్కు లేనందున రాకనే పోవును.

'సంజ్ఞచే గుణవృద్ధులు విహితములయినచోటను' అని అపూర్వముగ జెప్పవలసియుండునని భావమా?

కాదు. చెప్పబడని దెట్లు తెలియబడును?

గుణవృద్ధి పదములను 'గుణవృద్ధీ' అని యీ సూత్రమున గ్రహించి నందువలన, తద్బలముచే తెలియబడును.

ఇందు 'గుణవృద్ధీ' అను పదము లేనిచో ఇక్కుస్థానమున గుణవృద్ధు లెట్లు సిద్ధించును? ప్రకృత గుణవృద్ధి గ్రహణ మనువర్తించును.

ఎచ్చట, ప్రకృతము? 'గుణవృద్ధీ' అను సమస్తపదము ప్రకృతము కాదే? సమస్తములు గాని, 'గుణః' 'వృద్ధిః' అను పదములు పూర్వసూత్రముల నుండి అనువర్తించును.

అట్లనువర్తించినయెడల, 'అదేఙ్లు గుణములగును, వృద్ధులు నగును' అని అదేఙ్లకు వృద్ధిసంజ్ఞయు ప్రాప్తించునే?

ఆదైజ్గ్రహణ సంబద్ధమగు వృద్ధిపదమనువర్తించును గాని కేవల వృద్ధిపద మనువర్తింపదు. 'వృద్ధిరాదైచ్'- 'అదేఙ్గుణః' అని సూత్రక్రమము. ఇందు రెండవసూత్రములోనికి, ఆదైచ్పదసంబద్ధమైన వృద్ధిపదమనువర్తించును. ఇందాదైచ్పదానువృత్తి స్వకార్యముకొరకు గాదు. అనగా తమకు గుణసంజ్ఞకొరకు కాదు. వృద్ధిశబ్దమునకు ఆదైచ్చులతోడనే సంబంధము. అదేఙ్లతో కాదు అని తెలియజేయుటకే. తరువాత 'మూడవ సూత్రము,' "ఇకోగ్గుణవృద్ధీ" అనునిది. ఇందు 'అదేఙ్' అను పదమువలె, ఆదైచ్ అనునదియు నివృత్తమగును. స్వరితత్వము లేనందున ననువర్తింపకుండుటయే నివృత్తియగుట, 'వృద్ధిః' 'గుణః' అను పదములు మాత్రమే అనువర్తించును.

లేదా ఇట్లును జెప్పవచ్చును. అధికారములు మండూకగతి కలవి.

అనువర్తించు పదములు కప్పగతివంటి గతి గలవి. కప్పలు ప్రదేశము నంతను దమ గమనముచే నాక్రమింపవు. ఎగిరి ఎగిరి దూకుచుండును. నడుమ కొంత ప్రదేశము స్పృశింపబడదు. అట్లే నడుమ కొంత ప్రదేశమును వద లియు నుత్తరసూత్రములందు ఆకాంక్షావశమున నా యాపదములు అను వర్తింపవచ్చును. కావున అదేఙ్ సూత్రమునందనువర్తింపకయే వృద్ధిపద 'ఇకో గుణవృద్ధీ' అను సూత్రములోని కనువర్తింపవచ్చును.

లేదా — "వృద్ధిరాదైజదేఙ్గుణః" అని ఒకటే సూత్రమును జేయు దుము. "ఆదైచ్చులు వృద్ధి సంజ్ఞకములగును. అదేఙ్లులు గుణసంజ్ఞకములు" అని సంగ్రాహకవాక్యార్థ బోధకలుగును. భవతిక్రియ, ఒకటియే. ఏకసూత్రమైన నిఁక అందనువృత్తి యుండదుగదా?

లేదా, "అన్యవచనాచ్చకారాకరణాచ్చ ప్రకృతాపవాదో విజ్ఞాయతేయథోత్స ర్గేణ ప్రసక్తస్యాపవాదోబాధకో భవతి" అని సమాధానాంతరము.

అదేఙులకు, వృద్ధి సంజ్ఞకంటె వేరయిన గుణసంజ్ఞను విధించుట వల నను సమావేశమును వేధించు చకారము లేనందునను, ఉత్సర్గాపవాద స్థలము లందు వలె నుత్సర్గ ప్రసక్తమున కపవాదము బాధకమగును. కాగా వృద్ధి సంజ్ఞకు గుణసంజ్ఞ బాధకము. '**అదేఙ్గుణః**' అను సూత్రమునందు వృద్ధి పద మనువర్తించినను, ఆ అనువృత్తికి ఉత్తరసూత్రముననే ప్రయోజనమా? లేక ప్రకృతసూత్రమున గూడ కలదా? యను సందేహము కలుగును. మరియు వృద్ధిసంజ్ఞ సావకాశము. అది ఆదైచ్చులందు ప్రవర్తింపవచ్చునుగదా. అది అదే ఙ్లులనుద్దేశించి ప్రవర్తింపలేదు గాన తాత్పర్యమునులేదు. కావున నదేఙ్లులకది ప్రవర్తింపదు.

గుణసంజ్ఞ అసందిగ్ధము, అనవకాశము, తత్పరము. కావున క్రప్రత్యయ మణ్ప్రత్యయమునకు బాధకమయినట్లు వృద్ధిసంజ్ఞకు బాధకమగునని తాత్పర్యము.

లేదా, సమానాంతరము—గోనర్దీయుడు, ముందు, "విధులను వర్తించు చునేయుండును. కాని అనువృత్తి మాత్రమున లక్ష్యములందు ప్రవర్తింపవు. యత్నవిశేషమువలన ప్రవర్తించును" — అని చెప్పఁగలడు.

వృద్ధిపదము 'అదేఙ్గుణః' అను సూత్రమున ననువర్తించినను యత్న విశేష మేదియు లేనందున, అదేఙ్లులతో సంబంధింపదు. ప్రకృతసూత్రమునం దను వర్తించుట కిచట మరల గుణవృద్ధి గ్రహణము యత్నము; అని భావము.

లేదా-'ఉభయమును నివర్తించును. గుణవృద్ధి గ్రహణమున నపేక్షిం తుము' అని సమాధానాంతరము. 'ఆదైచ్', 'అదేఙ్' పదములనువర్తింపనే యనువర్తింపవు. అనువృత్తికిఁగావలసినది స్వరితమను లింగము. అది చేర్పబడ

లేదు కాన నాపదము అనువర్తింపవు. అనువర్తింపకుండుటయే నివృత్తి. గుణ వృద్ధి పదములను మాత్రమపేక్షింతుము. అనఁగా 'అపేక్ష'యను లౌకికాధి కారమే యాశ్రయింపఁబడును. అనువృత్తి కాదు.

## పరిభాషాత్వ సాధనము

ఈ సూత్రమలోఽన్త్యపరిభాషకు శేషమా? లేక అపవాదమా?

దానికి శేషమెట్లగును? ఎట్లపవాదమగును?

'ఆదేశములు షష్ఠీనిర్దిష్టాంత్యమునకు వచ్చును. ఇక్కుకు గుణవృద్ధులును అంత్యాల్లునకు వచ్చును' అని యిట్లు అదియు నిదియు నొకేవాక్యమయిన, అపుడిది తచ్ఛేషమగును. ఇక నానావాక్యము అయి, 'విధులంత్యాల్లునకగును, గుణవృద్ధులు అంత్యాల్లునకును, అనంత్యమునకును వచ్చును'- అని యర్థమును జేసిన నిది దాని కపవాదమగు.

ఎట్లైననేమి విశేషము? అనిన, తచ్ఛేషపక్ష దూషణ వార్తికము— "వృద్ధిగుణావలోఽన్త్యస్యేతిచేన్మిది మృజి పుగన్తలఘూపధర్చ్ఛిదృశిక్షిప్రక్షుద్రేష్విగ్గ్రహణమ్" అనునది.

వృద్ధియు, గుణమును, అంత్యాల్లయిన ఇక్కునకువచ్చుననిన, "మిదేర్గుణః (7 3 82) "మృజేర్వృద్ధిః" (7 2 114) "పుగన్తలఘూపధస్యచ"(7.3 86), "ఋచ్ఛత్యౄతామ్" (7 4 11), "ఋదృశోఽఙిగుణః" (7.4 16), "స్థూలదూర యువ హ్రస్వక్షిప్రక్షుద్రాణాం యణాదిపరం పూర్వస్యచగుణః" (6 4 156) అను సూత్రములచే విధింపబడిన, గుణవృద్ధులు, 'మిద్' 'మృజ్' లఘూపధాంగము, ఋధాతువు, 'దృశ్', ధాతువు, క్షిప్రక్షుద్ర శబ్దములలో రేఫాదిభాగము లోపించిన వెనుక శేషించిన క్షివ్ 'క్షుద్' అనువానికివి, 'మేద్యతి' 'మార్ష్టి' 'మోదతే' 'ఆనర్ఛ', 'అదర్శత్' 'క్షేపిష్ఠః' 'క్షోదిష్ఠః'—ఇత్యాదులందు చివర ఇక్కులేనందున ప్రవర్తింపకపోవలసి వచ్చును. కావున నటనట నెల్లచోటుల 'ఇకః' 'ఇకః'—'ఇక్కునకు', 'ఇక్కునకు' అని చెప్పవలసియుండును. ఆ విధులలో, 'ఇకోగుణవృద్ధీ' 'అలోఽన్త్యస్య' అను పరిభాషలు పరస్పర సంబంధముగలిగియే ఉపస్థితములగును. అదియేతచ్ఛేషత్వము. అందొకటి, ఇక్కు అంత్యముకానందున ప్రవర్తింపకున్న నిదియు బ్రవర్తింపదు. కావున 'ఇక్కుకు' అని చెప్పవలసియుండునని భావము. "సర్వాదేశ ప్రసంగశ్చానిగన్తస్య"—అని దూషాణాంతరవార్తికము

ఇగంతము కాని యంగమున, గుణము సర్వాదేశముగ బ్రవర్తింపవలసియుండును.

'యాతా', 'వాతా'—యా, వా ధాతువులిగంతములుగావు. అట "సార్వ

ధాతుకార్ధ ధాతుకయోః" (7.3.84) అను, గుణము, సర్వాదేశము గావలసివచ్చును. ఏలయన, ఆసూత్రమున, 'అంగస్య' 'అను' స్థానషష్ఠి, ఇగంతములును, తద్భిన్నములును నయిన అంగములకు గుణమును బోధించుచున్నది. 'అలోన్త్యస్య' అను షష్ఠి అంత్యమయిన ఇక్కునందే ఉపసంక్రాంతము. కాగా ఆసూత్రమునకు, అంగమునకు గుణమువచ్చును. అందుచివర ఇక్కుఉన్నయెడల దానికే వచ్చును' అని యర్థము. ఆనిగంతాంగ విషయక గుణశాస్త్రములందలి షష్ఠికి అంత్యాల్లున్యందుపసంహారము లేనందున నచట గుణము సర్వాదేశము కావలెను.

ఇక నీ దూషణమునకుద్ధారమును వినుడు. 'అలోన్త్యస్య' అను షష్ఠికి వలె, 'అంగస్య' అను స్థానషష్ఠికిని, అంత్యమగు నిక్కునందే ఉపసంహారము. కాగా సంగ్రాహక గుణవిధాయక వాక్యము, ఇగంతములందే గుణమును బోధించును. ఇగంతములుగాని అంగములందు గుణమును ప్రవర్తింపజేయు లక్షణమే సంభవింపదు. కావున సర్వాదేశగుణ ప్రసంగము లేదు. అనిన,

మిదాద్యాదులందు 'ఇకః' అని చెప్పవలసివచ్చుట యొక దోషమును అనిగంతాంగములందు సర్వాదేశ ప్రసంగము వేరొక దోషమునుగావు రెండవవార్తికము, పూర్వవార్తికముచే జెప్పబడిన, ఇగ్గ్రహణకర్తవ్యతకు హేతువునుపపాదించునది. అందలిచకారము 'హి' అను నవ్యయార్థమున పఠింపబడినది. మిదాద్యాదులకుజెప్ప బడిన గుణముమున్నగునది, 'ఇక్కుకు అనుటవలన అంత్యమిక్కుకాదుగాన దానికిరాదు. 'అంత్యాల్లుకు' అనుటవలన నిక్కుకు, ప్రాప్తింపదు. ఇక విధానమువ్యర్థముకాకుండుటకై, షష్ఠీస్థానేయోగా (1-1-49 అనుపరిభాషచే సర్వాదేశముగా ప్రాప్తించుచున్నది.

## అలోన్త్యాపవాదత్వ విచారము

పైన, తచ్ఛేష పక్షము దూషితము. పోనిండు, ఇది అలోంత్య సూత్రమున కపవాదము. అంత్యానంత్యసాధారణముగ, సకలేక్కులకు గుణవృద్ధులు వచ్చును' - అందుమా, ఆపక్షమునకును దూషణము వార్తిక కారునిచే నిట్లు చెప్పబడినది.

"ఇజ్మాత్రస్యచేజ్జుసిసార్వధాతుకార్ధధాతుక
హ్రస్వాదొర్యర్గుణేష్వనన్త్యప్రతిషేధః"

ఇజ్మాత్రమునకు గుణవృద్ధులు వచ్చుననిన, "జుసిచ" (7-3-83) "సార్వధాతుకార్ధధాతుకయోః" (7-3-54) "హ్రస్వస్యగుణః" (7-3-108) "జసిచ" (7-3-109) ఋతోఙిసర్వనామస్థానయోః" (7-3-110) "ఘేర్ఙితి" (7-3-111) "ఓర్గుణః (6-4-146') అనునది, అవయవషష్ఠిగాన, స్థానషష్ఠీనిమిత్తకమగు అలోంత్య పరిభాష ఉపస్థితము కాదు. అపుడు, అంగావయవమగు నిక్కుకు. అంత్యమైనను గాకున్నను గుణము

ప్రవర్తించునని యర్థమగును. అది అనంత్యమునకు వచ్చుట అనిష్టముగాన, దానిని ప్రతిషేధింపవలసి యుండును. ఎట్లనగా చూడుడు. జుసిచేతి గుణము 'అజుహవుః 'అబిభయుః' అను ఇగంతాంగములందు ప్రవర్తించినట్లు అనేనిజుః 'పర్యవేవిషుః' అను హలంతములందును ఇక్కుకు రావలసి వచ్చుచున్నందున దానికి ప్రతిషేధము వక్తవ్యము.

సార్వధాతుకగుణము, ఇగంతాంగములైన 'కర్తా' 'హర్తా' 'నయతి' తరతి' మున్నగువాని కృ, హృ, నీ, తౄ అనుధాతువులందువలె, ఈహితా, 'ఈహితవ్యమ్' 'ఈహితుమ్' అను అనిగంతాంగములందును ప్రవర్తింప కుండుటకు ప్రతిషేధమావశ్యకము.

'హ్రస్వస్యగుణః" అను గుణమును, హే 'అగ్నేహే వాయో అను చోటవలె, ఇగంతాంగములుగాని హే అగ్నిచిత్' హేసోమ సుత్, - అను స్థలము లందును రాకుండ జేయవలసి యుండును.

జసి గుణము, 'అగ్నయః' 'వాయవః అనుచో ప్రవర్తించినది అంగమచట ఇగంతము. 'అగ్నిచితః' సోమసుతః అనుచోట్లగూడ, అనిగంతాంగములందు ప్రాప్తించుచున్నది. కావున వారింప దగినది.

అట్లే 'ఋతోఙిగుణము, కర్తరి' కర్తారౌ' అనుచోట్లవలె, సుకృతి, సుకృతౌ మున్నగు చోట్లను ప్రాప్తముగాన, ప్రతిషేధ్యమగుచున్నది.

ఇక ఘేర్ఙితి గుణమునకు అగ్నయే వాయవే' అను నిగంతాంగము లందును, 'అగ్నిచితే' సోమసుతే' అను ఇగంతభిన్నములయిన చోట్లను ప్రాప్తి గలదు. అనిగంతాంగములందు దానికి ప్రతిషేధము వక్తవ్యము.

'ఓర్గుణః అను గుణము, 'బాభ్రవ్యః 'మాణ్డవ్యః' అనునిగంతాంగములు గలచోట్ల బభ్రు, మణ్డు శబ్దములకు వలె 'సుశ్రుత్' మున్నగు ఇగంతభిన్నాంగము లందును ఇక్కుకు ప్రాప్తించుచున్నది. దానికి ప్రతిషేధము వక్తవ్యమగుచున్నది.

కాని ఇవి దోషములుకావు. ఏలయనగా, "**పుగన్తలఘూపధ గ్రహణ మనన్త్యనియమార్థమ్**" అని వార్తికము.

'భేత్తా' ఇత్యాదులందు, "సార్వధాతుకార్ధధాతుకయోః" (7-3-84) అను సూత్రముచేతనే గుణము సిద్ధించుచుండగా మరల పుగంతమునకునులఘూపధము నకు, పుగన్తలఘూపధస్యచ (7-3-86) అని గుణమును విధించుట, అనంత్య నియ మార్థమగును. అనగా, పుగన్తమును, లఘూపధమునునగు అనంత్యమునకేగాని, ఇతరమగు అంత్యభిన్నమునకు రాదు అని నియమించుట. కాబట్టి 'ఈహితా' మున్నగుచోట్ల ఈకారము అనంత్యమయినను, లఘువు కానందునరాదు,

ఆనియమము ప్రకృత సూత్రమునకే యగును.

ఏది ప్రకృత సూత్రము ?

"సార్వధాతుకార్ధధాతుకయోః" (7-3-84) అనునది. 'ఈహితా' 'ఈహితుమ్' 'ఈహితవ్యమ్' అనుస్థలములందు,'లఘూపధమగు అనంత్యమునకే,-అను నియమము వలన గుణమురాకుండుట సిద్ధింపవచ్చును. హ్రస్వాదిగుణమును, ఓర్గుణమును నియమింపబడవు. దానికి హేతువు అవి అనంతరములు కాకుండుట. అనన్తరస్య విధిర్వాభవతి ప్రతిషేధోవా" అనున్యాయముచే, "సార్వధాతుకార్ధధాతుకములు పరములగు నపుడు ప్రాప్తించుగుణము పుగంతమునకును, లఘూపధమునకునే వచ్చును" - అని నియమమగుట వలన, ఈహితేత్యాదులందు ఉపధలఘువు కాదుగాన గుణాభావము సిద్ధించినను. "లఘూపధమునకు గుణము ప్రాప్తించిన, సార్వధాతుకార్ధధాతుకములు పరములయినపుడే" - అను ఆకారముగల నియమము లేనందున, 'హేఅగ్నిచిత్ 'అగ్నయః', 'కర్తరి', అగ్నయే', బాభ్రవ్యః- అనుస్థలము లందు ప్రవర్తించినట్లు, 'హేఅగ్నిచిత్ః 'అగ్నిచితః, సుకృతి 'అగ్నిచితే' 'సుక్రుత్' - అనుస్థలములందును, "హ్రస్వస్యగుణః" (7-3-108) "జసిచ" (7-3-109), "ఋతోఙి" (7-3-110)" ఘేర్ఙితి" (7-3-111) "ఓర్గుణః" (6-4-146)- అను, గుణములు వారింపబడవు. ఒకే <u>వాక్యమునందు నియమద్వయము లభింపదు</u>.

లక్ష్యములననుసరించి, 'అనన్తరస్య' అను న్యాయమును గ్రహింపక, 'పుగన్తలఘూపధ గుణము సార్వధాతుకార్థతుకములు పరమగునపుడే' - అని నియమించిన, 'సార్వధాతుకగుణము లఘూపధమునకే' - అను నియమముండదుగాన, 'ఈహితా' ఈహితుమ్" ఈహితవ్యమ్' అను చోటనది అనన్త్యమగు నీకారమునకు రావలసివచ్చును. 'సార్వధాతుకార్ధధాతుకములు పరమగునపుడు వచ్చునట్టి గుణము పుగంతమునకును, లఘూపధమునకునే వచ్చును'-అని, పుగన్తలఘూపధములకు వచ్చెడి గుణము సార్వధాతుకార్ధధాతుకములు పరమగునపుడే వచ్చును'-అనియు, అభ్యుపేత్యవాదముగ ఉభయనియమమునంగీకరించి, ఈ 'జుసిచ' (7-3-83) అనేగుణము నియమింప బడదుగాన నది, 'అనేనిజుః' 'పర్యవేవిషుః' అనుస్థలములందు, అనంత్య మయిన ఇకారమునకును రావలసి వచ్చును. అచ్చట లఘూపదమగునంగమును గలదు. సార్వధాతుక ప్రత్యయ పరత్వమును గలదు గాననది నియమనివర్త్యముకాలేదు.

కాగా తచ్ఛేష తదపవాద పక్షములు రెండును దోషయుక్తములే.

## అసంబద్ధపరిభాషాపక్ష విచారము .

అటులైననీ 'ఇకో గుణవృద్ధీ' అను యోగము, తచ్ఛేషమునుగాదు. తదపవాదమునుగాదు, ఈ సూత్రమునందలి పదములకును అలోంత్య సూత్రము

నందలి పదములకును విశేషణ విశేష్య భావముండిన నుండవచ్చును. అంతమాత్ర మున తచ్ఛేషమనువ్యవహారము అనగా శేషశేషిభావమదినికి వీనికి కలదను వ్యవహారము ఎచ్చటనులేదు. ఇవి పరస్పర నిరపేక్షముగనే లక్ష్యములందు తమతమ కార్యములను ప్రతిపాదించెను. ఒకానొకచో సమావేశము సంభవించినను నది పరస్పరాపేక్షముగాదు. కావుననే దానికిది అపవాదమునుగాదు. ఇయ్యది వేరొక పరిభాషా విశేషమే. దీనికలోంత్యపరిభాషతో శేషశేషి భావముగాని ఉత్సర్గాప వాదభావముగాని లేనేలేదు. ఇది వానితో నెట్టిసంబంధమును లేనిది.

'ఇది స్వతంత్ర పరిభాష' అను నాశయముతోడనే, క్రోష్టీయులను వార్తిక కారులు ఇట్లు పఠించియున్నారు.

"నియమాదికో గుణవృద్ధిభవతో విప్రతిషేధేన"

నియమమని అలోంత్యపరిభాషకు పూర్వాచార్యుల సంజ్ఞ. అలోంత్యపరి భాషయు, నీపరిభాషయు యుగపత్ప్రాప్తములయినపుడు, ఈ పరిభాషయే విప్రతిషేధముచే ప్రవర్తించును' అని ఆవార్తికమున కర్థము. ఇది అలోంత్య పరిభాషకు శేషమయినయెడల, శేషశేషులభిన్నములేగాన దనతోనే తనకు విప్రతిషేధయు క్తము. దానికపవాదమనినను, ఉత్సర్గాపవాదములకు విప్రతి షేధము యుక్తముగాదు విప్రతిషేధమునిట్లుపపాదింప నగును. 'రాజకీయమ్' అను రూపమునందు, "రాజ్ఞఃకచ" (4-2-140) అను సూత్రముచే రాజన్ శబ్దాంత్య నకార స్థానమున కకారాదేశము విధింప బడినది. అట నీ సూత్రమునకు ప్రసక్తిలేదు. కాగా నియమమట సావకాశము. 'చయనమ్' 'చాయకః 'లవ నమ్' 'లావకః" అనుచో, నియమమునకు, ప్రయోజనము లేనందున ప్రసక్తిలేని స్థలములందు, "ఇకోగుణవృద్ధీ" (1-1-3) అను నిదిసావకాశము. ఇక 'మేద్యతి', 'మార్ష్టి' అను చోట్ల' ఉభయమునకు ప్రాప్తికలదు. విప్రతిషేధముచే ఇకప్పరిభాష ప్రవర్తించును.

ఈ విప్రతిషేధమిష్ట సిద్ధిసంపాదకముకాదు. విప్రతిషేధే పరం కార్యమ్" (4-1-2) అనిగదా చెప్పబడినది. ఈ సూత్రము పూర్వమాయె. నియమము పరమాయె. అనిన,

విప్రతిషేధ సూత్రమునందలి 'పరమ్' అనుదానికి 'ఇష్టమైనది' అని యర్థము. 'తుల్యబలములగు శాస్త్రములకేకత్ర సమావేశము ప్రసక్తమయినపుడు, ఆ రెండింటనేని యాలక్ష్యమున ప్రవర్తించుట ఇష్టమో అది ప్రవర్తించును' అని ఆ సూత్రమునకర్థము. కావున విప్రతిషేధమయుక్తముకాదు.

అట్లనినను, విప్రతిషేధము అయుక్తమే. రెండు కార్యములతో సంబం ధముగల స్థాని విప్రతిషేధమునకు విషయమగునుగాన విప్రతిషేధమనబడును. ఆ విధముగ రెండు కార్యములుగల స్థానీ ఇచట లేదే? అనిన.

ద్వికార్య యోగమొక్కటియే విప్రతిషేధముకాదు. మరి యేది విప్రతిషేధము? అసంభవమును విప్రతిషేధమే. ఆ అసంభవమిచ్చట గలదు. ఆ అసంభవమ మెయ్యది? 'వృక్షేభ్యః,' 'ప్లక్షేభ్యః-అనుచో, స్థానియొక్కటి, ఆదేశములు రెండు. స్థాని ప్రాతిపదికాంతాకారము, దానికే, "సుపిచ'' (7.3 102) అని దీర్ఘమును, "బహువచనే ఝల్యేత్" (7 3.103) అని ఏత్వమును ప్రాప్తించుచున్నవి. ఒక స్థానికి రెండాదేశములు వచ్చుట సంభవింపనిది. ఇకనిపుడు "మేద్యతి, మేద్యతః మేద్యన్తి" అను లక్ష్యములు చూడుడు. ఇట రెండు స్థానులు, ఆదేశమొక్కటి. ఇకారదకారములు స్థానులు. గుణము, ఏకారము ఒక్కటి ఆదేశము. రెండు స్థానుల కొకయాదేశము. "ఏకః పూర్వ పరయోః" (6.1 84) అనునది. కార్యమునందు విహితములకు సంభవించినను, 'మిదేర్గుణః' (8-3.42) ఇత్యాదులందు సంభవింపదు. అటః, 'మిదేః' అనునది ఒకటియే షష్ఠి. అది అవయవ షష్ఠియనిన, ఇకారమునకు గుణమురావలెను. స్థాన షష్ఠియనిన, అలోంత్యపరిభాషయుపస్థితమై దకార స్థానమున రావలెను. ఒక్కసారిగా వాక్యార్థద్వయ బోధ కలుగదుగాన యుగపత్ రెండు స్థానులకు గుణము సంభవింపదు. ఇది కేవలాసంభవము. ద్వికార్యయోగమే కాక ఇదియు నసంభవమే కనుక విప్రతిషేధము యుక్తమే.

ఇట్లు కేవలాసంభవము కలదనుకొనుడు. అయినను విప్రతిషేధము అయుక్తమే. రెండును సావకాశములయి యుండినపుడుగదా వానికి విప్రతిషేధము. ఈ 'ఇకోగుణవృద్ధీ' అనుయోగ మనవకాశము.

ఏమయ్యా! ఇపుడిప్పుడే 'చయనం, 'చాయకః;' లవనమ్, 'లావకః' అను లక్ష్యములు ఈ సూత్రమున కవకాశమని సరిపెట్టితిమిగదా? అనిన,

అచ్చట గూడ ఫలములేకున్నను, 'పర్జన్యవల్లక్షణప్రవృత్తిః'—అను న్యాయముచే మేఘుడు ఫలములేనిచోట్ల గూడ వర్షించినట్లు, లక్షణము ప్రవర్తింపకతీరదు. కాగా 'అలోన్త్యస్య'-అనునియమునకు ప్రాప్తికలదు. అపుడలోన్త్యస్య అను నియమమునకిది 'యేన నాప్రాప్తి' న్యాయముచే, అపవాదము కావలెను. ఉత్సర్గాపవాదములకు విప్రతిషేధము యుక్తముకాదు. ఫలములేనందున నట నియమముపస్థితముకాదని అట 'ఇకోగుణవృద్ధి'-అనుదానికి అవకాశమును జూపించి విప్రతిషేధమును పొంచినను, వేరొక దోషము తప్పదు. "మేద్యతి, మేద్యతః మేద్యన్తి" అను స్థలమునందు విప్రతిషేధమువలన ఇక్కునకు గుణము వచ్చినట్లు "అనేని" జుః పర్యవేవిషుః ఇత్యాదులందును నిక్కునకు ''జుసిచ" (7.3 83) అని గుణము రావలసివచ్చును. కనుక క్రోష్టీయ సమ్మతమగువిప్రతిషేధమును, తదుపజీవ్యమగు అసంబద్ధ పరిభాషా పక్షమును పన్నములుకావు,

## సిద్ధాంత భూతపదోపస్థితిపక్షనిరూపణము

అట్లైన, 'వృద్ధివచ్చును' 'గుణమువచ్చును' అని యిట్లే సూత్రములందు సూత్రకారుడు స్పష్టముగ నుచ్చరించి గుణవృద్ధులను విధించునో, ఆ సూత్రము లందు 'ఇకః' అనుషష్ఠ్యంత పదము ఉపస్థితమగునని యీ సూత్రమున కర్థముగా గ్రహింపఁదగును.

అనఁగా నేమి చేయఁబడినట్లగును?

రెండవ షష్ఠ్యంతపదము గుణవృద్ధివిధాయకములందుపస్థాపింపఁబడునని యర్థము. ఆ సూత్రము అందొకషష్ఠ్యంతపదము గృహ్యమాణమయినదుండును ఈ 'ఇకః'అనునదింకొకటి అందు గృహ్యమాణమును విశేషణముగను, ఇక్కును విశేష్యముగను జేసికాని,ఇక్కుచేతనే గృహ్యమాణమునువిశేషించికానివాక్యార్థ మునుబోధింపవచ్చును.ఆవిషయమునకామచారమే. కాఁబట్టి "మిదేర్గుణః'(7-3-82) 'మృజేర్వృద్ధిః' (7-2-114) ''పుగన్తలఘూపధస్యచ'' (7-3-86) "ఋచ్ఛత్యృతామ్" (7-4-11), ''ఋదృశోఙిగుణః'' (7-4-16), "స్థూలదూరయువహ్రస్వక్షిప్రక్షుద్రాణాం యణాదిపరం పూర్వస్యచగుణః" (6-4-156) అను గుణవృద్ధివిధాయకశాస్త్రము లందున్న మిది, మృజి మున్నగు గృహ్యమాణములను, 'ఇకః' అను షష్ఠ్యంతము నకు వ్యధికరణ విశేషణములుగ చేసి వీని ఇక్కునకు గుణవృద్ధులు వచ్చును, అనియును, ఇక, ''జుసిచ'' (7-3-83) ''సార్వధాతుకార్ధధాతుకయోః" (7-3-84) "గుణః"(7-3-108) "జసిచ" (7-3-109) "ఋతోఙి సర్వనామస్థానయోః"(7-3-110) "ఘేర్ఙితి" (7-3-111) "ఓర్గుణః" (6-4-146) - అను సూత్రములందు, 'ఇకః' అను పదమును సమానాధికరణవిశేషణముగ సంబంధింపజేసి, "ఇటునాయా అంగము లకు, ఇగన్తములకు గుణమగును" అనియు నన్వయబోధను సంపాదింతుము.

కాగా నియ్యది పదోపస్థాపక పరిభాషాసూత్రమని సిద్ధాంతము.

**ఇకతచ్ఛేష పక్షమున వార్తికోక్త దూషణములకుద్ధారము.**

'లేదా పై సూత్రములన్నింటిలో స్థానినిర్దేశింపబడియుండనే యున్నది. కావున ఇగ్గ్రహణకర్తవ్యత లేనేలేదు.'

(1) 'మిదేర్గుణః'(7-3-82)అను సూత్రమున' మిద్ 'అనునది విభక్తిరహితముగ నిర్దేశింపబడినది, మిద్, ఏః అని విభాగము. మిద్ అను ధాతువుయొక్క ఏః= ఇకారమునకు గుణమువచ్చును అని యర్థము. లేదా 'మిదిః' 'అనుపదము షష్ఠీ సమాసపదము. మిదః ఇః=మిదిః తస్యమిదేః' అని మిద్ అనుధాతువునికారము నకు అనియుఁజెప్పుట లఘుభూతము. ఎట్లైనను స్థానినిర్దేశము స్పష్టము.

(2) ''పుగన్తలఘూపధస్యచ" (7-3-86) అను సూత్రమున "పుగాగమాంతమగునంగమునకును, లఘుభూతమయిన ఉపధావర్ణముగల యంగమునకును గుణమగును' అనియర్థము చెప్పబడదు. మరియెట్లు? పుక్ అన్తః=పుగన్తః

"లఘ్వీచ సా ఉపధాచ=లఘూపధా" పుగన్త లఘూపధయోః సమాహారః పుగన్తలఘూపధమ్ తస్య" అని ఇట్లు సమాహార ద్వంద్వతాత్పర్యముతో నిర్దేశింపబడినపదమిది. పుగాగమ పరకమగు వర్ణమునకును, లఘువయిన యుపధావర్ణమునకును గుణమువచ్చునని యర్థమగుటచే, స్థానినిర్దేశము స్పష్టము. ఆ సూత్రమున నట్టి విగ్రహమే తప్పక కర్తవ్యము. అట్లుకాక, ఆపదము అంగమునకు విశేషణమయిన, 'ఖినత్తి' 'ఛినత్తి' మున్నగు స్థలములందు, 'ఖినద్', 'ఛినద్' అను లఘూపధాంగముల ఇకారమునకుగూడ గుణమురావలసి వచ్చును.

(3) ఇక ఋచ్ఛధాతువు విషయమునను స్థానినిర్దిష్టమయియే యున్నది "ఋచ్ఛత్యౄతామ్" (17-4-11) అను నిర్దేశము, 'ఋచ్ఛతి ఋ, ఋ ౠత్' అని ప్రశ్లేషముచే రెండు ఋకారములకును, ౠకారమునకు సవర్ణదీర్ఘ నిర్దేశము. ఋచ్ఛధాతుఋకారమునకును, ఋధాతువునకును, ౠదంతధాతువులకును ఋకారమునకు గుణమగునని యర్థము. ఋ అనునది అవిభక్తికము. కాగా, 'ఋ' అను స్థాని నిర్దిష్టమే యయినది.

(4) "ఋదృశోఽఙిగుణః" (7-4-16) అనుసూత్రమును, 'ఉరఙిగుణః దృశేః' అని రెండు సూత్రములుగా జేసి, దృశేః అను రెండవసూత్రములోనికి ఉః అను పదము ననువర్తింప జేసిన, ఋకారమను స్థాని నిర్దేశింపబడినదే యగును.

(5) "స్థూలదూరయువహ్రస్వక్షిప్రక్షుద్రాణాం యణాది పరం పూర్వస్యచ గుణః" (6-4-156) అను సూత్రమున, 'యణాదిపరం' అను నంతవరకొక సూత్రముగను, 'పూర్వస్యచగుణః' అని వేరొక సూత్రముగను, యోగ విభాగము చేయుదుము. రెండవ సూత్రములోనికి, క్షిప్రక్షుద్ర అను రెండుశబ్దములు మాత్రమే స్వరితత్వమువలన ననువర్తించును. స్థూలాదులందు యణాదిపరభాగము లోపించినవెనుక "ఓర్గుణః (6-4-1·6) అను సూత్రముచేతనే గుణము సిద్ధించును. 'యణాదిపరం' అను పదమునకు, యణ్ణుకు ముందున్నది యణాది. అనగాక్షిప్రలో పకారమును, క్షుద్రలో దకారముననుట, దానికంటె బరమైనది లోపించి, ఆయణాదులగు పకారదకారములకు, పూర్వమున్నదానికి గుణమగునని యర్థము. ఆపూర్వము, ఇకారమును ఉకారమును నగుచున్నవి. ఈ ప్రయోజనము కొరకే రెండవ సూత్రము. ఆ సూత్రమున "యణాదిపరం గుణః" అనినజాలును. అయినను, 'పూర్వస్య' అనుటకు ప్రయోజనము, ఇక్కుకే రావలెను. తద్భిన్నమయిన వ్యంజనమునకు రాకూడదు అనునది. కాగా ఆసూత్రమునను స్థానినిర్దేశము కృతమేయని స్పష్టము.

ఈ విధముగ బహుసూత్రములందు స్థాని నిర్దేశము నుపపాదించి, తచ్ఛేషపక్షదూషణములను బరిహరించినను, "మృజేర్వృద్ధిః" అను చోట స్థానినిర్దేశమగపడదు గాన నేది దూషణముద్ధరింపబడలేదు.

## వృద్ధిపదప్రయోజనవిచారము

ఈ సూత్రమునందు, వృద్ధి పదమెందులకు ? అని ప్రశ్న. 'విశేషముగ వృద్ధిపద మెందులకు? అనియే యడుగుటేల? గుణపదమెందులకని గూడ నేల ప్రశ్నింపలేదు. గుణపదగ్రహణమునకు ప్రయోజన మేదేని యుండి నది వృద్ధి గ్రహణమునకును నుండును గదా అని ప్రత్యాక్షేపము.

ఈ విశేషమున్నది. గుణవిధులలో గొన్ని చోట్ల స్థాని నిర్దేశింప బడి యుండలేదు. అట స్థాని నిర్దేశమునకై గుణగ్రహణము కర్తవ్యము. వృద్ధి విధు లందైన, నించుమించుగ, నంతటను, "అచోఞ్ణితి" (7-2-115) "అతఉపధాయాః" (7-2-116) "తద్ధితేష్వ చామాదేః" (7-'-117) ఇత్యాదులందు స్థాని నిర్దేశింప బడియే యున్నది. అని ప్రత్యాక్షేపసమాధానము. ప్రథమ ప్రశ్నకు సమాధానముగ వార్తికకారుడు వృద్ధిగ్రహణమునకు ప్రయోజన ముత్తర సూత్రమున కలదని **"వృద్ధిగ్రహణ ముత్తరార్థమ్"** అను వార్తికమును బఠించెను. ఉత్తర సూత్రము "క్ఙితిచ" (1-1-5) అనునది. అది నిషేధసూత్రము. అయ్యది స్వవిషయ మునను బ్రవర్తింపవలెను. ఇందు వృద్ధి పదమున్న వృద్ధియునిగ్లక్షణ మగును. కిత్తులు ఙిత్తులునగు ప్రత్యయములు పరములయినపుడు, వృద్ధికిని అపుడా సూత్రముచే నిషేధము సిద్ధించును.

ఐననొక ప్రశ్న. వృద్ధి ఞిత్తులును ణిత్తులుననగు ప్రత్యయములు పర మగునపుడుగదా విధింపబడినది. కిత్తులును ఙిత్తులును బరమగునపుడు దానికేమి ప్రసంగము?

**"తచ్చమృజ్యర్థమ్"**- అని సమాధానవార్తిక ఖండము. మృజికివృద్ధి ప్రత్యయసామాన్య నిమిత్తకము.ఞిత్తుగాని ణిత్తుగాని పరమగునవుడు మాత్రమే విధింప బడినదిగాదు. అవిశేష విహితమనుట. అది, కిత్తు (ఙిత్తును) పరము అగున పుడు, 'మృష్టః' 'మృష్టవాన్' ఇత్యాదులందు, క్ఙితితి సూత్రముచే నిషేధింపబడ వలెను. కనుక నిగ్లక్షణత్వసంపాదనమునకై వృద్ధి పదమీ సూత్రమున గ్రహింపబడవలెను.

ఉత్తరార్థమేకాక ప్రకృతార్థమును వృద్ధి పదమావశ్యకమని, "ఇ హార్థం చాపి"-అను సిద్ధాంత సమాధానవార్తికము చెప్పుచున్నది. అవిశేషోక్తమగు అమృజివృద్ధి, ఇక్కుకే సిద్ధించుటకును, అనిక్కునకు రాకుండుటకును నీ సూత్రముననునది ఆవశ్యకమే. ఇట అవిశేషోక్తి యనగా స్థానివిశేషానుక్తి.

**"మృజ్యర్థమితిచేద్యోగవిభాగాత్సిద్ధమ్"** అని, వేరొక వార్తికము మృజిధాతువునందు వృద్ధి ఇక్కుకే ప్రవర్తించుటకు వృద్ధిగ్రహణమనిన ఆ ప్రయోజనము యోగవిభాగముచే సాధ్యముగాన నదివ్యర్థము. 'మృజేర్వృద్ధిరచో ఞ్ణితి' అను సంహితాపాఠమున, "మృజేర్వృద్ధిరచః" అను వంతవరకొక సూత్ర

మును, తదుపరి 'ఇతి' అని వేరొక సూత్రమును విభజింపబడును. రెండవ సూత్రమునందు "అచః" అను పదమునువర్తించును. ఈ యోగవిభాగ ప్రకారము మృజధాతువునందు అచ్చుకు వృద్ధియగును అని యర్థము సిద్ధించుటచే అచ్చు అను స్థాని నిర్దేశింపబడినదగును. గాన, నంత్యాల్లునకు దత్ప్రాప్తి కలుగదు. కాగా వృద్ధి గ్రహణము వ్యర్థము.

అటులైన 'న్యమార్ట్, అనులఙ్ప్రథమైకవచనమున, అడాగమాకారమును మృజధాతువచ్చేయగునుగాన దానికి వృద్ధి ప్రాప్తమగునే?

అనిన "అటిచోక్తమ్" అని సమాధానము. అడాగమవిషయమున పరిహారము క్తపూర్వమే. ఏమిచెప్పబడి నదందువా? 'అనన్త్యవికారేన్త్యసదేశస్య కార్యంభవతి 'అనిచెప్పబడినది. ఒక పదమునందు, అంత్యములుకాని వర్ణములనేకములకు గార్యము ప్రాప్తమయినపుడు, అంత్యవర్ణమునకు సన్నిహితమగు ననంత్యవర్ణమునకే ఆకార్యము ప్రవర్తించును. అని దానియర్థము. ప్రకృతమున 'అ + మృజ్ + త్' అనునవస్థయందు, అంత్యమగు జకారమునకు గార్యప్రాప్తి లేదు. అనన్త్యములగు, అకారఋకారములకు గలదు. ఇట్టియెడ, అంత్యమగు జకారమునకు సన్నిహితమైన ఋకారమునకే వృద్ధిప్రవర్తించును. అకారమునకు ప్రవర్తింపదు.

'కాని, యోగవిభాగముచే నంత్యమునకు వృద్ధివారించినను, 'మృజేరితి' సూత్రమునందు స్థానిసమర్పకముగ 'నికః' అనునది లేనందున నా వృద్ధి ఇగ్లక్షణ వృద్ధియనిపించుకొనదు. అపుడు 'మృష్ట' ఇత్యాదులందు వృద్ధిప్రతిషేధము సిద్ధింపదు. తత్సిద్ధ్యర్థమై వృద్ధి గ్రహణమావశ్యకము' అను తాత్పర్యముతో వార్తికకారుడు "వృద్ధిప్రతిషేధానుపపత్తిస్త్విక్ప్రకరణాత్" అను వార్తికము పఠించెను. "క్ఙితిచ'' (1-1-5) అనుసూత్రముచే వృద్ధికిప్రతిషేధము ఉపపన్నము కాకపోవును. ఎందువలననినిన, ఇక్ప్రకరణమువలన, నిషేధసూత్రము ఇగ్లక్షణములగు గుణవృద్ధులనే నిషేధించు చున్నది. యోగవిభాగముచే మృజిలో వృద్ధిని అచ్చుకు సాధించిన, నది ఇకః అను పదము నుచ్చరించి విధింపబడినదికాదు. ఇగ్లక్షణము కాదనుట కనుకనిషేధ సిద్ధికై, స్థాని సమర్పణము కొరకు, ఈ పరిభాషోపస్థితియే స్వీకార్యము.

అటులైన, మృష్టః, మృష్టవాన్' ఇత్యాదులందు వృద్ధికి ప్రాప్తియే కలుగని కల్పమొకటి యున్నందున, నిషేధముతో పనియేలేదు. అపుడు తత్తార్థత్వము వృద్ధి గ్రహణమునకు ఆవశ్యకముకాదు.

ఆకల్పమేదియనగా, - మృజధాతువు విషయములో. ఇతర వైయాకరణులు గొందరు, దానికి అజాదియగు సంక్రమము పరమగునపుడు వృద్ధి వికల్పమును విధించు చున్నారు. గుణవృద్ధి ప్రతిషేధనిమిత్తమగు క్ఙిత్ప్రత్య

యమునకు సంక్రమమని వారి సంజ్ఞ. 'పరిమృజన్తి' ''పరిమార్జన్తి' 'పరిమృజన్తు' పరిమార్జన్తు, 'పరిమమృజతుః 'పరిమమార్జతుః' - ఇత్యాదివైకల్పికరూప సిద్ధిదానికి ప్రయోజనము ఆవికల్పమునీ పాణినీయమునగూడ సాధింపవలెను. అపుడు 'మృజేర్వృద్ధిరచః' అని యోగ విభాగము చేయబడును.

ఆ తరువాత 'అచిక్ఙితివా' అనియొక అపూర్వ వచనము కర్తవ్యము. అందును, 'అచిక్ఙితి' అనియొక యోగము. దానికి "అజాదులగు కిత్ జిత్ప్రత్యయములు పరమగునపుడును మృజ్ ధాతువునకు వృద్ధి యగును' అని యర్థము. పరిమార్జన్తి 'పరిమార్జన్తు' 'పరిమమార్జతుః' ఉదాహరణములు.

'మృజేర్వృద్ధిరచః' అనుసూత్రము చేతనే సిద్ధించునుగదా వృద్ధి. దినికేమి ప్రయోజనము? అనగా, 'అజాదియగు కిత్తును జిత్తును పరములగు నపుడే యీ వృద్ధి వచ్చును ఇతరత్రరాదు' అని నియమమును బోధించుటకీ సూత్రము.

ఇతరత్ర అవగా నెచ్చట రాకుండుటకు?

'మృష్టః' మృష్టవాన్ అనుచోట రాకుండుటకు, కాగానట వృద్ధికి ప్రాప్తియే లేదనుట వ్యక్తము.

తరువాత, 'వా' అని వేరు యోగము. ఇది 'అచిక్ఙితివా' అను వచనమున విభక్తమైన యోగము. అజాదికిత్ జిత్తులు పరమగునపుడు వికల్పముగా మృజ్ ధాతువునకు వృద్ధియగునని దాని కర్థము. 'పరిమృజన్తి' పరిమార్జన్తి 'పరిమ మృజతు:' 'పరిమమార్జతు:' అను రూపము లుదాహరణములు. కాఁగా "క్ఙితిచ (1-1-5) అను నుత్తర సూత్రముచే నిషేధింపఁబడిన వృద్ధికి "ఇగ్లక్షణత్వ సంపాదనమునకిందు వృద్ధి గ్రహణము నిష్ప్రయోజనము" అట్లైన, సిజ్నిమిత్తక మగు వృద్ధి ఇక్కునకే సిద్దించుటకు ప్రకృత సూత్రముననే వృద్ధి గ్రహణము కర్తవ్యమగును. "సిచివృద్ధిః పరస్మైపదేషు" (7 2.1) అను సూత్రముచే వృద్ధి, స్థాని విశేషమునకు జెప్పబడలేదు. అయ్యది ఇగ్భిన్నమునకు ప్రవర్తింపక, ఇక్కునకే వచ్చుట వృద్ధి గ్రహణమావశ్యకము

ఇగ్భిన్నమునకు దేనికది ప్రాప్తించుచున్నది?

'అచికీర్షీత్' అజిహీర్షీత్ మున్నగు లుఙన్త ప్రయోగములందు సన్నంత ధాతువుల అంత్యాకారమునకు ప్రాప్తించుచున్నది.

లేదు. ఆట వృద్ధికి బాధకముగ. అకార స్థానమున, చికీర్షకః అను చోటవలె. "అతోలోపః" (6-4-48) అను సూత్రముచే లోపము వచ్చును.

అట్లైన, 'అయాసీత్' అవాసీత్, అనురూపములందు ఆకారము నకావృద్ధి రాకుండటకెట్లవచ్చును,

అటఘోత్వాకారము వృద్ధ్యక్షర మేగనుక దానికి వృద్ధివచ్చునననను రాదన్నను విశేషమేమియులేదు.

పోనిమ్ము సంధ్యక్షరమునకు వృద్ధి ప్రాప్తించును గదా? అనిన అంగాంత్యమునకుగదా రావలెను. అంత్యమగు సంధ్యక్షరమునకు "ఆదేచ ఉపదేశేఽశితి (6 1 45) అని లోపము వచ్చునుగాన వృద్ధియోగ్యమగు, అంత్యసంధ్యక్షరము దుర్లభము.

ఓయీ! ఉదవోఢామ్, 'ఉదవోఢ' అను రూపములలో, అవోఢ్ఢామ్ అని యున్నపుడు, "ఢోఢేలోపః' (8 3 13) అని మొదటి ఢకారమునకు లోపము రాగా, దానికి బూర్వముననున్న ఓకారము అంగాంత్యమయిన వృద్ధి యోగ్య సంధ్యక్షరము కలదే?

అనిన, నదియునులేదు. ఢలోపము అసిద్ధమగును గాన నోకార మంత్యము గాదు.

అట్లైన, 'అభైత్సీత్' 'అచ్ఛైత్సీత్' అను చోట వ్యంజనమైన తకారమునకు బ్రాప్తించుచున్నది గదా? దానిని వారించుట కనవచ్చునే?

అందులకును నక్కరలేదు. అచ్చట హలంతలక్షణ వృద్ధి అంత్యవృద్ధికి బాధకమగును.

అయినను, ఆ వృద్ధి నిషేధింపబడిన 'అకోషీత్' అమోషీత్ మున్నగు ఇడాగమసహిత సిజన్త రూపములలో అంత్యమునకు సిచివృద్ధి నివారించుటకు వృద్ధి పద మావశ్యక మనవచ్చునేమో? అనిన "నేటి (7-2-4)అను వృద్ధి నిషేధము, "సిచివృద్ధిః పరస్మైపదేషు" (7-2-1) అను వృద్ధికిని వచ్చును.

అదియెట్లు? "సిచివృద్ధిః పరస్మైపదేషు" "అతోల్రాన్తస్య" (7-2-2) వద వ్రజహలన్తస్యాచః" (7 2.3). "నేటి" (7 2.4)—అను సూత్రక్రమములో 'నేటి',అను నిషేధము, అనంతరమైన హలంతలక్షణ వృద్ధికే ప్రవర్తించుట యుచితము గదా యనిన నట్లుకాదు.

లక్షణమనునది ధ్వనించుచునే యుండును, అవ్యక్తముగ సామాన్య. రూపముననే బోధించుట దానికి స్వభావము. ఈ 'నేటి, యనులక్షణమును ఈ వృద్ధికే తాను నిషేధమును బోధించునని వ్యక్తముగ జెప్పదు. అంతటను వ్యాపించును. ఒక చోటనే విశ్రమింపదు. క్షణ కాలముగూడ నూరకుండదు ఈ నేటి యనునది స్వబాధ్యములగు నన్ని వృద్ధులను బాధించును.

లేదా సిచివృద్ధికి హలంత లక్షణవృద్ధి భాధకము. 'నేటి' యను నీ ప్రతిషేధము; సిచివృద్ధికిని హలంత లక్షణవృద్ధికిని ప్రతిషేధకము. కాగా సిచివృద్ధియు ప్రాప్తించదు.

ఇంకెక్కడనైన, అపవాదము ప్రతిషిద్ధమయిన యెడ నుత్సర్గము గూడ ప్రవర్తింపకుండుట కలదా?

లేకేమి? "సుజాతే అశ్వసూనృతే అధ్వర్యో అద్రిభిః సుతమ్, శుక్రంతే. అన్యదితి", ఇట పూర్వ రూపమగు నపవాదము ప్రతిషిద్ధము. ఉత్సర్గమయిన అయాదివిధియు ప్రవర్తింపలేదు.

అటులైన 'న్యనువీత్, 'న్యధువీత్' అనుచోట, 'నూ', 'ధూ' ధాతువుల ఊకారమునకు 'సిచివృద్ధి'ని "క్ఙితిచ" (1-1-5) అను సూత్రముచే వారింపవలసి యుండునుగాన నా విధముగను త్తరార్ధము వృద్ధిపద మావశ్యకమగు నందుము. అచ్చట సిచ్చు "గాఙ్ కుటాదిభ్యోఽఞ్ణిన్ ఙిత్" (1-2-1) అను సూత్రముచే ఙిత్తగును. అనిన,

ఇదియు ప్రయోజనముగాదు. అంతరంగత్వము వలన 'ఉవఙ్' ఆదేశమే ముందు ప్రవర్తించును. తదుపరి ఊకారమంత్యముగానందున వృద్ధికి ప్రాప్తియే యుండదు.

అయిన, సిజ్విషయమున, అపవాదము కంటెను నంతరంగమే ప్రబలమన్న మాటగదా. అట్లయినచో, 'అకార్షీత్' అహార్షీత్ అను లక్ష్యములను జూడుము. అట అంతరంగమగు గుణము రపరముగా ప్రవర్తించిన పిదప, అకర్ సీత్ అనుచో కకారాకారమంత్యముగానందున వృద్ధి సిద్ధింపక పోవును. పోనిమ్మ 'హలన్తలక్షణవృద్ధి' వచ్చును.

అపుడిచ్చట = న్యస్తారీత్, న్యదారీత్, అనుచోట, గుణము రపరమై ప్రవర్తించిన తరువాత అంత్యముకానందున అకారమునకు వృద్ధిరాక పోవునే? హలన్తలక్షణవృద్ధియా, 'నేటి' అని నిషేధింపబడెను.

పోనిమ్మ. అట "అతోల్రాన్తస్య' (7-2-2) అని వృద్ధిరావచ్చును.

లకారాన్తముగాని రేఫాన్తముగాని కాని లూధాతువుయొక్క లుఙన్త రూపమగు అలావీత్తనుచోటను అయాదీత్ అనుచోటను వృద్ధియెట్లు రావలె? అంతరంగములగు గుణావాదేశములు ముందు ప్రవర్తించిన 'పిదప', అలక్, ఈత్ అను స్థితిలో, అకారమంత్యముకాదుగాన సిచివృద్ధి ప్రాప్తింపదు. ఇక "హలన్తలక్షణవృద్ధికి 'నేటి' అని నిషేధము వచ్చునాయె.
అది రాకపోనిమ్మ, "అతోల్రాన్తస్య" (7-2-2) అనియే వచ్చును.

'ల్రాన్తస్య' అందువుగదా? ఇది ల్రాన్తముగాదు. లాన్తముగదా? 'ల్రాన్తస్య' అను పదమున లకారమునకు ముందు వకారమును నిర్దేశింపబడి యున్నది.

ఏదీ! వినబడుటలేదే?

అదీ లుప్త నిర్దిష్టము. ముందుచ్చరింపబడినది. "లోపోవ్యోర్వలి" (6.1 66) అని లోపించినది.

అటులైన నీ సూత్రముచే "మాభవాన్ అవీత్' మాభవాన్ మవీత్ అను' ప్రయోగములందు అవ్‌మత్ అను వాన్త ధాతువుల అకారమునకు గూడ, ఈ సూత్రముచేత వృద్ధి రావలసి వచ్చునే?

'అవ్‌మవ్' ధాతువులందురాదు, అని చెప్పెదను.

అట్టి నిషేధ వచనమున పూర్వముగ జెప్పవలసి వచ్చుటలో గౌరవము కలదు గదా?

అపూర్వ వచనమును జెప్పనక్కరలేదు. 'ణిశ్వి' అను ధాతువులతో నవి మవిధాతువులను పరివర్తింపవచ్చును. అనగా "హ్మ్యన్త, క్షణ, శ్వస, జాగృ ణి,శ్వి, ఏదితామ్" (7.2 5) అని యొక వృద్ధి నిషేధ సూత్రము, 'నేట' (7.2 4) అను సూత్రమున కనంతరము పఠింపబడియున్నది. 'అగ్రహీత్', 'అవమీత్', 'అవ్యయీత్' అక్షణీత్, 'అశ్వసీత్ అజాగరీత్', (మాభవాన్) ఊనయీత్. 'అశ్వయీత్' 'అరగీత్' అను స్థలములందే నిషేధము వలన వృద్ధిరాలేదు.

ఇందు, 'ణి' అనగా ణ్యన్త ధాతువనుట, ఊనయీత్, అశ్వయీత్ అను రెండుదాహరణములందును, అంతరంగత్వము వలన ముందు గుణాయాదేశములు వచ్చిన యెడల, యాంతము లగుటవలననే నిషేధము సిద్ధించుచున్నది. కాగా వాని నా సూత్రమునందు దీసివైచి, వాని స్థానమున, అవి మవులనుంచి, "హ్మ్యన్త క్షణశ్వ సజాగ్రవ్ మవేదితామ్" అని పఠింపవచ్చును. మాత్రా గౌరవమును లేదు.

అట్లైన, సిజ్విషయమున అంతరంగ శాస్త్ర ప్రవృత్తి లేదని, ఆచార్యుని ప్రవృత్తి మనకు జ్ఞాపకము. ఎట్లనగా, "అతో హలాదేర్లఘోః" (7.2 7) అను సూత్రము హలాది యగునంగము యొక్క లఘువగు అత్తునకు ఇడాది పరస్మై పదవర సిచ్చు పరమగును. వృద్ధిని వికల్పముగా విధించుచున్నది. అందు 'అతః'- అనునది, అకోషీత్, అమోషీత్ ఇత్యాద స్థలములందు, ధాతువునందలి ఉకారము నకు వృద్ధి వికల్పము ప్రాప్తింపకుండుటకు గదా. సిజ్విషయమున నంతరంగ శాస్త్రమునకు ప్రాబల్యముండిన, గుణమే ముందు ప్రవర్తించును. అప్పుడు లఘువే లేనందున వృద్ధి వికల్పమునకు ప్రాప్తియేలేదు. కాననయ్యది నిరుప యోగము కాకుండుటకు సిజ్విషయమున నంతరంగత్వమకించిత్కరము' అని జ్ఞాపించును. ఆ విషయము నాచార్యుడు కనిపెట్టియే, ఆ సూత్రమున అకార గ్రహణము చేసెను.

ఇది జ్ఞాపకము కాజాలదు. 'అతః' అని చెప్పుటలో వేరు ప్రయోజనము కలదు. ఏ మదియనిన, గుణము ప్రతిషేధింపబడిన చోట లఘ్వక్షరమే యుండును.

అట్టి 'న్యకుటీత్' 'న్యపుటీత్' మున్నగు కుటాది ధాతు ప్రకృతి కతిజంతములందు వృద్ధి నివారించుటకు అతః అప నది సార్థకము గదా.

అపుడు ణిశ్వ్రులకు విధింపబడిన వృద్ధి ప్రతిషేధము, సిజ్విషయమున నంతరంగము ముందు ప్రవర్తించుట యనునది లేదని బోధించును.

పరిశీలింపగా, "అతోహలాదేర్లఘోః" (7.2 7) అను సూత్రమున "లఘోః" అను పదమున్నను మరల 'అతః' అను పదమును గూడ గ్రహించుటయు జ్ఞాపకము కావచ్చును. లేకున్న నది సర్వథావ్యర్థమగును.

'న్యకుటీత్' ఇత్యాదులందు అంతరంగమైన గుణముచే వృద్ధి బాధిత మగును. పిదప నా గుణము "క్ఙితిచ" అను సూత్రముచే నిషిద్ధమయినను, "భ్రష్టావసరః కార్యం నలభతే" అను న్యాయముచే, బాధితమగు వృద్ధి మరల ప్రాప్తింపదు కాబట్టి 'అతః' అనునగ్రహణము నిష్ఫలమే యగును.

"తస్మాదిగ్లక్షణావృద్ధిః" అని ఉపసంహార వార్తికము. తస్మాత్ = 'అకోషీత్' మున్నగుచోట్ల వ్యంజనమునకు ప్రాప్తమయిన వృద్ధిని వారించుటకును, 'న్యనువీత్' ఇత్యాదులందు, ఉవజాదేశమును బాధించి ప్రాప్తమయిన వృద్ధిని నిషేధించుటకును, "సిచి వృద్ధిః పరస్మైపదేషు" (7.2 1) అను వృద్ధి 'ఇగ్లక్షణ'గా జేయబడవలె 'ఇగ్లక్షణ' అనగా, ఇక్కు స్థానిగా గలది అని యర్థము.

ఈ విధముగా వృద్ధి గ్రహణము ఉత్తరార్థమును, ఇహార్థమును గూడ ఆవశ్యకము' అని పర్యవసాదము.

## స్వాతంత్ర విధిత్వ నిరాకరణము

"షష్ఠ్యః స్థానేయోగత్వా దిగ్నివృత్తిః" అనునది ఆక్షేపవార్తికము' షష్ఠికి స్థాన పదార్థ నిరూపిత సంబంధమర్థము. కనుక ఇక్కు స్థానమున నని ఇకః, అను పదమున కర్థము కావలెను. సంబంధ విశేషము నిర్ధారితము కాని షష్ఠిగదాయిది? కాగా ఎచ్చటనున్న ఇక్కులకై ననుగుణ వృద్ధులాదేశములగునని యర్థముగాఁబట్టి, 'దధి' 'మధు' అను స్థలములందలి ఇక్కులకు గూడ గుణాదేశము చేతనో వృద్ధ్యాదేశము చేతనో నివృత్తి కలుగవలెను. అనగా నీ సూత్రము, గుణ వృద్ధులకు స్వతంత్రి విధాయక మగుననుట, అపుడు, 'దధి' 'మధు' అనుచోట గూడ నిక్కులకు నివృత్తి ప్రాప్తము.

ఐన నిపుడు 'మిదేర్గుణః' 'మృజేర్వృద్ధిః' ఇత్యాదిగా మరల గుణవృద్ధి వచనమునకేమి ప్రయోజనము కావలెను?

"అన్యతరార్థంపునర్వచనమ్" "ఇకోగుణ వృద్ధీ" (1.1.3) అను సూత్రముచే పర్యాయముగ నంతటను ప్రాప్తించుచున్న గుణవృద్ధులకు వాని వాని నిమిత్తము

లున్నపుడందొకటి నివర్తించుటకు పునర్వచనమగును. సార్వధాతుకార్ధకములు పరమగునపుడు గుణమే వచ్చును. 'మృజికి గుణమురాదు వృద్ధియే వచ్చును'అని చెప్పుననుట'.

"సంప్రసారణేచ" అని యాక్షేప వార్తికాంతరము.

సంప్రసారణ విధాయక సూత్రమునందును, ఈ సూత్రమున అనిర్ధారిత సంబంధ విశేష షష్ఠియగు 'ఇకః' అనునది యున్నట్లు 'యణః' అని, ఆ విధమయిన షష్ఠి యగపడుచుండుట వలన, న్యాయతౌల్యముచే నచట గూడ సర్వ'యణ్ణు'లకును సంప్రసారణాదేశముచే నివృత్తి ప్రాప్తించుచున్నది. ఆ సూత్రమునకు, యణ్ణు స్థానమున నిక్కు ఆదేశమగును. దానికి సంప్రసారణ సంజ్ఞయుగలుగును అని యర్థమగును. అపుడు, 'యాతా' 'వాతా' అను ప్రయోగములందున్న యా, వా ధాతువుల 'యవ'లకును సంప్రసారణము ప్రాప్తించును.

అపుడు, "ష్యఙస్సంప్రసారణం పుత్రపత్యో స్తత్పురుషే"(6-1-13) మున్నగు పునస్సంప్రసారణవచనమునకేమి ప్రయోజనము కావలెను?

ఆపునర్వచనము విషయార్థమగును. అనగా నిమిత్తనియమమును చేయుటకు అన్నమాట. "వచిస్వపియజాదీనాంకితి" (6-1-15) అనునది, ఈ సూత్రమున నుపాత్తములగు ధాతువులకు, కిత్తులు పరమగునపుడే సంప్రసారణమగును అన్యథారాదు అని నియమమును బోధించును.

"ఉరణ్రపరేచ" అని వేరొక వయాక్షేపవార్తికము. "ఉరణ్రపరః" (1-1-51) అను సూత్రమును దుర్బలన్యాయమున స్వతంత్ర విధి కావలెను. ఋకారస్థానమున అణ్ణులు ఆదేశములగును. అవిరపరములగును అని యపుడర్థము. అపుడు, సర్వ ఋకారములకును నెచ్చట నున్నవానికిని. అణ్ణులచే నివృత్తి ప్రాప్తించుచున్నది. ఋకారమున కంతరతమమగు అణ్ణు ఏదియు గావందున, పర్యాయమున నన్ని అణ్ణులును ప్రాప్తించుచున్నవి. కాగా 'కర్తృ' 'హర్త' అనుచోటను ఋకారమున కాదేశముచే నివృత్తి సంప్రాప్తము.

"సిద్ధంతు షష్ఠ్యధికారేవచనాత్" అని సర్వాక్షేప పరిహారవార్తికము సిద్ధంతు = ఈ ఆక్షేపములకు పరిహారము సిద్ధము. ఎట్లు? షష్ఠీస్థానే యను సూత్రమున నున్న షష్ఠ్యధికారమునందీ యోగములను బఠించుటవలన. అందొకటి, 'ఉరణ్ రపరః' (1-1-51) అనునది అచ్చటనే పఠింపబడియున్నది. "ఇకో గుణవృద్ధీ" (1-1-3)" ఇగ్యణస్సంప్రసారణమ్'' (1-1-45) అను నీరెండునుగూడ, ఉరణ్రపరసూత్రమునకు ముందుగాని తరువాతగాని అనువర్తించును కాగా నివి షష్ఠ్యధికారమువందలివగుటచే, వీనికి, 'ఎచ్చట స్థానషష్ఠీ నిర్దిష్టమగు

ఋకారముండునో యచట 'రపరః' అనియుపస్థితమగును', ఎచట స్థానషష్ఠీ నిర్దిష్టమునకు గుణవృద్ధులు విధింపబడునో, అట 'ఇకః' అనుషష్ఠ్యంత పదము పస్థితమగును,' ఎచ్చట స్థానషష్ఠీ నిర్దిష్టమునకు సంప్రసారణము విహితమో యచట 'ఇగ్యణః' అని యుపస్థితమగును.' అని వాక్యార్థములు నిష్పన్నమగును. కాబట్టి వీనికి, "అంగస్య" (6-4-1), వచిస్వపియజాదీనాంకితి" (6-1-15) "ఋూత ఇద్ధాతోః" (7-1-100) ఇత్యాదులందుపస్థితి కలుగును. అంతియేగాని ఇవి స్వతంత్ర విధులుగావు. కాగా పై దోషములు లేవు.

లేదా శాస్త్రీయాధికారము కాదభిప్రేతము. అపేక్షా రూపమగు లౌకికాధికారము. షష్ఠ్యధికారమున నీ యోగములను రెండింటిని ఆకాంక్షింతుము. అనగా "షష్ఠీస్థానేయోగా" (1-1-49)అను సూత్రమున,షష్ఠీ" అని యోగవిభాగము చేయబడును. దానికి, ఇంతకుపూర్వ మనుక్రాంతమయినది, 'షష్ఠి' యున్నచోట ననువర్తించును. తరువాత 'స్థానే యోగా' అను సూత్రము. ఇందు షష్ఠీ అను విభక్తసూత్ర మనువర్తించును.

లేదందురా! స్వతంత్ర విధి యిది అను వాని నీ విషయ మడుగదగి యున్నది. 'సార్వధాతుకార్ధధాతుకములు పరమగునపుడు గుణ మగునని విధింప బడిన గుణము, 'యాతా' 'వాతా' అను స్థలము లందేలరాలేదు? 'ఇకోగుణవృద్ధీ' అనునదచట నపేక్షింపబడును. ఇక్కులేనందున రాలేదు.' అనిగదా చెప్పవలెను. ఇది అచ్చట నపేక్షింపబడినట్లే, అదియు నిచ్చట నపేక్షింపబడును. ఇక్కునకు గుణవృద్ధులు, సార్వధాతుకార్ధధాతుకములు పరమగునపుడు అని. కాగా విధి పరిభాష లకు ఏక వాక్యతయేగాని, వాక్యభేదముచే స్వాతంత్ర్యమును,పారతంత్ర్యమును గూడ సంభవింపవు.

"ఇకో గుణ వృద్ధీ"

"తృతీయాహ్నికము సమాప్తము'

# చతుర్థాహ్నికము

## "న ధాతులోప ఆర్ధధాతుకే"

'ధాత్వంశము లోపించుటకు నిమిత్తమయిన ఆర్ధధాతుక ప్రత్యయము పరమగునపుడు, ఇక్కుకుగుణవృద్ధులురావు' అని యర్థము.

### ప ద కృ త్య వి చా ర ము

ఇందు ధాతుగ్రహణమునకు ప్రయోజనమేమని ప్రశ్న.

ధాతుపదము లేనపుడు, ఏ వర్ణమునకయినను లోపము వచ్చినపుడు, ఆర్ధ ధాతుక నిమిత్తకములయిన గుణవృద్ధులు ప్రవర్తింపవు" అని సూత్రమునకర్థ మగును. లూఞ్ ఛేదనే అను ధాతువునకు తుమున్నంత రూపము 'లవితుమ్' అనియు, 'పూఞ్' ధాతువునకు 'పవితుమ్' అనియునగును. 'లవితా' 'పవితా' అనునవి తృజంతరూపములు, ఇందు గుణము ప్రవర్తించి యున్నది. ఇట ఞకారమునకు "తస్యలోపః'' (1-3-9) అని లోపము వచ్చియున్నది. కాని గుణ నిషేధము కలుగలేదు. ఏలయన ఆ ఞకారముధాత్వవయవముగాదు. ఇత్సంజ్ఞక వర్ణములు లోపించిన తరువాత శేషించిన 'లూ' 'పూ' అనునవియే ధాతు సంజ్ఞ కలవియగును. కాగా ఞకారము ధాత్వంశము కాదు గాన గుణనిషేధములేదు. ధాతు పదములేనిచో నిషేధమువచ్చి యుండెడిది.

'ఆర్ధధాతుకే' అనుపదమునకేమి ప్రయోజనము? "త్రిధాబద్ధోవృషభోరోర వీతి'' ఇత్యాది మంత్రమునందు 'రోరవీతి' 'అనునది' యఙ్లుగంతరూపము. ఇట యఙంతధాత్వేకదేశమయిన యఙ్లులోపించినందున ధాత్వంశలోపము కలిగినది. 'రుశబ్దే' అనునది ధాతువు. దానికి పరముగ క్రియాసమభిహారమున 'యఙ్' ప్రత్యయము. యఙంతము వేరుధాతువు యఙ్ప్రత్యయమునకు లుక్కు. 'రోరు' అనునది యఙ్లుగంతము. యఙ్లుగంతమునకు 'చర్కరీతము' అని ప్రాచీన వైయా కరణుల సంజ్ఞ. 'చర్కరీతంచ' అనునది అదాదిగణము నందలి గణసూత్రము, కాగా శప్పుకు లుక్కు వచ్చును ఈ 'రోరు' అనునది భూవాది సూత్రముచే ధాతువగును. కనుక లడాదులు, తిప్పు, శప్పు, దానికి లుక్కు, గుణము. అవా దేశము, అంతకు బూర్వమే తిప్పుకు ఈడాగమము మున్నగు కార్యములు ప్రవ ర్తించిన 'రోరవీతి' అగును.

ఈ సూత్రమున 'ఆర్ధధాతుకే' అను పదము లేనపుడు, ధాత్వంశమునకు లోపమువచ్చినపుడు ఇక్కుకు గుణమురాదు, అని సూత్రార్థముగాన నిట "సార్వధాతుకార్ధధాతుకయోః" (7-3-84) అను సూత్రముచే గుణము నిషేధింప బడవలసి వచ్చును.

## ఆర్ధధాతుకపదార్థాన్వయ విచారము

ఇం'దార్ధధాతుకే' యను పదమునకు రెండు విధములుగా నన్వయము సంభవించును.

'ఆర్ధధాతుక నిమిత్తముగ లోపము వచ్చినపుడు గుణ వృద్ధులురావు అని యొక అన్వయబోధ. ఈ అన్వయమున ఆర్ధధాతుకే అనునది 'ధాతులోపే' అను పదమునకు విశేషణము-లేదా అ గుణవృద్ధులకు విశేషణమని చెప్పు. ధాతు లోపము వచ్చినపుడు 'ఆర్ధధాతుకము నిమిత్తముగా గలుగు గుణవృద్ధులురావు' అని వేరొక యన్వయబోధయుగావచ్చును.

ఇందే యన్వయము స్వీకరింపదగినది?

ఎట్లైననేమి? ఏది స్వీకరించిన నేమగును? లోపవిశేషణ మార్ధధాతుక పదమని చెప్పి,'ఆర్ధధాతుక నిమిత్తముగ ధాతులోపము వచ్చినచోట్ల గుణవృద్ధులు రావు' అను రీతిగా నన్వయముచేసి నపుడు, ఉప + ఇద్ధ = ఉపేద్ధః, అను చోట, "ఆద్గుణః" (6-1-87) అను గుణముగూడ రాకపోవును 'ఇద్ధః' అనునది క్తాంతము 'ఇన్ధ్' అని ధాతువు. అందలి న కారమునకు, ఆర్ధధాతుకమగు 'క్త' ప్రత్యయము. మూలముగ లోపము వచ్చినది. ధాతులోపమనగా నెచ్చటనైనను ధాత్వేకదేశ లోపమే. సకలధాతులోపమయిన, గుణవృద్ధులకు ప్రసంగమేకలుగదు గదా.

ఇక గుణవృద్ధులకు విశేషణ మందుమా? 'క్నోపయతి' అను రూపము నందు, ణిచ్చను నార్ధధాతుకము నిమిత్తముగ వచ్చిన "పుగన్తలఘూపధస్యచ" (7-3-86) అను గుణము గూడ నిషేధింపబడవలసి వచ్చును. క్నూయీధాతువు ణిజన్తరూపమిది. ఇట ధాత్వంశలోపము యకారలోపము.

ఎట్లుకావలెననిన నట్లు కానిండు. లోపవిశేషణమనుడు.

'ఉపేద్ధః' 'ప్రేద్ధః' - అనుచోనెట్లు?

ధాతూపసర్గయోగ స్థలములందు ముందుగ ధాతువు సాధన వాచక మగు ప్రత్యయముతో సంబంధించి, తరువాత నుపసర్గతో గలియును. "పూర్వం ధాతుస్సాధనేన యుజ్యతే. పశ్చాదుపసర్గేణ" అనునది సిద్ధాంతపక్షము. ఈ పక్షమున, "నధాతులోప" ఇత్యాది ప్రతిషేధమంతరంగమును, "ఆద్గుణః" (6-1-87) అను గుణము బహిరంగమునునగును. అంతరంగమగు ప్రతిషేధము కర్తవ్యమగు

నపుడు, బహిరంగ గుణము "అసిద్ధంబహిరంగమంతరంగే" అను పరిభాషచే నసిద్ధమగును గాన, ప్రతిషేధ్యము తనకంటి కగపడనపుడు, ప్రతిషేధశాస్త్రము, దానినెట్లు ప్రతిషేధింప గలుగును? కావుననిటగుణ మార్ధధాతుక ప్రత్యయ నిమిత్తముకాదు కాబట్టి నిషేధము ప్రవర్తింపలేదు అనవక్కరలేదు. ఆర్ధధాతుక పదము గుణవృద్ధులకు విశేషణముకాకున్నను నిట దోషము లేదనుట, ఇట్లయిన లాఘవముగూడ గలదు. సూత్రమున ధాతుగ్రహణము, ఆవశ్యకముగాదు. ధాతుగ్రహణము లేనిచో, 'లవితా' 'లవితుమ్' అను ప్రయోగము లెట్లు సిద్ధించును? 'ధాతుపదమున్నపుడు ఈకారము ధాత్వంశము కాదు. దానిలోపము ధాతులోపముగాదు. కావున గుణనిషేధము ప్రవర్తింపదు' అంటిరిగదా? ఇపు డెట్లు? అనిన.

ఇపుడు "నలోపే ఆర్ధదాతుకే" అనిగదా సూత్రముండును. ఆర్ధధాతుక నిమిత్తమగులోపముకలిగినపుడు ఇక్కుకు గుణనిషేధమగునని యర్థమగును. లూఞ్ ధాతువు నందలి ఈకారమునకు, వచ్చిన "తస్యలోపః" (1-3-9) అను లోపమునకు ఆర్ధధాతుక ప్రత్యయము నిమిత్తముకాదు. కావున నా యాక్షేపము లేదు.

లేదా- 'అర్ధధాతుకే' అనునది గుణవృద్ధులకే విశేషణమగుగాక. ఆర్ధ ధాతుక ప్రత్యయము నిమిత్తముగ ప్రాప్తములగు గుణవృద్ధులురావు' అని యర్థమగును.

అట్లైన, 'క్నోపయతి' అనుచోటగూడ గుణనిషేధము ప్రాప్తించునంటివి గదా? అనిన, నిపాతనమువలననట నిషేధమును వారింపవచ్చును గాన నా దోషములేదు. అనిపాతనమేమి? "చేలేక్నోపేః" (3-4-33) అనునది. యలోప మునకై దానియావశ్యకతగలదు. కాగాపతద్వయమును నిర్దుష్టమే.

"పరిగణన విచారము"

'అవ్యాప్త్యతివ్యాప్తులను బరిహరించుటకు ఈ సూత్రమున' లోపప్రతి యోగులకు పరిగణనము చేయవలెను. పరిగణన మనగా ఇయత్తా నిర్ణయము. కాగా "నయజ్, యల్, క్య, వలోప ఆర్ధధాతుకే' అని సూత్రమును రచింప దగును'అను నాశయముతో వార్తికకారుడు"యఙ్ యల్ క్యవలోపేప్రతిషేధః" అని వార్తికమును పఠించెను. యఙ్, యల్, క్య, వ-వీనికి లోపము వచ్చినపుడు మాత్రమే గుణవృద్ధి ప్రతిషేధము ప్రవర్తించునని చెప్పవలెను, యఙ్-బేభిదితా, మరీమృజః''

'బేభిద్య' అను యఙ్ప్రత్యయాంతమునకు బరముగా తృచ్ప్రత్యయము వచ్చిన నీ రూపమేర్పడును. మరల మరల భేదించువాడు అనియర్థము. ఇచట "యస్యహాలః'' (6-4-49) అనుసూత్రముచే, అకార విశిష్టమగు యకారమునకు

లోపము వచ్చును. తదనంతరము ఖిద్ ధాతువునందలి, ఇకారమునకు ప్రసక్తమగు గుణము నీ సూత్రము వారింపవలెను. ఇట ధాతువు యజంతము, యలోపము, తదంశలోపము.

"మరీమృజః" మరల మరల శోధనము చేయువాడు. మరీమృజ్య= యజంతధాతువు ణ్వుల్ప్రత్యయము. యకారలోపానంతరము, మృజేర్వృద్ధిః' (7-2-114) అనుసూత్రముచే, ప్రాప్తించు వృద్ధికీసూత్రముచే నిషేధము, యక్ = కుషభితా, మగధకః"

'కుషభఞ్ఞేపే', 'మగధపరివేష్టనే' అనునివి కండ్వాది గణమున బఠింపబడిన ధాతువులు. వీనికి బరముగాయక్ప్రత్యయము. అయ్యది "య.స్యహాలః" అను (6-4-49) సూత్రముచే మొత్తములోపించును. ఆలోపమునకు నిమిత్తము 'ణ్వుల్' 'తృచ్' ప్రత్యయములు. గుణవృద్ధులకు, యథాక్రమముగ నీ సూత్రముచే నిషేధము ప్రవర్తింపవలెను.

'క్య'—'సమిధితా, 'దృషదకః' సమిధను రాయిని తనకు కోరువాడు. యథాక్రమముగ నాపదముల కర్థము. ఇవి.' పుత్రీయ' వంటి నామధాతు ప్రకృతిక ణ్వుల్తృజంతములు. వలోపము—జీరదానుః' 'జీల్' ధాతువు. 'రదాను' ప్రత్యయము. వకారమునకు లోపము రాగా 'సార్వధాతుకార్ధధాతుకయోః, (7-3-84) అను సూత్రముచే ప్రాప్తించు గుణమునకు ఈ సూత్రముచే ప్రతిషేధము—ఇట్లుపరిగణనము చేసినందువలన నీరూపములవంటి యజ్,యల్,క్య' వలోప ప్రపసంగము కలస్థలములందేగాని స్థలాంతరముల నీ నిషేధము ప్రవర్తింపదు.

ఆప్రయోజనమెచ్చటననిన వార్తికకారుడు.

"నుమ్లోపస్రివ్యనుబంధలోపే అప్రతిషేధార్థమ్" అను వార్తికముచే వా ప్రయోజనములను నిర్దేశించెను.

పరిగణన ప్రయోజనము: నుమ్, స్రివుధాతువునందు వకారమునకు లోపము అనుబంధవర్ణమునకులోపమును గలిగిన స్థలములందు, ఈ ప్రతిషేధము ప్రవర్తింపకుండుట పరిగణనమునకు బ్రయోజనము.

నుమ్లోపము—'అభాజి' 'రాగః' 'ఉపబర్హణమ్' 'భఞ్జ్' ధాతువు చిణన్త రూపము 'అభాజి','భఞ్జేశ్చచిణి"(6-4-33) అను సూత్రముచే నకార లోపము. తదుపరి ఉపధావృద్ధి అభాజి. ఇటవృద్ధికీసూత్రముచే నిషేధము రారాదు, వార్తికమున నుమ్మనగా నకారమే. నుమాగమముకాదు. భఞ్జ్, రఞ్జ్ ధాతువు లలోని నకారమౌపదేశికమేగాని ఆగమముకాదు. నకారమునకే నుమ్మని పూర్వాచార్యుల సంజ్ఞ.

'రాగః' ఘఞంతము, ఇందును ఉపధావృద్ధికి నిషేధమురారాదు.

'ఉపబర్హణమ్'—అనునది 'బృహివృద్ధౌ' అనుదాని ల్యుడంతము. ధాతువు 'ఇదిత్తు' అగుటవలన నుమాగమము. ఆనకారమునకు, "బృంహేరచ్యనిటి" అను వార్తికముచే లోపము. పిదపగుణము దానికిసూత్రముచే నిషేధము ప్రవర్తింప రాదు.

ఇక 'అస్రేమాణమ్' ఇది ఋగ్వేదమునందు
'అస్రేమాణమ్' అని పఠింప బడియున్నది. నఞ్పూర్వకమగు 'స్రివు' గతి శోషణయోః అను ధాతువుపైన, మనిన్ప్రత్యయముచేరగా నేర్పడిన 'అస్రిమన్' శబ్దముయొక్క ద్వితీయైకవచనాంతము, ఇట ధాతువ కారమునకు లోపము వచ్చిన తరవాత, గుణము ప్రవర్తించినది. దానికి నిషేధము ప్రవర్తింప కుండుటయు పరిగణనమునకు ప్రయోజనము.

అనుబంధలోపము—'లూఞ్ ఛేదనే' అనే ధాతువునందు ప్రవర్తించి, ఞ్ కారము నివర్తింపగా, ఊకారమునకు గుణముచే 'లవితా' 'లవితుమ్' మున్నగు రూపములగుచున్నవి. అట గుణనిషేధము లేకుండుటయు వేరొక ప్రయోజనము. కాగా పరిగణనము వలన, పైన జెప్పిన అయిదు రూపములందును గుణ వృద్ధులు సిద్ధించును. లేనిచో నీ నిషేధము ఆచటను ప్రాప్తము.

ఇట్లు పరిగణనము చేసినచో, 'స్యదః' 'ప్రశ్రథః' "హిమశ్రథః" అను నీ రూపములందును వృద్ధి ప్రాప్తించునే. ఈ నిషేధమిక నచ్చట ప్రవర్తింపదు గదా? 'స్యన్దూ' స్యన్ద ధాతువులందు ధాత్వంశమగునకారము లోపించినది. అత ఉపధాయాః (7-2-116) అని వృద్ధి రావలసియున్నది, దానికి సూత్రముచే నిషేధము సిద్ధింపవలెను. పరిగణన పక్షమున నీ వృద్ధికి, 'అభాజి' ఇత్యాదులందు వలె ప్రవృత్తియే ప్రాప్తమగుచున్నది. అను నాక్షేపమునకు సమాధానమును వార్తిక కర్తయే అను పదమే "నిపాతనాత్స్యదాదిషు" అని చెప్పెను. "స్యదో జవే" (6-4-28) "అవోదైధౌద్మ ప్రశ్రథహిమశ్రథాః" (6-4-29) అను రెండు సూత్రములచే, ఆ రూపములందు. నలోప వృద్ధ్యభావములు రెండును నిపతింప బడినవి కాగా ఆ దోషము లేదు.

అయిన పరిగణనము కర్తవ్యమనుటయేనా? నిర్దోషమేకదా? చేయ నక్కరలేదు.

అట్లైన నుమ్లోప స్థలములందు ప్రతిషేధమెందులకు ప్రవర్తింపదు? దీనికి సమాధాన వార్తికము—"ఇక్ప్రకరణాన్నుమ్లోపేవృద్ధిః" అనునది.

ప్రకరణము ఇక్ప్రకరణము అగుటచే నుమ్లోపము గలిగిన చోట వృద్ధి సిద్ధించును. ఇగ్లక్షణములగు గుణవృద్ధులకు గదా ప్రతిషేధము. ఇది ఇగ్లక్షణ వృద్ధికాదు గదా. ఏ గుణవృద్ధి విధాయక శాస్త్రములందు, స్థాన్యంతరమునకు

వృద్ధి గుణములను వారించుటకు "ఇకో గుణవృద్ధీ" అను పరిభాష యుపస్థిత మగునో అవి ఇగ్లక్షణములు. ఇక్పరిభాషాలక్షణములనుట అభాజి' 'రాగః' అనుచోట "అతఉపధాయాః"—అని గదా వృద్ధి అందిక్పరిభాషకుపస్థితి స్థాని నిర్దేశముండుటవలన గలుగదు అని వార్తిక తాత్పర్యము.

ఓహో! ఇగ్లక్షణ గుణవృద్ధులకు, ప్రతిషేధమనిన, 'స్యద', 'ప్రశ్రథః' 'హిమశ్రథః' అను స్థలములందు, ప్రతిషేధము ప్రాప్తింపకపోవునే? అట్లే,

'అవోదః' 'ఏధః' 'ఓద్మః' అనుచో నయ్యది ప్రాప్తింపవలసియువచ్చునే? ఇట పుగంతేతి గుణము ఇగ్లక్షణమే.

'ఉన్దీక్లేదనే' అనుధాతువు ఘఞంతరూపము 'ఓదః'అనునది. 'అవ' అనునది యుపసర్గము. ఓదః అనురూపమున లోపగుణములు ప్రవర్తించిన తరువాత నేర్పడినది. ఉపసర్గతో "ఏఙిపరరూపమ్" (6-1-94) అని పరరూపము. 'ఏధః' అనునది 'ఇన్ధీదీప్తౌ' ఘఞతము. 'దీప్తి' అని యర్థము. 'ఓద్మః' 'ఉన్దీక్లేదనే' మనిన్ప్రత్యయాంతము. ప్రశ్రథః = 'శ్రథగ్రన్థ సందర్భే', ప్రకృష్టమయిన గ్రథనము హిమశ్రథః = మంచు కూడిక, ఈయాశేః మునకు సమాధాన వార్తికము "నిపాతనాత్స్యదాదిషు" నిపాతనమువలన స్యదాదులందు నిషేధము సిద్ధింప వలసిన చోట సిద్ధించును. అనిష్టమగుచోట ప్రవర్తింపదు.

ఇగ్లక్షణ గుణ వృద్ధులకు ప్రతిషేధమనిన స్రివుధాతువున వకారమునకు లోపము గలిగినపుడు అస్రేమాణమనుచోటను, 'అవితుమ్' అనుచోటను అను బంధలోపము వచ్చిన స్థలమునను దూప సిద్ధియెట్లు కావలెను? అనిన-సమాధాన వార్తికము, ప్రత్యయాశ్రియత్వాదన్యత్రసిద్ధమ్" అని, 'ఆర్ధధాతుకే' అనునది సూత్రమున లోపవిశేషణము, కాగా ఆర్ధధాతుక ప్రత్యయము కారణముగా లోపము కలిగినపుడే గుణవృద్ధి ప్రతిషేధము ప్రవర్తించును. అస్రేమాణమను చోట వకార లోపమునకు 'మనిన్' అను నార్ధధాతుక ప్రత్యయము నిమిత్తము గాదు. అందలి 'వల్' అయిన మకారము మాత్రమే నిమిత్తము. లూఞ్ ధాతువు నందలి ఞకారమునకు లోపము. తస్యలోపః (1-3-9) అని వచ్చినది. అనైమిత్తికము. ఆర్ధధాతుక మగు తుముప్రత్యయము దానికి నిమిత్తముగాదు

లోప మార్ధధాతుకనిమిత్తక మయినపుడే ప్రతిషేధము ప్రవర్తించు ననినచో, అవుడు "జీరదానుః" అనుచోట, ప్రవర్తింపక పోవునే? అచట వకార లోపము రేఫరూపవల్ - నిమిత్తమేగాని, రదాను ప్రత్యయ నిమిత్తకము కాదు గదా. అనిన సమాధానము "రకిజ్యఃసంప్రసారణమ్"-అనునది.

'జీరదానుః' అను నీ రూపము, జీవధాతు నిష్పన్నము కానేకాదు. 'జ్యా వయోహానౌ' అను ధాతువునకు 'రక్' అను ప్రత్యయము. "గ్రహిజ్యే" త్యాది సూత్రముచే (6.1.16) సమ్ప్రసారణము, దానికి "హలః" (6.4.2) అని

దీర్ఘము రాగా 'జీరః' అను రూపము ఏర్పడినది. దానికిదాను శబ్దముతో బహు వ్రీహి.

ఇది రక్ప్రత్యయాంతమనినపుడు జ్యాధాతువునకు బరముగా రక్ప్రత్యయమనియు, సంప్రసారణ, పూర్వరూప దీర్ఘములు వచ్చి ఏర్పడినదనియు నీక్లేశమక్కరలేదు. జీరధాతువు కంటె బరముగా రక్ప్రత్యయమనినను, కిత్త్వమువలన గుణ నిషేధము సిద్ధించును గాన నట్లే చెప్పవచ్చును.

సరి. 'ఉపబర్హాణమ్' ఎట్లు ?

'బృహి' అనగా బృహధాతువు వేరుగాగలదు. 'బృహ, బృహివృద్ధౌ' అని ధాతుపాఠమున బఠితము. ఇట ల్యుట్ప్రత్యయమునకు బ్రకృతి, 'బృహ' నిగా బృహిగాదు. కాగా, ధాత్వంశ లోపమే లేదు.

ఇది బృహధాతు ప్రకృతికము. బృహిప్రకృతికము కాదు.

అని ఎట్లు తెలియును ?

బృహి ప్రకృతికమైనచో, నలోపము, "బృంహేరచ్యనిటి" అను వార్తికముచే వచ్చు నంటిరి గదా. ఆ వార్తికమవ్యాప్త్యతివ్యాప్తిగ్రస్తముగాన ఆశ్రయణీయముగాదు. అది యెట్లన, - అచ్చుపరమైనపుడు లోపము వచ్చునని వార్తికమున జెప్పబడినది. 'నిబృహ్యతే' అను రూపమున అచ్చుపరముగా లేకున్నను లోపము కనబడుచున్నది. అది అతివ్యాప్తి. అట్లే ఇడాగమము పరముగా లేనపుడు వచ్చునని చెప్పబడినది. కాని 'నిబర్హిణా', 'నిబర్హితుమ్' అను చోట నిడాగమము పరమైనపుడు నగపడుచున్నది. ఇది అతివ్యాప్తి.

ఇక 'బృంహయతి' 'బృంహకః' అనుచోట ణిజాది ప్రత్యయము పరమైనపుడు రాదగినదిరాలేదు. అది అవ్యాప్తి. కావున వార్తికము ఆశ్రయణీయము గాదు. ఉపబర్హణమను రూపమునందు ధాతువు బృహ అను ప్రకృత్యంతరమే గాని 'బృహి' కాదు.

అందువలన పరిగణనముతో పనిలేదని స్పష్టము.

పరిగణనము లేనిచో, 'భేద్యతే' 'ఛేద్యతే'అను ప్రయోగములందును గుణ ప్రతిషేధము ప్రాప్తించవలసివచ్చునే? అట భిదిఛిదులు ణ్యంతములు. కర్మార్థమున లకారము. ధాత్వంశమగుణిచ్ప్రత్యయమునకు యక్ప్రత్యయ నిమిత్తకముగ లోపము. కావున లోపమార్ధధాతుక నిమిత్తకము. గుణమునకు ణిచ్ప్రత్యయము నిమిత్తము గాన లోపగుణములు రెండును అర్ధ ధాతుక నిమిత్తకములే గావున గుణ ప్రతిషేధమనివార్యమగుచున్నది.

అనిన. నయ్యది దోషము గాదు. 'ధాతోర్లోపః ధాతులోపః, తస్మిన్ = ధాతులోపే' - అని తత్పురుష సమాసముగా నాపదమును గ్రహింతము.

'ధాతోర్లోపః యస్మిన్ తత్=ధాతులోపమ్' అని వ్యధికరణ బహువ్రీహిగా గ్రహింతుము. అన్యపదార్థమార్ధధాతుకము. అపుడు లోపమునకును గుణ వృద్ధులకును ఆర్ధధాతుక మొక్కటే నిమిత్తము అయినపుడు ప్రతిషేధము ప్రవర్తించునని తాత్పర్యము, 'భేద్యతే చేద్యతే' అను స్థలములందా స్థితి లేదు. గుణము ణిప్రత్యయాశ్రయము. ణిలోపము యగాశ్రయము. కావున నట నిషేధాపత్తి లేదు' అని సమాధానము.

అందువలన ఇగ్లక్షణ వృద్ధియే నిషేధ్యము.

సకల దోషములును నిరస్తములుగాన పరిగణన మనావశ్యకము. ఇగ్లక్షణ వృద్ధికే ప్రతిషేధమని యంగీకరించుట చేతనే, 'అభాజి' ఇత్యాదులందు వృద్ధికి ప్రతిషేధము రాలేదు. లేనిచో నలోపమును వృద్ధియు నేక నిమిత్తకములే అయినందున నట ప్రతిషేధము దుష్పరిహారమయ్యెడిది. బహువ్రీహి పక్షమునను నాదోషము తప్పనిదగును. అందువలన, ఇగ్లక్షణ వృద్ధికే ప్రతిషేధము ప్రవర్తించునను సిద్ధాంతమున నేదోషమును లేదు.

"ఇగ్లక్షణత్వపక్షమున దోషనిరాకరణము"

ఇగ్లక్షణగుణవృద్ధులకు నిషేధమనిన 'పాపచకః' 'పాపతకః' 'మగధకః- దృషదకః' అను నిరూపములలో "అత ఉపధాయాః" (7-2-116) అనువృద్ధి ఇగ్లక్షణముకానందున, దానికి నిషేధము ప్రాప్తింపక పోవునే?

అందు, 'పాపచ్య', 'పాపత్య' అనునవి యజంత ధాతువులు, ణ్వుల్లు, ప్రత్యయము. అకారమునకును, యకారమునకును వేరువేరుగ లోపములు.

'మగధ్య' — కండ్వాది యగంతము, "కండ్వాదిభ్యోయక్"(3-1-27)
'దృషద్య' - క్యజన్తము. సుప ఆత్మనః క్యచ్"(3-1-8) ఈ స్థలములందు వృద్ధికి నిషేధము ప్రవర్తింపవలె. అయ్యది సిద్ధింపకుండునని తాత్పర్యము.

సమాధానవార్తికము-"అల్లోపస్య స్థానివత్త్వాత్"అని "అతోలోపః"(6-4-48) అని అకారమునకు, లోపమును, "యస్యహలః" (6-4- 49) అని యకారమునకు లోపమును గలిగినవి. అకారమునకు వచ్చిన లోపమును నాదేశమునకు, "అచః పరస్మిన్పూర్వవిధౌ" (1-1-57) అను సూత్రముచే స్థానిసాదృశ్యమును బోధింపవచ్చును. అపుడు అకారముతో వ్యవధానముండుటవలన వృద్ధి ప్రాప్తింపదు అని చెప్పవచ్చును. కాగా ఇగ్లక్షణత్వపక్షమునిర్దోషమే.

## సూత్రప్రత్యాఖ్యానము

"**అనారంభోవా**"-అని వార్తికము. లేదా ఈ సూత్రమును రచింపకుండుటయు న్యాయ్యమేయగును. 'బేభిదితా', 'మరీమృజకః' 'కుషుభితా' 'సమిధితా'- ఇవి యెట్లు? ఇట గుణ వృద్ధి ప్రతిషేధ మెట్లు సిద్ధించును?

ఇందును, అకార లోపముకలదు దానికి స్థానివద్భావము నాశ్రయించిన, తద్వ్యవధానమువలన గుణవృద్ధులకు ప్రాప్తియే యుండదుగావున సూత్రమనావశ్యకమని వార్తికకారుని తాత్పర్యము.

అట్లైన స్థానివద్భావమునకు ప్రసంగము లేనిచోట నెట్లు?

స్థానివద్భావ ప్రసంగ విరహితములగు స్థలములేయ్యవి?

'లోలువః' 'పోపువః' మున్నగునవి. అట లోలూయ 'పోపూయ' అనునవి 'లూ' 'పూ' ధాతువులు ప్రకృతిగాగల యఙంతములు. పచాదిత్వము వలన 'అచ్' ప్రత్యయము. అది పరమగునపుడు, "యఙోచి చ" (2-4-74) అను సూత్రముచే యఙ్ప్రత్యయమునకులుక్కు. ఆలుక్కు 'య' అను యకారాకార సముదాయమునకు వచ్చిన యాదేశమగుటచేత అజాదేశముకాదు. అందువలన స్థానివద్భావము ప్రాప్తింపదు.

అచ్చటగూడ, "అతోలోపః" (6-4-48) అని అకారమునకు లోపమునుజేసి, శేషించిన యకారమాత్రమునకు లుక్కును జేయవచ్చును. అపుడు స్థానివద్భావము వలన గుణవృద్ధులను వారింపవచ్చును. "మరీమృజకః" అనునది వృద్ధ్యుదాహరణము.

అనవకాశమగుటవలన లుక్కు లోపముకంటే ముందుగనే ప్రవర్తించును "అతోలోపః" (6-4-48) అను లోపమునకిక ప్రసక్తిలేదు. లుక్కును బ్రవర్తింప జేయవలెనా? అల్లోపమును బ్రవర్తింపజేయవలెనా యను సంప్రధారణము కర్తవ్యము. అపుడు పరమయిన దగుటవలన నల్లోపమే కర్తవ్యమని తేలును.

అట్లుకాదు. లుక్కు నిత్యము. నిత్యమనగా కృతాకృత ప్రసంగి. అల్లోపానంతరమును దత్పూర్వమును గూడ బ్రసంగముగల లుక్శాస్త్ర ప్రవృత్తి నిత్యము.

లుక్కుకూడ అనిత్యమే. ఎందువలననగా అల్లోపముచేసిన తరువాత 'య్' అనుదానికి బ్రాప్తించుచున్నది. చేయక పూర్వమైన 'య' అను దానికి తత్ప్రాప్తి. ఇట్లు భిన్నభిన్న శబ్దములకు వెనకముందు ప్రాప్తియున్నదనుకొనుము. ఏ వ్యక్తికి సంబంధించి, ముందు ప్రాప్తించునో తరువాతకూడ ఆ వ్యక్తికి సంబంధించి ప్రాప్తించినదే యది కృతాకృత ప్రసంగమనబడును. శబ్దాంతరమునకు బ్రాప్తించువిధి అనిత్యమేయగును, రెండును అనిత్యములగు నపుడింక పరత్వమే వ్యవస్థాపకము కావున నల్లోపమే వచ్చును.

అట్లుకాదు. లుక్కు అనవకాశముగా నల్లోపమును బాధించును. లోపమవశ్యప్రాప్తమగుచుండగ నారంభింపడినదిగదా లుక్కు.

'కాదు, లుక్కు సావకాశియే' అని ప్రత్యాఖ్యానవాది.

ఆ అవకాశమేయది?

శేషించినది. అనగా, అకారమునకు లోపము ప్రవర్తించిన వెనుక మిగిలిన యకారము లుక్కున కవకాశము.

లుక్కునకును లోపమునకును విషయములు భిన్నభిన్నములు కనుక 'యేననా ప్రాప్తి' న్యాయముకు ప్రసంగముమ లేదు.

విషయభేదమున్నను లోపప్రవృత్తికాలమున లుక్కున కవశ్య ప్రాప్తి కలదుగాన లుక్కు బాధకమగుననినను దోషములేదు. "అతోలోపః" 6-4-48 "యస్యహలః"(6-4-49)అనునవి వరుససూత్రములు.అందు"యస్యహలః" (6-4-49) అను సూత్రమునందు, 'యస్య' అనునది వేరు సూత్రముగా జేయబడును. అందు పూర్వసూత్రమునుండి "అతః" అనుపదమను వర్తించును. 'హల్లుకంటె, బరమగు 'య' శబ్దముయొక్క అకారమునకు గూడ లోపము వచ్చును' అనిదాని కర్థము 'పూర్వసూత్రముచేతనే సిద్ధించునుగదా దీనితోబనియేమి" యనిన లుక్కును జెప్పబోవును దానిని బాధించుటకిది యనుట లుక్కు లోపమున కపవాదము. ఈ యోగవిభాగము వలన నది 'య' అను మొత్తమునకు రాదని సిద్ధించును. అకార లోపానంతరము యకార మాత్రమునకది వచ్చును.

తరువాత-"హలః" అని సూత్రశేషము, 'హల్లునకు బరమైన యకారమునకు లోపమగును' అని దాని యర్థము.

అట్లైన, వక్ష్యమాణరూపమున గూడ పరత్వమువలనగాని యోగవిభాగము వలన గాని లోపము లుక్కును బాధించినచో దానికి స్థానివద్భావముచే వృద్ధింప కుండెడిదే? ఎచట ననగా "కృష్ణో నోనావ వృషభోయదీదమ్" అను ఋఙ్మంత్ర పాదమున 'నోనావ' అనునది యఙంతమగు 'ణుస్తుతౌ' అను ధాతువునకు లిట్ప్రథమ పురుషైక వచనాంతరూపము. ఇది మంత్రమగుటచే 'కాస్ప్రత్యయాదామ మంత్రేలిటి' (3-1-35) అని. 'ఆమ్' అను ప్రత్యయమురాలేదు. 'నోనూయ + అ' - అను నవస్థలో యఙ్ప్రత్యయావయవమగు అకారమునకు లోపము వేరగా వచ్చునెడల, స్థానివద్భావముచే అకారసత్త భావింపబడును గాన ణిత్తుపరముగా నుండుట కుదురదు. దానిచే వృద్ధి సిద్ధింపకుండును.

అనిన సమానాశ్రయమగు లుక్కునకే లోపముచే బాధకలుగును. ఇటుగల గదు అని ప్రత్యాఖ్యానవాది యుత్తరము.

<u>సమానాశ్రయమనగా</u> నెట్టిదికావలెను? అనిన ప్రత్యయాశ్రయము కావలెననుట. "యఙోచిచ" (2-4-74) అను సూత్రమున, 'యఙోచి' 'చ' అని రెండంశములు. 'అచ్ప్రత్యయము పరమగునపుడు వచ్చు లోపమున లుక్కును సమాన కాలికముగునపుడు [illegible] విధియనెడి 'చ' అనునది రెండవ

యంశము. అది యజర్థ వివక్షలో, అచ్ప్రత్యయము లేకున్నను లుక్కును విధించునది. ఇది అనైమిత్తికము. ఈ సమయములో అర్ధధాతుక ప్రత్యయము వేరొక దానికి ప్రసంగమే లేదుగదా. 'నోనావ' అను నుదాహరణమున, 'చ' అను నీ రెండవ యంశము లుగ్విధాయకము. అయ్యది ముందే ప్రవర్తించును. అకార లోపమో అర్ధధాతుక నిమిత్తకము. కావున లుగ్లోపములు తుల్య కాలములు కావు. తుల్యకాలతయే సమానాశ్రయత. కాగా నట వృద్ధికి ప్రతిబంధము లేదు.

'స్యదః' 'ప్రశ్రథః' "హిమశ్రథ" 'శీకశానః' "నికుచితః" అనునవి యెట్లు? ఈ సూత్రము లేని పక్షమున ఇట గుణ వృద్ధి ప్రతిషేధము లెట్లు సిద్ధించును?

"ఉక్తం శేషే" అనునది యీ యాక్షేపమునకు సమాధానము. ఉక్తపూర్వమేనని వార్తికమున కర్థము. ఏమి చెప్పబడినది? అనిన నిపాతనము వలన స్యదప్రశ్రథ హిమశ్రథలలో వృద్ధి ప్రతిషేధము సిద్ధించుననియు, అందువలననే, అవోద,ఏధ,ఓద్మలందు గుణము సిద్ధించుననియు,'శీకశానః'అనుచోట వదజ్యాధాతువునకు రక్ప్రత్యయ సంప్రసారణములచే నిష్పన్నమయిన దగుటచే, రక్ప్రత్యయమునందలి కిత్త్వము మూలమున, "క్ఙితిచ" (1-1-5) అను సూత్రముచే గుణనిషేధము సిద్ధించినదనియు చెప్పబడినది. "నిపాతనాత్స్యదాదిషు" "ప్రత్యయాశ్రయత్వాదన్యత్ర సిద్ధమ్" "రకిజ్యః సంప్రసారణమ్" అను వార్తికములు వ్యాఖ్యాత పూర్వములు.

ఇక "నికుచితః" అను నుదాహరణము విషయమునగూడ సమాధానము చెప్పబడియే యున్నది. ఏమది యనిన,—

"సన్నిపాత లక్షణోవిధి రనిమిత్తం తద్విఘాతస్య" అను సమాధానము." ఇతి పరిభాష.

సన్నిపాత లక్షణమగు విధి ఆ సన్నిపాతమునకు విఘాతకమగు విధికి నిమిత్తముకాదు అని అర్థము.

సన్నిపాతమనగా సంబంధము. అది పౌర్వాపర్యముగాని విశేషణ విశేష్య భావముగాని కావచ్చును. అయ్యది నిమిత్తముగా ప్రవర్తించిన విధి, ఆ సంబంధమునకు విఘాతమును గల్గించు నింకే విధికిని తాను నిమిత్తము కాజాదు. అట్లైన నది ఉపజీవ్య విరోధమగును. "ఉపజీవ్యస్య విరోధో న కర్తవ్యః" అని న్యాయము. ఈ న్యాయమే పై పరిభాషకు మూలము. "నికుచితః" అను నుదాహరణమును జాతము.

'కుఞ్చ కౌటిల్యాల్పీభావయోః'అను ధాతువుక్తాంత రూపమిది. క్తప్రత్యయమునందలి కిత్త్వమును బురస్కరించుకొని ధాతువునందలి నకారమునకు

లోపమును, క్తప్రత్యయమున కిడాగమమునురాగా 'నికుచితః' అను రూప మేర్పడుచున్నది. ఇట, 'కుచ్' అనుధాతువున ఉకారమునకు గుణము ప్రాప్తించుచున్నది.అది నిషేధింపబడవలెను. క్తప్రత్యయమునందలి కిత్త్వమువలన "క్ఙితిచ" అను నిషేధము ప్రవర్తింపవచ్చునని యందుమా? అది కుదురదు. వివరణ చూడుడు.

"ఉదుపధాద్భావాది కర్మణో రన్యతరస్యామ్" (1-2-21) అను సూత్రము హ్రస్వోకారోపధమగు ధాతువు కంటె పరమగు సెడాగమసహిత మయిన భావార్థక నిష్ఠా ప్రత్యయమునకు వికల్పము కిత్త్వనిషేధమును బోధించు చున్నది. అందువలన నా నిషేధము ప్రవర్తింపదు. ఇక నట నావశ్యకమగు గుణ నిషేధమునకు ప్రకృత సూత్రమందున 'న ధాతులోప ఆర్ధధాతుకే' (1-1-4) అను నది యవసరమగును. కాగా తదనారంభము న్యాయ్యముకాదు. అను వాక్షే పము పై పరిభాషవలన సమాహితము కావలెను.

'నికుచితః' అనుచోట కిత్త్వ సంబంధము వలన నలోపము ప్రవర్తించి నది. అందువలన ధాతువు ఉదుపధమైనది. ఉదుపధమై యిపుడాకిత్త్వమునకు విఘాతకమగు ఉదుపగాత్తను విధి తాను నిమిత్తమయిన నది యుప జీవ్య విరోధము. కాగా కిత్త్వనిషేధము ప్రవర్తింపదు. కిత్త్వమునకు భంగములేదు 'క్ఙితి చ' అను సూత్రము చేతనే గుణ నిషేధము ప్రవర్తించును గాన నధాతు లోప సూత్రానారంభము న్యాయ్యమే" "నధాతు లోప ఆర్ధధాతుకే"

## "క్ఙితిచ"

'క్ చ ఙ్ చ = క్ఙౌ, క్ఙౌ ఇతౌ యస్యాసః = క్ఙిత్, తస్మిన్, కకారమును ఙకారమును ఇత్సంజ్ఞకములుగా అవి పరముగా నున్నపుడు ఇగ్లక్షణములగు గుణ వృద్ధులు ప్రవర్తింపవు" అని యర్థము. కాని వార్తికకారుడు, ఇందలి సప్తమి నిమిత్త సప్తమి కావలెనను అభిప్రాయముతో" "క్ఙితి ప్రతిషేధే తన్నిమిత్త గ్రహణమ్" అను వార్తికమును రచించెను.

కిత్తులను ఙిత్తులును నగు ప్రత్యయముల సమవధానమున నిక్కునకు గుణవృద్ధులు ప్రవర్తింపవు అని బోధించు నీ సూత్రమున తన్నిమిత్త పద ముండవలెను. కిత్ ఙిత్ ప్రత్యయములు నిమిత్తముగ నిక్కునకు ప్రాప్తించు గుణ వృద్ధులు రావని యర్థము కావలెను అని తాత్పర్యము. కిత్ ఙిత్ప్రత్యయముల అవ్యవహిత పూర్వమగు నిక్కునకు గుణ వృద్ధులు రావని యర్థమయిన, 'చితం' 'స్తుతమ్' ఇత్యాదులందు క్తప్రత్యయావ్యవహిత పూర్వములైన ఇకారో కారములకే గుణ ప్రతిషేధము ప్రవర్తించునుగాని 'భిన్నమ్' 'ఛిన్నమ్' అనుచో వ్యవహిత పూర్వమునకు నిషేధము సిద్ధింపక పోవును.

తన్నిమిత్త గ్రహణమునకు ప్రయోజన మేమనిన నది యుపధారో రతీత్యర్థమని, "ఉపధారో రతీత్యర్థ" మను వార్తిక శేషము చెప్పు చున్నది.

ఉపధయయిన ఇక్కునకు ఛిన్నభిన్న శబ్దములందు గుణ నిషేధము ప్రయోజనమని చూపబడియే యున్నది.

ఓయీ! 'క్ఙితి' అనునది దేనికి విశేషణము? దేనిస్థానమున గుణము విధింపబడుచున్నదో దాని వా విశేషణముచే విశేషింతుము పుగాగమాంత మును, లఘూపధమును నగు నంగమునకు గదా 'క్ఙితి' అనునది విశేషణము 'భిద్ ఛిద్' అను నంగములు కిత్పరములేగాన నికదన్నిమిత్త గ్రహణము తో బనియేమి? కావు ననుపధార్థమయ్యేది యనావశ్యకము.

అనిన,— 'పుగన్త లఘూపధస్య' అనుపదమునకు, పుగంతమగునంగమున కును, లఘూపధగా గల యంగమునకును (గుణమగును) అని యర్థము వివక్షితముగాదు. మరియెట్లిందువా? 'పుకి అన్తః=పుగన్తః' లఘ్వీ చసా ఉపధాచ=లఘూపధాపుగన్తశ్చ లఘూపధాచ అనయోస్సమాహారః పుగన్త లఘూపధమ్. తస్యపుగన్తలఘూపధస్య' అని పరిగ్రహించి, పుగాగమువరమగు నపుడున్న చివరి వర్ణమునకును, లఘువైన ఉపధావర్ణమునకును గుణమగునని యర్థమును వివక్షింతుము. ఈ అన్వయమున కిత్తు ఉపధకు, గుణస్థానికి పరము కావలెనని తేలినది.

ఈ విధమగు నన్వయమే అవశ్య కర్తవ్యము. నిమిత్తము అంగమునకు విశేషణమయినచో, 'భినత్తి', 'ఛినత్తి' అనుచోట గూడ గుణము రావలసి వచ్చును. అది అనిష్టము గదా? 'భినద్' ఛినద్' అనునంగములు లఘూపధ ములే. సార్వధాతుకము వానికి పరముగనున్నది. కావున నాపత్తి తప్పదు. దానిని వారించుటకు, ఉపధయయిన ఇక్కుకు సార్వధాతుకార్ధధాతుకములు పరములగునపుడు గుణమగునను నర్థమును వివక్షించిన నిట ఉపధ ఇక్కుకాదు గాన దోషములేదు. కాగా ఉపధార్థము, 'క్ఙిన్నిమిత్తములైన గుణవృద్ధులకు నిషేధమని' చెప్పవలెను.

ఇక 'రోరవీతి' కొరకు తన్నిమిత్త గ్రహణము అను నంశమునుజూతము.

## "త్రిధాబద్ధో వృషభో రోరవీతి"

'రోరవీతి' రుశబ్దే అను ధాతువు పైన యఙ్ప్రత్యయమును దానికి లుక్కును రాగా నేర్పడిన లట్ప్రథమైకవచనాంతము.

రోరు + య + ఈతి — రోరు + ఈతి. ఉకారమునకు గుణము. రు + య = ధాతువు. క్రియాసమభిహారమున యఙ్ ప్రత్యయము. రు + య = "సన్యఙోః" — అని ద్విత్వమురాగా. రోరు + య = "గుణోయఙ్లుకోః" —

అని అభ్యాసగుణము. రో రూ + య = "అకృత్సార్వధాతుకయోః"— అని దీర్ఘము. రోరూయ + తి = "సనాద్యన్తాధాతవః"— అని ధాతుత్వము లట్. రో రో ఈ తి = యఙ్లుక్కు ప్రవర్తించిన తరువాత, సార్వధాతుకగుణము. రో రో ఈతి = "యఙోవా"— అని ఈడాగమము రోరవీతి = అవాదేశము రాగా ఫలితమైన రూపము.

కిత్ జిత్తుల సమవధానమున గుణవృద్ధులు రావనిన నిట గుణము రాకుండును. తన్నిమిత్త గ్రహణము వలన, జిన్నిమిత్తక గుణమునకే నిషేధమగును గాన నిట నిషేధము ప్రవర్తింపదు. ఇటనది తిఙ్నిమిత్తకము

## తన్నిమిత్తగ్రహణపక్షమున దోష విచారము.

ఈ పక్షమునందును, శచజ న్తాంగములందు దోషము కలదని యాక్షేపము- రియతి, పియతి, ధియతి— ఈరూపములందు రియ, పియ, ధియ, అనునవి శప్రత్యయాంతములు.

'ప్రాదు ద్రువత్' 'ప్రాసు స్రువత్'— అను నుదాహరణములందు, 'అదు ద్రువ', 'అను స్రువ' అనునవి చజన్తము.

'రిగతౌ'— ధాతువు, తౌదాదికము. 'శ' వికరణప్రత్యయము.

రి + అ + తి — శప్రత్యయము జిత్తగుటచే ధాత్విశాకారమునకు సార్వధాతుకగుణము నిషిద్ధము. కాని శాంతాగమగు 'రిఅ' అను దానికి, లఘూపధ గుణము 'తిప్పు' నిమిత్తముగ ప్రాప్తించుచున్నది దానిక నిషేధము తన్నిమిత గ్రహణమువలన ప్రాప్తింపకున్నది.

అటులనే 'అదు ద్రు + అ + త్' అను స్థితిలో చఙ్నిమిత్తకము నిషేధింపబడినను, తిఙ్నిమిత్తక గుణమునకు నిషేధ మీతన్నిమిత్తగ్రహణము వలన ప్రాప్తించుట లేదు ఇవిదోషములు.

"శచజన్తస్యాన్తరంగ లక్షణత్వాత్" అని సమాధానవార్తికము. ఇట, 'ఇయఙ్' 'ఉవఙ్' ఆదేశములు ముందుగనే ప్రవర్తించును. అపుడంగములు, 'రియ' 'ప్రాదుద్రువ' అనునవి. వాని యుపధ యిపుడిక్కగాదు. కావున గుణమునకు ప్రాప్తియే లేదు.

ఇయఙువఙాదేశముల నిమిత్తము పూర్వోపస్థితమగుటం జేసి యవియరితరంగములగుట వానిక పూర్వప్రవృత్తి హేతువు. కాబట్టి తన్నిమిత్తగ్రహణము చేయబడినను నెట్టిదోషమును లేదు.

తన్నిమిత్త గ్రహణమ్మున కుతఘారోరవవీత్యర్థత్వము మాత్రమేకాక,

ప్రయోజనాంతరములును గలవు. అవి — 'హతః' 'హథః' 'ఉపోయతే' 'ఔయత' 'లౌయమాని' 'పౌయమాని' 'నేనిక్తే' - అనునవి.

తన్నిమిత్త గ్రహణములేని యెడల "కిత్తులును జిత్తులును పరముగ నున్న గుణ వృద్ధి వర్ణములకు ప్రయోగము నివర్తింపబడును" అని, "అది ప్రభృతిభ్యః శపః" (2-4-72) అను సూత్రమునకు, అదాదులకంటె పర మగుశప్పునకు ప్రయోగముండదని యర్థమయినట్లు ఈ సూత్రమునకు అర్థము గ్రహింపబడును. అపుడు 'హతః' 'హథః' అను నుదాహరణ ములందు, హన్ + అ + తః అను నవస్థలో "అది ప్రభృతిభ్యః శపః" (2-4-72) అను సూత్రముచే శబకారమును, "అనుదాత్తోపదేశేత్యాది సూత్రముచే, ధాత్వవయవ నకారమును నివర్తించినట్లు ధాత్వకారముగూడ జిత్తులగు తస్ ప్రత్యయమును. థస్ ప్రత్యయమును పరములుగా నుండుటచే నివర్తింపవలసి యున్నది. గుణ నిషేధమనగా గుణాభావము. ఆ అభావము 'చితమ్' ఇత్యాదు లందు ప్రాగభావరూపము. హతః అనుచో నది ధ్వంస (నివృత్తి) రూప మగును.

'ఉపోయతే'-అనుచోట, గుణము. "అద్గుణః" (6-1-87) అని వచ్చినది. అది కిత్తగు యక్ప్రత్యయము పరముగా గలదిగాని తన్నిమిత్తముకాదు. కావున నిషేధింపబడలేదు. అదితన్నిమిత్త గ్రహణఫలము.

'ఔయత' అనుచోట వృద్ధి "ఆటశ్చ" (6-1-90) అను సూత్రముచే వచ్చిన సంధి కార్యము. కిత్పరముగాని కిన్నిమిత్తకముగాదు.

'లౌయమానిః' 'పౌయమానిః' అను స్థలములందు వృద్ధి ఆదివృద్ధి. అదియు కిత్పరమయినను కిన్నిమిత్తకముగాదు.

"నేనిక్తే" అనుచోట "నిజాంత్రయాణాంగుణః శ్లౌ" (7-4-75) అను నభ్యాస గుణమును, జిత్పరమైనను జిన్నిమిత్తకము కానందున నిషేధింపబడ లేదు. కావున నివియన్నియు దన్నిమిత్త గ్రహణ ప్రయోజనములు.

కాని ఇవియేవియు తన్నిమిత్త గ్రహణమునకు ప్రయోజనములు కావు. "హతః" "హథః" అను స్థలములందెట్లు దానికి ప్రయోజనములేదో చూతము. ప్రసక్తమై అభినిర్వృత్తము కానిదానికి నిషేధశాస్త్రముచే నివృత్తి బోధింపబడును. ఇట ధాతూపదేశావస్థయందే అకారము సిద్ధము. కావున దానికి నిషేధముచే నివృత్తి కలుగదు. 'చితమ్' అను చోటవట్లు గుణము ను ఏకారము సిద్ధముగాదు. ప్రసక్తము అనభినిర్వృత్తము. కావున దానికి నిషే ధము ప్రవర్తించును.

ఇక 'ఉపోయతే' 'ఔయత' 'లౌయమానిః' 'పౌయమానిః' అను నుదా

హరణములందు, ప్రతిషేధమంతరంగము, గుణవృద్ధులు బహిరంగములును నగుటచే ప్రతిషేధశాస్త్ర దృష్టిలో నవి యసిద్ధములగును. పదద్వయాశ్రయ మగుటచే గుణము బహిరంగము బహిర్భూత లజపేక్షమగు ఆడాగమాశ్రితము గాన వృద్ధి బహిరంగము 'లౌయమానిః' 'పౌయమానిః' అనుచో బహిర్భూత ములగు ప్రత్యయముల నాశ్రయించిన దగుటచే వృద్ధి బహిరంగము

ఇంక 'నేనిక్తే' అను స్థలమున ద్విత్వోత్తరము ఉత్తరఖండముచేత అభ్యాసమునందలి ఇక్కు వ్యవహితమగుటచే జిత్పరత్వమే దానికిలేదు. గుణముదేనికి రావలెనో దానికి జిత్తు పరముకావలెను గాని అంగమున కది పర మైనచాలదు. అభ్యాసమునకు గుణము ప్రాప్తము. కాన దానికే కిత్ జిత్తులు పరములు కావలెను. ఉత్తర ఖండముచే వ్యవధానముండుటవలన నభ్యాసమునకు దత్పరత్వములేదు.

కావున, తన్నిమిత్త గ్రహణమున కిందేదియు ప్రయోజనముకాదు.

తన్నిమిత్త గ్రహణమునకు ముఖ్యఫలములు, ఉపధారోరపీతులు. గౌణ ఫలములు 'హతః' 'హథః' - మున్నగునవి ఇవి ఫలములు కావని నిరూపింపబడి నది. ముఖ్యప్రయోజనములని తలంపబడునవియు, ప్రయోజనములు కానేరవు. ఎట్లనిన, - అందు ఉపధార్థము తన్నిమిత్త గ్రహణముతో బనిలేదు. ఈ సూత్రమునందు పూర్వ సూత్రము నుండి ధాతుపద మనువర్తింపజేయబడును. ఆ ధాతుపదమునకు 'క్ఙితి' అను దానిని విశేషణముగా జేయుదుము కాగా ధాతువిహితమయిన కిత్ జిత్ప్రత్యయము దేనికి పరమైనను దాని ఇక్కునకు గుణ వృద్ధులురావు అని సూత్రార్థము.

ధాతువు విశేషింపబడినచో క్ఙిత్పరమైన ధాత్వవయవము యొక్క ఇక్కునకే గుణవృద్ధి ప్రతిషేధము సిద్ధించునుగాని, 'చినుతః' 'సునుతః' 'లునీతః' 'పునీతః' - అనుచో, వికరణ ప్రత్యయ సంబంధియగు నిక్కునకు సిద్ధింపక పోవునే యనిన,

ధాతు గ్రహణము విహిత విశేషణము ధాతువునకు విధింపబడిన క్ఙిత్తులు పరమగునపుడు అనంతరమగు నిక్కున కని యర్థము. కావున నాదోషము తగులదు.

అట్లైన ధాతువునకే రాకపోవునేమో? యనిన, ధాతువు కంటె బాహ్యముగ విధింపబడినదానికి కిత్‌జిత్తులు పరమగునపుడు నిషేధమని యర్థముకాదు. ధాతు విహితములగు కిత్‌జిత్తులు పరములగు నపుడు ధాతు సంబంధి యిక్కుకుగాని, వికరణ ప్రత్యయము నిక్కునకుగాని గుణ వృద్ధులురావు అని యర్థము. అందు వలన నా యాపత్తిలేదు. కాని ధాతు గ్రహణమును, నధాతులోప సూత్రమును ప్రత్యాఖ్యాతములగుటచేత నీ సమాధానము అయుక్తము అనిన,

ఎచ్చట గుణ వృద్ధులు విధింపబడునో యచ్చట 'క్ఙితిచ' అను నీ సూత్రముపస్థితమగునని అర్థము, కాగా ఇది పరిభాషా సూత్రమనబడును. సంజ్ఞలును పరిభాషలును తత్తత్కార్యములచే తమసన్నిధికి చేర్చుకొనబడు చుండును "కార్యకాలం సంజ్ఞా పరిభాషమ్" "పుగన్తలఘూపధస్యచ" (7-3-86) అను గుణ విధాయక శాస్త్రము 'క్ఙితిచ' అను నీ పరిభాషను దన సన్నిధికి ఆకర్షించును. అటు 'క్ఙితిచ' అను దాని యుపస్థితి సామర్థ్యము వలన ఉపధయైన ఇక్కునకు సార్వధాతుకార్ధధాతుకములు పరమగుట హల్వ్యవధానముగాని సంభవింపదు గాన 'భిన్నమ్' ఇత్యాదులందు ఏకవర్ణవ్యవధానమున నిషేధము ప్రవర్తించును.

## సమాధానాంతరము

లేదా ఈ సూత్రము పరిభాషకాకున్నను ప్రతిషేధశాస్త్రమే అనిపను ప్రతిషేధ్యముల సంఖ్యనుబట్టి ప్రతిషేధశాస్త్రములు కల్పింపబడును గాన "పుగన్తలఘూపధస్య" (7-3-86) అను ప్రతిషేధ్యమునకై వేరుగా కల్పింపబడు "క్ఙితిచ" (1-1-5) అను ప్రతిషేధశాస్త్రము, 'ఛిన్నం భిన్నమ్' ఇత్యాదులందు వ్యవధానమువలన ప్రవర్తింపనిచో నది యనవకాశమే యగును. కాబట్టి వ్యవధానమున్నను ప్రవర్తించునని చెప్పకతప్పదు. 'క్ఙితి' అనునది సప్తమ్యంతమే. గుణవృద్ధి ప్రతిషేధ రూపమగు కార్యము సప్తమీనిర్దేశముచే నిహితమే. కావున నవ్యవహిత పూర్వమునకే ప్రవర్తింపవలె. కాని ప్రకృత లక్ష్య సంస్కారమునకు గల్పితమైన 'క్ఙితిచ' అను లక్షణము వ్యవధానమున ప్రవర్తింపనిచో వ్యర్థము కావలసి వచ్చును.

## సమాధానాంతరము

లేదా—ఉపధా లక్షణమగు గుణమునకును నీనిషేధము ప్రవర్తించునని పాణిన్యాచార్యుని ప్రవృత్తి జ్ఞాపన చేయును. "త్రసి గృధి ధృషి క్షిపేః క్నుః"— అను సూత్రముచే విధింపబడిన క్నుప్రత్యయము కిత్తుగా నుచ్చరింపబడినది. "ఇకోఝల్"-"హలన్తాచ్చ"— అను సూత్రములచే ఇక్కునకు సమీపముననున్న హల్లుకంటె పరమగు ఝలాది సన్ప్రత్యయమునకు కిత్త్వము విధింపబడినది. ఇది ఉపధా లక్షణ గుణ ప్రతిషేధమునకు జ్ఞాపకము. అదియెట్లు జ్ఞాపకమనిన,

కిత్త్వమునకు ప్రయోజనము గుణమెట్లైనను రాకుండుట 'గృధ్నుః' 'క్షిప్నుః' 'బిభిత్సతి' అను స్థలములందు ఇక్కునకును కిత్తునకును నడుమ హల్లుతో వ్యవధానముండుటచే నిషేధము ప్రవర్తింపదగిన, వాని కిత్త్వము వ్యర్థమే యగును. ఉపధా లక్షణ గుణమునకు గూడ నీ ప్రతిషేధము ప్రవర్తించుట పాణినికి తాత్పర్య విషయము. అందులకై వాని కాతడు కిత్త్వమును సంఘటింపజేసెను. ఈ సూత్రమున "తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య" (1-1-66) అను పరిభాష,

'నిర్దిష్టే' అను సంగమును విడచి ఉపస్థిత మగునని ఈ కిత్కరణ రూపమగు లింగమువలన తెలిసికొనవలెను."

ఇక రోరవీతి కొరకును తన్నిమిత్త గ్రహణ మక్కరలేదు. కిత్ జిత్తులు పరమగునపుడు గదా నిషేధము ప్రవర్తించునది. ఇట నవి కనబడుటలేదే.

జిత్తగు యఙ్లు లోపించినను, ప్రత్యయ లక్షణముచే ప్రతిషేధము ప్రాప్తించుచున్నది అనిన, "నలుమతా తస్మిన్" లుమత్తగు శబ్దముచే లోపించిన ప్రత్యయము పరమగు నపుడు తత్పూర్వమునకు కార్యములు ప్రవర్తింపవు. కావున నిట 'యఙ్లుక్' అను లుమచ్ఛబ్దముచే లోపించుటచే దానికి పూర్వ మగు ఉకారమునకు గుణ ప్రతిషేధమను కార్యము ప్రవర్తింపదు. ఇట్లు ప్రత్యయలక్షణమునకు ప్రతిషేధము కలదని సమాధానము.

"నలుమతాఙ్గస్య" — అని కదా ఆ సూత్రము పఠింపబడినది. అపుడు 'లుమచ్ఛబ్దలోప స్థలములందు ప్రత్యయలక్షణముచే అంగాధికార విహితమగు కార్యము ప్రవర్తింపదు' అని యర్థము. గుణ వృద్ధిప్రతిషేధము అంగము కాదు. కావున ప్రత్యయ లక్షణముచే నిషేధము ప్రాప్తించుచున్నది గాన తన్నిమిత్త గ్రహణ మావశ్యకమని మరల ఆక్షేపము.

పాణిని సమ్మత సూత్ర పాఠపక్షమునను నీయాక్షేపము లేదు. ఎట్లనగా అట 'అంగస్య' అనగా అంగాధికారమున విహిత మగు కార్యము అని యర్థముగాదు 'అంగస్య' అనుదానిచేత అంగాధికారము ప్రతినిర్దేశింపబడ లేదు. లుమత్తగు శబ్దముచే లోపించు ప్రత్యయము నిమిత్తముగా గల అంగ సంజ్ఞకమునకు ప్రాప్తించు కార్యము- అది అంగాధికార విహితమయినదైననూ కాకున్నను ప్రవర్తింపదు అని యర్థము. కాబట్టి గుణ ప్రతిషేధ మంగాధికార విహితము కాకున్నను ప్రవర్తింపదు.

'అభ్యుపేత్యవాదము' చే అంగాధికారమే ప్రతినిర్దేశింపబడుననినను దోషము లేదు. ఎట్లన,

సంజ్ఞలును పరిభాషలును కార్యకాలములు. అనగా విధి శాస్త్రములచే స్వస్థానములకు కాకర్షింపబడున్నవి. "సార్వధాతుకార్ధధాతుకయోః" అనునది 'క్ఙితిచ' అను పరిభాషకు విధి శాస్త్రము. కాన విధిశాస్త్ర ప్రదేశముననిది ఉపస్థితమగును. అంగాధి కారస్థమగు విధిస్థలముననుపస్థితమైన పరిభాషా సదృశమగు నీ 'క్ఙితిచ' అనునదియు విధిశాస్త్రైకవాక్యతాపన్నమగుట వలన అంగమేయగును. కాగా ప్రత్యయలక్షణము ప్రవర్తింపదు. జిత్పరత్వము లేనందునవనే నిషేధము ప్రసక్తము కాదు. తన్నిమిత్తగ్రహణమునకు 'రోరవీతి' ప్రయోజనము కాదు.

సమాధానాంతరమును గలదు.

లేదా— ఈ రూపము ఛాందసము. "దృష్టానువిధిశ్ఛన్దసిభవతి"- "యజోచిచ" —అను సూత్రము యజ్ఞగ్విధాయకము, అందలిచకారమువలన ఛ దసి' అను పద మనుకర్షింపబడుచున్నది. కావున యజ్ఞగంతములు ఛాందసము. 'ఛందస్సు నందు దృష్టరూపము ననుసరించి కార్యవిధానము కావలెను' అని యర్థము. దృష్టమ్ అను = అగపడినరూపము ననుసరించి, విధిః = అత్య సంస్కారము, ఛందసి = వైదిక రూపములందు, భవతి = జరుగవలెను. కాగా రోరవీతిలో గుణము నిష్ప్రతిబంధము.

సమాధానాంతరమును చెప్పనగును

లేదా- ఈ 'క్ఙితిచ' అను ప్రతిషేధశాస్త్రము అంతరంగము. గుణము బహి రంగము. అది బహిర్భూత సార్వధాతుకాశ్రయము. కాబట్టి అసిద్ధము. అనగా నయ్యది నిషేధశాస్త్రమునకు దృగ్గోచరము కాదనుట. లేని దానిని విషే ధించుటయెట్లు పొసగును ? కాగా నిర్విరోధముగ గుణము రోరవీతిలో ప్రవర్తించుననని భావము

సమాధానాంతరమును జెప్పనగును

లేదా- పూర్వసూత్రమైన, 'నధాతులోప ఆర్థధాతుకే' అన సూత్రము నందు ఆర్థధాతుకే' అను పదమనావశ్యకము. ఏలయన 'ధాతులోపే' అను పదము బహువ్రీహి. ధాతోర్లోపః యస్మిన్సః— అని విగ్రహము. ధాతులోపే = ధాత్వంశమునకు లోపము కలుగుటకు నిమిత్తమైనది పరమగునపుడు- అని యర్థము. అట్టిది ఆర్థధాతుకమేయగును. కాగా అతిరిక్తముగానున్న "ఆర్ధ ధాతుకే" అనునది పృథక్సూత్రమై నియమమును బోధించును. అందు 'నధాతు లోపే' అనునదనువర్తించును. "ధాత్వంశమునకు లోపము కలిగిన స్థలములందు ప్రత్యాసత్తిచే ఆ లుప్తధాత్వేకదేశ నిమిత్తములయిన గుణవృద్ధులకు నిషేధము కలుగవలెనని న నది అర్థధాతుకము పరమగునపుడే కలుగును' అనునది నియ మము. ఆ నియమము సామర్థ్యమువలన సూత్రాంతరముచే ప్రాప్తమగు నిషే ధమును గూడ వారించును. సూత్రారతర మనగా 'కిఙిచ' అనునది. రోర వీతిలో నీవిధముగ గుణము సిద్ధింపవచ్చును. ఇట గుణము సార్వధాతుకనిమిత్త కము గాని ఆర్థధాతుకనిమిత్తము కాదు గదా. కాగా తన్నిమిత్తగ్రహణమున కిది ప్రయోజనము కాదు. 'క్ఙితి' అనునది వరస ప్తమియే"

లిగువు అపత్యములై గవాయనుడు "లైగవాయనః" ఫక్ ప్రత్యయము. ఆదివృద్ధి. ఓర్గుణము. అవాదేశము. ఇట గుణ వృద్ధులకునిషేధ మీ సూత్రముచేత నేల ప్రవర్తింపలేదు ?

'కము కాన్తౌ' అని ధాతువు, ణిఙ్ ప్రత్యయము. ఉపధావృద్ధి, 'కామ యతే' రూపము. ఇట ఉపధావృద్ధికిని నిషేధమేల ప్రవర్తింపలేదు? అను నాక్షేపమునకు సమాధాన వార్తికము "తద్ధిత కామ్యోరిక్ప్రకరణాత్" అనునది.

ఇగ్లక్షణములగు గుణవృద్ధులకు నిషేధము ప్రవర్తించును. ఇట నివి ఇగ్లక్షణములు కావుగదా. ఏ గుణవృద్ధి విధాయక శాస్త్రములలో 'ఇకః' అను షష్ఠ్యంత పదముపస్థితమగునో అవియే 'ఇగ్లక్షణములు', వానికే నిషేధము. పైగవాయనః అనుచో ణిక్ స్థానికము అయినను తల్లక్షణము కాదు, కామయేత్‌లో నదియు గాదు.

## స్థానివద్భావప్రాప్త దోషవారణము

"వా॥ లకారస్య ఙిత్త్వాదాదేశేషు స్థానివద్భావ ప్రసంగః" అని యాక్షేప వార్తికము.

లకారమగు లఙ్ ఙిత్తుగాన, దానియందున్న ఙిత్త్వము తదాదేశమయిన ఉత్తమైక వచన ప్రత్యయము నందతిదేశింపబడిన 'అచినవమ్' 'అసునవమ్' 'అకరవమ్'— అను రూపములందు, 'అమ్' అననది ఙిత్తగును. అపుడు 'క్ఙితి' చ అను నీ సూత్రముచే వికరణ ప్రత్యయోకారమునకు సార్వధాతుక గుణము నిషేధింపబడవలసి వచ్చుచున్నది. పదార్థోపస్థితి కాలమునందే అనుబంధము లోపించును కావున 'అసల్విధౌ' అను నిషేధము, స్థానివద్భావమునకు ప్రాపింపదు అని ఆక్షేపతాత్పర్యము.

వా॥ "లకారస్య ఙిత్త్వాదాదేశేషు స్థానివద్భావ ప్రసంగ ఇతి చేత్ యాసుటోఙిద్వచనాత్సిద్ధమ్"

అనునది పై యాక్షేపమునకు సమాధాన వార్తికము సూ॥ "యాసుట్పరస్మైపదేషూదాత్తో ఙిచ్చ"(3-4- 03) అను సూత్రము చేత, పాణిని లిఙ్ స్థానముగ నాదేశము లయిన పరస్మైపద ప్రత్యయము ప్రత్యయములకు 'యాస్' అను నాగమమును, దానికి ఉదాత్తత్వమును, ఙిత్త్వమును విధించి యున్నాడు.

ఙిత్త్వమునకు ప్రయోజనములు గుణవృద్ధి ప్రతిషేధము సంప్రసారణము మున్నగునవి. అవి ప్రత్యయము పరమగునపుడె ప్రాపించునవి. ఈ 'యాసుట్' ఆగమముగాని ప్రత్యయముకాదు. కాగా యాసుడాగమమునకు విధింపబడిన ఙిత్త్వము ఆగమ విశిష్టమగు నాగమికే ఫలితము కావలెను.

అపుడు స్థానియగు లఙ్నందున్న ఙిత్త్వము ఆదేశమునందు స్థానివద్భావముచే సిద్ధించును గావ నాగమమునకు ఙిత్త్వాతిదేశము వ్యర్థమయి' - 'ఙిత్తుల

యాదేశములు జిత్తులుకావు' అని జ్ఞాపనము చేయును. కావున పై రూపము లలో, 'అమ్' జిత్తు కానేరదు గాన గుణ నిషేధము లేదని తాత్పర్యము.

జిదాదేశములకు జిత్త్వమతిదేశింపబడదని జ్ఞాపితమగు ననిన "నిత్యం జితః" (3-4-99) "ఇతశ్చ" (3-4-100) అవి యెట్లు? 'భవేవ' 'భవేమ' అను స్థలములందు, 'వస్, మస్' ప్రత్యయముల సకారమునకు లోపము కావలెను. అందులకు వానికి జిత్త్వ మావశ్యకము. 'భవేత్' అనుచోట ఇకారమునకు లోపము రావలెను. అవియు జిత్త్వాదీనము. యాసుడాగమమునకు జిత్త్వ విధానమువలన స్థానియగు లకారమునకు జిత్త్వ వ్యవహారము లేదని జ్ఞాపితమగును గదా. అపుడా లోపము లెట్లు సిద్ధించును?

అనిన, స్థానికి జిత్త్వ వ్యవహారము లేదని జ్ఞాపన చేయబడదు. జిత్తు పరమగునపుడు రాదగిన కార్యమురాదు. జిత్తుకు రాదగినది రావచ్చును. స్థానిక జిద్వ్యవహారమే లేదనిన, 'నిత్యం జితః' (3-4-99) అనునది నిర్విషయమే కావలసి వచ్చును. ఈ జిద్వచనమువలన ఇత్సంజ్ఞాశాస్త్రమునకు బాధ కల్పింపబడునని యభిప్రాయముగాదు. స్థానివద్భావమునకు మాత్రమే బాధ కల్పనము యుక్తము.

పరి. అట్లైన నీ విషయ విశేషము నపూర్వముగ చెప్పవలసియుండును గదా. అందు గౌరవము లేదా యనిన,

అపూర్వముగ చెప్పనక్కరలేదు.

చెప్పబడనిది యెట్లు తెలియబడును? యాసుడాగమమునకు జిత్త్వ విధానమువలననే ఆవిశేషమును దెలియనగును.

జిత్తునకు రాదగిన కార్యమేదియు యాసుడాగమమున కతిదేశింపదగినది లేదు. జిత్తు పరమగునపుడు రావగిన సంప్రసారణాదికమే అతిదేష్టవ్యము. అది స్థానివద్భావము చేతనే సిద్ధించిన అతిదేశము వ్యర్థమే యగును. కావున నాజిద్వచనము, జిత్పరత్వమున రాదగిన కార్యమునకే అభావమును బోధించును.

ఆగమ మాత్రమునకు విధింపబడిన జిత్త్వము ఆగమ విశిష్టమునకు జిద్వ్యవహారమును సంపాదించుటకు సమర్థముగాదు. కావున పాణిని కిదియే యభిప్రాయము. ఆగమవిశిష్టమునందు స్థానివద్భావముచే జిత్కార్యములు ప్రవర్తించినచో యాసుడాగమమునకు జిత్త్వమును పాణిన్యాచార్యుడు విధించియుండెడి వాడు కాడు. అట్లు విధించుటవలన జిత్తులగు ప్రత్యయములు పరము అయినపుడు పూర్వమునకు ప్రవర్తింపవలసిన కార్యములే ప్రవర్తింపవు. జిత్తులయిన లకారముల స్థానమున నాదేశములయిన పరస్మైపద ప్రత్యయములగు 'వస్, మస్' ప్రత్యయముల ఇకార సకారములకు లోపము ప్రవర్తింప వచ్చును అని ఆయన హృదయము.

"క్ఙితిచ"

సూ॥ "దీ ధీ వే వీ టామ్"

'దీధీఙ్' 'వేవీఙ్' అని రెండు వైదిక ధాతువులు. వానికిని 'ఇట్' అను నాగమమునకును గుణవృద్ధులురావు' అని సూత్రార్థము.

ఈ సూత్ర మెందుకు? అని ఆక్షేపము.

'ఆదీధ్యనమ్' 'ఆదీధ్యకః' 'ఆవేవ్యనమ్' 'ఆవేవ్యకః'— అను రూపములందు గుణవృద్ధులు ప్రవర్తింపకుండుటకు అని సమాధానము. గుణ వృద్ధులు ప్రవర్తింపక, "ఏరనేకాచో సంయోగ పూర్వస్య"— అని యణాదేశమచట ప్రవర్తించినది.

ఈ యోగము అనగా దీధీవేవీ ధాతుద్వయ గ్రహణ మీ సూత్రమున చేయనక్కరలేదు. వానికి గుణప్రతిషేధమును జెప్పనక్కరలేదు. ఏలయన—

వా॥ "దీధీవేవ్యోశ్ఛన్దోవిషయత్వాత్ దృష్టానువిధిత్వాచ్చ, ఛందసః, ఛందసి అదీధేదధీధయురితిచ గుణదర్శనా దప్రతిషేధః" అని సిద్ధాంత వార్తికము. దీధీ, వేవీ ధాతువులు ఛందో విషయములు. వీనికి భాషలో ప్రయోగములులేవు 'ఆదీధ్యనమ్' 'ఆదీధ్యకః' మున్నగునవి ఛందస్సునందును నగపడుటలేదు. దృష్టమయిన లక్ష్యములకే ఛందస్సునను వ్యాకరణశాస్త్రీయ సంస్కారము ప్రవర్తించును. లౌకిక భాషా శబ్దముల కయిన నిపుడవి ప్రయోగములందు ప్రసిద్ధములు కాకున్నను వ్యాకరణాంతరములవలనగాని, శిష్ట ప్రయోగములవలన గాని సాధువులుగా పరిగణింపబడు వానికి అనువిధాన మావశ్యకము. వేదమున నాలక్ష్య ముండిన గదా సంస్కార ప్రసంగము?

పైగా ఛందస్సునందు గుణము ప్రవర్తించిన రూపములే యగపడు చుండె. 'అదీధేత్' 'అదీధయుః' అనుచోట గుణమే ప్రవర్తించినదిగదా? చూడుడు—

"ప్రజాపతిర్వై యత్కించన మనసాదీధేత్" "హోత్రాయ వృతః కృపయన్నదీధేత్" "అదీధయుర్దా శరాజ్ఞే వృతాసః" ఇది ఋక్సంహితాపాఠము. కాగా ప్రతిషేధ మనర్థకము అని స్పష్టము - కాని.

గుణ దర్శనమునకు, 'అదీధేత్' అను నుదాహరణమును ప్రదర్శించుట యుక్తము కావచ్చును. అట గుణము సార్వధాతుక గుణము. 'అదీధయుః' అను నుదాహరణ ప్రదర్శనము యుక్తము కాదు. ఏలయన,— అచ్చట గుణము జుసి గుణము. అనగా "జుసిచ" (7-3-83) అను సూత్రముచే, అజాదియగు జుస్ప్రత్యయము పరమగునపు డిగంతాంగమునకు విధింపబడినది, అది 'క్ఙితిచ'

అను నిషేధమున కపవాదమయినట్లు, 'దీధీవేవీటామ్' అను ప్రకృత నిషేధము నకును నపవాదమే యగును. కావున వాలక్ష్యమున నీ సూత్రమున కవ్యాప్తిని జూపుటయుక్తముగాదు. అనియాక్షేపింప వచ్చును. కాని యది దోషము కాదు. జసిగుణము ప్రతిషేధ విషయమే యనుకొనుడు. అయిననది తుల్య జాతీయమగు ప్రతిషేధమునే బాధించును. అనగా గుణ మచట జస్నిమిత్త కముగాన, తన్నిమిత్తక నిషేధమునే బాధించును. ఇది ప్రకృత్యాశ్రయ ప్రతి షేధముగాని ప్రత్యయాశ్రయముగాదు. 'క్ఙితిచ' అను ప్రతిషేధము ప్రత్య యాశ్రయము. కావుననిది బాధ్యముగాదు. ప్రవర్తింపవలసిన లక్ష్యమున ప్రవర్తింపలేదనిన అవ్యాప్తియే గదా ?

సమాధానాంతరమును చెప్పవగును. "జసిచ" (7-3-88) అను గుణము "క్ఙితిచ" (1.1 5) అను నిషేధమునకు అపవాదము. ఎందువలన ? తదప్రాప్తి యోగ్యలక్ష్యమున నెచ్చటను అవకాశము లేనిది గనుక. దీధీవేవీటామను నిషే ధము అవశ్య ప్రాప్తముగుచుండ నారంభింపబడినదిగాదు జసి గుణము. ఈ నిషేధము ప్రాపింపని లక్ష్యము లగు 'అజాగరుః' మున్నగుచోట్ల నది చరితా ర్థము. కాబట్టి దీధీవేవీటామను నిషేధమునకు బాధకము గాజాలదు.

ఈ యోగమారంభింపబడనిచో, 'దీధ్యత్' అను లక్ష్యమున గుణనిషేధ మెట్లు సిద్ధించును ? అని యాక్షేపము.

దీధీధాతువు. లేట్ లకారము, తిప్, శప్పు, దానికి లుక్కు. "ఇతశ్చలోపః పరస్మైపదేషు"(3-4-97) అను సూత్రముచే ఇకారమునకు లోపము. "లేటోఽ డాటౌ" (3-4-94) అనుసూత్రముచే తిప్పుకు అడాగమము. యణ్.

## వా॥ "దీధ్యదితిచశ్యన్ వ్యత్యయేన"

అని సమాధాన వార్తికము 'దీధ్యత్' అనుచోట, "వ్యత్యయోబహులమ్" (3-1-85) అని వికరణ ప్రత్యయవ్యత్యయముచేత శప్పుకుబదులుగ 'శ్యన్' అను అను వికరణ ప్రత్యయము వచ్చినదిగాన అదిజిత్తుకాబట్టి 'క్ఙితిచ' అని గుణ నిషేధము సిద్ధించును. "ఏరనేకాచో సంయోగ పూర్వస్య" (6.4.82) అను సూత్ర ముచే యణాదేశము రాగా నారూపము సిద్ధమగును.

ఈ సూత్రమునందిట్గ్రహణమును అనావశ్యకము. "అకణిషమ్' 'అరణి షమ్' 'కణితాశ్వః' రణితాశ్వః- అను నుదాహరణములలో నిడాగమనిషేధమెట్లు సిద్ధించును ? అని ప్రశ్న.

సమాధానము- "ఆర్ధధాతుకస్యేశ్వలాదేః" (7-2-35) అను సూత్రము వలాది ఆర్ధధాతుక ప్రత్యయమున కిడాగమమును విధించునది. "నేడ్వశికృతి"- అనునది దీనికి పూర్వ సూత్రము. అందున్న ఇట్పద మిందనువర్తింపవచ్చును.

అయినను నిందు మరల ఇట్ప్రకమును గ్రహించుటకు ప్రయోజనముకలదు. ఈ ఇడాగమము ఇడాగమముగనే, అనగా నా ఇకారమున కెట్టి మార్పును లేకుండగ నుండవలెను. అని యభిప్రాయము ఇంకేమి విచారము దానికి కలుగువనిన, గుణము వచ్చుట కవకాశమున్నది. అది రాకుండుట కద్గ్రహణమునకు ప్రయోజనము. కాగా ఇడాగమ స్థానమున గుణప్రసక్తియే లేదు గాన నీ సూత్రమున నిద్గ్రహణ మక్కరలేదని తాత్పర్యము

'ఇడాగమ మా పాటుననే యుండదగును. దాని కెట్టి మార్పునురారాదు' అని నియమమునుజేసిన 'పిపఠీః' అను రూపమున దీర్ఘత్వము ప్రాప్తింపక పోవునే? ఆ రూపమిల్లేర్పడునది. 'పిపఠిష' అను సన్నంతధాతువునకు క్విప్ ప్రత్యయము ఆ ప్రత్యయమునగల వర్ణము లన్నియు లోపించును. ఏదియు వినబడదు. కాగా అశ్రూయమాణ ప్రత్యయ మగుటచే దానికి 'అప్రత్యయము' అనియు వ్యవహారము.

సప్రత్యయాకారమునకు, "అతోలోపః"—అని లోపము. షత్వ మసిద్ధ మగుటవలన "ససజుషోరుః" — అని సకారమునకు రుత్వము. తరువాత "ర్వోరుపధాయా దీర్ఘ ఇకః"—అను సూత్రముచే ఠకారోత్తరమగు, ఇడాగమే కారమునకు దీర్ఘమురాగా 'పిపఠీః' అని రూపము.

సత్యమే. కాని యీ దోషము తగులదు. ఏలయన—అర్ధధాతుకేత్యాది సూత్రమంగాధికారస్థము ఇందు 'అంగస్య' అను పద మనువర్తించును. కావున నా నియమముచే నంగాధికార విహితమగు రూపాంతరమే నివర్తింప జేయ బడును. ర్వోరితి దీర్ఘము అంగముకాదు. కావున నా దోషము లేదు.

సమాధానాంతరము—లేదా నియమముచే దీర్ఘ నివృత్తి ప్రసంగమే లేదు. నియమము సాపాదికము. దీర్ఘము త్రైపాదికము. కావున నసిద్ధము. దీర్ఘము ప్రవర్తించినను శాస్త్రదృష్టిచే ఇడాగమము అవికృతమే యగును. ప్రయోగముల మార్పుగవడినను నది నియమమునకు గోచరము కానందున. మార్పు లేనట్లే భావ్యము "దీధీ వేవీ టామ్"

## "హలో నన్తరాః సంయోగః"

అనన్తరాః = వ్యవధానములేని హల్లులు "సంయోగః" అను సంజ్ఞ కలవియగును వ్యవధానము దేనిచైన, విజాతీయములతోడనేకదా. కాగా హల్లులకు విజాతీయములగు అచ్చులచేత, వ్యవహితములు కాని హల్లులు సంయోగ సంజ్ఞకము లని యర్థము,

## "అనంతర పదార్థ నిరూపణము"

'అనన్తరాః' అను పదమునకు విగ్రహమెట్లు? ఇది అన్తర శబ్దమునకు నఞ్తో బహువ్రీహిసమాసమా, అవిద్యమానమన్తరం యేషాంతే = అనన్తరాః అని? లేదా "అవిద్యమానాః 'అన్తరా' యేషాంతే" అని 'అన్తరా' శబ్దమునకు బహువ్రీహియగా? అంతరం అనగా వివరము, కాళీ, వర్ణ శూన్యకాలమనుట. అంతరాశబ్దము అధికరణశక్తి ప్రధానమగు నవ్యయము మధ్యమున అనువర్తముకలది. అంతర శబ్దమున నాధారమగు కాల మాత్రమునకు నిషేధము. అంతరాశబ్దముతో విగ్రహము నందు ఆధేయముగు వర్ణములకు నిషేధమగును. వర్ణాధార కాల వ్యవహితములు కాని హల్లులకు సంయోగ సంజ్ఞ యని వివక్షితమా? లేక ఆధేయముగు వర్ణములచే వ్యవహితములు కాని హల్లులకనియా? అని ప్రశ్నతాత్పర్యము:

ఈ ప్రశ్నవలననేమి జిజ్ఞాసితము? ఎట్లైననేమి? వర్ణశూన్యకాల వ్యవధానములేని హల్లులని వివక్షితమైన 'అప్స్యత్యప్-సు' అనుస్థలమున అవగ్రహమునందు పకార సకారములకు సంయోగ సంజ్ఞ ప్రాప్తింపకపోవును ఆదు వానికి నడుమ వర్ణ శూన్యకాలము కలదుగదా? అవగ్రహమన అర్థమాత్రా కాలము

'అవిద్యమానాః అన్తరా ఏషామ్' అను వివక్షలో, ఆధేయములగు వర్ణము లెవ్వియు నడుమలేవు గాన దోషములేదు. పకార సకారములకు సంయోగ సంజ్ఞ సిద్ధించి, అకారమునకు గురు సంజ్ఞ గురో రనృతః ఇత్యాది సూత్రముచే ప్లుతమును సిద్ధించును

ఎట్లు చెప్పిన దోషము ప్రాప్తింపదో అట్లే చెప్పుడు.

లేదా—'అవిద్యమాన మంతరం యేషామ్' నియు జెప్పనగును. అట్లైన అవగ్రహమున సంయోగ సంజ్ఞ ప్రాప్తింపకుండును. అట వర్ణశూన్యకాలము కలదు అంటిగదా? అనిన,

దోష నివృత్తి కొరకుగాని ప్రయోజన సిద్ధికైగాని శాస్త్రమున సంజ్ఞలు చేయబడును. 'అఘు' అనుచో వా యుభయమును లేదు. ఇప్సు అను పద మధికరణ బోధకము, 'ఉదకములందు' అని గదా దాని కర్థము. అట్టిదానికి దూరాహ్వాన ప్రసంగమేమి యుండును? దూరాహ్వానమునకునే గదా ప్లుతమునకు ప్రసక్తి? కనుక దోష ప్రయోజనములు రెండును లేనందున, 'అవిద్యమాన మంతరం యేషాంతే = అనన్తరాః' అను విగ్రహమును నిర్బాధమే.

## ప్రత్యేక సంజ్ఞా నిరాకరణము

వా॥ "సంయోగ సంజ్ఞాయాం సహవచనం యదాన్యత్ర" — అని ఆక్షేప వార్తికము.

సంయోగ సంజ్ఞా సూత్రమునందును, "సహసుపా"—"ఉభేఽభ్యస్తమ్‌సహ" ఇత్యాదులందువలె సహ అను పదమును చేర్చి, "హలో నన్తరాః సహ" అని సూత్రమును బఠింపవలెను. ఎందులకనగా సహభూతములగు హల్లులకే సంయోగ సంజ్ఞ ఇష్టముగాని అనంతర్యవిశిష్టములగు హల్లులకు ప్రత్యేకముగ నాసంజ్ఞ వచ్చుట సమ్మతముగాదు. అనంతర్యము విశేషణమే కావలెను గాని ఉపలక్షణము కారాదు. అపుడు 'సహ' అను పదము గూడ సూత్రమున నుండదగును.

సహభూతములకు కార్యమిష్టమైన స్థలాంతరము లందును, పాణినీ సహ గ్రహణమును జేయుచున్నాడు. ఎట్లనగా – సుబంతముతో జేరి సమాసమన బడుననిన నా సుబంత సముదాయమే సమానము కావలెనుగాని ప్రత్యేక సుబంతములు కావు. అందుకై యచట 'సహ' అను పదము స్మరింపబడినది.

అట్లే షాష్ఠ ద్విత్వప్రకరణమున విధింపబడిన ద్విత్వోదాహరణములలో విహితములగు రెండు భాగములును గలిసియే అభ్యస్తమనబడవలెను గాని వేరుగా కాదు. కావున నచటను సహగ్రహణమును పాణిని చేయును. కాగా నిటను 'సహ' అనుట ఆవశ్యకము.

ఒకొక్క హల్లునకు సంయోగ సంజ్ఞ వచ్చిన నేమగును? రెండు హల్లులు అనంతరములుగనున్నపు డందొక దానికి సంయోగసంజ్ఞ వచ్చినను గురు సంజ్ఞా ప్రతిబద్ధ కార్యములు సిద్ధింపవచ్చును గదాయని ప్రశ్న, ఏమగునా? ఎంత సంక్షోభమగునో చూతుము

(1) 'గ్లాయాత్ గ్లేయాత్' అని "వాన్యస్య సంయోగాదేః" (6-4-68) అను సూత్రముచే ఏత్వ వికల్పము ప్రవర్తించినట్లు. 'నిర్యాయాత్.' 'నిర్వాయాత్' అనుచోటగూడ నయ్యది ప్రవర్తింపవలసి వచ్చును. అనంతరములైన రేఫయకారములకును రేఫ వకారములకును. ప్రత్యేక సంయోగ సంజ్ఞ ప్రాప్తించును.

(2) 'సంహ్వృషీష్ట—అను రూపము, హ్వృఞ్ హరణే' అను ధాతువున కాశీర్లిఙాత్మనేపదప్రథమైకవచనాంతము. ఇట ఉపసర్గ మకారానంతరహకారము సంయోగ సంజ్ఞకమయిన "ఋతశ్చ సంయోగాదేః" (7-2-43) అను సూత్రము చేతనిడియు సంయోగాది ఋదన్త ధాతువగును గాన లిఙ్లున కిడ్వికల్పము, 'స్తరిషీష్ట' అను చోటవలె ప్రాప్తించును.

(3) 'సంప్రహియతే' అను రూపమున, 'స్మర్యతే' అను రూపమునందు వలె, "గుణోర్తి సంయోగాద్యోః" (7-4-29) అని గుణము రావలసి యుండును.

(4) 'ద్రుపత్ కరోతి' 'సమిత్ కరోతి'—ఇట తకార కకారములు ప్రత్యేకముగ సంయోగములైన కకారమునకు, "సంయోగాన్తస్యలోపః" (8-2-23) అను సూత్రముచే లోపము ప్రాప్తించును.

(5) 'శక్తా' 'వస్తా'— అనుచోట్ల గూడ తకార రూపమగు ఝులు పరమగుచున కకార సకారములు సంయోగములును, ఆది భూతములును నగునుగావ, "స్కోస్సంయోగాద్యో ర న్తేచ" (8-2-29) అను సూత్రముచే లోపము ప్రసక్తమయ్యెడిది ప్రత్యేక స జ్ఞా పక్షమున సకార కకారములకు సంయోగావయవత్వము సంభవింపదు గాన సంయోగాద్యోః అను పదము కర్మధారయమే యగును.

(6) ఇక 'విర్యాతః' 'నిర్వాతః' అను క్తాంతములలో యా, లా, ధాతువులు సంయోగాదు లిపక్షమున నగునుగాన "సంయోగాదేరాతోధాతోర్యణ్వతః" (8-2-43) అను సూత్రముచే నిష్ఠాతకారమునకు 'గ్లానః' అనుచోటవలె నత్వము రావలసియుండును.

ప్రత్యేక సంయోగ సంజ్ఞా పక్షమున నాపాదింపబడిన పై దోషము లేవియు దోషములుకావు. అన్నియు నన్యథా సిద్ధములు. ఎట్లనగా జూడుడు.

'నిర్యాయాత్' 'నిర్వాయాత్' అను స్థలములందు, "వాన్యస్య సంయోగాదేః" (6-4-68) అని ఏత్వ వికల్పము ప్రసక్తమగునంటిరిగదా? దాని నిట్లు పరిహరింప వచ్చును.

'సంయోగః ఆదిః యస్యసః = సంయోగాదిః. తస్యసంయోగాదేః' అని ఏకవచనాంతముతో విగ్రహము గాన నొక సంయోగ మాదియందుగల ధాతువున కేత్వమని యర్థము గ్రహింపబడదు. 'సంయోగౌ ఆదీయస్యసః' అని రెండు సంయోగము లాదినిగల దాని కేత్వ వికల్పమగునని గ్రహింపబడును.

"ఋతశ్చ సంయోగాదేః" (7-2-43) అను సూత్రమునను "గుణోర్తి సంయోగాద్యోః" (7-4-29) అను సూత్రమునను నిట్లే వివక్షితము గాన నంగాధికారస్థములయిన ఆ మూడు సూత్రములచే విహితము లయిన కార్యముల కతి ప్రసంగము పరిహృతమగును.

ఇక 'దృపత్కరోతి' 'సమిత్కరోతి' అను స్థలములందు సంయోగాంత లోపమున కాపాదింపబడిన అతి ప్రసంగమును, సంయోగాంత పదమున, 'సంయోగౌ అన్తౌయస్యతత్' అని ద్వివచనాన్తవిగ్రహము నాశ్రయించి సంయోగ

ద్వయాంత పదమున సంయోగాంత లోపము ప్రవర్తించునని గ్రహింతుముగాన తేలికగా వారింపదగినది యగును.

ఇక 'శక్తా వస్తా' అను చోట "స్కోస్సంయోగాద్యోరన్తేచ" (8-2-29) అను సంయోగాద లోపము ఆపాదింపబడినది. దాని నిట్లు వారింపవచ్చును పదాంతమునగాని ఝల్లు పరమగు నపుడుగాని రెండు సంయోగ సంజ్ఞ. వర్ణములు ఆదిభూతములయి యుండిన అట్టి సకార కకారములకు లోపమక నని యర్థమట వివక్షితము గాదు. అట్లు వివక్షితమైనపుడు తకారము ఝల్లు తత్పూర్వ సంయోగములు కకార సకారములు. అవి అచ్చట సంయోగ సంజ్ఞ వర్ణముల కాదిభూతములు కావున లోపప్రాప్తికలదు అని చెప్పవచ్చును. కా ఆట షష్ఠీ తత్పురుష సమాసము వివక్షితము 'సంయోగయోః ఆదీ = సంయోగాదీ సంయోగాద్యోః'—ఝల్లు పరముగా గలదిగాని, పదాంతమున నున్నదిగాని అగు సంయోగమునకు ఆదియైన అనగా సమీపమయిన సకారమునకును, కకారము నకును లోపమగునని యర్థము. 'శక్తా' 'వస్తా' అనుచోట ఝల్పరక సంయోగ ములు సకారకకారము లయినను దానికి సమీపములయిన సకార కకారములు వేరుగలేవు. 'లస్జ్' ధాతువునకు క్తాన్తరూపమగు 'లగ్నః' అనుచోట ధాతు సకారమున కాసంనివేశము సంభవము.

'నిర్యాతః' 'నిర్వాతః' అనుచోట "సంయోగాదేరాతో ధాతోర్యణ్వతః అని నిష్ఠానత్వమీపక్షమున ప్రాప్తించుచున్న దంటిరే? ఆ సూత్రము 'సంయోగః ఆదిర్యస్య సోఽయం సంయోగాదిః తస్మాత్' అని సంయోగాదేః' అను పద మున కర్థముగాదు. మరియెట్లు? సంయోగావాదీ యస్యసః=సంయోగాద అని ద్వివచనాంతముతో విగ్రహము వివక్షితము. అట్లు కాకున్న "సంయోగా దాతో ధాతోర్యణ్వతః" అనియే పాణిని సూత్రమును రచించి యుండునుగదాది కావున నా దోషమును ప్రసక్తముగాదు ఇది నాకారాంత ధాతువునకు రెండు సంయోగములు ఆదిగ లేవు గదా.

కాగా ప్రత్యేక సంయోగ సంజ్ఞాపక్షప్రాప్త దూషణము లన్నియు నుద్ధ రింపబడినవి.

## ఇతి ప్రత్యేక సంయోగ సంజ్ఞా ప్రాప్తియెట్లని విచారము

ఏకైక హల్లునకు సంయోగ సంజ్ఞా ప్రాప్తికి ప్రసంగమేమి? సంయోగ సంజ్ఞ అన్వర్థము గదా? సముదాయమే సంయోగమగును. వాచ్య వృత్తిచే ప్రత్యేక వర్ణములకు ప్రాప్తియే లేదాయె. కాగా సహగ్రహణమున కేమి యావశ్యకత?

వృద్ధి గుణ సంజ్ఞా విధాయక సూత్రములలో వాక్యార్థ పరిసమాప్తి

ప్రత్యేక వర్ణములందు గనబడుచున్నది గాన నీ సంయోగ సంజ్ఞయు ప్రత్యేక వర్ణములకు ప్రాప్తించు చున్నదని సహగ్రహణ మావశ్యకమని తలంపబడినది.

సముదాయ వాక్య పరిసమాప్తికిని ప్రతిదృష్టాంతము కలదుగదా? ఎట్లనగా "గర్గాః శతం దండ్యన్తామ్" అని ఒక రాజాజ్ఞ. రాజులు హిరణ్యము కొరకు పన్నులు వసూలు చేయుదురు. శతమనగా వంద బంగారు నాణెము అని యర్థము. దండన మనగా వసూలు చేయుట శరీర దండనముగాదు. "అర్థినశ్చ రాజానో హిరణ్యేన భవన్తి" అని తరువాతి వాక్యము. అది దండనము నకు ప్రయోజనము హిరణ్య లాభమని తెలియజేయుచున్నది. "నచ ప్రత్యేకం దండయన్తి" అని మూడవ వాక్యము. దీనికి గర్గ దండన న్యాయమని వ్యవహారము. ఆ దండనము గర్గుల సముదాయముననే పరిసమాప్తముగాని ప్రత్యేకముగ గాదు,

బ్రాహ్మణ భోజన న్యాయము ప్రత్యేక వాక్య పరిసమాప్తికి దృష్టాంతము. గర్గదండ న్యాయము సముదాయ వాక్య పరిసమాప్తికి దృష్టాంతము. వృద్ధిగుణ సంజ్ఞా సూత్రములందు బ్రాహ్మణ భోజన దృష్టాంతమున్నను "ప్రత్యేకమ్" అను వచన మావశ్యకమైన నిచ్చుటను సహగ్రహణము గర్గ దండన న్యాయమున్నను నావశ్యకమగును. అట ప్రత్యేకమను వచనము లేకున్నను గుణవృద్ధి సంజ్ఞలు ప్రత్యేకముగనే ప్రవర్తించిన ఇచటను సహగ్రహణముతో బనిలేదు. న్యాయనుచే సిద్ధించును గాన సహగ్రహణ మక్కర లేదని ప్రత్యాఖ్యాత తాత్పర్యము.

అనేక వర్ణము లజవ్యవహితములయి యున్నపుడు అందు రెండు రెండు వర్ణములకే సంయోగ సంజ్ఞయా? లేక సముదాయమునకే సంయోగ సంజ్ఞ ప్రవర్తించునా? అను విచారము.

ఎట్లైన నేమి? అనిన సముదాయ పక్షమున, 'మస్జ్' ధాతువున సంయోగాది లోపము సిద్ధింపకపోవుమ' అని వార్తికకారుని ఆక్షేప వార్తికము —వా॥ "సముదాయే సంయోగాదిలోపో మస్జేః"

(1) 'మఙ్క్తా' 'మఙ్క్తుమ్' అను రూపములు తృజన్త తుమున్నంతములు' 'మస్జ్' ధాతువు. "మస్జి నశో ర్ఝలి" (7-1-60) అని నుమాగమము. మన్స్జ్ + తృ. మన్స్జ్ + తుమ్॥ "స్కోః సంయోగాద్యో రన్తే చ" (8-2-29) అని, సకార జకార సంయోగమున కాదియైన సకారము నకు లోపము. జకారమునకు కుత్వముచే క కారాదేశము, నకార మున కనుస్వారము, దానికి పర సవర్ణము ఙకారము, ఈ ప్రక్రియచే, మఙ్క్తా. 'మఙ్క్తుమ్' అనునవేర్పడును. ఇట "బహూనామేవ"

అన్ని వర్ణముల మొత్తమునకే సంయోగ సంజ్ఞ అయిన, సకారము సంయోగాదికాదు లోపము సిద్ధింపకపోవును.

(2) 'నిర్గ్లేయాత్' 'నిర్గ్లాయాత్' 'నిర్గ్లేమ్లయాత్' 'నిర్గ్లామ్లయాత్'— అను స్థలము లందును 'వాన్యస్య' - అను నేత్వ వికల్పము సిద్ధింపదు. సంయో గాద్యంగమున కేత్వము విహితము. 'గ్ల్గా' సంయోగాది. అది అంగముకాదు. అంగము 'గ్లా', అది సంయోగాదికాదు.

(3) 'సం స్వరిషీష్ట' అనుచోట "ఋతశ్చ సంయోగాదేః" (7-2-43) అని ఇడాగమము ప్రాప్తింపదు సకార వకారములు మాత్రము సంయో గము కాదు. మకార సకార వకారములు సంయోగ మగునుగాని, తదాది 'మ్స్వృ' అంగముకాదు ఋదంతమును సంయోగాదియు నంగ నంగము కంటె బరమగు లిఙ్నకు ఇడాగమము విహిత మాయె.

(4) 'సంస్వర్యతే'—అనుచోట "గుణోర్తి సంయోగాద్యోః" (7-4-29) అను సూత్రముచే రాదగిన గుణమునకును నదియే ప్రతిబంధము.

(5) ఇక, 'గోమాన్ కరోతి' 'యవమాన్ కరోతి' అను స్థలమున, గోమాన్త్ కరోతి' అను నవస్థలో తకారమునకు సంయోగాంత లోపము రావలెను. నకార తకార సముదాయము సంయోగ సంజ్ఞ కము కానిచో నది సిద్ధింపదు.

(6) 'నిర్గ్లానః' 'నిర్గ్లామ్లనః' అను రూపములందు నిష్ఠానత్వమునకును నిదియే యనుపపత్తి॥ రేఫ గకార లకారములే సంయోగమైన నది ధాత్వాదికాదు, ధాతువగు 'గ్లా' సంయోగాదికాదాయె.

అట్లైన రెండు రెండు వర్ణములకు సంయోగ సంజ్ఞయగు గాక ప్రథమ పక్షమువే యంగీకరింపవచ్చును అనిన, వా॥ "ద్వయోర్హ్యలోః సంయోగ ఇతి చేద్ద్విర్వచనమ్" అని యాక్షేపము.

ఇన్ద్రి మాత్మ ఇచ్ఛతి = ఇన్ద్రీయతి, ఇచట, 'ఇన్ద్రీయ'—అనునది క్యజన్తధాతువు. 'ఇన్ద్రీయతు మిచ్ఛతి' అను వర్థము వివక్షితమగునపుడు, ఇచ్ఛా సన్నంత రూపము 'ఇన్దిద్రీయిషతి'—అని యగును. ఇందు సన్తంతమునకు ద్విత్వ మగపడుచున్నది. ద్విత్వము, నకారమును వదలిపెట్టి 'ద్రీ' అను ద్వితీయైకాచ్చునకు వచ్చినది. "నన్ద్రాః సంయోగాదయః" (6-1-3) అను సూత్రము అచ్చు కంటె బరములగు సంయోగాది నదరలకు ద్విత్వ నిషేధమును బోధించుచున్నది. ఇట ద్వివర్ణ సంయోగములు రెండు. నకార దకార రూప సంయోగము.

దకార రేఖ రూప సంయోగము. ఈ రెండవ సంయోగమునకు దకార మాది యగుటచే ద్విత్వ నిషేధము ప్రాప్తించుచున్నది. కాగా దకారమునకు ద్విర్వచనాసిద్ధియని ఆక్షేప తాత్పర్యము.

"వా॥ నవాజ్విధేః" —అని సమాధానవార్తికము.

ఇది దోషముకాదు. ద్విత్వనిషేధసూత్రములోనికి "అజాదే ర్ద్వితీయస్య" (6-1-2) అనుదాని పూర్వ సూత్రమునుండి 'అజాదేః' అను పదమును వర్తించును. ఆదియైన అచ్చుకంటె, పరములగు నదరలకు ద్విత్వము రాదని యర్థము కాగా నది అజ్విధి. అచ్చాసావాదిశ్చ=అజాది అని కర్మధారయ సమాస మభిప్రేతము. ఇట ఇకారమగు నచ్చుకంటె బరముగా నకారమున్నది గాని దకారములేదు. కావున ద్విర్వచన సిద్ధికి ప్రతిబంధము లేదు.

అనేక వర్ణములు అజవ్యవహితము లయినపుడు ఆ వర్ణముల మొత్తమునకు సంయోగ సంజ్ఞ యను పక్షముగాని, 'కాదు కాదు. అందు రెండు రెండు వర్ణములకే యను పక్షముగాని, యథాశ్రుత సూత్రము వలననే లభించు చున్నదా ? లేక అందొక్కటియే సూత్రాక్షర లభ్యమా ? రెండవ పక్షము, సూత్రమున పదాంతరఘటనము వలనగాని లభింపదు. అని తలంపవలెనా ? అనిన,

యథాశ్రుత సూత్ర లభ్యములే రెండు పక్షములును.

ఎట్లందురా ? అవిద్యమానం అంతరం యేషాం తే = అనంతరాః అను విగ్రహముచే బహు వర్ణములకు సంజ్ఞ యను పక్షము లభ్యము. అంతర మనగా వర్ణశూన్యకాలము. బహువర్ణములు అనంతరము లయినపుడు అనగా విజాతీయ వర్ణ వ్యవహితములు కానపుడు, వాని సముదాయమునకే, ద్విర్వచన ప్రసంగములందు అద్విర్వచనము ప్రత్యేకవర్ణములకు గాక సముదాయము నందే ప్రవర్తించినట్లు, సంయోగ సంజ్ఞయు ప్రవర్తించును.

రెండింటికి రెండింటికి గావలసినపుడు, "అవిద్యమానాః అన్తరా యేషాం తే" అని విగ్రహము చేయబడును. ఒకానొక వర్ణము మధ్యనున్నది అనిన, రెండింటికి మధ్యను అనియే యర్థమగునట్లు, మధ్యనే ఆధేయమును లేదు అనునపుడును రెండింటికి మధ్య ననియే యర్థము గ్రహింపబడును.

ఏదియైన మధ్యనుండుటగాని లేకుండుటగాని రెండింటికే సంభవించు నది. సంయోగమువలె విప్రయోగమును విశేషావగతి హేతువు గాన బహువాల్పమవధానమునను రెండురెండింటికే సంయోగసంజ్ఞ సిద్ధించును. అనిన విప్రయోగముగూడ విశేషావగతికి హేతువే యనుకొనుడు. దూడను విడిచి యావును దెమ్మనిన, దూడగల యావును, ఆ దూడను విడచియే తెత్తురు.

అసలు దూడయే లేని యావును తెచ్చారు.

అయినను నిట బహు హల్లులకే సంయోగసంజ్ఞ ప్రాప్తించును అని యాక్షేపమున కవకాశము గలదు—'రెండింటికి నడుమనే ఏదేని మధ్యనుండుట సంభవము'—అనిమీరు 'రెండింటికి' అని షష్ఠీ విభక్తిచే ప్రతినిర్దేశించిన రెండు వర్ణముల రెండు సముదాయములకు విజాతీయ వర్ణముతో వ్యవధానమున్నపుడు సంయోగ సంజ్ఞ ప్రవర్తింపదని యర్థము. రెండింటికి రెండింటికి నడుమ వింకొకటి లేనపుడు బహు హల్లులు అనంతరములగును. కాన వానికే ప్రాప్తించును. కావున బహుహల్సమవధానమున ఆ సముదాయమునకే సంయోగ సంజ్ఞా ప్రాప్తియని తెలుటచే, సముదాయ సంజ్ఞాభ్యుపగమమే యుక్తము. దోషము లున్న పరిహరింపవచ్చును.

ఏమండీ! సముదాయమునకే సంజ్ఞ యను పక్షమున మస్జిలో సంయోగాదిలోపము సిద్ధింపకుండునంటిరిగదా? ఆదోషము తగులదు. "అన్త్యాత్పూర్వో మస్జేర్మి దనుషంగ సంయోగాది లోపార్థమ్"— అని వార్తికకారుడు చెప్పుచున్నాడు.

"మిదచోఽన్త్యా త్పరః"(1-1-47) అను సూత్రమునందు ఈ వార్తికము గలదు. మస్జ ధాతువునందు ప్రవర్తించు నుమాగమము, చివరి వర్ణమునకు వెనుకగా, పూర్వముగా ప్రవర్తించును. అచ్చులలో చివరి అచ్చునకు పరముగా రాదు. అనుషంగ లోపము సంయోగాదిలోపము సిద్ధించుట దానికి ప్రయోజనము. అనుషంగ మనగా నకారము. దానికి "అని దితాం హల ఉపధాయాః క్ఙితి" (6-4-24) అను సూత్రముచే లోపమురావలెను దానికి నకార ముపధ కావలె. అంత్యాత్పరమునకు పూర్వమైననే యుపధయగును. అందుల కావచన మావశ్యకము. దానివలన సంయోగాది లోపమును సిద్ధించును.

లేదా

అనేకములయిన హల్లులు అచ్చులచే వ్యవహితములు కాకుండగ నున్నపుడు, ఆ వర్ణములలో రెండు రెండు వర్ణములకును, వాని మొత్తమునకును గూడ సంయోగసంజ్ఞ కలుగు ననవచ్చును. విశేషమును గాటింప నక్కరలేదు. సంయోగ సంజ్ఞ కార్యార్థముగదా. ఒకే సంజ్ఞచే కార్యములన్నియు సిద్ధింపనపుడు విశేషమును గాటింప పనిలేదు. ద్విర్వచనము శ్రవణార్థమే కాని కార్యార్థముకాదు. కనుక తత్సామర్థ్య మిట లేదు. కాగా రెండు వర్ణములకు గలుగు సంయోగ సంజ్ఞకే లోపము లక్ష్యము.

## సముదాయ సంజ్ఞా పక్షోక్త దూషణ
## ని రా క ర ణ ము

'నిర్గ్లేయాత్', 'నిర్గ్లాయాత్', 'నిర్గ్లేమయాత్', 'నిర్గ్లామయాత్' — అను చోట్ల, "వాన్యస్య సంయోగాదేః" (6-4-68) అను నేత్వము ప్రాప్తింపక పోవు నంటిరే. అదియు దోషముగాదు. అం దనువృత్తమైన 'అంగస్య' అనుదానిచే 'సంయోగాదేః' అనునది విశేషింతుము. కాగా అంగము సంయోగాది యగునుగాననంగాధికారమునందు ఐఠింపబడిన మూడు సూత్రములచే విధింపబడిన కార్యములును దత్తల్లక్ష్యములందు సిద్ధించును.

'నిర్గ్లేయాత్' ఇత్యాద్యులందు మూడు హల్లులున్నను, సంయోగ సంజ్ఞా కార్యము సముదాయమునందు ప్రసక్తము కాదు గాన, రెండు హల్లులకే ఆ స జ్ఞ ప్రవర్తించును. అంగపద ధాత్వవయవ సంయోగమే ఆయా లక్షణములందాశ్రితము. వాని కాదినిగాని అంతమునగాని వ్యంజనత్రయ మెచటను సంభవింపదు. సంభవించినను నట రెండు వర్ణములకే సంయోగ సంజ్ఞ ఏల ప్రవర్తింపకుండును? అంత మాత్రముననే సంజ్ఞ సఫలముగదా?

ఇక 'గోమాన్ కరోతి', 'యవమాన్ కరోతి' అను స్థలములందు సంయోగాంత లోపము తకారమునకు ప్రాప్తింపకుండునని యుద్భావింపబడిన దోషము విషయమున నిట్లు పరిహారము సంభవము. అట పదముచే సంయోగాంతమును విశేషించిన, సంయోగాంత పదమున కంత లోపమగు నని యర్థమగును. పదము సంయోగాంతమే గదా? కావున నా దోషములేదు

'నిర్గ్లానః' 'నిర్గ్లామ్నః'—అనుచోట్ల "సంయోగాదే రాతో ధాతో ర్యణ్వతః" (8-2-43) అను నిష్ఠానత్వ మీపక్షమున సిద్ధింపకుండు నను నాపాదనము గూడ, ధాతువుచే సంయోగాదిని విశేషించి, సంయోగాది యగు ధాతువునకు పరమైన నిష్ఠాతకారమునకు నత్వము వచ్చునని యర్థమును జెప్పుదుము గాన బరిహృతమగును. త్ర్యవయవ సంయోగముగల ధాతువులకు సంభవము లేదు గావ, బహుసమవధానమునను రెండు వర్ణములకు సంయోగ సంజ్ఞ ప్రవర్తింపవచ్చును. కావున సంజ్ఞా పక్షమును నిర్దుష్టమే యగును.

## "అనంతర శబ్దార్థ నిరూపణము"

అందు మొదటి యాక్షేప వార్తికము—

వా. "స్వరానన్తర్హితవచనమ్"— అనునది.

హలః, అనన్తరాః, సంయోగః అని మూడు పదములు సూత్రమున

నున్నవి. 'స్వరానన్తర్హితాః అనన్తరాః హలః సంయోగః' అని సూత్రమును రచింపదగును.

అచ్చులచే వ్యవహితములు కాని 'అనంతరములివి' అని వ్యవహరింపబడు హల్లులు సంయోగమను సంజ్ఞ కలవి యగునని అర్థమగును
స్వరానంతర్హితవచనమున కేమి ప్రయోజనము? వ్యవహితములకు రాకుండుటయే ప్రయోజనము.

'పచతి పనసమ్'— అనుచోట హల్లుల కనుటచే సకార, అకార, మకారములు మూడింటికి రాకున్నను, మధ్య నకారమున్నను సకార మకారములకు సంజ్ఞ ప్రాప్తించుచున్నది. అపుడు సంయోగాది సకారమునకు "స్కోః సంయోగాద్యోరన్తేచ" (8-2-29) అని లోపము రావలసివచ్చును.

'అనన్తరాః' అను పదము కలదుగదా? అందుచే వ్యవహితములకు రాదు అనిన,

వా॥ "దృష్ట మానన్తర్యం వ్యవహితేఽపి"—అని వార్తికకర్త సమాధానము. వ్యవహితమునందుగూడ అనంతరశబ్దవ్యవహారము కనబడుచున్నది. 'అనన్తరా విమౌ గ్రామౌ' ఈ రెండూళ్లను అనంతరములుగ నున్నవందుము. వానికి నడుమ నేళ్ళు, కొండలును నుండును గదా.

వ్యవహితము లయిన వానిని గూడ అనంతరములనిన సూత్రమున 'అనన్తరాః' అనుట కిక నేమి ఫలము?

వా॥ "ఆనన్తర్యవచనం కిమర్థ మితిచే దేకప్రతిషేధార్థమ్" అని వార్తికకారుని ఆక్షేపసమర్థక వార్తికము.

అనంతర్య వచనమునకు ప్రయోజన మొకటే హల్లునకు సంయోగ సంజ్ఞను వారించుట.

ఒకే హలుకు సంయోగసంజ్ఞ వచ్చిన నేమగును? 'ఇయేష', 'ఉవోష'— అను ఉదాహరణములందు "ఇజాదేశ్చ గురుమతోఽనృచ్ఛః" (3-1-36) అని ఆమ్ప్రత్యయము రావలసి వచ్చును. ఇట, 'ఇష్' ధాతువులోని షకారము మాత్రము సంయోగసంజ్ఞకమయిన ఇకారము గురువగును. ధాతు విజాదియు, గురుమంతమును అగును. కాగా ఆమ్ప్రత్యయ మనివార్యము. 'అనంతరాః' అను పదము సూత్రమున నున్న నది విషయ నిర్దేశార్థమై, ఎచట ననంతర శబ్ద వ్యవహారముండునో యచటనే సంజ్ఞ ప్రవర్తించును. ఆనంతర్యము ప్రతియోగి సాపేక్షము. ప్రకృతమున వేరొక ప్రతియోగి లేదు గాన నుపస్థితమయిన హల్లే ప్రతియోగి కావలెను. ఒకే ఒక హల్లయిన నది సంభవించునదిగాదు. కనుక ఏకాకి యగు హల్లున కనంతరమిది యను వ్యవహారముండదు. కాన ఆనంతర్య మేకప్రతిషేధార్థము.

వా॥ "నవా అతజ్జాతీయ వ్యవాయాత్" ఆక్షేప సమాధాన వార్తికము.

స్వరానంతర్హిత వచన మనావశ్యకము. 'అనన్తరాః' అను దానిచేతనే అతిప్రసంగము వారితమగునని తాత్పర్యము. లోకమున వ్యవధాయక మగునది అతజ్జాతీయకమే. ఆ జాతికి చెందని దొకటియే వానికి వ్యవధాయక మగునని యెట్లు తెలియబడుచున్నది ?

లోకము నందొకానొకడు ఒకానొకనిని, 'ఈ బ్రాహ్మణ గృహములు రెండును ననంతరములేనా?' అని యడుగును. అపుడా వ్యక్తి "కావు. వాని నడుమ వృషల గృహముకలదు"అని సమాధానము చెప్పుచున్నాడు.

అయిన కొన్ని తావులందు తజ్జాతీయమునది వ్యవధాయక మగుట కును, కొన్ని తావుల నట్లు కాకుండుటకును నేమి కారణము? బ్రాహ్మణ జాతీ యులది కాని వృషల గృహము వ్యవధాయకమగు చున్నది. రెండు గ్రామముల నడుమనున్న, భిన్నజాతీయములగు నదులును గొండలును, వ్యవధాయకములు కాలేదు. ఇట్లుండుట కేమి కారణము? అను ప్రశ్నకు సమాధానము—అంత టను అతజ్జాతీయకమే వ్యవధాయకము. ఒకానొకచో, తజ్జాతీయమును వ్యవ ధాయకమయిన నది క్వాచిత్కము.

అటులైన నదీపర్వతములు గ్రామజాతీయములుకానివి, ఈ రెండు గ్రామములను అనంతరములను వ్యవహారములో నేల వ్యవధాయకములు కాలేదు?

అనిన వినుడు—గ్రామ శబ్దమున కనేకార్థములుకలవు.

'ఊరు' అనగా నొకప్పుడు 'ఇండ్లు' అని యర్థము. 'ఊరు కాలిపోయినది' అనిన నిండ్లు కాలిపోయిన వనిగదా యర్థము?

'ఊరును జేరెను'— అను వ్యవహారములో గ్రామశబ్దమునకు వాట పరిక్షేప మర్థము. వాటిపరిక్షేపమనగా నూరి యందలి గృహములకు రక్షకముగ నేర్పరుపబడిన కంచె, ప్రహరి.

ఈ గ్రామ శబ్ద మొకానొకచో మనుష్యులను బోధించును. ఎట్లనగా, 'ఊరు లేచిపోయినది' అందురు, ఇంకొక యూరు వచ్చిపడినది అందురు. అట మనుష్యులనిగదా యర్థము?

మరియు నిది అడవులు, మెట్టలు, గుట్టలు - వీనితో గూడిన యూరిని బోధించుటయుగలదు. 'గ్రామము దానముగా బొందబడినది' అనిన తత్సహిత మగున దనియేగదా యర్థము. కావున, అరణ్య, సీమ, స్థండిల సహితమగు నూరిని మనమునం దిడికొని, 'ఈ గ్రామము లనసంతరములు' అని వ్యవహరింప బడినది.

కాగా భిన్నజాతీయక మెల్లయెడలను వ్యవధాయకమే.
హలోఽనన్తరాః సంయోగః॥

సూ॥ "ముఖనాసికావచనోఽనునాసికః" (1-1-8). నోటితోను, ముక్కుతోను గూడ నుచ్చరింపబడు వర్ణ మనునాసికము.

## ముఖనాసికా వచన శబ్దార్థ నిరూపణము

"ముఖనాసికావచనః" అనగానేమి?

ముఖనాసికల సమాహారము ముఖనాసిక మగును. ఆ ముఖనాసిక ముచ్చారణ సాధనముగాగల వర్ణము ముఖనాసిక వచనము కావలెను. ముఖనాసికా వచన మని దీర్ఘ మెట్లు సాధువగును?

'నిపాతనమువలన సమాహారద్వంద్వమునకు దీర్ఘము వచ్చును' అని సమాధానము.

లేదా

ముఖనాసికా సమాహారమగు ముఖనాసికము. అవచనముగా గలది ముఖనాసికావచనము అనవచ్చును.

## అవచన మనగా నేమి ?

ఈషద్వచన మావచనము. అనగా కొంతభాగము నోటితోను, కొంత భాగము నాసికతోను నుచ్చరింపబడునదని యర్థము.

లేదా

'ముఖద్వితీయా నాసికా = ముఖనాసికా, సా వచన మస్య ముఖనాసికావచనః' అనియు జెప్పనగును. "అసి ద్వితీయోఽనుససార పాండవమ్"—అను ప్రయోగము వందువలె ద్వితీయశబ్దమునకు సహాయభూతమని యర్థము.

ఈ పక్షమున అనునాసిక వర్ణముయొక్క మొదటి భాగము గాని రెండవ భాగముగాని ముఖముతో నుచ్చరింప బడుననియు భాగాంతరము నాసికతో నుచ్చరింపబడుననియు నందు నాసికతో నుచ్చరింపబడు భాగము యొక్క ఉపరంజనము వలన ముఖవచనముగూడ నాసికావచనము వలెనే భాసించుచుండు ననియు జెప్పెడి మతము సూచితము. కాని అనునాసిక వర్ణములకు ముఖమును, నాసికయును గూడ స్థానములుగావు, కాని నడుమ నుండు భాగము స్థానాంతరముగలదు కాబట్టి,'ముఖోప సంహితా నాసికా ముఖనాసికా, సా వచన మస్య ముఖనాసికావచనః' అని విగ్రహము.

ముఖోపసంహిత నాసిక యనగా ముఖనాసికల అంతరాళము. అచటి చర్మపుట మనుట. అదియే అనునాసిక వర్ణములకు స్థానము.

## పద కృత్య నిర్వచనము

ఈ సూత్రమున ముఖపదము లేకుండిననేమి?

ముఖపదమును విడచి, 'నాసికావచన మనునాసికము' అని మాత్రమే చెప్పినచో యమలకును, అనుస్వారమునకును మాత్రమే అనునాసిక సంజ్ఞ వచ్చును. అపు డనునాసికాదేశము విధింపబడిన తావులందు యమానుస్వార ములే యాదేశములుగా వచ్చెడివి.

ఇక అనునాసిక స్థానమున నాదేశమును విధించిన అనువాద స్థలములైన "విడ్వనో రనునాసికస్యాత్" (6-4-41) ఇత్యాది స్థలములందు యమానుస్వారము లకు సంభవము లేదు గాన అప్రతిపత్తియే కలుగవలసి వచ్చును. ముఖ పదము సూత్రమున నున్నచో యమానుస్వారములు కేవల నాసికా వచనములేగాని ముఖవచనములుకావు. దోషములేదు.

## నాసికా పదమునకేమి ప్రయోజనము?

ఆపదము లేనిచో "ముఖవచనోనునాసికః" అనియే సూత్రము. కేవల ముఖవచనములగు కచటతపలకే అనునాసిక సంజ్ఞ వచ్చును. అపుడు 'పక్వమ్' అను రూపమున పచధాతువు చకారమునకు "అనుదాత్తోపదేశవనతితనోత్యాదీనా మనునాసికలోపో ఝలి క్ఙితి"(6-4-37) అను సూత్రముచే లోపము రావలసి వచ్చును. నాసికాపదమున్నచో నవి యుభయవచనములు కావుగాన వానికా సంజ్ఞ ప్రసక్తముగాదు. కనుక దోషముండబోదు.

## ముఖగ్రహణ ప్రత్యాఖ్యానము

ఇందు ముఖపదమును దీసివేయ వచ్చును.

అపు డుభయవచనముల కెట్లు సిద్ధించును?

ప్రాసాదవాసిన్యాయముచే సిద్ధించునని సమాధానము. ప్రాసాదవాసి న్యాయమనగా—

కొందరు మేడపైన నివసించువారు. కొందరు క్రిందను నివసించువారు. కొందరు మేడపైనను క్రిందనుగూడ వసియించువారు. 'ప్రాసాద వాసులను రమ్మనుడు' అని చెప్పిన మేడపైనివారే వత్తురు. భూమివాసులు రండనిన, క్రిందనుండు వారే వత్తురు. ఇకనుభయవాసులో వారెట్లనినను గ్రహింపబడు

దురు. అట్లే ప్రకృతమునను గొన్ని వర్ణములు ముఖవచనములు, కొన్ని నాసికా వచనములు, మరి కొన్ని యుభయవచనములును గలవు. అందు ముఖ మాత్ర వచనములు ముఖగ్రహణముచే గ్రహింపబడును. నాసికామాత్ర వచనములు నాసికా గ్రహణ గ్రాహ్యములు.

ఇక ముఖ వచనములును నాసికా వచనములును గూడనగు వర్ణములు, ముఖవచనము లనినను, నాసికావచనము లనినను గ్రహింపబడును. కావున 'నాసికావచనోనునాసికః' అనియే సూత్రము రచింపబడినను నుభయవచనములకును సంజ్ఞ లభించును.

సరి. ఉభయవచనములకును సిద్ధించు ననుకొనుము. కేవల నాసికావచనములగు యమానుస్వారముల కనునాసికసంజ్ఞను వారించుట యెట్లు?

వాని కాసంజ్ఞ ప్రాప్తించినను దోష ప్రయోజనములు రెండును లేవు. అనువాద విషయమున యమానుస్వారములకు సంభవమే లేదు. విధి ప్రదేశములందైనను ముఖవచనములగు వర్ణములకు, ఆంతరతమ్యమువలన నుభయ వచనములే యాదేశములు కావచ్చును. కేవల నాసికావచనములకు ప్రసక్తి యుండదు.

## అన్యోన్యాశ్రయ పరిహారము

వా॥ "ఇతరేతరాశ్రయం తు"—అని ఆక్షేప వార్తికము. అనునాసిక సంజ్ఞ ఇతరేతరాశ్రయము మాత్రమగు చున్నది. అది దానికి కలదోషము.

## ఆ ఇతరేతరాశ్రయత యేమి ?

సంజ్ఞాసంజ్ఞులు పరస్పరాపేక్షము లగుట ఇతరేతరాశ్రయత.

సంజ్ఞా విధానమునకు సంజ్ఞ పూర్వ సిద్ధమై యుండవలె. ముఖ నాసికా వచనమగు వర్ణముండిన దానికి సూత్ర మనునాసిక సంజ్ఞను బోధించును. ఇట నట్లు లేదు. సంజ్ఞ చేతనే సంజ్ఞ విధింపబడుచున్నది. ఏ కార్యమునకైనను ముఖ్యకారణమును సహకారికారణములును నుండును. సహకారి కారణ వ్యాపారమువలన ముఖ్యకారణమునకు కార్యోత్పాదన శక్తిలభించును. అటులనే ముఖ్యకారణముయొక్క వ్యాపారమువలన సహకారుల కాశక్తి కలుగును. కాగా ఒకదాని వ్యాపారమునకుముం దింకొకటి ప్రవర్తింపదు కాగా కార్యానుత్పత్తియే ఫలితమగును. కర్ణధారుడు లేని రెండు నావలను, ఒక దానితో నొకటి బంధించిన నయ్యవి తీరమును జేరలేవు.

కాగా పరస్పరాశ్రయ కార్యము లెవ్వియు సిద్ధింపవు.

వా॥ "అనునాసికసంజ్ఞాయా మితరేతరాశ్రయత్వా దుక్తమ్"— అని

సిద్ధాంతం సమాధానము. ఈ ఇతరేతరేతరాశ్రయతకు పరిహారము పూర్వమే చెప్పబడియున్నది.

ఏమి చెప్పబడినది?

వా॥ "సిద్ధంతు నిత్యశబ్దత్వాత్"—అని వార్తికకారునిచే చెప్పబడినది.

'శబ్దములు నిత్యములేగాని కార్యములు కావు'—అనునది సిద్ధాంతము ఆ సిద్ధాంతమువలన దోషాభావము సిద్ధమనుట. కావున నీసూత్ర మదివరకే యున్న ముఖ నాసిక వచన వర్ణమునకు అనునాసిక సంజ్ఞను విధించుచున్నది. అంతియగాని సంజ్ఞచే అనునాసిక మపూర్వముగ కల్పింపబడలేదు. అని భావము.

శబ్దములు నిత్యములైన నిక శాస్త్రమెందులకు? అని ప్రశ్న.

వా॥ "కిమర్థం శాస్త్రమితిచే న్నివర్తకత్వాత్సిద్ధమ్ "అని సమాధానము.

శాస్త్రము నివర్తకముగా నావశ్యకము. ఎట్లనగా,

"ఆఙోనునాసిక శ్ఛన్దసి"— అను సూత్రము వేదమునందు 'ఆఙ్' అను నుపసర్గమునకు అనునాసికాదేశమును విధించినది.

ఆఙను నుపసర్గము ప్రాదిగణమున అననునాసికముగ పాణినిచే నుప దేశింపబడినది. సాధుశబ్ద జిజ్ఞాసువు "ఉపసర్గ మెచటనున్నను అననునాసికమే యనుకొనును. అట్టియెడ నీ "ఆఙోనునాసిక శ్ఛందసి"—అను సూత్రము ఆ బుద్ధికి నివర్తకమగును.

'ఆఙ్ లోకమునందును వేదమునందునుగూడ అననునాసికముగాదు. వేదమునందు అచ్చు పరమగునపుడు ఆఙుపసర్గ మనునాసిక మగును' అని బోధించి సర్వత్ర ప్రసక్తమగు న అననునాసిక బుద్ధిని నివర్తింపజేసి, వేద మున అనునాసికమునకు సాధుత్వమును బోధించి సార్థకమగును.

## ముఖనాసికావచనోనునాసికః

సూ॥ "తుల్యాస్య ప్రయత్నం సవర్ణమ్" (1-1-9)

ఇది సవర్ణ సంజ్ఞా విధాయక సూత్రము.

తుల్యాస్య ప్రయత్నమైన వర్ణ ద్వయము పరస్పరము సవర్ణమగును— అని యర్థము.

తుల్యాస్య ప్రయత్నమననేమి?

తుల్యం = తులయా సమ్మితమ్. త్రాసుతో దూచి సమపరపబడినది అని వ్యుత్పత్త్యర్థము, ఈ యర్థమున కిట సంభవములేదు. అది వ్యుత్పాదనమ్ము

మాత్రమే.'సదృశము' అని రూఢ్యర్థము. రూఢిశబ్దముల వ్యుత్పాదన మంతయు నవయవార్థానుగమము కానిదిగనే యుండును.

ఆస్య ప్రయత్నమ్ = ఆస్య ప్రయత్నముల సమాహారము.

ఆస్యమననేమి? ఇది తద్ధితాంతమా? 'ఆస్యభవము'అని యర్థమా ? లేక 'ముఖము' అని యర్థమా?

పురఃస్ఫూర్తిక మయిన యర్థము ముఖము. అది లోకవిదితము. పెదవులు మొదలు 'కాకలకము' వరకు నుండు భాగము నోరు. కాకలకము = కంఠమునందలి యెత్తైన ప్రదేశము.

నోటికి ఆస్యమను వ్యవహార మెట్లు కలిగినది?

దీనితో వర్ణములను బలుకుదురుగాన నిది యాస్యము. కరణార్థమున ణ్యత్ ప్రత్యయము. లేదా 'అస్యన్దతే ఇత్యాస్యమ్' ద్రవింప జేయునది. అంతర్భావితణ్యర్థమగు స్యన్దూధాతువునకు డ ప్రత్యయము. అన్నము నోటిని ద్రవము కల దానినిగ జేయును గనుక ఆస్యము = నోరు.

ఇక ప్రయత్న మననేమి ? అనగా యత్నమాత్రమా ? యత్న ప్రారంభమా?

ప్రయతనమే ప్రయత్నము. యత్నమాత్రమే. రెండు శబ్దములను బర్యాయములే. 'ప్ర' అను నుపసర్గము పూర్వమందుగల 'యత' ధాతువునకు 'నఙ్' అను ప్రత్యయము భావార్థమున రాగా నేర్పడినది ప్రయత్న శబ్దము.

ఆస్య మనగా లోకప్రసిద్ధమైన నోరు అనెడి యర్థమే గ్రహింపబడిన యెడల,ఆస్యపదమునకు సూత్రమున నేమి ప్రయోజనము? అన్ని వర్ణములకును నుచ్చారణ సాధనమగు నోరు తుల్యమేగదా? నాసికయు ఆస్యాంతర్గతమే. కనుక ఆస్యపద వ్యావర్త్య మేదియులేదే ? అనిన

ఆస్యపదము ప్రయత్నపదమునకు విశేషణముగా సార్థకమగు నని ముందు జెప్పబడును. అట నా విషయమును విచారింపవచ్చును. ఆ పరీక్ష ప్రకృతమున ననావశ్యకము.

వా॥ "సవర్ణసంజ్ఞాయాం భిన్నదేశే ష్వతిప్రసంగః ప్రయత్న సామాన్యాత్" అని ప్రథమాక్షేపవార్తికము. సవర్ణ సంజ్ఞ విషయములో నొక యతిప్రసంగము ప్రాప్తించుచున్నది. వేరు వేరు స్థానము లందున్నవియైనవి జ, బ, గ, డ, ద — అను వర్ణములు గదా. కాని నోరు అను స్థానము వాని కన్నిటికిని దుల్యము. అవి స్పర్శ వర్ణములు గాన 'స్పృష్టము' అను ప్రయత్నములు దుల్యము. కాగా వానికి బరస్పరము సవర్ణ సంజ్ఞ ప్రాప్తించుచున్నది. 'ఊర్గజః' — అను పదమును జూడుడు. 'ఊర్క్' అనగా నన్నము

దాని నుండి పుట్టినది అని యర్థము. అట గకార జకారములు సవర్ణములైన, 'ఝురోఝురి సవర్ణే'—అని గకారమునకు లోపము ప్రసక్తమగును. ఆపదమున, రేఫ హల్లు. దానికి బలమైన ఝుర్ప్రత్యాహారవర్ణము గకారము. పరమయిన సవర్ణ ఝుర్వర్ణము జకారము.

ఈ యాక్షేపమునకు సమాధాన వార్తికము,

వా॥ "సిద్ధం త్వాస్యే తుల్య దేశ ప్రయత్నం సవర్ణమ్" అనునది.
సిద్ధమ్ = ఆక్షేప పరిహారము సిద్ధము. ఎట్లు?

"ఆస్యే తుల్య దేశ ప్రయత్నం సవర్ణమ్" అని న్యాసమును మార్చి, ముఖము నందలి ప్రదేశమును, ప్రయత్నమును తుల్యమయి యున్న వర్ణములు సవర్ణము లగునని చెప్పవగును గాన నాదోషము ప్రసక్తముకాదు. వానికి ఆస్యాంతర్గత స్థానములు తుల్యములు కావు.

అట్టి న్యాసము నందైనను, ఆస్యపదమునకు ప్రయోజన మగపడదు. ఆస్యమునందలి దేశములనిన నన్నియు, ముఖమునందున్న తాల్వాది స్థానములే గదా? అస్యమన్ని వర్ణములకును సమానమే అయె అని యాక్షేపము.

ప్రయత్నమునకు విశేషణముగా వాస్యపదము సార్థకమని సమాధానము. ప్రయత్నము లాస్యాంతర్గతములును తద్భిన్నములును గలవు. ఆస్యము నందలి యత్నములు తుల్యముగానున్న వర్ణములనుటవలన, బాహ్యములగు యత్న ములు నివర్తింపజేయబడును. అనగా నవి యున్నను లేకున్న సవర్ణ సంజ్ఞ సిద్ధించును. కాని సామ్యముతో నిపుడు పని లేదు.

అట్టి ఆస్యబాహ్యములయిన యత్నము లెయ్యవి? వివార సంవారములు, శ్వాసనాదములు, ఘోషవత్త్వాఘోషవత్త్వములు అల్పప్రాణతా మహాప్రాణ తలును నెనిమిది.

అందు వర్గలలో ప్రథమ ద్వితీయాక్షరములు వివృత కంఠములు. అనగా నవి కంఠమును వివరింపజేయునవి. వానికి వివారము ప్రయత్నమనుట మరియు నవి శ్వాసానుప్రదానములు. 'అనగా శ్వాసః అను ప్రదీయతే యైః' అని విగ్రహము. కంఠబిలము వివరింపబడిన వెనుక పైన శ్వాసలుద్భవించును. వాని నీవర్ణములు ఘంటా నిర్హ్రాదమువలె ననువర్తింపజేయును మరియు నవి అఘోషములు. అందు మొదటివి అల్పప్రాణములు. రెండవవి మహా ప్రాణములు.

ఇక తృతీయ చతుర్థములు సంవృత కంఠములు, నాదానుప్రదాన ములు, ఘోషవంతములును. అందును, తృతీయము లల్పప్రాణములు. చతుర్థ ములు మహాప్రాణములు.

తృతీయ వర్ణముల వంటివే పంచమాక్షరములు. అనునాసికత్వమను గుణము వాని కధికము.

సూత్రమున నిర్దిష్టాస్యపదము ప్రయత్న విశేషణమగుటవలన సవర్ణ సంజ్ఞ తనకు నిమిత్తముగా వానిని గ్రహింపక వదలిపెట్టును. అవి వ్యర్థ ప్రస్తము లగుటవలన నిక స్పృష్టత, ఈషత్ స్పృష్టత, వివృత, సంవృతత- అను నీ నాలుగు అభ్యంతర ప్రయత్నములు మాత్రము సవర్ణ సంజ్ఞకు నిమిత్తము లగును.

ఆస్యాంతర్గతములగు తాలువు మున్నగు స్థానములందు జిహ్వాగ్ర, ఉపాగ్ర, మధ్య, మూలముల స్పర్శవలన, ఈషత్ స్పర్శవలన, సమీపావస్థాన దూరావస్థానములవలనను వర్ణముల యభివ్యక్తి కలుగును. కావున నవి అభ్యంతరయత్నములని వ్యవహరింపబడుచున్నవి.

శబ్దములను ప్రయోగింపవలెనను నిచ్ఛ కలిగిన తోడనే మనలో నొక యత్న ముద్భవించును. ఆ యత్నము నాభిప్రదేశముననున్న వాయువును ప్రేరించును. అపుడా వాయువు వేగముగ మూర్ధ పర్యంతము పోవును. ఇక ముందుకు పోవు మార్గము లేక వెనుకకు మరలి ఆస్యమునందు నిలచి, ఆయా తాల్వాది స్థానములందు జిహ్వాగ్రాదులను దాకించి, ఆ యభిఘాతముచే వర్ణముల నావిర్భవింపజేయును.

ఆ వాయువే తిరిగి వెనుకకు బోవుచు, ఆయత్నము చేతనే గళ వివరాదులను వికసింపజేయును. వివార సంవారములనగా కంఠబిలముయొక్క వికాస సంకోచములు. శ్వాసమును నాదమును వర్ణ నిష్పత్త్యనంతర భావి యత్నములు కనుక అనుప్రదానము లనబడును. అను = పశ్చాత్, ప్రదీయతే యైః తే= శ్వాసానుప్రదానాః.

ఆయా స్థానములందు జిహ్వాగ్రాదులను స్పృశింపజేయు యత్నములు ఆస్యాంతర్గత కార్యములను జేయును గాన నవి యాభ్యంతరములు. ఆస్య బహిర్భూతమగు దేశమున నాయా కార్యములను జేయునవి బాహ్యములు.

ఈ బాహ్య ప్రయత్నములు పదునొకండు అందురు. కాని హ్రస్వత్వ, దీర్ఘత్వ, ప్లుతత్వ, అనునాసికత్వములును బాహ్యములే.

నాభి ప్రదేశమునుండి వాయువును ప్రేరించిన యత్నములలో నొకా నొకటి అల్పమగు వాయువును, వేరొకటి అధికమగు వాయువును ప్రేరించును. ఆ కార్యము ఆస్యమునకు బయట జరుగును. కావున నదియు బాహ్యము. సవర్ణ సంజ్ఞకు గావలసినది ఆస్యమునందలి యత్నముల సామ్యము. కాగా నీ హ్రస్వత్వాది జనకయత్నములు గూడ వ్యావర్తితము లగును,

బాహ్య ప్రయత్నముల వ్యావృత్తికొరకు ఆస్యపదముచే ప్రయత్నమును విశేషించినట్లు ఆస్యపదముచే స్థానమును గూడ విశేషింపవలసియుండును. ఆస్యబాహ్యమగు దేశ మేదియు నే వర్ణమునకును లేదని తలంపబడినదిగాని, అవర్ణమునకు స్థానమాస్య బాహ్యమయినది కలదు. కాకలమునకు దిగువ జత్రు ప్రదేశమునకు సమీపదేశము అకారమునకు స్థానము. అది ముఖము లోనిది కాదు. అపుడష్టాదశ భేద భిన్నములగు వకారములకు పరస్పరము సవర్ణ సంజ్ఞ ప్రాప్తింపకపోవునని యాక్షేపము. అది మాత్రమే దానికి స్థానముగాదు. ముఖమంతయు అవర్ణ నిష్పత్తిలో వ్యాపారముగలదియే యని సమాధానము.

అవర్ణము సర్వముఖ స్థానకమయినను 'ఆస్యము నందలి దేశము ఏవర్ణము లకు తుల్యమో' అను వ్యవహారముకుదురదే? దానికి ఆస్యమే దేశముగాని నోటి యందలి స్థానాంతర మేదియు దేశము కాదుగదా? అనిన,

వ్యపదేశివద్భావముచే నట్టి వ్యవహారములకుపపత్తికలుగును. రాహువే శిరస్సు, శిరస్సు మాత్రమే రాహువు. భేదములేదు. అయినను మన బుద్ధిలో భేదమును గల్పించి, రాహువును వేరుగను శిరస్సును వేరుగను భావించి, 'రాహువు శిరస్సిది' అని వ్యవహరించుట గలదు.

"ఆస్యేతుల్య దేశ ప్రయత్నం సవర్ణమ్" అను న్యాసాంతరమున దోషాంతరము-లెవ్వియు లేకున్నను, పాణిని సూత్రమునకు భేదము తప్పదు. అదియే దోషము.

అట్లయిన, సూత్రము మార్చవద్దు. యథాన్యాసముగనే యుండవలెను.

ప్రయత్న తౌల్యమున్నందున, భిన్నదేశములయినను జబగడదలకు సవర్ణ సంజ్ఞ కతిప్రసంగము కలుగుచున్నదని యాక్షేపింపబడినది గదా యనిన, నది దోషముకాదు.

ఆస్యమనగా లౌకికమయిన నోరు అని గాదిచట గ్రహింపదగిన యర్థము. మరియేమనిన,

ఇది తద్ధిత ప్రత్యయాంతము. 'ఆస్యేభవ మాస్యమ్' 'నోటిలో నున్నది' అను నర్థమునందు "శరీరావయవాద్యత్" (5-1-6) అను సూత్రముచే విహిత మయిన యత్ప్రత్యయాంతమిది.

ఆస్యభవ మేమగును?

స్థానమును, కరణమును నగును. స్థానములు, కంఠ, తాలు, మూర్ధ, దంత, ఓష్ఠ, నాసికాదులు, కరణములనగా స్పృష్టతాద్యాభ్యంతర యత్నములు మున్నగునవి.

తద్ధితాంతాస్య శబ్దమును గ్రహించినను, అస్యంచ ప్రయత్నశ్చ అస్య ప్రయత్నౌ, తుల్యౌ ఆస్యప్రయత్నౌ యస్యతత్ =తుల్యాస్యప్రయత్నమ్'— అని యిట్లు ద్వంద్వ గర్భ బహువ్రీహిచే ఆస్యభవ స్థానములును యత్నములను దుల్యము లయిన వర్ణములు సవర్ణములని సిద్ధించు నేగాని, బాహ్య ప్రయత్న వ్యావర్తన మునకై ఆస్యముచే ప్రయత్నమును విశేషించుట కుదురదే? అనిన,

అదియు విశేషితమగును. ఎట్లు?

ఇట ప్రయత్నమనగా యత్న మాత్రముగాదు. యత్నములలో ముందు, అనగా వర్ణోత్పత్తికి పూర్వ మారభ్యమాణమగునది ప్రయత్నము. అది ఆభ్యంతర ప్రయత్నమేగాని బాహ్య ప్రయత్నముగాదు. కావున వాని వ్యావర్తనమును సిద్ధించును. వర్ణోత్పత్త్యనంతరము గళ వివర వికాసాదులను గలుగజేయు యత్నములు ప్రారంభ యత్నములుగావు.

ప్రయత్నమనగా యత్నముయొక్క ఆరంభము—అనగా ఆభ్యంతర యత్నము. తత్సామ్యమే సవర్ణ సంజ్ఞకు నిమిత్తము అయినను అవర్ణమున కును ఏ ఓ లకును, పరస్పరము సవర్ణ సంజ్ఞ ప్రాప్తించును. సంధ్యక్షరములలో ప్రథమ భాగము అకారముతో సస్పృశము. కాగా స్వసవర్ణాకారము ఏ ఓలలో నుండె. దాని ద్వారముగ అకార ఏకారములును, అకార-ఓకారములును సవర్ణ ములైన, 'గవ్యమ్' అను రూపమున, 'యస్యేతిచ' (6-4-148) అని లోపము ప్రసక్తమగుచున్నది. అనిన,

ఏ ఓ-లు ప్రశ్లిష్టావర్ణములు. అచట అవర్ణము, ఇవర్ణోవర్ణములతో బాగుగ గలసి పోవుటచే పాంశూదకముల వలె విభాగము దుశ్శకము. కావున నది సవర్ణత్వాప్తిలేదని సమాధానము.

అటులైన అవర్ణమునకును ఐ, ఔలకును పరస్పరము సావర్ణ్యము ప్రాప్తించును. అవి విశ్లిష్టావర్ణములు. విభాగ మచట సాధ్యము. కాగా 'వావ్యమ్' అనుచోట ''యస్యేతిచ'' (6-4-148) అను లోపాపత్తి కలుగును. అనిన,

వానిలోని అవర్ణము వివృత తరము. తద్ద్వారమున ఐఔలును, వివృత తరములు. అకార హ్రస్వము వివృతమేగదా-కాగా సావర్ణ్య ప్రాప్తిలేదని సమాధానము. ఇక దీర్ఘాకార మంతకంటెను వివృతతరము కాన దానికిని వానితో తత్ప్రాప్తిలేదు.

అటులైన ఐకార, ఔకారములకు, తమలో తముకే, పరస్పరము సవర్ణ సంజ్ఞ ప్రాప్తించును: అపుడు "ఏచఇ" (8-4-93) అను సూత్రముచేత లోదుత్త మైకారమునకు ఔకారమును ప్రాప్తమగును.

ఇవి తుల్యస్థానములుకావు. కంఠ స్థాన మాత్ర సామ్యమున్నను, తదితరస్థాన సామ్యములేదు. కనుక ఏఐ చ్ఛులకు. పరస్పర సవర్ణ సంజ్ఞాప్రాప్తిలేదని సమాధానము. యావత్ స్థాన సామ్యమే సవర్ణ సంజ్ఞోపయోగి,

ఓహో ! సవర్ణ సంజ్ఞకు యావత్ స్థానముల సామ్యమువలె, యావత్ప్రయత్నసామ్యమును వివక్షితము కావలెను గదా? అపుడు, ఉదాత్త, అనుదాత్త, స్వరిత, హ్రస్వ, దీర్ఘ, ప్లుత, చతుర్మాత్రానునాసికములకును అకస్వరము సావర్ణ్యము ప్రాప్తింపక పోవునే యనిన,

ఉదాత్తాదులభేదకములు గాన వాదోషములేదు.

"అస్థిదధి సక్థ్యక్ష్ణ మనఙుదాత్తః" (7-1-75) అను సూత్రము నందు నఙాదేశమునకుదాత్తత్వము, 'ఉదాత్తః'—అను పదము నుచ్చరించి విధించుటచేనది భేదకమేయగును. ఆ విధముగ ప్రత్యేక యత్నముచే బోధింపబడిన తప్ప, సామాన్యముగ నవి భేదమును సూచింపవు. కావున ప్రారంభ భేదమున్నను. అనగా వాభ్యంతర భేదమున్నను వానికి సవర్ణ సంజ్ఞ సిద్ధించును. సవర్ణ సంజ్ఞా విధాయక సూత్రమునందలి ప్రయత్న శబ్దముచే నుదాత్తాదులకు గ్రహణము కలుగదనుట.

లేదా —ప్రయత్నమనగా నాభ్యంతర ప్రయత్నమేయని విశేష యత్నముతో మేమెందులకు జెప్పవలెను? యత్న సామాన్యమే ప్రయత్నము. ఇక, ఆస్యశబ్దము తద్ధితాంతమే, తాల్వాది స్థానమని దానికర్థము. ఎయ్యది సమానమయి యుండునో దానినే సవర్ణ సంజ్ఞకు నిమిత్తముగా నాశ్రయింతుము.

ఏమి గలిగి యుండి సామ్యముండిన నది ప్రవర్తించుననిన, భేదమును యతిక్రంచి దంశమున గలిగియుండిననేయనుట.

అట్లేల జెప్పవలెననిన, సవర్ణ సంజ్ఞకు భేదమధిష్ఠానము గాన యతిక్రంచి భేదముండినపుడే యతిక్రంచి సామ్యము నాశ్రయించి ఆ సంజ్ఞప్రవర్తించును. వర్గాక్షరములకు, బాహ్యయత్న భేదమున్నను, స్పృష్టతాది సామ్యము వలన నా సంజ్ఞ ప్రవర్తించినది. ఏ భేదమును లేకుండగ సర్వమున సామ్యమేయున్న సవర్ణ సంజ్ఞావచనమే అనర్థకమగును గదా ?

"ఝరోఝరి సవర్ణే" (8.4.65) అను సూత్రమును జూడుడు. ఇందు, హల్లు కంటే బరమగు ఝర్వర్ణమునకు, సవర్ణమైన ఝర్వర్ణము పరమయినపుడు లోపము విధింపబడినది. అటయథా సంఖ్య నిరాసము కొరకు 'సవర్ణే' అనుట.

'శిణ్ డ్ఢి'- అను లక్ష్యమున టవర్గ తృతీయమునకు చతుర్థము పరమగు నపుడు లోపము రావలెను. వచ్చినది.

బాహ్య ప్రయత్న భేదమున్నందున తృతీయ చతుర్థములు సవర్ణములు

కానిచో 'సవర్ణే' అనుట వ్యర్థమే గదా. కాగా నా 'సవర్ణే' అనునది, యత్కించి ప్రయత్న భేదమునున్నను యత్కించి ప్రయత్నైక్యమును గ్రహించి సవర్ణ సంజ్ఞ ప్రవర్తించుననని పాణిని ఆశయమును దెలియజేయునని గ్రహింపదగును.

ఆక్షేపము- యత్కించి దంశమున భేదమున్నను, యత్కించి దంశ సామ్యమును గ్రహించి, సవర్ణ సంజ్ఞను బ్రవర్తింప జేయవచ్చుననిన, శకార ఛకారములకును, షకార ఠకారములకును, సకార థకారములకును సవర్ణ సంజ్ఞ ప్రాప్తించును. వీనికి అభ్యంతర ప్రయత్న సామ్యము లేకున్నను, స్థానబాహ్యా యత్న సామ్యము గలదు సవర్ణ సంజ్ఞ ప్రవర్తించిన యెడల, నిశ్ఛద్మ. నిష్ ష్ఠానమ్, నిః స్థానమ్ అను స్థలములందు, "ఝరో ఝరి సవర్ణే" (8.4 65) అని శషలకు లోపము రావలసివచ్చును. వర్గ్యములు స్పృష్టములు, ఊష్మలు వివృతములునగుటచే, కరణ సామ్యములేదు. స్థానసామ్యమును, అఘోషత్వాది సామ్యమును గలవు. కాగా "ప్రారంభో యత్నస్య=ప్రయత్నః" అనియే చెప్ప వలెను. అనగా వాభ్యంతర ప్రయత్న తౌల్యమే సవర్ణ సంజ్ఞా ప్రయోజకమని చెప్పకతప్పదు-"

సమాధానము—— ప్రయత్న మన యత్న మాత్రమే. ఆస్యమనగా వాస్యభవమే. ఆ పదము తద్ధితాంతమే. ఇక దానికి సమాసము 'ఆస్యంచ ప్రయత్నశ్చ = ఆస్యప్రయత్నమ్'- అని ద్వంద్వముగాదు. అది త్రిపద బహు వ్రీహి. 'తుల్యః ఆస్యే ప్రయత్నః యస్యతత్ = తుల్యాస్యప్రయత్నమ్' అని విగ్రహము. అందు 'ఆస్యే' అను పదమునందేకత్వమును వివక్షింపవలెను. కాగా ఒక స్థానముననే ఏ రెండు వర్ణములకు ప్రయత్నము తుల్యముగ నుండునో, అవి సవర్ణములగునని యర్థము. కావున, శచ,-షఠ- సథ- లకు సవర్ణ సంజ్ఞా ప్రవృత్తిలేదు.

లేదా—— తుల్యాస్యపదములు రెండింటికి ముందు తత్పురుష. తరు వాత ద్విపద బహువ్రీహి అని చెప్పవచ్చును, 'తుల్యే' ఆస్యే = తుల్యాస్యః ఇది మయూరవ్యంసకాది సప్తమ్యన్తోత్తరపదక తత్పురుషః 'తుల్యాస్యః ప్రయత్నః యేషామ్'- అని తరువాత బహువ్రీహి. 'వ్యంసకో మయూరః = మయూరవ్యంసకః' అనునట్లు ఆస్యేతుల్య = తుల్యాస్యః అనవచ్చునుగాని, తత్పురుష సమాసమున, పూర్వ పదార్థ ప్రాధాన్యమగలిక గతి యగును.

అందువలన, "ఆస్యే ప్రయత్నః = ఆస్యప్రయత్నః" అని ముందుగా తత్పురుషసమాసమును జేసి, పిదప, 'తుల్యః ఆస్య ప్రయత్నః యేషామ్' అని బహువ్రీహి, అనిగాని చెప్పనగును.

## అనిష్టసావర్ణ్యనిరాకరణము

వా॥ "తస్య" అని ఆక్షేపవార్తికము.

ఈ సూత్రమున 'తస్య'-అను పదముగూడ నధికముగ నుండవలె. ఏవర్ణమే వర్ణమునకు దుల్యాస్యప్రయత్నమో దానికది సవర్ణమగునని యర్థము కావలెను. వేరొక వర్ణమునకు సమాన స్థాన ప్రయత్నమయినది వేరొక వర్ణమునకు సవర్ణము కారాదు. ఇకారమునకు దుల్యాస్యప్రయత్నకమైన ఈ కారమకారమునకు సవర్ణము కారాదుగదా. అట్టియెడ నన్నివర్ణములను నన్ని వర్ణములకును సవర్ణములగునుగావ, సవర్ణ సంజ్ఞావచనము వ్యర్థమగును. కాగా వర్ణాంతరముతో సమాన స్థాన ప్రయత్నకము వర్ణాంతరమునకు సవర్ణముగాదు, అనునభిప్రాయముతో నవతరించిన సమాధానవార్తికము.

వా॥ తస్యా వచనం వచన ప్రామాణ్యాత్" అనునది.

రేఫకును, ఊష్మవర్ణములకును సవర్ణములు లేనేలేవు. అనుబంధం. వానికి సవర్ణ సంజ్ఞానివృత్తి సవర్ణ సంజ్ఞావచనమునకు బ్రయోజనము కావచ్చునను శంక కవకాశము కలదు గాని, రేఫోష్మలకు విజాతీయములగు సవర్ణములు లేవనినను, వానికవియే సవర్ణములు కావచ్చును గాన సూత్రారంభము వ్యర్థమగునని ఆ శంకకు సమాధానము కలదు.

ఇట్లు వచన సామర్థ్యముచే దోషము పరిహృతమగును. కాణి న్యాయము చేతను దానిని బరిహరింపవచ్చునను నాశయముతో వార్తికకర్త. సమాధానాంతరమును,

వా॥ "సంబంధి శబ్దైర్వాతుల్యమ్" అని పఠించెను.

సవర్ణ శబ్దము సంబంధి శబ్దములయిన, మాతృ శబ్దము పితృశబ్దము వంటిది. 'మాతరివర్తితవ్యమ్' 'పితరి శుశ్రూషితవ్యమ్' అని ధర్మశాస్త్రవచనములు. అట 'స్వస్య' అనియు జెప్పలేదు. అయినను దన తల్లి యెడల వినయవిధేయతలతో నుండవలెను, 'తన తండ్రికి శుశ్రూష చేయవలెను' అనియే, సంబంధము వలన గమ్యమగుచున్నది.

ఆ విధముగనే, ప్రకృతమును, తుల్యాస్య ప్రయత్నం, సవర్ణం అను శబ్దములు రెండు సంబంధి శబ్దములు కాగా, ఏ వర్ణమున కేవర్ణము సమాన స్థాన ప్రయత్నమో దాని కదియే సవర్ణ మగునని సంబోధము వలననే తెలిసికొనదగియుండును.

"తుల్యాయ కన్యాదాతవ్యా" 'తనకన్యను తుల్యున కీయదగును' అనిన దనతో తుల్యుల కనియే యర్థము గ్రహించునుగాని బ్రాహ్మణుడు శూద్రునితో దుల్యునకు దన కన్య నిచ్చుట లేదు.

అక్షే యచటం, తనకు తుల్యాస్యప్రయత్నమగునది తనకు సవర్ణమగు నని యే యర్థమగును గాన,

'తస్య' అను వచనమునకు జేర్పనక్కరలేదని భావము.

## "ఋ, ఌవర్ణముల సవర్ణసంజ్ఞా విచారము"

వా॥ "ఋకారఌకారయోః సవర్ణవిధిః" అనివార్తికము.

ఋకారమునకు మూర్ధము. ఌకారమునకు దంతములు స్థానములగుటచే సవర్ణ సంజ్ఞ సూత్రముచే ప్రాప్తించుట లేదు. కనుక వానికిఁబరస్పరము సవర్ణ సంజ్ఞను విధింపవలసి యున్నది. ప్రయోజనమేమనిన- హోతృ + ఌకారః = హోతౄకారః అని సంహితరూపముకావలెను. అట ఋకారమునకు ఌకారము పరమగునపుడు,

"అకస్సవర్ణే దీర్ఘః"— అను సూత్రముచే దీర్ఘమగు ౠకారము పూర్వపర వర్ణముల స్థానమున నేకాదేశమై రావలెను. ఋకారమునకు ఌకారము సవర్ణమైననే యది పొసగును. ఈ యాదేశము ఋకార ఌకారముల స్థానమున ప్రవర్తించుచున్నను, అక్షర సమామ్నాయమునందలి ఌకారమునకు దీర్ఘము లేనందున ఋకార దీర్ఘమే వచ్చును వానికి సవర్ణ సంజ్ఞ లేనిచో అది సిద్ధింపదు. ఌకారమనగా దేవత. హోతయొక్క దేవత అని యర్థము.

'ఇందుకొరకు సవర్ణ సంజ్ఞా విధానమక్కర లేదు.

"సవర్ణ దీర్ఘత్వే ఋతి ఋవా వచనమ్" "ఌతి ఌవా వచనమ్" అని రెండు వచనములను, షష్ఠాధ్యాయమునందలి సవర్ణ దీర్ఘ విధాయక సూత్రమునందు వార్తికకారుడే చెప్పనున్నాడు. కావున సవర్ణ సంజ్ఞావచన మనావశ్యకము.

హ్రస్వ ఋకారము పరమయినపుడు, పూర్వపరముల స్థానమున 'ఋ' అను నాదేశము వికల్పముగా వచ్చును ఇది రెండు మాత్రలుకలది. దీని నడుమ రెండు రేఫలున్నవి. వానికొక మాత్ర. ఇటునటు నున్న అచ్ఛక్తి కింకొక మాత్ర మొత్తము రెండు మాత్రలు. ఇది అక్షర సమామ్నాయము నందలి ఋకారమువలె, వివృతముగాదు. ఈషత్ స్పృష్టమిది. కావున, ప్రయత్న భేదముండుటచేత దీనిని 'ఋఌక్' సూత్రము నందలి ఋకారము గ్రహింపదు. అపుడిది అచ్చుకానేరదు అందువలన దీర్ఘ సంజ్ఞ దీనికి ప్రాప్తింపదు. అందువలన "అకస్సవర్ణే దీర్ఘః"— అను సూత్రముచే ప్రాప్తింపని దీర్ఘము నీ 'ఋతిఋవా వచన'మను మొదటి వార్తికము విధించుచున్నది. ఉదాహరణము, హోతృ + ఋకారః = హోతృకారః అనునది. ఈషత్ స్పృష్టమును వికల్పముగుటచే నిది రానపుడు వివృత దీర్ఘముచే 'హోతౄకారః' అని యగును.

రెండవవచనము, 'ఇతి ఌవావచనమ్' అనునది. అందు 'అకస్సవర్ణే' అను సూత్రము నుండి 'దీర్ఘః' అను పదమనువర్తించును. కాగా ఌకారము పరమగు నపుడు హ్రస్వ ఋకారమునకు ఈ వచనముచే 'ఌ' ఏకాదేశమగును. ఉదాహరణము 'హోతృ + ఌకారః = హోతౢకారః' అనునది. ఇది యీషత్ స్పృష్టము దీనినడుమ రెండు లకారములును, నిటునటు నజ్భక్తియుగలదు. కాగా ద్వెమాత్రికము. ఇదియు నప్రాప్తమై విధింపబడునదియే. 'వావచన'మనుచోట వా శబ్దము సముచ్చయార్థకము. అది దీర్ఘమునుగూడ ప్రాప్తి పని దానిని విధించును. కాగా సవర్ణసంజ్ఞావచన మనావశ్యక మని వార్తికఖండనవాది తాత్పర్యము.

ఋ ఌ వర్ణములకు బరస్పరము సవర్ణసంజ్ఞను విధింపకయే ఆ వచన ద్వయమును జెప్పిన, 'దధి + ఌకారః' 'మధు + ఌకారః' అనుచోట, అక్కడయిన ఇకారమునకు ఌకారము పరమయినపుడును, ద్వితీయ వచనము ప్రవర్తింపవలసి వచ్చును. 'అకస్సవర్ణే' అనుసూత్రము నుండి 'ఋగ్బన్నవ్యావృత్తిత్రే అకః' అనునది వార్తికమున ననువర్తించినను, సవర్ణ సంజ్ఞ ఋ ఌ వర్ణములకు లేదుగాన 'సవర్ణే' అను పద మనువర్తింపదు. కాగా. సవర్ణ సంజ్ఞా వచన మావశ్యకమని, సావర్ణ్యమండనవాది.

యీ అతి ప్రసంగమును పూర్వ వార్తికమునందు న్యాసమును మార్చి వారింతునని, ఖండనవాది వాదము.

ఎట్లనగా 'ఋతిఋవావచనమ్' అనువార్తికమునందలి 'ఋతి' అనుసప్తమ్యంతపదమును 'ఋతః' అని షష్ఠ్యంతమునుగా మార్చెదను. ఆ 'ఋతః' అనునది రెండవ వచనములోని కనువర్తించును. కాగా ఋకారమునకు ఌకారము పరమగు నపుడే అది ప్రవర్తించును. 'హోతృ + ఌకారః' అను దశలో. ఈషత్ స్పృష్ట ఌకారమొకపర్యాయమును, వివృత ఋూకారమొక పర్యాయమును సవర్ణ సంజ్ఞ లేకున్నను సిద్ధించును.

సవర్ణ సంజ్ఞను విధించిన, పూర్వవార్తికద్వయమును జెప్పనక్కర లేదుగదా. ఒక సవర్ణ సంజ్ఞా వచనము చేత రెండు వచనములు చెప్పనక్కర లేని లాఘవము లభించును.

ఋ, ఌ, అనునివి రెండును దీర్ఘములు. అందు ఋకారమునకు ఋకారము పరమగు నపుడు 'ఒకసారి 'ఋ' వచ్చును. ఇంకొకసారి ఋదీర్ఘము వచ్చును. అట్లే ఌకారము పరమగునపుడు ఒకసారి 'ఌ'కు ఆదేశమును, ఇంకొకసారి వివృతదీర్ఘమును సిద్ధించును కాగా సవర్ణ సంజ్ఞావచనమే లాఘవాను గృహీతము.

సవర్ణ సంజ్ఞా వచన మున్నను పూర్వ వచనద్వయకథనమవర్జనీయము. ఉ, ఊ, ఊ౩ అ కాలము వంటి కాలముగలది అచ్చయిననే గదా క్రమముగ

హ్రస్వము, దీర్ఘము, ప్లుతము అను సంజ్ఞలను బొందునది. ఈషత్ స్పృష్టముల యిన, ఋ, ఌ అనునవి రెండును అచ్చులు కావు. అక్షరసమామ్నాయము నందలి ఋ ఌ వర్ణములు వివృతములు. కాగా సావర్ణ్యములేనందున దీనినయ్యావి గ్రహింపవు. కావున నావచనద్వయ మావశ్యకమేయని సావర్ణ్య ఖండనవాది వాదము.

ఇక సావర్ణ్య మండన వాది యిట్లు వాదించును. ఈషత్ స్పృష్ట ఋకార ఌకారములకు. "ఇవి అచ్చులు" అని అచ్త్వమును గూడ జెప్పెదను. కాగా వానికి దీర్ఘసంజ్ఞ సిద్ధించును. దీర్ఘములుగాన, "అకస్సవర్ణేదీర్ఘః" అను సూత్రము చేతనే యవియు సిద్ధింపవచ్చును. వచనద్వయ మనావశ్యకము.

ఆ వచనములున్నను, తద్విధేయముల కచ్త్వము కొరకు వర్ణసమామ్నాయమున వానికి పాఠమును నావశ్యకమగును. లేనిచో వానికి విధానమాత్రమే సిద్ధించును గాని అచ్కార్యమైన ప్లుతము లభింపదు ప్లుతివిధాయకము లందు, సూ॥ "అచశ్చ"(1 2.28) అను పరిభాష అపస్థితమగును గదా. కాగా వానికయోగవాహములందు పాఠముకర్తవ్యము ప్లుత సంజ్ఞయు, ప్లుతాదేశమును అచ్చుకే వచ్చును. అచ్త్వ ముండిన నవి రెండును త్రిమాత్రికములను గూడ గ్రహించును గాన వానికి ప్లుతమును, ప్లుత సంజ్ఞయు సిద్ధించును. ఉదాహరణములు హోతృ (3) కారః, హోతౢ (3) కారః అనునవి.

అభీష్ట రూప సిద్ధి పక్షద్వయమును దుల్యమేగదా. అట్టియెడ, సవర్ణ సంజ్ఞా వచనమా? పాఠ్య వార్తికద్వయ స్వీకారమా యుక్తతరమగును ?

ఋ ఌ వర్ణములకు సవర్ణ సంజ్ఞా వచనమే న్యాయ్యము. వచన ద్వయాశ్రయగుణములో గౌరవము స్పష్టము, దీర్ఘత్వ సిద్ధియేగాక, ఫలాంతరము కూడ సవర్ణ సంజ్ఞావచనమునకు గలదు. ఋ కారము గ్రహింపబడిన చోట, చత్సవర్ణమగు ఌకారమును గ్రాహక శాస్త్రముచే గ్రహింపబడును.

'ఖట్వ + ఋష్యః' 'మాల+ఋష్యః' అను స్థలములందు, 'ఋత్యకః' (6-1-128) అని ప్రకృతిభావము ఋకారము పరమగునపుడు ప్రవర్తించినట్లు, 'ఖట్వ+ఌకారః' మాల+ఌకారః అను స్థలమునగూడనయ్యది సిద్ధించును.

అట్లే "వాసుప్యాపిశలేః" (6-1-92) అనువృద్ధి వికల్పము 'ఉప+ఋకారీయతి = ఉపార్కారీయతి' అనుచోటువలె, 'ఉప + ఌకారీయతి = ఉపాల్కారీయతి అను చోటను సిద్ధించును.

అట్లైనా "ఉరణ్రపరః" (1-1-51) అను సూత్రముచే ఋకారస్థానమున విధింపబడుచున్న అణ్ణు రపరమయినట్లు, ఌకార స్థానికమునకుగూడ పరత్వము ప్రాప్తించిన దోషముకాదా ? అనిన

ౡకారస్థానమున వచ్చు దానికి ల పరత్వమును చెప్పెదను. అట్లు చెప్పుట ఆవశ్యకముగూడ నగుచున్నది. "ఉరణ్రపరః" (1-1-51) అనుచోట, ఋౡ వర్ణములకు సవర్ణసంజ్ఞలేని పక్షమున, 'ఉః' అనిన జాలదు. ఉః అనిన 'ఋకారము స్థానమున' అనియే యర్థమగును. అపుడు ౡకార స్థానమునవచ్చెడు అణ్ణుగూడ రపరమగునని చెప్పవలసియుండును. అపుడది విధ్యర్థమగును, సవర్ణ సంజ్ఞవానికి గలదను పక్షమున, ౡకారస్థానికమునకు గూడ రేఫ పరకత్వమును సాధించుట అవచనమునకు ప్రయోజనమగును.

సవర్ణ సంజ్ఞావాదమున నొకయాక్షేపము.

"రషాభ్యాం నోణస్సమానపదే" (8-4-1) అనునది ణత్వవిధాయకము. 'మాతౄణామ్' 'పితౄణాం' అనుచోట ణత్వము సిద్ధించుట కాసూత్రమున 'ఋవర్ణాన్నస్యణత్వం వాచ్యమ్' అని వార్తికము పఠింపబడినది. 'క్లృప్త మానం పశ్య" అనుచోటుగూడ నిపుడది ప్రాప్తించుచున్నది. దాని నెట్లు వారించుట అనిన,

సవర్ణ సంజ్ఞ లేని పక్షముననైనను, 'ప్రక్లప్తమానం పశ్య' అను లక్ష్యమున, "కృత్యచః" — అని విహితమైన ణత్వమేలరాలేదు ?

"చుటుతుల శర్వ్యవాయేన" అనియో, "త్రిభిశ్చ మధ్యమై ర్వర్గై ర్లశసై శ్చవ్యవాయేన" అని చెప్పబోవుదునుగాన రాలేదు. చవర్గ, టవర్గ, తవర్గములలోని వర్ణములతోడను, లకార శ, స సవర్ణములతోడను వ్యవధానమున ణత్వమురాదని వార్తికార్థము. వర్ణైకదేశములు వర్ణగ్రహణముచే గ్రహింపబడును. కావున ౡకారాంతర్గత మగులకారముతో వ్యవధానముండుటవలన 'క్లృప్యమానమ్' అనుచోగాని, ప్రక్లృప్యమానమ్, అనుచోగాని ణత్వము ప్రాప్తింపదు.

సిద్ధాంతోపసంహారము

వర్ణైకదేశములుగూడ స్వతంత్ర వర్ణములుగా గ్రహింపబడునను పక్షమున వేరొకలాఘవమును గలదు.

"రషాభ్యాం నోస్సమానపదే" (8-4-1) అను ణత్వ విధాయకమునందు, ఋవర్ణాన్నస్య ణత్వం వాచ్యమ్" అని చెప్పనక్కరలేదు. మాతౄణామిత్యాదులందు ఋకారైకదేశమగు రేఫను నిమిత్తముగ నాశ్రయించి, ణత్వమును సాధింపవచ్చును. కాబట్టి ఋౡవర్ణములకు సవర్ణ సంజ్ఞావిధానము సమర్థనీయమే అని స్పష్టము. ఆ రెండు వర్ణములును బహుస్వరము సవర్ణములైనను, కొన్ని ధాతువులందు ఋకారమును, 'గమ్లు'మున్నగు మరికొన్ని ధాతువులలో ౡకారమును అనుబంధములుగ నిర్దేశించుటవలనను, ఋదిత్తులను ౡదిత్తులను భిన్నభిన్నముగ గార్య విధాయకములందు గ్రహించుటవలనను, అనుబంధ ప్రయుక్త

కార్యములందు పరస్పర గ్రహణరూపమగు నాపత్తికవకాశములేదు. కావున కార్య సంకరము ప్రసక్తముగాదు. కార్యసంకరమన, ఋదిత్త్వ ప్రయుక్తమగు "నాగ్లోపిశాస్వృదితామ్" (7-4-2) అని విధింపబడిన ఉపధాహ్రస్వనిషేధము మున్నగు వానికిని, ఇదిత్త్వ ప్రయుక్త కార్యములగు "పుషాదిద్యుతాది ఌదితః పరస్మైపదేషు" (3-1-55) అని విధింపబడిన అఙాదులకును, ఓణృ, గమ్లు మున్నగు ధాతువులందు సాంకర్యము కలుగదు అని తాత్పర్యము

"తుల్యాస్య ప్రయత్నం సవర్ణమ్"

"నాజ్ఝలౌ"

రెండు వర్ణములు తుల్యములయిన స్థాన ప్రయత్నములు గలవయినను; అందొకటి అచ్చును, ఇంకొకటి హల్లును నయిననవి సవర్ణ సంజ్ఞ కలవికావు అని సూత్రార్థము.

రెండు శకారములు పరస్పరము సవర్ణములగునా కాదాయను విచారము.

వా "అజ్ఝలోః ప్రతిషేధే శకార ప్రతిషేధోఽ జ్ఝల్త్వాత్"

తత్ర సవర్ణలోపేదోషః"—అనునది ఆక్షేప వార్తికము.

అచ్చులకును హల్లులకును బరస్పరము సవర్ణ సంజ్ఞ నీసూత్రము ప్రతిషేధించుచున్నది. కాగా శకారద్వయమునకును బరస్పరము సవర్ణ సంజ్ఞా. ప్రతిషేధము ప్రాప్తించుచున్నది. శకారమచ్చును, హల్లును గూడనగుట దానికి కారణము శకారయోః ప్రతిషేధః = శకార ప్రతిషేధః॥

శకారమచ్చెట్లగును ? ఇకారమచ్చు గదా. శకారము దానితో సమానమగు స్థానమును కరణమును గలది. కావున నది సవర్ణ గ్రాహక శాస్త్రముచే శకారమును గూడ గ్రహించును. ఆ విధముగనది అచ్చులగును. హల్లులందుప దేశింపబడినది గాన హల్లుగదా.

ఇకారశకారములు సమాన స్థాన ప్రయత్నకములయినను, దానికి సవర్ణ సంజ్ఞనీసూత్రమే నిషేధించుచున్నది గదా. అట్టియెడ నికారము శకారమునెట్లు గ్రహించును ? దానికచ్చుత్వమెట్లు కలుగును ? అని ప్రశ్నింపవచ్చును. <u>ఒకదాని యందే విషయత్వమును విషయిత్వమునుమండవు</u>. కావున నీసూత్రమువనే, తన వాక్యార్థబోధ సంపన్నము కాక పూర్వము, పదార్థోపస్థితి వేళలోనే తాను ప్రవర్తించి, ఇకారశకారములను సావర్ణ్యమును నిషేధింప జాలదు. వాక్యార్థ నివృత్త్యనంతరము 'యస్యేతిచ' (6-4-148) ఇత్యాదులందివి ప్రవర్తించి, ఇకారమునకును శకారమునకును పరస్పర సావర్ణ్యమును నిషేధించును. కావున నిట పూర్వ సూత్రముచేత నికార శకారములు సవర్ణములగును. శకారమును నికారము గ్రహించును గాన నది యచ్చగును,

శకారద్వయమునకు ఖరస్పర సావర్ణ్యము నిషేధింపబడిననేమి దోషము ?

"తత్ర సవర్ణలోపేదోషః"—వార్తిక శేషము. అపుడు సవర్ణలోప విష యమున దోషము ప్రాప్తమగును. "పరశ్శతానికార్యాణి" అను వాక్యము నందు, 'పరశ్శతాని' అను పదమునందు, "ఝరోఝరి సవర్ణే" (8-4-65) అను సూత్రము చేత, శకారపరక శకారమునకు లోపము రావలసినది రాకపోవును "శతాత్పరాణి పరశ్శతాని". పారస్కరాది గణపాఠమువలన సుడాగమము కాగా, 'పరస్ శతాని' అని యగును. సకారమునకు శ్చుత్వముచే శకారాదేశము. దానికి "అచచిచ" (8-4-47) అనిద్విత్వము ఇట్లేర్పడిన మూడు శకారములలో, మధ్య శకారమునకు, "ఝరోఝరి సవర్ణే" (8-4-65) అని లోపము రావలెను శకారమునకు శకారము సవర్ణము కానందున లోపము రానిచో మూడు శకా రములు వినబడవలసి వచ్చును.

వా॥ "సిద్ధమనచ్త్వాత్"—అని సమాధాన వార్తికము. శకారలోపము సిద్ధమగును. ఎట్లనగా నది అచ్చుకాదు. అచ్చు కాకుండుట యెట్లు? అచ్త్వ ముపపాదింపబడినదిగదా యనిన, ప్రయత్న భేదముచే అచ్చులకును హల్లులకును సవర్ణ సంజ్ఞా ప్రాప్తియే లేదు. ఇకారము శకారమును గ్రహించు ప్రసంగమే లేదు. ప్రయత్న భేద మెట్లనిన జూపుదు.

"స్పృష్టంకరణం స్పర్శానామ్"
"ఈషత్ స్పృష్ట మన్తస్థానామ్"
"వివృత మూష్మణామ్"

"స్వరాణాంచ"—అనునవి నాలుగును శౌనక ప్రాతి శాఖ్య సూత్ర ములు. ఇందు మూడవ సూత్రమగు "వివృత మూష్మణామ్" అను సూత్రము లోనికి, రెండవ సూత్రమునుండి ఈషత్ అను పదమనువర్తించును. 'స్వరా ణాంచ' అను సూత్రమున నివర్తించును. కాగా ఊష్మవర్ణములకు ప్రయత్నము ఈషద్వివృతమును, స్వరములకు వివృతమునగుటచేత నికార శకారములకు సావర్ణ్య ప్రసక్తియే లేదు కాగా శకారమచ్చుగాదు. సావర్ణ్య నిషేధము లేదు. 'ఝరోఝరి' అను లోపమునకు, 'పరశ్శతాని' అను స్థలమునందెట్టి ప్రతి బంధమును లేదు.

వా॥ "వాక్యాపరిసమాప్తేర్వా"—అని సమాధానాంతరము. వాక్యాపరి సమాప్తి వలననైననిది సిద్ధించునని వార్తికార్థము. వాక్యాపరిసమాప్తి వలన ననగానేమి ?

వర్ణజ్ఞానముకొరకు వర్ణోపదేశము ప్రథమ కర్తవ్యము. ఉపదేశము వలన జ్ఞాతములయిన వర్ణములకు,పిదప, ఇత్సంజ్ఞావిధానము. "ఆదిరన్త్యేన సహేతా" (1-1-71) అను సూత్రముచే, ఇత్సంజ్ఞా విధానమునకు దరువాత ప్రత్యాహారము. ప్రత్యాహారోత్తర కాలమున ప్రవర్తించునది సవర్ణ సంజ్ఞ కలదియని తెలిసిన

పిదప, "అణుదిత్సవర్ణస్యచాప్రత్యయః" (1-1-69) అను సూత్రము, అకారాదులు, తమకు సవర్ణములుగా జ్ఞాతములయిన వానిని గ్రహించునని బోధించును. ఇట్లు వాక్యము సముదితమైన పిదప, ఉపదేశాదుల కంటె భిన్నములగు స్థలములందు సవర్ణములకు గ్రహణము కలుగును. కనుకనిట అనగా "నాజ్ఝలౌ" (1-1-10) అను సూత్రమునందు ఇకారము శకారమును గ్రహింపదు. ఈ సూత్రము నకు వాక్యార్థబోధ కలిగిన పిదప నిది సవర్ణ సంజ్ఞాపవాదమని తెలియును. అపుడు దీనికి విషయమయిన వాటిని వదిలిపెట్టి, ఇష్ట విషయమున సవర్ణ సంజ్ఞా శాస్త్రము ప్రవర్తించును. తదుత్తర "మీ వర్ణములు పరస్పరము సవర్ణములగును." అను నిశ్చయాత్మక జ్ఞానము కలుగును. అట్టి జ్ఞానమే లక్ష్య సంస్కారోప యోగి. అది వాక్యార్థము నిష్పన్నమయిన తరువాత కలుగునుగాని పదార్థబోధ కాలమునగలుగదు.

వాక్యాపరిసమాప్తి యనగా వాక్యార్థమసలే కలుగకుండుటగాదు, ఈయా వర్ణములు సవర్ణములను నిర్ణయము కలుగనపుడు. సవర్ణగ్రహణమును బోధించుట కసమర్థమగుటయే వాక్యాపరిసమాప్తి. సవర్ణ గ్రాహక సూత్రమగు "అణుదిత్స వర్ణస్యచా ప్రత్యయః" (1-1-69) అను దానికంగములు, ఉపదేశము ఇత్సంజ్ఞ, ప్రత్యాహారము, సవర్ణ సంజ్ఞ—అనునివి నాలుగును నిష్పన్నములైన వెనుక నా సూత్రము. "అస్య చ్వౌ"(7-4-32) ఇత్యాదులందు ప్రవర్తించును. అంగములైన ఉపదేశాదులందు గాని, అంగియగుదనయందేగాని, అనగా గ్రాహక సూత్రము నందే గాని యది ప్రవర్తింపదు. కారణము వాక్యార్థాపరిసమాప్తి. సవర్ణ సంజ్ఞా విధాయకమగు తుల్యాస్య సూత్రమును, దన్నిషేధకమగు 'నాజ్ఝలౌ' అనునదియు గలసి యొకటే అంగము. కాబట్టి 'నాజ్ఝలౌ' అను నీ సూత్రమున గ్రాహక శాస్త్రము ప్రవర్తింపదు.

అటులైన ఇకారము శకారమును గ్రహింపనట్లు, ఈకారమును గూడ గ్రహింపకపోవునే ? అయిననేమి దోషమనిన,

'కుమారీ+ఈహతే' అని సవర్ణదీర్ఘము రావలెను. "అకః సవర్ణే దీర్ఘః" (6-1-101) అను సూత్రము నందలి అక్ప్రత్యాహారబోధ్య వర్ణ ఘటకమగు ఇకారముగూడ, "నాజ్ఝలౌ" (1-1-10) అను సూత్రమునందలి అచ్ప్రత్యాహార ఘటకవర్ణమగు ఇకారము స్వసవర్ణములను గ్రహింపనట్లు, తనసవర్ణమైన ఈకారమును గ్రహింపనియెడల సవర్ణ దీర్ఘము రాకుండెడిది. అది దోషము అనిన, ఇది దోషముగాదు.

'అకస్సవర్ణేదీర్ఘః' (6-1-101) అనుచోట, అక్పరముచే బోధ్యమగు ఇకారము, ఈకారమును గ్రహించును. శకారమును గ్రహింపదు. ఏలయన, ఆ సూత్రము వాక్యార్థబోధ సమయమునకు వాక్యపరిసమాప్తికలదు. ఉప

దేశాదులవలె నది గ్రహణక శాస్త్రాంగముకాదు. కాగానట గ్రాహకశాస్త్ర ప్రవృత్తి అప్రతిహతము అని భావము.

## వార్తికములకు వ్యాఖ్యానాంతరము

వా॥ "అజ్ఝలోః ప్రతిషేధే శకార ప్రతిషేధో ఝల్త్వాత్"

అని ఆక్షేపవార్తికము. దానికి సమాధానముగ,

వా॥ "సిద్ధమ నచ్త్వాత్" "వాక్యాపరి సమాప్తేర్వా" అని రెండు వార్తికములు పఠింపబడినవి.

రెండు ఇకారములు పరస్పరము సవర్ణములు కానిచో 'పరశ్శతాని కార్యాణి' అను వాక్యమునందు 'పరశ్శతాని' అను పదమునందు సవర్ణలోపము విషయమున దోషము ప్రాప్తించును' అని ఆక్షేపించి, శకారమున అచ్త్వము లేనందున నీ దోషము తగలదు అని సమాధానము చెప్పఁబడినది. అచ్త్వ కాందులకు లేదనిన, ప్రయత్న భేదముచే సావర్ణ్యములేనందున లేదు. కాగా నిషేధము ప్రవర్తింపదు. శకారములు మిథస్సవర్ణములు కావచ్చును. ఉత్తమధ్య శకారమగు "పరశ్శతాని" అను రూపము సిద్ధింప వచ్చును అనిచెప్పి, వాక్యాపరిసమాప్తిన్యాయము చేతనయినను నిది సిద్ధించునని యింతవరకు వ్యాఖ్యానింపబడినది.

అనచ్త్వమునకు సాధకము ప్రయత్న భేదముగాదు. వాక్యాపరిసమాప్తియే అని వ్యాఖ్యానాంతరము.

సాధ్యమొకటియైనపుడు హేతువులకు వికల్ప ముపపన్నమగును. ఇట సాధ్యములు రెండు సిద్ధికి. అనచ్త్వము హేతువు. అవచ్త్వమునకు వాక్యాపరి సమాప్తి హేతువు. అట్టియెడ, "వాక్యాపరి సమాప్తేర్వా" అని 'వా' అను వికల్పార్థ కావ్యయమెట్లు సమర్థింపబడును ?

అనిన నదియు సమర్థితము కావచ్చును. ఎట్లనిన,

శకారమునకు శకారముతో సావర్ణ్యముండనిమ్ము లేకున్న బోనిమ్ము. లేకున్నబోనిమ్మనిన, ఇకారముచే శకారమునకు గ్రహణము కలిగిన గలుగ నిమ్మనియర్థము.

వా శబ్దము ప్రతిజ్ఞా వికల్పార్థకమనుట.

అట్లైన 'నాజ్ఝలౌ' (1-1-10) అను నిషేధముచే శకారములకు పరస్పర సావర్ణ్యము లేనిచో 'పరశ్శతాని కార్యాణి'అనుచో "ఝరోఝరి సవర్ణే" (8-4-65) అని లోపము సిద్ధింపక పోవునంటి రే ?

లోపము రాకున్న నేమగును ? లోపము వచ్చిన రెండు శకారములుగల రూపమును, రాకున్న మూడు శకారములు గలదియగును. ఇట్లు భేదమేర్పడునుగదా. ఉచ్చారణమున విశేష మగపడకున్నను, శ్రుతికృతమగు భేద మపరిహార్యము

భేదమురాదు. లోపము రాకున్నను ద్విశకారకమేయగును. ఎట్లనగా- ద్విర్వచనము వికల్పముగదా

అయినను భేదముతప్పదు. లోపమురాని పక్షమున నొకప్పుడు రెండు శకారములుగల రూపమును, వేరొక పర్యాయము మూడు శకారములుగల రూపమునగును.

లోపము వచ్చినపుడు ద్విశకారకమే గదా.

అది యెందుకు భేదముకాదు, భేదమే.

లోపము నిత్యమైనచో నది భేదమే యనుకొనుడు. లోపము వికల్పము గదా. కాగా భేదము లేదనుట.

సరి. ఎట్లయిన భేదముకలుగకుండునో అట్లుకానిమ్ము. ద్విర్వచనము వికల్పము. లోపమును వికల్పమే.

కనుక భేదము లేదనుట.

"నాజ్ఝలౌ"

"చతుర్థాహ్నిక వివర్తము సమాప్తము"

# పంచమాహ్నికము

## "ప్రగృహ్యసంజ్ఞాప్రకరణము"

సూ॥ "ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్" (1-1-11)

'ఈ కార, ఊకార, ఏ కార ములంతమందు గల ద్వివచనము ప్రగృహ్య మను' సంజ్ఞ కలదియగును అని సూత్రమున కర్థము.

ఈత్, ఊత్, ఏత్— అని యిట్లు తకార పరకములైన ఈ కారో కారో కారముల కని యెందులకు ప్రగృహ్య సంజ్ఞ చెప్ప బడవలెను అని ప్రశ్న, ఈ కార ఊ కారములను, తపరములను గానుచ్చరింట భిన్నకాలములయిన వారికి గ్రహణమును వారించుటకు గావలెను. లేదా గుణాంతర యుక్తములను గ్రహించుటకైన గావలెను. ఈ కారమును, ఊ కారమును, అక్షరసమామ్నాయిక ములు కావుగాన నణ్త్వము లేనందున సవర్ణ గ్రహణ ప్రసక్తియే లేదు. కాగా భిన్నకాల వ్యావృత్తికి, తపరకరణము కాదు.

ఇక తపర సూత్రములోనికి పూర్వ సూత్రము నుండి అణ్ -ను పద మనువర్తింపదు గాన అణ్ణులు కానివైనను తత్కాలములగు వాని సవర్ణములను గ్రహించుటకు, తపరకరణ మందు నూ యదియు ననావశ్యకమే. ఉదాత్తాదులు భేదకములు కావని సిద్ధాంతము గదా ? అపక్షమున వానికి గ్రహణము సిద్ధమే యగును.

ఇక జాతి పక్షమున తపర సూత్రము నియమార్థము గాన భిన్న కాలము లగు వర్ణములను వ్యావర్తించుటకై తపరకరణ మందురా ? ఏ భిన్న కాలముల వ్యావృత్తికి ? దీర్ఘోచ్చారణ రూపమగు నధిక ప్రయత్నమువలన హ్రస్వములకు సంజ్ఞా ప్రాప్తిలేనే లేదు. ప్లుతములకు గ్రహణ మిష్టమేయాయె. కాగా నీతపర కరణమెందులకు చేసినట్లు ? అని ప్రశ్న తాత్పర్యము.

"తపరస్తత్కాలస్య" (1-1-70) అను సూత్రముచే, తత్కాల సవర్ణము లను గ్రహించుట కీతపరకరణము చేయబడినదని సమాధానము వేనికి ? ఉదా త్తానుదాత్తస్వరితములకు.

గుణములు అభేదకములు కావు. భేదకములే అందువలన నుదాత్తాదులను సంగ్రహించుటకు, తపరోచ్చారణ మీ కారోకారముల విషయమున నావశ్యకము. ఏకారము అణ్ణేకాబట్టి యట సవర్ణ గ్రహణము అణుదిత్సూత్రము చేతనే సిద్ధిం

చును. కాగా తత్కాల సవర్ణగ్రహణ రూపమగు ప్రయోజనము తపరకరణము నకు గలదని సమాధానతాత్పర్యము.

వా॥ "ప్లుతానాంతు ప్రగృహ్యత్వాప్రసంగోఽతత్కాలత్వాత్" అని యాక్షేపవార్తికము.

ప్లుతములైన, ఈ, ఊ, ఏ లు, తత్కాలములు కావు గాన, వానికి ప్రగృహ్య సంజ్ఞ ప్రాప్తింపకున్నది. ప్లుతములు త్రిమాత్రికములు తత్కాల ములు కావుగదా. 'ఈకారోకారములు వ్యక్తి పక్షమున, ద్విమాత్రికములకే బోధకములు' అను నాక్షేపమునకు,

"ప్లుతములును తత్కాలములే యగును. ఎట్లన ప్లుతము సిద్ధమగును. అంతరంగత్వము వలన ప్లుతము ప్రవర్తించి, ద్విమాత్రికములు త్రిమాత్రికము లయినను, ప్లుత విధాయకశాస్త్రమునకే, పూర్వత్రాసిద్ధమ్ (8-2-1) అను సూత్రము చేత నసిద్ధత్వము బోధింపబడుటవలన నయ్యది పవర్తించిన దను బుద్ధియే కలు గదు. కాన త్రిమాత్రికమునందును నిది ద్విమాత్రికమే యను భావన కలుగును అందు వలన వానికి ప్రగృహ్య సంజ్ఞ సిద్ధింపవచ్చును. అసిద్ధత్వ వచనమునకు, స్థాన్యాశయములగు కార్యములు సిద్ధించుట ఆదేశాశ్రయ కార్యములు నివర్తించుటయునేగదా ప్రయోజనము." "షత్వతుకో రసిద్ధః" (6-1-8 ) అను సూత్రమునందు వార్తికాచార్యుడే "అసిద్ధవచనముత్సర్గ లక్షణభావార్థ మాదేశ లక్షణ ప్రతిషేధార్థంచ" అని చెప్పను. అని సమాధానము రాగా, ఆక్షేప్త తన యాక్షేపమునకు సాధకముగ స్వాభిప్రాయమును,

"ప్లుతమసిద్ధముగాదు. స్వరసంధుల విషయమున నది సిద్ధమే" అని వివ రించును,

స్వరసంధుల విషయమున ప్లుతము సిద్ధమేయగునని యెట్లు? "ప్లుతః ప్రకృత్యా" 'ప్లుతము ప్రకృతి భావమును బొందును' అని ప్లుతమునకు ప్రకృతి భావమును శాసించుట యందులకు జ్ఞాపకమగును.

అదియెట్లనిన,— కార్యిఉండిన గదా కార్యము ప్రవర్తించునది ? ప్లుతము అసిద్ధమయిన యెడల నది ప్రకృతిభావమును బొందునని చెప్పుటయే పొసగ గదు. ప్లుతమును కార్యిగా నాశ్రయించుట వలననే, అదియసిద్ధము కాదని యను మానింపవచ్చును. ఈ సిద్ధత్వము ప్రకృతి భావ విషయమున మాత్రమేగాక సామాన్యముగ స్వరసంధి ప్రకరణ విషయముగ జ్ఞాపన చేయబడును.

ప్రకరణమనగా నుత్సర్గాపవాదములతో గూడినదిగాన ప్రకృతిభావము స్వర సంధి ప్రకరణస్థముగాదే యను శంకకవకాశము లేదు. ప్లుత ప్రకృతి భావమున కుత్సర్గము సంధికార్యము. తదపవాదము ప్రకృతిభావము. కావున

ప్రగృహ్యత్వహేతుక ప్రకృతి భావ విషయమున గూడ ప్లుతమునకు సిద్ధత్వము చెప్పబడును.

ప్రకృతి భావ సూత్ర విషయముననే గాక, స్వరసంధి ప్రకరణ విషయముగ సిద్ధత్వ జ్ఞాపనమున కేమి ప్రయోజనము? అనిన, లాఘవము ప్రయోజనము "అతోరోరప్లుతాదప్లుతే"(6-1-113) అను నుత్వ విధాయక శాస్త్రమున 'అప్లుతాత్' 'అప్లుతే' అను పదములు రెండును అకర్తవ్యములే జ్ఞాపకము వలన నగును. అట్టి లాఘవము లభించుటయే ప్రయోజనము. అది యెట్లన "ఏహి సుస్రోత౩ర్ అత్రస్నాహి"—అను వాక్యమున సుస్రోతశ్శబ్దమునందలి తకారాకారము ప్లుతము. ప్లుతము కాని అత్తునకు పరమైనరు స్థానమున ఉత్వము విధింపబడుచున్నది. ఇది ప్లుతమగుటచే నిట ఉత్వమురాదు. అయిననొక శంక కలదు. అత్తనగా నేకమాత్రికము గదా, ప్లుతము త్రిమాత్రికమాయె అది 'అత్తు' ఎట్లగును? దీనికి సమాధానము, ప్లుతమైనను నా ప్లుతమసిద్ధమగుటచే నది 'అత్తు' అగును అని చెప్పబడుచున్నది. ఇపుడీ అసిద్ధత్వాభావ జ్ఞాపనము వలన, అత్తుకంటె పరమగుట యనునదియే లేదు గాన నుత్వమునకు ప్రసంగమే లేదు. కాగా 'అప్లుతాత్' అను విశేషణముతో పనిలేదు.

'తిష్ఠతు పయ ఆశిగ్నిదత్త' అనుచోట గూడ ప్లుతము సిద్ధమగుటచే అత్పరకత్వమే లేనందున ఉత్వ ప్రాప్తికి ప్రసంగమే లేదు. కావున, 'అప్లుతే' అను సప్తమ్యంతమును అనావశ్యకము. ఇది లాఘవము.

స్వరసంధి విషయమున ప్లుతము సిద్ధమైననేమి లాభము? సంజ్ఞా విధి విషయముననది అసిద్ధమే గదా. అందువలన ప్లుతములు తత్కాలములే యగును. సంజ్ఞలును, పరిభాషలును తమతమ స్థానములందుండియే కార్యకరములగును. స్వస్థానమును వీడకయే ప్రధానోపకారకములగును. కావున ప్రగృహ్య సంజ్ఞ స్వరసంధి మధ్యస్థము కానేరదు గదా యనిన, సంజ్ఞా విధి విషయమునను నది సిద్ధమే.'

అది యెట్లనిన సంజ్ఞాపరిభాషలు కార్యకాలములు. అనగా నాయా కార్యములు వానిని స్వస్థానమున కాకర్షించి వానివలన నుపకారమును బొందును 'ప్రగృహ్యము ప్రకృతి భావము నొందును' అను విధి ప్రదేశమున, 'ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్' అను సంజ్ఞాశాస్త్రము ముపస్థితమగును. అదియే యుక్తము. సంజ్ఞాపరిభాషలు,అంగములు అప్రధానములు. విధులు ప్రధానములు. విధ్యర్థములగు సంజ్ఞాపరిభాషలు విధి దేశీయములగుట న్యాయ్యము గానట్టి, ప్రధానముతో నేకవాక్యతనొందిన సంజ్ఞాసూత్రము గూడ నా ప్రకరణము నందలిదే యగును.

ప్లుతమునకు ప్రగృహ్యసంజ్ఞ అనలెందులకు ? అది ప్రగృహ్యము కాకున్నను ప్రకృతిభావము సిద్ధించును గదా ?

ప్రగృహ్యాశ్రయమగు ప్రకృతి భావము కొరకు. అని సమాధానము అది లేకున్ననేమి ? ప్లుతాశ్రయ ప్రకృతి భావము సిద్ధించును గదా ?

అని కుదురదు. ఉపస్థితము పరమయినపుడు దోషము వచ్చును. "అప్లుతవ దుపస్థితే" (8.2.107) అని సూత్రము. ఉపస్థితమనగా వైదికము గాని 'ఇతి' అను శబ్దము. అది పరమగునపుడు ప్లుతము అప్లుతము వంటి దగును - అని సూత్రార్థము. ఆ సూత్రమున వార్తికాచార్యుడు, "వద్వచనం ప్లుత కార్య ప్రతిషేధార్థమ్ ప్లుత ప్రతిషేధే హి ప్రగృహ్య ప్లుతషేధ ప్రసంగోఽస్యైవ విహితత్వాత్"- అని పఠించును.

ఆ సూత్రముచే ప్లుత ప్రతిషేధము చేయబడదు. అట్లయిన వేరొక విధిచే విధింపబడుట వలన ప్రగృహ్య ప్లుతమునకు శ్రవణము ప్రతిషేధింపబడ వలసి వచ్చును కనుక ప్లుత కార్యమే ప్రతిషేధింపబడును. 'వత్' అనుట అందు కొరకే. ప్లుతమైనను అప్లుత కార్యములను బొందును అనియే యర్థము అగ్నీ 3+ఇతి అనుచోట 'అగ్నీ' అనునది ఈ కారాంత ద్వివచనమగుటచేత ప్రగృహ్యము. ఆ ఈకారము "దూరాద్ధూతేచ" (8.2.84) అని ప్లుతము అచట ప్లుతాశ్రయ ప్రకృతి భావము అప్లుతవద్భావముచే బాధితమైనను, ప్రగృహ్యాశ్రయ ప్రకృతి భావము సిద్ధి పవలెను.

ఇటువంటి స్థలములందును ప్రగృహ్యాశ్రయ ప్రకృతివద్భావము ప్రవర్తించినచో, అప్లుతవద్భావబోధిత ప్లుతాశ్రయ ప్రకృతి భావమునకు విషయమేమగును ? అని ప్రశ్న కలుగును కాని దానికి 'దేవదత్తా 3 + ఇతి = దేవదత్తేతి' - మున్నగునవి విషయము కావచ్చును.

ప్రగృహ్యాశ్రయ ప్రకృతి భావమునకు గూడ అప్లుతవద్భావముచే నివృత్తి యేల గలుగదనిన, సూత్ర మొక్కటియే యయినను లక్ష్యమునుబట్టి యది భేదించును. కాగా నది యన్యవిహితమగునని 'వద్వచనమిత్యాది పఠిష్యమాణ' వార్తికమున కర్థము.

పోనిండు. తపరములు కాని దీర్ఘములకు ప్రగృహ్య సంజ్ఞను విధించిన నేమి? అట్లయినను ఏకార మొక్కటియే అణ్ణుగాన సవర్ణములను గ్రహించునుగాని ఈకార ఊకారములు గ్రహింపక పోవును. ఎందులకనగా నవి అణ్ణులు కావుగదా. సూత్రమునందు దీర్ఘములను గ్రహించుటవలన హ్రస్వములకు ప్రగృహ్య సంజ్ఞ ప్రవర్తించవనట్లే, దీర్ఘోచ్చారణ సామర్థ్యమువలన, విశిష్ట వ్యక్తిగతమగు నాకృతియే గ్రహింపబడును. జాతి పక్షమునవైనను, వ్యక్తి నుచ్చరింపకుండగ జాతి నిర్దేశము పొసగదు గనుక వ్యక్త్యుచ్చారణ మవర్జనీయము.

హ్రస్వ వ్యక్తి నుచ్చరింపక, గురువగు దీర్ఘ వ్యక్త్యుచ్చారణమువలన నా వ్యక్తి విశేషణమే యగునుగాని ఉపలక్షణము కాదు. కాగా దీర్ఘ వ్యక్తిగత జాతియే గ్రహింపబడును. అధిక కాల వ్యక్తిగత జాతికి గ్రహణము కలుగదు. అందు వలన ప్లుతములైన సవర్ణములకు గ్రహణము సిద్ధింపదు.

పోనిండు. తపరములుగాని హ్రస్వములకు ప్రగృహ్య సంజ్ఞను విధించిన ప్లుతములకు సిద్ధించును గదా ?

అది శక్యము కాదు. అట్లైన, అకుర్వహి+అత్ర = అకుర్వహ్యత్ర, అనుచో ప్రగృహ్య త్వాపత్తి.

అందువలన తపరములగు దీర్ఘములకే ప్రగృహ్య సంజ్ఞ వక్తవ్యము దీర్ఘములకు జెప్పబడుటచే ప్లుతములకు ప్రాప్తింపక పోవును.

అటులైన స్వర సంధుల విషయమున ప్లుతము అసిద్ధము గాదు సిద్ధమే. అను నీ యత్నము మనకెందులకు ? అది అసిద్ధమే యగును. అసిద్ధము కావున ప్లుతములు తత్కాలములే యగును.

'ప్లుత ప్రగృహ్య అచి' అని ప్రకృతి భావవచనము సిద్ధత్వమునకు జ్ఞాపక మంటరే. అది యెట్లు ? అనిన -

'ప్లుత భావి, ప్రకృతి భావము నొందును' అని 'ప్లుతః ప్రకృత్యా' అను దానికర్థము. ప్లుతభావి యనగా, ప్లుతః భావీ యస్యాసః=ప్లుతభావీ=ప్లుతమునకు స్థాని అని యర్థము. ప్లుతమసిద్ధమయిన, ప్లుతభావికాబట్టి ప్లుతమిది యను వ్యవ హారము స్థానికెట్లు కలుగును ? అని శంకింప జనదు ప్లుతము దీని స్థానమున రానున్నది గావ నిది ప్లుతమను బుద్ధి పరికల్పనము మాత్రమే అటజేయబడునది. అసిద్ధత్వము శాస్త్రీయ కార్యములందు గాని, శాస్త్రీయ వ్యవహారములందు ప్రవర్తింపదు.

ప్లుతము సిద్ధమగునని చెప్పిన లాఘవరూపమగు ప్రయోజనమును గలుగు నంటిరిగదా ? అది యెట్లు ?

పాణినిచే "ఉతోऽరప్లుతాదప్లుతే"(6-1-113) అను సూత్రమున 'అప్లుతాత్' 'అప్లుతే' అను పదములు చెప్పబడియే యున్నవి. కావున నీ లాఘవమపేక్షిత ముగా దోపదు.

ప్లుతము యొక్క సిద్ధత్వ జ్ఞాపకమునకు ప్రయోజనము లేకున్నను, ప్లుతము సిద్ధకాండపఠమయినపుడు ప్రవర్తించు ప్రగృహ్య కార్యము ప్లుతమునకు ప్రాప్తిం

పకపోవునే? అనగా "అకణో ప్రగృహ్యా స్యానునాసికః" (8-4-57) అను ప్రగృహ్యాను నాసిక ప్రతిషేధమనుట.

సంజ్ఞా పరిభాషలు విధ్యుపకారమును జేయుటలో రెండు పక్షములు గలవు. అందొకటి యథోద్దేశ పక్షము, రెండవది కార్యకాల పక్షము. ప్రయోజన విశేషమునుద్దేశింపక, దీనికేదయో ప్రయోజనముండకపోదు. అది ముందు దెలియును, అనునాశయముతో సంతసించు యథాశ్రుత గ్రాహులగు నధికారుల విషయమున ప్రవర్తించునది యథోద్దేశ పక్షము.

మహా వాక్యార్థ పర్యాలోచనము చేయవలెనని సంకల్పించి, విశేష జ్ఞానము కలిగిన గాని తృప్తినందని యుత్తమాధికారులకు సంబంధించినది కార్య కాల పక్షము. ఈ పక్షమున సంజ్ఞాశాస్త్రములకు ప్రత్యేకముగ వాక్యార్థబోధ కలుగదు. పూర్వత్రాసిద్ధమను సూత్రముచే చేయబడు నసిద్ధత్వము గూడ కార్యములకొరకే. ఆ కార్య జ్ఞానము వాక్యార్థ బోధానంతరము కలుగునదే కనుక నా వాక్యార్థ బోధ యే దేశమున కలుగునో ఆ దేశమునందే, అసిద్ధత్వాతి దేశ బోధకశాస్త్రమగు "పూర్వత్రా సిద్ధమ్" (8.2-1) అను శాస్త్రమును నుండును. అది అధికార శాస్త్రముగాన, 'పూర్వ శాస్త్రము కర్తవ్యమగునపు డియ్యది యసిద్ధమగును' అని తానాయా శాస్త్రములందుపస్థితమై బోధించును. కావున కార్యకాల పక్షమున, విధి ప్రదేశములందుపస్థితములగు సంజ్ఞలకును, పరిభాషలకును గూడ నసిద్ధత్వమునది బోధించును. కాబట్టి ప్లుతదృష్టిలో, అను నాసిక విధియగు "అణోఽప్రగృహ్యస్యానునాసికః" (8 4.57) అనునది యసిద్ధ మగుటవలన దానితో నేకవాక్యతను బొందియున్న సంజ్ఞా శాస్త్రమగు "ఈ దూ దే ద్ద్వివచనమనునదిగూడ నసిద్ధమగుటచే ప్లుత విధాయక శాస్త్రము" నందనువర్తించిన, పూర్వత్రా సిద్ధమ్" 8-2-1 అను సూత్రమునందలి "పూర్వత్ర" అనుదానిచే ఈ దూదేత్తను సంజ్ఞా శాస్త్రమును గ్రహించుటకు వీలు కలుగదు.

కాగా, 'అగ్నీ౩' అనుచోట 'అప్రగృహ్యస్య' అని అనునాసిక ప్రతి షేధము చేయబడు సమయమున, ప్లుతమసిద్ధము కాలేదుగాన ప్రగృహ్యసంజ్ఞ ప్రవర్తింపదు. అనునాసికాపత్తి దుర్వారమగును అని భావము.

ఇక సిద్ధాంతి సమాధానము. 'కార్య కాలములు సంజ్ఞాపరిభాషలు' అను పక్షము నాశ్రయింపవలసిన పని మనకేమి ? అని యథోద్దేశముగనే కార్యకరము లగునను పక్షమునే యాశ్రయించితము. ఈ పక్షమున ప్లుతమసిద్ధమగును గాన నవియు తత్కాలములే యగును.

ఈ పక్షమున నొక శంక కలుగును- 'అగ్నీ౩' అనుచోట ప్లుతమసిద్ధ మగుటచే, ప్లుతమునకు పూర్వమే ప్రగృహ్య సంజ్ఞ ప్రవర్తించినది. దానివలన

అనునాసికాదేశము రాలేదు. ప్రగృహ్యసంజ్ఞ సఫలమైనది. తరువాత నీ కార మునకు ప్లుతము వచ్చినది. కాని అప్లుతాత్రిమాత్రికము ద్విమాత్రికముగనే ప్రగృహ్య సంజ్ఞకు కనబడును. అందు సందేహములేదు. కాని ఒకసారి ప్రవర్తించి సఫలమైన సంజ్ఞ మరల ప్రవర్తించుటకు బీజములేదు. కాన నిపుడీ ఈ కారము ప్రగృహ్యముకాదు స్థానివద్భావము చేత, స్థానిగతమగు ప్రగృహ్యత్వమును దెత్తుమనిన 'అనల్విధౌ' అను నిషేధము తగులును. కాగా అది అప్రగృహ్యమే. అనునాసికాపత్తితప్పదు అని శంక.

సంజ్ఞలు కార్యార్థములు. కార్య సిద్ధి రూపమగు బీజమున్నపుడవి ప్రవర్తింప వచ్చును అనియీ శంకకు సమాధానము.

''ఇక ద్వివచన విశేషణతావిచారము''

ద్వివచనములైన ఈత్, ఊత్, ఏత్- అనునవి ప్రగృహ్యము లగునని యర్థమా ? లేక ఈదూదేదంతములగు ద్వివచనములు ప్రగృహ్యములగునమ నర్థమిట వివక్షితమా ?

ఎట్లైననేమి విశేషమందురా ?

వా॥ "ఈదాదయో ద్వివచనం ప్రగృహ్య ఇతిచేదన్త్యస్యవిధిః" అని ప్రథమ పక్షమున దోషదర్శకవార్తికము.

ద్వి వచనములగు నదాదులను మొదటి పక్షమున ద్వివచనాంత్య వర్ణమునకు ప్రగృహ్య సంజ్ఞను వేరుగా విధింపవలసియుండును. 'పచేతే', 'పచేథే' అనుచోట్ల ఏకారమే ద్వివచనముగాదు. అది ద్వివచనాంతము.

సామర్థ్యము వలన ద్వి వచన శబ్దము ద్వి వచనావయవమునందు లక్షణచే వర్తించును.

ముఖ్యమగు నేకారరూపద్వివచనము 'ఖట్వే' 'మాలే' అను చోట సంభవించుచున్నది గాన సూత్రము సార్థకమగును. కాగా గౌణము గ్రహింపబడదు. అట ఆదివద్భావము చేత నేకారమాత్రము ముఖ్య ద్వివచనము సంభవము.

అట్లైన ఈదాద్యంతమగు ద్వివచనము ప్రగృహ్యమగునని చెప్ప వచ్చును. అనిన,

వా॥ "ఈదాద్యన్త మితి చేదేకస్యవిధిః" అని ఆపక్షమున దూషణ వార్తికము.

అప్పుడు, 'ఖట్వే ఇతి' 'మాలేఇతి' అనుచోట ఏకవర్ణమునకు ప్రగృహ్యసంజ్ఞ విధేయమగును.

వా॥ "నవా ఆద్యన్తవత్త్వాత్" అని ద్వితీయ పక్ష సమాధానవార్తికము లేదా ఈ దోషము తగులదు అనవచ్చును. ఏమి కారణ మందురా " ఆద్యంత వత్త్వము వలన. అనగా- అసహాయము నందు కార్యములు ప్రవర్తించినపుడు అవి ఆ అసహాయవర్ణమాదిని గల దాని యందు వలెను, అది అంతమున గల దానియందును వలెనే తన్మాత్రము నందును ప్రవర్తించును. కాబట్టి, 'ఖట్వే' అనుచో నేకార సూత్రమునను నేకారాంత మిదియను భావముతో ప్రగృహ్య సంజ్ఞ ప్రవర్తించును

లేదా ఇట్లుగూడ చెప్పెదను. ఎట్లు? ఈదాదులంత మందుగల ద్వివచ నాంతము ప్రగృహ్యమగును అని.

ద్వివచనపదము ప్రత్యయగ్రహణ పరిభాషచే ద్వివచనాంతమని యర్థము గలదియగును. పిదప దానికి ఈదూదేత్తనునది విశేషణముగాన, "యేనవిధిరితి" సూత్రముచే ఈదాద్యంతమయిన ద్వివచనాంతము ప్రగృహ్యమని యర్థము లభించును. ఇది తృతీయ పక్షము. ఈ పక్షమున నాద్యంతవద్భావాశ్రయణ మక్కర లేదు.

వా॥ "ఈదాద్యన్తంద్వివచనాంతమితిచేల్లుకి ప్రతిషేధః" అని ఆక్షేప వార్తికము.

ఈదాద్యంత ద్వివచనాంతము ప్రగృహ్యమగుననిన, లుక్కువచ్చినపుడు ప్రగృహ్య ప్రతిషేధము వక్తవ్యమగును.

"కుమార్యోరగారమ్=కుమార్యగారమ్, వధ్వోరగారమ్=వధ్వగారమ్- అనుచోట 'కుమారీ' 'వధూ'-అను నీకారోకారాంతములు శ్రూయమాణములు అవి ప్రత్యయ లక్షణముచే ద్వివచనాంతములును నగును. కావున నిట ప్రగృహ్యత్వ మతిప్రసక్తము

వా॥ సప్తమ్యాంమర్థగ్రహణం జ్ఞాపకం ప్రత్యయలక్షణ ప్రతి షేధస్య"—అని సమాధాన వార్తికము. సప్తమీపద ఘటిత సూత్రమగు "ఈదూతౌచసప్తమ్యర్థే" (1-1-19) అను సూత్రము నందర్థపదము నుచ్చరించుట వలన పాణిని ప్రగృహ్య సంజ్ఞలో ప్రత్యయలక్షణము ప్రవర్తింపదని జ్ఞాపకము చేయుచున్నాడు. అనగా, 'ఈ దూతౌచ సప్తమ్యర్థే' అనున్నదొక ప్రగృహ్య సంజ్ఞా విధాయక సూత్రము. "సోమోగౌరీ అధిశ్రితః" అను వ్యాఖ్యము నందలి 'గౌరీ' అను నీదంతమునకు ఈ సూత్రముచే ప్రగృహ్య సంజ్ఞ వచ్చును. ఇట 'గౌరీ' అను పదమునకు 'గౌరియందు' అని యర్థము. సప్తమీ విభక్తి ప్రత్యయ

మునకు 'సుపాంసులుక్' ఇత్యాది సూత్రముచే లోపము, కావున నీ ఈదంతము సప్తమ్యర్థ పర్యవసన్నము. సూత్రమున నర్థగ్రహణ మనావశ్యకము. 'సప్తమీ' అనినను చాలను. తదంతవిధిచేత సప్తమ్యంతమను నర్థము సిద్ధించును. సప్తమ్యంతత్వ ప్రత్యయలక్షణము చేతను, శ్రూయమాణమగు నీకారాంతత్వమును నాశ్రయించిన, గౌరీ అనుదానికి ప్రగృహ్య సంజ్ఞ సిద్ధించును. పున రర్థగ్రహణము వ్యర్థమయి మరల దాను సార్థ మగుటకు ఒకపూర్వార్థము నొకదానిని గల్పించును.

ఆ అపూర్వార్థమే, 'ప్రగృహ్యసంజ్ఞా విషయములో, ఆ ప్రకరణమున నెచ్చటను తదంతవిధి ప్రవర్తింపదు'- అనునది.

అట్లైనచో నిట్లు జ్ఞాపకము చేయుటకు 'ర్థే' అనునది సూత్రమునందావశ్యకమగుటగదా? ఆద్యంత వద్భావము నాశ్రయింపబని లేకుండుటకై తృతీయ పక్షమంగీకృతము. ఆ గౌరవ మట్లుండగా దోషప్రతి విధానముకొరకు అర్థగ్రహణమును జ్ఞాపకముగా నాశ్రయించుట గౌరవాంతరమునగునేయవిన.

అర్థగ్రహణము కర్తవ్యముగాదు ఈదాదులచే ద్వివచనమును విశేషింతుము. అట్లు విశేషింపబడిన ద్వివచనముచే తదంత విధికలుగును. ఈదాద్యంతమగు ద్వివచనమంత మగుచుండగనది ప్రగృహ్యము ఈదాద్యంతాంతమని పర్యవసానము. ఈ పక్షమున 'కుమార్యగారం' అను స్థలమున నతిప్రసంగమే లేదు. ఇట ద్వివచనమగు 'ఓస్' ఈదూదేదంతము కాదుగదా అని సమాధానము.

ఈ పక్షమునందైనను, "శుక్ల్యాస్తాం వస్త్రే" అన చోట 'శుక్లీ' అనుదానికి ప్రగృహ్యసంజ్ఞ ప్రాప్తించుచున్నదే? ఇట ద్వివచన మీకారరూపము. ప్రత్యయ లక్షణముచేత నీకారాది ద్వివచనాంతము నిదియగును.

శుక్ల శబ్దమునకు బరమగున ద్వివచనము 'ఔ' అనునది. దానికి "నపుంసకాచ్చ"— అని శీభావము. దానికి "సుపోధాత్విత్యాది సూత్రముచే లుక్కు, "అస్యచ్వౌ"—అని అకారమున కీకారమాదేశము. తద్ధితయగు'చ్వి' ప్రత్యయము అంతమున కలదిగాన, తద్ధితాంతము దానివలననిది ప్రాతిపదికము సుబుత్పత్తి. అనుప్పుకు "అవ్యయాదాప్సుపః''— అని లుక్కు కాగా 'శుక్లీ' అని నిష్పన్నము ఇట నీకారాంత ద్వివచనము 'శీ' తదంతము ప్రత్యయలక్షణముచే ప్రగృహ్య సంజ్ఞను బొందవలసి యున్నది.

"అశుక్లే వస్త్రే శుక్లే సమపద్యేతాం=శుక్ల్యాస్తాం వస్త్రే"

ఇచ్చట శీ ఆదేశమునకు ముందే ఔకారమునకు లుక్కువచ్చును. అందువలన ప్రత్యయలక్షణముచే నీదంతత్వము దుర్లభము అని సమాధానము.

ఔ ప్రత్యయ స్థానమున లుక్కుచేయబడవలెనా? శీభావమా? యను విషయమును ముందు తేల్చవలెనుగదా ? అందేమి కర్తవ్యము ?

పరమగుటవలన శీభావమే ప్రథమ ప్రవర్త్యమగును.

శీభావమునకు ముందును వెనుకను ప్రాప్తికలదిగాన లుక్కు నిత్యము గదా యనినకాదు. అది అనిత్యమే. ఎట్లన, శీభావమునకు ముందొక శబ్దమునకు సంబంధించినదిగా ప్రాప్తించుచున్నది. శీభావానంతరము శబ్దాంతరమునకు ప్రాప్తించుచున్నది. శబ్దాంతరమునకు ప్రాప్తించు విధి అనిత్యము.

అట్లైన శీభావమును ననిత్యమేయగును. లుక్కు చేసినతరువాతనిక ప్రసంగమను షష్ఠ్యర్థములేదుగాన దేనిస్థానమున ప్రాప్తించును? కాగా రెండును ననిత్యములే. కావుననిపుడు పరమగుటవలన శీభావమువచ్చును. శీభావమును ప్రవర్తింపజేసిన పిమ్మట లుక్కువచ్చును.

ఒకానొకప్పుడు, కృతాకృత ప్రసంగమాత్రము కలదు గదాయని విచారించి, స్థానివిశేషమును గమనింపక, ప్రాప్తికలదని ఎట్లో నిర్ణయించి లుక్కును ప్రవర్తింపజేసినను దోషమే. "పదసంజ్ఞాయామంతగ్రహణమన్యత్ర సంజ్ఞావిధౌప్రత్యయగ్రహణే తదన్తవిధి ప్రతిషేధార్థమ్" అని వార్తికాచార్యుడు ముందు చెప్పబోవును. ఈ సూత్రమున 'ద్వివచనమ్' అనునది ప్రత్యయగ్రహణము. ఇది ప్రగృహ్యసంజ్ఞావిధి. కావున నీ పక్షమునకు సంభవమేలేదు. అదియేదోషము .

మరియు ఆద్యంతవద్భావాశ్రయణ భయమువలనగదా యీ చతుర్థ పక్షాశ్రయణము ? అది యీ పక్షమునందును దప్పునదికాదాయె. 'అగ్నీ' 'ఖట్వే'—ఇత్యాదులందు, ద్వివచన మీకారమేగాని ఈకారాంతముగాదు. కావున వ్యపదేశివద్భావాశ్రయణ మవర్జనీయము.

అందువలన, ఆద్యంతవద్భావముగల ఆ మధ్యమపక్షమే సిద్ధాంత ఖ్యాత మగుపక్షము. మధ్యమపక్షమనగా ద్వితీయపక్షమనుట ప్రత్యయాంశమున తద నంతర విధి మూడవ పక్షమునను, నాల్గవ పక్షమునను గలదు. కాన నారెండు పక్షములను నొకటిగా గ్రహించిన, 'ఈదూదేదన్తం ద్వివచనం ప్రగృహ్యమ్' అను పక్షము మధ్యమ పక్షమగును.

"ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్"

సూ॥ "అదసో మాత్॥" (1-1-12)

## మాత్వమీత్వముల అసిద్ధత్వమునకు నిరాసము.

వా॥ 'మాత్ప్రగృహ్యే సంజ్ఞాయాం తస్యా సిద్ధత్వాదయావేకాదేశ ప్రతిషేధః"— అని ఆదివార్తికము.

"మకారముకంటె బరములైన ఈత్వఊత్వములకు ప్రగృహ్యసంజ్ఞను విధించినప్పుడు, ఆ ఈత్వ ఊత్వములు అసిద్ధములగుటవలన, అయాదేశము, అవాదేశము, ఏకాదేశమును ప్రాప్తించుచున్నవి. వానికి ప్రతిషేధమును జెప్ప వలసియుండును' అని వార్త్తికార్థము.

అదస్ శబ్దముయొక్క మకారమునకు బరములైన ఈకారమును ఊకారమును ప్రగృహ్య సంజ్ఞకములగును. ఉదాహరణములు— అమీ+అత్ర = అమీ అత్ర ॥ అమూ+అత్ర=అమూఅత్ర ॥ అమీ+ఆసతే = అమీఆసతే ॥ అమూ + ఆసాతే = అమూఆసాతే ॥ ఇందు ప్రగృహ్యసంజ్ఞ కార్యము ప్రకృతిభావము.

అద్రస్ +జస్ – అనుస్థితిలో, త్యదాద్యత్వము. పరరూపత్వము. జస్ ప్రత్యయమునకు శీభావము. గుణము, 'అదే' అనికాగా, "అదసోసేర్దాదుదోమః" (8-2-80), "ఏత ఈద్బహువచనే"(8-2-81) అను సూత్రములలో రెండవ సూత్రముచే, దకారమునకు మత్వమును, ఏకారమున కీత్వమును రాగా, 'అమీ' అను రూపమేర్పడినది. అట్లే 'అదౌ' అనునది, మొదటి సూత్రముచే 'అమూ' అని యగును. ఇపుడు మకారము తరువాతి ఈకార ఊకారములకు, ప్రగృహ్యసంజ్ఞయు, తత్కార్యమగు ప్రకృతి భావమును ప్రవర్తించినవి.

"ఏచోయవాయావః" (6-1-78) అను సూత్రమును, "ఏఙః పదాన్తాదతి" (6-1-109) అనుసూత్రమును సాపాదికములును, మూత్వమీత్వ విధాయకములగు "అదసోసేర్దాదుదోమః" (8-2-80), "ఏత ఈద్బహువచనే" (8-2-1) అను నివి త్రైపాదికములును నగుటచే, "పూర్వత్రాసిద్ధమ్" (8-2-1) అను సూత్రముచే నసిద్ధములగుటచేత నీకారమునందు ఏకారబుద్ధియు. ఊకారమునం దౌకార బుద్ధియు నుండునుగాన, 'అమీ అసతే' అనుచోట అయాదేశమును, 'అమూ అసాతే' అనుచో బూర్వరూపైకాదేశమును బ్రసక్తములగుచున్నవి. వానిని బ్రతిషేధింపవలసి యున్నది.

అటులసిద్ధములయిన ప్రగృహ్యసంజ్ఞను వానికి జెప్పుట నిష్ప్రయోజనమగుగదా. కాబట్టి ఆశ్రయణ బలమువలన ప్రగృహ్యసంజ్ఞా విషయమునను, నది సఫలమగుటకు అయావేకాదేశవిషయమునను సిద్ధత్వము జ్ఞాపితమగునుగాన వానికి ప్రాప్తియేలేదుగాన ప్రతిషేధ మనావశ్యకముగదయ్యా! అనిన

ఆక్షేపసాధకమగునది "వచనార్థోహిసిద్ధే" అను వర్త్తికము. ఇది వచన లక్ష్యము కాదు ప్రగృహ్యసంజ్ఞా వచనమునకు వేరొక ప్రయోజనముగలదు. ఈత్వాదికము సిద్ధకాండమునందలిదయినపుడు ప్రాప్తించు ప్రగృహ్యసంజ్ఞా కార్యము విషయమున వచనమునకు ప్రయోజనముకలదు. అది "అణోఽప్రగృహ్యస్యానునాసికః" (8-4-57) అను సూత్రముచే విహితమయిన అనునాసిక ప్రతి

షేధము. మూత్వమీత్వములు దానికి బూర్వములగుట వలనన వియసిద్ధములు కావు.

కాగా ప్రగృహ్య సంజ్ఞకు 'అమీ' అనుచోట అనునాసిక ప్రతిషేధమొక్కటియే ప్రయోజన మనవలసి యున్నది. అపుడు, సూ॥ "అణో౽ప్రగృహ్యస్యాను నాసికః" (8-4-57) అను సూత్రమునకు తరువాత "అదసోన" అని చెప్పినచో ఆ ప్రయోజనము సిద్ధించును గదా! అనేక కార్యములు సిద్ధింపవలెనను తలంపుతో జేయబడిన సంజ్ఞా సూత్రమునకు ఒకేయొక ఉదాహరణమయిన నయ్యది సంజ్ఞా ప్రకరణమునందు వేరుగారచింపబనిలేదు 'ముద్గాదణ్' (4-4-25) "అగ్నేర్ఢక్" (4-2-33) మున్నగునవి తత్తద్రూప సిద్ధిమాత్రము ప్రయోజనముగా గలవి కావున అవి ఉపపన్నములు కావచ్చు. కాబట్టి సంజ్ఞా ప్రకరణమునందు గురుభూతమగున్యాసమును రచించి విధించిన ప్రగృహ్య సంజ్ఞ, అనునాసిక ప్రతిషేధమొక్కటియే గాక ప్రకృతి భావము మున్నగు సర్వ ప్రగృహ్య కార్యములకొరకును నగును గాన నది అసిద్ధత్వమును బాధించును

వా॥ "విప్రతిషేధా ద్వా ప్రగృహ్య సంజ్ఞా"—అని ఆక్షేపమునకు సమాధాన వార్తికము.

లేదా విప్రతిషేధము వలన ప్రగృహ్య సంజ్ఞ ప్రవర్తించును గాబట్టి అయావేకాదేశ ప్రతిషేధమును జేయవిన్యూనత పాణినికిలేదు.

అంతరంగత్వము వలన మూత్వమీత్వములు ముందుప్రవర్తించును. పద సంస్కార పక్షములో, అపుడు పదాంతరసమభివ్యాహారము లేనందున, అయాదులకు ప్రాప్తిలేదు పదాంతసమభివ్యాహారానంతరమయినను, అయాదులకంటె పరమగుటచే ప్రగృహ్య సంజ్ఞయే ప్రవర్తించును. దాని సాఫల్యముకై మూత్వాదికము, ప్రకృతి భావమును గూర్చియు, అయాదులను గురించియు, కూడా అసిద్ధము కాదు. మకారమునకు బరములైన ఈకారోకారములు, ప్రగృహ్య సంజ్ఞలో నాశ్రయింపబడుట వలన, మూత్వమీత్వములు సంజ్ఞా విషయముననను నసిద్ధములు కావనుట.

ఇట్లు విప్రతిషేధోపపాదనము యుక్తముగాదు 'విప్రతిషేధే పరంకార్యమ్' (1-4-2) అనిగదావచింపబడినది. ప్రగృహ్య సంజ్ఞ పరము కాదే? అది పూర్వ పఠితము. అయాదులు పరములుగదా?

ప్రగృహ్య సంజ్ఞ పరమైనదిగా చేయబడును. అనగా పరమైనదిగా నాశ్రయింపబడును.

సూత్ర విపర్యాసమును జేయవలయునే?

అశక్యతలేదు. సూత్ర విపర్యాసములేకున్నను, ప్రగృహ్య సంజ్ఞ పరమేయగును. ఎట్లు ?

"సంజ్ఞా పరిభాషలు కార్యకాలములు. అనగా కార్యము, వానిని తన వద్దకు ఆకర్షించును. ఎచ్చట వాని యుపకారమపేక్షితమగునో అటనవి ఉపస్థితములగును. "ప్రగృహ్యాః ప్రకృత్యా"(6-1-125) అనునది ప్రకృతి భావరూప కార్య విధాయకము. ఇది షష్ఠాధ్యాయస్థము. అచ్చట ప్రగృహ్య సంజ్ఞా శాస్త్రమైన "అద సోమాత్" అనునది (1-1-12) ఉపస్థితమగును. కాగా అయాదులకంటె, ప్రగృహ్య సంజ్ఞ పరమగును.

కార్యకాల పక్షమున సంజ్ఞా శాస్త్రములకు స్వదేశమున వాక్యార్థ బోధ కలుగదు. కార్య విధాయక శాస్త్రదేశముననే కలుగును. కాగా కార్య జ్ఞానమును, విరోధ ప్రతి సంధానమును గూడనిచటనే కలుగును గాన విప్రతిషేధ శాస్త్రప్రవృత్తిలో అచట పరత్వమే ప్రయోజకమగును, పాఠకృతమగు పూర్వత్వమున్నను, నది విప్రతిషేధ శాస్త్ర ప్రవృత్తి ప్రయోజకము కాదనుట.

పరిభాషల విషయమున మాత్రమట్లుగాదు. వాని విషయమున, పాఠకృత పరత్వమే గ్రాహ్యమని సిద్ధాంతము.

అయినను విప్రతిషేధము దురుపపాదమేయని ప్రతిషేధవాది. ఎందువలననగా రెండు కార్యములకు ప్రసక్తిగల లక్ష్యముగదా విప్రతిషేధమునకు విషయము, ఇటనొకస్థానికి రెండు కార్యములు ప్రసక్తములు కావు అయాద్యాదేశములు 'ఏచ్'లకు ప్రాప్తించునవి. ప్రగృహ్యకార్యమగు ప్రకృతిభావము ఈకార ఊకారములకు ప్రాప్తించునదాయె.

ద్వికార్య యోగమొకటియే విప్రతిషేధముగాదు. విప్రతిషేధమనగా అసంభవమే. అది యొకచో ద్వికార్యయోగకృతమగును, వేరొకచో కేవలాసంభవమునగును. అట్టి కేవలాసంభవమిచట గలదు అదెట్లందురా ? చూడుడు.

ప్రగృహ్య సంజ్ఞ ప్రవర్తించిన, అది అయాదులను బాధించును. అయాదులు ప్రవర్తించిన, ప్రగృహ్య సంజ్ఞను నిమిత్తమగు ఈదూదేద్ద్వివచనత్వము లకు విఘాతము కలుగును. అవి విహతములైన, ప్రగృహ్య సంజ్ఞ ప్రవర్తింపదుగాన, ప్రకృతి భావమున విఘాతము. 'త్రపూణామ్' అను లక్ష్యమునందు, నుమాగమము ప్రకృతి భక్తము, నుడాగమము ప్రత్యయ భక్తమునుగాన నొక్కదానికి కార్యద్వయ యోగములేదు. అయినను నవి పరస్పర నిమిత్త విఘాతకములు గాన నసంభవము కలదు. ప్రకృతమునసట్టి కేవలాసంభవము కలదు గాన విప్రతిషేధము యుక్తమే,

అయినను విప్రతిషేధము పొసగనిదే. విప్రతిషేధము విద్యమానములగు రెండు కార్యములకు గదా. ఇచట, ఈత్వ ఊత్వములును లేవు. మకారమును లేదు. ఆ రెండును అసిద్ధములే గదా అయాదుల దృష్టిలో అనిన దీనికి సమాధానముగా నీ వార్తికము.

వా॥ "ఆశ్రయాత్సిద్ధత్వం యథారోరుత్వే" అనునది యవతరించినది. "అతోరోరప్లుతాదప్లుతే" (6-1-113) అని విధింపబడిన ఉత్వము రుత్వము నుద్దేశించి విహితమగుటచే, ఆ ఉత్వ విషయమున రుత్వము ఆశ్రయణ సామర్థ్యమువలన నసిద్ధము కానట్లు, ప్రగృహ్య సంజ్ఞలో కార్యులుగా నాశ్రయింపబడుట వలన మూత్వమీత్వములను సిద్ధత్వమాశ్రయింపబడును, అని వార్తికార్థము.

'ససజుషో రుః'(8-2-66) అను సూత్రము రుత్వ విధాయకము. దాని స్థానమున, 'శివోర్చ్యః' ఇత్యాదులందు, "అతోరోరప్లుతాదప్లుతే" (6-1-113) అను సూత్రము ఉత్వమును విధించుచున్నది. రుత్వము త్రైపాదికమగుటవలన నుత్వ దృష్టిలో అసిద్ధము కావలెను. కాని ఉత్వమునకదియాశ్రయముగాగా గ్రహింపబడుటవలన అసిద్ధము కాలేదు. అట్లే ప్రకృతమునను, ప్రగృహ్య సంజ్ఞలో కార్యులుగా నాశ్రయింపబడుటవలన, త్రైపాదికములయినను నీత్వాదులసిద్ధములు కావు. ప్రగృహ్యసంజ్ఞ వ్యర్థము కాకుండుటకు, అయాదుల దృష్టిలో గూడ అసిద్ధములు కావు. కాబట్టి ఈత్వాదులకును, అయాదులకును విప్రతిషేధముపపన్నమేయగును.

అందీత్వాదులకు ప్రసంగములేని 'చయనమ్'-ఇత్యాదిలక్ష్యములు అయాదుల కవకాశము. అయాదులకు ప్రసక్తిలేని 'అమీస్థితాః' 'అమూస్థితౌ'-ఇత్యాదులు మూత్వమీత్వములకవకాశములు.

'అమీ అత్ర'- అనుచోట నుభయ కార్యములకును ప్రాప్తికలదు. అట పరత్వము వలన నీదాదులు ప్రవర్తించును. అవి ప్రవర్తించిన పిదప నిక వాని కసిద్ధత్వము లేదుగాన అయాదులకు ప్రసంగమే లేదు.

రుత్వము ఉత్వము విషయమున ఆశ్రయణ బలమువలన సిద్ధమగునని యేల చెప్పవలెను ? ఉత్వ విధాయకమును షష్ఠాధ్యాయమున పఠింపక ఎట పఠించిన రుత్వము సిద్ధమగునో అటనే పఠింపరాదా ? "రోః సుపి" (8.3.16) అను సూత్రమునకుదరువాత, "అతఉరతి" అని పఠింపవచ్చునే ? అపుడు ద్వితీయ పాదమునందలి రుత్వమున కసిద్ధత్వ ప్రసంగమేకలుగదు. ఇక దాని దృష్టికి, ప్లుతమును సిద్ధమేయగునుగాన, ప్లుతమసిద్ధమగుటవలన, "ఏహి సుస్రోతఃఅత్రస్నాహి" అను స్థలమున ప్లుతమునకు పరమైన రుత్వము ఉత్తుకంటె పరమైనదియనుట సంభవింపదుగాన, 'అప్లుతాత్' 'అప్లుతే' అను విశేషణములా సూత్రమున ననావశ్యకములునగును.

అనిన నది సాధ్యముగాదు.

వా॥ "అసిద్ధేహ్యుత్వే ఆద్గుణాప్రసిద్ధిః"

'వృక్షోత్ర' 'ప్లక్షోత్ర'- అనుచోట, సాపాదికమగు గుణము దృష్టిలో, ఈ పాఠమునందు, త్రైపాదికమగు ఉత్వమసిద్ధమగునుగాన గుణము సిద్ధింపక పోవును. అందువలన యత్వమునకు ఆశ్రయమువలన సిద్ధత్వమునే యంగీకరింప తగును. అపుడు ఆ సామ్యమున నిట గూడ ఆశ్రయణ బలమువలన సిద్ధత్వము లభించును.

వా॥ "వచన సామర్థ్యాద్వా"— అని సమాధానాంతర వార్తికము.

లేదా 'ప్రగృహ్య సంజ్ఞా వచనము సార్థకమగుటకు అయాదులు ప్రవర్తింపవు' అనియైన జెప్పనగును. అయాదులు ప్రవర్తించినచో ప్రగృహ్యసంజ్ఞను విధించుట వ్యర్థమే యగునుగదా !

వా॥ "యోగవిభాగాద్వా"— అని సమాధానాంతర వార్తికము.

లేదా సూత్ర విభాగము వలన అయాదులను వారింపవచ్చును.

ఆ సూత్రమును, 'అదసః' అని యొక సూత్రముగను, 'మాత్' అని వేరొక సూత్రముగను విభజింతుము. 'అదశ్శబ్దసంబంధులగు నీదాదులు ప్రగృహ్యములగున'ని మొదటి సూత్రమున కర్థము. తరువాత 'మాత్' అను రెండవ సూత్రమునకు, 'మకారము కంటెబరములైన ఈదాదులును ప్రగృహ్యము లగును. అవియును అదశ్శబ్ద సంబంధులే కావలెను' అని యర్థము. 'మాత్' అను సూత్రములోనికి 'అదసః' అను ప్రథమ ఖండ మనువర్తించును.

యోగ విభాగ మెందులకనిన, అందు రెండవది, ఏ కార్యము విషయమున మూత్వము సిద్ధమగునో దాని కొరకనియు, దేని దృష్టిలో మూత్వము అసిద్ధమగునో ఆ ప్రగృహ్య కార్యము కొరకనియు తాత్పర్యము. అది అనువాసిక ప్రతిషేధమొకటి ప్రకృతి భావమొకటి అగును.

యోగ విభాగము నంగీకరించిన, 'అముయా' 'అముయోః' అనుచోట గూడ రావలసి వచ్చునే ?

ఇట ప్రగృహ్య సంజ్ఞ వచ్చిన నేమగును ?

ప్రగృహ్యాశ్రయమగు ప్రకృతిభావము రావలసి యుండును.

'అదస్ + టా' అదస్ + ఓస్ — అను నవస్థలో, త్యదాద్యత్వము, పరరూపత్వము, టాపు, సవర్ణదీర్ఘము, ఆటాప్పునకు "ఆఙిచాపః" (7.3.105) అను సూత్రముచే ఏత్వము ప్రవర్తింపగా, 'అదే' ఆ 'అదేఓస్' అనునవస్థలో,

'అదసః' అను మొదటి విభక్త సూత్రముచే ప్రగృహ్య సంజ్ఞ ప్రవర్తించినచో అయాదేశము సిద్ధింపక పోవును.

మకారముకంటెపరముతైన ఈదూదేత్తులకను నర్థమీయోగ విభాగ పక్షమున మొదటి సూత్రమునకు లేదుగదా ? అనిన,

ఇది దోషము కాదు. "ఏఙః పదాన్తాదతి" (6.1.109) అను సూత్రము నుండి 'పదాన్తాత్' అను పదము ననువర్తింపజేసి, దానిని ప్రథమాంతముగా మార్చుటచేత, 'అదశ్శబ్ద సంబంధులగు నీదూదేత్తులు, పదాంతములే ప్రకృతి భావము నందును' అని యర్థము. ఈ ఏకారము పదాంతముగాదుగాన నిట తదాపత్తి లేదు.

పదాంతపదానువృత్తి చేయబడినను 'అముకేఽత్ర' అనుచోట, అదసః అను సూత్రముచేత ప్రగృహ్య సంజ్ఞ రావలసి వచ్చును. ద్వివచన పదమును వర్తించునుగదా అనిన, ద్వివచన పదమనువర్తించినచో, 'అమీ అత్ర' అనుచో రాక పోవును.

అట్లైన 'పదాన్తమ్' అనునది నివృత్త మగునందము, నివర్తించుట యనగా ననువర్తింపకుండుటయే ఈదూత్తులకు మాత్రమే స్వరితత్వము కలదుగాన 'ఏత్' అనునది యనువర్తింపదనుట.

వా॥ "మాత్రార్థాదీదాద్యర్థానాం వా"—అని సమాధానాంతర వార్తికము. పాణిన్యాచార్యుడు, అదశ్శబ్ద సంబంధి మకారముకంటె పరముతైన ఈదూత్తులకు ప్రగృహ్య సంజ్ఞను విధించెను కాని ఈదూత్తులును లేవు. మకారమును అగపడదు. ఎందువలన ? అసిద్ధములగుట వలన. కావున నాతని యాశయము నిట్లుగా మేము గ్రహింతుము. మశబ్దమునకు, 'మకారార్థమైనది' అనగా 'మకారస్థాని' అని యర్థము. ఈదూదేత్తను పదమునకును, తదర్థములయిన స్థాని అని యర్థము. మార్థమగు దాసికంటె పరములయిన ఈదాద్యర్థములకు, ప్రగృహ్యసంజ్ఞ యగునని యర్థము. ఇది కేవలము బుద్ధిపరికల్పనము. ఈ కల్పనలో అసిద్ధత్వమునకు సంభవములేదు. శాస్త్రమునకు గాని, కార్యమునకు గాని అసిద్ధత్వము సంభవము. బుద్ధికసిద్ధత్వము సంభవింపదు. ఇది ఏకయోగమునందును బరిహారాంతరము.

వా॥ "ఉక్తం వా"— అని సమాధానాంతరవార్తికము.

లేదా దీనికి సమాధానము, "స్వరితో వానుదాత్తే పదాదౌ" (8.2.6) అను సూత్రమునందు, వార్తిక కారునిచే చెప్పబడియే యున్నది. ఏమి చెప్పబడినదనిన— "అదస ఈతోత్వేస్వరేణహిష్పదలక్షణే (సిద్ధేవక్తవ్యే) "ప్రగృహ్య సంజ్ఞాయాంచ"— అని రెండు వార్తికములచే అసిద్ధత్వమే ప్రతిషేధింపబడినది.

ద్వితీయ పదమునందలి స్వరము, అనగా అచ్చు పరమగునపుడు ఈత్వోత్వములు సిద్ధములగును. కావున 'అమీఅత్ర' ఇత్యాదులందు దోష ప్రసక్తి లేదు. 'అముయా' ఇత్యాదులందు స్వరము ద్వితీయపద వ్యవస్థితము కాదు గావ మూత్వాదులు అసిద్ధములగును. కాగా జయాదులు ప్రవర్తించును ప్రగృహ్య సంజ్ఞ విషయమున సిద్ధత్వము, అయాదుల దృష్టిలో సిద్ధత్వము లేనిచో సప్రయోజనము కాదు కావున, వాని విషయమున గూడ మూత్వమీత్వములు సిద్ధములే యగునని భావము.

## అనిష్టాపత్తి నివారణము

వా॥ ""తత్రసకి దోషః"— అని ఆక్షేపవార్తికము.

కకార సహితమయిన అదస్ శబ్దమున ప్రగృహ్య సంజ్ఞాపత్తి రూప దోషము ప్రాప్తించుచున్నది, 'అముకేఽత్ర' అను స్థలమున మకారముకంటె పర మైన ఈదాద్యంతము కలదుగాన దోషము. అనగా ప్రగృహ్య సంజ్ఞాపత్తి కలుగుచున్నది.

సమాధాన వార్తికము— వా॥ "నవాగ్రహణ విశేషణత్వాత్" అని.

ఇది దోషము కాదు. ఎందువలననగా, గ్రహణ విశేషణ మగుటవలన. మాత్పదము గృహ్యమాణములయిన ఈదూదేత్తులకే విశేషణముగాని తదంత మునకుగాదు. తదంతములు సూత్రగృహీతములు కావు.

అపుడు 'అముకేఽత్ర' అను చోట మకారమునకును ఏకారమునకును నడుమ వ్యవధానము కలదుగాన, మకారము కంటె అవ్యవహిత పరముగా ఏకారము లేనందున ప్రగృహ్యసంజ్ఞాపత్తి లేదు అని భావము

'అదసః' అనునది పృథక్సూత్ర మను పక్షమున, 'అముకేఽత్ర' అనుచోట ప్రగృహ్య సంజ్ఞాపత్తి నాశంకించి, "ఏవం తర్హిఏదన్త మితినివృత్తమ్"— "ఏదంత పరమగు సేత్పదము నివర్తించినది' అని వెనుక చెప్పబడినది. ఏక యోగపక్షమున దాని నివృత్తికి ప్రయోజనము లేదు అను తాత్పర్యముతో "నవాగ్రహణ విశేషణత్వాత్" అను సమాధానము చెప్పబడినది. ఏత్పదమును వర్తించినను, 'మాత్ అనునది దానికే విశేషణము గాని తదంతమునకు విశే షణము కాదు గాన నిట నేకారము మకారమునకు వ్యవహితమగుటంజేసి దోషము లేదని సమాధాన తాత్పర్యము "వస్తుతః ఏకారానువృత్తి నిష్ఫలము"

"అదసో మాత్"సమాప్తము

"శే"

"అనిష్టాపత్తినిరాకరణము"

వేదమునందు సుప్పుల స్థానమున 'శే' అను నాదేశము విధింపబడినది. దానికి ప్రగృహ్య సంజ్ఞ ఈసూత్రము విధించుచున్నది. "అస్మే ఇన్ద్రా బృహస్పతీ" అని యుదాహరణము. ఇట 'అస్మే' అనుచో నేకారము "భ్యస్" అను సుప్రత్యయస్థానమున వచ్చిన 'శే' ఆదేశము. దానికి ప్రగృహ్య సంజ్ఞ వలన ప్రకృతి భావము వచ్చినది.

కాశ, కుశ వంశ, శబ్దముల సప్తమ్యేకవచనాంత రూపములు:— 'కాశే' 'కుశే', 'వంశే', - అనునవి. అట 'శే' అను రూపము ప్రత్యక్షము గ్రుతమై యున్నది 'యుష్మే' 'అస్మే' అను చోట వినబడు 'ఏ' అనునది 'శే' ఆదేశము. అయినను అట లోపించిన శకారమును స్మరించిన గాని ఆ రూపము స్పష్టము గాదు. కాగా నది అనుమేయము. ఇట్లుండ "శ్రుతానుమిత న్యాయముచే, కాశే,కుశే,వంశే, అను చోటనే ఏల ఈ సంజ్ఞ ప్రవర్తి వలేదు ? అను నాక్షేపము సంభవించుచున్నది. ఆయాక్షేపమునకు సమాధాన వార్తికము— వా॥ "శేఽర్థవద్గ్రహణాత్" అనునది.

'అర్థవద్గ్రహణ పరిభాషచే, అర్ధవంతమగు శే శబ్దమే గ్రహింపబడును. 'కాశే' ఇత్యాదులందలి 'శే' అనునది ప్రకృతి ప్రత్యయావయవముల అనర్థక సముదాయము కావున నది గ్రహింపబడదు' అని సమాధాన వార్తిక తాత్పర్యము.

పోనిండు. 'హరిశే' 'బభ్రుశే' అనుచోట శే ఏల గ్రహింపబడరాదు. అట, "లోమాది పామాది పిచ్ఛాదిభ్యః శనేలచః" (5-2-100) అను సూత్రముచే మత్వర్థమున ప్రవర్తించిన శప్రత్యయము సార్థకమే. సప్తమ్యేకవచన ప్రత్యయమునకును దానికిని సంధి వశమున నేర్పడిన 'శే' అనునది యర్థవత్సముదాయమగుటచే నర్థవంతమే గదా ? అనిన,

లాక్షణిక ప్రతిపదోక్తములలో ప్రతిపదోక్తములే గ్రాహ్యములు. 'సుపాం సులుక్'(7-1-39) ఇత్యాది సూత్ర విహితమగు 'శే' అనునది ప్రతిపదోక్తము గాన దానికే గ్రహణము న్యాయ్యము. లాక్షణికములు గ్రాహ్యములు కావు.

లేదా - 'అర్థవద్గ్రహణేనానర్థకస్య' అనిదియే సమాధానమగుగాక.

'హరిశే' 'బభ్రుశే' అనుచోటనెట్లు? అట అర్థవంతములైన ప్రత్యయముల సముదాయమర్థవంతమేగదా? అనిన, హరిశ శబ్దమునందలి 'శ' అనునది ప్రత్యయముగాన నర్థవంతమైనను, నా యర్థముతో సప్తమీ ప్రత్యయమునకు సంబంధము లేదు. అది సముదాయార్థగతసంఖ్యాబోధకము. కాగా దశదాడిమాది వాక్యము వందువలె నవయవములర్థవంతములయినను సముదాయమనర్థకమే అని తాత్పర్యము॥

"శే సమాప్తము"

"॥నిపాత ఏకాజనాఙ్॥"

పదకృత్య విచారణము.

ఆఙ్ భిన్నమగు ఏకాచ్చయిన నిపాతము ప్రగృహ్య సంజ్ఞకము.

ఇందు నిపాత పదమునకేమి ప్రయోజనము?

చకార+అత్ర=చకారాత్ర, జహార+అత్ర=జహారాత్ర, ఇట రేఫోత్తరాకారము ఆఙ్ భిన్నమగునేకాచ్చు. కాని అది నిపాతము గాదు. ప్రత్యయము. దానికి ప్రగృహ్య సంజ్ఞ కలిగినచో, ప్రకృతి భావము ప్రవర్తించియుండెడిది. అన్వయ వ్యతిరేకములచే ప్రత్యయములును నర్థవంతములే. కేవలములకు ప్రయోగము లేకుండుట నిపాతములకును తుల్యమే. అందువలన ఏకాచ్చు అయిన ప్రత్యయములకు ప్రగృహ్య సంజ్ఞను వారించుటకు నిపాత పదము.

'ఏకాచ్'— అనునది యేందులకు?

'ప్రేదం బ్రహ్మ' "ప్రేదంక్షత్రమ్"॥ ఇట, అజ్మాత్రముకాని, అజంతమయిన నిపాతము. 'ప్ర' అనుదానికి ప్రగృహ్య సంజ్ఞ ప్రాప్తింపకుండుటకు ఏకాచ్పదము.

'ఏకాచ్'— అను పదమున్నను నిట ప్రాప్తించుచునే యున్నదిగదా. ఇదియు నేకాచ్చే? అనిన,

'ఏకాచ్' అను నిది బహువ్రీహికాదు.'ఒక అచ్చు దేనియందుండునోయది' అని యర్థము గాదు. వివక్షితమగునది మరియేమనిన, ఇది సమానాధికరణ తత్పురుషము ఏకః చ అసౌ అచ్ చ=ఏకాచ్, అని విగ్రహము, వర్తిపదార్థ ప్రధానమగుటచే వచ్చు తత్పురుషము బహువ్రీహికంటె నంతరంగము. ఒకే ఒక అచ్చు అయిన నిపాతమని యర్థము.

ఇది సమానాధికరణ తత్పురుష మయిన ఏక గ్రహణము నిష్ప్రయోజనమగునే?

కాదు. అపుడచ్పదము విశేషణమై అజంతమగు నిపాతమని యర్థమగును. కాగా 'ప్రేదం బ్రహ్మ' 'ప్రేదం బ్రహ్మక్షత్రమ్' అను స్థలముననుప్రవర్తింపవలసి వచ్చునే? దానిని వారించుటెట్లు?

నిపాత పదమే విశేషణము. అజ్గ్రహణ సామర్థ్యము వలన గాని, 'సర్వం వాక్యం సావధారణ'మను న్యాయముచేతనగాని, అజ్మాత్రమగు నిపాతమని గ్రహింపవలసి యుండును.

నిపాతపదమునకు న్యాయ ప్రాప్తమగు విశేష్యత్వమును విడచి దానికి విశేషణత్వము అపూర్వముగ వక్తవ్యమనుటయా?

కాదు. అపూర్వవక్తవ్యమేదియు లేదు.

చెప్పనిచో తెలియబడుట యెట్లు?

అజ్గ్రహణ సామర్థ్యము వలన దెలియబడును. అచట అచ్చును, తద్భిన్నమును గూడ నుండిన, అచ్ పదము అనర్థకమగును గదా? అనిన,

అజ్గ్రహణము వ్యర్థము కాదు. దానికి వేరొక ప్రయోజనము కలదు. ఏమది? అచ్పదములేనిచో హలంతమునకును ప్రాప్తించును. అజంతమునకే సమ్మతము. అందులకై అజ్గ్రహణము సార్థకము అని యందురేమో? హలంత నిపాతమునకు ప్రగృహ్య సంజ్ఞ కలిగిన, ఎచ్చటను ఎట్టి ప్రయోజనమును లేదు. దోషమును లేదు కాబట్టి సామర్థ్య ముపపన్నమే అనుట.

అట్లయినను "ఆద్యన్తవదేకస్మిన్"(1-1-21)"యేనవిధిస్తదన్తస్య" (1-1-72) అను రెండు పరిభాషలను, ఇతరత్ర సావకాశములైనవి, ఇట ప్రాప్తించుచున్నవి గదా. ఈ రెంటిలో నిట ఆద్యంతవద్భావ పరిభాషయే ప్రవర్తించును గాని తదంత పరిభాష ప్రవర్తింపదనుట యెట్లు?

నిపాత పదము విశేషణమై అచ్పదము విశేష్యమయిన, తదంత పరిభాషకు ప్రసంగము లేకుండుట వలన దానికి నివృత్తి. అచ్పదము విశేషణమయి నిపాత పదము విశేష్యమయిన అజంతమగు నిపాతమునకని అర్థమగును. కావ ఆద్యంతవత్పరిభాషకు నివృత్తి కలుగును. ఇందు నిర్ణయ కారణమేదని యుండ వలెను గదా యని భావము పై పరిభాషలు రెండును, ఒకటి యతిదేశమును, ఇంకొకటి సంజ్ఞా సూత్రమును అయినను, పారార్థ్యముభయ సూత్రములకును తుల్యమగుటచే పరిభాషా సామ్యము వలన పరిభాషా వ్యవహారము చేయబడినది. కాగా ఆద్యంతవద్భావ పరిభాషా ప్రవృత్తి నిర్ణాయకము ఆచార్య ప్రవృత్తి".

పాణిన్యాచార్యుడు, ఈ సూత్రమున 'అనాఙ్' అని 'ఆఙ్' కు ప్రగృహ్య సంజ్ఞా ప్రతిషేధమును శాసించెను. ఇందు తదంతపరిభాష ప్రవర్తించిన,

అజంతమను నిపాతమని యర్థమగును. ఆఙుపసర్గము, అస్త్రీజ్ఞాప నిపాతమేగాని అజంతము కామగాన నిషేధమునకు ప్రసంగమే లేదు. కావున నీ లింగమువలన ఆద్యన్తపదేకస్మిన్నను పరిభాష యుపస్థితమగుటకు, తదంత విధి ముందు బుద్ధి సన్నిహితమయినను పిదప అది పరిత్యజింపబడును. ఇట్లచట, ఆద్యంతవద్భావ పరిభాషయే ప్రవర్తించును గాని తదంత పరిభాష ప్రవర్తింపదనుటకు, ఆచార్య ప్రవృత్తి జ్ఞాపకము.

అట్లైన, అచ్పదము మాత్రమే ఉన్నను, 'ప్రేదమ్' ఇత్యాదులందు, సామర్థ్యమువలన దోషము నారింపబడునుగాన నేకగ్రహణము వ్యర్థము. అట్టి ఏకగ్రహణమును జేయుటవలన, పాణిన్యాచార్యుడు, వర్ణమాత్రము గ్రహింప బడిన స్థలాంతరములందెచ్చట నైనను, దద్వర్ణ జాతికి గ్రహణము కలుగునని జ్ఞాపనమును జేయును.

ఇట్లు జ్ఞాపనముచేయుట కేమి ప్రయోజనము ?

"హలన్తాచ్చ" (1-2-10) అను సూత్రమునందు దంభేర్హల్గ్రహణస్య జాతి వాచకత్వాత్సిద్ధమ్" అని చెప్పబడినది యుపపన్నమగుట ఫలము. అనగా హలన్తాచ్చ (1-2-10) అను సూత్రము, ఇక్కునకు సమీపమునమున్న హల్లుకు పరమైన ఝలాది సన్ప్రత్యయమునకు కిత్త్వమును విధించునది. బిభిత్సతీత్యాదు లుదాహరణములు. 'ధిప్సతి' అనునదియు నా సూత్రలక్ష్యమే. 'దమ్భు దంభనే' అను ధాతువు సన్నంతరూపమది. దన్ భ్+స+తి అను స్థితిలో, 'దమ్భఇచ్చ' (7-4-56) అను సూత్రముచే దకారాకారమున కిత్వము ప్రవర్తించిన తరువాత, పై 'హలన్తాచ్చ' అను సూత్రముచే సన్ప్రత్యయము కిత్తగును. పిదప నలోపము, భష్భావచర్త్వములురాగా 'ధిప్సతి' అను రూపమేర్పడును. అట నికారమునకు తరువాత నకార భకారములు రెండు హల్లులు గలవు. వాని యందుండు హల్త్వమొక్కటియేగాన, ఆ సూత్రమునందలి హల్పదము జాతి పరమగుటచే హల్త్వాశ్రయ నకారభకార వ్యక్తులకు బరమైన సన్ప్రత్యయము హల్లుకంటెబరమైనదిగా గ్రహింబడుట ఈ జ్ఞాపకమునకు ఫలము.

'అనాఙ్' అను పదమునకేమి యర్థము ?

ఙకారమిత్సంజ్ఞకముగాగ ఆకారమునకు, ప్రగృహ్యసంజ్ఞ ప్రవర్తింప దని యర్థము. 'ఆ+ఉదకాన్తాత్ = ఓదకాన్తాత్' అని యుదాహరణము. ఇట ఆకారము ఆఙు, అభివిధి దానికర్థము.

"ఆ ఏవంను మన్యసే" "ఆ ఏవం కిలతత్" అను వాక్యములలో ఆకారమున కేల ప్రగృహ్యసంజ్ఞా ప్రతిషేధము ప్రవర్తింపలేదు ? ఈ సూత్రమునందలి 'అనాఙ్' అను పదముచే, ఙకార రూపమగు ననుబంధముతో కూడిన ఆకారమే బోధితమగును. దానికే ప్రగృహ్యసంజ్ఞా ప్రతిషేధము. పై ప్రయోగములందలి

ఆకారము అనుబంధ విరహితము. కాగానట ప్రగృహ్యసంజ్ఞా ప్రకృతి భావములు ప్రవర్తించినవి.

అనుబంధము తొలగిన తరువాత విశేషమును దెలిసికొనుట సాధ్యపడదు గదా ? ఎచటనది సానుబంధకమో ఎచట నిరనుబంధకమో గ్రహించుటకేమి యుపాయము ?

ఈషదర్థకాకారము సానుబంధకము. ఉ॥ ఆ+ఉష్ణమ్ = ఓష్ణమ్. క్రియాావాచక శబ్దయోగముగల ఆకారమును సానుబంధకమే. అప్రగృహ్యము. ఉదాహరణము—ఆ+ఇతః = ఏతః

మర్యాదార్థకాకారము జిత్తు. అదియు ప్రగృహ్యముకాదు. ఉదాహరణము -ఆ+అహిచ్ఛత్రాత్ = ఆహిచ్ఛత్రాత్॥ అహిచ్ఛత్రముదరకు. అభివిధి యర్థము గాగల ఆకారమును జిత్తే. కావున ప్రగృహ్యముకాదు. ఉ॥ ఆ+ఉదకాన్తాత్ = ఓదకాన్తాత్॥ "తేనవినామర్యాదా। తేనసహ అభివిధిః" "అకాలింవృష్టోదేవః" అను వాక్యమున అజ్ఞా, ఉభయార్థకము కావచ్చును॥

శ్లో॥ ఈషదర్థే క్రియాయోగే మర్యాదాభి విధౌచయః।
ఏతమాతంజితం విద్యాద్వాక్య స్మరణయోరజిత్॥

అర్థవశమున విశేషావసాయము కర్తవ్యమని భావము॥

పూర్వప్రక్రాంతమగు వాక్యార్థమునకు మార్పును ద్యోతనచేయు ఆకార మును భాషలో నటనట ప్రయుక్తమగుచున్నది. ఉ॥ 'ఆ, ఏవంను మన్యసే'= "ఓహో ! ఇపుడిట్లు తలంచుచుంటివా ? వెనుక నిట్లనుకొనలేదే" అని యర్థము. ఆ యర్థమునకు ద్యోతకమాకారము. ఇది జిత్తుకాదు. కాన ప్రగృహ్యమే. కావున సంధిరాలేదు ప్రకృతి భావము కలిగినది.

ఇట్లే స్మరణద్యోతకాకారమును నిరనుబాధకమే. ప్రగృహ్యమే. ఉదాహర ణము—'ఆ ఏవంకిలతత్'= 'ఓహో, అది ఇటులనా ? ఇపుడు జ్ఞప్తికి వచ్చినది' అని యర్థము. కాగా, వాక్యార్థమునకు మార్పును సూచించు ఆకారమును, స్మరణ సూచకమగు ఆకారమును జిత్తులుకావు. నిరనుబాధకములు. ప్రగృహ్యములు ప్రకృతి భావయోగ్యములు. 'వాక్యస్మరణ యోరజిత్' అను చతుర్థపాదము ఆ విషయమును బోధించుచున్నది.

॥నిపాత ఏకాజనాఙ్॥-సమాప్తము

సూ॥ "ఓత్" (1-1-15)

॥సూత్రవ్యైయర్థ్యాశంకా నివారణము॥

ఓకారాంతమగు నిపాతము ప్రగృహ్యసంజ్ఞకమగునని యర్థము.

ఉదాహరణమేమి ?

'ఆహో+ఇతి=ఆహో ఇతి' ఉతాహో+ఇతి=ఉతాహో ఇతి. "ఇచట, ప్రగృహ్య సంజ్ఞాసిద్ధి ఈ సూత్రమునకు ప్రయోజనము కాదు. అది అన్యథా సిద్ధము'—అని యాక్షేపము. ఇవి రెండును నేకనిపాతములుకావు. నిపాత సమాహార రూపములు. ఆహ, ఉ, కలసి ఆహో, ఉత, ఆహ, ఉ, అనునీ మూడునుగలసి 'ఉతాహో' అగును. కావున "నిపాత ఏకాజనాఙ్" (1-1-14) అను సూత్రముచేతనే 'ఉ' అను నిరనుబంధకనిపాతమునకు సిద్దించుననిభావము.

అట్లైన, ఇవి ఏకనిపాతములే. చాదులందు ఏకనిపాతములుగా పఠింప బడియున్నవి. నిపాత సమాహారరూపమయిన,చాదిగణమునపునఃపాఠము వ్యర్థము అని యొక సమాధానము.

లేదా ఈ సూత్రారంభము ప్రతిషిద్ధార్థము అనగా 'అనాఙ్' అని ప్రగృహ్య సంజ్ఞ ప్రతిషేధింపబడిన, "ఓ షు యాతం మరుతః। ఓషుయాతం బృహతీ శక్వరీచ, ఓ చిత్సఖాయం సఖ్యావవృత్యామ్" అను ఋక్కునందలి 'ఓ' అను దానికి ప్రగృహ్యసంజ్ఞకి సూత్రమావశ్యకము. అట 'ఓ' అనునది ఆ+ఉ=ఓ అని యేర్పడినది. దీనికి పదపాఠమున,'ఇతి' అను శబ్దము పరమగునపుడు, ప్రగృహ్య సంజ్ఞ కలిగి, ప్రకృతిభావముచే 'ఓ ఇతి' అని కావలెను. అంతవద్భావముచేత నిట నీ 'ఓ' అనునది 'ఆఙ్' అగునుగాన ప్రతిషేధము ప్రాప్తించుచున్నది. అందుకొఱకీ సూత్రమని సమాధానాంతరము॥

## చ్విప్రత్యయాంతమున సూత్రప్రవృత్తి నిరాకరణము

వా॥ "ఓతశ్చ్విప్రతిషేధః"— అని ఆక్షేపవార్తికము.

ఓదంతనిపాతమునకు ప్రగృహ్యసంజ్ఞను విధించినపుడు అది చ్విప్రత్య యాంతమయినచో నాసంజ్ఞ ప్రవర్తింపదని చెప్పవలసియుండును.

ఉ॥ 'అనదః అదః అభవత్' — అదోభవత్, 'అతిరః తిరః అభవత్ = తిరోభవత్' అను స్థలములందు 'అదో, తిరో' అను నోదంతములు చ్విప్రత్య యాంతములు. "ఊర్యాదిచ్వి డాచశ్చ" (1.4.61) అను సూత్రముచే నిపాతములు. చ్విప్రతిషేధము లేనిచో నివియు ప్రగృహ్యములయిన, పూర్వ రూపము రాదు. ప్రకృతి భావము వచ్చియుండెడిది, అందువలన చ్విప్రతిషేధమావశ్యకము.

అక్కరలేదు. "లక్షణ ప్రతిపదోక్తయోః ప్రతిపదోక్తస్య" అను పరిభాషచే, ప్రతిపదోక్తమగు నోదంతనిపాతమునకే ప్రగృహ్యసంజ్ఞ ప్రవర్తించును. 'అదోః తిరో' అనునివి సంధి వశమున నోకారాంతములయినవిగాని సాక్షాదుచ్చారిత ములుగావు. అనుచో అప్పటికిని,

'అగౌః గౌః సమపద్యత = గోభవత్' అనుచో,'గో' అను నోదంతమునకు ప్రగృహ్యత్వ మనివార్యమగుచున్నది. 'గమేర్డోః'- అను ఔణాదిక సూత్ర ముచే విధింపబడిన "డో" ప్రత్యయము సాక్షాదుచ్చారితమయి ప్రతిపదోక్తమగు చున్నది. ఇది సామాన్య లక్షణనిష్పాదితము గాదు. కాగానిట ప్రగృహ్యసం జ్ఞను వారించుట యెట్లు ? ఇదియు లక్షణ ప్రతిపాదితమేగదాయనిన, లాక్షణిక మనగా లక్షణ ప్రతిపాదితమని యర్థము గాదు. లక్షణ నిష్పాదితము లక్షణ వశమున నిష్పన్నమనుట. ఇది గుణాది నిష్పన్నము కాదు. కనుక ప్రతి పదోక్తమే.

అట్లనిన, "గౌణముఖ్యయోర్ముఖ్యే కార్య సంప్రత్యయః" = 'గౌణార్థక మును ముఖ్యార్థకమును నుపస్థితములయినపుడు అందు శాస్త్రీయ కార్య ప్రవృత్తి ముఖ్యార్థమునందే కలుగును' కాబట్టి, 'అదో' అను నోదంతమునకుగాని, 'గోభవత్' అనుచో గో అను నోదంతమునగాని ప్రగృహ్య సంజ్ఞ ప్రవర్తింపదు. 'గోవు కాని వాహీకుడు గోవాయెను' అనిన, జాడ్యాది ధర్మములు వాని యందుండుటచే గోత్వమారోపితమగుచున్నదిగాన వాహీకుడను నర్థము గోశబ్ద మునకు గౌణార్థము. శాస్త్రీయకార్యములు ముఖ్యార్థక శబ్దములందే ప్రవర్తిం చును. గౌణార్థమనియతము, ముఖ్యార్థము ముఖమువలె ప్రధానము.

ఈ గౌణముఖ్య న్యాయము లోక సిద్ధము. "గౌరనుబంధ్యో జోగ్నీ షోమీయః" అను విధి గవానుబంధనమును బోధించు చున్నది. అచట నీన్యాయ ముచే గోపదము ముఖ్యార్థమగు పశువునే బోధించును గాని గౌణార్థమగు వాహీకుని బోధించుటలేదు. కావున వాహీకున కనుబంధన ప్రసంగము లేదు గదా ?

అట్లైన, 'గౌస్తిష్ఠతి' 'గామానయ' అను వాక్యములలో, గోశబ్దము గౌణార్థమగు వాహీకుని బోధించినపుడు, "గోతోణిత్" (7.1.90) అని ణిద్వ ద్భావము, తత్ప్రయుక్త వృద్ధియు, "ఔతోమ్శసోః"— అని ఆత్వమును నట నెట్లు ప్రవర్తించినవి ? ముఖ్యార్థబోధక శబ్దములందే శాస్త్రములు ప్రవర్తింప వలెనని గౌణముఖ్య న్యాయము బోధించుచున్నది గదాయనిన,

అర్థాశ్రయమగు కార్యము విషయమున 'ముఖ్యార్థకమునందే కార్య ములు ప్రవర్తింపవలెనన్నమాట.' అనగా లోక ప్రసిద్ధార్థముగల పదముల నాశ్రయించిన కార్యముల పట్ల గౌణ ముఖ్యములలో ముఖ్యమునందే కార్య ప్రవృత్తి అనుట నిక్కము. కాని శబ్దమాత్రాశ్రయ కార్యము శబ్దమునందే ప్రవర్తించును, వృద్ధియు, ఆత్వమును, అర్థరహితమగు శబ్దమును మాత్ర మాశ్ర యించిన కార్యములు. కావున వాని విషయమున నాన్యాయము ప్రవర్తింపదు.

స్వార్థ, ద్రవ్య, లింగ, సంఖ్యా,కారకములు ప్రాతిపదికార్థములు. వానికి సంబంధించిన కార్యములన్నియు ప్రవర్తించిన పిదప అర్థ ప్రతిపాదన మునకై ప్రయోగింపబడునది పదము, ఆ పదమునకు, పదాంతరముతో సంబంధము కలిగిన తరువాత గాని గౌణార్థ ప్రతీతి కలుగదు.

'గౌః' అను పదమువలన గౌణార్థ స్ఫూర్తి కలుగునది 'వాహీకః' అను పదముతో సంబంధము కలిగిన తరువాతనే గదా? అయా శాస్త్రీయ కార్య ములచే సంస్కారము ప్రాతిపదికమునకు గదా. కాగా ప్రాతిపదిక సంస్కార వేళలో గౌణార్థ ప్రతీతి కలుగనే కలుగదు. వృద్ధ్యాత్వములు అర్థరహిత శబ్ద మాత్రాశ్రయములనగా వాని కర్థము లేనే లేదనుటగాదు. అపుడు ప్రాతిపది కార్థమునకు ముఖ్యార్థమిదియను వ్యపదేశము కలుగదు. గౌణార్థము గూడ ప్రతీ తమగునపుడు గదా దాని దృష్టిచే నీయర్థము ముఖ్యమగునని తలంచుట? కాగా, 'గౌః', 'గామ్' అనుచోట వృద్ధ్యాత్వములు, 'ముఖ్య మిది'యను వ్యవ హారములేని యర్థమును బోధించు ప్రాతిపదిక రూప శబ్ద మాత్రమును ఆశ్ర యించిన వనుట. తత్తత్సంస్కార సంస్కృత మయిన పదమునే ప్రయోక్త లాయాయర్థములందు ప్రయోగింతురు గాన నీన్యాయము పదకార్య విషయమే యని భావము.

'ఓత్'— సమాప్తము.

## ఉ ఞ ఊఁ (1-1-17)

### అనిష్టాపత్తి వారణము

'ఉఞ్' అను నిపాతమునకు ఇతి అను శబ్దము పరమగునపుడు దీర్ఘమును, అనునాసికమును, ప్రగృహ్యమును అగు ఊఁ అను నాదేశము వికల్పముగా ప్రవ ర్తించును' - అని సూత్రమునకర్థము.

ఇందు పూర్వ సూత్రమునుండి 'శాకల్యస్య' 'ఇతౌ' 'అనార్షే' అను పదములు అనువర్తించును. ఉ॥ ఉ+ఇతి = ఊఁఇతి లేదా వితి.

ఈ ఆదేశము 'అహో ఇతి' 'ఉతాహో ఇతి' అను స్థలము లందెందులకు రాలేదు? అని ప్రశ్న.

ఉఞ్ఞునకీయాదేశమని చెప్పబడుచున్నదిగదా? ఇట ఉఞ్ లేదే? ఉన్నది. లేకేమి? ఉఞ్ఞున కింకొకదానితో నిదియేకాదేశము. ఈ ఓకారము పరాదివద్భా వము చేత, ఉఞ్ అగును.

సమాధానము—పాణిన్యాచార్యుని ప్రవృత్తి,ఉఞోకాదేశమాదివద్భావము చేత ఉఞ్ఞుగా గ్రహింపబడదని జ్ఞాపనము చేయబడుచున్నది. ఎట్లన— 'ఓత్' (1-1-16) అను పూర్వ సూత్రముచే, ఓదంత నిపాతమున కాతడు ప్రగృహ్య

సంజ్ఞను శాసించుచున్నాడు. గదా! 'అహో ఇతి' ఇత్యాదులందు, ఏకాదేశా నంతరము పరాదివద్భావము చేత 'నిపాత ఏకాజనాఙ్' అనియే యది సిద్ధించు నాయె. అట్టియెడనది వ్యర్థమగును గాన, ఉఞాదేశమునకు పరాదివద్భావము లేదని జ్ఞాపనచేసియే యది సార్థకమగును.

ఈ జ్ఞాపకముపపన్నము గాదు. 'ఓత్' - అను ప్రగృహ్యత్వము ప్రతి షిద్ధార్థమని చెప్పితిరి గదా. వ్యర్థమెట్లగును. పైగా ఉఞాదేశము ఉఞ్ఞుగా గ్రహింపబడదనిన దోషము గూడ గలుగును. చూడుడు. 'జానూ అస్య రుజతి' 'జాన్వస్యరుజతి' అని రెండు రూపములు కలవు. జాను+ఉ—జానూ అని సవర్ణ దీర్ఘనిష్పన్నము. అట పరాదివద్భావముచేత నాదీర్ఘమునందు ఉఞ్త్వము నతిదే శించినందున, "మయఉఞోవోవా" (8-3-33) అను సూత్రముచే వైకల్పికవత్వము ప్రవర్తింపవలెను. అది సిద్ధింపకపోవును.

అట్లైన నివి ఏక నిపాతములే యందుమని సిద్ధాంతి సమాధానము. లేదా, ఇవి రెండు ఉకారములు ఒకటి ఞకార రహితము, వేరొకటి తత్సహితము. అనుబంధ రహితమునకిది యేకాదేశము గాన దోషము లేదు.

### యోగ విభాగ విచారము.

వా॥ "ఉఞ ఇతి యోగ విభాగః" అని, ఆక్షేపవార్తికము 'ఉ ఞః'— అని వేరుగ సూత్రముకు విభజింపవలసి యున్నది. శాకల్యాచార్యుని మత మున ఉఞ్ఞునకు ప్రగృహ్య సంజ్ఞ కలుగును. ఉదాహరణము— 'ఉ ఇతి', అని ప్రకృతి భావముచే రూపము. శాకల్యమతమనుటచే స్మృత్యంతరమున నది లేదని తెలియుచున్నది గాన వికల్పము ఫలితము. ప్రగృహ్య సంజ్ఞ లేని పక్షమున యణాదేశముచే 'వితి' అనురూపమగును.

ఇక విభక్త ద్వితీయ సూత్రమునకు, ఉఞ్ఞు స్థానమున దీర్ఘము, అను నాసికమును, ప్రగృహ్యమును. అగు 'ఊ' అను నాదేశము శాకల్యాచార్యుని మతముననే వచ్చును అని యర్థము. ఉదాహరణము— 'ఊ ఇతి' - అను నది.

ఎందు కొరకీ యోగవిభాగము ? అని ప్రశ్న. దానికి సమాధాన వార్తి కము— వా॥ 'ఊఁ వా శాకల్యస్య"— అనునది. 'శాకల్యాచార్యుని మతముననే'ఊఁ' ఆదేశము వికల్పముగా సిద్ధించుటకు 'యోగ విభాగము' అని వార్తి కార్థము.

'ప్రగృహ్యసంజ్ఞయును, ఊఁ ఆదేశమును శాకల్య మతమునందే ప్రాప్తిం చుటచే ఒక ప్రయోగమునందే ప్రవర్తించిన, 'ఊఁ ఇతి' అనురూపమును,పక్షమున 'వితి' అను రూపమును సిద్ధించును.

ఒకచే సూత్రమైనను ఆ రెండు రూపములును సిద్ధించుచున్నవి. కాగా యోగ విభాగమునకు ఫలము 'ఊ ఇతి' అను రూపమును 'ఉ ఇతి' అను రూపమును శాకల్య మతముననే సిద్ధించుట.

ఇతరాచార్యుల మతమున 'వితి' అనురూపము సిద్ధించును.

కాగా, ఉ ఇతి, వితి, ఊ ఇతి, అను మూడు రూపములును ఏక యోగము వలన సిద్ధింపవు కాబట్టి యోగ విభాగ మావశ్యకమని భావము.

"ఉ ఞ ఊ" సూత్రము సమాప్తము

## "ఈదూతౌ చ సప్తమ్యర్థే" (1-1-19)

'సప్తమ్యంత పదార్థమునందు, పర్యవసన్నములయిన ఈదంత ఊదంత శబ్దములు ప్రగృహ్య సంజ్ఞ కలవి యగును' అని సూత్రార్థము॥

"సోమో గౌరీ అధిశ్రితః"— అని యుదాహరణము ఇట, గౌరీ శబ్దమునకు పరమైన సప్తమీ విభక్తి ప్రత్యయమునకు, "సుపాంసులుక్" (7-1-39) ఇత్యాది సూత్రముచే లుక్కు, కాగా గౌరీ అను పదమునకు 'గౌరియందు' అని యర్థము. కావున నిది సప్తమ్యర్థ పర్యవసితమైన ఈదంతము. 'మామకీ తనూ ఇతి' అనుచోట 'తనూ' - అనునది అట్టి ఊదంతము॥

### అర్థగ్రహణ ప్రయోజన నిరూపణము

"ఈదూతౌ సప్తమీత్యేవ, లుప్తేఽర్థ గ్రహణాద్భవేత్।
పూర్వస్య చేత్సవర్ణోసావాడాంభావః ప్రసజ్యతే॥
వచనాద్యత్ర, దీర్ఘత్వం తత్రాపిసరసీయది।
జ్ఞాపకం స్యాత్తదన్తత్వే మా వాపూర్వ పరస్యభూత్॥"

ఇది యొక శ్లోక వార్తికము. ఈ సూత్రమున నిది ఖండములుగ వ్యాఖ్యానింపబడును.

"ఈదూతౌ సప్తమీ త్యేవ" — అనునది ఆక్షేప వార్తిక ఖండము.

"ఈదూతౌ సప్తమీ"— అనియే సూత్రమేల రచింపబడలేదు ?

సప్తమీ సహచరితము లేదా సప్తమీ పరకమునైన ఈకారాంత ఊకారాంత శబ్దములు ప్రగృహ్యములగునని యర్థమగును. ఈకార, ఊకార రూపమగు సప్తమికి సంభవమేచటనునగడపదు గాన వచన సామర్థ్యము వలన, తాత్పర్యానుపపత్తిచే సప్తమీ పదమునకు సప్తమీ సహచరితమని యర్థమగును. కావున నర్థపదమునకు, ప్రయోజనము లేదు' అని ఆక్షేపమునకు తాత్పర్యము.

అర్థ పదము లేని యెడల సప్తమికి లోపము వచ్చిన చోట నా సంజ్ఞ ప్రవర్తించకపోవును అని సమాధానము. ఎచ్చట ?

"సోమో గౌరీ అధిశ్రితః" అను స్థలమున. అట ప్రగృహ్యాత్వము 'గౌరీ' అను నీకారాంతమునకు సమ్మతము. ఇట ఈదూదంతమగు సప్తమ్యంతమునకు ప్రగృహ్య సంజ్ఞ యగునని యర్థమైన ప్రత్యయ లక్షణముచే సిద్ధించెడిదే కాని ఇది సంజ్ఞా విధి గదా. అందువలన సప్తమికే సంజ్ఞ కావలెను. సప్తమియే లేనపుడు దానికి సంజ్ఞ ఎట్లు లభించును ? ఇక ప్రత్యయ లక్షణము, ప్రత్యయేతరమునకు ప్రత్యయ నిమిత్తక కార్యము విధింపబడిన చోట్లనే ప్రవర్తించును గదా !

అందుకని యర్థ గ్రహణము. దానివలన నీ సంజ్ఞ అర్థనిమిత్తకము గాని శబ్ద నిమిత్తకము గాదని తెలియును గాన ప్రత్యయ లోప స్థలముల దును సంజ్ఞను ప్రవర్తింపజేయవచ్చును అని సమాధాన తాత్పర్యము.

ఇట సప్తమికి లోపము గాదే ? మరియేమి ? "సుపాంసులుక్" ఇత్యాది సూత్రము చేతనే పూర్ణ సవర్ణ దీర్ఘము. 'తనూ+ఇ=తనూ'— అని ఏర్పడిన తరువాత, ఆదివద్భావముచే 'ఇ'కారము సప్తమి యగును ప్రగృహ్య సంజ్ఞ సిద్ధించును. కాగా అర్థగ్రహణముతో పనిలేదు. అనిన,

అట్లుకాదు. అది ఆవశ్యకమే. గౌరీ మున్నగు ఙ్యాబంతములందు సప్తమికి లుక్కే చెప్పవలెను. పూర్ణ సవర్ణ దీర్ఘమునకు కుదురు పడదు. ఇట సప్తమీ ప్రత్యయము ఙకారేత్సంజ్ఞకము. నద్యంతముకంటె పరమై యున్నది. కాన, "ఆణ్నద్యాః" (7-3-112) అను సూత్రము చేత 'ఆట్' అను ఆగమమును "ఙేరామ్నద్యామ్నీభ్యః" (7-3-116) అను సూత్రముచే 'ఆమ్' అనునాదేశమును ప్రసక్తములగును. అవి అంగములు, పరములునగుట చేత నేకాదేశమును బాధించును అని, సమాధాన వార్తిక ఖండమగు, వా॥ "పూర్వస్యచేత్సవర్ణోసావాడామ్భావః ప్రసజ్యతే" అనునది 'లుప్తేర్థగ్రహణాద్భవేత్'-అను సమాధానమును సమర్థించుచున్నది.

స సప్తమీ ప్రత్యయమున కెచ్చటనైనను లోపము తప్పదు. కాని "ఈదూతౌ చ సప్తమ్యర్థే" అని పాణిని చెప్పెను. ఈకార ఊకార రూపమగు సప్తమి లేనేలేదు గాన 'గౌణార్థకల్పనచే, సప్తమీ సహచరితములగు నీదూదంతములని వచన సామర్థ్యము వలన చెప్పవచ్చును' అను ప్రశ్నకు సమాధాన వార్తిక ఖండము —"వచనాద్యత్ర దీర్ఘత్వమ్" అనునది.

సప్తమీ ప్రత్యయ స్థానమునందు దీర్ఘ ఈకారమూదేశముగా వచ్చిన లమునందు వచనము చరితార్థము. కావున, ఆడామ్భావములను బాధించి పూర్వ సవర్ణ దీర్ఘము వచన సామర్థ్యము వలన లభింపదు' అని వార్తిక ఖండా

ర్థము. ఇది వచనమువలన లభ్యముకాదు. 'ఈదూతౌ సప్తమీ' అను వచనములో, దీనికి వేరు ప్రయోజనము కలదు

ఏమది ? ఎచట సప్తమికి దీర్ఘము చెప్పబడినదో అది ప్రయోజనము. "దృతిం న శుష్కం సరసీ శయానమ్" అను బుజస్త్రేత్రిమునందలి 'సరసీ' అను పదమునందు సరశ్శబ్దమునకు పరమైన జిప్రత్యయమునకు 'ఇయాడియాజీకారాణాముపసంఖ్యానమ్' అను వార్తికము చేత ఈకారాదేశము ప్రవర్తించినది. అది సప్తమి. కావున గౌరీ అనుచో రాక పోవును.

ఈ సమాధానమునకు బాధకమగు వార్తిక ఖండము—

వా॥ "తత్రాపిసరసీయది"— అనునది.

అచట గూడ 'సరసీ' అను నీకారాంత శబ్దము కలదందుమేని యదియు గుడుసుపడును. లోకమున సరసీ అను నీకారాంత శబ్దమునకు ప్రయోగమును కలదు. దక్షిణాపథమునందు, పెద్ద పెద్ద సరస్సులను, ఇవి సరసులు అని వ్యవహరింతురు. కాగా సరసీ శబ్దమీకారాంతమనుట. అట సప్తమికి లుక్కు ప్రవర్తింపగా సరసీయనునది ప్రత్యయ లక్షణముచే సప్తమ్యంతముగా సిద్ధించును.

'ఇయాడియాజిత్యాది వార్తికముచే సప్తమీ ప్రత్యయమున కీకారదీర్ఘ విధానము అనావశ్యకము. కాబట్టి వచన సామర్థ్యము ఉపక్షీణము కాలేదు. లుక్కు వచ్చిన తావులందును ప్రగృహ్యసంజ్ఞ సిద్ధించును. అర్థ గ్రహణమునకు ప్రయోజనము లేదు' అని భావము.

వా॥ ఖం॥ "జ్ఞాపకం స్యాత్తదన్తత్వే"— అనునది సమాధాన ఖండము.

'జ్ఞాపకం స్యాత్ = జ్ఞాపకమగును ఏది ? అర్థగ్రహణము. దేనికి ? ప్రత్యయలక్షణాభావమునకు, ప్రయోజన మెచట? తదన్తత్వే = 'ఈ దూదేదిది సూత్రమున తృతీయ చతుర్థ పక్షములందు, ప్రగృహ్య సంజ్ఞా సంజ్ఞి ద్వివచనాంతముగా నభిమతమయిన, 'కుమార్యోరగారం = కుమార్యగారమ్, 'వధ్వోరగారం = వధ్వగారమ్' అనుచోట 'కుమారీ' 'వధూ' అనువానికి ప్రగృహ్యసంజ్ఞ ప్రత్యయలక్షణముచే ప్రవర్తింపకుండుట ప్రయోజనము.

లేదా అర్థగ్రహణమునకు ప్రయోజనాంతరమును జెప్పనగును.

వా॥ ఖం॥ "మావాపూర్వపదస్య భూత్"— అని శ్లోకవార్తికాంత్య పాదము

'వాప్యశ్వః', 'నద్యాతిః' అను సమాసములలో పూర్వపదములైన 'వాపీ' 'నదీ' అనువానికి ప్రగృహ్య సంజ్ఞను వారించుట అర్థగ్రహణ ఫలము. ఇట

"సంజ్ఞాయామ్" (2-1-44) అను సూత్రముచే సమాసము. 'వాపి' 'నదీ' అనునవి, ప్రత్యయలక్షణముచే సప్తమీ సహచరితములైన ఈకారాంతములు గాన ప్రగృహ్య సంజ్ఞ ప్రాప్తించుచున్నది. దానిని వారించుట అర్థగ్రహణమునకు ప్రయోజనము.

ఇట నొక ప్రశ్నకలుగ వచ్చును. నిత్యసమాసములందు విగ్రహ కార్యముచే సంజ్ఞిబోధింపబడదు, కావున విగ్రహవాక్యమే యుండదు. అట్టియెడ, నిట 'వాప్యామశ్వః'- అను విగ్రహప్రదర్శన మెట్లు పొసగును? అనిన, 'సంజ్ఞా భూతసమాసములు నిత్యసమాస సదృశములని మాత్రమే యర్థముగాని, మహా విభాషా సంబంధ మావిధులందుండనే యుండదు' అని తాత్పర్యముకాదు. కావున విగ్రహప్రదర్శనముపపన్నమేయనుట.

అర్థగ్రహణము సూత్రమునందున్నను, 'వాప్యశ్వః'- అనుచోట సప్తమ్యర్థమును గలదుగదా యట నేల ప్రగృహ్య సంజ్ఞ ప్రవర్తింపదు ?

వృత్తి జహత్స్వార్థయగుటం జేసి ఆ సంజ్ఞ ప్రవర్తింపలేదని భావము. అనగా సమాసమే అర్థవంతము. పూర్వోత్తర పదము లనర్థకములు. కాగా సప్తమ్యర్థమిట లేదనుట. సంజ్ఞాయామనుసూత్ర నిష్పన్న సమాసములు రూఢి శబ్దములు. అట నవయవముల కర్థప్రతీతి యుండదు. రథంతరాది శబ్దములను రూఢిశబ్దములే. 'రథేన తరతీతి = రథంతరమ్',- అని విగ్రహప్రదర్శనము వంటిదే 'వాప్యామశ్వః' అను విగ్రహప్రదర్శనము. రూఢ్యర్థమునకు అవయవార్థము విరుద్ధమయినచోట్ల జహత్స్వార్థతయే వృత్తి ధర్మము.

ఇవి రూఢి శబ్దములు కావు. యౌగికములే 'సంజ్ఞాయామ్'అను సూత్రముచే కాదిట సమాసము. 'సుప్సుపా' అను సూత్రముచేతనేయను పక్షమున. వృత్తి 'అజహత్స్వార్థయేయగును' వృత్త్యవయవముల కపుడర్థము ససంభవము. ఆ పక్షమున దోషమేగదాయనిన,

అపుడును దోషములేదు. పూర్వ పదార్థముతోగూడిన ఉత్తరపదార్థమే సముదాయార్థము. అశ్వపు శక్తియు, సముదాయశక్తియు పరస్పరసహకారముతో సంసృష్టిరూపముగనే దానినుపస్థాపింపజేయును కావున వాప్యాదిపదములకు సప్తమ్యంతార్థ మాత్రపర్యవసానములేదు.

"సోమో గౌరీ అధిశ్రితః"- ఇత్యాదులందట్లు కాదు. అట 'గౌరీ' అనునది 'వృత్తి' కాదు. కావున అయ్యది సమభివ్యాహృత పదాంతరార్థాన్వయములేని స్వార్థముచే అది బోధించును. సప్తమ్యర్థమాత్రపర్యవసానమనగా నదియే.

"ఈ దూతౌచ సప్తమ్యర్థే" అను సూత్రమునకు వివర్తము సమాప్తము"
ప్రగృహ్యసంజ్ఞా ప్రకరణమును ముగిసినది.

## "దాధాఘ్వదాప్" (1-1-20)

దాః, ధాః, ఘు, అదాప్- అని పదముల చేదము.

"దాః'- రూపమగు ధాతువును, 'ధాః'- రూపమగు ధాతువును, 'ఘు'- అను సంజ్ఞకలవియగును'- అని సూత్రార్థము. అందు, 'దాప్ లవనే' 'దైప్ శోధనే' అను నివిమాత్రపు దా రూపములయినను, వానికి ఘుసంజ్ఞ ప్రవర్తింపదు.

### ఇష్టానుపత్తి నిరాకరణము

వా॥ "ఘుసంజ్ఞాయాం ప్రకృతి గ్రహణంశిదర్థమ్" - అని ఆక్షేప వార్తికము.

ఘుసంజ్ఞా విధాయక సూత్రమునందు ప్రకృతిపదమును గూడ జేర్చ వలెను. "దారూపధాతువులు నాలుగును, ధారూపధాతువులు రెండును వాని ప్రకృతులును ఘుసంజ్ఞకలవియగును" అని చెప్పవలసియుండు. ఎందులకనగా- ప్రయోగములం దాకారాంతములుగానున్న వానిని సూత్రమునందనుకరించి వానికి సంజ్ఞ విధింపబడినది. కనుక ఆత్వమును బొందని వానికాయవస్థలో నీ ఘుసంజ్ఞ సిద్ధింపకపోవునుగదా ?

ఏమయ్యా ! ఘుసంజ్ఞాకార్యము లించుమించుగనన్నియు వార్థధాయక ప్రత్యయములు పరమగునపుడే లక్ష్యములలో నగపడుచుండెనుగదా ! అట నివియాకారాంతములుగనే దృష్టములే ? అనిన- శిదర్థము ప్రకృతిగ్రహణమావశ్యకము. శకారమిత్సంజ్ఞకముగాగల ప్రత్యయములు పరమగునపుడు ఘుసంజ్ఞ సిద్ధించుట కనుట. అట ఆత్వము. 'అశితి' అని నిషేధింపబడినని.

'ప్రణిదయతే'- మున్నగు స్థలములందు, "నేర్గదనదపతపద ఘుమాస్యతి హన్తి యాతివాతిద్రాతిప్సాతి వపతి వహతి శామ్యతి చినోతిదేగ్ధిషుచ" (8-4-17) అను సూత్రముచే ఉపసర్గనకారమునకు, ఘుసంజ్ఞకము పరమయినవుడు ణత్వము సిద్ధింపవలెను. 'ప్రణిద్యతి,' 'ప్రణిధయతి'- మున్నగునవియు నుదాహరణములు.

పై ఆక్షేపవార్తికమునందు కాత్యాయనీయులు చెప్పని ప్రయోజనాంతరమును గూడజేర్చి భారద్వాజీయులావార్తికమునిట్లు పఠించుచున్నారు.

వా॥ "ఘుసంజ్ఞాయాంప్రకృతి గ్రహణం శిద్వికృతార్థమ్" అని వారి వార్తిక పాఠము

శిదర్థమయిన ప్రకృతి గ్రహణమున కుదాహరణము చూపబడినది. ఇక వికృతార్థమనగా– "ప్రణిదాతా' 'ప్రణిధాతా'- అను స్థలములందు ణత్వము సిద్ధించుటకొరకనుట.

ఎందువలన నట ణత్వమిపుడు సిద్ధింపలేదనగా,

'లక్షణప్రతిపదోక్తయోః ప్రతిపదోక్త స్యైవగ్రహణమ్'— అను పరిభాషచే ప్రతిపదోక్తములయిన అదంతములకే గాని, లక్షణ వశసంపన్నములయిన అదంతములగు, దో, దేజ్ ధాతురూపమగు ప్రణిదాతా' అనుచోటను, ధేట్ ధాతురూపమగు 'ప్రణిధాతా' అను స్థలమునను ప్రాప్తింపకపోవును.

వికృతార్థమనగా సహజములగు నాకారాంతములుగాక, అకారాదేశము ప్రవర్తించినందున నాకారాంతములుగా మారిన, దో, దేజ్, ధేట్ ధాతువులు పరమగునపుడును ణత్వము సిద్ధించుట కనుట.

ప్రకృతి గ్రహణమును జేసినను, 'దాధాప్రకృతయః' అను పదమున దాధా లప్రకృతులని షష్ఠీసమాసము వివక్షితమా ? లేక, దాధారూపములగు ప్రకృతులని కర్మధారయము వివక్షితమా ?

ఎట్లనిననేమి? దాధారూపములగు ప్రకృతులనిన, ఆత్వభూతములకేగాని ఆత్వమును బొందనివానికి రాకపోవచ్చును. ఆ దోష మట్లేయుండును. ఇక దాధాల ప్రకృతులనిన, ఆత్వభూతములు కానివానికే ప్రాప్తించి, ఆత్వభూతములకు ప్రాప్తింపకయేపోవును, అను ఈ ప్రత్యాక్షేపమునకు సమాధానము = "కర్మధారయమును గాదు, తత్పురుషయును గాదు. ద్వంద్వమట వివక్షితము. అనగా 'దాధాలును, వాని ప్రకృతులును' అని ప్రత్యాసత్తిచే లభ్యమగును" అని చెప్పవగును.

అట్లైన ప్రకృతి గ్రహణము కర్తవ్యమనియా? అని ప్రశ్న. కర్తవ్యము గాదు. అర్థపదము ప్రస్తుతమై యున్నదిగదా ? అది యనువర్తించును. ఎచ్చట ప్రస్తుతమది ?

"ఈదూతౌచ సప్తమ్యర్థే"—అను పూర్వ సూత్రమున ప్రస్తుతము. ఆ సూత్రమునకు తరువాత, 'దాధా' ఘు, అదాప్ 'అర్థే' అని అర్థపదమట ననువర్తింపజేయబడును. 'దారూపములును, ధారూపములును నగు ధాతువులు ఘు సంజ్ఞకములు' అని 'దాధాఘు' అను సూత్రమున కర్థము తరువాత 'అర్థేః'అనుదానికి, దాధాల యర్థమున వర్తించువానికిని ఘుసంజ్ఞ వచ్చును. అని యర్థమగును. వాని యర్థమున వర్తించునవి వాని ప్రకృతులు.

అట్లు చెప్పుట సాధ్యపడదు. 'డుదాఞ్' 'దానే' అను ధాతువు నర్థము నందు వర్తించునవి, రాతి, రాసతి, దాసతి, మంహతి, ప్రీణాతి మున్నగునవి

తత్సమానార్థకములు కలవు. 'పితృభ్యః ప్రీణాతి' అని ప్రయోగము కలదు. అందువలన 'ప్రీఞ్' ధాతువును దదాతి సమానార్థకమే. వానికి గూడ నీ పక్షమున ఘుసంజ్ఞ ప్రాప్తింపవలసివచ్చును. అది యనిష్టముగదా! కాబట్టి ప్రకృతి గ్రహణము కర్తవ్యమే అందురేని - కర్తవ్యము కాదు. శిదర్థమయి దాని కావశ్యకత లేదు. 'ప్రణిదయతే' అనుచో నేర్గదేతి ణత్వము వేరొక విధముగ సిద్ధింపవచ్చును. 'ప్రణిమయతే', 'ప్రణ్యమయత' ఇత్యాదులందు, ధాతువు 'మేఙ్ ప్రణిదానే' అనునది. నేర్గదేతి సూత్రమున, 'మా' అని ఆకారాంతము నిర్దేశింపబడినది. కావున పై రూపములందు ఆ సూత్రముచే ణత్వము సిద్ధించుట లేదు. అందులకై ఆ సూత్రమున 'ఘు, మా' అనువాని 'నకుమ ప్రకృతి' అను పదమును జేర్చి, 'ఘు ప్రకృతి మా' అని పఠించుట యావశ్యకము. 'ప్రకృతి' పదమచట, పూర్వోత్తరములు రెంటికిని సంబంధించి, ఘు ప్రకృతులును మా ప్రకృతులును పరమైనపుడు ణత్వము వచ్చునని యర్థమగును. కాగా, 'ప్రణిదయతే' అనుచోటను, 'ప్రణిమయతే' అను స్థలముననను ణత్వము సిద్ధించును.

ప్రకృతి గ్రహణమును జేసిన, 'ప్రనిమినోతి', 'ప్రనిమీనాతి' అనుచోట్ల గూడ ణత్వము ప్రాప్తించునే? 'మీఙ్ హింసాయామ్' 'డుమిఞ్' ప్రక్షేపణే- అను మీనాతి మినోతులు గూడ, ఏ జ్విషయమున "మీనాతి మినోతిదీఙాం ల్యపిచ" (6-1-50) అను సూత్రముచే ఆత్వమును బొందునుగదా? అందువలన 'మా' కు ప్రకృతులగును.

ఆ సూత్రమునందు ప్రకృతి గ్రహణమును జేయనపుడును, 'ప్రనిమాతా' 'ప్రనిమాతుమ్', 'ప్రనిమాతవ్యమ్' అను స్థలములందు ణత్వమేల కాలేదు? అట, మా అనురూపమే కలదుగదా యనిన,

'ఘుమాస్యతి' అనుచోట మా అను పదముచే, ఙకారేత్సంజ్ఞకమగు మాఙ్ ధాతువునకే గ్రహణమని గ్రహింపబడును.

ప్రకృతి గ్రహణము లేనపుడు, ఆకారాంతమగు జిత్తునే మా శబ్దముచే గ్రహించినట్లు, ప్రకృతి గ్రహణమున్నపుడును దానికే గ్రహణమని దెలియబడును. ణత్వవిధాయకమున 'ఘు మాఙ్స్యతి' అని పఠింపబడును అన్నమాట.

భారద్వాజీయులు చెప్పిన వికృతార్థత్వము గూడ ప్రయోజనముగాదు. ప్రణిదాతా' 'ప్రణిధాతా' అనుస్థలములందు 'దా' 'ధా' అను రూపములు లాక్షణికములుగాన లక్షణ ప్రతిపదోక్త పరిభాషచే వానికి గ్రహణము కలుగదని వారి యాశయము. కాని ఆ పరిభాషకు అపవాదమగు పరిభాషాంతరము, "గామాదాగ్రహణేష్వవిశేషః" అనునది కలదు. ఈ పరిభాష, 'దాధాఘ్వదాప్' అను సూత్రమునందు గ్రహింపబడిన దాధాల విషయముననను, ప్రకృత పరి

భాషా గృహీతములయిన 'గా' మున్నగు వాని విషయమునను అవిశేషమును బోధించును. 'గా' 'మా' 'దా' 'ధా'- అనునివి గ్రహింపబడిన సూత్రములందు, ఆ రూపములు లాక్షణికములా ? ప్రతిపదోక్తములా ? ఆధాతువులు నిరనుబంధకములా సానుబంధకములా ? ఏకానుబంధకములా ? ద్వ్యనుబంధకములా ? అవి ?- అను విచారముతో పనిలేకుండ దత్తతాక్కార్యములు ప్రవర్తించును' అని సామాన్యముగా బోధించునని భావము. కాగా విశ్రుతార్థత్వరూపమగు ప్రయోజనమును లేదు. ప్రకృతిగ్రహణమనావశ్యకము.

## యదాగమన్యాయవిచారము

వా॥ "సమాన శబ్ద ప్రతిషేధః"- అని ఆక్షేపవార్తికము.

'ఈ దాధాలతో సమానములయిన యితర శబ్దములకు 'ప్రనిదారయతి' 'ప్రనిధారయతి' మున్నగువానిలో వినబడుచున్నవానికి ఘుసంజ్ఞా ప్రతిషేధము చెప్పవలసియున్నది'- అని వార్తికార్థము.

ఇవి 'దృఙ్' 'ధృఙ్' ధాతువుల ణిజంత రూపములు. ఇందు ఋకార స్థానమున వృద్ధి రాగా, దా, ధా శబ్దములందు వినవచ్చుచున్నవి. వానికి ఘుసంజ్ఞ కలిగిన నేర్గదేత్యాది సూత్రముచే ణత్వము రావలసియుండును.

ఈ ఆక్షేపమునకు సమాధానవార్తికము

వా॥ "సమాన శబ్దాప్రతిషేధోఽర్థవద్గ్రహణాత్" అనునది.

సమాన శబ్దములకు ప్రతిషేధమనర్థకము. అప్రతిషేధమనగా అనర్థకమైనది ప్రతిషేధమనుట. ఘుసంజ్ఞ వానికెందువలన రాదు ? అర్థవద్గ్రహణము వలన = అర్థ విశిష్టములయిన దా ధాలకే గ్రహణము కాబట్టి వానికి ఘుసంజ్ఞా ప్రాప్తి లేదు. ఇవి యర్థవంతములు కావుగదా ! అచట రేఫము "ఉరణ్రపరః" (1-1-51) అను సూత్రముచేత విధాన కాలమునందే, ఆకారమున కవయవముగా జేరినందున, 'దార్' 'ధార్' అనునవియే యర్థవంతములు. కావున వాని యవయవములగు దాధాలకు ఘుసంజ్ఞరాదు.

వా॥ "అనుపసర్గాద్వా"- అని సమాధాన హేత్వంతర వార్తికము.

ఘుసంజ్ఞ ప్రవర్తించినను నిట ణత్వ ప్రసంగము లేదు. ప్రశబ్ద మిట దా, ధాలకుపసర్గముగాదు. అది 'దార్' 'ధార్'- అనువానికే యుపసర్గమగును. ప్రాదులేధాత్వర్థక్రియా యుక్తములో వానికే యవి గతి సంజ్ఞయు నుపసర్గసంజ్ఞయుగలవి యగును. 'ఘుసంజ్ఞకములకుపసర్గమైన దానికంటె పరమైన, 'ని' అనుదానికి ణత్వము వచ్చును' అని నేర్గదేతి సూత్రమునకర్థము.

"అట్లైన 'ప్రణిదాపయతి' 'ప్రణిధాపయతి' అనుచోట గూడ ఘుసంజ్ఞా ణత్వములు ప్రాప్తింపక పోవునే ? ఇటగూడ నివి యర్థవంతములు కావు గదా. పుగాగమము ప్రవర్తించిన తరువాత, పకారాంతములగు 'దాప్' 'ధాప్' అనునవియే యర్థవంతములు. వానికే 'ప్ర' అనునది యుపసర్గము."- అను నాక్షేపమునకు సమాధానముగా,

వా॥ "నవార్థవతో హ్యాగమ స్తద్గుణీభూత స్తద్గ్రహణేన గృహ్యతే యథాన్యత్ర" అను వార్తికమవతరించినది.

లేదా- ఇదిదోషము కానేరదు. ఎందువలన ననగా, అర్థవత్తునకు వచ్చిన యాగమము, దానికవయవమేయగునని శాస్త్రముచే బోధింపబడుచున్నదిగాన తద్బోధక శబ్దముచే విశిష్టము గ్రహింప బడును. దేవదత్తున కొక కంతిపుట్టినను కొనుడు. అయినను, తద్విశిష్టునకు దేవదత్తుడను వ్యవహారము లేక పోదు. నిమిత్తవశమున నుపచయాపచయములు కలిగినను దానివలన, 'అదియేయిది' అను వ్యవహార మా పదార్థమునకు లేకుండపోదు. 'లవితా' 'లవితుమ్'- ఇత్యాది స్థలాంతరములందు గూడ, అర్థవంతమగు ప్రత్యయమునకు గలిగిన 'ఇడాగమము' తదవయవమయినందున తద్విశిష్టమునకు ప్రత్యయ వ్యవహారమునకు భంగము లేదు.

ఆ విధముగనే ప్రణిదాపయతి అనుచోట 'దా' అనుదానికి ఘుసంజ్ఞ ప్రవర్తించిన తరువాత వచ్చిన పుగాగమము, దానికి 'ఘువ్యవహారము'ను గాని అర్థవత్త్వ వ్యవహారమును గాని నివర్తింప జేయదు.

ఇక 'ప్రవిదారయతి' అనుచోట రేఫాగమము ఆకారమునకే అవయవము గాన 'దార్' అనునదియే యర్థవంతముగాని 'దా' అనునది కాదుగాన నట ఘుసంజ్ఞా ప్రాప్తి లేదు.

ఏమయ్యా! శబ్దములును ఆకాశాదుల వలె నిత్యములుగదా! అనగా నవి కూటస్థములు వికారరహితములు, లోపముగాని ఆధిక్యము గాని లేనివి యనుగా ఉండ దగినవాయె. ఆగమమనగా నొక కొత్త వర్ణమవయవముగా చేరుటగదా! కాగా 'దా' శబ్దమునకు పుగాగమము విధింపబడినదనిన, దానికి 'దాప్' అనునది యాదేశమయిన దనియేయర్థము కావలెను. అపుడు 'దాప్' శబ్దమే యర్థవంతముగాని 'దా' శబ్దము' గాదు. కనుక దోషము తదవస్థమే యగునే ? నిత్యశబ్దతావాదమునందు ఆగమవిధాన మెట్లు యుక్తమగును ?

ఆ పక్షమున ఆదేశవిధానము మాత్రమెట్లయుక్తమగును ? అపుడైనను స్థానినశించి, దానిస్థానమున వర్ణాంతర మాదేశమగుననిగదా యర్థము ? కావున నదియుభయవాదులకును దోషమేగదా ?

శబ్దనిత్యతాపక్షమునందు ఆగమ విధాన మయుక్తమయినను, ఆదేశ విధానము చక్కగా బొసగును. అట ఆదేశములు శబ్దాంతరములే యగును. "షష్ఠీస్థానేయోగా" (1-1-49) అను సూత్రమునందలి స్థానశబ్దమునకు ప్రసంగ నివృత్తికాదు. ఆ ప్రసంగముకు బుద్ధివిపరిణామ మాత్రమే. స్థాన్యాదేశభావ మనిన, స్థానిబుద్ధికి నిమజ్జనమును, ఆదేశబుద్ధికి ఉన్మజ్జనమును అనియే యర్థము. ఆశబ్దములు ప్రయోగములందు నిత్యములుగా నున్నవే. శబ్దాంతర బుద్ధి ప్రసక్త మయినపుడు, శబ్దాంతర బుద్ధి కలుగునని పర్యవసానము. ఆగమ మట్టిదిగాదు. ఉన్నయొక శబ్దమునకు, అపూర్వముగ నొకయవయవము వచ్చి కలియుట ఆగమము.

అట్లైన నాగమములు గూడ నాదేశముకే యగును. ఆగమరహితముల కాగమవిశిష్టము లాదేశము లనవచ్చును.

అది యెట్లు కుదురు ననిన,

దాక్షీకుమారుడయిన పాణినిమతమున నన్నియు నన్ని పదములకును నాదేశములే. అట్లుచెప్పక, ఏకదేశమునకు వికారము, మార్పు, కలుగునని చెప్పిన శబ్దముల నిత్యత్వము అనుపపన్నమగును.

శ్లో॥ "సర్వేసర్వపదాదేశా దాక్షీపుత్రస్యపాణినేః
ఏకదేశ వికారేహి నిత్యత్వం నోపపద్యతే॥"

అన్నియు నన్ని పదముల కనగా, ప్రకృతి ప్రత్యయాదులకని యర్థము. సుప్తిఙంతరూపపదముల కనిగాదు. తవ్యప్రత్యయమునకు, 'ఇ' ఆగమముగా వచ్చుననిన, 'తవ్య'కు 'ఇతవ్య' ఆదేశమగుననియర్థము. స్థాన్యాదేశభావమును, ఆగమాగమిభావమును, బుద్ధి విపరిణామమాత్రములే. వర్ణముల నిత్యతను పరి రక్షించుటకే బుద్ధి విపరిణామమంగీ కర్తవ్యము. ప్రక్రియాదశలో, ఆగమాదేశ కల్పనము, తద్వ్యవహారము, యదాగమన్యాయస్థానివద్భావాదులును, అపరి హార్యములే.

## అనిష్టాపత్తి నిరాకరణము

వా॥ "దీఙః ప్రతిషేధః స్థాఘ్వోరిత్వే"- అని యాక్షేపవార్తికము.

"స్థాఘ్వోరిచ్చ" (1-2-17) అను సూత్రము, స్థాధాతువునకును, ఘు సంజ్ఞక ధాతువులకును ఇత్వముకు విధించునది. 'దీఙ్' క్షయే అనునది దైవాదికమగు నొక ధాతువు. దీనికిల్యప్పుపరమగునపుడును, శిత్తుకాని గుణనిమిత్త ప్రత్య యము పరమైనవుడును, ఆత్వము, "మీనాతి మినోతి దీఙాంల్యపిచ" (6-1-50) అను సూత్రముచే విధింపబడినది. "ఉపాదాస్తాస్య స్వరఃశిక్షకస్య"— అను ప్రయో గమునందు, ఉప+అ+దీ+స్+త, అను నవస్థలో ఆత్వము ప్రవర్తించిన

తరువాత, 'దా' అను రూపము కలదుగాన దానికి ఘు సంజ్ఞ ప్రవర్తించిన, ఇత్వము రావలసియుండును. కావున ఘు సంజ్ఞా ప్రతిషేధము కర్తవ్యమని వార్తికకారుని యాక్షేపమునకు తాత్పర్యము.

ఈ దోషము ప్రకృతి గ్రహణమువలననా? లేక రూపగ్రహణము వలననా? ప్రసక్తమగుచున్నది?

దా రూపము ఘు సంజ్ఞకమగుసని రూపగ్రహణమువలన.

ఘు సంజ్ఞాసూత్రమునందు, ప్రకృతి గ్రహణమువలన, "ఉపదిదీషతే" అను స్థలమునందును దోషము ప్రాప్తించుచున్నది.

ఇది సన్నంతరూపము. సజ్విషయమున ఆత్వము విధింపబడుటవలన దీశబ్దమిచట దా ప్రకృతి యగుచున్నది. కాగా "సనిమీమాఘు" (7-4-54) ఇత్యాది సూత్రముచే, 'ఇస్' ఆదేశము రావలసి వచ్చుచున్నది. అందువల్లనచట ప్రకృతి గ్రహణము దుష్టము.

అనిన, కాదు. దా ప్రకృతి ఘు సంజ్ఞకమగునని గదా చెప్పబడినది. ఇది దా ప్రకృతి కాదు. ఆకారాంతములకు ఏజంతములు ప్రకృతులు. ఏజంతములకు ఈకారాంతములు ప్రకృతులు. 'దా' కు 'దే' అనునది ప్రకృతి. 'దే' అను దానికి 'దీ' అనునది ప్రకృతి. కాగా 'దీ' అనునది ప్రకృతికి ప్రకృతి గాని తనకు ప్రకృతి గాదు. ప్రకృతి ప్రకృతి స్వప్రకృతిగా గ్రహింపబడదు గదా.

అట్లైన 'దీఙ్' ధాతువునకు ఘుసంజ్ఞా ప్రతిషేధము వక్తవ్యమేనా? అక్కరలేదు. అది వక్తవ్యముగాదు. ఘు సంజ్ఞ ఏల రాదనిన, "సన్నిపాత లక్షణో విధిరనిమిత్తం తద్విఘాతస్య" అను పరిభాషచే ఘుత్వము రాదు.

సన్నిపాత మనగా సంబంధము. అది పౌర్వాపర్యమయినను గావచ్చును. విశేషణ విశేష్యభావరూపమయినను గానగును. లక్షణమనగా నిమిత్తము. ఆ సన్నిపాతము నిమిత్తముగా కల విధి సన్నిపాత లక్షణ విధి. విధియన, విధాయక శాస్త్రము. అట్టి విధి ఆ సన్నిపాతమునకు విఘాతమును గలిగించు వేరొక విధికి నిమిత్తముగారాదు. 'తద్విఘాతస్య' అను పదమునకు 'తంవిహన్తీతితద్విఘాతః తస్య' అని విగ్రహము. 'తద్విఘాతస్య = ఆ సంబంధమునకు నాశకమయినదానికి' అని యర్థము. ఉపజీవకము ఉపజీవ్యమునకు విరుద్ధమగు పనిని జేయరాదను లోక న్యాయమీ పరిభాషకు మూలము.

ప్రకృతమున దీఙ్ ధాతువునకు ఘు సంజ్ఞా ప్రతిషేధావశ్యకత విషయము. 'ఉపాదీస్త' అను లక్ష్యములో "మీనాతి మినోతిదీఙాంల్యపిచ" (6-1-50) అను సూత్రముచే ఆత్వమీకారమునకు వచ్చును. దానికి నిమిత్తము సిచ్ ప్రత్య

యము. ఆత్వానంతరము, ఘుసంజ్ఞ ప్రవర్తించినయెడల, "స్థాఘ్వోరిచ్చ" (1.2.7) అను సూత్రముచే, 'దా' అనుచో ఆకారమునకు ఇకారాదేశమును, సిచ్చుకు కిత్త్వమును ఆత్మనేపద ప్రత్యయము పరమగునపుడు ప్రాప్తించును. కిద్భిన్నమగు సిచ్ప్రత్యయమును నిమిత్తముగ నాశ్రయించి ప్రవర్తించి ఆత్వవిధాయక శాస్త్రము, తాను ప్రవర్తించిన తరువాత ఘసంజ్ఞ కలిగినచో, 'స్థాఘ్వోరిచ' అను సూత్రము విధించిన కిత్త్వము గూడ సిచ్చునకు ప్రవర్తించుపుగాన సన్నిపాతలక్షణ విధియగు ఆత్వవిధి. తద్విఘాతకవిధి యగు ఘుసంజ్ఞా విధికి నిమిత్తమయినదిగా దేలినది. కావున నీ పరిభాషచేత నాత్వము ఘుసంజ్ఞను ప్రవర్తింపచేయదు. కాగా, "దీఙః ప్రతిషేధః స్థాఘ్వోరిత్వే" అను వార్తికమనావశ్యకము"

"నానుబంధకృతమనేజన్తత్వమ్" అనుపరిభాషానిరూపణము.

వా॥ "దాప్ప్రతిషేధేనదైప్య నేజన్తత్వాత్" అని యాక్షేపవార్తికము.

ఈ సూత్రమున 'అదాప్' అనునది నిషేధబోధకము. 'దాప్' ఘుసంజ్ఞకము కాదని యర్థము. 'దాప్' లవనే' అనుధాతువు నిషేధవిషయము. దైప్ శోధనే అను ధాతువునకును నీనిషేధము ప్రవర్తింపవలెను. అందైకారమునకు ఆత్వము వచ్చినచో నిదియు "దాప్" అగును. కాని పకారాంతమేజంతము గాదుగాన నాత్వము ప్రాప్తింపదు. అది ఘుసంజ్ఞకమైన, అవదాతమ్' (ముఖమ్) అనుచో, "అచఉపసర్గాత్తః (7.4 47) అను సూత్రముచే, ఆకారస్థానమున తకారమాదేశముగా విధింపబడుటవలన 'అవత్తమ్' అని రూపము ఏర్పడవలసివచ్చును. ఇది యాక్షేపము.

వా॥ "సిద్ధమనుబంధస్యానేకాంతత్వాత్" అని సమాధాన వార్తికము.

'దైప్' ధాతువునకు గూడ ఘుసంజ్ఞా ప్రతిషేధము సిద్ధమే. ఎట్లు? అనుబంధము అనేకాంతము గనుక. అనుబంధములనేకాంతములుగదా. అనుబంధములనగా నిత్సంజ్ఞక వర్ణములు. ప్రకృతధాతువున పకారమనుబంధము. అదిధాతువున కవయవముగాదు. అనేకాంతమనగా అవయవమనియర్థము. కావున పకారమున్నను ఐకారము ధాత్వంతమేయగును. "ఆదేచ ఉపదేశే శితి" (6-1-45) అని ఆకారాదేశము రావచ్చును, అనుబంధ ప్రయుక్తమగు నేజంతత్వాభావము ప్రతిబంధకము గాదు అని పరిభాషకర్థము. ప్రతిషేధము సిద్ధమే.

వా॥ "పిత్ప్రతిషేధాద్వా"- అని సమాధానాంతర వార్తికము" లేదా- 'దాధాఘ్వదాప్' అను సూత్రమును మార్చి 'దాధాఘ్వపిత్' అని పఠింతుము. ఆ విధముగ మార్చుట ఆవశ్యకమును నయియున్నది. అదాప్' అను పాఠమున, 'ప్రణిదాపయతి' అను స్థలమున,పుగాగమానంతరము 'దా'అనునది'దాప్'అగును.

గాన, నిషేధము ప్రాప్తించును. అపిత్ అను పాఠమున నదే వారింపబడును. అదిపకారేత్సంజ్ఞకము కాదుగదా.

అట్లు పాఠమును మార్చనక్కరలేదు. 'దాధాఘ్వదాబాద్యన్తవదేకస్మిన్ అను సంహితాపాఠమున, 'అదాబ్' అని చాంతమునుగా ఛేదించి, బకారాంతము లయిన దా, ధా-కు ప్రతిషేధమని చెప్పవచ్చును. 'దాప్, దైప్ ధాతువులకు ధాతుపాఠమునందు బకారాంతములనుగా జరింపవచ్చును' అని సూత్రకారుని తాత్పర్యము కావచ్చును.

బాగున్నదిగాని అట్లైన సూత్రము భేదించునే ?

సరి. యథాన్యాసముగనే యుండనిండు. ఏమార్పును వలదు. 'దాప్'కు ప్రతిషేధమనిన నది దైప్‌కు సిద్ధింపకపోవును అది ఏజంతము కాదుగదా' అని యంటిరిగదా యనిన ఆక్షేపము 'సిద్ధమనుబంధస్యానేకాంతత్వాత్' అని చెప్పి, ఇత్సంజ్ఞక వర్ణములుపస్థాపకావయవములు గావని పరిహరింపబడినదిగదా.

అట్లైన నవి అనవయవములే అను పక్షము దోషమే. ఏకారాంతములే యనునది సిద్ధాంతపక్షముగదా.

ఆ పక్షమునను దోషము లేదు ఆత్వము ప్రవర్తించిన తరువాత ప్రతిషేధము సిద్ధించును. ఏజంతము కానందున ఆత్వము ప్రాప్తింపదని చెప్పబడినది గదా. పకారము లోపించిన తరువాత నది రావచ్చును. అపుడది దాప్ కాదే యనిన, భూతపూర్వగతిచే కావచ్చును దా రూపము సాంప్రతికము. పకారము భూతపూర్వము.

ఇత్సంజ్ఞక వర్ణవిశిష్ట రూపములు గ్రహింపబడిన సూత్రములందంతటను, భూతపూర్వగత్యాశ్రయణమే యుక్తము ఇత్సంజ్ఞ ఉపదేశోత్తర కాలముననే ప్రవర్తించును. లోపానంతరము ప్రయోగమున నుండునది 'దా' శబ్దమే. అదియే ధాతువు దానికి పిత్కార్యములు లభించును.

లేదా — అనుబంధముండుటవలన నేజంతత్వమునకు భంగముకలుగదు. అను నంశమును, పాణిన్యాచార్యులు సూత్రరచనా ప్రణాళిక జ్ఞాపన చేయుచున్నది "ఉదీచాం మాఙో వ్యతీహారే"(3-4-19) అను సూత్రము వ్యతీహారార్థకమగు మాఙ్ అను ధాతువునకు బరముగా క్త్వా ప్రత్యయమును విధించుచున్నది. 'మేఙ్' ప్రణిదానే అనునది ధాతుపాఠమున బఠింపబడినది. ప్రణిదానమనగా, వ్యతీహారము. ఈ 'మేఙ్' ధాతువే సూత్రమున, ఆత్వముచే నిర్దేశింపబడినది. ఆ నిర్దేశమే 'అనుబంధకృతమగు నేజంతత్వాభావము ఏజంత వ్యవహారమునకు ప్రతిబంధకము గాదు' అని జ్ఞాపన చేయును. కాగా ఇత్సంజ్ఞకమున్నను, ఆత్వము సిద్ధించును.

లేదా — దైప్ శోధనే అను ధాతువుగూడ 'దాప్ శోధనే' అనియే పఠింపబడియుండును. 'దైప్' అనునది లేనేలేదు.

'అవదాయతి' అను రూపమెట్లు సిద్ధించుననిన, దివాదిగణమునందు అది పఠింపబడును గాన 'శ్యన్' ప్రత్యయము వికరణమగును.

"దాధాఘ్వదాప్" సమాప్తము.

## "ఆద్యంతవదేకస్మిన్" (1-1-21)

ఇది అతిదేశసూత్రము. అతిదేశములు (1) రూపాతిదేశము (2) నిమిత్తాతిదశము (3) తాదాత్మ్యాతిదేశము (4) వ్యపదేశాతిదేశము (5) శాస్త్రాతిదేశము (6) కార్యాతిదేశము - అని ఈ విధముగా పలురకములు గలవు. అతిదేశ సూత్రములు, సామాన్యముగ వతిప్రత్యయ ఘటితములుగ నుండును. 'తృజ్వత్' పూర్వవత్, పరాంగవత్, స్థానివత్, కర్మవత్, ఙిద్వత్ - ఇత్యాదులతిదేశములు.

ఆదిశ్చ, అంతశ్చ=ఆద్యంతౌ॥ ఆద్యంతయోరివాద్యంతవత్॥ ఏకస్మిన్= అసహాయమునందు. "సుపిచ" (7-3-102) అను సూత్రము, హ్రస్వాకారాంతమగు నంగమునకు, 'రామాభ్యామ్' ఇత్యాదులందు దీర్ఘమును విధించును. 'అ' కార మాత్రము అంగమైన స్థలమునందు నది ప్రవర్తింపవలెను. అట్టి స్థలమునందు అకారమాత్రమునందు అకారాంతత్వము నీ సూత్రమతిదేశించును. కాగా, 'ఆభ్యామ్' అనుచోటను దీర్ఘము సిద్ధించును

గౌణముఖ్యన్యాయము ముఖ్యమునందే శాస్త్రీయ కార్యములు ప్రవర్తింపవలెనని చెప్పుచున్నందున, గౌణవ్యవహారముగల, అకారమాత్రములందు, దీర్ఘాదికార్యములు ప్రవర్తించుట కీయతిదేశమావశ్యకము.

లౌకికమగు వ్యపదేశివద్భావముండగా నీయతిదేశమునకు ప్రయోజనమేమి? అను ప్రశ్న కలుగగా దానికి వార్తికకారుని సమాధానము.

వా॥ "సత్యన్యస్మిన్నాద్యంతవద్భావాదేకస్మిన్నాద్యంతవద్వచనమ్" అది ఒక సముదాయమునకు ఘటకమై, స్వేతరములయిన తద్ఘటకములకు పూర్వము తానుండి, తనకు ముందు వేరొక సముదాయ ఘటకములేనిది = ఆది యగును.

ఇట్లే తాను సముదాయ ఘటకమై స్వేతరములయిన తద్ఘటకములు, తనకు పూర్వముననే గాని పరమున లేనిది = అంతమనబడును.

ఆద్యంత పదములు గల శాస్త్రములు, అట్టి లక్ష్యములందే ముఖ్యముగ ప్రవర్తించును, కాగా అసహాయమైన ఏకైక వర్ణముగమందు లక్ష్యమునం

దాద్యంతావదిష్టములగు కార్యములు ప్రవర్తింపకపోవును. అవి యచట గూడ ప్రవర్తించుట సమ్మతము. అవశ్యాపేక్షితము కాని యత్నము లేనిచో నది సిద్ధింపదు అందువలన అద్యంతవద్భావము శాస్త్రప్రయోజనసిద్ధికయిన యత్నము. ఇది అనన్యథాసిద్ధ ప్రయోజనము.

వా॥ "తత్ర వ్యపదేశివద్వచనమ్" అని ఆక్షేపవార్తిక ఖండము. అద్యంతవద్భావమునకు బదులుగ వ్యపదేశివద్భావమును జెప్పుట కర్తవ్యము. వ్యపదేశమనగా ముఖ్య వ్యవహారము. అది కలది వ్యపదేశి. వ్యపదేశముకలదాని వలెనే అసహాయమైనదియు నగునని చెప్పుటయే వ్యపదేశివద్వచనము.

అద్యంతవద్భావముకంటే నీ వ్యపదేశివద్భావము వ్యాపకము. కార్యము లన్నియు అద్యంత పదావదిష్టములు మాత్రమే కావు. "అద్యంత వదేకస్మిన్" అనుటకు బదులు "వ్యపదేశివదేకస్మిన్" అని సూత్రమును రచించిన, అద్యంత వదావదిష్ట కార్యములను తద్భిన్నములగు వక్ష్యమాణ కార్యములను దీనివలననే సిద్ధించును అపుడీ వ్యపదేశివద్భావము గూడ శాస్త్ర ప్రతిపాదిత మగును గాన శాస్త్రీయమగు గౌణ ముఖ్య న్యాయము బాధించును.

వ్యపదేశివద్వచన ప్రయోజనము లేమి ? అనిన,

వా॥ (1) "ఏకాచో ద్వే ప్రథమార్థమ్" (2) "షత్వే మిదేశ సంప్రత్యయార్థమ్" అను రెండు వార్తికములచే నవి చెప్పబడినవి.

"ఏకాచో ద్వే ప్రథమస్య" అనునది షాష్ఠద్విత్వవిధిలో నధికార సూత్రము. అందు "ఏకాచః" అనునది బహువ్రీహి నిర్దేశమని "ఏకాచో ద్వే ప్రథమ స్యేతి బహువ్రీహి నిర్దేశః" అని ఆ సూత్రమున వార్తికకారుడు చెప్పెను. 'అచ్పుకలదానికి' అని యర్థ 'ఇచ్' ను ధాతువు అట్టిది అట ఏకాజ్వ్యవహారము ముఖ్యము. కావున ద్విత్వ మచటనే ప్రవర్తించుట యుచితము 'ఇణ్ గతౌ' అని ధాతువు. అం దికార మాత్రమే ధాతువు. అది గల సముదాయము వేరొండు లేదు. ద్విత్వ మచట, ఆ ఇకారమునే, ఏకాచ్పునుగా తీసికొని ప్రవర్తింపవలెను. అది వ్యపదేశివద్భావ ప్రయోజనము. అది అద్యంతపదావదిష్టముగాదు. ఇట్లే 'అర' అను 'ఋ' ధాతురూపములందును ద్విత్వము వ్యపదేశివద్భావమునకు ప్రయోజనము

ఇంకొక కార్యము, అద్యంతవదావదిష్టము కానిది సిద్ధించుటయు తత్ప్రయోజనము. "ఆదేశ ప్రత్యయయోః" (8.3.59) అను సూత్రము షత్వవిధాయకము అందలి షష్ఠీ ప్రత్యయాంశము. నవయవ షష్ఠి "ఆదేశ ప్రత్యయయోరిత్యవయవషష్ఠీ షా" అని ఆ సూత్రమున చెప్పబడును. కావున ప్రత్యయావయవమగు సకారమునకు షత్వము వచ్చునని యర్థము. 'కరిష్యతి' హరిష్యతి మున్నగు స్థలములందు, 'స్య' అనునది ప్రత్యయము. సకారము తదవయవము. కాగా

ప్రత్యయావయవ సకారమను వ్యవహారమటు ముఖ్యము. అచ్చటనే షత్వము ప్రవర్తించును.

'ఇన్ద్రో త్రిమా వక్షత్' 'సదేవా న్యక్షత్' అను ఋఙ్మంత్రములందలి 'వక్షత్' 'యక్షత్' అను లేట్రూపములందు, 'సిప్' అను వికరణ ప్రత్యయమునకు, అది సకార మాత్రమే యగుటవలన షత్వము సిద్ధింపకపోవును. 'అసహాయము నందును, వ్యపదేశితో తుల్యముగ కార్యములు ప్రవర్తించును' అను నీ యతిదేశముచే అది సిద్ధించును.

అట్లైన వ్యపదేశివద్భావము పూర్వముగ వక్తవ్యము కావలసినదన్నమాట. అక్కరలేదు. వా॥ "అవచనాల్లోక విజ్ఞానాత్సిద్ధమ్" అని వార్తికము. అవచనాత్=వచనరహితముగు. వచన మక్కరలేకయే యనుట. లోకవిజ్ఞానాత్= లోక వ్యవహారమువలన ఇది సిద్ధించును. అనగా 'ఇణ్ గతౌ' - అను ధాతువు ప్రయోగభేదముచే బహురూపములు గలది. 'ఏతి', 'ఇతః', 'యన్తి', 'అయనమ్', 'అగాత్', 'గమయతి'- అని యిట్లనేకరూపములు గలదిగా, ఏ-ఇ-య్-అయ్-గా-గమ్ అని ప్రయోగములం దగపడుచున్నది. అందు 'ఇ' అనునది దాని యవయవమగు నేకాచ్చు గనుక 'ఇణ్ ధాతువేకాచ్చ'ను వ్యవహార ముపపన్నముగును.

అట్లే సిప్ప్రత్యయము. 'జోషిషత్' ఇత్యాద్యులందు ఇడాగమసహితముగను, 'వక్ష' దిత్యాద్యులందు తద్రహితముగను నగపడుచున్నది. కావున నిది దాని సకారమను వ్యవహార ముపపన్నము గావచ్చును. ఆ విధముగనే లోకము నందును, 'ఇది ఈ రాతిబొమ్మ శరీరము' - అందురు. అట రాతిబొమ్మ వేరుగను దాని శరీరము వేరుగను లేవు. అయినను అవస్థాభేద కల్పనముచేసి, తత్తదవస్థావస్థితమగు నా బొమ్మయొక్క ఒకానొక యవస్థ ఈ శరీరము అను తాత్పర్యముతో అట్టి వ్యవహారములు ఏర్పడినవి. ఇవి లోకనిరూఢములగు వ్యవహారములు గాన లోకము నందువలెనే శాస్త్రమునందును నట్టి వ్యవహారముల కుపపత్తి గలదు.

లోకమునందు, గ్రామమనగా గొన్ని యిండ్ల సముదాయము గదా! ఒకానొక గ్రామమున నొకటే యిల్లున్నను, నొకటే యిల్లుగల గ్రామ మిది యందురు. అట ఇల్లే ఊరు. ఊరే యిల్లు గదా!

ఈ దృష్టాంతము సరిగాదు. గ్రామ శబ్ద మనేకార్థములు గలదిగనున్నది. ఒకచోట శాలా సముదాయము గ్రామము. 'గ్రామము దగ్ధము' అనిన శాలలు దగ్ధములనియే గదా యర్థము.

ఒకచో వా గ్రామశబ్దము వాటి పరిక్షేపమును అనగా పొలిమేరను

బోధించును. గ్రామము ప్రవేశించె ననిన ఊరి సరిహద్దును బ్రవేశించె నని గదా యర్థము.

"గ్రామమంతయు వెడలినది లేదా వచ్చినది"- అనిన నట గ్రామమనగా జనులు.

"గ్రామము లభించినది" అను వ్యవహారములో గ్రామమనగా అడవులు, గట్టులు, పోరంబోకులు - దీనితోగూడిన యూరని గదా యర్థము.

కాబట్టి అరణ్య సీమా, స్థండిల సహితమైన యూరును మనమునవిడి కొని, ఈ గ్రామమేకశాలము అనుచున్నారు. అటనయ్యది ముఖ్య వ్యవహారమే కావున దృష్టాంతము గాజాలదు.

అట్లైన నింకొక దృష్టాంతమును జూడుడు.

'పదమనగా వర్ణముల సముదాయము'. 'పదసముదాయము ఋక్కు', 'సూక్తమనగా ఋక్కుల సముదాయము' అనిగదా వ్యవహారము. కాని, ఏకాక్షరములయిన పదములును, ఒకటే పాదముగల ఋక్కులును, ఏకర్చములగు సూక్తములును గలవు. ఆ వ్యవహారమును వ్యపదేశివద్భావ సిద్ధమే— అనిన నీ దృష్టాంతమును కుదురువడనిదే. ఏలయన, 'ఒక వర్ణము గల పదము'— అను వ్యవహారమునందు, పదమనగా నర్థము. కనుక నా వ్యపదేశము, అర్థయుక్తము. ఋక్కనినను నర్థమే. సూక్తమును అర్థమే. శబ్దార్థముల కభేదమనాది యగుటచేత నన్యపదార్థము అర్థ మననగును. వర్ణ, పాద, ఋక్కులు వర్తి పదార్థములు. కావున నదియు ముఖ్యవ్యవహారమే॥

అట్లయిన వక్ష్యమాణములని శాల్యములగు దృష్టాంతములు. ఒక వ్యక్తికి ముగ్గురు పుత్రులున్నప్పుడు, వారిలో పెద్దవానిని, 'వీడు నా పెద్ద కొడుకని యు, రెండవవానిని, 'వీడు మధ్యముడనియు, మూడవవానినీతడు కడగొట్టు వాడనియు వ్యవహరించుట ఉపపన్నము. కాని ఒకడే పుత్రుడు గల తండ్రి గూడ, 'వీడు నాకు పెద్దవాడు, మధ్యముడు కనిష్ఠుడును' అని వ్యవహరించుట గలదు. వానికి ముందు బిడ్డలు లేనందున, వాడే ప్రథముడనియు, రెండవ కుమారుడు కలుగకున్నను, వాడే ఆ యానందమును నిచ్చుటచే మధ్యముడనియు, ఇక బిడ్డలు కలుగబోరను నభిప్రాయముతో వీడే చివరివాడనియు నట్లు వ్యవహరింతురు.

అట్లే - 'ఆమె ప్రథమ గర్భముచే మృతి నందినది' - అని వ్యవహారము కలదు. ఆమె అంతకు పూర్వము కనలేదు. అటుపైన కనబోదు. కుక్షిస్థ సంతానము చేతనే మృతి పొందినది. కాని, యోగ్యతాధ్యవసాయముచే భావి గర్భమును వివక్షించి, "ప్రథమ గర్భమిది అను వ్యవహారముచట నిరూఢమైనది.

ఇంకొక దృష్టాంతము - ఒకడు, అంతకు ముందచటకు రాలేదు. ఇక తరవాతకూడ రాబోడు. అపుడే వచ్చినవాడు. ట్టివాడు "ఇదంమే ప్రథమ మాగమనమ్" 'ఇది నా మొదటిరాక' అనుట కలదు.

పై లోకవ్యవహార దృష్టాంతములవలననే, అసహాయములందును ముఖ్య వ్యవహారము శాస్త్రమునందును సిద్ధింపవచ్చునుగాన వ్యపదేశివద్భావము వక్తవ్యముగాదు అని తాత్పర్యము.

## "సూత్రప్రత్యాఖ్యానము"

వ్యపదేశివద్భావమువలె నాద్యంతవద్భావమును అవక్తవ్యమే॥ ఎట్లందురా? - ఆది అనగా దానికిముందు లేనిది. అంతమనగా దనకు దరువాత లేనిది. ఇవియే ఆద్యంతములకు లక్షణములు. ఏకకముగూడ నీ లక్షణ లక్షితముగా వచ్చును.కావున నసహాయమునందును నాద్యంతాపదిష్టములగు కార్యములు ప్రవర్తింపవచ్చునగాన అద్యంతవద్భావవచన మనావశ్యకమని, వా॥ "అపూర్వానుత్తరలక్షణత్వాదాద్యంతయోః సిద్ధమేకస్మిన్"— అను ప్రత్యాఖ్యాన వార్తికభావము.

ఈ విషయమున గోవర్ధియుడు మాత్రము ఇట్లు చెప్పుచున్నాడు. 'అపూర్వత్వమాదిత్వము,' 'అనుత్తరత్వమంతత్వము' - అని నీవు చెప్పినది సత్యమే. కాని "సత్యన్యస్మిన్" వ్యక్త్యంతరమున్నపుడు - అని గూడ లక్షణమున జేర్పవలెను. ఆద్యంతములు ప్రతియోగి సాపేక్షము . 'ఇది అది అనుట' అదికానిది వేరొకటియుండిననే సంభవము. ఇట్లే 'ఇది అంతము' అనుటయు, అన్య సద్భావముననే పొసగును నీవు చెప్పిన, 'అపూర్వత్వ' అనుత్తత్వములు లక్షణఘటకములు, కాని, అంతమాత్రమే లక్షణముగాదు. కావున నసహాయము నందు ముఖ్యమగునాద్యంత వ్యపదేశము సంభవపడదు. న సూత్ర మావశ్యక మని భాష్యకారుని సిద్ధాంతము. గోవర్ధియుడాగా భాష్యకారుడు"

## సూత్రోదాహరణ విచారము

ఈ సూత్రమునకు, పయోజనములేవి?

వా । "ఆదివత్త్వే ప్రయోజనం ప్రత్యయశ్చాదాద్యుదాత్తత్వే'- అనునది ప్రథమ ప్రయోజన వార్తికము.

"ప్రత్యయః" (3-1-1), "పరశ్చ" (3-1-2) "ఆద్యుదాత్తశ్చ" (3-1-3) - అని ప్రత్యయమున కాద్యుదాత్తత్వము విధింపబడినది. అది 'కర్తవ్యమ్' 'తైత్తిరీయః' - ఇత్యాదులందు, తవ్య, ఈయ, అను ప్రత్యయములకే ప్రవర్తించును గాని 'ఔపగవః' 'కాపటవః' - ఇత్యాదులందలి అకారమాత్రమే ప్రత్యయమైన

వానికి రాకపోవును అటుగూడ నాద్యుదాత్తము సిద్ధించుటకు ఆదివద్భావాతి దేశము.

అట్లే "ఞ్నిత్యాదిర్నిత్యమ్" (6 1.197) అను సూత్రముచే విధింపబడిన ఆద్యుదాత్తస్వరము. అహించుటకాయని: 'అగ్నివేశ్యః' అని మున్నగు స్థలము లందే ప్రవర్తించును గాని 'గార్గ్యః', 'కృతః'— ఇత్యాది లక్ష్యములలో, ప్రకృతులేకాచ్చులైన స్థలములందు ప్రవర్తింపకుండును. అటుగూడ నది ప్రవర్తించుట ఆదివద్భావ ప్రయోజనము.

వా॥ "వలాదేరార్ధ ధాతుకస్యేట్" అని రెండవ ప్రయోజన వార్తికము. "ఆర్ధధాతుకస్యేడ్వలాదేః" (7.2.35) అను సూత్రముచే విహితమయిన ఇడాగమము, 'కరిష్యతి' 'హరిష్యతి' మున్నగుచోట్ల నున్న ఆర్ధధాతుకమునకేగాని, 'జోషిషత్' 'మందిషత్'– ఇత్యాదులందున్న, వల్మాత్రమగు నార్ధధాతుకమునకు సిద్ధింపకుండగా అటుగూడ సిద్ధింపజేయుటయు ప్రయోజనము.

వా॥ "యస్మిన్విధి స్తదాదిత్వే" అని మూడవ వార్తికము. "యస్మిన్విధి స్తదాదావల్గ్రహణే" అని ముందు చెప్పబడును. అల్మాత్రబోధకమగు సప్తమ్యంత పదము విశేషణమైయున్నపుడు, విధింపబడిన కార్యము. ఆ అల్లు ఆదిగాగలదిపరమై నపుడు ప్రవర్తించునని దాని యర్థము. "అచిశ్నుధాతు భ్రువాం య్వోరియఙువఙౌ" (6 4.77) అను సూత్రముచే 'ఇయఙ్' 'ఉవఙ్' అను నాదేశములు విధింపబడినవి. ఆ సూత్రమునందలి 'అచి' అనునది అల్మాత్రమును బోధించు సప్తమ్యంతము. దానికి అజాది యగు ప్రత్యయము పరమైనపుడని యర్థము. 'శ్రియః' 'భువః' మున్నగు అజాది ప్రత్యయములు గల చోట ప్రవర్తించినట్లు శ్రియౌ భువౌ మున్నగు, అజ్మాత్ర ప్రత్యయములు పరమగునపుడును ఆ ఆదేశములు ప్రవర్తించుట, ఆదివద్భావమునకు ప్రయోజనము.

వా॥ "అజాద్యాత్త్వే" అనునది చివరి ఆదివత్త్వ ప్రయోజనము.

"ఆడజాదీనామ్" (6-4-72) అను సూత్రముచే విధింపబడిన ఆడాగమము, 'ఐక్షిష్ట' 'ఐహిష్ట' – మున్నగు స్థలములందువలె 'ఐష్ట' 'ఆధ్యైష్ట' మున్నగు స్థలములందు అజ్మాత్రమే ధాతువయినపుడును సిద్ధించుటయు ఆదివద్భావ ప్రయోజనము.

## అంతవద్భావమునకు ప్రయోజనములే యవి?

వా॥ "అంతవద్ద్వివచనాంత ప్రగృహ్యత్వే" – అని అంతవద్భావ ప్రథమ ప్రయోజనము.

"ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్" (1.1.11) అను సూత్రము ఏకారాంత ద్వివచనమునకు, ప్రగృహ్యసంజ్ఞను విధించుచున్నది. 'పచేతే', 'పచేథే' అను స్థలమునందు

అందు. 'ఆతే' 'ఆథే' అనునవి ముఖ్యములైన ఏకాంతవ్యాపచనములు. 'ఖట్వే' 'మాలే' అను స్థలములందు ఏకారము మాత్రమే ద్వివచనము. అచటగూడ ప్రగృహ్యత్వసిద్ధి అంతవత్త్వ ప్రయోజనము.

వా॥ "మిదచోఽన్త్యాత్పరః"- ఇదియు ప్రయోజన వార్త్తికము. 'మకారేత్సంజ్ఞకమయిన ఆగమము, అచ్చులలో, చివరి అచ్చునకు పరమై, సముదాయమునకంతావయవముగా ప్రవర్తించును' అని యర్థము 'కుండాని' 'వనాని'- ఇత్యాదులందు, 'కుండ' 'వన' అనునవి యజంతములయిన ప్రాతిపదికములు. "నపుంసకస్య ఝలచః" (7 1 72) అని విధింపబడిన నుమాగమము అట ముఖ్యముగ ప్రవర్తించును. 'కాని' 'యాని' అనుచోట్ల నొకటే అచ్చుగలది ప్రాతిపదికము. ఈ అంతవద్భావముచే నటగూడ నుమాగమము సిద్ధించును.

వా॥ "అచోఽన్త్యాదిటి"- ఇదియు నంతవత్త్వ ప్రయోజనాంతరము. అచ్చులలో చివరి యచ్చు మొదలుగాగల భాగమునకు 'టి' అని సంజ్ఞ. టిత్తులగు లకారములస్థానమున వచ్చిన ఆత్మనేపదప్రత్యయములయొక్క టి అను భాగమునకు ఏత్వమును "టిత ఆత్మనేపదానాం టేరే"(3 4.79) అను సూత్రముచే పాణిని విధించియున్నాడు. 'ఆతామ్' 'ఆథామ్'- అను ప్రత్యయములు అనేకాచ్కములు. అందుగల అచ్చులలో చివరిది రెండవ ఆకారము తదాది 'ఆమ్' అనునది. కావున దానికి 'కుర్వాతే' 'కుర్వాథే' అను రూపములలో ఏత్వము ప్రవర్తించినది.

'కుర్వే' 'కురుతే' అనుచోట్ల 'ఇ' 'త' అను ప్రత్యయములు ఏకాచ్కములు. 'అచ్చులలో చివరిది' అనదగినది అట లేదు కావున టి సంజ్ఞ ప్రవర్తింపకుండిన ఏత్వము సిద్ధింపకపోవును. అది సిద్ధించుట అతిదేశ ప్రయోజనము

"అలోఽన్త్యస్య" (1.1 52) అను పరిభాషకును ప్రయోజనము గలదు ఆయా సూత్రములందు షష్ఠ్యంత పదములచే నిర్దిష్టమగు దాని యంత్యాల్లునకాదేశములు ప్రవర్తించును. "సుపి చ" (7 3.102) అను దీర్ఘ విధాయక సూత్రము. హ్రస్వాకారాంతాంగమునకు దానిని విధించుచున్నది. 'ఘటాభ్యామ్' 'పటాభ్యామ్' ఇత్యాదులందు అంగము హ్రస్వాంతము దాని చివరి అల్లు హ్రస్వాకారము. దానికి దీర్ఘము ప్రవర్తించుట న్యాయ్యమే. కాని 'అభ్యామ్' మను చోట నంగము 'అ'కారము మాత్రమే. తదంతము కాదు. అదువలన నిట యంతవద్భావమావశ్యకము. అందును రెండు అంతవద్భావాతిదేశములు. అంగమునకదంతత్వము, ఏతదతిదేశాధీనము. ఆ 'అ' కారమునకు, అంగాంతత్వము గూడ నంతవద్భావాతిదేశ సాధ్యము

"యేన విధిస్తదన్తత్వే"- అనునది చివరి ప్రయోజన వార్త్తికము విశేషణములు తదంతములకు బోధకములు "అచో యత్" (3.1.97) అను సూత్రము

అజంతధాతువులకంచే పరముగ 'యత్' అను కృత్యప్రత్యయము విధించును. 'చిఞ్', 'చయనే', 'జి జయే'- అను ధాతువులు అజంతములు కావున నట యత్ప్రత్యయము ప్రవర్తించుటచే 'జేయమ్' 'చేయమ్' అను రూపములు నిష్పన్నములు.

'ఏయమ్' 'అధ్యేయమ్' అను స్థలములందు ఈ సూత్రముచే య త్ప్రత్యయము సిద్ధింపవలెను. అట ధాతువులు 'ఇణ్','గతౌ', 'ఇఙ్ అధ్యయనే' అనునవి, అజ్మాత్రములు. అజంతములు కావు. అవహోయముకందును అంతవద్భావముచే తత్తత్కార్యములు ప్రవర్తించునని ఈ సూత్రము బోధించుటచే పై రూపములును సిద్ధించును.

"ఆద్యన్తవదేకస్మిన్" - సూత్ర వివర్తము సమాప్తము.

## "తరప్తమపౌ ఘః" (1.1 22)

### అనిష్టనివారణాధికరణము

'తరప్' 'తమప్'- అను నివి రెండును 'ఘ' అను సంజ్ఞకలవి యగును.

వా॥ "ఘసంజ్ఞాయాం నదీతరే ప్రతిషేధః" అనుపవ వార్తికము 'నదీతరః' అనుచో 'తర' అను దానికి 'ఘ' అను సంజ్ఞ రాదు అని చెప్పవలెను అని వార్తికార్థము.

నద్యాస్తరః=నదీతరః- అని షష్ఠీసమాసము. "తౄప్లవనతరణయోః" అను ధాతువునకు "ఋదోరప్" (3.3 57) అను సూత్రముచే విధింపబడిన 'అప్' ప్రత్యయము చేరగా 'తరప్' అని యగును. ఇత్సంజ్ఞక వర్ణమగు పకారమందు లోపింపగా 'తర' అని కృదంత ప్రాతిపదిక మేర్పడినది. 'తీర్యతే నేన - తరః'= 'తరణమునకు సాధనమైనది' అని యర్థము. ప్రకృతరూపము పకారము లేకున్నను అది స్మరింపబడి కార్యసాధక మగును కావున ఘ సంజ్ఞ. అను అంథ వర్ణము లెచ్చుటనైనను ,ఇత్సంజ్ఞా ప్రవృత్తుంగ తరమే లోపించినను, స్మృతములే కార్యహేతువులగుట ప్రసిద్ధము. కావున నిదియు 'తరప్' అను రూపము గలదియు యగును

ఇట ఘ సంజ్ఞ ప్రవర్తించిన, "ఘ రూపకల్పచేలడ్బ్రువ గోత్ర మత హతేషు ఙ్యోనేకాచో హ్రస్వః" అను సూత్రముచేత ఉత్తరపదము పరముకాగా ఙ్యంత పూర్వపదమునకు విహితమైన హ్రస్వము ప్రాప్తించును. అది యనిష్టము

వా॥ "ఘసంజ్ఞాయాం నదీతరే అప్రతిషేధః" "తరబ్గ్రహణం హి లౌపదేశికమ్"- అని సమాధాన వార్తికము.

ఘ సంజ్ఞా విషయకముగా, 'నదీతర' అను పదమునందు 'తర' అను దానికి ప్రాప్తించు ఘ సంజ్ఞకు ప్రతిషేధము అనర్థకము.

ఘ సంజ్ఞ ఎందువలన రాదు అనిన,

తరప్ గ్రహణము ఔపదేశికము గదా! అని వార్తిక ఖండముల యర్థము. సూత్రమునందలి 'తరప్' అను గ్రహము ఉపదేశభవము యుదేదియో గ్రహింపబడును. 'నదీతరః' అను దానిలోని తరప్ ఔపదేశికము కాదు.

ఖైన ఉపదేశమునందలి 'తరప్' 'తమప్' అనునవి ఘ సంజ్ఞకములగును. ని చెప్పవలెనందురా ?

క్కర లేదు. చెప్పబడనిది యెట్లు తెలియబడవలెను ? అనిన, ఈ వ్యాకరణ శాస్త్రములో, ఇత్సంజ్ఞకవర్ణసహితములు గ్రహింపబడిన స్థలములెందైనను, ఈ రూప మెచ్చటనుండును? అని విచారింపబడును అన అనుబంధ విశిష్ట రూప మెచ్చటను-డునో అచట ఘ సంజ్ఞ ప్రవర్తించును. ఆయా శబ్దము అవి గ్రహింపను. రూపజ్ఞానము లౌకిక ప్రయోగములందు దప్ప వేరొకచో సంభవింపదు గదా!

ఆ లౌకిక ప్రయోగములందు సానుబంధములకు ప్రయోగములు లభింప వాయె కాబట్టి దాని రెండవ ప్రయోగము ఆశ్రయింపబడవలెను.

నగా నదియేదనిన, ఏయే ఉపదేశమందలి ప్రయోగము. ఇది ఉపదేశమునందు 'తరప్' కాదు గ ప్రయోగమునందలి 'తర' అను తరప్ ప్రత్యయ శేషమునకు స్థానివదతిదేశముచేత సంజ్ఞ లభించును. 'నదీతర' అను పదమునందలి తరకు తరప్త్వము కాల్పనికము గా సాక్షాన్నిర్దిష్టము గాదు కాగా నట ఘ సంజ్ఞకు ప్రసక్తి లేదు.

లేదా- అట ఘ సంజ్ఞ వచ్చినదే యగుగాక. దాన నేమి దోషము ? 'ఘాదులు పరమైనపుడు నద్యంతమునకు హ్రస్వమగును' అని విధింపబడిన హ్రస్వము రావలె వచ్చునే ? అనిన,

సమానాధికరణములైన ఘాదులు పరమగునపుడు గదా యది ప్రవర్తించునది ? సమానాధికరణమనగా ప్రకృతితో సమానమగు విషయము గల దనుట 'బ్రాహ్మణితరా' మున్నగు నుదాహరణములందు అతిశాయనికమగు 'తరప్' స్వార్థకము గాన నది ఏకవిశేష్యక బోధజనకము. 'నదీతరః' అనునది వ్యధికరణ సమాసము.

అపుడు, తరశబ్దార్థములు రెండును నభిన్నములైన, రావచ్చునా? అనగా, 'తీర్యతే ఇతితరః' అని కర్మార్థమున, కర్మ విశేష వివక్ష లేకుండగ, 'అప్' ప్రత్యయమును ప్రవర్తింపజేసి 'తరః' అను రూపము నిష్పన్నమైన పిదప దానికి నదీ

పదమును విశేషణముగా జేసిన 'నదీచాసౌ శరశ్చ'- అను నర్థమగును. అపుడు సామానాధికరణ్యము ససంభవముగాన హ్రస్వము ప్రాప్తించును గదా యనిన,

స్త్రీలింగములయిన ఘాదులు పరములైనపుడే హ్రస్వము ప్రవర్తించును అట్లే చెప్పితీరవలయును. సమానాధికరణములైన ఘాదులు పరములైనపుడు హ్రస్వము ప్రవరించు అని మాత్రమే చెప్పినచో, 'మహిషీరూపమిదం' 'బ్రాహ్మణీరూపమిదం' అనుచోగూడ హ్రస్వము ప్రసక్తమగును. ఇట 'రూపమ్' అనునది స్త్రీలింగ పదముగాదు.

అతిశాయనికాదిస్వార్థిక ప్రత్యయములందున్నవి ప్రకృతి లింగమునే తమకును లింగముగ గ్రహించును. కావున నవియు స్త్రీలింగములగును.

'మహిషీరూపమ్' 'బ్రాహ్మణీరూపమ్' అనునివి సుప్సుపేతి సూత్ర నిష్పన్న సమాసములు. 'మహిషివంటి ఆకృతి' 'బ్రాహ్మణివంటి ఆకృతి' అని యర్థము. ఇవశబ్దము భిన్నక్రమము. ప్రత్యయము కాని 'తర' యనునది పరమైనప్పుడును, హ్రస్వము ప్రవర్తించిన, ఇట్టి 'రూప' అనునది పరమైనపుడును నది రావలసివచ్చును అని తాత్పర్యము.

"తరప్తమపౌ ఘః" సమాప్తము.

## "బహుగణవతుడతి సంఖ్యా" (1-1-23)

'బహు', 'గణ' అను శబ్దములును, 'వతు' డ 'తి' అను ప్రత్యయములును, 'సంఖ్యా'- అను సంజ్ఞ కలవి యగును.

వా॥ సంఖ్యాసంజ్ఞాయాం సంఖ్యాగ్రహణం సంఖ్యాసంప్రత్యయార్థమ్"- అని ఆక్షేపవార్తికము.

సంఖ్యా సంజ్ఞావిధాయక సూత్రమునందు సంఖ్యా పదమును గూర్చి, సంఖ్యా సంజ్ఞా ప్రదేశములందు సంఖ్యకు గూడ ప్రతీతి కలుగుటకై ఉద్దేశ్యముగా గ్రహింపవలెను. సంఖ్య యనగా, 'ఏక', 'ద్వి' మున్నగు లౌకిక సంఖ్య యనుట వానికిగూడ సంఖ్యాపదముచే గ్రహణము కలుగవలెను

ఇట నొక ప్రశ్న కలుగవచ్చును. 'ఏక' 'ద్వి' మున్నగునవి 'ఇవి సంఖ్యలు' - అని లోకమున నెల్లరకును దెలియునుగదా! మరల నీ సంజ్ఞతో వానికి పనియేమి? లోకప్రసిద్ధివలన సిద్ధించినపుడది వ్యర్థము గదా! "హరతేర్దృతినాథయోః పశౌ" (3-2-25) అను సూత్రమున 'పశు' శబ్దము కలదు. "తస్యాపత్యమ్" (4-1-92) అను సూత్రమున అపత్యశబ్దమున్నది. "సాస్యదేవతా" (4-2-24) అను సూత్రమున దేవతాశబ్దము గ్రహింపబడినది. అందు పశ్వాది శబ్దములకు వానివాని యర్థములంటిలి సంజ్ఞలుగా శాస్త్రముచే విధానము చేతున్నను లౌకికార్థములు గ్రహింపబడుచునేయున్నవి గదా అట్లే ఏకాది

శబ్దములు గూడ సంఖ్యాపద గ్రాహ్యములు అగునే యను నా ప్రశ్నకు సమాధానము.

వా॥ "ఇతర థాహ్యసంప్రత్యయో కృత్రిమత్వాద్యథాలోకే" అను వార్తిక మువతరించినది.

సంఖ్యా గ్రహణము కర్తవ్యమే. లేనిచో, 'ఏక' 'ద్వి' మున్నగునవి కృత్రిమములు కావుగాన వానికి సంప్రత్యయము కలగకపోవును. "బహుగణవతుడతి సంఖ్యా సంఖ్యా" అని సూత్రమును రచింపవలెను. అనిచో 'ఏక' మున్నగునవి అకృత్రిమములును, బహాదులు కృత్రిమములు నగుటచేత, కృత్రిమములే. "కృత్రిమాకృత్రిమయోః కృత్రిమే కార్యసంప్రత్యయః" అను న్యాయముచే గ్రహింపబడును. ఏకాదులకు గ్రహణము లేకుండును కృత్రిమమనగా కల్పితము. లోకమునందట్టి ప్రక్రియ కనబడుచున్నది. చూడుడు. 'గోపాలకుని దీసికొని రమ్ము' 'కటజకుని దీసికొనిరమ్ము' అని యందురు. అట, గోపాలక, కటజక శబ్దములకు, గోవులను బాలించువాడు, చాపమీద బుట్టినవాడు అను నర్థములు అకృత్రిమార్థములు. ఆ పేర్లు గల వ్యక్తులు అను నర్థములు కృత్రిమములు. ఆ పేరు గలవారలె దీసికొని రాబడుచున్నారు గాని గోవులకావరి, చాపమీద బుట్టినవాడును దీసికొని రాబడుట లోకమున నగపడదు శబ్దముల కనేకార్థ బోధన శక్తియున్నను, పకరణాదులవలన నొకానొక విశిష్టార్థమునందే కొందరికి శక్తిగ్రహము కలుగును. అట్టివారికవి ఆ యర్థమునే బోధించును గాని ఇతరార్థములను బోధింపవు. లోకమునందువలె శాస్త్రమునందును, సంఖ్యాపదముచే బహు గణ, వతు, డతి అనునవేగాని, 'ఏక', 'ద్వి' మున్నగు నకృత్రిమ సంఖ్యలు గ్రహింపబడకపోవును. అందువలన సంఖ్యావాచకములకు గూడ సంఖ్యా సంజ్ఞ ఆవశ్యకము. "కృత్రిమాకృత్రిమయోః కృత్రిమేకార్యసంప్రత్యయః" అనునది గ్రంథకారాదులచే సిద్ధింపక న్యాయమే.

ఈ న్యాయము వాశ్రయించిన యెడల "నదీపౌర్ణమాస్యాగ్రహాయణీభ్యః" (5-4-110) అను సూత్రమునందు గూడ నదీ పదముచే, కృత్రిమ నదీ సంజ్ఞా విశిష్టములకే గ్రహణము కలుగునుగాని 'నదీ' అను పదమునకు గ్రహణము కలుగకుండెడిదే. అపుడా సూత్రముచే విధింపబడిన సమాసాంత ప్రత్యయమగు టచ్చు, "ఉపనదమ్" అనుచో నెట్లు ప్రవర్తించును? అని యడుగవచ్చును.

కాని అచట జ్ఞాపకమువలన నీ న్యాయము ప్రవర్తింపదు. టజ్విధాయక సూత్రమునందు, 'పౌర్ణమాసీ' 'అగ్రహాయణీ'- అను శబ్దములు గూడ గ్రహింపబడియున్నవి. నదీ పదముచే కృత్రిమములకు మాత్రమే గ్రహణమనిన, నివియు నీకారాంత నిత్య స్త్రీలింగ శబ్దములే కావున నదీ సంజ్ఞకములగుటంజేసి నదీ పదమే వానిని గ్రహించును గదా. కావున పౌర్ణమాస్యాగ్రహాయణీ గ్రహ

ణము వ్యర్థమయి కృత్రిమాకృత్రిమన్యాయ మిట ప్రవర్తింపదని జ్ఞాపనము చేయును.

పోనిమ్ము అట నదీ పదముచే నదీ సంజ్ఞకములను గ్రహింపకున్నను, నదీ విశేషవాచకములగు గంగాది శబ్దముల నేల గ్రహింపరాదు? అపుడు 'ఉపగంగమ్' ఇత్యాదులందును 'టచ్' ప్రవర్తింపవలసియుండునే! రూపము నందెట్టియున భేదము లేదు గదా యందురేమో? రూపభేదము లేకున్నను 'ఉప గంగమ్', 'పరిషమునమ్' ఇత్యాదులందు స్వరభేదము కలిగి యుండెడిది. అనిన, అందులకు సమాధానమును వినుడు.

నదీ పౌర్ణమాసీత్యాది సూత్రమున, నదీ పదము 'నదీ' అను స్వరూపమునే బోధించును గాని, నదీ విశేష వాచకములను బోధింపదని పాణిని తాత్పర్యముగా నాతడు శరత్ప్రభృతులందు 'విపాట్' అను శబ్దమును గ్రహించుటవలన దెలిసి కొనవచ్చును. 'విపాట్' అన నదొక నదీ విశేషముగదా? ఆ శబ్దమున కవ్యయీ భావ సమాసమున, 'టచ్' అను ప్రత్యయము, సూ॥ "అవ్యయీభావే శరత్ప్రభృతిభ్యః" (5-4-107) అను సూత్రముచే విధింపబడినది. అది వ్యర్థమగునుగదా. 'ప్రతివిపాశమ్' అను నవ్యయీభావసమాస రూపము నందును నీ సూత్రముచేతనే సిద్ధింపవచ్చును. ఇయ్యది వైకల్పికమయినను, వ్యవస్థిత విభాషచే నట నిత్యము గనే టచ్ప్రత్యయము రానగును. అందీభాష్యగ్రంథమే ప్రమాణమనవచ్చును. లేదా ఆ సూత్రమున నన్యతరస్యామనునది యనువర్తింపదని చెప్పనగును.

పోనిమ్ము. "నదీభిశ్చ" (2-1 20) అను సంఖ్యావాచకముల కవ్యయీ భావమును విధించిన సూత్రమున, నదీశబ్దముచే నదీసంజ్ఞకములే యేల గ్రహింప బడలేదు? 'సప్తగంగమ్' 'ద్వియమునమ్' ఇత్యాదులందు గంగా, యమునా ద్యాకారాంత నదీవాచకములతో గూడ సంఖ్యా వాచకములు సమసించినవే? కృత్రిమాకృత్రిమ న్యాయమట నేల ప్రవర్తింపలేదు అని ప్రశ్నింపవచ్చును. సమాధానము వినుడు

'నదీభిశ్చ' అను సూత్రమును 'నద్యాచ' - అనియే, 'అణ్నద్యాః' అను సూత్రమునందువలె, ఏకవచనాంతముగనే నిర్దేశింపవచ్చునే? అట్లు చేయక, బహువచనాంతముగ నిర్దేశించుటలో పాణిన్యాచార్యునకు తాత్పర్య విశేష మేదియో కలదని వ్యక్తము. కృత్రిమాకృత్రిమ న్యాయమట ప్రవర్తింపదని యాతని హృదయమయియుండును.

పోనిండు. స్వరూపగ్రహణమట నేల కలుగలేదు? బహువచన నిర్దేశము వలననే. కావున లక్ష్యానుసారముగ నదీవాచకములే అట గ్రాహ్యములు కాగా ఆ న్యాయము నాశ్రయించినను, దానికి ప్రవృత్త్య ప్రవృత్తులు లక్ష్యానురోధ ముగ నుండునుగాన నెట్టి దోషమును లేదు.

వా॥ "ఉత్తరార్థంచ" అని ఆక్షేపసాధక వార్తికాంతరము.

ఉత్తర సూత్రమునందనువర్తించుటకై యీ సూత్రమున సంఖ్యాగ్రహణము కర్తవ్యమని యభిప్రాయము. ఉత్తర సూత్రమనగా "ష్ణాంతాషట్" అనునది. షకారాంతమును, నకారాంతమును నగు సంఖ్యావాచకము 'షట్' అను సంజ్ఞ కలది యగునని దాని యర్థము. ఆ సంజ్ఞవలన 'షష్' అను ప్రాతిపదికము, ప్రథమా ద్వితీయా బహువచనములకును, పఞ్చన్, సప్తన్ మున్నగు నాంత సంఖ్యావాచకముల ఆ ప్రత్యయములకును లుక్కువచ్చి 'షట్' పఞ్చ ఇత్యాదిరూపములగును. సంఖ్యావాచకములు కాని 'విప్రుష్' 'పామన్' అనువానికి షట్సంజ్ఞ రాదాదు వాని బహువచనాంతములు 'విప్రుషః' 'పామానః' అనియే యగును అట్టిశబ్దములకు లోపము రాకుండుటకై సంఖ్యాపదమీ సూత్రమున ననువర్తింపవలెను. సూత్రములో చివరనున్న సంఖ్యాపదమునకు స్వరూపమర్థము. ఉత్తర సూత్రమున ననువర్తింపవలసిన సంఖ్యాశబ్దము పంచాది సంఖ్యావాచకము కావలెనని నుట.

ఇవార్థమై సంఖ్యాగ్రహణము మనావశ్యకము. ప్రకృత సూత్రమునందుద్దేశ్యకోటిలో వేరొక సంఖ్యాపదమును గ్రహింపనక్కరలేదు.

అది లేనిచో, 'గోపాలకమానయ' మున్నగు వాక్యములందువలెనే అకృత్రిమములగు 'ఏక', 'ద్వి' మున్నగువానికి ఉపస్థితి కలుగకపోవును అంటిరి గదా యనిన, నా దోషము లేదు.

కృత్రిమాకృత్రిమములలో, కృత్రిమమే గ్రహింపబడవలెననుటకు దాని కృత్రిమత్వము మాత్రమే కారణము గాదు. వేరొకటియు హేతువుగావచ్చును. "గోపాలకుని పిలిచికొని రమ్ము. అతడు పిల్లవానికి పాఠమును జెప్పవలెను" అని యనిన నట, పాఠమును జెప్పు సామర్థ్యము గొడ్లకాపరికి సంభవింపదు గాన సామర్థ్యమువలన నట కృత్రిమమగు, గోపాలకుడను పేరుగల వ్యక్తికే గ్రహణము కలుగుచున్నది ఇట్లే ప్రకరణాది పదార్థ నియామకములు గూడ కారణములుగానోపును.

మరియు. కృత్రిమగ్రహణములో హేతువులుగా నర్థ ప్రకరణాదులు వ్యతిరేక ముఖమునను సిద్ధించుచున్నవి. ఎట్లందువా,

చూడన్నా! నీవు, ఒక పల్లెటూరి వ్యక్తిని, ఊహాపోహాలెరుగనివానిని, అపుడపుడే వచ్చి, పాదధూళియు నింకను నాపాటున నే యున్నవానిని, ప్రకరణమేమియో యెరుగని వానిని బిలచి, 'అయ్యా నీవు గోపాలకుని దీసికొని రమ్ము' 'కటజకుని దీసికొనిరమ్ము' అని చెప్పిన, వాడేమిచేయును? వానికపుడు సందేహము కలుగును. తన్నిర్ణాయకమేదియు లేదాయె. అపుడాతడు చక్కగబోయి యొక్క యష్టిహస్తుడగు గొడ్లకాపరినే తీసికొని వచ్చును. కనుక, అర్థప్రకరణాదులే కృత్రిమార్థగ్రాహకములు. అవి లేనపుడకృత్రిమార్థమును

గ్రహింపబడును. అందువలన నేకాదిశబ్దములు గూడ నిట గ్రహింపబడును కావున సంఖ్యాగ్రహణ మక్కరలేదు.

అట్లైన, 'బహ్వాదుల కీ సంజ్ఞ చేయబడినది' అని యాతిదెలియుచున్నది కావున, వానినే గ్రహింపవలెను గాని 'ఏక' 'ద్వి' — మున్నగువానిని గ్రహింపనేల గ్రహింపవలె? అవి బుద్ధియందు సన్నిహితములు గదా. బుద్ధి సన్నిధానమే ప్రకరణము గదా? అనిన,

లోకమున మఱియు దిరిగాదు శాస్త్రమునందు వ్యాకరణశాస్త్రమున, బోద్ధల, వ్యాఖ్యాతలవలన, వక్తల తాత్పర్యమును గ్రహించి, ప్రకరణాదులను గణింపక యే కృత్రిమాకృత్రిమము లను రెంటిని గ్రహింతురు. కాగా నిట నుభయగతి కలుగును. ఇట్లు భయగతి సంఖ్యాప్రదేశముల యందే కాదు. ఇతరత్రగూడ గలదు. ఎట్లనగా చూడుడు.

"కర్తురీప్సితతమం కర్మ" (1-4-49) అను సూత్రము, కర్తకీప్సితతమమగు కారకమునకు 'కర్మ' అను సంజ్ఞను జెప్పుచున్నది అది కృత్రిమము. కర్మ నుద్దేశించి కార్యమును విధించిన "కర్మణిద్వితీయా" (2-3-2) మున్నగు సూత్రములు కర్మ సంజ్ఞాప్రదేశములు. ఇట కృత్రిమమునకే గ్రహణము అవగా కర్మ సంజ్ఞా సంజ్ఞితమునకే గాని 'క్రియ' అను అకృత్రిమార్థము గ్రహింపబడదు. కాని "కర్తరికర్మవ్యతీహారే" (1-3-14) అను సూత్రమునందు 'క్రియ' అను నకృత్రిమార్థమే గ్రహింపబడుచున్నది.

అట్లే "సాధకతమం కరణమ్" (1-4-42) అను సూత్రముచే క్రియాసిద్ధికి ప్రకృష్టోపకారకమగు కారకమునకు 'కరణము' అను సంజ్ఞ విధింపబడినది. తత్ప్రదేశములు "కర్తృకరణయోస్తృతీయా" (2-3-18) మున్నగునవి. అట, కరణ పదముచే కృత్రిమమే గ్రహింపబడును. కాని "శబ్దవైరకలహాభ్రకణ్వమేఘేభ్యః కరణే" (3-1-17) ఇత్యాదులందు కరణమనగా, చేయుట, అను అకృత్రిమార్థమే గ్రహింపబడుచున్నది.

"ఆధారోఽధికరణమ్" (1-4-45) అను సూత్రముచే విధింపబడిన అధికరణ సంజ్ఞ కృత్రిమార్థము. అధికరణ శబ్దమునకు 'ద్రవ్యము' అను నర్థము అకృత్రిమము. "సప్తమ్యధికరణేచ" (2-3-36) అనుచో, కృత్రిమార్థమును, "విప్రతిషిద్ధం చానధికరణవాచి" (2-4-13) అను పుంవద్భావవిధాయక సూత్రమునందు 'ద్రవ్యము' అను నకృత్రిమార్థమును గ్రహింపబడుచున్నవి. ఈ విధముగ నుభయ విధార్థములును నచ్చటచ్చట గ్రహింపబడుట ప్రసిద్ధము. 'బహుగణ' అను ప్రకృత సూత్రమునకు, 'ఈ శబ్దమునకు, బహు, గణ, వతు, డతులను బోధించు శక్తియు గలదు' – అని అజ్ఞాతశక్తి జ్ఞాపనమే కృత్యముగాని, 'ఇవి మాత్రమే సంఖ్యాపదమున కర్థములు' అని నియమమును బోధించుట కాదు. కాగా, 'ఏక'

ద్వి' మున్నగువానికిని సంఖ్యాప్రదేశములందు గ్రహణము, ఉద్దేశ్యకోటిలో సంఖ్యాపదము లేకున్నను సిద్ధించును.

లేదా — ఇది సంజ్ఞావిధి కాదు. అతిదేశబోధకమిది యగును. 'సంఖ్యా' అనునది సంజ్ఞ కాదు. సంజ్ఞలు 'టి' 'ఘు', 'భ' - అనునట్లు ఏకాక్షర రూపములుగ నుండదగును. అందువలన, 'బహు గణ వతు డతు లు సంఖ్య వంటి వగును' అని యీ సూత్రము వానికి సంఖ్యాకార్యము నతిదేశించుననవచ్చును.

అట్లైన వతి ఘటిత నిర్దేశము లేదే యనిన, నది యక్కరలేదు. లేనిచో నిది యతిదేశ బోధకమని యెట్లు తెలియును? వతి నిర్దేశము లేకున్నను నతి దేశమని తెలియవచ్చును. ఎట్లందురా? ఒక వ్యక్తిని నిర్దేశించి "ఈతడు బ్రహ్మదత్తుడు" అనినపుడు, 'బ్రహ్మదత్తు'డు కానివాని నీతడు బ్రహ్మదత్తుడనుచున్నాడు. బ్రహ్మదత్తునివంటివాడని యీతని యభిప్రాయము' అని మనము తలంచుచున్నాము. ఆ విధముగనే ఇచటను, సంఖ్యలుగాని వానిని, పాణిని సంఖ్యలు అనుచుండుటచే, 'బహు, గణ, వతు, డతులు సంఖ్యలవంటివి' అని యాతని యాశయమని గ్రహింతుము.

లేదా — ఏక, ద్వి మున్నగువానికి గూడ సంఖ్యోద్దేశ్యక కార్యవిధాయక శాస్త్రములందు గ్రహణము కలుగునని పాణిన్యాచార్యుని సూత్రరచనా ప్రవృత్తి జ్ఞాపన చేయును. ఆతడు, సూ॥ "సంఖ్యాయా అతిశదంతాయాః కన్" (5-1-22) అను సూత్రముచే సంఖ్యా వాచకములకు 'కన్' అను ప్రత్యయమును విధించుచు, 'తి', 'శత్' అనునవి యంతమున గల సంఖ్యల కది రాదని ప్రతిషేధించియున్నాడు. కావున నది జ్ఞాపకమగును.

ఎట్లైన, — కృత్రిమ సంఖ్యలకు మాత్రమే అట గ్రహణమనినచో, 'వింశతి' 'త్రింశత్' మున్నగు త్యంత శదంతములు అకృత్రిమ సంఖ్యలుగాని, కృత్రిమములు లేనేలేవు గదా! ప్రతిషేధమేల?

కృత్రిమ సంఖ్య 'డతి' అనునది కలదే? యనిన పోనిమ్ము, శదంత ప్రతిషేధము జ్ఞాపకము కావచ్చును శదంత సంఖ్యలు కృత్రిమములు లేవు.

లేదా — త్యంత ప్రతిషేధమును జ్ఞాపకమే కావచ్చును. 'డతి' కృత్రిమ సంఖ్య కలదు. తదర్థము ప్రతిషేధము సార్థకము. అంటివిగదా యనిన,

'అర్థవిశిష్టములకు గ్రహణము సంభవించినపుడు తద్విరహితములు గ్రహింపబడవు'. కావ నర్థవత్తగు 'త' శబ్దమే 'అతిశదంతాయాః' అనుచోట గ్రహింపబడును. 'డతి' లోని 'తి' శబ్ద మర్థవంతము కాదుగదా.

లేదా — వేరొక సమాధానము చెప్పనగును. 'సంఖ్యా' అని యొక మహాసంజ్ఞగదా చేయబడినది. అట్టి గురు సంజ్ఞాకరణమున కేదేని ప్రయోజన

ముండి యుండవలెను. శాస్త్రమునందు సంజ్ఞలను గల్పించుకొనుట లాఘవము కొరకు గదా. దేనికంటె నిక లఘుభూతమయినది వేరొకటి యుండబోదో, అట్టిదిగా 'సంజ్ఞ' అనునది యుండవలె. అట్లుగాక మహాసంజ్ఞను జేయుటవలన నిది యన్వర్థమగు సంజ్ఞ గావలెనని పాణిని తాత్పర్యము. అనగా సంఖ్యాయతే అనయా ఇతి - ఖ్యా 'దేనితో లెక్కింతుమో అది' అని యర్థము. సంఖ్యానము నకు, కరణము అనది అనుట 'ఏక' 'ద్వి' మొదలగువానితో 'ఒకటి' 'రెండు' అని యిట్లు లెక్కింతుము గనుక నవియు సంఖ్యలే యగును. కావున నందులకై, సంఖ్యాపదమును నుద్దేశ్యముగా గ్రహింపబనిలేదు.

ఇక నుత్తర సూత్రమయిన, "ష్ణాంతాషట్" అను దానిలోని కనువర్తించుటకై కూడ సంఖ్యాపదము నధికముగా గ్రహింపనక్కఱలేదు అందున్న పదమే యనువర్తించును.

అది యెట్లు? ఇందున్న సంఖ్యాపదము సంజ్ఞాబోధకము. ఉత్తర సూత్రమున ననువర్తించునది సంజ్ఞిపరము కావలెను. ప్రకృతమైనది వేరొక యర్థము కలదయినపుడు, అనువర్తించుట వలన దాని రూపము మారదుగదా. ఉడుము గూడ ప్రదేశాంతరమునకు పాకును. అట్లు సర్పించుటవలననది సర్పము గాదు. గోధసర్పణము సూత్రమున గోధాత్వమును విడువనట్లు శబ్దముగూడ ననువృత్తి మాత్రమున నర్థాంతరమును గ్రహింపదు. కాగా విధేయబోధకమగు వా సంఖ్యాపద మిందనువర్తించినను బ్రయోజనము లేదని యాక్షేపము.

సమాధానము — ఒక ప్రయోజనము సిద్ధించుట కుపక్రాంతమయినది అన్యార్థము కాదంటిరే, అది సరికాదు. శబ్దములు, శక్తి వైచిత్ర్యము వలన వేరువేరర్థములను బోధించును. సంఖ్యాపదము పూర్వ సూత్రమునందు స్వరూప బోధకమైనను, ఉత్తర సూత్రమున వేరొక శక్తిచే నర్థపరము కావచ్చును. లోకమునందు పంటలకొరకు కాలువలను ద్రవ్వుదురు. అట నుద్దేశ్యము శాలి సంపత్తియే యయినను, వానినుండి మంచినీటిని ద్రాగుదురు స్నానాచమనాదులను జేయుదురు. పంటలను బండింతురు.

'ప్రకృతమయిన యొక శబ్దము, అనువర్తనమాత్రము వలన వేరొక శబ్ద మెట్లగును? ఉడుము ప్రదేశాంతరమునకు పాకినంతమాత్రమున పాము గాదు గదా' - అనియు నాక్షేపించితిరి. దానికి సమాధానమును వినుడు. ద్రవ్యము విషయమున నట్లైన గావచ్చును. శబ్దమట్లు కాదు. అయ్యది ఏయే పరిచ్ఛేద్య విశేషముతో సంబంధించునో, వావి వానికెల్ల పరిచ్ఛేదకమగును స్వగౌతత్వ ప్రతిజ్ఞచే వాక్యాంతరమున నూహింపబడినది, ఆ వాక్యాంతరముయొక్క అర్థమున కనుగుణమైన యర్థము కలది కావచ్చును.

లేదా — ఇది శాస్త్రీయాధికారము కానేకాదు. అట్లైన అర్థాధికార మావశ్యకమగునుగాన, సంఖ్యాపదము, ఉభయత్ర సమానార్థకము కావలె ననవచ్చును. 'ష్ణాంతాషట్' అను సూత్రమున, 'ష్ణాంతా' అను స్త్రీలింగ నిర్దేశము సాపేక్షముగ చేయబడియున్నది. 'ష్ణాంతా' అనునది బహువ్రీహి, అన్యపదార్థాపేక్షము. అందు సంఖ్య ప్రకృతము. కావున దానినే అన్యపదార్థముగానిది గ్రహించును. స్వరితత్వాపేక్షతో బనిలేదు. లౌకికమగు 'అపేక్షాలక్షణాధికారము గాని శాస్త్రీయాధికారముగాదు. కాగా వేరొకటి యపేక్షింపదగినది లేవందున, ఆ సంఖ్యనే అపేక్షింతుము. కావున నెట్టి యాక్షేపమునకును ప్రసక్తిలేదు.'

వా॥ "అధ్యర్థగ్రహణంచ సమాసకన్విధ్యర్థమ్" అని యాక్షేప వార్తికము. సంఖ్యాగ్రహణ ముత్తరార్థమును ఇహార్థమును నీ సూత్రమున అవశ్యకమయినట్లు, అధ్యర్థపదమును గూడ సూత్రమున నుద్దేశ్యకోటిలో చేర్చుట అవశ్యకమని వార్తికకారుని మతము. దానికి, ప్రయోజనము, సమాససిద్ధియును, కన్ప్రత్యయము సిద్ధించుటయును అని ఆశయము.

అధ్యర్థమనగా, 'అధ్యారూఢం అర్థమస్మిన్నిత్యధ్యర్థమ్' అను వ్యుత్పత్తిచే ఒకటిన్నర అని యర్థము. ఇదియు, త్రిభాగ, చతుర్భాగ, మున్నగు శబ్దముల వలె సంఖ్యావాచి కాదు. కావున దీనికి సంఖ్యా సంజ్ఞ వక్తవ్యము. 'అధ్యర్థేన శూర్పేణ క్రీతమ్=ఒకటిన్నర శేటలధాన్యముతో గొనబడినది' అను నర్థమున, "దిక్సంఖ్యే సంజ్ఞాయామ్" (2-1-50), "తద్ధితార్థోత్తరపదసమాహారేచ" (2-1-51) అను సూత్రముచే సమాసము రాగా 'అధ్యర్థశూర్పమ్' అని రూపము కావలెను. అది యొక ప్రయోజనము. 'అధ్యర్థేన క్రీతమ్' అను నర్థమున, "సంఖ్యాయా అతిశదన్తాయాః కన్" అని కన్ప్రత్యయము సిద్ధించి 'అధ్యర్థకమ్' అను రూప మేర్పడుటయు సంఖ్యా సంజ్ఞావచనమునకు ప్రయోజనము. దీనివలన నిక "అధ్యర్థపూర్వద్విగోర్లుగ సంజ్ఞాయామ్" (5-1-28) అను సూత్రమున, అధ్యర్థ పదమును గ్రహింపబనిలేదు. అధ్యర్థశూర్పమిత్యాదులు ద్విగుసమాసములే యగునుగాన 'ద్విగోర్లుగ సంజ్ఞాయామ్' అనినందుననే ఆర్హీయ ప్రత్యయమునకు లుక్కు సిద్ధించును.

వా॥ "లుకిచాగ్రహణమ్" — అను వాక్షేప ప్రయోజన వార్తిక మీ విషయమును బోధించుచున్నది.

వా॥ "అర్థపూర్వపదశ్చ పూరణ ప్రత్యయాన్తః" అక్షేపవార్తికము. అర్థశబ్దము పూర్వమునగల పూరణ ప్రత్యయాంతము గూడ సంఖ్యాసంజ్ఞ కలది' అని చెప్పవలెను అని వార్తికార్థము. సమాస సిద్ధి, కన్ప్రత్యయ సిద్ధులే ప్రయోజనములు. 'అర్థపంచశూర్పమ్' 'అర్థపఞ్చమకమ్' — అని క్రమముగ నుదాహరణములు.

వా॥ అధిక గ్రహణంచా లుకి సమాసోత్తర పదవృద్ధ్యర్థమ్"- లుగ్భిన్న సంఖ్యాకార్యములు సిద్ధించుటకై సంఖ్యా సంజ్ఞా సూత్రమున 'అధిక' అను పదమును గూడ పఠింపవలెను. ఎందులకనగా, సమాసవిధి సిద్ధించుట, ఉత్తర పద వృద్ధి సిద్ధియు ప్రయోజనములు. 'ఆధిః షాష్టిః' 'ఆధిక సాప్తతికః' అని యుదాహరణములు. 'అధికయా షష్ట్యాక్రీతః' 'అధికయా సప్తత్యాక్రీతః' అని విగ్రహములు. అ వది అధికముగా నిచ్చి కొనబడినది. డెబ్బది యధికమిచ్చి కొనబడినది అని యర్థము. "తద్ధితార్థోత్తరపద సమాహారేచ" అని సమాసము, "సంఖ్యాయాః సంవత్సర సంఖ్యస్యచ" (7 3-15) అను సూత్ర చే సంఖ్యావాచకముకంటె పరమైన సంవత్సర సంఖ్యకు వృద్ధియు ప్రయోజనములు. లుగ్భిన్న సంఖ్యాకార్యసిద్ధి కనుటచే, ఠన్ప్రత్యయమునకు, అధ్యర్థపూర్వేత్యాదిసూత్రముచే లుక్కు లేదు. ఈ సంఖ్యాసంజ్ఞ వలన, బహువ్రీహి సమాసవిధాయకమగు "సంఖ్యయా వ్యయాసన్నాదూరాధికసంఖ్యాః సంఖ్యేయే"(2-2-25) అను సూత్రమున అధిక పదమనావశ్యకము. సంఖ్యాపదమువలననే యది సిద్ధించును.

వా॥ బహువ్రీహౌచాగ్రహణమ్" అనునది ఆక్షేపప్రయోజన వార్తికము.

## "సూత్రప్రత్యాఖ్యానము"

వా॥ "బహ్వాదీనామగ్రహణమ్'' "జ్ఞాపకాత్సిద్ధమ్'' — అను ఖండద్వయాత్మకమగు వార్తికము సూత్రప్రత్యాఖ్యానపరము.

బహు, గణ, వతు, డతులకు సంఖ్యా సంజ్ఞాసూత్రమునందు గ్రహణమనర్థకము. వానికి సంఖ్యా సంజ్ఞావిధానము లేకున్నను దోషము లేదు.

సంఖ్యా సంజ్ఞాప్రయుక్త కార్యవిధాయక శాస్త్రములందు వీనికి గ్రహణమెట్లు కలుగును ?

జ్ఞాపకమువలనకలుగవచ్చును. ఆ జ్ఞాపకమేమి ? "వతోరిడ్వా" (5-1-23) అను సూత్రముచే, వతుప్రత్యయాంతముకంటె బరమయిన 'కన్' అను ప్రత్యయమునకు వికల్పముగ నిడాగమము శాసింపబడినది. 'తావతికః' 'తావత్కః'— అనునవి యుదాహరణములు. వతుప్రత్యయాంతమునకు సంఖ్యాసంజ్ఞ లేనిచో, దానికంటె బరముగ కన్ప్రత్యయమే లభింపదుగదా ? అట్టియెడ ఇడాగమ శాసనమెట్లు ఘటించును? కావున నయ్యది జ్ఞాపకమనుట.

సరి. వతుప్రత్యయాంతమున కది సంఖ్యాసంజ్ఞను జ్ఞాపింపవచ్చును కాని, బహు, గణ, డతులకు సంఖ్యాత్వమెట్లు ? అనిన - అట్లు కాదు.

అది యోగాపేక్షమగు జ్ఞాపకము. అనగా బహు సూత్రములందు జ్ఞాపకము అగుచున్నది. అయ్యది, "బహుపూగగణ సంఘస్యతిథుక్" (5-2-52), "వతో

రిథుక్" (5-2-53), "షట్కతి కతిపయచతురాం థుక్" (5-2-51) — అనునవి. యోగాన్ సూత్రాణి అపేక్షతే ఇతి = యోగాపేక్షమ్ జ్ఞాపకమ్ ?

"తస్యపూరణేడట్" (5-2-48) అను సూత్రముచే సంఖ్యావాచకమునకంటె బరముగా పూరణార్థమున విధింపబడిన 'డట్' అను ప్రత్యయము పరమైనపుడు, 'థుక్', 'ఇథుక్', 'తిథుక్' అను నాగమము లీ సూత్రములచే విధింపబడినవి. ఆ సూత్రములందు, 'బహు', 'గణ' - అను శబ్దములును వతు, డతి, ప్రత్యయాంతములును తత్తదాగమముల అగమములుగా గ్రహింపబడియున్నవి. వానికి సంఖ్యాసంజ్ఞ లేనియెడల డట్ప్రత్యయమే రాదుగదా. అపుడు వానికంటె పరమైనదిగా డట్ప్రత్యయమే లేదాయె. వానికా అగమములు వచ్చుటకు ప్రసంగమేమి ? కాగా డట్ప్రత్యయము పరమగునపుడు విధీయమానములయిన ఆ ఆగమములు, బహు, గణ, వతు, డతులకు డట్ప్రత్యయ నిర్వాహకమగు సంఖ్యాత్వమును జ్ఞాపనము చేయును. కావున సూత్రమనావశ్యకమని వార్తికకారుని మతము.

కాని, వస్తుతత్త్వమును బరిశీలించిన జ్ఞాపకముల నాశ్రయించి సూత్రము లను ప్రత్యాఖ్యాన మొనర్చుట అంతగా సమంజసము గాదను భావముతో సూత్రకర్త సూత్రమును రచించెననుట పరమార్థము.

"బహు గణ వతు డతి సంఖ్యా" అను సూత్రము సమాప్తము.

## "ష్ణాన్తాషట్ (1-1-24)

షకారాంతమును, నకారాంతమును నగు సంఖ్యాశబ్దము 'షట్' అను సంజ్ఞ కలదియగును. దానికి ప్రయోజనము 'షట్' 'పఞ్చ' ఇత్యాదులందు 'జస్' 'శస్' అను ప్రత్యయములకు లుక్కు ప్రవర్తించుట.

వా॥ "షట్సంజ్ఞాయాముపదేశవచనం శతాద్యష్టనోర్నుమ్నుడర్థమ్" అని యాశేషవార్తికము.

షట్సంజ్ఞావిధాయక సూత్రమున 'ఉపదేశే' అని చేర్చి, ఉపదేశావస్థలో షకారాంతములును, నకారాంతములును నగు సంఖ్యావాచకములకు షట్సంజ్ఞ వచ్చును అని చెప్పవలసియున్నది. దానికి ప్రయోజనము, 'శతాని, 'సహస్రాణి' అను చోట్ల నుమాగమము ప్రవర్తించిన తరువాత షట్సంజ్ఞ ప్రవర్తింపకుండుట యును, 'అష్టానామ్'- అను స్థలమునందు, పరత్వ నిత్యత్వములన, నకార స్థానమునందాత్వము ప్రవర్తించిన పిదప నది నకారాంతము గానందున షట్సంజ్ఞ నివర్తింపకుండుటయు, దానంజేసి, "షట్చతుర్భ్యశ్చ" (7-1-55) అను సూత్రముచే నుడాగమము సిద్ధించుటయునగును.

శత, సహస్ర శబ్దముల ప్రథమా ద్వితీయా బహువచనాంతరూపములు 'శతాని' సహస్రాణి అనునవి. అట — శత + జస్. శత + ఇ శతన్ + ఇ. శతాన్ + ఇ = శతాని అని ప్రక్రియాక్రమము. ఇట్లే సహస్రాణి అందు "నపుంసకస్య ఝలచః" (7-1-72) అని నుమాగమము ప్రవర్తించిన వెనుక 'శతన్' అనునవి నకారాంత సంఖ్యా వాచకములగుటచే ప్రాప్తించు సంజ్ఞను ఉపదేశ గ్రహణముచే వారింపవలెను. ప్రకృతి ప్రత్యయ విభాగపూర్వక ప్రతిపాదన మువదేశము. ఆ అవస్థలో, పఞ్చన్' సప్తన్ అనువాని వలె నకారాంతములుగావు సంజ్ఞ ప్రవర్తింపరాదు. కాగా నుమాగమానంతరము సంజ్ఞానివృత్తి ప్రయోజన మనుట.

'అష్టానామ్' అనుచోట అష్టన్ + ఆమ్, అష్టా + ఆమ్, అష్టా+నామ్ — అని ప్రక్రియాక్రమము. ఇటనాత్వ ప్రవృత్త్యనంతరము నుడాగమసిద్ధి ప్రయోజన మనుట.

ఉపదేశమున షకార నకారాంతములని చెప్పనక్కరలేదు. 'పైన చెప్ప బడిన, ఇష్టానుపపత్త్యనిష్టాపత్తులకు నిరాసము చెప్పబడియేయున్నది' అని ప్రత్యా ఖ్యానవాది తాత్పర్యము ఏమిచెప్పబడినది? అనిన. 'శతాని' 'సహస్రాణి'- అను లక్ష్యముల విషయమున "సంనిపాతలక్షణో విధిర్నిమిత్తం తద్విఘాతస్య" అని చెప్ప బడియే యుండెను.

'అష్టన్' విషయమునను చెప్పబడియే యున్నది. ఏమనగా, "అష్టనో దీర్ఘగ్రహణం షట్సంజ్ఞాజ్ఞాపకమాకారాంతస్యనుడర్థమ్" అని చెప్పబడినది.

'శతాని' ఇత్యాదులందు, అజంతమగు ప్రకృతి. సర్వనామస్థాన ప్రత్య యము- వీని సంనిపాతము నిమిత్తముగ ప్రవర్తించిన నుమాగమము ఆ సంబంధ మునకు విఘాతకమగు షట్సంజ్ఞకు నిమిత్తమగుట ఉపజీవ్య విరోధముగాన షట్సంజ్ఞ ప్రవర్తింపదు.

'అష్టనోదీర్ఘాత్'- అను సూత్రమునకు, 'దీర్ఘాంతమగు 'అష్టన్' శబ్దము కంటె బరమైన, 'అసర్వనామస్థాన విభక్తి ఉదాత్తమగును' అని యర్థము. అందు 'దీర్ఘాత్' అను విశేషణము, 'అష్టసు' ఇత్యాదులందు దీర్ఘములేని చోట్ల నా స్వరము ప్రవర్తింపకుండుటకై చేయబడినది. 'అష్టసు' స్థలమున "షట్ త్రిచతుర్భ్యో హలాదిః"- అను సూత్రముచే,విభక్తికి ఉదాత్త స్వరము ప్రాప్తించుచుండ దానిని బాధించి, "ఝల్యుపోత్తమమ్" (6-1-180) అను సూత్రము ఉపోత్తమమున కుదాత్తత్వమును విధించినది. దానిని బాధించుటకై "అష్టనోదీర్ఘాత్" అను నీ 'అష్టన్స్వర' విధాయకమారంభింపబడినది.

ప్రకృతమున, అత్వానంతరము షట్సంజ్ఞ ప్రవర్తింపనిచో, అచట ఈ స్వరము సావకాశముగాన, "ఝల్యుపోత్తమమ్' అనుదానికి అపవాదము

కాజాలదు. అపుడు 'అష్టను' అను లక్ష్యమున నుపోత్తమోదాత్తమే ప్రవర్తిం చునుగాన నీ సూత్రమున దీర్ఘ గ్రహణము వ్యర్థమేయగును. కృతాత్వమున కును షట్సంజ్ఞ ప్రవర్తించినపుడు షట్స్వరమున కష్టన్‌స్వరమపవాద మగును. దీర్ఘ గ్రహణమును చరితార్థమగును. కావున షట్సంజ్ఞా విధాయక సూత్రము నందు, ఉపదేశ పదమును గ్రహింప పని యుండదు.

లేదా — ఆకారము గూడ నిట నిర్దేశింపబడినది షకారాంతము, నకా రాంతమును అయిన సంఖ్య షట్సంజ్ఞకమగును. కాగా అష్టన్ శబ్దమునకు, ఆత్వా నంతరము షట్సంజ్ఞ సిద్ధించును. ఈ సూత్రమున ష్ణాన్తా అను పదమునందు, ష్, న్, ఆ, అన్తా=ష్ణాన్తా అని ఆకారము గూడ ప్రశ్లిష్టమై యున్నది.

అట్లైన, "సద హాదోద్యమ్న ఏకాస్తాః" అను మంత్రమున 'ఏకా' అను ఆకారాంత సంఖ్యా వాచకమునకుగూడ షట్సంజ్ఞ ప్రవర్తించినయెడల, జస్, శసులకు లుక్కు రావలసి వచ్చునే? అనిన,

ఈ ఏక శబ్దము సంఖ్యా వాచిగాదు. ఇది అన్యార్థకము. కాబట్టి దోషము లేదు. ఏకశబ్దమున కనేకార్థములు గలవు.

సంఖ్యార్థకముగా,-'ఏకః' 'ద్వౌ' 'బహవః' అని సంఖ్యానమున నున్నది. అసహాయ వాచిగా,— 'ఏకాగ్నయః' 'ఏకహలాని' 'ఏకాకిభిః క్షుద్రకైః జితమ్' ఇత్యాది ప్రయోగములందగపడుచున్నది. అట అసహాయులచే అని యర్థము. 'ఇతర మైనది' అను నర్థమునను గలదు ఎట్లనగా, "ప్రజామేకావతతి" "ఊర్జమేకా" అని. ఏకా=అన్యా, అని యర్థము. "సధమాదోద్యమ్న ఏకాస్తాః" అనుచో గూడ 'అన్యములు' అని యర్థము. కాబట్టి అన్యార్థమున వర్తమానమైన ఏకశబ్దమిట ప్రయోగింపబడినదిగాని సంఖ్యావాచికాదు. కావున "షట్సంజ్ఞాప్రవృత్తి లేదు" అని భావము.

అయిన, 'ద్వాభ్యామిష్టయే వింశత్యాచ'- అనుచో, 'ద్వాభ్యామ్' అను పదము నందున్న 'ద్వా' అనునది ఆకారాంతమును సంఖ్యావాచియునై యున్నదిగాన షట్సంజ్ఞ ప్రవర్తించినయెడల "షట్త్రిచతుర్భ్యో హలాదిః" (6 1.179) అను సూత్రముచే, హలాది విభక్తియగు 'భ్యామ్' అనుదానికి ఉదాత్తస్వరము రావలసి వచ్చునే? అనిన.

అట్లైన, ఏడవయధ్యాయమున, "అష్టాభ్య ఔశ్" (7-1-21) "షడ్భ్యోలుక్" (7.1.22) అను సూత్రములలో, రెండవదియగు 'షడ్భ్యోలుక్' అనుచో, 'షడ్భ్యః' అని యోగ విభాగము చేయబడును. ఈ విభక్త సూత్రములోనికి, 'అష్టాభ్యః' అనునదిమాత్ర మనువర్తింపజేయబడును ఇయ్యది అతిదేశబోధకము. షట్సంజ్ఞకల దానికంటె పరమగు దానికి చెప్పబడినదెల్ల, కృతాకారముగు 'అష్టన్' శబ్దమునకు పరమగు దానికి గూడ ప్రవర్తించునని ఈ అతిదేశమువలన

దెలియును. కాగా, కృతాత్వమునకు షట్సంజ్ఞ లేకున్నను, నుడాగమము, ఈయతిదేశముచే సిద్ధించును. తరువాత 'లుక్' అను విభక్త సూత్రమునందు 'షడ్భ్యః' అను సూత్రమనువర్తించి, షట్సంజ్ఞకములకంటె బరములైన జశ్శస్సులకు లుక్కును బోధించును.

లేదా— ఇంకను ముందు, "అష్టన ఆవిభక్తౌ" (7.2.84), "రాయోహాలి" (7.2.85) సూత్రములలో, యోగవిభాగమును ఇట్లు చేయబడును. "అష్టన ఆవిభక్తౌ" ॥ "రాయః" "హాలి" అని మూడు సూత్రములు. మొదటిది అష్టన్ శబ్దమునకు, విభక్తిపరమైనపుడు ఆకారమును సామాన్యముగ విధించును. తరువాత "రాయః" అనునది రై శబ్దమునకు, విభక్తిపరత్వమున అత్వమును విధించును. మూడవ సూత్రమైన 'హాలి' అనునది, వెనుకటి రెండు సూత్రములకును శేషము. కాగా హాలాది విభక్తిపరమగునపుడే, అష్టన్ శబ్దమున కాత్వమువచ్చునని యర్థమగును. కాన 'అష్టానామ్' అనుచోట నుడాగమ ప్రవృత్త్యనంతరమే ఆత్వము ప్రాప్తించును. నుడాగమ ప్రవృత్తి సమయమున నది నకారాంతమేగాన షట్సంజ్ఞనిరాబాధము.

అట్లైన, ప్రియాష్టానే ప్రియాష్టానః అనియే యగునుగాని, 'ప్రియాష్టౌ' 'ప్రియాష్టాః' అను రూపములు సిద్ధించవే? అనగా 'జా', జస్సులు హాలాదివిభక్తులు కావుగాన నట ఆత్వము ప్రాప్తింపదు. 'హాలి' అను పదమునకు అష్టన ఆ విభక్తౌ అను సూత్రము కోనికి, అపకర్షను చేయనియెడల వచటను ఆత్వము సిద్ధించును 'అష్టాభ్యః ఔశ్' అను సూత్రమున, కృతాత్వ నిర్దేశమువలన ఆత్వము జశ్శస్సులందనుమానింపబడుచున్నదిగదా యనిన, నది అష్టన్ శబ్దార్థము ప్రధానమైనపుడే ప్రవర్తించును ఇది బహువ్రీహియగుటచే నిటనది యప్రధానముగదా! అనిన,

"యథాలక్షణ మప్రయుక్తే"- శిష్టప్రయోగములేని శబ్దముల విషయమున లక్షణానుసారముగనే లక్ష్యసంస్కారము కర్తవ్యము. అనగా నిట అత్వమునకు ప్రాప్తియేలేదు- మరియు, అలక్షణస్య యోగ్యం=యథాలక్షణమ్. అప్రయుక్తముల కనభిధానమే యుక్తము.

## "ష్ణాన్తాషట్" — సూత్రము సమాప్తము-

## "డతిచ" (1.1.25)

"బహుగణవతుడతి సంఖ్యా" (1.1.23) అను సూత్రము నుండి సంఖ్యాపదమును 'ష్ణాన్తాషట్' (1.1.24) అను సూత్రము నుండి 'షట్' అను పదమును అనువర్తింపగా, 'డతిప్రత్యయాంతమగు సంఖ్యా శబ్దము షట్సంజ్ఞకమగును' అని యర్థము.

## సూత్రప్రత్యాఖ్యానము

సంఖ్యాసంజ్ఞా సూత్రమునందును, ప్రకృత సూత్రమునందును, ఈ 'డతి' అనునది రెండు సార్లు గ్రహింపబడియున్నది. అందొక డతి గ్రహణమును విడచిపెట్టవచ్చును. ఎట్లనిన,

సంఖ్యా సంజ్ఞా సూత్రమునందది యున్నచో నిక షట్సంజ్ఞా సూత్రమున నక్కరలేదు. ఏలయందురా? 'ష్ణాంతాషట్' అను సూత్రము నవయవపరివర్తన జేయ వచ్చును. ఆ సూత్రమును 'ష్ణాన్తాచ షట్' అని పఠింపవచ్చును. చకారమువలన, 'డతి' అను పదము సూత్రమున ఇందనువర్తింపజేయవచ్చును. కాగా షకారాంతమును, నకారాంతమును డతి ప్రత్యయాంతమును నగు సంఖ్యావాచకమునకు 'షట్సంజ్ఞ కలుగును' అని యర్థము లభించును. డతిప్రత్యయము లు రెండు. అందొకటి తద్ధిత ప్రత్యయము. రెండవది కృత్ప్రత్యయము. ఉణాదులందు బఠింపబడినది వక ప్రత్యయమును తద్ధితము. కృత్తయిన ఎతు ప్రత్యయములేదు. కావున దానిసాహచర్యమువలన, డతి ప్రత్యయమును నిట తద్ధితమే గ్రహింపబడును. 'కతి'-తద్ధిత ప్రత్యయాంతము. పతి=ఔణాదిక డత్యంతము.

ఈ సూత్రముచే షట్సంజ్ఞ 'కతి' శబ్దమునకే.

ఇక షట్సంజ్ఞావిధాయక సూత్రముననే డతి గ్రహణము చేయబడుననిన, 'సంఖ్యా సంజ్ఞా సూత్రమునందది అనావశ్యకము.

ఏలయనిన, "బహుగణ, వతుసంఖ్యా" 'ష్ణాన్తాషట్' 'డతిచ'— అనియే సూత్రపాఠమగును. 'డతిచ' అను నీ సూత్రములోనికి 'సంఖ్యా' అను పదమును వర్తించును షట్సంజ్ఞా విధాయక సూత్రమునకు తరువాత ఇది పఠింపబడుట వలన, డత్యంతము షట్సంజ్ఞకమగును' అనియు, చకారమువలనను, సంఖ్యా పదానువృత్తి వలనను 'డత్యంతము సంఖ్యా సంజ్ఞ కలదియునగును' అనియు, సంజ్ఞాద్వయము విధింపబడును. 'సంఖ్యా'పద మనర్థము సంఖ్యానము నకు సాధనమయినది సంఖ్య. సంఖ్యాప్రశ్నమునకు డత్యంతమే ట్టిది. కనుక ఔణాదిక డత్యంతమగు పతి శబ్దమునకు, షట్సంజ్ఞ వవర్తించదు. సంఖ్యా సంజ్ఞయు సంభవింపదు. రెండును నన్వయోగనిష్ఠలగు సంజ్ఞలు కాబట్టి వానికి సహప్రవృత్తియే కలుగునని భావము.

'డతిచ'— సమాప్తము

## సూ॥ "క్తక్తవతూ నిష్ఠా" (1 1-26

'క్త' అను ప్రత్యయమును, 'క్తవతు' అను ప్రత్యయమును 'నిష్ఠ' అను సంజ్ఞ కలవియగును ఈ ప్రత్యయములందలి కకారము ఇత్సంజ్ఞకము అది లోపించునది. ప్రయోగములందు వినబడునది 'త' 'తవత్' అనునవియే.

'ఋాఞ్' ఛేదనే అనుధాతువునకు భూతార్థమున క్త ప్రత్యయము చేసినపుడు, దాని తకారమునకు, "ల్వాదిభ్యశ్చ" (8-2-44) అను సూత్రముచే నత్వము సిద్ధించుట నిష్ఠాసంజ్ఞకు ప్రయోజనము.

## అనిష్ఠాపత్తి నిరాకరణము

వా॥ "నిష్ఠా సంజ్ఞాయాం సమానశబ్ద ప్రతిషేధః"-అని ఆక్షేప వార్తికము. 'లోతః' 'గర్తః'-అను పదములందును త శబ్దము కనబడుచున్నది. అట 'నిష్ఠా' అను సంజ్ఞ ప్రవర్తింపరాదు. అందుకై, సమాన శబ్దములకు నిష్ఠా సంజ్ఞ ప్రవర్తింపదని చెప్పదగియున్నది. అని ఆక్షేపతాత్పర్యము.

వా॥ "నిష్ఠా సంజ్ఞాయాం సమానశబ్దాప్రతిషేధః" - అని సమాధాన వార్తికము నిష్ఠా సంజ్ఞను జెప్పినపుడు సమాన శబ్దములకు దాని ప్రతిషేధమును జెప్పుట అనర్థకము అని యర్థము. ఆ సంజ్ఞ వానికేల గలుగదనిన,

వా॥ "అనుబంధోన్యత్వకరః"- అని ఆక్షేపబాధక హేతువార్తికము' అనుబంధము చేర్చబడినదికదా. అది భేదకమగును అని భావము.

వా॥ "అనుబంధోన్యత్వకర ఇతిచేన్నలోపాత్"- అను హేతు నిరాకరణ వార్తికము. అనుబంధవర్ణము భేదమును తెలియజేయుననినకాదు. ఏలయన అది లోపించినదిగదా? లోపించినది వ్యావర్తక మెట్లగును?

లోక వ్యవహారమును జూడుడు, ఒకచో రెండింట్లేక ...వమయినవి గలవు వానిలో నొకటి దేవదత్తునిది. వేరొకటి యజ్ఞదత్తునిది. దేవదత్తుని గృహమును దెలిసికొనదలంచి, అందేయని దేవదత్తుని యిల్లు ... ఎవరేని యడిగినపుడు 'అదిగో' ఆ కాకి యున్నది. అని సమాధానము చెప్పుదురు. ఆ కాకి అందు ఉన్నపుడు. దానినిబట్టి యా గృహమును దెలిసికొను కాని అది యెగిరి పోయినపుడు ఆ గురుతు లేనందు వాని గృహ ...జ్ఞానముకాదు. ఆ రీతి గనే ప్రకృతమునను ఇత్సంజ్ఞ వర్ణము లోపించుటచే, ఆ ... వ్యయము నష్ట మగును. అనగా అజ్ఞాతానుబంధమగును.

అది లోపించినదనుకొనుడు. కాని సానుబంధమునకే సంజ్ఞ చేయబడిన దని యాతడెరుంగును గాన. కకారము లేకున్నను, వెనుక కకారముతో గూడిన త శబ్దమునకే సంజ్ఞ చేయబడినదని తెలిసికొనవచ్చును. లోకమునను, 'దేవదత్తుని గృహామేయది' యను ప్రశ్నకు జెప్పిన సమాధానమున ఆ కాకి యున్నది దేవదత్తుని గృహమనుటచే, ముందా కాకిని జూచినవాడు అది యెగిరి పోయినను, వచ్చినను ఎత్తయిన ఆ ప్రదేశమును గుర్తించి, దాని వలన వాని గృహమును దెలిసికొనగలుగునుగదా? అనిన,

అగు ననుకొనుము. కాని సంశయము కలుగకతప్పదు.

వా॥ "సిద్ధ విపర్యాసశ్చ" అని వార్తికము. 'సిద్ధస్తు విపర్యాసః' విపర్యాసమనగా ఇట సంశయము. తశబ్దమునకు నిష్ఠయని సంజ్ఞయకీరిగదా 'లూతః' 'గర్తః' అనుచోటను, 'లూనః' 'గీర్ణః'-అను స్థలమునను, అవియే 'త' అను శబ్దము గనబడుచున్నదాయె. 'ఇందేది నిష్ఠా తకారము? అను సంశయము కలుగక తీరదు దేవదత్త గృహమేదె? యని యడిగినపుడును, 'అదిగో ఆ కాకి గలది యాతని గృహమ'ను సమాధానము చెప్పినను, అది యెగిరి పోయినపు డచట నేదియో ఉద్దేశమును=ఊర్ధ్వ ప్రదేశమును గుర్తుపెట్టుకొందుననుకొనుడు, కాని బుద్ధి అనవస్థికముగదా ఇదియా? అదియా? అను సంశయ మనువర్తిచుచునే యుండును'. అను నాక్షేపమురాగా "వా॥ కారకకాల విశేషాత్సిద్ధమ్" అను వార్తికము పఠింపబడినది.

కారక విశేషమును బట్టియు, కాలవిశేషమును బట్టియు నిర్ణయము చేయ వచ్చును. 'కర్మ' 'కర్త' మున్నగునవి కారకములు ప్రత్యయార్థములు. కాల మనగా భూతకాలము, భావమును కాలాతిరిక్త ప్రత్యయార్థమే. కాలమను ప్రత్యయార్థమును, తదతిరిక్తములగు కర్తృ, కర్మ, భావములను గ్రహించి, వాని యందు విహితమయినది 'నిష్ఠ' అని గ్రహింపవలెను. లోక వ్యవహారమున గూడ, ప్రేక్షా పూర్వకారియగు మనుష్యుడు, అస్థిరమైన నిమిత్తమునుబట్టి యొక స్థిరమైన గురుతు నేర్పరుచుకొనును. అనగా నా యింటి అరుగునో, లేదా యచట గోడమీద జిత్రింపబడిన పుండరీకమునో మనము నందికొనును.

వ్యావర్తకములు రెండు విధములు. అందు గొన్ని విశేషణములు. మరి కొన్ని ఉపలక్షణములు. సాక్షాత్తుగ నితర వ్యావర్తకములగునవి విశేషణములు. తామొక యర్థాంతరము నుపస్థాపించి, ఆ ద్వారమున నితర వ్యావర్తకములగు నవి ఉపలక్షణములు. విశేష్య నిష్ఠమై వ్యావర్తకమగునది విశేషణము. అం దసన్నిహితమైనను వ్యావర్తకమగునది ఉపలక్షణము కుట. దేవదత్త గృహమునకు కాకముపలక్షణమగును ఉత్పలమునకు నీల గుణము విశేషణమయిన వ్యావర్తకము.

కారక కాలములను స్థిరమైన గురుతులను గ్రహించినను, 'ప్రాకీర్ష్ట' అను లక్ష్యమునందు. త శబ్దము, కర్తృ భూతకాల వాచకమగుటచే దానికిని నిష్ఠా సంజ్ఞ ప్రాప్తి చుచున్నదే? అది ప్రపూర్వకమగు 'కౄ' విక్షేపే అను ధాతువు నకు, కర్త్రర్థమున, భూత సామాన్యమునందు లుఙన్త రూపము గదా యనిన,

వా॥ "లుఙిసి జాది దర్శనాత్"-అని సమాధానవార్తికము. లుఙ్రూపము నందు సిజాదు లగపడుటవలన నిది నిష్ఠాంతము గాదని నిర్ణయింపవచ్చును అని వార్తికార్థము.

'ప్రాఖిత్త'-అను లుజంతరూపమున సిక్కు అగపడుట లేదేయనిన, 'సిజాది' యనగా తత్సదృశము అని యర్థము. "ప్రాఖిత్తఘటందేవదత్తః"- అను వాక్యమున, కర్త, ఏకత్వము మున్నగునవి యగపడుటవలన, నిది లుజన్తము, నిష్ఠాంతముగాదు అని తెలిసికొనుము.

సిజాదు లనగా సిచ్ సదృశమునవి యపూర్వముగ జెప్పవలెనందువా? అక్కరలేదు. అనుచ్యమానము తెలియబడుట యెట్లనిన, ఈ ప్రేషా పూర్వకారి, ఉపదిష్టములు వాని కారకకాల విశేషములను దెలిసికొనినట్లే, 'సిజాదులు లేని స్థలమునందు' అనియు నెరుంగును. కాగా 'సిజాదులు లేనిచోట, భూతకాలమునను కారక విశేషమునందును విధింపబడిన తశబ్దము నిష్ఠా సంజ్ఞకలది' అని తెలిసికొనవగు ననుట.

"క్తక్తవతూనిష్ఠా" - సమాప్తము

పంచమాహ్నికమును సమాప్తము

# "షష్ఠాహ్నిక వివర్తము"

## "సర్వనామ సంజ్ఞా ప్రకరణము"

### సూ॥ "సర్వాదీని సర్వనామాని" (1-1-27)

'సర్వ' మున్నగు శబ్ద స్వరూపములకు సర్వనామములని సంజ్ఞ అని సూత్రార్థము.

'సర్వాదీని' అను నిది యే సమాసము ?

'బహువ్రీహి సమాసము' - అని సమాధానము.

ఈ సమాసమునకు విగ్రహ వాక్య మెట్లు?

"సర్వః ఆదిః యేషాం తాని" అని='సర్వశబ్ద మేశబ్దములకు మొదటి శబ్దమో అవి' అని విగ్రహము.

అట్లయిన సర్వ శబ్దమునకు సర్వనామ సంజ్ఞ ప్రాప్తింపదే? ఏకారణము వలన? బహువ్రీహి సమాసమున అన్య పదార్థము ప్రధానము. వర్తిపదార్థము అప్రధానము. "అనేక మన్య పదార్థే" అను (2-2-24) సూత్రముచే సమాసము. కాగా సర్వ శబ్దము తప్ప తదాదితర శబ్దములకు సర్వనామ సంజ్ఞ రావలెను.

'చిత్రగుః'=చిత్ర వర్ణములయిన గోవులు కలవాడు, 'చిత్రగుం ఆనయ'='అవి కల వానిని దీసికొనిరమ్ము'- అనిన చిత్ర గోస్వామి తీసికొని రాంబడుచున్నాడు గాని గోవులు దీసికొని రాబడలేదుగదా.

అనిన నది దోషము కాదు. బహువ్రీహి సమాసమున, తద్గుణ సంవిజ్ఞానము గూడ నుండును.

'చిత్రవాస సమానయ'='చిత్రవర్ణముగల దుస్తులను ధరించిన వానిని దీసికొని రమ్ము' అనిన వానితో గూడిన వ్యక్తినే తీసికొని వత్తురు. "లోహితోష్ణీషా ఋత్విజః ప్రచరన్తి=ఎఱ్ఱని తలపాగలుగల ఋత్విక్కులు హోమములను చేయుచున్నారు"-అనునపుడును ఉష్ణీష సహితులగు ఋత్విక్కులకే క్రియాన్వయ మగపడుచున్నది. తద్గుణ సంవిజ్ఞాన మనగా=తద్గుణములకు కార్యము నందన్వయము. తద్గుణములనగా=అన్యపదార్థము యొక్క ప్రకారములు. ఆ అన్వయము రెండు తెరగులుగా నుండును. వర్తి పదార్థములకు క్రియా సన్ని

ధానము మాత్ర మొకటి. రెండవది వానికి క్రియా యోగము. 'శుక్లవాస సంభోజయ', "శుక్లవాస సమానయ" - అని యుదాహరణములు. తెల్లని దుస్తులు ధరించియున్న వానికి భోజనమును పెట్టుమనిన, నట దుస్తులకు, భోజన క్రియా సన్నిధానము మాత్రమేగాని క్రియా సంబంధములేదు. 'శుక్లవాస సమానయ' అనుచో, దుస్తులకును వానయన క్రియా న్వయము గలదు. వానికి కార్యిత్వముగాని కార్య సన్నిహితత్వముగాని శబ్దశక్తి స్వభావము ననుసరించి ఉండును. కాగా, తద్గుణ సంవిజ్ఞానమున వర్తి పదార్థి విశిష్టముగను, అతద్గుణ సంవిజ్ఞానమున వర్తి పదార్థోపలక్షితమునకును నితరాన్వయము కలుగు నమట.

'సర్వాదీని' అను సమాసమున ఆది శబ్ద మవయవవాచి. ఉద్భూతావయవ భేదముగల సముదాయము సమాసార్థము. అట్టి సముదాయమున కంతకును ప్రయోగ మెచటను సంభవింపదు. కావున సముదాయాంతర్భూతముల కెల్ల సంజ్ఞ ప్రవర్తించును. 'దేవదత్తుని శాలలోనున్న బ్రాహ్మణులను రప్పింపుడు" అనిన, దేవదత్తుడు గూడ బ్రాహ్మణుడై, ఆపుణ్యశాలలో నుండిన నాతడు గూడ దీసికొని రాబడుట చూచుచున్నాము. కావున సర్వశబ్దమునకును సర్వనామ సంజ్ఞ సిద్ధింపగలదు.

## "సర్వనామపదసాధుత్వ విచారము"

'సర్వనామ'— అను నీ సంజ్ఞా పదము యౌగికము. అన్వర్థము. సర్వేషాం నామ = సర్వనామ అని విగ్రహము. ఈ సమాసమున, పూర్వ పదమందు రేఫకలదు. అది ణత్వమునకు నిమిత్తము. ఉత్తరపదముననున్న నకారమునకు "పూర్వపదాత్సంజ్ఞాయామగః" (8 4.3) అను సూత్రముచే ణత్వము ప్రాప్తించు చున్నది. దానికి ప్రతిషేధము చెప్పవలెను.

అను నాక్షేపమునకు సమాధానవార్తికము వా॥ సర్వనామ సంజ్ఞాయాం నిపాతనా ణ్ణత్వాభావః"— అనునది. 'సర్వనామ' అను సంజ్ఞాపదమునందు నిపాతనమువలన ణత్వమురాదు.

నిపాతన మనగానేమి ? దానివలన ణత్వమునకు నిషేధమెట్లు ?

ప్రతిషేధమన నేమి ? ప్రతిషేధమనగా,

సామాన్యముగనొకయంశమును జెప్పి, కొన్ని విశేషవస్తువులందు 'ఇది ప్రవర్తింపదు' అని చెప్పినది ప్రతిషేధము. అట్టియెడ వ్యక్తముగ 'ఒదియిట రాదు' అని ఆచార్యుని అభిప్రాయమవగతమగును.

నిపాతనమను ఆ జాతికి చెందినదే. అవిశేషము గణత్వాప్రసక్తి సాధించి, ఇట విశేషముగ, గణత్వములేని 'సర్వనామాని' అను నిపాతనముచే పఠనముటచే

'ణత్వ మిచట ప్రవ ర్తింపదని యాచార్యుని అభిప్రాయముగా గమ్యమగును' అనిన,

అట్లుకాదు. నిపాతనమువలన ణత్వాభావమును, యథాప్రా ప్తమగు ణత్వమునుగూడ రావలసివచ్చును. ప్రతిషేధమునకు నివృ త్తియందే తాత్ప ర్యము. నిపాతనమునకు, ఆ రూపము సాధువగును అని బోధించుటయే తాత్పర్య విషయముగాని రూపాంతరమును తొలగించుటలో దానికి తాత్ప ర్యము లేదు. భావాభావములకు విరోధము లేకుండుటకై, ఆ పదమునకే కొన్ని కావుల ణత్వము సాధువు, కొన్నింట నది అసాధువు అని యర్థమగును. అది యువభిమతము.

ఇట్లు బోధించు విధు లితరములేమైనగలవా ?

ఎందుకు లేవు ? కలవు. స్థానివదతిదేశము స్థానిప్రయు క్తము ప్రవ ర్తించు నని చెప్పును. ఆదేశప్రయు క్తమును వారింపదు. గాన నదియు వచ్చును.

అట్లే "ఇకోయణచి" (6.1.77) అను శాస్త్రము వలన, 'యణాదేశము ప్రవ ర్తించును, యథాప్రా ప్తమగు నిక్కుగూడ వివలదును.'

అనిన నదిగాదు. విశేషముకలదు. అట షష్ఠీ విభ క్తిచే స్థాని నిర్దేశము చేయబడినది. ఆ షష్ఠిస్థానిని నివ ర్తింపజేయును.

స్థాన షష్ఠీ నిర్దేశ స్థలములందెల్ల, స్థానికి నివృ త్తియు నాదేశమునకు ప్రవృ త్తియు నుభయమును దాత్పర్య విషయము, అనిన, కాని, షష్ఠిలేని చోటనెట్లు ? "క ర్త రి శప్" (3.1.68) అను సూత్రముచే, క ర్త్రర్థకసార్వధాతు కము పరమగునపుడు, 'శప్' అను వికరణ ప్రత్యయము ధాతు సామాన్యము నకు ణదముగా విధింపబడినది. ఇక "దివాదిభ్యశ్శ్యన్" (3.1.69) అను సూత్రము, దివాదిగణ పఠిత ధాతువులకు మాత్రము, శ్యన్ప్రత్యయమును విధించుచున్నది. అట షష్ఠీ నిర్దేశములేదు. కావున శ్యన్ప్రత్యయమును, యథాప్రా ప్తమగు 'శప్' ప్రత్యయమును వికల్పముగ ప్రవ ర్తింపవలసి యుండును గదా ? అందురేవి,

శ్యనాదులు శబాదేశములుగా జేయబడునుగాన, దోషములేదు. అట్లైన, "దివాదిభ్యః"- అను సూత్రమున 'శపః' - అని చెప్పవలసియుండును గదా యనిన,

అక్కరలేదు. ప్రకృతమైన శబ్గ్రహణ మనువ ర్తించును.

ఎచ్చట, ప్రకృతము ? 'క ర్తరి శప్' అను సూత్రమున.

ఇట, షష్ఠ్యంతమగు 'శపః' అను పదముగదా కావలసినది. ఆ సూత్రము నందున్నది ప్రథమాంతమే ?

"దివాదిభ్యః శ్యన్" (3.1.69) అను సూత్రమునందలి పంచమ్యంతమగు, "దివాదిభ్యః" అను పదము, అందనువర్తించిన 'శప్' అను పదమును షష్ఠ్యంతముగా మార్చును. "తస్మాదిత్యుత్తరస్య" (1.1.67) అను సూత్రము, పంచమ్యంత పదములకంటెె బరము లైయున్న వానికి షష్ఠ్యంతత్వమును గల్పించును. కనుక, 'శప్' అను పదము 'శపః' అని మారవచ్చును.

ఆ షష్ఠీప్రకల్పకత్వము ప్రత్యయ విధులందు ప్రవర్తింపదే? ఇదియు ప్రత్యయ విధిగదా యనిన నిది 'శప్' అను ప్రత్యయమును విధింపలేదు. "కర్తరిశప్" (3.1.68) అని విహితమయిన శప్పు ఇందనువర్తించును. అంతే.

అట్లైన, "అవ్యయసర్వనామ్నామకచ్ ప్రాక్టేః" (5.3.71) అను సూత్రముచే విధింబబడిన 'అకచ్' అను ప్రత్యయమును, 'క' అను ప్రత్యయమును వికల్పితములగును. యథాప్రాప్తమయిన క ప్రత్యయము వినబడును. రెండును అజ్ఞాతాద్యర్థమున విధింపబడినవేగాన, "ఏకార్థాస్తువికల్పేరన్" అను న్యాయము చేత వానికి వికల్పము ప్రసక్తమగుచున్నది, అనిన నకచ్ప్రత్యయము కప్రత్యయమున కపవాదముగాన దానిని బాధించునని సమాధానము. కప్రత్యయ మవశ్య ప్రాప్తమగుచుండ నారంభింపబడినదిగదా అకచ్ప్రత్యయము. కావున నా దోషములేదు.

యేలనగా ప్రాప్తిన్యాయముచే అత్వాదులు బాధకములంటే నట్లు నిపాతములు గూడ నాజాతికి చెందినవే కావున నవియు. యథా ప్రాప్తములకు బాధకములేయగును. ణత్వ మవశ్య ప్రాప్తముగా నారంభింపబడినది నిపాతనము. కావున అది ణత్వమునకు బాధకమగునని సిద్ధాంతి సమాధానము.

ఇటనొక యాక్షేపము—నిపాతనములును నట్టి వేయనిన, 'సమ్' అను నుపసర్గకు, తత శబ్దము పరమగునపుడు అనిష్టము ప్రాప్తమగుచున్నది. "సమోహిత తతయోర్వా" అని పాణినీతర వైయాకరణుల శాసనము. తత, హిత శబ్దములు పరములగునపుడు ఆ యుపసర్గ మకారమునకు వికల్పముగ లోపమగునని యర్థము. 'సతతమ్' 'సంతతమ్' సహితం సంహితమ్ అని యుదాహరణములు. "అపరస్పరాః క్రియాసాతత్యే" (6-1-144) అను సూత్రమునందు 'సాతత్యే' అను పదము నిపతింపబడినది. 'అది 'సంతతమ్' అను యథాప్రాప్త రూపమునకు బాధకమే అయిన పాణిని మతమున రుపద్వయము సిద్ధింపదు గదా!' అని ఆక్షేప తాత్పర్యము.

రూపాంతరము సిద్ధికి యత్నాంతరమును చేసికొనవలెను. నిపాతనములు మాత్రము యథా ప్రాప్తములకు బాధకములు కావలసినవియే,అవి సిద్ధాంతము. 'సతతమ్' అను రూపము నిపాతన సాధ్యముగాదు. అట్టి శబ్దములు మకార లోప వికల్పము సిద్ధి పవలసినవి యి కను మరి కొన్ని రూపములుగలవు. వాని కొరకవశ్యపఠనీయమగు నొక శ్లోక వార్తికముగలదు- అపరస్పరాః క్రియా సాతత్యే (6-1-14) అను సూత్రమునందలి 'అపరస్పరాః' అను నిర్దేశము ఏక దేశానుమతిచే నా శ్లోక వార్తికమును జ్ఞాపన చేయును.

శ్లో॥ ''లుంపే దవశ్యమః కృత్యే, తుంకాయమనసోరపి ।
సమోవాహిత తతయోః మాంసస్య పచియుడ్ఘఞోః''—

ఏతచ్ఛ్లోక జ్ఞాపకమే కర్తవ్యమగు యత్నము -

అవశ్యకర్తవ్యమ్' 'గన్తుకామః' 'గన్తుమనాః' అను రూపములలో మకారమునకు నిత్యముగ లోపము. 'సతత' 'సంతత' 'సహిత' సంహిత శబ్దములందు వైకల్పిక లోపము. మాంస శబ్దాకారమునకు, పచనీ, పాకః అను నవి పర మయినపుడు లోపము వైకల్పికము. మాంస్పచనీ 'మాంస పచనీ'- ఇత్యాది ఉదాహరణములు. ఇది శ్లోకార్థము॥

## సంజ్ఞోపసర్జనములకు సంజ్ఞావారణము

సర్వ మున్నగు శబ్దములు ముప్పదియైదు. సర్వ, విశ్వ, ఉభ, ఉభయ అనునవి నాలుగు. డతర డతమ ప్రత్యయాంతములు, అన్య, అన్యతర, ఇతర - అను నివి యైదు. త్వత్, త్వ, నేమ, సమ, సిమ - ఇవి అయిదు. సంజ్ఞలు కానివి, వ్యవస్థను బోధించునవియునైన పూర్వ, పర, అవర, దక్షిణ, ఉత్తర, అపర, అధర - అనునవి యేడు. ఆత్మాత్మీయ వాచియగు స్వశబ్దము, బాహ్యము, పరిధానీయము అను నర్థములుగల అంతరశబ్దము, త్యద్, తద్, యద్, ఏతద్, ఇదమ్, అదస్, ఏక, ద్వి, యుష్మద్, అస్మద్, భవతు, కిమ్ - అనునవియుగలసి మొత్తము సర్వాదులు ముప్పదియైదు.

వా॥ "సంజ్ఞాపసర్జనప్రతిషేధః" అని యాక్షేపవార్తికము. ఈ సర్వాదులు ఒకానొక వ్యక్తికి నామధేయములయినపుడున, లేదా వాని యర్థ మప్రధానమయినపుడును, వానికి 'సర్వనామ' అను సంజ్ఞ ప్రవర్తింపదని చెప్ప వలెను. ఒకనికి 'సర్వుడు' అని పేరయిన, 'దీనిని సర్వునకిమ్ము' అని చెప్పదలచి నపుడు, 'సర్వాయదేహి' అనియే అనవలెను గాని, 'సర్వస్మైదేహి' అని యనరాదు. అవిధముగనే, సర్వము నతిక్రమించినవాడు - అతి సర్వుడు, 'వాని కొరకు దీనినిమ్ము' అని చెప్పవలసినపుడు గూడ, 'అతి సర్వాయదేహి'

అని యనవలెనేగాని 'అతిసర్వస్మై' అనరాదు. అందు సర్వశబ్దముయొక్క అర్థము అప్రధానము, అతి శబ్దార్థము ప్రధానమునుగదా. కావున నట్టివానికి సంజ్ఞాప్రతిషేధము కర్తవ్యము.

ఇక అదియేవిధముగ కర్తవ్యము ? అనిన సమాధాన వార్తికము.

వా॥ "పాఠాత్పర్యుదాసః పఠితానామ్ సంజ్ఞాకరణమ్" అనునది సర్వాది గణ పాఠమునుండియే. వానిని తొలగించి, అన్యవిశేషణములు కానివియు, పౌరుష సంకేతములు కానివియునగు వానిని అందు పఠించి, అట్టి శబ్దములకే సంజ్ఞ కర్తవ్యము. అపుడు, 'సర్వాదులు సర్వనామ సంజ్ఞకములగును, సంజ్ఞలయినవి, ఉపసర్జనములయినవియును సర్వాదులే కావు' అని స్పష్టమగును.

అట్లుచేయుట, సర్వాదులకు సామాన్యముగ ప్రాప్తించు సర్వనామ కార్యవారణమునకేనా ? కాదు. విశేషకార్య నిషేధముకొరకును అది యావశ్యకము. ఆ ప్రయోజనమేమనిన, ప్రయోజన వార్తికము,

వా॥ "సర్వాద్యానంతర్య కార్యార్థమ్" అనునది.

"అనంతరోక్ష్యపలక్షితములగు త్యదాదుల శత్వమగును" అట్టిడతరాదుల కంటే పరమగు 'సు' 'అమ్' ప్రత్యయములకు 'అద్డ్' ఆదేశమగును అని యీ రూపముగ సర్వాద్యంతర్గతములగు త్యదాది ప్రకృతులకు విధింపబడిన కార్యము సంజ్ఞోపసర్జనీభూతములకు, ప్రవర్తింపకుండుట, ప్రయోజనమని వార్తికార్థము. ఆ ప్రయోజన మెచ్చటను ప్రశ్నకు సమాధాన రూప వార్తికములు.

వా॥ (1) "ప్రయోజనం డతరాదీ నామద్డ్భావే"

"త్యదాది విధౌ చ"—అనునవి.

అతిక్రాంతమిదం బ్రాహ్మణకులం కతరత్?=ఈ బ్రాహ్మణ గృహము దేనినతిక్రమించినది? అనునర్థమున, 'అతి కతరమ్? అనియే కావలెను. 'అతికతత్' అని కారాదు. అట కతర శబ్దార్థమప్రధానమగుటచేత 'అద్డ్' ఆదేశము రాదు.

అట్లే, అయం బ్రాహ్మణః తత్ అతిక్రాంతః=ఈ బ్రాహ్మణుడు దానిని అతిక్రమించినవాడు-అనునర్థమున "అతితత్, అయంబ్రాహ్మణః" అనియే కావలె. 'అతిసః' అని యనరాదు. ఈ ప్రయోజనములకై సంజ్ఞోపసర్జన ప్రతిషేధము కర్తవ్యమని భావము.

ఇక వార్తిక ప్రత్యాఖ్యానము—

అందు సంజ్ఞలకు ప్రతిషేధము చెప్ప నక్కర లేదు. సర్వాది గణములో నొక సూత్రము, "పూర్వ ప రావర దక్షిణో త్తరాపరాధరాణి వ్యవస్థాయామ సంజ్ఞాయామ్" అను నామ పూర్విగలది కలదు. ఆ సూత్రమష్టాధ్యాయి యందును, సర్వాది గణపాఠము నందును పఠింపబడియున్నది. అందు గణ సూత్రమున 'అసంజ్ఞాయామ్' అనునది పృథక్సూత్రముగా జేయబడును. 'సర్వాదులివి' అని అనుక్రాంతములయిన 'సర్వ' 'విశ్వ' - మున్నగు ముప్పది రైయిదును, సంజ్ఞాభిన్నములే ఈ గణమున పఠింపబడినవి, అని యా విభక్త గణ సూత్రమున కర్థము. కాగా వానికి వేరుగ ప్రతిషేధము అనావశ్యకము.

ఉపసర్జనములకు సర్వనామ సంజ్ఞా ప్రతిషేధమును అనావశ్యకమే. స్త్రీ ప్రత్యయ ప్రకరణమున "అనుపసర్జనాత్" (4-1-14) అని యొక సూత్రము గలదు అటనది నిరుపయోగమని ముందు, ప్రత్యాఖ్యానము చేయబడును. దానిని కార్యాంతరమునకై పరిభాషగా గ్రహింపవచ్చును. అందు, అనుప సర్జన' 'అ' అత్'—అని మూడు పదములు. మొదటిది షష్ఠ్యర్థకము. 'అనుప సర్జనమునకు, అని దాని కర్థము, 'అ' 'అత్'-అనగానేమి? అనిన, అకారమును, అత్కారమును విధింపబడినవి. అనుపసర్జనమునకే వచ్చునని తెలిసికొనవలెనని యర్థము. అకారమనగా, "త్యదాదీనామః" (7-2-102). అను నత్వము 'అత్' అనగా, 'అద్డ్ డతరాదిభ్యః పఞ్చభ్యః' అను సూత్రముచే విధింపబడిన నదేశము కాగా, అంతర్గణ కార్యములు వానికి రానేరావు. ప్రతిషేధ మనావశ్య కము.

అట్లైన, 'అతి యుష్మత్' 'అత్యస్మత్' అను రూపములు సిద్ధింపక పోవునే? "పంచమ్యా అత్" అను సూత్రముచే (7-1-31) భ్యస్ప్రత్యయము నకు అదాదేశమురావలె. మిమ్ములను నతిక్రమించినవాడు.' మమ్ములను నతిక్ర మించినవాడు, అను నర్థమున, యుష్మదస్మచ్ఛబ్దార్థము లప్రధానములుగాన నాశబ్దము లుపసర్జనములు గదా. అత్కారము విహితమైనది అనుపసర్జనము నకే యగునవనిరిగదా? అనిన,

'అనుపసర్జనాత్' - అను సూత్రములింకొక అకారముగూడ ప్రశ్లిష్టమై నిర్దేశింపబడియున్నది. అనుపసర్జన, అ, అ, అత్ అని విభాగము. దానివలన అకారముకంటె పరముగ విధింపబడిన అకారాత్కారములు అనుపసర్జనము నకే యగునని యర్థమగును "పంచమ్యాఅత్" అను సూత్రముచే విధింపబడిన ఈ అత్కారము దకారాంతములగు 'యుష్మద్' 'అస్మద్' - అనువానికి పరముగ విహితముకనుక దోషము లేదు. త్యదాద్యత్వము అకారమునకు పరమైన దకారస్థానమున విధింపబడునది గాన నీ పరిభాషవలన నది 'అతితత్' అనుచో ప్రవర్తింపదు

లేదా - సమాధానాంతరమును నిట్లు చెప్పవచ్చును. ఎట్లు ? అంగాధికారమునందు జెప్పబడినది గృహ్యమాణ విభక్తికే వచ్చును. గృహ్యమాణము అనగా సూత్రగృహీతములయిన త్యదాదులును, డతరాదులును. వాని విభక్తి యనగ, వానియర్థములగు సంఖ్యాకర్మాదులను జెప్పు విభక్తి. తత్సంబంధి కార్యములు విభక్త్యాదేశమగు అద్డాదేశమును విభక్తినిమిత్తకమగు నత్వమును 'అతికతరమ్' 'అతితత్' అను స్థలములందు విభక్తి అన్యపదార్థగత సంఖ్యా కర్మాభిధాయిగాని గృహ్యమాణార్థగత తదభిధాయిగాదు కాగా నది దోషము లేదు.

అట్లైన, 'పరమపంచ' 'పరమసప్త' అనుచోట్లను, 'షడ్భ్యోలుక్' (7 1 22) అను అంగకార్యమగు లుక్కు కూడ ప్రవర్తింపకపోవునే ? అచట విభక్తి సముదాయ విహితముగాని, గృహ్యమాణవిహితము కాదు గదా యనిన, వినుడు.

ఇది షట్సంజ్ఞకార్థము ప్రధానముగాగల సమాసమే. షట్సంజ్ఞకముల కంటె, పరములయి తదర్థగత సంఖ్యాభిధాయులగు 'జస్' 'శస్' ప్రత్యయములకు లుక్కు వచ్చునని యర్థముగాన, అర్థద్వారముగ విభక్తిగృహ్యమాణ సంబంధియగును.

అట్లైన - ప్రియసక్థి శబ్దమున తృతీయైకవచనాంత రూపములో, అనఙాదేశము ప్రవర్తించినది. అది యెట్లు పొసగునని "ప్రియసక్థ్నా" ప్రియమైన శకటాక్షముకలవానిచే అని యర్థము. సక్థిశబ్దార్థము అప్రధానము. విభక్తి గృహ్యమాణముకంటె విధింపబడినది గాదు. కావున అనఙాదేశము రాకపోవును అనిన—

సప్తమి నిర్దిష్ట విభక్తిపరమగునపుడు విహితమయినది. ప్రకృత విభక్తి అనగా, అంగార్థసంబంధి విభక్తిపరమగునపుడు ప్రవర్తించును. ఇట, విభక్తి అట్టిదే కాన దోషము లేదు" అని సమాధానము.

కాని, అట్లుచెప్పిన, 'అతితద్ అతితదౌ, అతితదః'—అనుచో అత్వము రావలసివచ్చును త్యదాద్యత్వమును. సప్తమీ నిర్దిష్టము పరమగునపుడు విహితమే గదా? 'అంగాధికారోక్తము గృహ్యమాణ విభక్తికి సంబంధించి ప్రవర్తించును' అని చెప్పిన, 'ప్రియసక్థ్నా' అను స్థలమున అనఙాదేశము ప్రవర్తింపక పోవును. ఆ దోషమును వారించుటకు, 'సప్తమి నిర్దేశముచే విహితమయినది. ప్రకృత విభక్తికి సంబంధించి ప్రవర్తించును' -అని చెప్పవలెను. అపుడు, 'అతితద్' అనుచో అత్వమునకు అతి ప్రసంగము. అందువలన నుభయమును వక్తవ్యమగును. అది గౌరవ పరాహతము.

అనిన—ఏదియు వక్తవ్యముగాదు. అన్యథా నిర్వాహము సర్వత్ర సుకరము. "అడ్ డ్ డతరాదిభ్యః పంచభ్యః" అనుసూత్రమును దీనికొనుడు. ఇట గృహ్యమాణము పంచమ్యంతము. అధికార ప్రాప్తమగు 'అంగస్య' అనునది షష్ఠ్యంతము. ఇట్లని రెండును విభిన్న విభక్త్యంతములగుటచే, డతరాదిభ్యః అను పంచమ్యంతము అంగస్య' అను షష్ఠ్యంతమునకు సమానాధికరణ విశేషణము గాజాలదు ఇక పంచమి, డతరాదుల కంటె విహితమగు ప్రత్యయమును దప్ప నెనిని విశేషించును? కాగా, అంగ సంజ్ఞా నిమిత్తములును, డతరాదుల కంటె విహితములును నయినను, అమ్ ప్రత్యయములకు అద్ డ్ ఆదేశమగునని యర్థము.

ఇక నిపుడు, "అస్థిదధి సక్థ్యక్ష్ణామనఙుదాత్తః" అను అనఙ్విధాయకము మందును, "త్యదాదుల కత్వమగు" నను "త్యదాదీనామః" అను సూత్రమందును అనిన. అట గృహ్యమాణ పదములును, అంగస్య అనునదియు షష్ఠ్యంతములే. కావున నచట విభక్తిని గృహ్యమాణముచే విశేషించినను విశేషింపవచ్చును. అంగముచేనైనను విశేషింపనగును. ఇట్లు కామచారమున కవకాశముకలదు గాన, అస్థిదధీతి సూత్రమున అంగముచే విభక్తిని విశేషింతుము. అస్థ్యాదులచే అనఙును విశేషింతుము. కాగా, అంగమునకు విభక్తి పరమగునపుడు అనఙాదేశము ప్రవర్తించును, అంగము అస్థి, దధి సక్థి ఇతిరూపము అని వాక్యార్థము విభక్తి అంగార్థ ప్రతిపాదకమనుట.

ఇట నిపుడు త్యదాదుల కత్వము విధింపబడిన స్థలమున నందురా, అట, గృహ్యమాణముచే విభక్తిని విశేషించి, అంగముచే అకారమును విశేషింతుము. "త్యదాదులకు విభక్తి పరమగున పుడత్వమగును, ఆ త్యదాదుల అత్వము అంగ సంబంధియునగును" అని వాక్యార్థము.

అటులైన, 'అతిసః' అనుచో అత్వము ప్రాప్తింపక పోవునే? అనిన అట, 'అతిశయముగల, లేదా శోభనుడైన అతడు' అని ఆపదమున కర్థము గావున ఆ సమాసము త్యదాదియగు తచ్ఛబ్దార్థము ప్రధానము గాగలది కాన దోషములేదు.

లేదా—ఈ సూత్రము సంజ్ఞా సూత్రమేకాదు. సర్వనామములు అనగా సర్వనామ సంజ్ఞ కలవి సర్వాదులు అని అర్థముకాదు 'సర్వనామములగునవి సర్వాది గణపఠితములు' అని, పాఠమునకు సర్వనామ పదము విశేషణము వాని సర్వార్థ వాచకత్వము సర్వనామత్వము స్వస్వవిషయాపేక్షమే కాన సర్వాదులకు పర్యాయకత్వము లేదు. గోత్వము అశ్వత్వము మున్నగు జాతులు సర్వగతములు అనగా స్వీయ స్వీయ సర్వగతములనియేగదా తాత్పర్యము.

సంజ్ఞలగు సర్వాదులు ఏక వ్యక్తి మాత్ర బోధకములు గాన సర్వ నామము లవికావు. వ్యక్తి విశేషపరములే.

ఉపసర్జనములును సర్వనామములుకావు గాన వానికిని సర్వాదిత్వము లేదు. అవి విశేషణముగ స్వార్థము నుపస్థాపించునవి గాని ప్రధానముగ స్వార్థోప స్థాపకములుగావు.

అటులైన సర్వాదులకు సర్వనామమను సంజ్ఞ లేదుగదా? అపుడు, "సర్వనామ్నః స్మై" 7-1-14 "ఆమి సర్వనామ్నస్సుట్" (7-1-52) ఇత్యాది సంజ్ఞాశ్రయ కార్యములెట్లు సిద్ధించును?

ఆ సూత్రములందలి సర్వనామపద మన్వర్థముగా భావింపబడును. ఎయ్యది సర్వములకు నామమో అది సర్వనామం. దానికంటె బరమయిన జేస్థాన మున 'స్మై' ఆదేశము, అట్టి 'ఆమ్' కు సుడాగమమునగునని యర్థము. కావున దోషము లేదు—

అట్లైన. 'సకలమ్' 'కృత్స్నం' 'జగత్'—అను పదములును సర్వార్థ బోధకములు గాన, వానికిని ప్రాప్తించుచున్నది. వీనితో గూడ నొక్కొక్క పదమునకు స్వ స్వవిషయ పరత్వముగలదు గాన నవియు సర్వనామములగును. కావున, తత్తద్విషయ పరములగు వీనికిని సర్వనామ కార్యము రావలని వచ్చు చున్నదే యనిన,

ఈ సూత్రముచే రెండు పనులును జేయబడును. పాఠమును విశేషింప బడును. సంజ్ఞయును విధింపబడును.

ఒకే ఒక యత్నముచే రెండు కార్యము లెట్లు లభించును? లభింప వచ్చును. ఎట్లనిన, ఏక శేష నిర్దేశమువలన లభించును. ఇది ఏక శేష నిర్దే శము. "సర్వాదీచ సర్వాదీనిచ = సర్వాదీని". "సర్వనామానిచ సర్వనామా నిచ = సర్వనామాని" అని గ్రహణము. 'సర్వ' మున్నగునవి సర్వనామ సంజ్ఞి కలవియగును. అని మొదట 'సర్వాదీని సర్వనామాని'—అను వాక్యమున కర్థము. ఎయ్యవి సర్వనామములో యవి సర్వాదులు అని రెండవ వాక్యార్థము. సంజ్ఞోపసర్జనములు విశేషమునందే నిలచి యుండునవి గాని సర్వనామములు గావు. సర్వశబ్ద మొక వ్యక్తికి పేరగునపుడది ప్రసిద్ధమగు యావత్త్వమను ప్రవృత్తి నిమిత్తమును వదలిపెట్టి స్వరూప మాత్ర బోధకము గాన సర్వార్థవాచకముగాదు. ఉపసర్జనము గూడ, 'అతిసర్వాయ'. మున్నగుచోట్ల ప్రధానముగ సర్వార్థబోధకమగుటలేదు, అతిక్రమించిన అను నర్థమునకు విశేష ణముగ నుపస్థితమగుటచే నదియు విశేషమున ననగా విశేషణమునందు నిలచినదే గావున సర్వనామము కాదు.

లేదా - సమాధానాంతరమును నిట్లు చెప్పనగును. 'సర్వనామము' అను నీ సంజ్ఞ పెద్దగా నున్నది. సంజ్ఞయన నెట్లుండవలెను ? దేనికంటె నిక చిన్నది యుండబోదో అట్టిదిగ నుండవలెను ? అట్టియెడ నింతటి మహాసంజ్ఞను ఏల చేయవలె ? శాస్త్రమున సంజ్ఞల నేర్పరచుట, శబ్దవ్యవహారములందెల్ల లఘుభూతమగు నుపాయముచే శాస్త్రమును ప్రవర్తింపజేయుటకేకదా ? అట్లు చేయక, మహాసంజ్ఞను జేయుటచే నియ్యది యన్వర్థమగు సంజ్ఞ కావలెనని పాణిని తాత్పర్యముగా దోచును. కాగా, గణపఠితములు, సంజ్ఞాప్రవృత్తి నిమిత్తమయిన సర్వనామత్వముతో కూడినవియే యగునని యూహింపబడుట వలన సంజ్ఞాకార్యములును, అంతర్గణకార్యములును సంజ్ఞోపసర్జనములకు ప్రవర్తింపవు. అవి విశేషబోధకములేగాని సర్వార్థ వాచకములగు సర్వాదులు కావు — అని భావము.

ఈ సర్వాదిగణములో మూడవ శబ్దముగా 'ఉభ' అను శబ్దము పఠింపబడి యున్నది. దానికి సర్వనామ సంజ్ఞాప్రయోజనమేమి ?

వా॥ "ఉభస్యసర్వనామత్వే అకజర్థః" :- అని సమాధాన వార్తికము. "ఉభకౌ" - అనుచోట. "అవ్యయ సర్వనామ్నామకచ్ప్రాక్టే" (5-3-71) అను సూత్రముచే, కప్రత్యయమున కపవాదముగ విధింపబడిన 'అకచ్' అను ప్రత్యయము సిద్ధించుటకై దానికి గణపాఠమని తాత్పర్యము.

అకచ్ప్రత్యయార్థమే తత్పాఠమందువేమి' ? ఇతర సర్వనామ కార్యములు సూత్రము ప్రయోజనములుగావా ? అవిన,

వా॥ "అన్యాభావోద్వివచనటాబ్విషయత్వాత్" అని సమాధాన వార్తికము.

ఇతర సర్వనామ కార్యములులేవు. ఏమికారణమనగా, అది కేవల ద్వివచన విషయమును, స్త్రీలింగమయిన, ద్వివచన టాబ్విషయమునుగదా ! ఇతర సర్వనామకార్యములు, ఏకవచన బహువచనములందే గలవాయె. కావున దానికి ప్రసక్తి లేదు.

ఈ ఉభశబ్దము, కేవల ద్వివచన విషయమును, టాప్సహిత ద్వివచన విషయమును నయినయెడల. ద్వివచనము లేనపుడు తసిలాది ప్రత్యయ విషయమున దీని యర్థమును ప్రతిపాదించు శబ్దమింకేదియగును ? దీనికి సమాధాన వార్తికము - వా॥ ఉభయోన్యత్ర" అనునది అట్టి స్థలములందు ద్వివచన విషయత్వాభావము సంభావితమయినపుడు, ఏతదర్థ ప్రతిపాదకము, 'ఉభయ' శబ్దమగును. ఉదాహరణము "ఉభయేదేవమనుష్యాః" "ఉభయోమణిః" అనునవి. ఇందు మొదటిది స్వార్థికమగు 'అయచ్' ప్రత్యయమంతమందుగలది రెండవది అవయవార్థ కాయజంతము.

'ఉభకా' అనుచోట 'అకచ్' రాకుండిన నేమగును?

'క' ప్రత్యయము రావలసి వచ్చెడిది.

క ప్రత్యయమునకును, 'అకచ్' ప్రత్యయమునకు నిందేమి భేదము? రూపమునందుగాని స్వరమునందుగాని విశేషమేదియులేదుగదా?

ఈ ఉభశబ్దము ద్వివచన టాబ్విషయమని చెప్పబడినది. 'అకచ్' ప్రత్యయము ప్రవర్తించిన, అది టి సంజ్ఞకభాగమునకు ముందు ప్రవర్తించును గాన మధ్యపతితమగును. "తన్మధ్యపతితస్తద్గ్రహణేన గృహ్యతే" అను న్యాయముచే 'ఉభక' అను నకజంతము ఉభశబ్దముగ గ్రహింపబడును గాన నిది ద్వివచనము పరముగా గలది' అని యనవచ్చును. ఇక 'క' అను ప్రత్యయము వచ్చినయెడల నిది ద్వివచనపరము కాజాలదు. ద్వివచన మవ్యవహిత పరముగ వినబడినపుడే ఉభ శబ్దము సాధువగును. అది వ్యవహిత పరమగునపుడు గాని లోపించినపుడు గాని అది సాధువుగాదు. 'క' ప్రత్యయము వచ్చినపుడు, ఉభశబ్ద ప్రకృతిక ద్వివచనము లోపించుటచేతను, కవిశిష్టము కంటె బలమైన ద్వివచనము, క ప్రత్యయముచే వ్యవహితమగుటవలనను, నది ద్వివచన పరముగాదు కాగా, 'వ్యవహిత ద్వివచన పరమగు ఉభశబ్దమును సాధువే అని చెప్పవలసివచ్చును. ఇట్లు అపూర్వ వచనమును చెప్పనక్కరలేకుండుట యనులాఘవమునకై తాత్పర్యము.

ఈ ఉభశబ్దము క ప్రత్యయము పరమగునపుడు ద్వివచనపరము కానట్లే 'అప్' పరమగునపుడును ద్వివచనము పరముగాగలది కాదు. ఆ అప్పుతో వ్యవధానముండునుగదా! కావున, 'క' ప్రత్యయము పరమగునపుడు ద్వివచన పరత వక్తవ్యమయినట్లు, 'టాప్' పరమగునపుడును నది వక్తవ్యము కావలెనే? అను ఆక్షేపమునకు సమాధాన వార్తికము, వా॥ "అవచనాదాపితత్పర విజ్ఞానమ్" అనునది.

వచనమక్కరలేకయే 'అప్' పరమగునపు డుభ శబ్దము ద్వివచన పరమగును. ఆప్ అను స్త్రీ ప్రత్యయము స్వార్థమున ప్రవర్తించినదియేగాన నట, ఉభశబ్దార్థమునకు హానిలేదు. టాప్ప్రత్యయముతో సవర్ణదీర్ఘముగాగా నేకాదేశము, పూర్వాంతమువంటి దగును గాని, అనంతాదివద్భావముచే ద్వివచన పరము టాబంతమగును. వచనముతో బనిలేదు.

పై వార్తికమునకు, ప్రత్యాఖ్యానవార్తికము — వా॥ "ఆవచనాదాపి తత్పర విజ్ఞానమితిచేత్కేపితుల్యమ్" అనునది.

అట్లైన, క ప్రత్యయము పరమగునప్పుడును నది ద్వివచనపరమగుట తుల్యమే

ఎట్లనగా—'స్వార్థిక ప్రత్యయములు ప్రకృతి కంటె విలక్షణములు గావు' అనుటచే, ప్రకృతి పదముచే స్వార్థికములును గ్రహింపబడును. క ప్రత్యయమును స్వార్థికము. అదియు ప్రకృతియగు ఉభ శబ్దము యొక్క అర్థమునే బోధించును. 'ద్వివచన విషయమగుటవలన' అను చోట ద్వివచన శబ్దమునకు ద్వివచన ప్రత్యయమని యర్థముగాదు. ద్వ్యర్థాభిధాయకమని యర్థము అది యౌగికము. కాగా నదియు ఉభార్థమును చెప్పు నదియేగాన వ్యవధాయకము గాదు.

'ఉభయతః' 'ఉభయత్ర' ఇత్యాదులందు, 'త్రల్' 'తసిల్' ప్రత్యయములు మాత్ర మట్టివి కావు. అవి అవ్యయములగుటచే ద్వ్యర్థాభిధాన సామర్థ్యము వానికిలేదు. కావున. 'ఉభకౌ' అనునట్లు 'ఉభతః' అనునది సాధువు కాదు. కావున ఉభశబ్దమునకు అకజర్థమై పాఠమనావశ్యకము॥

'భవత్' అను తకారాంత శబ్దము సర్వాదులందు పఠింపబడియున్నది. అది హలంతమగుటచే స్మాయాదులకు ప్రసంగములేదు గదా. తత్పాఠమునకందు ప్రయోజనమేమి? అను నాక్షేపమునకు సమాధానము, వా॥ "భవతో కచ్ఛేషాత్త్వాని" – అను వార్తికము. అకచ్, శేషము, అత్వము. 'భవకాన్' అనుచోట, "అవ్యయ సర్వనామ్నామకచ్ ప్రాక్టేః" (5-3-71) అని అకచ్ ప్రత్యయము సిద్ధించుట ఒక ప్రయోజనము.

'సచ, భవాంశ్చ=భవన్తౌ' — అనుచోట, "త్యదాదీని సర్వైర్నిత్యమ్" (1-2-72) అని ఏక శేషము ప్రవర్తించుట రెండవ ప్రయోజనము.

'భవాదృక్' అను రూపమునందు, "ఆసర్వనామ్నః" (6-3-11) అను సూత్రముచే ఆత్వము సిద్ధించుట మూడవ ప్రయోజనము.

ఇది పరిగణనమా? ఉదాహరణ మాత్రమా? అనగా, ఇవియే ప్రయోజనములు. వేరులేవు'- అని తాత్పర్యమా? ఇవియు నింకను నిట్టిదియు, ప్రయోజనములు కావచ్చు ననియా?

ఉదాహరణ మాత్రమే పరిగణనము కాదు 'భవతా హేతునా, భవతః హేతోః' అనుచోట్ల తృతీయా షష్ఠీ విభక్తి ప్రత్యయములు "సర్వనామ్న స్తృతీయాచ" (2-3-27) అను సూత్రముచే ప్రవర్తించుటయు, వింకను నిట్టి ప్రయోజనాంతరములును సంభవించవచ్చును అని తాత్పర్యము.

అవి—'భావత్కాయనః' అనుచోట, భవచ్ఛబ్దమునకు వృద్ధి సంజ్ఞయుండినందున "ఉదీచాం వృద్ధాదగోత్రాత్"—అని ఫిఞ్ ప్రత్యయము, 'భవద్ర్యఙ్' అనుచోట, అద్రి ఆదేశము. 'భవన్మయః' అనుచోట "నిత్యం వృద్ధ శరాదిభ్యః"- అని మయట్ప్రత్యయము మున్నగునవి.

"సర్వాదీని సర్వనామాని"—సమాప్తము

## "విభాషాదిక్సమాసే బహువ్రీహౌ" (1-1-28)

దిగ్వాచకశబ్దముల బహువ్రీహిలో, సర్వాదులకు సర్వనామసంజ్ఞ వికల్పముగా ప్రవర్తించును అని యర్థము. 'ఉత్తరపూర్వస్యై' 'ఉత్తరపూర్వాయై' అని ఉదాహరణము. పూర్వోత్తర దిక్కుల నడుమనున్నవి దిక్కుకొరకు' అని వాని కర్థము.

### తత్తత్పదప్రయోజనాధికరణము.

ఈ సూత్రమున దిక్పదమునకు ప్రయోజనమేమి ? దీనికి దరువాతి సూత్రము "నబహువ్రీహౌ" అనునది. అది బహువ్రీహి సమాసమునందే సర్వాదులకు సర్వనామసంజ్ఞా ప్రతిషేధమును జెప్పునది. ఇందు దిక్పదము లేనియెడల, ఇయ్యది బహువ్రీహి సమాసముననే సర్వనామసంజ్ఞా వికల్పమును బోధించునది యగునుగాన నెచ్చట వికల్పమో, ఎచ్చట ప్రతిషేధమో తెలియకుండును. ఇందు దిక్పదమున్న, దిగుపదిష్టబహువ్రీహిలో వికల్పమనియు, ఇతరత్ర నిషేధమనియు తెలియవగును కాన దోషములేదు. అందులకై దిక్పద మావశ్యకమని యాక్షేప సమాధానము.

"విభాషాదిగ్బహువ్రీహౌ" అని సూత్రమును రచింపవచ్చును గదా మరల నందు 'సమాసే' అను పద మెందులకు ? బహువ్రీహి యననది సమాసమే యగును గదా ! అని యాక్షేపము.

ఒకానొక సమాసము ముఖ్యసమాసమునుగ వచ్చును. అతిదిష్టమగు సమాసమును గావచ్చును. 'దక్షిణపూర్వస్యై' ఇత్యాదికము ముఖ్య బహువ్రీహి సమాసము. "దక్షిణ దక్షిణస్యైదేహి" అను ప్రయోగమున, 'దక్షిణా' అను పదమున్నకు "ఆకాదేత" (8-1-10) అను ద్విరుక్తి ప్రక్రియయందలి సూత్రముచే 'పీడ' అను నర్థమునందు ద్విత్వమును. బహువ్రీహివద్భావమును విధింపబడినవి. కాన నిదియు బహువ్రీహిసమాసమే, బహువ్రీహిత్వమను వ్యాప్యధర్మమతిదేశింపబడినపుడు సమాసత్వమను వ్యాపక ధర్మమును నతిదిష్టమగునుగాన నిదియు బహువ్రీహి సమాసమే యగును. కాని, ముఖ్యసమాసమునందే యీ వికల్పము ప్రవర్తించుట సమ్మతము. "దక్షిణ దక్షిణస్యై" అను బహువ్రీహి సమాసము బహువ్రీహివద్భావాతిదేశముచే బహువ్రీహియగును గాని ముఖ్య బహువ్రీహి కాదు. కావున నట నిత్యసంజ్ఞయే ప్రవర్తించినది.

ఇక 'బహువ్రీహౌ' అను పద మెందులకు ? అని యాక్షేపము.

'దక్షిణోత్తర పూర్వాణామ్' అనుచోట, దిగ్వాచకముల ద్వంద్వమునని వికల్పము ప్రవర్తింపకుండుటకని సమాధానము.

ఇది ప్రయోజనముకాదు. "ద్వంద్వేచ" (1-1-30) అని నిషేధమట వచ్చును. కాదు. ఆ ప్రతిషేధము అవశ్య ప్రాప్తమగుచుండ నీ వికల్పము ఆరంభింపబడినదిగదా? అది 'న బహువ్రీహౌ'—అను నిషేధమును బాధించి నట్లు, 'ద్వంద్వేచ' అను నిషేధమును బాధించెడిని, అనిన, బాధింపదు. 'ద్వంద్వేచ' అను ప్రతిషేధమే యీ వికల్పమును బాధించును. ఏమి కారణ మనిన, చూడుడు.

ఉత్సర్గ శాస్త్రము ప్రాప్తింపని స్థలమున అపవాదమున కవకాశము లేకుండుట చేతగదా అపవాదముత్సర్గమును బాధించుటకు బీజము. 'నబహువ్రీహౌ' అను నిషేధము బహువ్రీహియందెల్ల వ్యాప్తిగలది. తదప్రాప్తియోగ్య స్థలమున విభాషకు చారితార్థ్యములేదు. కనుక నీ వికల్పమే ఆ ప్రతిషేధమునకు బాధకమగును. 'ద్వంద్వేచ' అను ప్రతిషేధము, ద్వంద్వ సమాన స్థలము లందెల్ల వ్యాప్తికలదికాదు. జస్ ప్రత్యయ స్థానమున దానికి ప్రసక్తి లేదు. అచట 'విభాషాజసి' అని వికల్పము విధింపబడుటచేత నిషేధము బాధితము. దిగ్బహువ్రీహి యందంతటను 'నబహువ్రీహౌ' అను నిషేధము ప్రవర్తించినట్లు, దిగ్ద్వంద్వములందెల్ల, 'ద్వంద్వేచ' అను నిషేధము ప్రవర్తింపదు గాన దానికిది బాధకముకాదు.

లేదా—ఇట్లును ఆ సమాధానమునకు బాధకాంతరమును జెప్పనగును. "పురస్తా దపవాదా అనంతరాన్ విధీన్ బాధన్తే నోత్తరాన్" అని న్యాయము. ఉత్సర్గ శాస్త్రములకు ముందుగనే పఠింపబడిన అపవాద శాస్త్రములు, తమ కవ్యవహితోత్తరముగ పఠి పబడిన యుత్సర్గవిధులనే బాధించునుగాని, వ్యవహిత విధులను బాధింపవు ప్రకృతమున, విభాష పురస్తా దపవాదము. తద నంతరవిధి, "న బహువ్రీహౌ" అను ప్రతిషేధము. తదుత్తరోత్సర్గము, ద్వంద్వేచ" అను నిషేధము. కాగా అపవాదయగు విభాషావిధి, 'న బహువ్రీహౌ' అను ప్రతిషేధమునే బాధించునదిగాని 'ద్వంద్వేచ' అను దానిని బాధింపదు.

లేదా, ఈ బహువ్రీహి పద ప్రయోజన వాది నీ మాటనడుగవలె ఒకడు తూర్పుదిక్కును, 'ఇది ఉత్తర దిక్కని తలంచుచున్నాడు అద్భ్రమ, ఆ ఉన్మార్గుని కొరకు దీని నిమ్ము' అని చెప్పదలంచి, "పూర్వోత్తరాయదేహి" అని వేరొకడు ప్రయోగించును. అట పూర్వా ఉత్తరాయస్యాసః' అని విగ్రహము 'అనేకమన్య పదార్థే' అను సూత్రముచే బహువ్రీహి సమాసము. ఇదియు దిగ్వాచక శబ్దములకు వచ్చిన బహువ్రీహియే కావున 'దిగ్బహువ్రీహి' యగుచున్నది- ఇక్కడ వికల్పమేల ప్రవర్తింపలేదు? అని యడిగిన నాతడేమి చెప్పును? 'లక్షణ ప్రతి పదోక్తములలో ప్రతిపదోక్తమునకే గ్రహణము కలుగ వలెను. ఇది ప్రతిపదోక్తముగాదు అని గదా సమాధానము చెప్పవలెను? దిక్సమాస మను వ్యవహారము. 'దిఙ్నామాన్యనంతరాళే (2-2-27) అను సూత్ర

ముచేవిధింపబడిన బహువ్రీహి సమాసమునకే న్యాఖ్యానము. 'దిక్' అను శబ్దమునుచ్చరించి విహితమయిన సమాసమదియే. 'అనేకమన్యపదార్థే' అను సూత్రమున దిక్పదములేదు. అది బహువ్రీహి సమాస సామాన్యవిధాయకము. కావున ప్రతిపదోక్తము కానేరదు అని భావము.

అట్లైన నీ సూత్రమున బహువ్రీహి గ్రహణ మనావశ్యకమే. అదిలేనిచో ద్వంద్వమున నేల వికల్పము ప్రసక్తముగాదు? 'లాక్షణిక ప్రతిపదోక్తమునకే గ్రహణము న్యాఖ్యమని చెప్పబడినది గాన ద్వంద్వమునందు వికల్ప ప్రసక్తి లేదు. దిక్సమాసమనిన, "దిజ్నామాన్యంతరాళే" (2-2-26) అను సూత్రముచే దిక్శబ్దముచ్చరించి విధింపబడినదియేయగును. అదియే ప్రతిదోక్తము. ద్వంద్వ మట్టిదకాదు గదా. కాగా బహువ్రీహి పదమిందనావశ్యకమని తేలినది.

పోనిండు. ఉత్తర సూత్రమున ననువర్తించుట కది సార్థకమనిన, ఆ సూత్రమున "బహువ్రీహౌ" అను పదముకలదుగదా.

కలదు. ఇంకొక బహువ్రీహి పదమును గావలెను. అపుడు 'బహువ్రీహి యగు బహువ్రీహి యందు అనగా ముఖ్య బహువ్రీహి యందే సర్వనామ సంజ్ఞా నిషేధమని సిద్ధించును. దానికి ఫలము, "ఏకైకస్మై దేహి" అనుచోట, నిషేధము ప్రవర్తింప కుండుట. అది బహువ్రీహివద్భావముచే బహువ్రీహి అయినది.

ఇదియు ప్రయోజనముకాదు. 'సమాసే' అనుపద మందను వర్తించును. అది 'బహువ్రీహౌ' అను పదమునకు విశేషణమై సమాసమైన బహువ్రీహి యందని యర్థము నిచ్చును. కాగా, ముఖ్యమును, ఔపదేశికమునునగు బహువ్రీహి సమాసమునందే ప్రతిషేధము ప్రవర్తించును గాని అతిదిష్ట బహువ్రీహి యందు ప్రవర్తింపదు అని ఫలితమగును.

అట్లైన నిది ప్రయోజనమగును. ఏది? అవయవమైన బహువ్రీహికి గూడ సముదాయ బహువ్రీహివలె సంజ్ఞ సిద్ధించుట. ఎట్లనగా,

వస్త్రం అంతరం యేషాం తే=వస్త్రాంతరాః ।

వసనం=గృహం అనంతరం యేషాం తే వసనాంతరాః ।

వస్త్రాంతరాశ్చ వసనాంతరాశ్చ = వస్త్రానంతర వసనానంతరాః ॥

ఇందు మొదటివి రెండును బహువ్రీహులు. మూడవది ద్వంద్వము. వర్తి పదార్థము సమూహమున కవయవమగుటచే అప్రధానము. ప్రధానాప్రధాన న్యాయముచే అవయవమయిన అంతర శబ్దమునకు సర్వనామ సంజ్ఞా ప్రతిషేధము సిద్ధింపక పోవును. అపుడు 'వస్త్రాంతరే' 'వసనాంతరే' అని కావలసి

వచ్చెడిది. అందులకై బహువ్రీహి గ్రహణ మని భావము. ఉపసర్జన ప్రతిషేధముచే వార్తిక మతమున నీ ప్రయోజనము సిద్ధించినను, సూత్రమతమున సిద్ధింపదు.

"విభాషాదిక్సమాసే బహువ్రీహౌ" సమాప్తము.

## "న బహువ్రీహౌ" (1-1-28)

## సూత్ర ప్రయోజనాధికరణము

ఉదాహరణమేమి ?

'ప్రియవిశ్వాయ' అనునది. 'ప్రియమయిన విశ్వముకలవాని కొరకు'-అని ఆపదమున కర్థము.

ఇది ప్రయోజనము కాజాలదు. ఆరూపమే దుర్లభము. 'విశ్వప్రియాయ అనియే రూపమగును. సర్వాద్యనంతమగు బహువ్రీహికి ప్రతిషేధము ప్రవర్తించును. ఇది నసర్వానంతమేకాదు. వార్తికకర్త "బహువ్రీహౌ సర్వనామ సంఖ్యయోరుపసంఖ్యానమ్" అని, పూర్వ నిపాత ప్రకరణమున జెప్పెను. అందువలన 'విశ్వప్రియాయ' అనియే రూపము. కాగానిది సర్వాద్యనంత బహువ్రీహియేకాదు.

అట్లైన, 'ద్వ్యన్యాయ' 'త్ర్యన్యాయ' అను నివి ప్రయోజనములు. ద్వావన్యోయస్య, త్రయః అన్యేయస్య, అని విగ్రహములు. అనిన, ఇవియు నుదాహరణములుగావు. ఇట గూడ అన్యశబ్దమునకే పూర్వ నిపాతమురావలెను. 'సర్వనామ సంఖ్యయో రుపసంఖ్యానమ్' అను వార్తికమునకు, ఆ రెండును నొకరూపమున కూడినపుడు, ఆ బహువ్రీహిసమాసమున సర్వనామమునకే పూర్వనిపాతమగునని యర్థము. దానికది యర్థముకానిచో, సంఖ్యకు పూర్వ నిపాతమును బోధించుట కావార్తిక మక్కరయేలేదు. సంఖ్య సంఖ్యేయ పరతంత్రమగుటచే విశేషణమే యగునుగాన, "సప్తమీ విశేషణే బహువ్రీహౌ" 2-2-35 అని దానికి పూర్వనిపాతము సిద్ధమేగదా !

అది దోషముకాదు. అవి యుదాహరణములు గావచ్చును. ఆ వార్తికమున కది యర్థముకాదు. సంఖ్యాసర్వనామముల బహువ్రీహిలో, శబ్దపర విప్రతిషేధమువలన సంఖ్యకే పూర్వనిపాతము వచ్చునని యర్థము. కావున నవి యుదాహరణములే.

ప్రియవిశ్వాయ అనునదియు నుదాహరణమే.

'విశ్వప్రియాయ' అనియే కావలెనంటిరిగదా ? "వాప్రియస్య" అను వార్తికముచేత నచట, ప్రియశబ్దమునకు పూర్వనిపాతము వికల్పముగా

వచ్చును. అని ముందు చెప్పబడును. కావున 'ప్రియవిశ్వాయ' అనియు రూప ముండును.

మరియు, సర్వాద్యంతమగు బహువ్రీహికే సర్వనామసంజ్ఞా ప్రతిషేధము ప్రవర్తింపవలెననిలేదు. సర్వాది అంతమునలేని బహువ్రీహికిని నిషేధ మావశ్యకమే

ఎందులకు ? అట్టిచో సర్వనామకార్యమేమి ప్రాప్తించును ? అకచ్ ప్రత్యయము ప్రాప్తము. అది రాకూడదు,

అకచ్ప్రత్యయము వచ్చిన నేమగును ?

కప్రత్యయము రాదగినది రాకుండును.

కప్రత్యయమునకును అకచ్ప్రత్యయమునకు భేదమేమి ? హలంత శబ్దములందు వానికి భేదమగపడును. చూడుడు. అహకం, పితాయస్యసః = మకత్పితృకః ॥ త్వకం పితాయస్యసః = త్వకత్పితృకః॥ అని ప్రాప్తించుచున్నది. మత్కపితృకః త్వత్కపితృకః అను రూపములు ఇష్టములు.

సరి కానిమ్ము. కాని సర్వనామసంజ్ఞానిమిత్తకమగు 'అకచ్' ప్రత్యయ మంతరంగముగదా! అది ముందు ప్రవర్తింపవలె. తరువాత వర్తిపదార్థము విశేషణముగాగల అన్య పదార్థ వివక్షయందు ప్రవర్తించు బహువ్రీహి బహిరంగము. తన్నిమిత్తకమగు ప్రతిషేధము. అంతరంగమును, నీవు కోరినను నెట్లు బాధింపగలదు ?

'గోమత్ప్రియః' అను స్థలమునందువలె, అంతరంగములగు విధులను గూడ బహిరంగము బాధించును. అట, లుక్కుచేత, హల్ఙ్యాది లోపమనంత మయినను బాధింపబడుటవలననే నుమాగమమును, దీర్ఘమును ప్రవర్తింపలేదు గదా ! అనిన,

బహిరంగమయినను సమాసాశ్రయమగు లుక్కు అంతరంగమగు లోపమును బాధించుటకు, "ప్రత్యయోత్తరపదయోశ్చ"(7-2-98) అను యత్నము చేయబడినది. ప్రత్యయము పరమగునపుడు ఉత్తర పదము పరమగునపుడును నేకార్థములగు యుష్మదస్మచ్ఛబ్దములందు మపర్యంతమునకు త్వమాదేశము లా సూత్రముచే విధింపబడినవి. లోపము అంతరంగమగుటవలన ముందే ప్రవర్తించిన ప్రత్యయపరత్వమే సంభవింపదుగావన నది వ్యర్థమగును. కావున నంతరంగమగు లోపము బహిరంగము అను లుక్కు బాధించునని పాణిని తాత్పర్యము. అయ్యది లుక్తరూపవిశేషధర్మాపేక్షమగు జ్ఞాపకమేయగును.

అట్టి యత్నమిచటను, "నబహువ్రీహౌ" (1-1-28) అను సర్వనామ సంజ్ఞానిషేధరూపము చేయబడియున్నదిగాదా ! "బహువ్రీహౌ" అనునది

సప్తమ్యనంతము. బహువ్రీహి సమాస ఘటములగు సర్వాదులకు సర్వనామ సంజ్ఞ ప్రతిషేధింపబడినది. అకచ్ప్రత్యయమంతరంగమగుట వలన ముందే ప్రవర్తించియుండిన, నిషేధము నిష్ప్రయోజనమగునుగాన వైయధికరణ్యాన్వయ సామర్థ్యమువలన నంతరంగమగు నకచ్ప్రత్యయము నివర్తించునని చెప్ప వచ్చును.

ఈ 'న బహువ్రీహౌ' అను సర్వనామసంజ్ఞానిషేధవచనమునకు వేరొక ప్రయోజనము కలదు. ఇట సప్తమి ప్రథమార్థకము కాగా బహువ్రీహి సర్వనామ సంజ్ఞకము కాదు, అని సమానాధికరణాన్వయమే వివక్షితము. ప్రియవిశ్వాయ ఉదాహరణము. సంజ్ఞానిషేధమునకు ప్రయోజనము స్మై ఆదేశము లేకుండుట సంజ్ఞాకార్యకాల మగుట వలన విధికిని, ప్రతిషేధమునకు నట సమానకాల ప్రాప్తియేగలదు. అనిన, అట్లైన నీ నిషేధముతో బని లేదు. మహాసంజ్ఞాకరణమువలన నుపసర్జనములకు సంజ్ఞా ప్రతిషేధము చేయబడినది గదా. దానివలననే ప్రియవిశ్వాయ అనుచో సంజ్ఞానిషేధము సిద్ధించును.

అందువలన, బహువ్రీహి చికీర్షితమగునపుడు, అలౌకిక ప్రక్రియా వాక్యమున సర్వనామ సంజ్ఞా ప్రతిషేధము కొరకీ సూత్రము. అలౌకిక ప్రక్రియా వాక్యమునకు 'బహువ్రీహి' అను వ్యవహార మెట్లనిన, తాదర్థ్యము వలన తాచ్ఛబ్ద్యమును బొందిన పదములునుగలవు గదా. ఏకార్థీ భావము. ఏక స్వర్యము; ఏక విభక్తిత్వమును గల బహువ్రీహి సమాసము ప్రాథమ కల్పిక బహువ్రీహి అలౌకిక ప్రక్రియా వాక్యము తదర్థము గాన నదియు బహువ్రీహియే, ఈ సూత్రమున నా బహువ్రీహి గ్రహింపబడును. అని కొందరి తాత్పర్యము.

కాని, గోనర్దీయుడు, అకచ్ప్రత్యయమును, సర్వమును, నిస్సంశయముగ నవయవభూతములగు సర్వాదులందును ప్రవర్తింపజేయ వలసినదియే, 'త్వకత్పితృకః' 'మకత్పితృకః' అనియే, కాదగియున్నది* అని చెప్పి

"అకచ్ స్వరౌ తు కర్తవ్యౌ ప్రత్యఙ్గం ముక్త సంశయమ్

త్వకత్పితృకో మకత్పితృక ఇత్యేవ భవితవ్యమితి"

ఈ సూత్రము నాతడు ప్రత్యాఖ్యానము చేయుచున్నాడు. గోనర్దమని యొక తము గోవులా పర్వతమున నెపుడును నరచుచుండును గాన దాని కాపేరు గలిగినది. అది గల దేశమునకును గోనర్దదేశమని వ్యవహారము, ఆ దేశమున నుద్భవించుటచే భాష్యకారునకు గోనర్దీయుడను వ్యవహారము.

న్యూనతా పరిహారార్థమిట. ఆక్షేప తత్పరిహార రూపవార్తిక ద్వయము ఫలితము.

వా॥ "ప్రతిషేధే భూతపూర్వస్యోప సంఖ్యానమ్"—సర్వనామ సంజ్ఞా ప్రతిషేధ ప్రసంగమున, బహువ్రీహి కాని, 'అధ్యపూర్వా' అను కర్మధారయమునకు సంజ్ఞా ప్రతిషేధము కర్తవ్యమని వార్తికార్థము. వార్తికము నందలి 'భూతపూర్వస్య' అను పదమునకు భూతపూర్వార్థకమగు పూర్వ శబ్దమంతముగ గల సమాసమునకు అని యర్థము. 'అధ్య పూర్వాయ దేహి' అని యుదాహరణము. 'పూర్వాశ్చాసా ఆధ్యశ్చ=అధ్యపూర్వః' అని మయూర వ్యంసకాది సమాసము. సంజ్ఞా ప్రతిషేధ ఫలము స్మాయా దేశాభావము.

ఈ యాక్షేపమునకు సమాధాన వార్తికము—

వా॥ 'ప్రతిషేధే భూత పూర్వస్యోప సంఖ్యానానర్థక్యం, పూర్వాదీనాం వ్యవస్థాయామితి వచనాత్" అనునది. ప్రతిషేధము 'భూతపూర్వస్య' శబ్దమున నుపసంఖ్యాతవ్యము గాదు. పూర్వాదులు వ్యవస్థానాదులయిననే సర్వనామ సంజ్ఞాముగుగునని చెప్పబడియున్నది. ఇట వ్యవస్థ గమ్యముకాలేదు. నియతమగు, 'దీనికంటె బూర్వము'—అను నాకాంక్ష వ్యవస్థ, అది యచటలేదుగదా! 'ప్రయోగ కాలముకంటె బూర్వమున' 'అద్యుడు'—అని వ్యవస్థ నుపపాదించినను, పూర్వ శబ్దార్థము విశేషణమగుటచే నది ప్రధానముగాదు కావున నుపసర్జన ప్రతిషేధముచే గతార్థమగును.

"నబహువ్రీహౌ" సమాప్తము.

## "తృతీయాసమాసే" (1-1-29)

### ఇష్టానుపపత్తి నిరాకరణము.

'తృతీయా సమాసమునందును, తదర్థమగు లౌకిక విగ్రహ వాక్యము నందును, సంజ్ఞ లేదు' అని యర్థము. 'మాసపూర్వాయదేహి' - 'మాసేన పూర్వాయదేహి' - అని క్రమముగ నుదాహరణములు

ఈ సూత్రములోనికి 'విభాషాదిక్సమాసే బహువ్రీహౌ' అను పూర్వ సూత్రము నుండి 'సమాసే' అను పదమనువర్తించుచుండ మరల నిందు 'సమాసే' అను పద మెందులకని ఆక్షేపము.

ఏక పద్యము, ఏకస్వర్యము, ఏక విభక్తిత్వమునుగల ప్రాథమ కల్పిక తృతీయా సమాస మొకటియు, తదర్థమగుటవలన తచ్ఛబ్ద వ్యవహారముగల సమాసార్థమగు ప్రయోగార్హ లౌకిక విగ్రహ వాక్యరూప తృతీయా సమాసము గలవు. ఇట నీ రెండవ కల్పపు తృతీయా సమాసమును గ్రహించుటకై సమాసే అనుపదము. వాక్యభేదముచే ప్రాథమ కల్పికము నందును నిషేధము ప్రవర్తించును.

లేదా సమాస పదగ్రహణమున కీ ప్రయోజనమును చెప్పనగును. ఇయ్యది యోగాంగముగా నేర్పడవలెనని పాణిని తాత్పర్యము. యోగాంగ మనగా, పృథగ్యోగ రూపమగు అష్టాధ్యాయ్యంగము గావలెనని యాశయము. అపుడు, 'తృతీయా' అని యొక సూత్రమును 'అసమాసే' అని వేరొక సూత్రమును జేయనగును పడును.

'తృతీయా సమాసమునందు సర్వాదులు సర్వనామ సంజ్ఞకములుకావు' అని మొదటి సూత్రమున కర్థము 'మాసపూర్వాయదేహి' 'సంవత్సర పూర్వాయ దేహి' అని యుదాహరణములు. మొదటి సూత్రమున, తృతీయా అనునది సంబంధ సామాన్యార్థక లుప్తషష్ఠ్యంతము, రెండవ సూత్రమున నను వర్తించిన 'తృతీ'యా అనునది పంచమ్యర్థకము.

'అసమాసే' అను రెండవ సూత్రమునకు, అసమాసమునందు గూడ అనగా లౌకిక ప్రక్రియా వాక్యమునందును తృతీయాంతము కంటె బరము లయిన సర్వాదులు సర్వనామ సంజ్ఞకలని కావు అని యర్థము. మాసేన, సంవత్సరేణ పూర్వాయదేహి అని యుదాహరణములు.

అసమాసమనగా, పర్యుదాసముచే, సమాస భిన్నము ను, ప్రయోగార్హత్వముచే సమాస సమానమును నగు లౌకిక విగ్రహ వాక్యము. తృతీయా సమాస మనగా ప్రతిపదోక్తమగు, 'పూర్వసదృశేత్యాది' (2-1-31) సూత్ర విహితమే గ్రాహ్యము॥

"తృతీయాసమాసే" అను సూత్రము ముగిసినది.

## "విభాషాజసి" (1-1-32)

### అనిష్టాపత్తి నిరాకరణము॥

ఇట, 'జసః ఇః = జసిః' అని విగ్రహము ఉత్పన్నమగును. 'జస్ స్థానిక మగు 'ఇ' అనగా 'జసశ్శీ' (7-1-17) అని విధింపబడిన శీ కారము. 'అది కర్తవ్య మయినపుడే ద్వంద్వమున సర్వనామత వికల్పము' అని యర్థము. కావున అకజ్విషయమున, "ద్వంద్వేచ" (1-1-30) అను నిషేధమే ప్రవర్తించును॥

"విభాషాజసి"—సమాప్తము.

## పూర్వపరావరదక్షిణోత్తరాపరాధరాణి

## వ్యవస్థాయా మసంజ్ఞాయామ్"

### "గణపాఠసూత్రపాఠముల కాలనిర్ణయము"

వా॥ "అవరాదీనాంచపునః సూత్రపాఠే, గ్రహణానర్థక్యమ్ గణేపఠితత్వాత్" అని యాక్షేపవార్తికము.

పూర్వ, పర, అవర, దక్షిణ, ఉత్తర, అపర, అధర, స్వ, అంతర- ఈ శబ్దములును, సర్వాదిగణమునందు పఠింపబడియున్నవి. అష్టాధ్యాయీ సూత్ర పాఠమందును నివి సమానానుపూర్వీకములుగ బఠితములు. ప్రకృత సూత్ర మును, ఉత్తర సూత్రద్వయమును, జస్సుస్థానమున విధింపబడిన 'శీ' ఆదేశ విషయమున సర్వనామసంజ్ఞ వికల్పముగా' ప్రవర్తించునని బోధించుచున్నవి.

గణపాఠమున గల యీ మూడు సూత్రములును, దత్తదర్థ విశేషము లందు నిత్య సర్వనామ సంజ్ఞ కొరకు పఠితములై యున్నవిగదా; సూత్రపాఠ మున వీనికి పునఃపాఠ మెందులకు ? అని ప్రశ్న. అనగా, 'పూర్వాదీనిచ' అని యొకే సూత్రమును సూత్రపాఠమున పఠింపవచ్చును. పూర్వాదులన, గణ పఠితములేయని గ్రహింపబడును. అపుడు 'నిత్యసంజ్ఞ ప్రాప్తించుచుండ జస్విష యమున ఈ సూత్రము వికల్పమును విధించునుగాన నిది ప్రాప్తభాష యగును' అని భావము.

వార్తికమున అవరాదులనుచో నాదిపదము ప్రకారవాచకము. 'అవర వంటి శబ్దములకు' అని యర్థము. కాగా, 'పూర్వ', 'పర' - అనునవియు గ్రహింపబడును. అవరాదీనామనగా, 'పూర్వాదీనాం = 'పూర్వ'మున్నగువానికి' అనియే యర్థము.

ఇట నొక ప్రశ్న— గణపాఠము పూర్వమనియు, సూత్రపాఠము పునః పాఠమనియు నెట్లు తెలియును ? ఆదిశబ్దము ప్రకారవాచియు కలదు. వ్యవస్థా వాచియు ఉన్నది. సర్వాదీని అనుచో ఆది శబ్దము ప్రకారార్థకమును గావచ్చు నను నాశయముతో, బిమ్మట అభియుక్తులు గణపాఠమును జేసిరనవచ్చును. గణపాఠము నిదర్శనార్థమనుటకు ప్రమాణము, వేదమునందు "మధ్యమస్యామ్" "అవమస్యామ్" అను ప్రయోగము లగపడుట. ప్రకారమనగా సాదృశ్యము. సర్వనామ కార్యవత్త్వమే సాదృశ్యము. కావున గణపాఠ సూత్రపాఠ పౌర్వా పర్య నిర్ణయమెట్లు ?

సమాధానము— అవి పూర్వాదులు గదా. ఇవి అవరాదులు. అనగా అవి = తాని = గణపఠితాని = గణపఠితములు. పూర్వాదులు = పూర్వాదీని = పూర్వ కాలాశ్రయములు. ఇవి = ఇమాని = అష్టాధ్యాయీ సూత్రపఠితములు. అవరా దీని = అవరకాలాశ్రయములు. ఆదిశబ్దమునకు ఆశ్రయమర్థము. "భీష్మాదిశ్చ సుయోధనః" అనుచోట భీష్మాశ్రయః అనిగదా యర్థము. 'సర్వాదీని సర్వనామాని' అను సూత్రమునందు సర్వాదీని అనుచో నాదిపదము వ్యవస్థా వాచియేగాని ప్రకారవాచి గాదు. అట్లైన కృత్స్నాదిశబ్దములకును సంజ్ఞ ప్రాప్తించును. మధ్యమస్యామిత్యాదులు ఛాందసములు.

అందువలన గణపాఠము పూర్వము, సూత్రపాఠము తరువాతిది అని తెలియవచ్చును.

అష్టాధ్యాయీ పఠితములును పూర్వ కాలాశ్రయములేయని పల యన రాదు. గణపఠితములు పూర్వకాలాశ్రయములనుటకు ప్రమాణము లేదుగదా? అనిన,

ప్రమాణము కలదు. ఆచార్య ప్రవృత్తియే ప్రమాణము. పాణిన్యాచార్యుడు, "పూర్వాదిభ్యోనవభ్యోవా" (7-1-6) అని యొక సూత్రముచే పూర్వమున్నగు శబ్దములు తొమ్మిదింటికి బరమైన ఙసి, ఙి అను ప్రత్యయములకు 'స్మాత్' స్మిన్ అను నాదేశములను విధించియుండెను. ఆ సూత్రమున "నవభ్యః" అనుట యెందులకు? అని విచారింపవలెను. అష్టాధ్యాయీ సూత్ర పఠితములగు పూర్వాదులు తొమ్మిదియేగదా? మరల నవగ్రహణము వ్యర్థము. అట్లు వ్యర్థమయిన నవగ్రహణము గణపాఠము పూర్వమనియు, సూత్రపాఠము పరమనియు జ్ఞాపకము చేయును. అపుడు గణపాఠమున, పూర్వాదులు తొమ్మిదింటికి పైన, 'త్యద్' 'తద్' మున్నగునవిగూడ బఠింపబడుటచే వానిని వ్యావర్తింప జేయుటకు నవపదము సార్థకమగునని యాతని యాశయము.

అవుడు, పూర్వాదుల పునఃపాఠమునకు, ప్రతినియత తత్తద్విశేషణాభిధానము ప్రయోజనము. 'పూర్వాదీనినవ' అనినచో, పూర్వాది సప్తకమునకే 'వ్యవస్థాయామ్' 'అసంజ్ఞాయామ్' అనునవి విశేషణములు. 'అజ్ఞాతిధనాఖ్యాయామనునది స్వశబ్ద మాత్రమునకే విశేషణము, 'బహిర్యోగోపసంవ్యానయోః' అనునది అంతర శబ్దవిశేషణమేయని తెలియుట ఎట్లు? అందులకై పూర్వాదుల పునఃపాఠము.

అదియు, ప్రయోజనము కాదు. అర్థనిర్దేశ విశిష్టములుగనే అవి గణమున బఠింపబడినవి.

అట్లైన నియ్యది ప్రయోజనము కానోవును. "కిం సర్వనామబహుభ్యోఽద్వ్యాదిభ్యః" (5-3-2) అను సూత్రము 'పంచమ్యాస్తసిల్' (5-3-7) ఇత్యాది సూత్రములచే విహితములయిన తసిలాదులు. కింశబ్దముకంటెను, ద్విమున్నగు వానికంటె భిన్నములయిన సర్వనామములకంటెను,బహుశబ్దములకంటెనువచ్చునని చెప్పుచున్నది. అందు "అద్వ్యాదిభ్యః" అనునది పర్యుదాసము. సర్వనామ గణమున, గొందరు ముందు 'త్యద్' 'తద్' మున్నగువానిని బఠించి, తరువాత పూర్వాదులను బఠించిరి. అపుడు ఈ పూర్వాదులు ద్వ్యాదులలో చేరినందున పర్యుదస్తములు కావలసివచ్చును. వానికి తసిలాదులు సిద్ధింపకపోవును. కావున, అష్టాధ్యాయీ పాఠముచే వానికి మరల సర్వనామ సంజ్ఞ విధింపబడుచున్నది. అది ద్వ్యాది పర్యుదాసము వానికి లేకుండుటకనుట. వానిని, 'విభాషాజసి' అను సూత్రమునమువర్తింపజేసిన వాక్యభేదములచే జస్సునందు వికల్ప సంజ్ఞా విధానమును గుదురును.

కాని ఇదియు ప్రయోజనము గాదు. ఈ పూర్వాదులకు అద్వ్యాదిభ్యః అను పర్యుదాసముచే, పర్యుదాసము లేదని ఆచార్య ప్రవృత్తి జ్ఞాపన చేయును.

ఆచార్య ప్రవృత్తి యనగా, ఆచార్యుల ప్రయోగములు. 'పూర్వత్రా సిద్ధమ్' (8-2-1) అను సూత్రమున పాణిన్యాచార్యుడు 'పూర్వత్ర' అను పదమును నిర్దేశించెను. అది 'సప్తమ్యాస్త్రల్' — అని విధింపబడిన త్రల్ప్రత్యయాంతము. ఆపర్యుదాసము ప్రవర్తించిన, 'పూర్వత్ర' అను రూపమేర్పడదు.

ఇట్లే "ఢోఢేలోపః" 8-3-13 అను సూత్రములో వార్తికకారుడు, **"జశ్భావాదితిచేదుత్తరత్రాభావాదపవాదప్రసఙ్గః"** అను వార్తికమును బఠించియున్నాడు. అందు, 'ఉత్తరత్ర' అని త్రలంతమగు నుత్తర శబ్దము నిర్దేశింపబడినది. ద్వ్యాదిపర్యుదాసము పూర్వాదులకు ప్రవర్తించిన నదియు గుదురదుగదా ?

కాగా నీ సూత్ర వార్తిక ప్రయోగములచే, సర్వాదిగణములో, పూర్వాదులకు, త్యదాదులకు ముందే పాఠముగాని అనంతరముగాదని బోధింపబడుచున్నది. అట్లైన జస్ ప్రత్యయ విషయమున సర్వనామ సంజ్ఞావిభాషను చెప్పుచున్నాను. అది ప్రయోజనము మరల ప్రతిపద పాఠమున కగును.

'పూర్వాదీనినవ' అనియే సూత్రమును రచించి 'విభాషాజసి' అని విభాషను విధించిన, అది వ్యవస్థా అసంజ్ఞలకంటె భిన్నములయిన యర్థములందు వానికి ప్రాప్తింపని సర్వనామ సంజ్ఞకు వికల్పమగును. అపుడిది అప్రాప్తి విభాష యగును. గణపాఠముననున్న యర్థనిర్దేశము నిత్య సర్వనామ సంజ్ఞా విధానమున ఉపయుక్తమై ఉపక్షీణమగుటచే పాఠవిశేషణము కాజాలదు మరల పాఠము జేసిన, ఆ యర్థములందే, విభాషావిధానమగునుగాన ప్రాప్తవిభాష యగును.

పూర్వాది సప్తకముననే వ్యవస్థా సంబంధము జ్ఞాతిధనరూపార్థ సంబంధము స్వశబ్దముననే; బహిర్యోగోప సంవ్యానముల కంతర శబ్దముతోడనే సంబంధము— అని యిట్లు సంకర విరహిత తత్త్వసంబంధ ప్రతిపత్తి, 'వ్యవస్థా, అసంజ్ఞా, అజ్ఞాతి ధనాఖ్యా బహిర్యోగోపసంవ్యానేషు'— అని అర్థమాత్ర నిర్దేశముచే సిద్ధింపదు. అందువలన ప్రతిపద పాఠమును కర్తవ్యమే అని గ్రంథ కర్త యాశయము.

**"పూర్వపరావర దక్షిణోత్తరాపరాధరాణి వ్యవస్థాయామసంజ్ఞాయామ్"** అను సూత్రవిచారము సమాప్తము.

## "స్వమజ్ఞాతి ధనాఖ్యాయామ్" (1-1-34)

'జ్ఞాతి, ధనములకు వాచకముగాని స్వశబ్దమునకు గణపాఠము వలన నంతటను బ్రాప్తించు సర్వనామ సంజ్ఞ జస్విషయమున వికల్పము' అని సూత్రార్థము.

ఆత్మ, ఆత్మీయ, జ్ఞాతిధనములు స్వశబ్దమున కర్థములు. 'స్వామీ' అను ఆమిని్ప్రత్యయాంతమునందలి స్వశబ్దమైశ్వర్యవాచి. ఈ స్వశబ్దము, ఆత్మార్థమునను, జ్ఞాత్యర్థమునను పుంలింగము.

దీని కుదాహరణము - 'స్వే, స్వాః' అనునది. 'ఆత్మలు లేదా ఆత్మీయులు' అని యర్థము. ప్రత్యుదాహరణము,'స్వాః' అనునది. 'జ్ఞాతులు లేదా ధనములు' - అని యర్థము. సర్వనామ సంజ్ఞ లేనందున నొక రూపమే.

ఈ సూత్రమున నాఖ్యాగ్రహణ మెందులకు? 'స్వమజ్ఞాతిధనయోః' అనియే యేల సూత్రము రచింపలేదు అని ప్రశ్న.

జ్ఞాతి ధనపర్యాయవాచియగు స్వశబ్దమునకే సర్వనామ సంజ్ఞా ప్రతిషేధము ప్రవర్తింపవలెననియు, 'స్వేపుత్రాః', 'స్వాపుత్రాః', 'స్వేగావః' 'స్వాః గావః' అనుచో నిషేధము ప్రవర్తింపరాదనియు దలంచి ఆఖ్యాగ్రహణము చేయబడినది కాని 'స్వేపుత్రాః,' 'స్వేగావః' అనుచోట స్వశబ్దము విశేషణముగ ఆత్మీయత్వమునే చెప్పుచున్నది గాని జ్ఞాతిత్వధనత్వములను గాదు. పుత్ర శబ్దమువలన జ్ఞాతులుగా పుత్రుల ప్రతీతియు గోశబ్దమువలన ధనములుగా, గోవుల ప్రతీతియు కలుగుచున్నది. కావున అచట ఆఖ్యాపదము లేకుండగ, అజ్ఞాతిధనయోః అనినను ప్రతిషేధము ప్రవర్తించునను శంకలేదు గాన ఆఖ్యాపదము అనావశ్యకమని యాక్షేప్త తాత్పర్యము.

ఆఖ్యాపదము లేనియెడల 'స్వేపుత్రాః' ఇత్యాదులందు ప్రతిషేధము తప్పదు. ఆత్మీయత్వమను ప్రవృత్తి నిమిత్తమును బట్టి స్వశబ్దము జ్ఞాతి ధనముల నచట బోధించుచున్నది. కనుకనే, 'పుత్రాః' 'గావః' - అని పుత్రాది సామానాధికరణ్యముపపన్నము.

ఆఖ్యాపదమున్నపుడా దోషము ప్రసక్తము గాదు. స్వశబ్దము 'జ్ఞాతులనుగా పుత్రాదులను బోధించినపుడే సంజ్ఞా ప్రతిషేధము ప్రవర్తించును. ఆత్మీయులనుగా బోధించినపుడు ప్రవర్తింపదు' అను విశేషము లభించుటకే ఆఖ్యా గ్రహణము చేయబడినది. అది లేకున్నయెడల,'ఆత్మీయత్వ రూపముతో పుత్రులను ధనములను స్వశబ్దము బోధించినపుడును నిషేధము ప్రవర్తింపవలసి వచ్చెడిని' అని సమాధానమునకు తాత్పర్యము.

**స్వమజ్ఞాతి ధనాఖ్యాయామ్** - అను సూత్రముయొక్క విచారము సమాప్తము.

# "అంతరం బహిర్యోగోపసంవ్యానయోః" (1-1-36)

'బహిర్యోగము గలది' అనగా 'బాహ్యమైనది'- అను నర్థమునను, 'పరిధానీయము'=అనగా 'కట్టుకొనదగినది'-అను నర్థమునను, 'అంతరశబ్దమునకు గణపాఠమువలన ప్రాప్తమగు సర్వనామ సంజ్ఞ జస్విషయమున వికల్పముగ ప్రవర్తించును' అని సూత్రమున కర్థము.

'అంతరే అంతరాః'— అని యుదాహరణము. 'బాహ్యములైన గృహములు' అని అర్థము.

'అంతరే అంతరాః' పరిధానీయములయిన శాటకములని అర్థము. సూత్రమునందు, 'బహిర్యోగోపసంవ్యానయోః' అని గలదు. బహిః=అనావృత దేశః= బయలు అనియు, 'బయలులో నున్నది' అనియు బహిశ్శబ్దమున కర్థము. ఆ బహిః పదార్థముతో యోగము కలది=బహిర్యోగము. ఆ యర్థమున సర్వనామ సంజ్ఞా వికల్పము.

అనావృత ప్రదేశముతో సంబంధము గలది యనిన బందున్నది అగును. అనగా 'బాహ్యము' అని యర్థము.

'బహిః' అను పదముయొక్క రెండవ యర్థమగు 'అనావృత దేశమున నున్నది' అను నర్థమును గ్రహించినపుడు, అనావృత దేశమున నున్నదానితో సంబంధము గలది 'లోపలిది' అని యర్థమగును.

అందు ప్రథమార్థమున, 'అంతరే అంతరావా గృహాః' అనిన, 'నగర బాహ్యములయిన చండాలాదుల ఇండ్లు' అని అర్థము.

రెండవ అర్థమును వివక్షించిన, నగరాభ్యంతర గృహము లర్థము.

ఇట్లే ఉపసంవ్యాన శబ్దముగూడ నానార్థకము. 'ఉపసంవీయతే అదః' అను కర్మవ్యుత్పత్తిలో ఉపసంవ్యానమనగా అంతరీయము=కట్టుకొనిన బట్ట. 'ఉపసంవీయతే అనేన' అను కరణ వ్యుత్పత్తిలో ఉత్తరీయము=పై బట్ట అని యర్థము. "అంతరే అంతరా వా శాటకాః"=పరిధానీయములగు వస్త్రములు.

॥ఉపసంవ్యాన గ్రహణ ప్రయోజన విచారము॥

వా॥ "ఉపసంవ్యాన గ్రహణమనర్థకం బహిర్యోగేణ **కృతత్వాత్**" అని ఆక్షేపవార్తికము.

'అంతరం బహిర్యోగే' అని సూత్రమును రచించినజాలును. అంతమాత్రముననే గతార్థమగునుగాన ఉపసంవ్యానపదము సూత్రమునందనావశ్యకము. ఉపసంవ్యానము గూడ, కర్మవ్యుత్పత్తిలో బాహ్య యోగము గలది= అంతరము=అంతరీయము అని యర్థమగును కరణవ్యుత్పత్తిలో, బహిర్యోగము

గలది=బాహ్యము అను నర్థము కలది యగును. కావున 'బహిర్యోగే' అను పదముచేతనే గతార్థమగును. 'ఉపసంవ్యానపద మనావశ్యకము'- అని ఆక్షేప్తృ తాత్పర్యము.

**వా॥ "నవా శాటక యుగాద్యర్థమ్"** అని సమాధానవార్తికము.

ఉపసంవ్యాన గ్రహణ మనర్థకము గాదు. శాటక యుగాదులకై అది ఆవశ్యకము. సమానమైన కొలతలు గల రెండు బట్టలు, శరీరమున ధరింప బడనివి యున్నపుడు వానిలో నేది యుత్తరీయమో ఏది అంతరీయమో తెలిసికొనుట కష్టముగదా? ఏది బాహ్యమో ఏది బాహ్యయోగము కలదియో తెలియనపుడు, బహిర్యోగపదముచే గతార్థత యెట్లు పొసగును? అని సమాధాన తాత్పర్యము.

అట్టివానిలో గూడ ప్రేక్షాపూర్వకారియగు వ్యక్తి=పరిశీలనా చతురుడు. 'ఇది ఉత్తరీయము ఇది అంతరీయము' అని తెలిసికొనవచ్చును.

వానిలో బహిర్యోగోపపాదన మెట్లు? అవి ధరింపబడనివి గదా యనిన, ఉపసంవ్యానత్వ నిర్ణయమును నచట భావిబుద్ధిచేతనే గదా చేయవలెను. 'బహిర్యోగమును నట్లే నిర్ణయింపవచ్చును' అని ఉపసంవ్యానపద ప్రత్యాఖ్యాతృ తాత్పర్యము.

**వా॥ "అపురి"** — అని యొక ఆక్షేపవార్తికము.

**"అంతరం బహిర్యోగోప సంవ్యానయోః"** - అను గణసూత్రమునందు 'అపురి' అని చెప్పవలసి యున్నది. పూశ్శబ్దార్థము విశేష్యమయినపుడు, అంతర శబ్దము సర్వనామము కాదని యర్థము.

'అంతరాయాం పురి వసతి' అనియే ప్రయోగింపవలెను గాని 'అంతరస్యామ్' అనరాదు. లింగవిశిష్ట పరిభాషచేత అంతరా శబ్దమునకును సర్వనామత్వము ప్రాప్తించుచున్నది. పుర మొకానొక దేశమున ప్రాకారాభ్యంతర మునను, నొక దేశమున ప్రాకారమునకు బయటను నిర్మింపబడును గాన బహిర్యోగము సంభవించును. అష్టాధ్యాయీ సూత్రము జస్సునకు శీభావ విషయమున వికల్పవిధాయకము. టాబంతమున దానికి ప్రసక్తి లేదుగాన నీ వార్తికమునకు అష్టాధ్యాయీ సూత్రమున పనిలేదు.

**వా॥ "వాప్రకరణే తీయస్య ఙిత్సూపసంఖ్యానమ్"** - అని ఆక్షేప వార్తికము.

సర్వనామ సంజ్ఞావికల్ప ప్రకరణమున, 'తీయప్రత్యయాంతమునకు ఙిత్తు లగు ప్రత్యయములు పరములయినపుడు సర్వనామ సంజ్ఞ కలుగును' అని చెప్పవలసి యున్నది అని వార్తికార్థము. ఆ ఉపసంఖ్యానమునకు, 'ద్వితీయాయై,

ద్వితీయస్మై, తృతీయాయై తృతీయస్మై అను రూపములు సిద్ధించుట ప్రయోజనము. "విభాషా ద్వితీయా తృతీయాభ్యామ్" (7-3-115) అను సూత్రము, 'ద్వితీయా, తృతీయా' అను ఆకారాంత స్త్రీలింగ శబ్దములకంటె బరమైన ఙిద్విభక్తికి స్యాడాగమమును అప్పుకుహ్రస్వమును వికల్పముగా విధించుచున్నది. అది ఇపుడిక అవక్తవ్యము. అందువలన లాఘవము. ఇందేది శ్రేయమన ఉపసంఖ్యానమే శ్రేయము. ఆ సూత్రముచే, ద్వితీయా తృతీయా అను టాబంతముల కారూపములు సిద్ధించినను. ద్వితీయస్మై, తృతీయస్మై అను పుంలింగము రూపములు సిద్ధింపవు. ఉపసంఖ్యానమువలన నవియు సిద్ధించును.

ప్రకృత సూత్రమును, సర్వనామ ప్రకరణమును ముగిసినవి॥

## అవ్యయ సంజ్ఞాప్రకరణము

### సూ॥ "స్వరాది నిపాతమవ్యయమ్" (1-1-36)

స్వరాదులును నిపాతములును అవ్యయములను సంజ్ఞ కలవి యగును అని సూత్రార్థము.

స్వరాదులనగా- 'స్వః' 'అంతః ప్రాతః'— మున్నగునవి. వీనిలో గొన్ని సత్త్వవచనములును, గొన్ని అసత్త్వవచనములును గలవు. సత్త్వమనగా ద్రవ్యము. అందు,

'స్వః పశ్య' = స్వర్గమును జూడుము

స్వః తిష్ఠతి = స్వర్గమునందున్నాడు.

స్వః ఆగతః = స్వర్గమునుండి వచ్చినవాడు.

ఈ మున్నగు ప్రయోగములందు, స్వర్ అనుదానికి క్రియాసంబంధమున అనేక కారకశక్తియోగ మగపడుటవలన నది సత్త్వవాచకము.

'హిరుక్' 'పృథక్' - మున్నగునవి క్రియలతోడనే అన్వయము గలవి యగుటచే వానిని క్రియాప్రధానములందురు.

ఈ విధముగ ఉభయవిధ శబ్దములును స్వరాదిగణమున బఠింపబడి యున్నవి.

నిపాతములనగా ద్రవ్యవాచకములుకాని, 'చ', 'వా' - మున్నగునవి. దీనికి అవ్యయ సంజ్ఞ అని సూత్రము విధించుచున్నది.

స్వరాదులనుగూడ, చాదిగణముగనే పఠించి, "నిపాతాః అవ్యయమ్" - అని సూత్రమును రచింపవచ్చునుగదా. స్వరాదులకు వేరుగా అవ్యయ సంజ్ఞను విధింప పనియేమి ?

అని యిట ఆక్షేపముదయింపవచ్చును. కాని చాదులు అసత్త్వవచనములే నిపాతములగును. చాదులకు, సత్త్వవచనములకును, అసత్త్వవచనములకును గూడ, అవ్యయసంజ్ఞ అపేక్షితము అందులకై స్వరాదులకు ప్రత్యేక గ్రహణమావశ్యకమయినదని సమాధానము.

నిపాతసంజ్ఞ అనియు, అవ్యయసంజ్ఞ అనియు రెండు సంజ్ఞ లెందులకు ? ఒక్క నిపాతసంజ్ఞను మాత్రమే చేసిన చాలదా ?— "ప్రాగ్రీశ్వరా న్నిపాతాః" (1-4-56)

"స్వరాదీని". తరువాత "చాదయోఽసత్త్వే" (1-4-57) అని సూత్రము అను రచింపవచ్చునుగదా? అని ఇంకొక ఆక్షేపము.

అట్లు చేయుట సాధ్యముగాదు. సూ॥ "నిపాత ఏకాజనాఙ్" (1-1-14) అను సూత్రముచే ఏకాఙ్రూపమగు నిపాతకు ప్రగృహ్య సంజ్ఞ విధింపబడియున్నది. అది అపుడు ఏకాచ్చు లయిన స్వరాదులకు గూడ ప్రాప్తించును. 'క్వ' అనునది, కిమోఽత్ (5-3-12) అను సూత్రముచే విధింపబడిన 'అత్' అను తద్ధిత ప్రత్యయమంతమునగలది. ఈ కల్పమున "తద్ధితశ్చాసర్వవిభక్తిః" (1-1-37) అను సూత్రమును నిపాతసంజ్ఞనే విధించునుగాన నదియు నిపాతము. అపుడు 'క్వ+ఇవ=క్వేవ' అనుచోట, ప్రగృహ్యత్వము వచ్చిన ప్రకృతి భావము ప్రాప్తమగును— అని సమాధానము.

పోనిమ్ము. స్వరాదులకును,చాదులకునుగూడ "ప్రాగ్రీశ్వరాదవ్యయమ్" "స్వరాదీని" "చాదయోఽసత్త్వే" అని సూత్రన్యాసముచేసి, అవ్యయసంజ్ఞనే ఏల విధింపలేదు ? అని మరల యాక్షేపము.

అదియు శక్యము గాదు. సూ॥ "తత్పురుషే తుల్యార్థ తృతీయాసప్తమ్యుపమానావ్యయ ద్వితీయాకృత్యాః" (6-2-2) అను సూత్రముచే తత్పురుష సమాసమునందు, పూర్వపదమునకు ప్రకృతి స్వరము విధింపబడినది. ఆ స్వరము 'స్నాత్వాకాలకః' ఇత్యాది తత్పురుష సమాసములందు స్నాత్వా అను కృదంతావ్యయమునందు ప్రవర్తింపకుండుటకై పరిగణనము చేయబడియున్నది "అవ్యయేనఞ్కునిపాతానామ్" అని ఆ పరిగణన వార్తికము, ఆ సూత్రమున జెప్పబడును.

నిపాతసంజ్ఞ వేరుగ లేకుండజేసి, అసత్త్వవాచి చాదులకుగూడ అవ్యయసంజ్ఞనే విధించిన పక్షమున ఆ పరిగణనమున నిపాత పదవ్యావర్త్యములను దెలియజేయుటకు గురుతరమైన న్యాసమును జేయవలసివచ్చును.

అందువలన అవ్యయనిపాతసంజ్ఞలు వేరువేరుగా ఉండుటయే సమంజసము. మరియు "నిపాతా ఆద్యుదాత్తాః" ఇత్యాదులందును దోషము లేకుండును.

నిపాతసంజ్ఞ లేకుండగ, అవ్యయసంజ్ఞ ఒకటియే చేయబడిన యెడల, "అవ్యయమేకాజనాజ్" అని సూత్రమును రచింపవలసియుండును.

అపుడు, 'అత్' మున్నగు తద్ధితలకున, ప్రగృహ్యసంజ్ఞ ప్రసక్తమగును.

"చాదయఏకాజనాజ్" అని సూత్రమును గల్పించిన చాదులకు 'అసత్త్వవచనములైన' అను విశేషణము లభ్యము కాదు.

అందువలన యథాన్యాసమే యుక్తము.

"స్వరాదినిపాతమవ్యయమ్" అను సూత్రము ముగిసినది.

## "తద్ధితశ్చా సర్వవిభక్తిః"

### ॥ ఇష్టానుపపత్తి పరిహారాధికరణము ॥

'స్వరాదులును నిపాతములును అవ్యయసంజ్ఞ కలవి యగును' అని పూర్వసూత్రముచే చెప్పి, అసర్వవిభక్తి యగు తద్ధిత ప్రత్యయాంతమును అవ్యయసంజ్ఞ కలదగునని ప్రకృతసూత్రముచే బోధింపబడుచున్నది. తద్ధితము ప్రత్యయము. ప్రత్యయసూత్రమునకు ప్రయోగార్హత లేదు. కావున నిట తద్ధితయన, తద్ధితాంతమని గ్రహింపదగును.

అసర్వ విభక్తి యనగా=నసర్వా=అసర్వా. అసర్వావిభక్తిః యస్యసః= అసర్వ విభక్తిః సర్వవిభక్తిరహితము అని యర్థము. అసర్వ యనగా - సర్వావయములను గలది కానిది. విభక్తి వచనత్రయము గలది. అందు ఏకవచనము మాత్రమే కలది అసర్వవిభక్తి.

లేదా - అసర్వయగు విభక్తి=అనగా 'ఏదియో ప్రతినియతమగు నొక విభక్తి మాత్రమే ఏ తద్ధితోత్పత్తికి నిమిత్తమగునో అది అసర్వవిభక్తి' అనియు నర్థము కావచ్చును. అప్పుడు, 'వినా' 'నానా' అనువానికి అవ్యయ సంజ్ఞ సిద్ధింపదు. వినఞ్భ్యాం నానాఞౌనసహా" (5-2-27) అను సూత్రముచేత 'వి' అను వానికంటె పరముగా-'నా'-అను స్వార్థిక ప్రత్యయమును-'నఞ్'-కు బరముగా- 'నాఞ్' అను స్వార్థికమును విధింపబడినవి. ఈ 'వినా' 'నానా' - అనువానికిని అవ్యయసంజ్ఞ అపేక్షితము. ఈ ప్రసంగమున ఆక్షేప వార్తికము.

**వా॥ "అసర్వ విభక్తావవిభక్తి నిమిత్తస్యోపసంఖ్యానమ్"** అనునది. కొన్ని తద్ధితలు, అసర్వవిభక్తి అనగా యత్కించిదేకవిభక్తి మాత్రమే నిమిత్తముగా గలవి ఎట్లనగా- "సర్వైకాన్యకింయత్తదః కాలేదా" (5-3-15) అను సూత్రముచే విధింపబడినదా ప్రత్యయమునకు సప్తమీ విభక్తి మాత్రమే నిమిత్తముగాన నది అసర్వ విభక్తి తద్ధితమగును.

'నా' నాఞ్ ప్రత్యయములకు 'వి' నఞ్ములు, అశ్రూయమాణ విభక్తిక ములు- అనగా ఏ విభక్తియు వినబడని అవ్యయములు నిమిత్తములు. కనుక నవి, అవిభక్తికములుగాని, అసర్వ విభక్తికములు గావు. కాగా తన్నిమిత్తము లకు గూడ నవ్యయ సంజ్ఞను జెప్పవలసియుండును, అని ఆక్షేపవార్తిక తాత్పర్యము.

అచటగూడ ప్రథమైకవచనము మాత్రము 'వి' 'న' అనువానికంటె నుత్పన్నము అగును. కాగా అవియు అసర్వవిభక్తులగును గదా? ఎందువలన సిద్ధి పదు అనిన- ఆక్షేపహేతు వార్తికము.

వా॥ 'సర్వవిభక్తిర్హి అవిశేషాత్' - అనునది.

ఇది సర్వవిభక్తి యగునుగదా? ఏమన, ద్విత్వబహుత్వాది విధాయకముల సంబంధము లేకుండగ నేకవచనములౌత్సర్గికముగ బ్రవర్తించును. కావున, అసర్వవిభక్తి యెట్లగును? అవి యట్లు ప్రవర్తించినపిదప, వానికి 'కర్మణి ద్వితీయైవ' ఇత్యాదిగా నేర్పడిన నియమముచే శాస్త్రబలమువలన నివృత్తి కలు గును. కావున నదియు సర్వవిభక్తికమే.

వా॥ "త్రలాదీనాంచోపసంఖ్యానమ్" - అనియు నాక్షేపవార్తికము.

'త్రల్' 'తసిల్' ప్రత్యయాంతములను నవ్యయ సంజ్ఞకములగునని చెప్పవలసి యుండును అని ఆక్షేపము.

'పంచమ్యాస్తసిల్', సప్తమ్యాస్త్రల్' - 5-3-7 - 5-3-10 అను సూత్ర ములచే నవి 'పంచమీ' 'సప్తమీ' - అను విభక్తి విశేషము నాశ్రయించి విధింప బడుటచేత నవి అసర్వ విభక్తి తద్ధితములే గదా? సూత్రముచేతనే సిద్ధించు చుండె. ఉపసంఖ్యానమెందులకు? అనిన, అట్లు కాదు.

అవియు సర్వవిభక్తులే "ఇతరాభ్యోఽపి దృశ్యన్తే" 5-3-14 అను సూత్రము పంచమీ సప్తమీతర విభక్త్యంతములకంటె గూడ వాని ప్రయోగదర్శనమును జెప్పుచున్నది

పోనిమ్ము. న్యాసమును మార్చి 'అవిభక్తిరవ్యయమ్' అని చెప్పిన నీ దోషము తొలగును. ప్రయోగములందెప్పుటను విభక్తి శ్రవణములేని శబ్ద మవ్యయమగునని యర్థము. 'వినా' 'నానా' అనునవి పదత్వ సిద్ధికొరకు విభక్త్యుత్పత్తి కలవయినను, ఆ విభక్తి కెపుడును శ్రవణము లేదుగాన వాని కవ్యయత్వము సిద్ధించును.

'దధి', 'మధు' ఇత్యాదులందును విభక్తి శ్రవణము లేదు గాని 'దధ్నా 'దధ్నో' ఇత్యాదులందు విభక్తి వినబడుచుండుటచేత నవి అవిభక్తిక శబ్దములు కావు. వాని కవ్యయ సంజ్ఞాప్రాప్తి కలుగదు.

మరియు నీ న్యాసమున. 'తద్ధితపదము లేనందునను, సర్వపదము లేనందునను, సకలావ్యయములను సంగ్రహింపుచుండును. కావున లాఘవమును గలదు' అని న్యాసాంతరవాది తాత్పర్యము.

కాని ఈ న్యాసమున, ఇతరేతరాశ్రయము ఉండుటవలన అవ్యయసంజ్ఞకు అసిద్ధి.

ఆ ఇతరేతరాశ్రయత ఏమి ?

అవ్యయమైన "అవ్యయాదాప్సుపః" 2-4-82 అని విభక్తి ప్రత్యయమునకు లుక్కువచ్చునుగాన అవిభక్తిత్వము సిద్ధించును.

అవిభక్తియందున అవ్యయసంజ్ఞ ప్రవర్తించును. ఇట్లది పరస్పరాశ్రయమగుచున్నది. అవిభక్తికత్వము స్వాభావికము గాదు. అట్లయిన లుగ్విధాయక సూత్రము వ్యర్థము కావలసియుండును.

ఇతరేతరాశ్రయములగు కార్యములు సిద్ధింపవు.

**వా॥ "అలింగమసంఖ్యమితివా"** - అని వేరొక వార్తికము.

'అలింగమసంఖ్య మవ్యయమ్' - అను న్యాసమును దుష్టమే. లింగ సంఖ్యారాహిత్యము లౌకికార్థమే అయినను నదియు దానికి ద్యోతకమగు లుక్ శాస్త్రమువలననే తెలియునుగదా ?

లింగసంఖ్యారహితమైన నవ్యయ సంజ్ఞ ప్రవర్తింపవలెను. సంజ్ఞచేతనే అలింగా సంఖ్యత్వము భావింపబడుచుండె. ఇట్లది ఇతరేతరాశ్రయమగుచున్నది. పరస్పరాశ్రయ కార్యము లెచ్చటను నెరవేరవు అని తాత్పర్యము.

కాని అలింగత్వమును, అసంఖ్యత్వమును వాచనికములు కావు. అవ్యయముల కది స్వభావమే. స్వాభావికములగు సంఘటనములందు మనము చేయగలుగునది యుండదు.

ఉద్యమశీలులైన వారందరును, స్వస్వకార్య సాధనమునకు ప్రయత్నముల నేకరూపముగనే చేయుదురు. అట్లే అధ్యయనపరులును. అట్లయ్యును అందు కొందరే ఫలములనందగలుగుదురు. ఇతరులకాఫలము లభించుట లేదు. అందు మనము చేయగలుగునదేమి ? అయ్యది స్వాభావికమాయె

అటులనె ప్రాతిపదికత్వమును సత్త్వవాచకత్వమును దుల్యములే అయినను ఘటపటాది శబ్దములకు లింగసంఖ్యా సంబంధ మగపడుచున్నది. 'స్వః' 'స్వస్తి' ఇత్యాదులకయ్యది లేదు.

అవ్యయములకు, అలింగత్వమును అసంఖ్యత్వమును స్వాభావికములే అయినను, "అవ్యయాదాప్సుపః" అను సూత్రముచే లుగ్విధానము ప్రత్యయ

లక్షణ సిద్ధికొరకైన అనువాదమాత్రమే. కాబట్టి "అలింగ మసంఖ్యమవ్యయమ్" అను న్యాసము దోషరహితమే.

అయిన, న్యాసమునట్లు మార్చవలెనందురా ?

అక్కర లేదు. ఏల ?

**వా॥ "సిద్ధంతు పాఠాత్"** అని సమాధానహేతు వార్తికము.

అవ్యయములు కావలసిన ఆయా తద్ధితాంతముల తద్ధిత ప్రత్యయను లకు పరిగణనార్థమై పాఠమావశ్యకము. 'వచతికల్పమ్' ఇత్యాదుల కవ్యయత్వ మిష్టముగాదు. ఆ పాఠమువలన, 'వినా' 'నానా' మున్నగువానికిని సంజ్ఞ లభించును.

ఆ పాఠము నెట్లు చేయవలెను ? అనిన "పంచమ్యాస్తసిల్" 5-3-7 అని విధింపబడిన 'తసిల్' మొదలు "యాప్యేపాశప్" 5-3-47 అని విహితమయిన పాశప్ ప్రత్యయమునకు బూర్వమున్న ప్రత్యయములకును, "బహ్వల్పార్థాచ్ఛస్ కారకాదన్యతరస్యామ్" 5-4-42 అని విధింపబడిన 'శస్' ప్రత్యయము మొదలు సమాసాంత ప్రత్యయముల ముందు వరకును అమ్, ఆమ్, తసి, వతి, కృత్వసుచ్, సుచ్, ధా, నా, నాఞ్ - అను వానికిని స్వరాదులందు పాఠము కర్తవ్యము॥

లేదా - 'అవిభక్తియగు శబ్దమవ్యయసంజ్ఞకమగును' అనియే యుండ వచ్చును. శబ్దార్థ సంబంధములు వ్యర్థవ్యవహారము వలనగదా తెలియునది. వానికి అలింగత్వమును, అసంఖ్యత్వమును వ్యర్థవ్యవహారమున నగపడుచుండె. కావున సంఖ్య లేనందువలననే అవ్యయములకు విభక్త్యుత్పత్తి కలుగలేదు. కాగా, 'అలింగమసంఖ్యమవ్యయమ్'- అనున్యాసమువలె, 'అవిభక్తిశ్శబ్దోవ్యయమ్' అను న్యాసముగూడ నిర్దుష్టమే॥

"అవిభక్తా వితరేతరాశ్రయత్వాదప్రసిద్ధిః" అని ఆ న్యాసమున నితరేత రాశ్రయతవలన సంజ్ఞ సిద్ధింపవంటిరిగదా ?

అనినది దోషము కాదు. ఇందనోన్యాన్యాశ్రయత కలదనువాని నిట్లుగుదము.

ఆర్యా ! వైయాకరణులు, "అవ్యయాదాప్సుపః" 2-4-82 అని లుక్కుచే విభక్తిని లోపింపజేసి విభక్తిరహితములగు శబ్దములను ప్రయోగించుచున్నారు. వారికి ఏకత్వ ద్విత్వాదిసంఖ్యలు తెలియును అని యంగీకరింతము. వైయా కరణులు కాని వారుగూడ విభక్తిరహితావ్యయములను ప్రయోగించు చున్నారే ? ఏకత్వాది సంఖ్యలు వారికి తెలియవందుమా ? ఎందుకు తెలియవు?

'ఘటః', 'ఘటౌ', 'ఘటాః'- అని సంఖ్యాభేదముగల పదములను వారును ప్రయోగించుచున్నారు. కాగా వారును ఏకత్వాద్యర్థ పరిజ్ఞానము కలవారే. అట్లు చెప్పుటకు వారి వ్యవహారమును కారణము. ఒక వెల యిచ్చి, ఒక గోవును కొందురు. వేరొక మూల్యముతో రెండు గోవులను, మూల్యాంతరము నిచ్చి మూడు గోవులను గొనుచున్నారుగదా. అందువలన వారు సంఖ్యాభిజ్ఞులే. కాని, సంఖ్యాద్యోతకములయిన విభక్తులను ప్రయోగించుటలేదు.

కాబట్టి యిట్లు తలంపవలసి యున్నది. విభక్తిరాహిత్యము ఆ జాతి శబ్దముల యర్థరూపమే. అందువలన విభక్తులు లేవు. అని.

వాని అలింగత్వాసంఖ్యత్వము వక్ష్యమాణ ప్రకారముగ ఉపపాద్యమాన మగునని గమనింపవచ్చును.

ఒకానొక యవ్యయము విభక్త్యర్థ ప్రధానమై యుండును. వేరొకటి క్రియాప్రధానముగ నుండును.

'ఉచ్చైః' 'నీచైః' - అను నివి విభక్త్యర్థ ప్రధానములు. 'పై భాగము నందు', 'క్రింది భాగమునందు'. అని యర్థముగాన నవి అధికరణార్థకములు. 'హిరుక్' 'పృథక్' అనునవి క్రియాప్రధానములు. వానికి క్రియతోడనే అన్వయము.

ఇట్లే, తద్ధితలుగూడ విభక్త్యర్థ ప్రధానములగు 'తత్ర' 'యత్ర' ఇత్యాదులును, 'వినా' 'నానా' - మున్నగు క్రియాప్రధానములును గలవు. ఈ విభక్త్యర్థములకును, క్రియలకును లింగసంఖ్యా సంబంధము లేదుగదా॥

'తద్ధితశ్చా సర్వవిభక్తిః' అను యథాశ్రుతన్యాసమును సమర్థనీయమే. ఎట్లువగా

"ద్వ్యేకయోర్ద్వివచనైకవచనే" 1-4-22 "బహుషుబహువచనమ్" 1-4-23 అను సూత్రములు, ఏకత్వ, ద్విత్వ, బహుత్వ సంఖ్యలందు, ఏకవచన బహు వచనములను విధి చుచున్నవి. ఏకస్మిన్ ఏకవచనమ్' 'ద్విత్వే ద్వివచనమ్' 'బహుత్వే బహువచనమ్' అను నర్థముగల ఆ సూత్ర విన్యాసము మిక్కిలి పెద్దదిగ, వ్యర్థముగ రచింపబడినది. మరి యెట్లుండవలననిన, "ఏకవచనమ్"అని సామాన్యసూత్రము సాపవాదము రచింపనగును. దానికి ద్వ్యర్థమునందును, బహ్వర్థము నందును, ద్వివచన బహువచనములు బాధకములగును. దానివలన ద్విత్వమున ద్వివచనమును, బహుత్వమున బహువచనమును సిద్ధించును. ఏక వచనము మాత్రము ఏకత్వమున్న ప్రాతిపదికములకంటెను, ఏ సంఖ్యయు, లింగమును లేని అవ్యయములకంటెను గూడ ప్రవర్తింపగలదు.

ఏకపదము సూత్రమందున్నప్పుడు, ఏకత్వము లేని అవ్యయములకు జ్ఞాపకాంగులవలన సర్వవిభక్తులును గలుగుననిన ఈ సూత్రమును వ్యర్థమే. ఏక

గ్రహణమను వ్యర్థమగును. ఏకపదమును తొలగించిన యెడల నీ సూత్రము సార్థకమగును. అవ్యయములకంటెు ఏకవచనము లు మాత్రమే ప్రవర్తించును కాబట్టి యవి అసర్వ విభక్తులు అగును.

అసర్వవిభక్తిః అను సమాసపదమునకు బహువచనాంత ఘటిత విగ్రహము ను, 'నసర్వాః=అసర్వాః అసర్వాః విభక్తయః యస్మాత్సః=అసర్వవిభక్తిః' అని యిట్లు చేయబడదు.

'నసర్వా = అసర్వా, అసర్వావిభక్తిః యస్మాత్సః = అసర్వవిభక్తిః' అనియే చేయబడును విభక్తి యనగా త్రికము. వచనత్రయాత్మకమగు ప్రథమ ద్వితీయ మున్నగునది విభక్తి

బహువచనాంతములకు విగ్రహము నాశ్రయించిన పక్షమున సర్వశబ్దము ప్రకార కార్త్స్న్యము ను బోధించునుగాన అన్ని విభక్తుల ఏకవచనములు మాత్రమే పుట్టినను సర్వ ప్రకారములయిన విభక్తులును ఉత్పన్నములయినట్లే యగును. అందువలన అసర్వవిభక్తిత్వము లభింపదు.

ఏకవచనాంత విగ్రహమునకో, సర్వశబ్దము ద్రవ్యకార్త్స్న్యమును బోధించి, ఏకవచనము మాత్ర ముత్పన్నమయినపుడు, వచనత్రయాత్మక విభక్తి యుత్పన్నము కానట్లే గనుక అసర్వవిభక్తిత్వ ముపపన్నమగును.

ఇందు లాఘవవిశేషము ను గలదు.

ఎట్లనగా—

శ్లో॥ "ఏవంగతే కృత్యపితుల్యమేతత్। మాంతస్య కార్యంగ్రహణంనతత్ర।
తతః పరేచాభిమతానకార్యాః। త్రయః కృదర్థాగ్రహణేనయోగాః॥

"ఏవంగతేసతి="

అనగా— నసర్వా=అసర్వా. అసర్వా విభక్తిః యస్మాత్సః అసర్వ విభక్తిః అని చెప్పి, విభక్తి యనగా త్రికము గనుక సర్వవిభక్తుల ఏకవచనములను ఉత్పన్న[illegible]ననను, నిరవశేషముగనే విభక్తియు బుట్టియుండలేదు గాన 'అసర్వవిభక్తిత్వమునకు భంగము లేదు' అని నిశ్చయింపబడినపుడు, అని యర్థము. అప్పుడు 'అసర్వవిభక్తి అవ్యయమ్' అనియే అవ్యయ లక్షణము. 'స్వరాది నిపాతవ్యయమ్' 'తద్ధితశ్చాసర్వవిభక్తిః' 'కృన్మేజంతః' 'క్త్వాతోసున్ కసునః' 'అవ్యయీభావశ్చ'— అను పంచసూత్రి అనావశ్యకము.

"కృత్యపితుల్యమేతత్" = ఈ అసర్వవిభక్తిత్వము, అవ్యయసంజ్ఞ. కృదంతములందును తుల్యమే. అచటను 'అసర్వవిభక్త్యవ్యయమ్' అను లక్షణము చేతనే అవ్యయసంజ్ఞ సిద్ధించును. కాగా,

"మాంతస్య కార్యగ్రహణం నతత్ర"=తత్ర=అవ్యయ సంజ్ఞావిధాయక సూత్రములలో, 'కృన్మేజంతః' అని సూత్రమును బఠింప బనిలేదు.

"తతఃపరేచాభిహితాస కార్యాక్త్ర్యయః కృదర్థాః గ్రహణేన" = కృన్మేజంతః అను సూత్రమునకు తరువాతనున్న "కృదర్థాః = కృత్సంజ్ఞా విషయములగు క్త్వాతోసున్, కసున్ ప్రత్యయములు మూడును" ప్రతిపదోచ్చారణముచేసి గ్రహింపబడినవియు అనావశ్యకములు. సామాన్య సూత్రముచేతనే తదంతములకును నవ్యయసంజ్ఞ సిద్ధించును.

"యోగాః"='స్వరాదినిపాత మవ్యయమ్' ఇత్యాది యోగము లయిదును అనావశ్యకములే॥ అని భాష్యశ్లోక తాత్పర్యము.

కాని, అసర్వ విభక్తి అవ్యయమ్' అను లక్షణమున, తద్ధిత గ్రహణము లేనందున, తద్ధితాంతములు కాని అసర్వవిభక్తికములగు ఏకః, ద్వౌ, బహవః అను ప్రతినియత సంఖ్యాకములకు గూడ ప్రాప్తించు అవ్యయసంజ్ఞకు నిషేధమును జెప్పవలసియుండును. అందులకై తద్ధిత గ్రహణ మావశ్యకము. అది గ్రహింపబడిన స్వరాదులు తద్ధితాంతములు కావు గాన వాని కవ్యయసంజ్ఞా సిద్ధికై స్వరాది గ్రహణమును కర్తవ్యము. అట్లే "కృన్మేజంతః" అనునదియు కర్తవ్యమగును కావున నీ గౌరవమును పరిహరించుటకై స్వరాదిగణమున, అవ్యయసంజ్ఞ కలుగుట సమ్మతమయిన, కృత్తద్ధిత ప్రత్యయములకు ప్రతిపదపాఠమే కర్తవ్యమనియు, సూత్రారంభము కేవల ప్రపంచనార్థమేయనియు నీ క్రింది భాష్యశ్లోకము బోధించుచున్నది.

శ్లో॥ "కృత్తద్ధితానాం గ్రహణంతు కార్యమ్।
సంఖ్యావిశేషం హ్యభినిశ్చితా యే।
తస్మాత్ స్వరాది గ్రహణంచకార్యమ్।
కృత్తద్ధితానాం గ్రహణంచ పాఠే॥"

అని శ్లోకము. యే=ఏ కృదంత తద్ధితాంతములు. సంఖ్యావిశేషమభినిశ్చితాః=నిశ్చితమైన సంఖ్యా విశేషము మాత్ర కలవియో వానికిని, అనగా ఉభయః ఉభయే, అను అయజంతము, 'గోదౌ' అను 'వరణాః' అను చాతురర్థికల బంతములు మున్నగువానికిని, 'ఏకః, ద్వౌ, బహవః' మున్నగు

వానికిని అవ్యయసంజ్ఞా ప్రతిషేధమును వేరుగ జెప్పనక్కర లేకుండుటకు ఆయా సూత్రములందు తద్ధిత గ్రహణమును కృద్గ్రహణమును కర్తవ్యములు. తస్మాత్ = అతివ్యాప్తి పరిహారమునకై కృత్తద్ధిత గ్రహణ మావశ్యకమగుట వలన, కృత్తద్ధితాంతములు కాని స్వరాదుల కవ్యయసంజ్ఞాసిద్ధికై స్వరాది నిపాత మవ్యయమను సూత్రమును కర్తవ్యమగును. అప్పటికిని, ఉభయ, గోదా, వరణాః ఇత్యాదులందతి ప్రసంగము తప్పలేదు. కావున గణపాఠమును మాత్ర మాశ్రయించి. ఆయా కృత్తద్ధితలను అందు పఠించి, అవ్యయసంజ్ఞా విధాయక సూత్రములను గణసూత్రములుగ బఠించిన, అష్టాధ్యాయీ సూత్రపాఠము పరిత్యజింపదగినది- అని తాత్పర్యము.

అవ్యయత్వమభీష్టమయిన ఆయా శబ్దములను గణమునందు పఠించి, వాని కవ్యయసంజ్ఞ విధింపబడుచున్నదేయని తేలినది.

'పరమోచ్చైః' 'పరమనీచైః' అనువానికిపుడది ప్రాప్తించుటలేదు- 'ఉచ్చైః' 'నీచైః' అనునవియే గదా గణపఠితములు ?

'ప్రయోజనం సర్వనామావ్యయసంజ్ఞాయామ్'- అను వచనముచేత తదంత విధి లభించునుగాన వానికిని సిద్ధించును.

అట్లైన 'అత్యుచ్చైః' 'అత్యుచ్చైసౌ' 'అత్యుచ్చైసః' అనుచో గూడ రావలసి వచ్చునే? ఇందు చ్చై అనుదానికి 'ఊర్ధ్వదేశమున నున్నది' అని యర్థము. శక్తి ప్రధానములయిన వయ్యును నవ్యయములు, దోషాభూతమహః (పగలు రాత్రిగా నయినది) అన్న స్థలమునందువలె, శక్తిమత్ప్రధానములగును గాన ఊర్ధ్వదేశమున నున్నదాని నతిక్రమించినవాడు అని యర్థము. అది అవ్యయము కాదు. తదంత విధిచేత నవ్యయత్వము ప్రాప్తించుచున్నది.

'ఉపసర్జనములయిన స్వరాదుల కవ్యయసంజ్ఞ లేదు' అను ప్రతిషేధముచే ఆ ఆపత్తి లేదు.

అట్టి నిషేధమును ఒకదానిని చెప్పవలెనని యభిప్రాయమా? అక్కర లేదు. సర్వనామ ప్రకరణమున బ్రస్తుతమయిన ఉపసర్జన ప్రతిషేధ మిట ననువర్తించును.

అచ్చట నది ప్రత్యాఖ్యాతము గదా? అనిన, అచ్చట బ్రత్యాఖ్యాతమయిన రీతిలో నిచటను నవి ప్రత్యాఖ్యాతము కావచ్చును.

అట నెట్లది ప్రత్యాఖ్యాతము ?

'సర్వనామ'- అనునది మహాసంజ్ఞగా గ్రహింపబడినది. అనగా నన్వర్థ మగు సంజ్ఞ యనుట. 'అట్టి యన్వర్థ సర్వనామ ప్రధానమగు సర్వాదియగును గాని ఉపసర్జనము కాదు అని చెప్పి ప్రత్యాఖ్యానము చేయబడినది.

అట్లైన, ఇదియు మహాసంజ్ఞయే. సంజ్ఞలను జేయుట, లాఘవము కొఱకేగదా? కనుక నా సంజ్ఞ ఎట్టిదిగా నుండవలెననిన, 'ఇంతకంటె లఘు భూతమయినది ఇక నుండబోదు' అని చెప్పదగినదిగా నుండవలెను. అట్టియెడ "అవ్యయమ్" అని పెద్ద సంజ్ఞను జేయుటకు తాత్పర్యమిది యర్థానుగతమగు సంజ్ఞ కావలెననిగదా? అవ్యయమ్=అనగా 'నవ్యేతి'=వివిధమగు ప్రకారమును బొందనిది. 'ఏకరూపముగ నుండునది' అని యర్థము.

ఏ విషయమున వైవిధ్యమును బొందనిది?

స్త్రీత్వము, పుంస్త్వము, నపుంసకత్వము, ఏకత్వము ద్విత్వము బహుత్వము, కర్మత్వము, కరణత్వము- మన్నగునవి సత్త్వగుణములు, ద్రవ్య ధర్మములనుట. ఆ యర్థములను గొన్ని శబ్దములు వ్యభిచరించును. కొన్ని వ్యభిచరింపవు.

అట్లా యర్థములందు వ్యభిచారము లేకుండగా ఏకరూపముగ నుండు శబ్దము అవ్యయము.

శ్లో॥ సదృశం త్రిషు లింగేషు।
సర్వాసుచ విభక్తిషు।
వచనేషుచ సర్వేషు।
యన్నవ్యేతి తదవ్యయమ్॥

అనునది శ్రుతి. ఏ శబ్దము, మూడు లింగములందును దుల్యరూపముగ నుండునో, సర్వవిభక్తులందును నట్లే యుండునో, సర్వవచనములందును నానాత్వమును బొందక ఏకరూపముగనే యుండునో అది అవ్యయము.

ద్రవ్యార్థకములు కాని, కారకశక్తిమాత్ర ప్రధానములయిన 'ఉచ్చైః', 'నీచైః' మున్నగువానికి లింగ సంఖ్యాకారక సంబంధముండదు. సత్త్వవాచు లగు 'స్వర్' మొదలగువానికిగూడ గొన్నిటికి ఆ సంబంధము లేదు. శబ్దశక్తి స్వభావము అట్టిది అని భావము.

"వివర్తమున, తద్ధితశ్చాసర్వవిభక్తిః"- అను సూత్రము ముగిసినది.

## ॥ "కృన్మేజన్తః" ॥ 1-1-39

### మేజంతపదమున, విశేషణతా విచారము.

మకారాంతమగు కృత్ప్రత్యయమంతమున గలది అవ్యయసంజ్ఞ కలది యగునని యీ సూత్రమున కర్థమా? లేక

'మకారాంతమగు కృత్ప్రత్యయాంత మవ్యయ మగునని యర్థమా?' అనగా- మేజంతపదము కృత్తునకు విశేషణమా? కృదంతమునకు' విశేషణము యనుట.

ఎట్లయిననేమి ?

'మకారాంతమగు కృత్తు'- అని వివరించిన, 'కారయాంచకార' 'హారయాంచకార' అను స్థలములందు 'కారయామ్' 'హారయామ్' అను వాని కవ్యయసంజ్ఞ ప్రాప్తింపక పోవును. అది ఇష్టము. అట కృత్తు మకారాంతము గాదు. 'లిట్' అను లకారమచట కృతు. అది మాంతము గాదు. ఆ లిట్టుకు, 'ఆమః'— అను సూత్రముచే లుక్కు కలుగును. కావున నది తిఙ్ఖాదికానందున 'అతిఙ్' అను కృత్త్వ ప్రతిషేధము లేదు. మకారాంతమగు కృదంతమనిన దోషము లేదు.

కాని మకారాంతమగు కృదంత మవ్యయమగునను నర్థమును స్వీకరించిన, 'ప్రతామౌ' ప్రతామః అను లక్ష్యములందు క్విబంతమగు మాంతమున కవ్యయత్వమనిష్టమైనది ప్రాప్తమై, "అవ్యయాదాప్సుపః"- అను సూత్రముచే విభక్తి ప్రత్యయములకు లుక్కు రావలసివచ్చును" అని యాక్షేపము.

నీ వెట్లు చెప్పదలచుకొనిన నట్లు చెప్పవచ్చునని సమాధానము.

మకారాంతమగు కృత్ప్రత్యయమంతమున గలది యవ్యయమనుడు. అట్లైన 'కారయామ్' 'హారయామ్' అనువాని కవ్యయ సంజ్ఞ ప్రాప్తింపక పోవునుగదా? అది యెటు పొసగును?

అట నామాంతముల కవ్యయసంజ్ఞచే నేమి సిద్ధింపవలెను? "అవ్యయాదాప్సుపః" 2-4-82 అని లుక్కు రావలెననిగదా? ఈ సూత్రముచే ఆ లుక్కు రాకున్నను, "ఆమః" 2-4-81 అను వెనుక సూత్రముచే నది సిద్ధించును. అందువేని,

అట్లు సిద్ధింపదు. "ఆమః" అను సూత్రములోనికి దాని వెనుక సూత్రమయిన "మన్త్రేఘస" ఇత్యాది సూత్రమునందలి 'లేః' అను పద మనువర్తించును. కావున నా సూత్రముచే లిట్ప్రత్యయమునకే లుక్కగునుగాని సుప్పులకు రాదు.

విగ్రహాణము నివర్తించును. ఇందది యనువర్తింపదు.

అది నివర్తించిన ప్రత్యయమాత్రమునకు లుక్కు రావలసి వచ్చునే యవిన,

ప్రత్యయమాత్రమునకు లుక్కు సమ్మతమే. ఆమంతముకంటె బరమైన సకల ప్రత్యయములకును నది ఇష్టమే, రావలసినదియే. ఆమంతములందు, ప్రకర్షము వివక్షింపబడినపుడు, 'తరప్' 'తమప్'- మున్నగు ప్రత్యయములు రావలసి యున్నవి. వానికిని అదర్శనమ పేక్షితము.

"కృఞ్చాను ప్రయుజ్యతే లిటి"-అను సూత్రముచే ఆమంతమునకు బరముగ కృభ్వస్తుల కను ప్రయోగమును బోధించి, పాణిని ఈ యంశమును దెలియ జేయుచున్నాడు. ఆమంతమునకు బరముగ తరబాది ప్రత్యయములు ప్రయోగింపబడిన, కృ, భూ, అస్ ధాతువులకు అవ్యవహిత ప్రయోగము ఘటింపదు. సూత్రమునందలి 'అనుప్రయుజ్యతే' అను పదమునందు అను, 'ప్ర' అను పదములవలన నవ్యవహిత ప్రయోగమే అనుప్రయోగమగునని తెలియుచున్నది. కాబట్టి, ఆమంతమునకు పరమయిన ప్రత్యయమాత్రమునకు లుక్కు సమ్మతమే.

లేదా— మాంతపదము కృదంతమునకే విశేషణము. 'మకారాంతమగు కృదంత మవ్యయసంజ్ఞకమగును' అనియే చెప్పుడు.

'ప్రశామౌ' 'ప్రశామః'— అను స్థలమున నెట్లు మాంతమున కవ్యయ సంజ్ఞ వారింపబడవలెను?

'ప్రశామ్'— అనునది శము ధాతువుపైన క్విబంతము. 'క్విప్' అను ప్రత్యయము సర్వలోపి. ప్రత్యయలక్షణముచే ప్రశామ్ అనునది కృదంతము కావలెను.

స్వరాదిగణమున 'ప్రశాన్' అను శబ్దము పఠింపబడియున్నది. దాని కవ్యయసంజ్ఞకొరకది యాగణమున బఠింపబడినదని స్పష్టము. అది ప్రపూర్వక శముధాతువు క్విబంతము. "మోనోధాతోః 8-2-64 అను సూత్రముచే మకారమునకు నకారాదేశము వచ్చినది. ఆనత్వ మసిద్ధమగునుగాన, మాంతత్వమును, ప్రత్యయ లక్షణముచే కృదంతత్వమును లభించుచున్నది గాన కృన్మేజంత సూత్రముచేతనే అవ్యయసంజ్ఞ సిద్ధించుచున్నపుడు, స్వరాదులం దా శబ్దమునకు పాఠము వ్యర్థమగునుగదా? ఆ పాఠము ప్రత్యయ లక్షణముచే కృదంతము లయినవానికి సూత్రముచే నవ్యయసంజ్ఞ రాదని పాణినియాశయమగుటచే పాఠమిపుడు సార్థకము. కావున కృదంతమగు మకారాంత మవ్యయసంజ్ఞక మగునవనినను నెట్టి దోషమును పాటిల్లదు.

## సన్నిపాత పరిభాషాధికరణము

**వా॥ "కృన్మేజంతశ్చానికారోకార ప్రకృతిః"**— అని యాక్షేపవార్తికము.

ఏజంతమగు కృత్ప్రత్యయమగునని చెప్పినపుడు, ఆ ఏచ్చు ఇకార ఉకారములు ప్రకృతిగా గలది కానపుడే అవ్యయమగునని చెప్పవలెను. అని వార్తికార్థము.

'ఆధయే' 'చికీర్షతే'— అను స్థలములం దవ్యయసంజ్ఞ ఏకారోకారములకు లేకుండుట, దానికి ప్రయోజనము.

ఆధిశబ్దమునందు చివరి ఇకారమును, చికీర్షు శబ్దమునందు ఉకారమును కృత్ప్రత్యయములు. ఆ శబ్దముల పఞ్చమీ చతుర్థీ ఏకవచనాంతరూపములలో ఆధి+ఏ—ఆధి+అస్,—'చికీర్షు+ఏ,చికీర్షు+అస్,అను నవస్థలో "ఘేర్ఙితి"7-3-111 అను సూత్రముచే గుణము ప్రవర్తించిన తరువాత 'ఆధే', 'చికీర్షో' అని యగును. ఇపుడీ ఏకారోకారములు స్థానివద్భావముచే కృత్తులు. వ్యపదేశివద్భావముచే ఏదంతములు. కాగా తదంతముల కవ్యయసంజ్ఞ కలిగినయెడల, విభక్తి ప్రత్యయమునకు లుక్కు రావలసివచ్చుచున్నది. తద్వారణార్థమట్లు చెప్పవలయునని భావము.

**వా॥ "అనన్య ప్రకృతిరితివా"**- అని వార్తిక పాఠాంతరము.

"కృన్మేజంతశ్చానన్యప్రకృతిః" అనియైనను బఠింపవలెను. 'అనికారోకార ప్రకృతిః'- అను పాఠమున, 'ఆధయే' 'చికీర్షతే' అనుచోట నవ్యయసంజ్ఞ వారింపబడినను, 'కుంభకారేభ్యః' అనుచో, 'కుంభకారే' అను నేజంతమునకది వారింపబడదు. అట నేకారమునకు ప్రకృతి అకారముగాని ఇకారోకారములు గావు.

ఈ రెండు విధముల పాఠములలో ఏది శ్రేయము? అనిన- 'అనన్య ప్రకృతిః'- అను వచనమే శ్రేయము. దానివలన 'కుంభకారేభ్యః' 'నగరకారేభ్యః' అనుచోట నవ్యయత్వాపత్తియు వారించును గదా.

అట్లైన నా విధముగా బఠింపవలయునా? అనిన,

**వా॥ "నవాసం నిపాతలక్షణో విధిరనిమిత్తం తద్విఘాతస్యేతి"** అట్లు పఠింపకున్నను, దోషము లేదు. దానికి గారణమేమనిన, "సన్నిపాతలక్షణో విధిరనిమిత్తం తద్విఘాతస్య"- అను నీ పరిభాష అవశ్యకర్తవ్యము. దానివలననే వార్తికోక్త ప్రయోజనము సిద్ధించును.

'పౌర్వాపర్యము మున్నగు సంబంధములు నిమిత్తములయినపుడు విహితములగునవి, ఆ సంబంధములకు విఘాతమును కలిగించు విధ్యంతరమునకు నిమిత్తములు గావు' అని యీ పరిభాషకర్థము. జే, జసి, జస్ అను ప్రత్యయముల పరత్వమును బురస్కరించుకొని ప్రవర్తించిన "ఘేర్ఙితి" 7-3-111 "బహువచనే ఝల్యేత్" 7-3-103 అను విధులు, ఆ సంబంధమునకు విఘాతమును గలిగించు, అవ్యయసంజ్ఞా ప్రయుక్తమగు లుక్కునకు నిమిత్తములు కాజాలవు. కావున నా దోషము లేదు.

అందేమి విశేషము గలదు? ఈ పరిభాషను జేసిననేమి? "అనన్యప్రకృతిః" అను వచనమును జెప్పిననేమి ?

ఈ పరిభాష యవశ్యకర్తవ్యము. దీని కనేక ప్రయోజనములు గలవు.

అవి యేవి ?

వా॥ "ప్రయోజనంహ్రస్వత్వంతుగ్విధేర్గ్రామణికులమ్" అని ప్రథమ ప్రయోజన వార్తికము.

'గ్రామణికులమ్' అనుచోట, హ్రస్వత్వము తుగ్విధికి నిమిత్తము కాకుండుట పరిభాషకు ప్రయోజనము.

'గ్రామణికులమ్' 'సేనానికులమ్'- అనునవి షష్ఠీతత్పురుష సమాసములు. అందు పూర్వపదము లీ కారాంతము౹౹, ఆ ఈకారమున కుత్తరపదము పరమగునపుడు "ఇకో హ్రస్వోఽఙ్యో గాలవస్య" 6-3-61 అను సూత్రముచే హ్రస్వము ప్రవర్తించినది. గ్రామణీ సేనానీ శబ్దములు క్విబంతములు. ప్రత్యయలక్షణముచే హ్రస్వమునకు, పకారేత్సంజ్ఞకమగు కృత్తు పరమగుచున్నందున "హ్రస్వస్య పితి కృతి తుక్"6-1-71 అను సూత్రముచే తుగాగమము ప్రాప్తించుచున్నది. అయ్యది ప్రవర్తింపకుండుట సన్నిపాత పరిభాషకొక ప్రయోజనము.

హ్రస్వమునకు, పూర్వోత్తరపద సన్నిపాతము నిమిత్తము. తుగాగమము ప్రవర్తించిన యెడల, ఆ సన్నిపాతమునకు విఘాతము కలుగును గాన హ్రస్వమందులకు నిమిత్తము గాదు.

అంతరంగ పరిభాషవలన నీ ప్రయోజనము సిద్ధించునుగాన సన్నిపాత పరిభాష కిది ప్రయోజనము గాదు. హ్రస్వము పదద్వయాశ్రయమగుటచే బహిరంగము. తుగాగమము వర్ణమాత్రాశ్రయమగుట నంతరంగము. అంతరంగము కర్తవ్యమగునపుడు బహిరంగ మసిద్ధమగును. కావున హ్రస్వమునందు దీర్ఘ బుద్ధియే యుండునుగాన, తుగాగమమునకు ప్రసంగములేదని భావము.

వా॥ "నలోపో వృత్రహభిః"- అని ప్రయోజనాంతర వార్తికము. 'వృత్రహాభిః' అను రూపము, వృత్రహన్ శబ్దమునకు, తృతీయా బహువచ

నాంతము. అట "నలోపః ప్రాతిపదికాంతస్య" 8-2-7 అను సూత్రముచే నకార లోపము ప్రవర్తించిన తరువాత, ఆ శబ్దము క్విబంతమగుటంజేసి తుగాగమము ప్రాప్తించుచున్నది.

నలోపమునకు, పదత్వము కావలెను. పదసంజ్ఞకు సుప్పు నిమిత్తము. కావున పదసంజ్ఞ ద్వారముగ నలోపము స్వాదిసన్నిపాత నిమిత్తకమగునుగాన నయ్యది, తద్విఘాతకమగు తుగాగమమునకు నిమిత్తము గాజాలదు.

ఇదియు ప్రయోజనముగాదు. తుగాగమము కర్తవ్యమగునపుడు నలోప మసిద్ధమగును. స్వాదిప్రత్యయాపేక్షమగుటచే నలోపము బహిరంగము. కాగా నీ ప్రయోజనమును నిరాకృతము.

**వా॥ "ఉదుపధత్వమకిత్త్వస్యనికుచితే"**— అనియు ప్రయోజన వార్తికము.

'నికుచితమ్' అను రూపమునందు, 'ధాతువుయొక్క ఉదుపధత్వము, క్తప్రత్యయముయొక్క అకిత్త్వమునకు నిమిత్తము కాకుండుట సన్నిపాత పరిభాషకు వేరొక ప్రయోజనము' అని వార్తికార్థము.

'నికుచితమ్' అనునది కుఞ్చధాతువునకు భావార్థమున వచ్చిన క్తప్రత్యయ మంతమున గల రూపము. "అనిదితాంహల ఉపధాయాః క్ఙితి" 6-4-24 అను సూత్రముచే ధాతువునందలి ఞకారమునకు స్థానియగు నకారమునకు లోపము రాగా ధాతువు ఉకారోపధమగుచున్నది. అందువలన, "ఉదుపధాద్భావాది కర్మణోరన్యతరస్యామ్" 1-2-21 అను సూత్రముచే నిష్ఠాప్రత్యయమునకు వైకల్పికముగ కిత్త్వప్రతిషేధము ప్రాపించుచున్నది.అందు కిత్త్వాభావపక్షమున గుణము ప్రాప్తించుచున్నది. అది సమ్మతము గాదు. సన్నిపాత పరిభాషచే దానిని వారింపవలె. అది యెట్లనిన,

ధాతువు ఉదుపధమగుటకు నిమిత్తము నలోపము. నలోపమునకు నిమిత్తము ప్రత్యయమందలి కిత్త్వముగదా. ఉదుపధత్వమువలన, కిత్త్వప్రతిషేధము వచ్చినచో, కిత్త్వనిమిత్తముగ గలిగిన ఉదుపధత్వము, తద్విఘాతకమగు,'ఉదుప' ధాత్తను సూత్రముచే విహితమగు నకిత్త్వమునకు నిమిత్తముగా నేర్పడిన దగును. సన్నిపాత పరిభాషచేత నా దోషము వారింపవలయును.

కాని యీ ప్రయోజనమును, అన్యథాసాధింపవచ్చునుగాన నిదియు ప్రయోజనము గాదు. ఇట అకిత్త్వము రానిండు. దానివలన ప్రాప్తమగు గుణమును, "నధాతులోప ఆర్ధధాతుకే" 1-1-4 అను సూత్రముచే నిషేధింప వచ్చునుగాన నా దోషము లేదు.

వా॥ "నాభావోఽయఘిదీర్ఘత్వస్యామునా" అనునది వేరొక ప్రయోజన వార్తికము.

'అమునా' అను రూపములో, "ఆఙోనాఽస్త్రియామ్" 7-3-120 అను సూత్రముచే 'నా'భావను ప్రవర్తించిన తరువాత, "సుపిచ" 7-3-102 అను సూత్రముచే ఉకారమునకు దీర్ఘము వచ్చినయెడల 'అమూనా' అని కావలసి వచ్చును. అట ముత్వమసిద్ధమగుటచేత నుకారాంతమునందదంతత్వ జ్ఞానముచే దీర్ఘమునకు ప్రాప్తి. కాని సన్నిపాత పరిభాష, ఉదంతసన్నిపాత నిమిత్తకమగు 'నా' అను నాదేశము, తద్విఘాతకమగు దీర్ఘమునకు నిమిత్తముగాదు' అని బోధించునుగాన నా యాప తి వారితమగును. దీర్ఘము ప్రవర్తించిన యెడల ఉదంతత్వము విహతమగును. ఘిసంజ్ఞ ప్రవర్తింపదు. దాన, 'నా' భావము ప్రవర్తింపదు. సన్నిపాత పరిభాషవలన దీర్ఘత్వమును వారింపవలెను అని భావము.

ఇదియు ప్రయోజన మా పరిభాషకు గాదు. 'ననుటాదేశే' అని ముందు చెప్పబడును. టాదేశ విషయమున ముత్వ మసిద్ధముగాదని దాని యర్థము. టాదేశమునందు, 'టాయాః ఆదేశః' అనియు, 'టాయామాదేశః' అనియు విగ్రహ ంలు. అందు 'టా'కు ఆదేశము నా భావము. టాపరమగునపుడు. అనగా నాదేశము పరమగునపు నుట, ఆదేశము దీర్ఘత్వము. ఆ రెండింటి విష యమునను, ముభావ మసిద్ధము కాదు గావున నాదేశము సిద్ధించును. దీర్ఘము వారించును.

వా॥ "ఆత్వం కిత్త్వస్యోపాదాస్త"— అనియు ప్రయోజన వార్తికము.

ఈ పరిభాషవలన, ఆత్వము కిత్త్వమునకు నిమిత్తము గాదు.

ఎచ్చట? 'ఉపాదాస్త' అను లక్ష్యమునందు. "ఉపాదాస్తాస్య స్వరః శిక్షకస్య" అను వాక్యమున ననుట. "ఈ ఉపాధ్యాయుని స్వరము క్షీణించినది" ఇది లుఙంతరూపము. "మీనాతి మినోతి దీఙాం ల్యపిచ"6-1-50 అను సూత్రముచే 'దీ' ధాతువు నీకారమున కాత్వము వచ్చిన పిదప ధాతువు దారూపమగును గాన 'ఘు' సంజ్ఞ ప్రవర్తించును. అపుడు "స్థాఘ్వోరిచ్చ" 1-2-17 అను సూత్ర ముచే, ధాత్వాకారమునకు ఇకారమును సిచ్చునకు కిత్త్వమును ప్రాప్తింపను. దానిని పరిభాషచే వారింపవలె. పఙ్నిమిత్త నిమిత్తకముగ ప్రవర్తించి హాత్వము, సిచ్చునకు, కిత్త్వము ప్రవర్తించిన, గుణవృద్ధులు ప్రవర్తింపవుగాన, పఙ్విషయ సన్నిపాతమునకు భంజకమగును. కావున నిదియు ప్రయోజనము.

'మీనాతి' 'మినోతి' దీఙ్ ధాతువులకు ల్యప్ ప్రత్యయము పరమగు నపుడు ఆత్వము వచ్చును. చకారమువలన శిద్భిన్నమగు ఏజ్నిమిత్త ప్రత్యయము పరమయినపుడును ఆ ఆత్వము కలుగును' అని 'మీనాతి మినోతీత్యాది' సూత్ర మున కర్థము. ఏజ్విషయమనగా గుణవృద్ధులకు నిమిత్తము. అది సిచ్చు. తత్సన్నిపాతమాత్వమునకు నిమిత్తము. దానికి కిత్త్వమును విధింపబడుటచే దాని గుణవృద్ధి నిమిత్తత్వము నివర్తించును. ఆ స్థితి సన్నిపాత పరిభాషచే వారింపవలెనని భావము.

ఇదియు నీ పరిభాషకు ప్రయోజనము కాదు.

"దీఙః ప్రతిషేధః స్థాఘ్వోరిత్వే"— అని వార్తికకారుడే చెప్పి యుండుటచే నీ పరిభాష లేకున్నను ఘుత్వము రాదు. ఇత్త్వయుతమగు కిత్త్వము కర్తవ్యమయినపుడు దీఙ్ ధాతువునకు 'ఘు' సంజ్ఞ రాదు అని యా వార్తికమున కర్థము.

"తిసృచతసృత్వంఙీబ్విధేః"— అని వేరొక ప్రయోజన వార్తికము.

'తిస్రస్తిష్ఠంతి' 'చతస్రస్తిష్ఠంతి' అను స్థలములందు త్రి, చతుర్ శబ్దము లకు స్త్రీత్వమున, 'తిసృ' 'చతసృ' అను నాదేశములు ప్రవర్తించినవి. అవి ఋకారాంతములగుటచేత వానికి "ఋన్నేభ్యోఙీప్" 4-1-5 అను సూత్రముచే ఙీప్ ప్రత్యయము ప్రాప్తించుచున్నది. అది ప్రవర్తించిన యెడల దానితో వ్యవధానము ప్రకృతి విభక్తులు ఏర్పడును. విభక్తి నిమిత్తకములగు నా యాదే శములు, ఙీప్ప్రత్యయద్వారముగ విభక్తి వ్యవధాయకములై ప్రకృతికి తత్సన్ని పాత విఘాతకములగుట ఉపజీవ్యవిరోధము. దాని నీ పరిభాషచే నివారింప వలెను. కావున నిదియు ప్రయోజనము.

కాని, ఇదియు అన్యథా సిద్ధముకాన ప్రయోజనము కాదు. ఏలయన, పాణిన్యాచార్యుడు, 'తిసృచతసృ' శబ్దములకు 'నాము' పరమగునపుడు "నామి" 6-4-3 అను సూత్రముచే ప్రాప్తించు దీర్ఘమును, "నతిసృచతసృ" 6-4-4 అను సూత్రముచే నిషేధించుచున్నాడు. వానికి ఙీప్ప్రత్యయము వచ్చినయెడల, దీర్ఘప్రాప్తియే లేనందున నిషేధము వ్యర్థము. కావున నాతని ప్రవృత్తి తిసృచతస్రాదేశములు ప్రవర్తించిన తరువాత నిక ఙీప్పు ప్రవర్తింపదని జ్ఞాపన చేయుచున్నదిగాన నదియు ప్రయోజనము గాదు.

అటులైన నీ క్రింది ప్రయోజన త్రయమును అన్యథా సిద్ధము కాని పరిభాషా ప్రయోజనముగా నగును.

అందు మొదటిది- 'శతాని' 'సహస్రాణి' అనునది.

ఈ రూపములలో ప్రాతిపదికము లకారాంతము లే యయినను, "నపుంసకస్యఝలచః" 7-1-72 అను సూత్రముచే విభక్తి నిమిత్తకముగ నుమాగమము ప్రవర్తించిన తరువాత నవి నాంతములగును కావున "ష్ణాంతాషట్" 1-1-24 అను సూత్రముచే 'షట్' అను సంజ్ఞ ప్రవర్తించి, "షడ్భ్యోలుక్" 7-1-22 అను సూత్రముచే జస్ శస్ ప్రత్యయము లకు లుక్కు ప్రాప్తించుచున్నది. సర్వనామ - స్థాన సన్నిపాత నిమిత్తకమగు నుమాగమవిధి సన్నిపాత లక్షణవిధి. అయ్యది, తద్విఘాతకమగు షట్సంజ్ఞాహేతకమగు లుక్కునకు నిమిత్తము కాదని యీ పరిభాష బోధించునుగాన నది యొక ప్రయోజనము.

రెండవది— 'శకటౌ పద్ధతౌ'- అను స్థలము. ఇవి 'శకటి పద్ధతి' అను ఇకారాంత శబ్దముల సప్తమ్యేకవచనా తములు. ఇట "అచ్చఘేః" 7-3-119 అను సూత్రముచే ఘిసంజ్ఞకాఙ్గముకంటె బరమగు ఙి ప్రత్యయమునకు ఔకారాదేశమును, అంగమున కదాదేశమును విధింపబడినవి. తరువాత వృద్ధిసంధిచేత నా రూపము లేర్పడును.

ఇట నంగమున కదాదేశము ప్రవర్తించిన తరువాత,"అజాద్యతష్టాప్"— అని టాప్ అను స్త్రీ ప్రత్యయము ప్రాప్తించుచున్నది. దాని నీ పరిభాషచే వారింపవలెను. టాప్ప్రత్యయము ప్రవర్తించినను వృద్ధిచే ఆరూపములు నిష్పన్నములు కావచ్చునుగదా యని ప్రశ్నింప నవకాశము గలదు. కాని యపుడు పరత్వాంతరంగత్వములవలన యాడాగమమును, ఆమాదేశమును బ్రసక్తములయి 'శకటాయామ్' అని కావలసి వచ్చును.

విభక్త్యానంతర్యము నాశ్రయించి ప్రవర్తించిన అత్త్వము, తద్విఘాతకమగు స్త్రీ ప్రత్యయమునకు నిమిత్త మీ పరిభాషచే కాజాలదు.

ఇక మూడవ అనన్యథాసిద్ధ ప్రయోజనమును, 'ఇయేష' 'ఉవోష'— అను స్థలములందు కాననగును.

ఇవి 'ఇష' 'ఉష' ధాతువుల లిట్ప్రథమ పురుషైకవచనాంతములు— ఇ+ఇష్+అ, 'ఉ+ఉష్+అ'— అను ప్రక్రియలో గుణము ప్రవర్తించి, ఇ+ఏష్+అ, ఉ+ఓష్+అ, అని యేర్పడిన పిదప ధాతువు ఇజాది గురుమత్తయినది గావున "ఇజాదేశ్చగురుమతోఽనృచ్ఛః" 3-1-36 అను సూత్రముచే 'ఆమ్' అను ప్రత్యయము ప్రసక్తమగుచున్నది. అది వచ్చిన యెడల "ఆమః" 2-4-81 అను సూత్రముచే లిట్టుకు లుక్కు రావలసియుండును. అపుడు నిమిత్త విఘాతము లేదా నిమిత్తానంతర్య విఘాతము కలుగును.

కావున నట ఆమ్ప్రత్యయవారణ మీ సన్నిపాత పరిభాషకు మూడవ అనన్యథా సిద్ధప్రయోజనము.

## పరిభాషాదోషములు

ఇక నీ పరిభాష నాశ్రయించినందున గలుగు దోషములును పెక్కులగ పడుచున్నవి.

### వా॥ "తస్యదోషో వర్ణాశ్రయః ప్రత్యయో వర్ణవిచాలస్య"

వర్ణము నాశ్రయించి ప్రవర్తించిన ప్రత్యయ మావర్ణ నాశమునకు నిమిత్తమగుట లక్ష్యములం దగపడుచున్నది. అది యీ సన్నిపాత పరిభాషా రూపమగు లక్షణమున కతివ్యాప్తిరూపదోషము. అది యెట్లనగా,

'దాక్షిః' 'ప్లాక్షిః' అను స్థలములందు "అత ఇఞ్" 4-1-95 అను సూత్రముచే విహితమయిన ఇఞ్ప్రత్యయము, తన కాశ్రయమగు హ్రస్వాకారరూప వర్ణ విచాలమునకు నిమిత్తమగుచున్నది హ్రస్వాకారాశ్రయమగు నా ప్రత్యయము "యస్యేతిచ" 6-4-148 అను లోపమునకు నిమిత్తము కాగాదు.

ప్రత్యయమిట సన్నిపాత లక్షణము కాదే? సన్నిపాత మనగా నుభయాధిష్ఠానమగు సంబంధము. అది యిట లేదుగదా? అవిద్యమానమగు ప్రత్యయమిట నపూర్వముగ నుత్పాదింపబడుచున్నది గదా! అనిన,

అట్లైన అఙ్గసంజ్ఞ వర్ణనాశమునకు నిమిత్తము కాదు అని చెప్పనగును. అంగసంజ్ఞకు ప్రత్యయము నిమిత్తము. అంగసంజ్ఞ ప్రవర్తించినందున లోపము వచ్చును. కావున అంగసంజ్ఞాద్వారముగ ప్రత్యయమానంతర్యవిఘాతకమగు లోపమునకు నిమిత్తము కాకపోవలసి వచ్చునని భావము.

సన్నిపాతమనగా కేవల పౌర్వాపర్య సంబంధరూపమే కాదు. విశేషణ విశేష్య భావసంబంధమును సన్నిపాతమే. కాగా, ప్రాతిపదికమునకు అదంతత్వ సంబంధము వలన కలుగు ప్రత్యయము. ఆ అదంతత్వమునకు విఘాతమును గలిగించు లోపమునకు నిమిత్తము కారాదనియు జెప్పవచ్చును.

ఇంకొక దూషణవార్తికము. "ఆత్వం పుగ్విధేః క్రాపయతి" అనునది.

క్రాపయతి' అను రూపమున, "క్రీఙ్జీనాంణౌ" 6-1-48 అను సూత్రముచే 'డుక్రీఞ్ ద్రవ్యవినిమయే' అను ధాతువునందలి వృద్ధి ప్రయుక్తమగు ఐకారమునకు, ణిప్రత్యయము పరమగునపుడు ఆత్వము విధింపబడినది. తరువాత "అర్తిహ్రీవ్లీరీక్నూయీక్ష్మాయ్యాతాంపుఙ్ణౌ" 7-3-36 అను సూత్రముచే పుగాగమము ప్రవర్తించును. దానివలన అంగమునకును, ప్రత్యయమునకును గల సన్నిపాతమునకు విఘాతము కలుగుచున్నదిగదా!

తృతీయదోష నిరూపణ వార్తికము—

**వా॥ "పుగ్ హ్రస్వత్వస్యసాఽఽడదీదపత్"** అనునది.

'అదీదపత్'— అను లుజంత రూపమున, ణిచ్చును ఆకారమును నిమిత్తముగా గల పుగాగమము, ణౌచజీణ్యాది హ్రస్వమునకు నిమిత్తము కాకపోవును. హ్రస్వము వచ్చినయెడల వాని సన్నిపాతమునకు విఘాతము కలుగుచున్నది గదా!

**వా॥ త్యదాద్యకారష్టాబ్విధేః"** అనునది వేరొక దూషణ వార్తికము

'యా' 'సా' అను రూపములందు త్యదాద్యత్వము ప్రవర్తించిన తరువాత అదంతమగుటచే, "అజాద్యతష్టాప్" 4-1-4 అని టాప్ ప్రత్యయము స్త్రీత్వద్యోతకము ప్రవర్తించినది. అత్వమునకు నిమిత్తము విభక్తిప్రత్యయము. స్త్రీప్రత్యయము ప్రవర్తించిన తరువాత, ఆ విభక్తి ప్రత్యయము హల్ఙ్యాబ్భ్యాది సూత్రముచే లోపింపవలెను. ఈ పరిభాషవలన నట్లు లోపము రాకుండ బోవును.

**వా॥ "ఇడ్విధిరాకారలోపస్యయయివాన్"**-

'యయివాన్' 'తస్థివాన్' అను రూపములలో, 'యా' 'స్థా' అను ధాతువులకు లిట్టు, లిట్టుస్థానమున క్వసుప్రత్యయము. ద్విత్వము, అభ్యాస కార్యములు ప్రవర్తించిన పిదప 'యాయావస్' అనునవస్థలో, ధాతువు నాదంతత్వము వలన "వస్వేకాజాద్ఘసామ్" 7- -67 అను సూత్రముచే ఇడాగమమును, "ఆతోలోపఇటిచ" 6-4-64 అని ఆకారమునకు లోపమును గలిగినవి.

ఇపుడీ పరిభాషవలన, ఇడాగమవిధి ఆకారలోపమునకు నిమిత్తము కాకపోవలసివచ్చును. ఇడాగమమాకార నిమిత్తకముగదా. కావున నిదియు పరిభాషా దోషము.

**వా॥ "మతుబ్విభక్త్యుదాత్తత్వం పూర్వనిఘాతస్య"** అనునదియు దూషణాంతర వార్తికము.

'అగ్నిమాన్', 'వాయుమాన్' అను లక్ష్యములలో, "హ్రస్వనుడ్భ్యాం మతుప్" 6-1-176 అను సూత్రముచే అంతోదాత్తమగు హ్రస్వాంతముకంటె బరమగు మతుప్ప్రత్యయమునకు విధింపబడిన ఉదాత్తస్వరము ప్రవర్తించినది. ఒక పదమునందొకయచ్చు ఉదాత్తము కాగా నితరాచ్చులను నుదాత్తములగునని "అనుదాత్తం పదమేకవర్జనమ్" 6-1-158 అను సూత్రము బోధించుచున్నది. కాగా అగ్నిశబ్దపు ఇకారము అనుదాత్తము. ఉదాత్తమగు నికారమును నిమిత్తముగా నాశ్రయించి ప్రవర్తించిన మతుబుదాత్తత్వము దానికి భంజకమగు శేషనిఘాతకు నిమిత్తము కారాదు.

ఇటులనే "అంతోదాత్తాదుత్తర పదాదనిత్య సమాసేన్యతరస్యామ్" 6-1-169 అను సూత్రముచే విధింపబడిన యంతోదాత్తము, ఉదాత్తనిమిత్తకమైనది యుదాత్తత్వమునకు భంజకమగుట యుపజీవ్యవిరోధము. పై సూత్రము నిత్యాధికార విహితముకాని సమాసమునందలి యుత్తరపదము, ఏకాచ్చును నంతోదాత్తమును నయినపుడు, అట్టిదానికంటె పరమగు తృతీయాది విభక్తికి వికల్పముగా అంతోదాత్తమును విధించుచున్నది. 'పరమవాచా' ఇత్యాదు లుదాహరణములు. ఉదాత్తమైన విభక్తి ప్రత్యయము శేషనిఘాతకు నిమిత్తము.

**వా॥ "నదీహ్రస్వత్వం సంబుద్ధిలోపస్య"**- అనునదియు వేరొక దూషణ వార్తికము.

నదీహ్రస్వత్వమనగా "అమ్బార్థనద్యోర్హ్రస్వః" 7-3-107 అను సూత్రముచే విధింపబడిన హ్రస్వము, అయ్యది సంబుద్ధి నిమిత్తకము కావున సంబుద్ధి లోపమునకు నిమిత్తము కాకపోవలసివచ్చును.

ఎచ్చట ?— 'నది' 'కుమారి' 'కిశోరి' 'బ్రాహ్మణి' 'బ్రహ్మబంధు'- ఆను స్థలములందు.

ఈ సంబుద్ధ్యంతములందు, "ఏఙ్హ్రస్వాత్సంబుద్ధేః" 6-1-69 అను సూత్రముచే సంబుద్ధికి లోపము, హ్రస్వాంతత్వప్రయుక్తమైనది రాకపోవును.

పోనిండు. ఙ్యంతత్వ ప్రయుక్తమైన లోపము రావచ్చును. అనగా "హల్ఙ్యాబ్భ్యోదీర్ఘాత్సుతిస్యపృక్తంహల్" 6-1-68 అను లోపము రానగును. ఆ సూత్రమున 'దీర్ఘాత్' అను పదము ఙీ-ఆప్పులకు విశేషణము కాదు. అది స్వతంత్ర నిమిత్తము. అనిన, కాదుకాదు. అది ఙ్యాబంతవిశేషణమే. అందువలన హ్రస్వాంతములందు ప్రవర్తింపదు.

ముందు హ్రస్వమును ప్రవర్తింపజేయవలెనా? లేక సంబుద్ధిలోపమునే చేయవలెనా యను విషయమును విచారింపవలెను. విచారింపగా నేమి తేలును ? పరమగుటవలన హ్రస్వత్వమే కర్తవ్యము. అనిన,

అట్లు కాదు. సంబుద్ధిలోపము నిత్యము. హ్రస్వమునకు బూర్వమును, హ్రస్వోత్తరము స్థానివద్భావముచేతను ప్రవర్తించు నవకాశము గలదిగాన, కృతాకృత ప్రసంగిగదా యది!

సంబుద్ధిలోపము నిత్యము గాదు. హ్రస్వానంతరమది ప్రాప్తింపదు. సన్నిపాత పరిభాషవలన దానికి కృతాకృత ప్రసంగము లేదు. ఇట్లవి సన్నిపాత పరిభాషాదోషములు.

ఈ దోషములు, ప్రయోజనముతో సమసంఖ్యాకములు. ఇంకను దోషము లుండవచ్చునుగాన నవి ప్రయోజనములకంటె నధికములనినను నన వచ్చు. అందువలన పరిభాష నాశ్రయించుట నిరర్థకమని యాక్షేప్త యుప సంహారము.

కాని, దోషములుండునని పరిభాషలను జేయకుండుటయు లక్షణములను జెప్పకుండుటయు యుక్తమగునా? సన్యాసులకు భిక్షను బెట్టవలసియుండునని వంటజేయుటయే మానుదురా? వ్యవసాయపు పొలములలో విత్తులను నాటిన, మృగములు పాడుచేయునని, విత్తులను జల్లుటయే మానుదురా? అదియును గాక, దోషము లన్నియు సమగ్రముగ పరిగణితములు. అనగా అంతకు మించి లేవనుట. ఇక ప్రయోజనములు ఉదాహరణమాత్రముగా చూపబడినవి. అనగా నవి యధికముగా నుండదగును.

ఎందువలననగా, దోషములకు లక్షణ ముండదుగదా! కావున నవి ఉప లక్షకములు గావు. కాగా తత్తత్ప్రయోజనసిద్ధికై ఈ పరిభాష అవశ్యాశ్రయ ణీయము. ఇక దోషములును గలవుగదా యనిన, వానికి తగిన ప్రతి విధాన ములను యోజింపవలెను. అనగా జ్ఞాపకాదులచే వానిని వారింపవచ్చునని భావము.

'కన్మేజంతః'— అను సూత్రమునకు ఆంధ్రవివర్తము ముగిసినది.

## ॥అవ్యయీభావశ్చ॥ 1-1-40

**వా॥ "అవ్యయీభావస్యావ్యయత్వే ప్రయోజనం లుఙ్ముఖస్వరోప చారాః"** అను వార్తికను, అవ్యయీభావ సమాసమునకు అవ్యయమను సంజ్ఞ నీ సూత్రము విధించుటకు ప్రయోజనములను జెప్పుచున్నది.

అందు లుక్కు— "అవ్యయాదాప్సుపః" 2-4-82 అని విధింపబడినది.

'ఉపాగ్ని' అనునది సమీపార్థమున నవ్యయీభావము. 'అగ్నిసమీపమున' అని యర్థము. ఇట సుప్ప్రత్యయమునకు లుక్కు రావలెను. ఇది అవ్యయీ భావమును నవ్యయమైననే సిద్ధించును.

'ప్రత్యగ్ని' అనునదియు నుదాహరణాంతరము.

ఇట, "లక్షణేనాభిప్రతీ ఆభిముఖ్యే" 2-1-14 అను సూత్రముచే అభిముఖ్య ద్యోతకములగు అభి, ప్రతులకు సుబంతముతో సమాసము విధింపబడుటచే నిది యవ్యయీభావసమాసము. ఇటగూడ నవ్యయత్వమువలన సుప్పుకు లుక్కు సిద్ధించినది.

ముఖస్వరమను ప్రయోజనమున కుదాహరణములు- 'ఉపాగ్నిముఖః' 'ప్రత్యగ్నిముఖః' అనునవి.

. . . "ముఖంస్వాఙ్గమ్" 6-2-167 అను సూత్రము స్వాంగవాచకమగు ముఖ శబ్దమున కంతోదాత్తమును విధించును. 'గౌరముఖ' ఇత్యాదు లుదాహరణములు. ఆస్వరము 'ఉపాగ్నిముఖః', 'ప్రత్యగ్నిముఖః' ఇత్యాదులందు గూడ ప్రవర్తింపవలసి యుండ నట నది సమ్మతము కానందున, "నావ్యయదిక్శబ్ద గోమహత్ స్థూలముష్టి పృథువత్సేభ్యః" 6-2-168 అను సూత్రముచే నిషేధింపబడినది. కావున ఉచ్చైర్ముఖః అనుచోట ప్రవర్తించినట్లే, 'ఉపాగ్నిముఖః' ఇత్యాదులందును ప్రవర్తింపకుండుటకు, అవ్యయీభావమున కవ్యయత్వ మావశ్యకము.

ఉపచారముగూడ నిషేధ్యముగా ప్రయోజనము. ఉపచారమనగా "అతః కృకమికంస కుంభపాత్ర కుశాకర్ణీష్వనవ్యయస్య" 8-3-46 అని విధింపబడిన విసర్గస్థానిక సత్వము

అది 'స్వఃకారః' అనుచోట ప్రవర్తింపనట్లు 'ఉపపయఃకారః' అను నవ్యయీభావపూర్వపదకమునందుగూడ ప్రవర్తింపకుండుట యిష్టముగాన దత్సిద్ధికొరకును అవ్యయీభావమున కవ్యయత్వ మావశ్యకము. ముఖస్వరోపచారములు ప్రయోజనమనిన, మశకార్థముధూమమనునట్లు వానిని వృత్తి ప్రయోజనమని భావము.

ప్రయోజనము లీ మూడు మాత్రమేనా? లేక వీని నిర్దేశ ముదాహరణ మాత్రమని తాత్పర్యమా?

ఇది పరిగణనమే. ప్రయోజనము లీ మూడు మాత్రమే.

ఇతర వైయాకరణులుగూడ నిది పరిగణనమను తాత్పర్యమునే సూచించుచున్నారు—"యదన్యదవ్యయీభావస్యావ్యయకృతం ప్రాప్నోతి తస్య ప్రతిషేధోవక్తవ్యః" అని ఋష్యంతర వచనము గలదు. అచట భేద ప్రతియోగులుగ నీ మూడే చూపబడినవి.

ఏతదన్యమగు నవ్యయకార్యమేమి? పరాఙ్గవద్భావము.

స్వరవిషయములో, సుబంతము, ఆమంత్రితము పరమగునపుడు పరాంగము వంటి దగునని "సుబామంత్రితేపరాంగవత్స్వరే" అను సూత్రము బోధించుచున్నది. పరాంగమువంటి దగుననిన, పరపదముయొక్క శరీరమున నేకీభవించిపోవునట్లగుననుట.

"శుభస్వతీ" అని యుదాహరణము. ఇట 'శుభః'యనునది షష్ఠ్యంతము. దీనికి పరాంగవద్భావము వలన, "ఆమంత్రితస్యచ" 6-1-198 అను సూత్రముచే ఆద్యుదాత్తత్వము కలిగినది.

"ఉచ్చైరధీయానః" "నీచైరధీయానః" అను స్థలములందు పరాంగవద్భావము సమ్మతముగాదు. అందుకొరకు 'అవ్యయానాం న' అని నిషేధము

చెప్పబడినది. ఆ నిషేధము అవ్యయీభావ సమాసము గూడ నవ్యయమగుటచే "ఉపాగ్న్యధీయానః" అనుచోగూడ ప్రాప్తించుచున్నది. తద్వారణము పరిగణనమునకు ప్రయోజనము. ఇట పరాంగవద్భావమిష్టముగాన నవ్యయీభావమున కవ్యయత్వమిట సమ్మతము గాదు.

పరిగణనము కాని పక్షమున నింకను దూషణము లగపడుచున్నవి. "అవ్యయ సర్వనామ్నామకచ్ప్రాక్టేః" 5-3-71 అను సూత్రమవ్యయాదుల కకచ్ప్రత్యయమును విధించుచున్నది. అందు అవ్యయోదాహరణములు, 'ఉచ్చకైః' 'నీచకైః' అనునవి. అవ్యయీభావము, అకజ్విషయమునగూడ నవ్యయమయి నచో, 'ఉపాగ్నికమ్' 'ప్రత్యగ్నికమ్' అనుచోటగూడ నది ప్రాప్తించిన 'ఉపాగ్నకి' 'ప్రత్యగ్నకి' అని రూపములు కావలసియుండును. అట్లు కాకుండుటయు పరిగణనమునకు ప్రయోజనము.

'దోషామన్యమహః' 'దివామన్యా రాత్రిః'— అనునవి ఖశ్ప్రత్యయాంతములు. 'తనను రాత్రిగ దలంచు పగలు' అనియు 'తనను పగటిగ భావించు రాత్రి' అనియు నర్థము. ఇట, పూర్వపదమున ముమాగమమును వారించుటకు "ఖిత్యనవ్యయస్య" 6-3-66 అను సూత్రమునుండి 'అనవ్యయస్య' అను పదమును "అరుర్ద్విషదజంతస్యముమ్" అను సూత్రములోని కనువర్తింపజేసి అవ్యయమునకు ముమాగమము వారింపబడినది. పరిగణనము లేనిచో 'ఉపకుంభమ్మన్యః' 'ఉపమణికమ్మన్యః' అనుచోటగూడ ఆ నిషేధము ప్రాప్తించును. అది అసమ్మతము

"అస్యచ్వౌ" 7-4-32 అను సూత్రము పరమగునపుడు, అకారస్థానమున నీకారమును విధించుచున్నది. 'బ్రహ్మీభవతి' 'కృష్ణీకరోతీత్యాదు లుదాహరణములు. ఆ ఈత్వము, 'దోషాభూతమ్' (అహః) 'దివాభూతా' (రాత్రిః) ఇత్యాదులందు ప్రవర్తింపకుండుటకు, ఆ సూత్రమున నవ్యయములకు ప్రతిషేధము విధింపబడినది. అయ్యది 'ఉపకుంభీభూతమ్' 'ఉపమణికీభూతమ్' ఇత్యాదులందు ప్రవర్తించుట సమ్మతము గాదు. కావున, అవ్యయీభావమున కవ్యయత్వ విధాన ప్రయోజనముల పరిగణన మావశ్యకము.

## సూత్రప్రత్యాఖ్యానము

పరిగణనము నంగీకరించినచో అవ్యయీభావమున కవ్యయసంజ్ఞ వ్యర్థమగునే ?

ఎందుకు వ్యర్థమగును ? లుఙ్ముఖస్వరోపచారములు ప్రయోజనములు కలవే? అనిన నవి ప్రయోజనములు కావు. చూడుడు.

- అవ్యయీభావమున కవ్యయత్వము జ్ఞాపకమువలన సిద్ధించును.

"నావ్యయీభావాదతోఽమ్త్వపంచమ్యాః" 2-4-83 అను సూత్రము అదంతా వ్యయీభావము నకంటె పరమగు సుప్పునకు లుక్ప్రతిషేధమును బోధించు చున్నది. అవ్యయీభావముగూడ నవ్యయమయిననేగదా లుక్ ప్రాప్తి. ప్రాప్తి కానిచో నిషేధము వ్యర్థము. కావున నిషేధ విధానరూపమగు నాచార్య ప్రవృత్తి, అవ్యయీభావముకంటె బరమైన సుప్పులకు లుక్కు వచ్చునని జ్ఞాపన చేయును. కాన లుక్కు ప్రయోజనము కాదు.

ఇక ఉపచారము— ఉపచారమనగా సత్వము. తద్విధాయకము "అతఃకృకమికంస" ఇత్యాదిసూత్రము. అందు, 'అనవ్యయస్య' అను విశేష ణము 'స్వఃకామః' అనుచోట సత్వమును వారించినట్లు అందనువృత్తమయిన, అనుత్తరపదస్థస్య అనునది 'ఉపపయఃకారః' అనుచో విసర్గ ముత్తరపదస్థమగు టచే దానిని నివర్తింపజేయును. కావున నదియు ప్రయోజనము కాదు.

ఇట్లు ప్రయోజన ద్వయమన్యథాసిద్ధము. కాగా ముఖస్వరమొక్కటియే ప్రయోజనము కావలె. ఒకేఒక ప్రయోజనముకొరకు సామాన్య లక్షణమును రచించుట యావశ్యకము గాదు అంతమాత్రమే ప్రయోజనమున్న, ముఖస్వర నిషేధకమైన 'నావ్యయదిక్శబ్దేత్యాది' సూత్రమునే 'నావ్యయావ్యయీభావ దిక్శబ్ద' ఇత్యాదిగా బఠించి, అవ్యయీభావముకంటె బరమయిన ముఖశబ్దమునకు అంతోదాత్తమును వారింపవచ్చును. సూత్రముతో బనిలేదు.

"అవ్యయీభావశ్చ" అను సూత్రమునకు వివర్తము ముగిసినది.

అవ్యయసంజ్ఞా ప్రకరణమును అవసితము.

## "శిసర్వనామ స్థానమ్" "సుడనపుంసకస్య" 1-1-41-42

'శి' అను జస్‌శస్సుల ఆదేశమునకు 'సర్వనామస్థానమ'ని సంజ్ఞ యగును. "స్వౌజసమౌట్" అను సూత్రమునందలి స్వాది పంచప్రత్యయములు గూడ సర్వనామస్థాన సంజ్ఞకములగును ఇ నాస్వాదిపంచకము నపుంసక ప్రాతిపదిక సంబంధి యయినది సర్వనామ స్థానసంజ్ఞకము కాదు అని అనపుంసకస్య అను పదమున కర్థము.

ఈ విధముగ నున్న సూత్ర సన్నివేశమునందు, 'కుండాని తిష్ఠంతి' 'వనాని తిష్ఠంతి' అనుచోట ప్రథమాబహువచనమయిన జస్సుస్థానమున వచ్చిన 'శి' అను నాదేశమును స్వాదిపంచవచనములలో న తర్భూతమగుటవలన ప్రతి షేధము ప్రాప్తించుచున్నది. 'సుట స్త్రీపుంసయోః' అని యా సూత్రము నిర్దేశింపబడియుండిన నీ దోష ముండెడిది కాదు.

మరియు నిపుడు 'అనపుంసకస్య' అను సమాసము అసమర్థ సమాస మగుచున్నది. 'నపుంసకస్యన' అని వాక్యభేదమును కర్తవ్యము. నక్షాలకు

క్రియతో నన్వయముగదా కర్తవ్యము. సుట్టు సర్వనామస్థానమగును. అది నపుంసక సంబంధియైన కాదు అని యర్థము. కావున నది ప్రసజ్య ప్రతిషేధార్థకమను తాత్పర్యముతో వార్త్తికకారుడు,

**వా॥ "శి సర్వనామస్థానం సుడనపుంసకస్యేతిచేత్ జసిశి ప్రతిషేధః"** అనియు,

**వా॥ "అసమర్థ సమాసశ్చ"** - అను వార్తికద్వయముచే పూర్వపక్షము చేసి,

**వా॥ "నాప్రతిషేధాత్"** -

**వా॥ "అప్రాప్తేర్వా"**— అను వార్తికద్వయముచే పరిహారమును రచించెను.

జసాధారమగు 'శి' అనుదానికి సర్వనామ సంజ్ఞాప్రతిషేధ ప్రాప్తిలేదు. ఏలయన 'నపుంసకమునకు రాదు' అని యిట్లు ప్రసజ్య ప్రతిషేధము ఇట తాత్పర్య విషయము గాదు. 'నపుంసకభిన్నమైన ప్రాతిపదికమునకు సంబంధించిన స్వాది పంచవచనములు సర్వనామ స్థానములు అగును' అనియే సూత్రార్థము. నపుంసక ప్రాతిపదిక విషయమున నీ సూత్రమునకు వ్యాపారము లేదు. అట, నే సూత్రాంతరముచేతనైనను నా సంజ్ఞ ప్రాప్తించిన నది రావచ్చును. పూర్వసూత్రమగు 'శి సర్వనామస్థానం' - అను సూత్రముచే ప్రాప్తించునుగాన 'కుండాని' 'వనాని' అను జసంతములందది సిద్ధించును.

లేదా— ప్రసజ్య ప్రతిషేధమే నఞర్థమనినను దోషము లేదు. 'కుండాని' 'వనాని' అనుచోట, జసాదేశమగు 'శి' ప్రత్యయమునందు 'అనపుంసకస్య' అను ప్రతిషేధమునకు ప్రాప్తియే లేదు. విధి ప్రతిషేధము లెచ్చటనైనను అనంతరమునకే ప్రవర్తించునుగాని వ్యవహితమునకు కావు.'అనపుంసకస్య' అను నీ ప్రతిషేధము స్వానంతరమగు 'సుట్' అను ప్రాప్తికే ప్రతిషేధముగాని తత్పూర్వమగు 'శి సర్వనామస్థానమ్' అను ప్రాప్తి నది నిషేధింపదు. కాబట్టి దానిచే ప్రవర్తింపవచ్చును.

ఈ ప్రాప్తి, పూర్వప్రాప్తిని బాధింపదా యనిన నీ ప్రాప్తి తాను ప్రతిషిద్ధమగుటచే పూర్వప్రాప్తిని బాధించుట కుత్సహింపదు. అనగా 'శి సర్వ నామ స్థానమ్' అను ప్రాప్తిని 'సుట్' అను ప్రాప్తి,పరత్వమువలన బాధించును. దానిని గూడ, 'అనపుంసకస్య' అను ప్రతిషేధము బాధించును. కావున 'జస్ స్థానికమగు 'శి' కి సర్వనామ సంజ్ఞ ప్రాప్తింపదు' అని శంకింపగా, అపవాద విషయమును బరిహరించియే యుత్సర్గము పవర్తించునుగాన, 'సుట్' అను ప్రాప్తి అచట ప్రవర్తింపదు. తాను ప్రవర్తించిన గదా ఆ లక్ష్యమునసే

ప్రాప్తించు వేరొకదానికి తాను బాధకమగుట? కావున, "సకృద్గతౌ విప్రతిషేధే యద్బాధితం తద్బాధితమేవ" అను న్యాయమున కిట ప్రసక్తి లేదని తాత్పర్యము.

ఇక 'అనపుంసకస్య' అనునది అసమర్థ సమాసమని అపూర్వముగ నంగీకరింపవలసియుండునని యంటిరే? కానిండు. అయిననేమి? అసమర్థ సమాసములు లోకమున నెన్నియో గలవు. వానికెల్ల సాధుత్వము నీ సూత్రమే బోధించును. కాకున్న, "సుట్ స్త్రీపుంసయోః" - అని సూత్రమును రచింపవచ్చును గదా! మాత్రాధిక్యమున్నను, స్పష్ట ప్రతిపత్తి ఆన్యాసమున గలదు. అట్టియెడ నట్లు చేయక 'అనపుంసకస్య' అని సూత్రమున నిర్దేశించుటయే అసమర్థ సమాసముల సాధుత్వమునకు జ్ఞాపకము.

"అసూర్యంపశ్యాని ముఖాని"

"అపునర్గేయాః శ్లోకాః"

"అశ్రాద్ధభోజీ బ్రాహ్మణః" ఇత్యాది బహు ప్రయోగములు దానివలన సాధువులని గ్రహింపనగును.

'శి సర్వనామ స్థానమ్' 'సుడ నపుంసకస్య' - అను సూత్రముల

ఆంధ్ర మహాభాష్య వివర్తము ముగిసినది.

సర్వనామ స్థాన సంజ్ఞాప్రకరణమును ముగిసినది.

## ॥నవేతి విభాషా॥ 1-1-43

న, వా, ఇతి, విభాషా అని పద విభాగము. న శబ్దార్థము నిషేధము, వా శబ్దార్థము వికల్పము. న, వా, అనునవి అర్థపరములని ఇతి శబ్దము తెలియజేయును. వానికి విభాషా అని సంజ్ఞ అని యర్థము.

## ॥ అర్థసంజ్ఞాస్థాపనాధికరణము ॥

**వా॥ "నవేతి విభాషాయా మర్థసంజ్ఞాకరణమ్"** అనునది యాక్షేప వార్తికము. నవా శబ్దార్థమునకు 'విభాషా' అని సంజ్ఞ యగునని చెప్పవలసి యుండును.

అట్లు చెప్పుట కేమి ప్రయోజనము ? అనిన,

**వా॥ "శబ్దసంజ్ఞాయాం హ్యర్థా సంప్రత్యయో యథాన్యత్ర"**

శబ్దమున కిది సంజ్ఞయైనచో, వీధి ప్రదేశములందు శబ్దములే ఉపస్థితము లగును. అర్థోపస్థితి కలుగకుండును.

యథాన్యత్ర=ఇతరత్రవలె. వేరొకచో నెచ్చట ?

''దాధాఘ్వదాప్'' 1-1-19 'తరప్తమపౌఘః'' 1-1-21 అను ఘు, ఘ సంజ్ఞలు దాధారూపములగు ధాతువులకును, 'తరప్' 'తమప్' అను ప్రత్యయములకును చేయబడినవి. అవి శబ్దములుగాన, ఘు సంజ్ఞాప్రదేశములగు ''ఉపసర్గే ఘోః కిః'' 3-3-92 ఇత్యాద్యులందును, ఘ ప్రదేశమగు ఘ రూపేత్యాది 6-3-43 సూత్రమునందును దా, ధా, తర, తమ అను శబ్దములే ఉపస్థితములగుచున్నవి కాని వాని యర్థ ముపస్థితము కాలేదు.

అట్లైన "నవార్థో విభాషా" అని చెప్పవలెనందువా? అక్కరలేదు.

**వా॥ "ఇతి కరణోర్థ నిర్దేశార్థః"**

ఇతి అను పద మర్థనిర్దేశ తాత్పర్యముతో చేయబడినది. 'క్రియతే ఇతి కరణః' అను కర్మ వ్యుత్పత్తిచే శబ్దము అని యర్థము. ఇతిశ్చా సౌకరణశ్చ అని సమాసము. ఆ ఇతిశబ్దము దాని యర్థమును నిర్దేశించును.

ఇతిశబ్దమాత్రముచే నది లభించునా? అధికముగ నిది కే శబ్దము నక్కర లేదా? తప్పక లభించును. ఎట్లనగా,

**వా॥ "లోకతః"** అని సమాధాన సాధక వార్తికము. లోకమునందు "గౌరిత్యయమాహ" అని ప్రయోగింతురు. ఇతడు 'గోవు' అని యనెను అని యర్థము.

అట 'ఇతి' అనునది గోశబ్దమును స్వపదార్థమునుండి వేరుపరచును. దాని స్వపదార్థము, దాని యర్థమగు గోవు. ఇట గోశబ్దమే ఉచ్చరింపబడినది గాని యర్థమగు గోవ్యక్తి కాదు.

అట్లది స్వపదార్థమునుండి ప్రచ్యుతమై—అనగా అర్థపదార్థకతను విడచి శబ్దపదార్థక మగుచున్నది.

అట్లే న, వా శబ్దస్థలమునందుగూడ ఇతిశబ్దము పదార్థ విపర్యాసమును జేయును.

'నవా' అను శబ్దము "స్వంరూపం శబ్దస్యా శబ్దసంజ్ఞా" 1-1-68 అను సూత్రముచే శబ్దమే పదార్థముగాగలది యగుచున్నది. దానికి ప్రక్కననున్న ఇతిశబ్దము, ఆ శబ్దమును స్వపదార్థము నుండి తొలగించును. అట్లు ప్రచ్యుతమై 'నవా' శబ్దము, లౌకికార్థములగు నిషేధ వికల్పములను బోధించును. కాని, ఆ నిషేధ వికల్పములకు 'విభాషా' అని సంజ్ఞయని సిద్ధించును. కావున వేరుగా నర్థ సంజ్ఞాకరణ మనావశ్యకమని భావము.

## ॥ సమాన శబ్దసంజ్ఞానిరసనాధికరణము ॥

ఈ యధికరణమున

**వా॥ "సమానశబ్ద ప్రతిషేధః" అని ఆక్షేపవార్తికమును,**

**వా॥ "నవా విధిపూర్వకత్వాత్ ప్రతిషేధసంప్రత్యయో యథాలోకే"**

అని సమాధాన వార్తికమును, రెండు వార్తికములు.

సమాన శబ్దములకు ప్రతిషేధము కర్తవ్యము, అని సామాన్యముగ వార్తికమున కర్థమగుచున్నది. ఇతికరణ మర్థనిర్దేశార్థమని నిర్ణయించుట వలన శబ్దములకీ సంజ్ఞాప్రసంగము లేదు. కావున సమానః శబ్దః యేషాంతే= సమాన శబ్దాః. ఏ యర్థములకు వాచకమగు శబ్దము తుల్యముగ నుండునో యా అర్థములు సమాన శబ్దములు అగును. అపుడు 'నూతనమైనది' అను నర్థముగల నవా శబ్దార్థము గూడ 'నవా కుండికా' 'నవా ఘటికా' అనుచో విభాషా సంజ్ఞా సంజ్ఞి కావలసివచ్చును.

అట విభాషాసంజ్ఞ ప్రవర్తించిన నేమి యగును? అపుడు "విభాషా దిక్సమాసే బహువ్రీహౌ" 1- -27 అను సూత్రముచే విధింపబడిన దిగ్బహువ్రీహి యగు శబ్దమునకు, దక్షిణ పూర్వస్యాం (శాలాయామ్) అను చోట క్రొత్తగా నిర్మితమైన శాలలోనని యర్థము కావలసివచ్చును.

ఫలయన నపుడు, "విభాషా దిక్సమాసే బహువ్రీహౌ" అను సూత్రమునకు దిగ్వాచకముల బహువ్రీహి నూతనార్థక మగునపుడు సర్వనామ సంజ్ఞ కలది యగునని యర్థమగును. బహువ్రీహి ఘటక పదముల యర్థమగు దిక్కులకు నవత్వ పురాణత్వములు సంభవింపవు గాన సమాసమునకే విభాషాయనునది విశేషణమగును. ఈశాల దక్షిణ పూర్వ, అనగా ఆగ్నేయి. అందును నూతనమైనది యనునర్థమున, సంజ్ఞ కలుగును. అపుడిది నిత్య సంజ్ఞయే. 'నబహువ్రీహౌ' అను నిషేధము నిది బాధించును. ప్రత్యగ్రత్వము సర్వనామ సంజ్ఞా కార్యవ్యంగ్యమగును. అని ఆక్షేపవార్తిక భావము.

ఇక సమాధాన వార్తికమున కిది తాత్పర్యము :

ప్రతిషేధమునకు పూర్వము విధి యుండవలెను గదా! ముందు దేనినైనను విధించి, పిదప 'నవా' = అనగా లేదా అందురు. అట 'నవా' యనునది ప్రతిషేధమును బోధించునని తెలియును. ఇది సంజ్ఞాసూత్రము. ప్రదేశ వాక్యార్థ పర్యాలోచనము చేసి దీని యర్థమును నిర్ణయింపవలెను. ప్రదేశము లందు సర్వనామ సంజ్ఞాది కార్యముల నంతకు పూర్వము విధించి విభాషాశబ్ద ముచ్చరింపబడుచున్నది. అది నవార్థమును దెలియజేయుచు

లోకమునందువలెనే నిపాతార్థమునే బోధించునుగాని ప్రత్యగ్రమను వర్థమును బోధింపదు. లోకమునందు "గ్రామో భవతా గంతవ్యో నవా" అని ప్రయోగింతురు ఊరికి నీవు వెళ్లవలసి యుండునని ముందుగ జెప్పుటచే, తరువాత 'నవా' యనునది, 'పోనిమ్ము అక్కరలేదు' అను నర్థమునే బోధించును అని తెలియవచ్చును. కాగా నవా శబ్దము ప్రతిషేధవాచియే గాని ప్రత్యగ్రవాచి యట కానేరదు, అనిన అట్లుగాదు. అట ప్రత్యగ్రార్థావగతి లేకుండుటకు గారణము కలదు నీవు గ్రామోభవతాగంతవ్యః అని పిదప 'నవా' అని విలింగముగ నిర్దేశించుచున్నావు. అట్లుగాక "గ్రామోభవతాగంతవ్యో నవః" యనుము. అపుడు నూతనార్థ ప్రతీతియే కలుగును.

లౌకిక ప్రయోగములందు సమాన లింగక నిర్దేశము లుండిన నుండుగాక. శాస్త్రమున నెచ్చటను సమానాధికరణముగ సమాన లింగనిర్దేశ ముండుట మే మెరుగము కావున నవా పదార్థ వాచకమగు విభాషాపదమువలన గూడ ప్రత్యగ్రార్థ ప్రతీతి కవకాశము లేదు.

మరియు ప్రయోక్తకు తాను ప్రయోగించు వాక్యమునందలి పదముల యన్వయము విషయమున కామచారము=స్వేచ్ఛ యుండును. "యవాగూర్భవతా భోక్తవ్యా నవా" అను వాక్యమును జూడుము. అట యవాగూ శబ్దమును భుజితో నన్వయించి భుజిని నవా శబ్దముతో సంబంధింపజేసిన, 'నభోక్తవ్యా' అని యర్థమగును. దానినే యవాగూ శబ్దముతో సంబంధింపజేసిన నూతనమగు గంజిని నీవు భక్షింపదగునని అర్థమగును. 'విభాషా దిక్సమాసే' అను సూత్రమున, విభాషాగ్రహణముచే సర్వాదులను సంబంధింపజేసి అట సర్వాదులు విభాషగా సర్వనామములగునని యర్థమును చెప్పుము. దానిని క్రియతో నన్వయించి, అట సర్వాదులు విభాషగా సర్వనామము లగును అని వివక్షింతుము. విశేషావగతి హేతువులలో నొకటియగు 'సామర్థ్య' మను దానిచే నర్థనిర్ణయమును జేయనగును. కాన ప్రతిషేధార్థావగతియే కలుగును. కాగా సమాన శబ్ద ప్రతిషేధ మనావశ్యకము అని భావము.

## విధ్యనిత్యత్వ సాధనము

ఈ సంజ్ఞా ప్రదేశములలో నొకటి "విభాషాశ్వేః" 6-1-30 అను విధి. అది 'శ్వి' ధాతువునకు లిట్టు పరమగునపుడును యఙ్ప్రత్యయము పరమగునపుడును సంప్రసారణమును విభాషగా విధించునది. విభాష అనగా 'నవా' అను శబ్దము నర్థమగు ప్రతిషేధము అది ప్రతిషేధ వాచకమగు నేకనిపాతము కాగా, శ్విధాతువునకు "వచిస్వపియజాదీనాం కితి" 6-1-15 అను సూత్రముచే కిత్తులు పరమగునపుడు ప్రాప్తమగు సంప్రసారణము లిట్టులో ప్రవర్తింపదు అని యా సూత్రమున కర్థమగునే గాని యది వికల్పముగా ప్రవర్తించునను నర్థము సిద్ధిం

పదు. అపుడు శుశావ, శుశువతుః, శుశువుః అనియు శిశ్వాయ, శిశ్వియతుః, శిశ్వియుః అనియు ద్వివిధ రూపములు సిద్ధించుట యెట్లు? అనునభిప్రాయముతో వార్తికకారుడు.

**వా॥ 'విధ్యనిత్యత్వం నోపపద్యతే ప్రతిషేధ సంజ్ఞాకరణాత్'** అను వార్తికముచే నాక్షేపించెను. విధ్యనిత్యత్వమనగా వికల్పము. విభాషాసంజ్ఞ ప్రతిషేధమునకే గనుక ప్రతిషేధమే సిద్ధించునుగాని వికల్పము సిద్ధింపదని యాక్షేప తాత్పర్యము.

**వా॥ "సిద్ధంతు ప్రసజ్య ప్రతిషేధాత్"** అని సమాధానము. వికల్పము సిద్ధించును. ఎట్లన. ప్రసజ్య = విధించి, నిషేధించుటవలన. అనగా 'విభాషాశ్వేః' 6-1-30 ఇత్యాదులందు, పిద్విషయమున, నిషేధముచే విధి యనుమానింప బడును. ప్రతిషేధము ప్రాప్తిపూర్వకము గదా! విధిని గల్పింపకున్న నిషేధము వ్యర్థమగును. తదనుపపత్తిచే పిద్విషయమున సంప్రసారణప్రాపక శాస్త్రమును గల్పించి, దానిచే ప్రాప్తి నుపపాదించి ప్రతిషేధించుటవలన వికల్పము సిద్ధించునని భావము.

మరల, **వా॥ "విప్రతిషిద్ధంతుభవతి"** అని వార్తికకర్త యాక్షేపము, ఒకదానిని విధించి, వెనువెంటనే నిషేధించుట విప్రతిషిద్ధమగును గదా, ఒక్క సారిగానేక విషయమున విధిప్రతిషేధములు పరస్పర విరుద్ధములు. ఏ అభిప్రాయముతో భావప్రసంజనము చేయబడుచున్నదో, ఏ అభిప్రాయముతో దన్నివృత్తియో తెలియబడుటలేదని తాత్పర్యము.

**వా॥ "నవాప్రసంగ సామర్థ్యా దన్యత్ర ప్రతిషేధ విషయాత్"** అని సమాధాన వార్తికము. కాలాంతరమున ప్రతిషేధమునకు విషయముగానిచోట, సామర్థ్యము వలన విధి ప్రవర్తించును. ప్రతిషేధము వ్యర్థముకాకుండుటకై కాలాంతరమున వచ్చుటనే ప్రతిషేధమును బ్రవర్తించును. కావున, సామర్థ్యము వలన విధి ప్రతిషేధములకు పర్యాయత సిద్ధించును, 'ప్రసంగ సామర్థ్యాత్' అనుచోట బ్రసంగమనగా, ప్రసజ్యతే ఇతి ప్రసఙ్గః అను వ్యుత్పత్తిచే విధి యని యర్థము.

సరియేకాని అప్రాప్తవిభాషాస్థలములలో నిషేధమునకు విధిని గల్పించు శక్తియుండును గాన విధియు, ప్రతిషేధ సామర్థ్యమువలన ప్రతిషేధమును సిద్ధించుననవచ్చును. కాని ప్రాప్త విభాషా స్థలముల, క్లుప్తమగు పూర్వ శాస్త్రము చేతనే విధి సిద్ధించునుగాన, నిషేధమునకు విధిని గల్పించు శక్తియుండదు. అట ప్రతిషేధము మాత్రమే ప్రతీతమగును గదా యనిన-

అచటను విధి సిద్ధించును. ఎటనగా 'విభాషా' అను నీ సంజ్ఞ మహా సంజ్ఞగా జేయబడియున్నది. సంజ్ఞల నేర్పరచుట లాఘవార్థముగదా. అట్టి

యెడ కేవలలాఘవ దృష్టితో, ఇకనింతకంటె లఘుభూతమయినది వేరొకటి యుండదు' అని తలంపదగునట్లు సంజ్ఞలను శాస్త్రకర్తలు కల్పింపవలెను.

అట్లుచేయక గురుభూతమగు సంజ్ఞను గల్పించుటలో, పాణిని దృష్టికి ప్రయోజనవిశేషమేదియో యుండవలెను. అది నిషేధ వికల్పములకు రెండింటికిని నది సంజ్ఞ కావలె ననునదియే. నిషేధము మాత్రమునకే సంజ్ఞయయిన సంజ్ఞాకరణమే వ్యర్థము. విధి స్థలములందే 'న' అని చెప్పిన జాలును గదా! సంజ్ఞను గల్పించుటచే నిట సంజ్ఞలు రెండనియు, విభాషాపదముగల విధి సూత్రములందు వికల్ప ప్రతిషేధములు రెండును నుపస్థితములగుననియు తాత్పర్యము.

అందప్రాప్త విభాషా ప్రదేశములందు ప్రాప్తిలేనందున ప్రతిషేధమునకు పనిలేదు. వికల్పమునకు మాత్రమే అట నుపస్థితి. ఇయ్యది నిషేధ వికల్పములకు సన్నియోగ శిష్ట సంజ్ఞ అయినను, నిషేధమున కన్వయయోగ్యత లేనందున రెండవది మాత్రమే యుపస్థితమగును.

అయినను,

**వా॥ "విధి ప్రతిషేధయో ర్యుగపద్వచనా నుపపత్తిః"** అని యాక్షేపాంతర ముద్భావింపబడినది.

"విభాషా శ్వేః" 6 1.30 అను సూత్రము సంప్రసారణ విధాయకము. అయ్యది విధిప్రతిషేధములు రెండును నొక పర్యాయమే ప్రవర్తింపనని బోధించును. కనుక శుశావ, శుశువతుః, శుశువుః, శిశ్వాయ, శిశ్వియతుః, శిశ్వియుః అని సంప్రసారణ ఘటిత రూపములును తదఘటిత రూపములును సిద్ధింపవలెను. అయ్యది ఉపపన్నమగుటలేదు. ఎందువలననగా- 'భవతి' అనిన నిక నపుడు ప్రతిషేధము ప్రవర్తింపదు. 'న' అనిన నిక విధికి ప్రసంగముండదు. భావాభావములు విరుద్ధములు. వానికి యుగపద్విధానమెట్లు పొసగును? అని యాక్షేప తాత్పర్యము.

**వా॥ "సిద్ధంతు పూర్వస్యోత్తరేణ బాధితత్వాత్"** అని సమాధాన వార్తికము.

పూర్వవిధి నుత్తరవిధి బాధించును. అనగా నశబ్దార్థమగు ప్రతిషేధము వాశబ్దార్థమగు వికల్పముచే బాధింపబడును. ఇట బాధయనగా నిషేధమును ప్రతిబంధించుటకాదు. నిషేధ ఫలమగు నభావాంశమునకు సార్వకాలికత్వమును నివారించుటయే బాధ. ఇతిశబ్ద మర్థనిర్దేశార్థమగుటచేతను, అయ్యది నశబ్ద వాశబ్దములు రెండింటితోడను సంబంధించుటచేతను, నా యర్థములు రెండింటికిని క్రమముగ నుపస్థితియు, విధి స్థలములం దన్వయమును గలుగును.

ఒక యంశమున ప్రాప్తియు, వేరొక యంశమున దదభావమును ప్రసక్త మగుచుండ ఆరంభింపబడిన విభాషలు ఉభయత్ర విభాషలగును. అట్టిచోట్ల నీ సూత్ర ముపస్థితమయి ముందు నిషేధమును పిదప వికల్పమును బోధించును.

శ్విధాతువునందు లిట్టులో, ద్వివచన బహువచనములు పరమగునపుడు సంప్రసారణము ప్రాప్తము. ఏకవచనములు కిత్తులుకావు గాన నట దానికి, ప్రాప్తిలేదు ఈ స్థితిలో "విభాషా శ్వేః" 6-1-30 అను సూత్రము సంప్రసారణమును అట విభాషగ విధించుచున్నది. అనగా విభాషాసంజ్ఞా విధాయక సూత్రమునందలి క్రమమునననుసరించి ముందుగ 'న' శబ్దార్థమగు నిషేధ ముపస్థితమయి కిత్తులు పరమయినపుడు ప్రాప్తించిన సంప్రసారణమును నిషేధించును, ఇపుడు కిదకిద్రూపమగు లిట్టంతయు నేకరూపమగును. పిదప వాశబ్దార్థ మగు వికల్ప ముపస్థితమయి వికల్పమును బోధించును.

కేవల ప్రాప్తవిభాషలందును, ఉభయత్ర విభాషలందును, క్రమముగ నిషేధవికల్పము లుపస్థితములగును. ఇక శుద్ధాప్రాప్త విభాషలలో నిషేధ మున కన్వయయోగ్యత లేనందున అట శుద్ధవికల్పమునకు మాత్రమే యుపస్థితి కలుగును. ఈ విభాషా సంజ్ఞా సూత్రము ఉభయత్ర విభాషామాత్ర విషయకమే యనియు, ప్రాప్తాప్రాప్త విభాషల విషయమున సంజ్ఞకు పనిలేదనియు పరిశీలనము వలన వ్యక్తమగును.

ప్రాప్త విభాషలలో, ప్రవృత్త్యంశము సిద్ధమే కావున, పక్షమునందు నివృత్తి మాత్రమే బోధింపబడును.

అప్రాప్త విభాషలలో, ఒక పక్షమునందు కార్యప్రవృత్తి మాత్రమే బోధ్యము. అభావాంశము సిద్ధమే కావున నట సంజ్ఞాఫలము శూన్యము.

ఉభయత్ర విభాషా విషయమున గూడ ఈ సంజ్ఞకు ప్రయోజనము లేదను నభిప్రాయముతో నీ సూత్రము ప్రత్యాఖ్యాతమగును. ఆ విషయము ముందు "అశిష్యోవా విదితత్వా" త్తను వార్తిక వివర్తమున స్పష్టము కాగలదు.

'శబ్దములు నిత్యములు. శాస్త్ర నిష్పాద్యములు కావు' అని యొక పక్షమును, 'అవి అనిత్యములు. శాస్త్రమే వానిని నిష్పాదింపవలెను' అని వేరొక పక్షమును గలవు.

అందు మొదటి పక్షమున శాస్త్రము తత్తత్కార్యములను విధింప పని లేదు. అపుడది కేవలము సాధుత్వ ప్రతిపాదనార్థమే యగును. అపుడు శాస్త్రమునకు సాధ్వనుశాసనము మాత్రమే పని. అనగా, ఈ శాస్త్రము చేత నే రూపము పరినిష్ఠితమగునో యది సాధువు అని గ్రహించుటకు మాత్రమే

శాస్త్రమావశ్యకము. సాధుత్వానుశాసనమే శాస్త్ర కృత్యముగాని శబ్దాను శాసనము గాదనుట. అందువలన వికల్పమునకు, ప్రధానమగు ఆ సాధుత్వము తోడనే సంబంధముగాని తదుద్దేశ్యములగు సమాస, సంప్రసారణాదులతో గాదు.

కాగా "విభాషా శ్వేః" 6-1-30 ఇత్యాది సూత్రములకు, 'వికల్పముగా సాధువగు సంప్రసారణము 'శ్వయతి' కగును అని యర్థమును జెప్పవలెను. అపుడు పక్షాంతరమున ఆ సంప్రసారణ మసాధువని తెలియును. అట్లే, "షష్ఠీ" 2-2-8 అను సమాస విధాయకమున 'విభాషా' పద మనువర్తింపగా 'షష్ఠ్యంత మునకు 'సుబంతము'తో సమాసము వికల్పముగ సాధువగును' అని యర్థమగును. సమాసము నుద్దేశించియే సాధుత్వము విధింపబడుట వలన, ఆ సాధుత్వమునకే వికల్పము ప్రసక్తమగును - అను తాత్పర్యముతో వార్తికకారుడు,

**వా॥ "సాధ్వనుశాసనే అస్మిన్ శాస్త్రే యస్య విభాషా తస్య సాధుత్వమ్" అని యాక్షేపించెను.**

కానిమ్ము, అయిననేమి? ఏయది సాధువో అదియే ప్రయోగింప బడును. అసాధువు ప్రయోగింపబడదు. భక్ష్యమును, అభక్ష్యమునగు పదార్థమున్నపుడు భక్ష్యమునే గ్రహించి అభక్ష్యమును వర్జింతురుగదా. సాధుత్వ వికల్పము బోధింపబడినను సాధువునే ప్రయోగింతురు.

అనిన నట్లు కాదు. 'రాజపురుషః' అను సమాసము ఎల్లపుడును సాధువేగాని యది సాధువును అసాధువును గూడ నెట్లగును? అది ఉభయ రూపమయిన, అసాధు పరిత్యాగపురస్సరముగ సాధూపాదాన మెట్లు పొసగును. సాధ్వసాధువులు రెండును దుల్యరూపములే గదా.

మరియు "విభాషా శ్వేః" 6-1-30 ఇత్యాదులందు 'విభాషా' పదము, సాధుత్వ వికల్ప బోధనమున నుపయుక్తము గాన నది సంప్రసారణవికల్పమును బోధింపదు. కావున 'శిశ్వయతుః' మున్నగు సంప్రసారణరహిత రూపములు సిద్ధించకపోవును.

**వా॥ "ద్వేధా అప్రతిపత్తిః"** అని వార్తికము. విభాషాపదఘటితము లగు విధిశాస్త్రములందు ద్విధాశబ్ద ప్రతిపత్తి ఇష్టము. అది సిద్ధింపకపోవునని భావము.

శబ్దములు శాస్త్ర నిష్పాద్యములే, నిత్యములు కావు, అను కార్య శబ్దవాది మతముననైన, సంప్రసారణ సమాసాదులపూర్వముగ శాస్త్ర విధేయములు గాన విభాషాపదము వానికి వికల్పమును బోధించును గాన శబ్దముల ద్వైవిధ ప్రతిపత్తి సుకరమగును.

నిత్య శబ్దవాదికి గూడ నిది సుకరమే. ఎట్లనగా విభాషా పదముచే సాధుత్వము సంబంధింపజేయబడదు. సమాస సంజ్ఞ సంబంధింపజేయబడును. సమాససంజ్ఞ వికల్పముగా ప్రవర్తించునని యర్థము. సాధుత్వము పౌరుషేయము గాదు. కావున దానికి వికల్పము పొసగదు. తదుద్దేశ్యములగు సమాస సంజ్ఞాదులకే వికల్పబోధనము సాధ్యము.

వేదమునందు, "మేధ్యః పశుర్విభాషితః" "మేధ్యోఽనడ్వాన్ విభాషితః" అని వినబడుచున్నది. అట పశుత్వానడుత్త్వములు వికల్పనీయములు గావు. క్రియకే వికల్పము సంభవము. కావున నాలంభన క్రియ వికల్పింపబడునని యర్థము. 'పశువాలంభనీయము', కాదు అనియే విచారణముగాని 'అనడ్వాహము' 'అనడ్వాహము కాదు' అని విచారము కాదు. ఆ విధముగనే ప్రకృతమునను సంజ్ఞావికల్పమే గాని సాధుత్వవికల్పము గాదని భావము.

**వా॥ "కార్యేషు యుగపదన్వాచయ యౌగపద్యమ్"** అని యాక్షేప వార్తికాంతరము.

శబ్దములు కార్యములు అను పక్షమున దూషణాంతరమును గలదు. కార్యేషు = శబ్దములు కార్యములను పక్షమునందు, యుగపదన్వాచయ-విధేయములకు = అనగా ఒక్కసారిగా ప్రవర్తించువానికిని, అన్వాచయ విహితములకును, యౌగపద్యం = యుగపద్వచనత ప్రాప్తించుచున్నది అని యర్థము. "తవ్యత్తవ్యానీయరః" 3-1-96 అను శాస్త్రము ధాతువునకు పరముగ, తవ్యత్, తవ్య, అనీయర్, అను ప్రత్యయములను విధించుచున్నది. అవి యౌగపద్య విహితములు. వానికి యుగపత్ప్రయోగము ప్రాప్తించుచున్నది.

ఆ విధముగనే "ఠక్ఛమణ్ణూ కాత్" 4.1-119 అను సూత్రము సముచ్చయార్థక చకారముచే అణ్ప్రత్యయమునుగూడ విధించుచున్నది. అది అన్వాచయ విధానము. అన్వాచయమనగా నిట సముచ్చయమే

శబ్దములు శాస్త్రనిష్పాద్యములుకావు, నిత్యములే- అను పక్షమున ప్రయోగములందు దృష్టములైన శబ్దములకే శాస్త్రముచే విధానము, రేఖాగవయమువలె కాల్పనికముగాన ఇష్టవిభాగము సిద్ధించును.

కార్యములను పక్షమున ప్రయోగ నిరపేక్షముగ = ఇవి ప్రయోగములందు గలవా లేదా అను విచారము చేయకయే శాస్త్రము శబ్దములను నిష్పాదించును గాన, ధాతువుకంటె బరముగా తవ్యత్తవ్యానీయర్ ప్రత్యయములు మూడింటికిని నొక్కసారిగా నుత్పత్తి కలుగవలసివచ్చును అని యాక్షేప తాత్పర్యము.

కాని, ఆ వాదమునందును నీ దోషము తగులదు. ప్రత్యయము ప్రకృతికి పరముగా ఉండునుగదా? పర మనగా అవ్యవహితపరము. ఒక ప్రకృతికి పరముగా ననేక ప్రత్యయములు ఒక్కసారిగా ప్రవర్తించిన యెడల, ద్వితీయ తృతీయ ప్రత్యయములకు, ప్రకృత్యవ్యవహిత పరత్వమెట్లు ఘటించును? అనిన-

ప్రత్యయముల మాల ప్రాప్తించునని మేమనుటలేదు. 'కర్తవ్యమ్' అని యనదలచినపుడు, ప్రత్యయాంతరముచే ప్రకృత్యంతరమును నాక్షేపింపబడును గాన 'కరణీయమ్' అనిగూడ ప్రయోగింపవలసివచ్చును అని మా యభిప్రాయము. అనిన-

ఆ దోషము లేదని సమాధానము. అర్థావగతికొరకు మనము శబ్దములను బ్రయోగింతుము. ఒకానొక యర్థము నితరులకు దెలియజేయదలంచి శబ్ద ప్రయోగము ప్రయోక్తలచే చేయబడునుగదా? 'తవ్యత్తవ్యానీయరః' అను వాక్యమునుండి మరికొన్ని తదర్థ ప్రతిపాదకములు ధాతువుకు పరముగా భావకర్మార్థములందు 'తవ్యత్' ప్రత్యయమగును అని యొకటి, 'తవ్య' వచ్చును అని యొకటి 'అనీయర్' వచ్చును, అని యొకటియు నీవిధముగ నుద్భవించును. అందు 'కర్తవ్యమ్' అను రూపముచేత నా భావకర్మార్థ మవగతమగును గాన నిక కరణీయ శబ్దప్రయోగమునకు ప్రసంగములేదు. ప్రత్యాయయతీతి ప్రత్యయః అను వ్యుత్పత్తిచే అర్థప్రత్యాయకమగునదియే ప్రత్యయ మనబడును. ప్రత్యయ సంజ్ఞయు వానికి ప్రత్యేకముగనే ప్రవర్తించునుగాని, సముదాయమున ప్రవర్తింపదు. "ఉక్తార్థానామప్రయోగః" అని యొక న్యాయము. వేని యర్థము శబ్దాంతరముచే నుక్తమగునో వానికిక ప్రయోగ ముండదని అర్థము. కాగా, కరణీయ శబ్దార్థము కర్తవ్య శబ్దముచే నుక్తమైనది గాన నిక దానికి ప్రయోగము ప్రసక్తము గాదు.

**వా॥ "ఆచార్య దేశశీలనేచ తద్విషయతా"** అని వేరొక యాక్షేపవార్తికము. పాణిని సూత్రములలో గొన్నిటి ఆచార్య సంకీర్తనమును, గొన్నింట దేశ సంకీర్తనమును గానవచ్చుచున్నవి. కీర్తనమనగా మరల మరల నుచ్చరించుట. అట్లు విధింపబడిన కార్యములకు తదాచార్యమాత్ర విషయత్వమును తద్దేశమాత్ర విషయత్వమును బ్రాప్తించును. అని వార్తికార్థము. "ఇకోహ్రస్వోఽఙ్యో గాలవస్య" 6-3-61 అను సూత్రము ఆచార్య సంకీర్తనముచే హ్రస్వమును విధించుచున్నది. కావున ఆ యాచార్య సంబంధులగు గాలవులే హ్రస్వమును బ్రయోగింపదగుదురు. తద్భిన్నులు వానిని బ్రయోగింపరాదు.

అట్లే "ప్రాచామవృద్ధాత్ఫిన్ బహులమ్" 4-1-160 అను ఫిన్ప్రత్యయ విధాయకమున, 'ప్రాచామ్' అని దేశ సంశీలనమున ఫిన్ప్రత్యయము విహితము గాన తూర్పుదేశమునందే ఫిన్ప్రత్యయాంతముల ప్రయోగము సాధువగును.

వేదమునందు "జమదగ్నిర్వా ఏతత్పఞ్చమమవదాన మవాద్యత్. తస్మాన్నా జామదగ్న్యః పంచావత్తం జుహోతి" అని వినబడుచున్నది. జమదగ్నియను మహర్షి పంచమావదానమును గ్రహించెను కాబట్టి, జామదగ్న్యులుకానివారు పంచావత్తమును హోమము చేయరాదు అని దాని యర్థము.

అట్లే హ్రస్వఘటిత ప్రయోగమును గాలవులే చేయవలెను.ఇతరులు చేయ రాదు. ఫిన్నంత శబ్దములను ప్రాగ్దేశములందే గాని దేశాంతరములందు చేయ రాదు అని యర్థమగును. ఇది కార్యవాదమున నాక్షేపము.

'శబ్దములు కార్యములు గావు. అనాది వ్యవహార సిద్ధములే' అను పక్ష మునకైన ప్రయోక్తృ నియమమును దేశనియమమును ఉండబోవు గాలవుడు మహాస్మర్తగాన నంతటి మహర్షి చెప్పిన విషయమును పాణినియు చెప్పుటచేత తన శాస్త్రమునకు పూజ అనగా ప్రామాణ్యము లభించుట గాలవస్మరణమునకు ప్రయోజనము. పూజార్థకనగా స్వశాస్త్రమునకు పూజకొరకని భావము. గాలవేతరులును హ్రస్వమున ననావెగ ప్రయోగించుచుండుటచేత 'గాలవులే' అను నియమము పొసగదు. అట్లే ప్రాచామిత్యాది దేశకీర్తనమునకు ఫలము కీర్తి. తద్దేశీయులకు కీర్తి కలుగుటవలన స్వర్గావస్థానము వారికి స్థిరమగును.

'శబ్దములు కార్యములే' అనువాని పక్షమునందును గాలవగ్రహణము పూజార్థముగను, దేశకీర్తనము కీర్త్యర్థమునని వ్యాఖ్యానింపవచ్చును గదా! గాలవుడు హ్రస్వమును ప్రయోగించుటకై నీవును హ్రస్వములను ప్రయోగింపుము' అని స్తుత్యర్థమైన యర్థవాదము కావచ్చును. అనిన-

ఆ విధముగ ఆ ఆక్షేపము పరిహృతమైనను, దుష్పరిహారమగు దూష ణాంతరము ఈ పక్షమున నుండుటచే శబ్దములు శాస్త్ర నిష్పాద్యములను పక్ష మును ఖండించుటకై వార్తికకారుడు

**వా॥ "తత్కీర్తనేచ ద్వేధా అప్రతిపత్తిః"** అని వేరొక ఆక్షేపవార్తిక మును అవతరింపజేసెను.

ఆచార్య గ్రహణమును, దేశగ్రహణమును గల సూత్రములచే ద్వివిధ ప్రయోగ ప్రతిపత్తి యపేక్షితము. అది ఈ పక్షమున సిద్ధింపదు.

గాలవునిచే హ్రస్వము ప్రయుక్తము కావున నీవును ప్రయోగింపుమని నంత సూత్రమున 'హ్రస్వము వికల్పము' అని సిద్ధింపదు.

ఇక "గాలవప్రయుక్తముగాన నది ప్రయోగార్హము. ఇతరులు ప్రయోగింపలేదు గాన నీవును బ్రయోగింపకుము అని యర్థమగును గాన వికల్పము ఫలితమగును" అని వ్యాఖ్యానించుటయు సంతసముగాదు. ఏలయన, అన్యకృతమునకు పునఃకరణము వ్యర్థము. ఇతరులచే నయ్యది ప్రయోగింపబడ లేదని మానుటయు నుచితముగాదు. ఇతరులు చేయనిదానిని చేయుటయే అనగా నప్రాప్తమయినదాని విధానమే యుక్తతరమగును. కావున నట్టి వ్యాఖ్యానము వలన వైకల్పికత్వ సంపాదన మసాధ్యము.

మరియు 'పచ్' ధాతువునకు క్తప్రత్యయాంత రూపము 'పక్వః' అను నది గదా. అట నిష్ఠాతకారమునకు వకారమును పాణిని విధించియుండెను. ఇతర వైయాకరణులెవ్వరును విధింపలేదు. వారి మతమున 'పక్తః' అని యే రూపమగునని దానివలన స్పష్టము గదా. 'ఇతరులు ప్రయోగింపలేదు గాన నీవును బ్రయోగింపకుము'- అను వ్యాఖ్యానము చొప్పున, 'పచోవః' ఇత్యాదులు పాణినికృతములయినను నితరకృతములు కానందున, వానిని పాణినీయులును ప్రయోగింపకుండిన, వత్వాదులును వికల్పములు కావలసివచ్చును. అది సంగతము కాదుగదా. కాగా కార్యశబ్దవాదము సర్వథా అపరిగ్రాహ్యము.

## "సూత్రప్రత్యాఖ్యానము"

**వా॥ "అశిష్యోవా విదితత్వాత్"** అని సిద్ధాంత వార్తికము. ఈ 'నవేతి విభాషా'- అనుయోగము అశిష్యమే=అవిధేయమే. విదితత్వాత్=ఈ సూత్రముచే జెప్పబడిన విషయము లోకవిదితమే గనుక అని వార్తికార్థము.

'ఈ కార్యము విభాష' అనిన, 'వికల్పము' అని పాణినీతర వైయాకరణుల గోష్ఠిలో గూడ విదితము.

యాజ్ఞికులు 'విభాషా' సంజ్ఞను జేసికొనలేదుకదా. వారుగూడ "మేధ్యః పశుర్విభాషితః" మేధ్యోనడ్వాన్ విభాషితః అను స్థలమునందు, విభాషితః అనగా వికల్పితము అనునర్థమును జెప్పుచున్నారు. యజ్ఞ పశ్వాలంభము వికల్పితము నిత్యము గాదు అను నర్థము వారికిని ప్రసిద్ధము.

పాణిన్యాచార్యుడీ విభాషాసంజ్ఞను జేసియున్నను అనిత్యత్వ రూపమగు నర్థమును దెలియజేయుటకు ఈ విభాషాశబ్దమునే గాక ఇతర శబ్దములను గూడ - 'బహులమ్', 'అన్యతరస్యామ్', 'ఉభయథా' 'వా', 'ఏకేషామ్' - మున్నగువానిని పెక్కింటిని ఉపయోగించియున్నాడు. అవి సంజ్ఞలు కావు.

కాబట్టి 'విభాషా' అను పదములేని స్థలమైన "హ్రక్రోరన్యతరస్యామ్" 1-2-53 అను సూత్రమునను నిషేధవికల్పములుపస్థితములగుచున్నవి గదా. అదియు ఉభయత్ర విభాషాస్థలమే.

ఆ విధముగనే విభాషాపదము గల సూత్రములందును నిషేధ వికల్పము లుపస్థితములు కావచ్చును. కాన సంజ్ఞావిధానము అనావశ్యకము.

సూత్రము నిష్ప్రయోజనమని ప్రత్యాఖ్యాన తాత్పర్యము.

## అప్రాప్త విభాషల ప్రకరణము

ఈ విభాషలు అప్రాప్త విభాషలు, ప్రాప్త విభాషలు ఉభయత్ర విభాషలు అని మూడు విధములుగా నున్నవి.

అందు గొన్ని ఇట చూపబడును.

**వా॥ "అప్రాప్తే త్రిసంశయాః"**- అని అధికారవార్త్తికము.

'అప్రాప్తే' అను పదమునకు 'ఇటుపైన నుపక్రమింపబడిన విభాషలు అప్రాప్త విభాషలు' అని యర్థము.

అన్ని విభాషలందును 'ఇది ప్రాప్తవిభాషయా?', 'అప్రాప్త విభాష'యా? లేక ఉభయత్ర విభాషయా? అని మూడంశములందు సంశయమున కవకాశముగలదు గాన నవి త్రిసంశయములు. త్రిసంశయములనగా, 'త్రిషు అర్థేషు సంశయః యేషాంతే త్రిసంశయాః' అని 'మూడర్థములందు సంశయముగలవి' అని యర్థము. 'మూడు సంశయములు' అని యర్థముకాదు. మూడర్థములందొక్కటియే సంశయము.

అందప్రాప్త విభాషోదాహరణ వార్త్తికములలో మొదటిది,

**వా॥ "ద్వంద్వేచ"-"విభాషాజసి"** అనునది.

ఈ వార్త్తికమిట్లున్నను నిది సర్వనామ సంజ్ఞాప్రకరణమునకు ఉపలక్షణము. 'విభాషాజసి' అను విభాష ద్వంద్వసమాస విషయము. ద్వంద్వమున సర్వనామ సంజ్ఞ నిషిద్ధము. కనుక నది సర్వనామ సంజ్ఞీయాప్రాప్త విభాషయే. త్రిసంశయత్వమున కిట తావు లేదు. కావున నది ప్రకరణోపలక్షణము.

ఇక సంశయమెచట అనగా అది "ప్రథమచరమ తయాల్పార్థ కతిపయనేమాశ్చ" అను సూత్రమునందలి తయప్గ్రహణ విషయమున అగును.

ఉభశబ్దమునందు, "ఉభాదుదాత్తోనిత్యమ్" 5-2-44 అను సూత్రముచే తయప్ ప్రత్యయస్థానమున, 'అయచ్' అనునది ఆదేశము. ఆ శబ్దమునకు బరముగా 'జస్' ప్రత్యయము విధింపబడినపుడు, స్థానివద్భావముచేత నది తయాంత మగుటవలన పై ప్రథమచరమేత్యాది సూత్రముచే సర్వనామ సంజ్ఞావికల్పము ప్రాప్తించుచున్నది. ఉభయశబ్దము సర్వాదిగణపఠితమగుటచే నిత్య సర్వనామసంజ్ఞ ప్రాప్తించుచుండగా నిది విహితము, కాగా ప్రాప్త విభాషయగును.

"సర్వాదని సర్వనామాని" 1-1-26 అను సూత్ర మిందనువర్తింపనిచో జస్భిన్న విభక్తులందు నిత్యసంజ్ఞయు, ద్వితయాది శబ్దములందు వైకల్పిక సంజ్ఞయును చరితార్థములగుటవలన ఉభయశబ్దమున జస్సుపరమగునపుడు నిత్యవైకల్పికసంజ్ఞలు రెండును ప్రాప్తము బ. అపుడు, పూర్వ విప్రతిషేధము నాశ్రయించిన ఉభయశబ్దమున నిత్యసంజ్ఞయే ప్రవర్తించును. ఇక 'ప్రథమచరమేతి' వికల్పము ద్వితయాదులందే ప్రవర్తింపవలె. కావున నప్రాప్త విభాషయే యగును.

పరవిప్రతిషేధమును అంగీకరించిన, ఉభయశబ్దమునందు 'ఉభయే' అను లక్ష్యమున ప్రాప్తియు, ద్వికయే ఇత్యాదు లందప్రాప్తియు గలదు గాన నుభయత్ర విభాష యగును.

ఈ విధముగ సంశయము కలుగుచుండుటచేత 'నిది అప్రాప్త విభాషయే. అయచ్ప్రత్యయాంతరముగాని తయకు ఆదేశముకాదు అని సిద్ధాంతము.

అది ప్రత్యయాంతరమయిన, 'ఉభయీ' అను రూపమున జీప్ప్రత్యయ మెట్లు లభించును? తయబంతమయిన, టిడ్ఢేతి సూత్రముచే సిద్ధింపవచ్చును. ఇవు డెట్లు? అని శంక కలుగుచున్నది.

ఆ సూత్రమున 'మాత్రచ్' అని కలదుగదా! దానివలన సిద్ధింపవచ్చునని సమాధానము.

ఇది మాత్రచ్ ప్రత్యయాంతము కాదే యనిన, 'మాత్రచ్' అనున దా సూత్రమున ప్రత్యయము గాదు. అది ప్రత్యాహారము.

ఎచ్చటనున్న వానికది ప్రత్యాహారము ?

మాత్రశబ్దము మొదలు అయచ్ ప్రత్యయచకారము వరకును. కాగా, అయజంతము, మాత్రచ్ ప్రత్యాహారాంతర్గత ప్రత్యయాంతము గావున సిద్ధించును.

అది ప్రత్యాహారమైనచో డతి ప్రత్యయము గూడ నా నడుమ గలదు గాన 'కతితిష్ఠంతి' అనుచోట డత్యంతమునకు గూడ స్త్రీత్వమున జీప్పు రావలసి వచ్చునే ?

అనిన, టిడ్ఢేతి సూత్రమునందు 'అతః' అను పద మనువర్తించును. 'కతి' అనునది యదంతము కాదుగాన ఆ దోషము లేదు.

అయినను, 'తైలమాత్రా' 'ఘృతమాత్రా' అను త్రస్వత్రయాంత మాత్ర శబ్దమునందు గూడ ప్రాప్తించ నుగదా అనిన నది తుల్యరూపమయినను

ప్రత్యాహారమున సంనివిష్టముగా లేదు. కావున దానికి గ్రహణము సంభవింపదు. ప్రయాణవాచక శబ్దముకంటె బరముగా ప్రమేయార్థమున విధింపబడిన 'మాత్రచ్' ప్రత్యయమునకే, 'మాత్రచ్' అను నీ ప్రత్యాహారమున గ్రహణము. అట్టిదానికే అందు సన్నివేశమని సాహచర్యములవలన గ్రహింపనగును. కావున దోషము లేదు.

రెండవ అప్రాప్త విభాషోదాహరణ వార్తికము.

**వా॥ "ఊర్ణోతేర్విభాషా"** అనునది.

"విభాషోర్ణోః" 1-2-3 అను సూత్రము, ఊర్ణుధాతువునకు పరమైన ఇడాది ప్రత్యయమునకు వికల్పముగా ఙిత్త్వమును విధించునది ఙిత్త్వఫలము గుణవృద్ధి ప్రతిషేధము.

ఇది ప్రాప్తవిభాషయా? అప్రాప్తవిభాషయా? లేక ఉభయత్ర విభాషయా? అని సంశయము.

అది, ప్రాప్తా ప్రాప్తోభయత్ర విభాష యెట్లగును? అనిన "విభాషోర్ణో" (1-2-3) అను సూత్రమును, "అసంయోగాల్లిట్కిత్" (1-2-5) అను సూత్రములోని కనువర్తింపజేసి, 'ఊర్ణుఞ్' ధాతువుకంటె పరమగు నిడాడి ప్రత్యయమునకు నిత్యముగ ప్రాప్తమైన కిత్త్వము దీనిచే వికల్పింపబడునని చెప్పిననది ప్రాప్తవిభాష యగును. కిత్త్వ ఙిత్త్వములు ఫలాంశమున నొక్కటియే యని భావము.

ఆ సూత్రము నిందనువర్తింపజేయక అపుడు స్థలాంతరములందు చరితార్థములయిన ఆ రెండు సూత్రములకును 'ఊర్ణువివ' ఇత్యాద్యదులందు, ప్రాప్తి ప్రసక్తమయినపుడు పూర్వ విప్రతిషేధమును స్వీకరించిన నిది ఉభయత్ర విభాషయు, పరవిప్రతిషేధము నాశ్రయించిన నప్రాప్త విభాషయు నగును. ఇట్లు సంశయము కలుగగా అప్రాప్త విభాషయే అని నిర్ణయము. ఎట్లన,

'కిత్త్వ ఙిత్త్వములు కార్యమొక్కటియే యయినను ఇది వ్యపదేశాతిదేశముగాని కార్యాతిదేశము కాదుగాన నవి వేరువేరుగాని యొక్కటి కాదు. కావున నట త్రిసంశయత్వ ముపపన్నము గాదు.

అయినను "ప్రోర్ణువి" అను లఙుత్తమైకవచనాంతరూపమున సందేహమునకుపపత్తి కలదు. అట "సార్వధాతుకమపిత్" (1-2-40) అని ఇత్ప్రత్యయమునకు ఙిత్త్వము నిత్యముగా ప్రాప్తించును. ఆ సూత్రమున "విభాషోర్ణో" (1-2-3) అను సూత్రమును వాక్యభేదముచే సంబంధింపజేసిన నది ప్రాప్త విభాష యగును.

సంబంధింపజేయక, పూర్వవిప్రతిషేధము నాశ్రయించిన, ఉభయత్ర విభాషయు, పరవిప్రతిషేధమును స్వీకరించిన అప్రాప్త విభాషయు నగును. ఈ విధమయిన సంశయమునందు అప్రాప్త విభాషయేయని సిద్ధాంతము చేయబడినది.

॥ **"విభాషోపయమనే"**॥ అనునది మూడవ వార్తికము. "యమోగంధనే" (1-2-15) "విభాషోపయమనే" (1-2-16) అను సూత్రములు రెండును, సిచ్చునకు కిత్త్వమును విధించునవి. గంధనమనగా సూచనము - పరదోషావిష్కరణము. ఆ యర్థమున్నందు 'యమ' 'ఉపరమే' అను ధాతువుకంటె పరమైన సిచ్ప్రత్యయము కిత్తగును. కిత్త్వమునకు ఫలము మకారలోపము. "ఉదాయత"- అనునది యుదాహరణము.

"విభాషోపయమనె" అనునది రెండవ సూత్రము. ఈ సూత్రములోనికి పూర్వ సూత్రము నుండి, గంధనే అను పద మనువర్తించుననిన, 'గంధన మంగముగా గల వివాహము' అను నర్థమున నా ధాతువు కంటె పరమయిన సిచ్చు విభాషగా కిత్తగునని యర్థము. అపుడిది ప్రాప్త విభాషయగును.

అనువర్తించని పక్షమున, గంధన మాత్రమున పూర్వ సూత్రమును, వివాహరూపార్థ మాత్రమున విభాషయు చరితార్థములగును గాన గంధనాంగక వివాహమున, ప్రాప్తించు కిత్త్వము విషయమున, పూర్వ విప్రతిషేధము సమ్మతమయిన యెడల ఇది అట నప్రాప్త విభాషయగును. పర విప్రతిషేధము నాశ్రయించి వికల్ప మిష్టమనిన, శుద్ధ వివాహమున నప్రాప్త విభాషయు, సగంధన వివాహమున ప్రాప్త విభాషయునగును గాన అపుడు ఉభయత్ర విభాష అగును. ఇది సంశయము. 'గంధనే' అను పద మిట అనువర్తింపదు. పూర్వ విప్రతిషేధమే సమ్మతము. కావున, గంధన రహిత వివాహ రూపార్థమున ప్రాప్తించు విభాష అప్రాప్త విభాషయే అని నిర్ణయము.

**"అనుపసర్గాద్వా"** ఇది వేరొక యుదాహరణము. "వృత్తిసర్గతాయనేషు క్రమః (1-3-38) అను సూత్రము వృత్త్యాద్యర్థములందు, 'క్రము' ధాతువునకంటె పరముగ నాత్మనేపదప్రత్యయమును విధించును. అది నిత్యము.

"అనుపసర్గాద్వా" (1-3-43) అనునది వికల్ప విధాయకము. "వృత్తిసర్గేత్యాది సూత్ర మిందనువర్తించిన, వృత్త్యాదులందు ఆత్మనేపదము సోపసర్గమైనపుడు నిత్యముగ ప్రాప్తించును గాన అపుడారంభింపబడిన విభాష యగుటచే ఇయ్యది ప్రాప్త విభాష అగును.

'వృత్తి సర్గతాయనేషు' అను పద మనువర్తింపదనినచో నిత్యాత్మనే పదమునకు, సోపసర్గ స్థలమునను వికల్పమునకు వృత్త్యాద్యర్థరహిత స్థలము లందును, చారితార్థ్య ముండుటచే, ధాతువు అనుపసర్గమైనపుడు, వృత్త్యాద్యర్థము లందు నిత్యవికల్పములు రెండును ప్రాప్తింప, పూర్వవిప్రతిషేధము నాశ్రయించి అట నిత్యాత్మనే పదమే అంగీకరింపబడినచో 'అనుపసర్గాద్వా' అనునది అప్రాప్త విభాషయే యగును.

పరవిప్రతిషేధము నాశ్రయించిన, వృత్త్యాదులందు ప్రాప్తియు, అవి లేని తావున అప్రాప్తియుగలదు గాన నపుడీ విభాష ఉభయత్ర విభాషయగును. ఇట్లు త్రిసంశయత ఏర్పడగా, వృత్తి సర్గేత్యాదిపద మిందనువర్తింపదు. పూర్వ విప్రతిషేధమే ఆశ్రయింపబడును కావున, వృత్త్యాదర్థములు లేనపుడు సోప సర్గ స్థలమున ప్రవర్తించు ఈ విభాష అప్రాప్తవిభాషయే.

**వా॥ "విభాషావృక్షమృగాదీనామ్"** అనునదియు వేరొక యుదాహరణ వార్తికము.

"జాతిరప్రాణినామ్" (2-4-6) అను సూత్రము ప్రాణిభిన్న జాతివాచ కముల ద్వంద్వమునకు ఏకవద్భావమును విధించునది. 'ధానాశష్కులి' అని ఉదాహరణము.

"విభాషా వృక్షమృగతృణధాన్యవ్యంజనపశుశకున్యశ్వబడవ పూర్వాపరాధ రోత్తరాణామ్" (2-4-12) అను సూత్రము వృక్షాదుల ద్వంద్వమునకు విభాషగా ఏకవద్భావము విధించునది. 'రురుపృషతమ్' 'రురుపృషతాః'- ఇత్యాదు లుదా హరణములు.

ఈ సూత్రమునందు, జాతి రప్రాణినా మను సూత్ర మనువర్తించిన, 'ప్రాణివర్జ్యజాతి వాచకముల ద్వంద్వ మేకవద్భావము కలది యగును' అను, ఆ సూత్రముయొక్క వ్యాపకార్థముచేతనే, ప్రాణిభిన్న జాతివాచి వృక్షాదుల ద్వంద్వమునకును నేకవద్భావము ప్రాప్తించుచుండగా నారంభింపబడిన ఈ విభాష ప్రాప్తవిభాషయే యగును.

ఆ సూత్రముతో సంబంధము లేనియెడల, దానికి ధానాశష్కులి ఇత్యా దులును, ప్రాణిజాతి మృగములగు రురుపృషతాదుల ద్వంద్వైకవద్భావ విష యమున విభాషకును అవకాశములగును.

ఇక చర్మమయ మృగవాచకముల ద్వంద్వమున నిత్యవైకల్పికములు రెండిటికిని ప్రాప్తికలదు. అట, పూర్వ విప్రతిషేధముచే నిత్యైకవద్భావమే సమ్మతమయిన, ప్రాణిజాతులందప్రాప్త విభాషయే అగును. అట, పర విప్రతి షేధము నంగీకరించిన అప్రాణులందు ప్రాప్తియు, ప్రాణులందప్రాప్తియు కలుగగా విహితమగు ఈ విభాష ఉభయత్ర విభాష అగును.

ఈవిధముగ మూడర్థములందు సంశయము కలుగగ, పూర్వ విషయము నకు అసంబంధమును, పూర్వ విప్రతిషేధమును ఆశ్రయించి, అప్రాప్త విభాషాత్వమే సిద్ధాంతము

ఇకపైన ప్రదర్శింపనున్న అప్రాప్త విభాషలందెల్ల పూర్వవిషయ నివృత్తియు, పూర్వవిప్రతిషేధాశ్రయణమును వాని అప్రాప్త విభాషాత్వమునకు బీజములు. దీపాది విభాషయందు మాత్రము పర విప్రతిషేధము తద్బీజమగునని యెరుంగునది.

**వా॥ "ఉషవిదజాగృభ్యోఽన్యతరస్యామ్"** ప్రయోజనాంతర వార్తికము.

ఇది ఆమ్ప్రత్యయ విధాయక సూత్రము. ఈ విభాష ప్రాప్త విభాషయా? అప్రాప్త విభాషయా? ఉభయత్ర విభాషయా? అను అర్థత్రయ సంశయమిచటను గలుగును.

ఆ సందేహబీజము లేమనిన,

"కాస్ప్రత్యయాదామమంత్రే లిటి" (3-1-35) అను సూత్రమునందలి 'ప్రత్యయాత్' అను పదము ఈ 3-1-38 వ సూత్రమున ననువర్తించును. ప్రత్యయాంతములగు ఉష, విద, జాగృ అను ధాతువులకంటె పరముగా లిట్టు పరమగునపుడు ఆమ్ ప్రత్యయము పూర్వ సూత్రముచే నిత్యముగ ప్రాప్తించుచుండ నీ సూత్రముచె విభాషగ విధింపబడుచున్నది. కావున, ప్రాప్త విభాషయగునా? లేక, ఆ పద మిందు సంబంధింపదు. కావున నపు డప్రాప్త విభాషయే యగునా? సంబంధింపనపుడైనను పరవిప్రతిషేధము నాశ్రయించిన యెడల ప్రత్యయాంతములుగాని ఉషాదులకంటె అప్రాప్తమగునపుడును, ప్రత్యయాంతములకంటె ప్రాప్తమగునపుడును ఇది ప్రవర్తించును గాన ఉభయత్ర విభాష అగును. ఈ హేతువులవలన, సంశయము.

అప్రాప్త విభాషయే అని సిద్ధాంతము, ఉషాదిధాతువులు సనాదిప్రత్యయాంతములయినపుడు అవి ధాత్వంతరములగునుగాని ఉషాదులు కావు. కావున నట 'ప్రత్యయాత్' అనునది సంబంధింపదు. కావున 'నిత్యమగు ఆమ్ప్రత్యయమునకు ప్రాప్తిలేదు' అని భావము.

**వా॥ "దీపాదీనాంవిభాషా"**- అని యుదాహరణ వార్తికాంతరము.

"దీపజనబుధపూరితాయిప్యాయిభ్యోఽన్యతరస్యామ్" (3-1-61) అను సూత్రము దీపాదులకంటె పరమగు 'చ్లి' ప్రత్యయము స్థానమున వికల్పముగ 'చిణ్' ప్రత్యయమును విధించుచున్నది.

“చిణ్ భావకర్మణోః” (3–1-66) అను సూత్రము భావకర్మవాచియగు ‘త’ శబ్దము పరమగునపుడు చ్లి ప్రత్యయస్థానమున నిత్యముగ చిణ్ప్రత్యయమును విధించునది. ఈ సూత్రములోనికి దీపేత్యాది పూర్వసూత్రము నను వర్తించి వేరు వాక్యముగా భావకర్మార్థములందు దీపాదుల చ్లి ప్రత్యయమునకు వికల్పముగ చిణ్ప్రత్యయమగును’ అని యర్థమును జెప్పిన, “భావకర్మణోః” అను సూత్రముచేత నది ప్రాప్తించుచున్నది గాన నియ్యది ప్రాప్త విభాష యగును.

ఆ సూత్ర మిందనువర్తింపదు అనిన, ‘అపాచి’ అనుచో కర్మార్థమున నిత్య చిణ్ణును, కర్త్రర్థమున దీపేత్యాది చిణ్ణును సావకాశములు గనుక దీపాదులకంటె భావాద్యర్థమునందు వికల్పము ప్రాప్తించినపుడు పరవిప్రతిషేధముచే అట నిత్యచిణ్ణే ప్రవర్తించునను పక్షమున, కర్త్రర్థమున దీపాదులకు వచ్చు చిణ్ణు, అప్రాప్తమే కావున నీ విభాష అప్రాప్త విభాష కాదగును.

పూర్వ విప్రతిషేధము నాశ్రయించి వికల్ప ప్రాప్తి నంగీకరించిన కర్త్రర్థమున అప్రాప్త విభాషయు, కర్మాద్యర్థములందు ప్రాప్త విభాషయు అగును కాన, అపుడు ఉభయత్ర విభాష కావలెను.

ఇట్లు త్రిసంశయత్వ మేర్పడగా, “ణిశ్రిద్రుస్రుభ్యః కర్తరి చఙ్” (3-1-48) అను సూత్రము నుండి ‘కర్తరి’ అను పద మిందనువర్తించును గాన దానికి భావకర్మార్థములందు ప్రసక్తియే లేదు. కాన నిది అప్రాప్త విభాషయే అని సిద్ధాంతము.

ఐనను నింకొక సందేహ మిట కలుగుచున్నది. “దీపజనే” త్యాది సూత్రమునందు ‘కర్తరి’ అను పద మనువర్తించును. అట, కర్తయనగా నే కర్త? న్యాయకర్తయా, కర్మకర్తయా? అని సందేహము. కర్మకర్త యనగా కర్మయే సౌకర్యాతిశయముకొరకు కర్తగా వివక్షింపబడినది యగును. కర్మ=ధాత్వర్థ ఫలాశ్రయము. కర్త=ధాత్వర్థ వ్యాపారాశ్రయము. “పచ్యతే ఓదనః”- అను ప్రయోగమును జూడుడు. ఓదనము, విక్లిత్తి అను ఫలమున కాశ్రయము. కాని యిట కర్తగా వివక్షింపబడినది. ‘అన్నము తానే వండుచున్నది’ అని యర్థము. తానే వండుటయనగా కర్తయగు వంటవాని విశేష ప్రయత్న మక్కరలేకయే ఉడికిపోవుట. కాగా, దీపాదుల కర్మ కర్త యందును ‘చ్లి’ కి చిణ్ణు ప్రవర్తించునా? అనిన నా సందేహమున కిట తావులేదు.

అట్టి కర్మకర్తృప్రయోగములందు కర్తకు కర్మవద్భావము శాస్త్రముచే విధింపబడినది. కావుననే “పచ్యతే ఓదనః స్వయమేవ” ‘యక్’ ప్రత్యయమును, ఆత్మనేపద ప్రత్యయమును ప్రవర్తించినవి. ఆ కర్మవద్భావము

సకర్మక ధాతువుల కర్తకే విహితము. దీపాదు లకర్మకములాయె. వాని కర్తకు కర్మవద్భావ ప్రసంగమునకేమి అవకాశము గలదు?

అకర్మకములయినను, సోపసర్గములయినపుడు అనుభవతివలె నర్థాంతరము నందు సకర్మకములు కావచ్చును గదా యనిన, కర్మాపదిష్టములగు కర్మవద్భావాదులు, కర్మస్థభావకములును, కర్మస్థ క్రియాకములునునగు ధాతువులందే ప్రవర్తించును. దీపాదులు కర్తృస్థ భావకములు గాని కర్మస్థ భావకములు గావు.

చలనక్రియతో బనిలేని కర్తృవ్యాపారము భావము. వచనము, పఠనము మున్నగునవి అట్టి భావములు. సపరిస్పందనసాధనసాధ్యము క్రియ అనబడును. గమనము, ఆరోహణము, ధావనము మున్నగునవి కర్తకు పరిస్పందములేనిచో జరుగునవి కావు. కనుక నవి క్రియలు.

**"విభాషాగ్రే ప్రథమపూర్వేషు"**- అనునది యింకొక త్రిసంజ్ఞయా ప్రాప్త విభాషోదాహరణ వార్తికము.

"విభాషాగ్రే ప్రథమపూర్వేషు" (3-4-24) అనునది ణముల్ప్రత్యయవిధాయకము. ఇటగూడ, 'ప్రాప్తే' 'అప్రాప్తే' 'ఉభయత్ర వా' అను సందేహమును, కథంవా ప్రాప్తే? కథంవా అప్రాప్తే? కథం వా ఉభయత్ర? అను సందేహాక్షేపమును, పూర్వప్రతిపాదిత విభాషలందువలె కలుగును.

"ఆభీక్ష్ణ్యే ణముల్చ" 3-4-22) అను సూత్రమునుండి 'ఆభీక్ష్ణ్యే' అను పదమిందనువర్తించిన ప్రాప్త విభాషయగును. అది నివర్తించినపుడును, పూర్వవిప్రతిషేధ మాశ్రయింపబడినపుడును అప్రాప్త విభాష కావలెను. పరవిప్రతిషేధమునాశ్రయించిన ఉభయత్ర విభాష అగును. కావ త్రిసంజ్ఞయోపపాదనమును దుర్వారమే.

'ఆభీక్ష్ణ్యే' అను పదమిందనువర్తింపదు. పూర్వవిప్రతిషేధమే లక్ష్యానురోధముచే ఆశ్రయణీయము. కాగా నిది అప్రాప్త విభాషయే అని సిద్ధాంతము.

**వా॥ "తృణాన్నాదీనాం విభాషా"** యనునది వేరొక యుదాహరణ వార్తికము.

"విభాషా తృణాన్నతీక్ష్ణశుచిషు" (6-2-161) అను సూత్రమున సందేహము "ఆక్రోశేచ" (6-2-118) అను సూత్రము నణ్ణుకొంటె బరములగు 'అచ్' 'క' అను ప్రత్యయములు అంతమున గల కృదంతములు అంతోదాత్తములగును. ఆక్రోశమపుడట్టి వ్యంగ్యము కావలెను. అని బోధించుచున్నది.

కాని యీ సూత్రములోనికి "అచ్కావశక్తౌ" (6-2-157) అను సూత్రము నుండి 'అచ్కౌ' అను పదము అనువర్తింపనపుడే సంశయము.

'ఆక్రోశే' అను పదము విభాషా అను సూత్రములోని కనువర్తించిన నిది ప్రాప్త విభాషయు, అనువర్తింపక పూర్వవిప్రతిషేధ మాశ్రయింపబడిన యెడల అప్రాప్త విభాషయునగును పరవిప్రతిషేధ మంగీకరింపబడిన ఉభయత్ర విభాష యగును.

ఇట్లు త్రిసంశయోపపాదనమునకు పిమ్మట అప్రాప్త విభాషయే అని సిద్ధాంతము.

'ఆక్రోశే' అను పదము నివృత్తము. పూర్వవిప్రతిషేధమే లక్ష్యాను రోధము చొప్పున నంగీకార్యము అని తాత్పర్యము.

**వా॥ "ఏకహలాదౌ పూరయితవ్యేఽన్యతరస్యామ్"**- ఇదియు నొక అప్రాప్త విభాషోదాహరణ వార్తికము.

"ఉదకస్యోదః సంజ్ఞాయామ్"(6-3-57) అను సూత్రము ఉదకశబ్ద స్థానమున 'ఉద' అను నాదేశమును, సంజ్ఞ అయినపుడు విధించుచున్నది. 'ఉదమేఘః' అని యుదాహరణము.

"ఏకహలాదౌ పూరయితవ్యేఽన్యతరస్యామ్" (6-3-59) అను సూత్రముచే అసంయుక్త హలాదియగు పూరయితవ్య వాచకమగునది యుత్తర పదముగా నున్నపుడు, వికల్పముగ ఉదాదేశము విధింపబడినది.

ఈ విభాష, ప్రాప్తయా ? అప్రాప్తయా ? ఉభయత్ర విభాషయా అని సందేహము. దీనికి "ఉదకుంభః ఉదకకుంభః" అని యుదాహరణము.

ఇందు సంజ్ఞాయామను పద మనువర్తించిన, 'ఉదపానమ్' అనుచోట, సంజ్ఞలో ప్రవర్తించు నీ విభాష ప్రాప్త విభాషయగును. ఆ పదమను వర్తింపనిచో, 'ఉదమేఘః' అను సంజ్ఞాస్థలమున పూర్వసూత్రమును, సంజ్ఞ కాని ఉదకుంభః ఇత్యాది స్థలములందు, వికల్ప బోధక సూత్రమును జరితార్థములు. "ఉదపానమ్" అనుచో రెండును ప్రాప్తములు. ఇట్టి యెడ పూర్వవిప్రతిషేధము నాశ్రయించిన, సంజ్ఞ కాని స్థలముననే దీనికి ప్రవృత్తి ప్రాప్తము గనుక అచటనది అప్రాప్త విభాషయే యగును.

పర విప్రతిషేధ పక్షమున సంజ్ఞలో, ప్రాప్తమునకును అసంజ్ఞలో అప్రాప్తమునకును విధింపబడిన విభాషయగును గాన నపుడది ఉభయత్ర విభాష యగును.

ఇట్లు త్రిసంశయ ప్రసంగమున, 'సంజ్ఞాయామ్' మను పదమిం దను వర్తింపదు. పూర్వవిప్రతిషేధమే లక్ష్యానురోధముగ నిట నంగీకార్యము. కావుననిది అప్రాప్త విభాషయే అని సిద్ధాంతము.

**వా॥ "శ్వాదేరి ఞి, పదాంతస్యాన్యతరస్యామ్"** అను వార్తికమును నప్రాప్త విభాషోదాహరణ వార్తికాంతరము.

"శ్వాదేరిఞి (7-3-8) అనునదియు, 'పదాంతస్యాన్యతరస్యామ్' (7-3-9) అనునదియు, క్రమముగ, వృద్ధినిషేధ ఐజాగమములకు నిషేధమును, వికల్ప ప్రవృత్తిని బోధించు సూత్రములు. ఇందు 'పదాంతస్యాన్యతరస్యామ్' అను విభాష విషయమున సంశయము.

'ఇఞ్' అను తద్ధిత ప్రత్యయము పరమగునపుడు, శ్వశబ్ద మాదిని గల యంగమునందలి అద్యచ్చునకు వృద్ధి నిషేధమును 'ఐజాగమమును రావు' అని మొదటి సూత్రమున కర్థము. "శ్వాభస్త్రిః శ్వాదంష్ట్రిః" అని ఉదాహరణ ములు.

'పద శబ్దాంతమగు శ్వాద్యంగమునకు ఐజాగమము వికల్పముగా నగును' అని రెండవసూత్రమున కర్థము. ఉదాహరణము 'శ్వాపదమ్' 'శౌవాపదమ్' అనునది.

ఈ రెండవ సూత్రమున 'ఇఞి' అను పదమనువర్తించి 'శ్వాపదిః' 'శౌవాపదిః' అను నుదాహరణమునందు నిత్యనిషేధము ప్రాప్తింపగా నిదె వికల్పమును బోధించునుగాన, ప్రాప్తవిభాషయా? లేదా, ఇందు ఇఞి అను నది యనువర్తింపదు. కావున శ్వాభస్త్రిః అనుచో నిత్య నిషేధమును, 'శ్వాప దమ్' 'శౌవాపదమ్' అనుచో వికల్పమును జరితార్థములు. ఇక 'శ్వాపదిః' అను చోట రెండు సూత్రములును ప్రాప్తింపగా, పూర్వ విప్రతిషేధాశ్రయణముచే నట నిత్య నిషేధమే ప్రవర్తించిన నీ వికల్పమునకు శ్వాపదమ్ అనునదియే విషయమగును గాన నపుడప్రాప్త విభాష అనియా?

పరవిప్రతిషేధమును స్వీకరించిన 'శ్వాపదిః' అను స్థలమునందు, ప్రాప్త విభాషయు, 'శ్వాపదమ్' అను లక్ష్యమున నప్రాప్త విభాషయునగును గాన ఉభయత్ర విభాషయా? అని త్రిసంశయమేర్పడగా, 'ఇఞి' అను పదమిందను వర్తింపదు. లక్ష్యానురోధమున పూర్వవిప్రతిషేధమే స్వీకార్యము. కావున నిది అప్రాప్త విభాష అని సిద్ధాంతము.

**"నపూర్వాయాః ప్రథమాయా విభాషా"** అనునది ప్రయోజనాంతర పర వార్తికము. ఉదాహరణాంతరమ్మనుట.

"నచవాహాహైవయుక్తే" (8-1-24) అను సూత్రముచే, చ, వా, హా, అహా, ఏవ- అను ఈ చాదిపంచకముతో యోగమునందు, యుష్మదస్మదా దేశములు నిషేధింపబడినవి 'హరిస్త్వాం మాం చ రక్షతు' అనునది యుదాహరణము. ఇట 'త్వా', 'మా' అని ప్రయోగింపరాదు.

"పూర్వాయాః ప్రథమాయా విభాషా" (8-1-26) అను సూత్రము, విద్యమాన పూర్వ ప్రథమాంతమునకు బరములైన యుష్మదస్మచ్ఛబ్దములకు వాం నావాద్యాదేశములను వికల్పముగా విధించుచున్నది, లేదా వికల్పముగా నిషేధించుచున్నది యననగును. ఉదాహరణము "భక్తస్త్వమప్యహంతేన హరిస్త్వాం త్రాయతే సమామ్" అనునది. ఇట నొకపక్షమున 'హరిస్త్వా త్రాయతేసమా' అనియు ననవచ్చును. 'తేన' అనునదియు, 'త్రాయతే' అనునదియు, విద్యమాన పూర్వ శబ్దములు. తత్పూర్వకములయిన ప్రథమాంతములు 'హరిః' 'సః' అనునవి. వానికి పరములు 'త్వామ్' 'మామ్' అనునవి. వాని కాదేశనిషేధము వైకల్పికము గాన 'త్వా' 'మా' అనియు నగును.

ఈ సూత్రమునందు 'చవాహాహైవయుక్తే' అను పదమనువర్తించిన నిది ప్రాప్త విభాషయగును.

అనువర్తింపని పక్షమున, 'సదాత్వాం మాం చ రక్షతు' అనుచో ప్రథమాంత పదప్రయోగరహిత స్థలమునందు నిత్యనిషేధము సావకాశమగును.

"భక్తస్త్వ మప్యహం తేన హరిస్త్వాం త్రాయతే సమామ్" అను మున్నగు చాది యోగములేనిచోట వికల్పము చరితార్థము.

ఇక "భక్తస్త్వ మప్యహంతేన హరిస్త్వాం మాంచత్రాయతే"అను స్థలమున రెండు విధులకును ప్రాప్తి కలదు.

అట, పూర్వవిప్రతిషేధముచే నిత్యనిషేధమే ప్రాప్తించుననిన, చాది పంచకయోగరహిత స్థలమునందే నిషేధ వికల్పమునకు ప్రవృత్తిగాన నట అప్రాప్త విభాషయే యగును.

అననువృత్తియే పరవిప్రతిషేధమే ఆశ్రయింపబడును అను పక్షమున, చాదియోగమున ప్రాప్త విభాషయు, తద్రాహిత్యమున నప్రాప్త విభాషయు నగుటచేత ఉభయత్ర విభాషయా ? అను సంశయము.

ఇట్లుండ, అననువృత్తి విప్రతిషేధములను లక్ష్యానురోధముగ నంగీకరించుట వలన అప్రాప్త విభాషయే యిది అని సిద్ధాంతము.

వా॥ "గ్రోయఙ్వచి విభాషా"- అని, అప్రాప్త విభాషోదాహరణ వార్తికాంతరము. ఇవి రెండు సూత్రములు. 'గ్రోయఙి' (8-2-20). నిత్యము. "అచి విభాషా" (8-2-21) అనునది విభాష. ఇది అప్రాప్త విభాషలో నిది

ను దాహరింపబడినవానిలో చివరిది. "గ్రోయజి" (8-2-20) అను సూత్రము, 'యఙ్' ప్రత్యయము పరమైనపుడు, 'గౄ నిగరణే' అను ధాతువు యొక్క రేఫకు లత్వమును విధించునది. 'జేగిల్యతే' అని యుదాహరణము.

రెండవది, అచ్చు పరమగునపుడా లత్వమును వికల్పముగా విధించుచున్నది. ఇయ్యది ప్రాప్తా ప్రాప్తోభయత్ర విభాషలలో నెయ్యది యగును? అని సందేహము.

ఈ సూత్రములోనికి 'గ్రోయజి' అను సూత్రమంతయు ననువర్తించి నచో వాక్య భేదముచే, గిరతి యొక్క రేఫకు అచ్చు పరమగునపుడు యఙ్విషయమున వికల్పముగా లత్వమగును" అని నీకర్థమగును. అప్పుడిది ప్రాప్త విభాష యగును.

ఇందు 'యజి' అను పదమనువర్తింపని పక్షమున, గిరతి యొక్క రేఫకు 'అచ్చు పరమగునపుడు లత్వము వికల్పము' అనియే యర్థము. అపుడు 'జేగిల్యతే' అను యఙ్విషయమున నిత్యలత్వమును, 'గిలతి' ఇత్యాదులందు వైకల్పిక లత్వమును సావకాశములు.

ఇక 'నిజేగిలః' అను యజంత ప్రకృతి కపబాద్యజంత స్థలమునందు ఉభయ సూత్రములకును ప్రసక్తి కలుగగా, పూర్వ విప్రతిషేధముచే, యఙ్విషయమున నిత్యలత్వమే సమ్మతమగునుగాన యఙ్విషయముకాని స్థలము ననే విభాషకు ప్రవృత్తి. కాగా నచట నది అప్రాప్తవిభాషయే.

పర విప్రతిషేధాశ్రయణముచే వైకల్పికమే అటను ప్రవర్తించునని ప్రాప్తాప్రాప్త విభాషయగును.

ఈ స్థితిలో లక్ష్యానురోధముగ 'యజి' అను పదమునకు అననువృత్తియు, పూర్వ విప్రతిషేధమును నంగీకరించుట వలన అప్రాప్త విభాషయే ఈ విభాష యని సిద్ధాంతము.

## ఇక ప్రాప్తవిభాషలు

అందు 'ప్రాప్తేచ' అని మొదటి వార్తికము. ఇకముందుపక్రమింపబడు విభాషలు ప్రాప్త విభాషలు. అవియు త్రిసంశయములు. పూర్వ ప్రక్రాంతమున కుత్తరత్ర అనువృత్తినంగీకరించి వానికి ప్రాప్తవిభాషాత్వము సిద్ధాంతీకరింపబడును. అందు (1) "విభాషా విప్రలాపే" (2) "విభాషోపపదేన ప్రతీయమానే॥" (3) తిరోంతర్ధౌ విభాషాకృఞి (4) "అధిరీశ్వరే విభాషాకృఞి" (5) 'దివస్తదర్థస్య 'విభాషోపసర్గే"- అను నీ అయిదును ప్రాప్తవిభాషలు. వీనిలో నన్నింటను సంశయోపపాదనము తత్పూర్వము సంశయాక్షేపమును, చివర సిద్ధాంత ప్రతిపాదనమును సమానములు.

"వ్యక్తవాచాం సముచ్చారణే" అను సూత్రము, మనుష్యుల సంభూయోచ్చారణమున వదధాతువున కాత్మనే పదమును విధించుచున్నది "సంప్రవదంతే బ్రాహ్మణాః" అనునది యుదాహరణము. ఈ సూత్రసంఖ్య 1-3-48 ఇక "విభాషా విప్రలాపే" (1-3-50) అను సూత్రము, విరుద్ధోక్తి రూపమగు విప్రలాపమునందు వికల్పముగ నాత్మనే పదమును విధించుచున్నది. 'విప్రవదంతే-విప్రవదంతివావైదా' అనునది దీని కుదాహరణము. ఇందు 'వ్యక్తవాచామ్' అను పదమనువర్తించునా? అనువర్తింపదా? అని సంశయము.

అనువర్తించిన, ప్రాప్తవిభాష యగును. అనువర్తింపకున్న, నిత్యాత్మనే పదమునకు, 'సంప్రవదంతే బ్రాహ్మణాః' అనునదియు, వికల్పమునకు, 'విప్రవదంతి ఖగాః' అనునదియు నవకాశములును, 'విప్రవదంతే బ్రాహ్మణాః' అను స్థలమున నుభయప్రాప్తియు నుండుటచేత విప్రతిషేధముకలదుగాన, నందు పూర్వ విప్రతిషేధము నాశ్రయించిన, "విప్రవదంతే ఖగాః" అనుచోటనే వికల్పము ప్రవర్తింపవలెను. అచట, ప్రాప్తిలేనందున, అప్రాప్త విభాషయాయిది అనుసందేహము. పర విప్రతిషేధము నాశ్రయించిన నుభయత్ర విభాషాసందేహము. ఇట్లు త్రిసంశయత్వమున, 'వ్యక్తవాచామ్' అను పదముత్తర సూత్రమున ననువర్తించుననియు, నందువలన నియ్యది ప్రాప్తవిభాషయే యగుననియు, లక్ష్యానురోధముగా సిద్ధాంతీకరింపబడినది.

"విభాషోపపదేన ప్రతీయమానే" అను వార్తిక ముదాహరణాంతర వార్తికము.

1. క్రియాఫలము కర్తకు జెందినపుడు స్వరితేత్తులును ఞిత్తులును నగు ధాతువులకును,

2. అప పూర్వక వద ధాతువునకును,

3. 'సమ్' 'ఉద్' 'ఆఙ్'- ఇవి పూర్వమున గల, గ్రంథ విషయకముగా నియమ ఉపరమే లను ధాతువునకును,

4. ణిజంత ధాతువులకును,

5. ఉపసర్గ రహితమగు జ్ఞాధాతువునకును, "స్వరితఞిత" ఇత్యాది పంచ సూత్రిచే లకార స్థానమున నాత్మనేపద ప్రత్యయములు విధింపబడినవి.

తరువాత, "విభాషోపపదేన ప్రతీయమానే" (1-3-77) అను సూత్రముచే, క్రియాఫలము యొక్క కర్తృగామిత్వ ముపపదముచే ద్యోతితమయినపుడు ఆత్మనేపదము వికల్పముగ ప్రవర్తించునని బోధింపబడినది. ఇందును, సంశయాక్షేప తదుపపాదనములును, పూర్వవిషయానువృత్తిని స్వీకరించి

లక్ష్యానురోధముగ ప్రాప్త విభాషాత్వ సిద్ధాంతమును వెనుకటి విభాష యందు వలె నూహ్యములు॥

వా॥ "తిరోంతర్ధౌ, విభాషాకృఞి"- ఉదాహరణవార్తికాంతరము.

ఇవి రెండు సూత్రములు. గతి సంజ్ఞా విధాయకములు 1-4-71, 72 క్రియాయోగమున నంతర్ధి గమ్యమానమగునపుడు 'తిరస్' అనుదానికి గతి సంజ్ఞ కలుగును అని యొక వాక్యమును, కృఞాత్వర్థ క్రియాయోగమున నది వికల్పముగా నగునని వేరొక వాక్యమును బోధించుచున్నది. అందు వ్యాపకార్థ బోధకమగు మొదటి వాక్యముచేత 'తిరస్కృత్య' అనుచోట గతి సంజ్ఞ సిద్ధించుచుండగా వికల్పము విధింపబడినది గాన నీ విభాష ప్రాప్త విభాషయా? లేక, 'అంతర్ధౌ' అను పద మనువర్తింపదు. 'తిరోభూయ' అనుచో నిత్యసంజ్ఞకు అవకాశముగలదు. అంతర్ధి లేని 'తిరస్కృత్య' అనుచోట వైకల్పిక సంజ్ఞ సావకాశము. కాగా తుల్యబల విరోధము కలదు. విప్రతి షేధ శాస్త్రము ప్రవర్తించును. అందు పూర్వ విప్రతిషేధము నాశ్రయించిన, అంతర్ధి లేని స్థలమున ప్రవర్తించు విభాష అప్రాప్త విభాషయా? లేక పర విప్రతిషేధమునాశ్రయించుట చేత ఉభయత్ర విభాషయగునా? అను త్రిసంశ యము నందు, ప్రాప్త విభాషయే అని సిద్ధాంతము॥

"అధిరీశ్వరే" (1-4-97), "విభాషాకృఞి" (1-4-98) - ఈ సూత్రములు కర్మ ప్రవచనీయ సంజ్ఞా విధాయకములు. 'ఈశ్వరే' అను పదమునకు ఈశ్వరత్వే అని యర్థము. స్వస్వామి భావ సంబంధమున అనుట 'ఆ సంబంధమున అధి అను నది కర్మ ప్రవచనీయమను సంజ్ఞకలది యగును.' అని మొదటి సూత్రమున కును, 'కృఞ్ ధాతుయోగము నందు ఆ సంజ్ఞ 'అధి' అనుదానికి విభాషగా ప్రవర్తించునని రెండవ సూత్రమునకును నర్థము కావున నీ విభాష ప్రాప్త విభాషయగును.

'ఈశ్వరే' అను పద మిందనువర్తింపనియెడల, పూర్వ విప్రతిషేధముచే అప్రాప్త విభాషయా? పర విప్రతిషేధాంగీకారమున నుభయత్ర విభాషయా? అను సంశయము కలుగును. 'అధిభువిభూపః' అనుచో నిత్యసంజ్ఞసావకాశము. 'అధిభువిఘటః' అను నది విభాషావకాశము. "భూపోభువి అధికరోతి" అను స్థల మున రెండు సంజ్ఞలకును ప్రాప్తికలదు. అందు పూర్వ విప్రతిషేధ మాశ్రిత మయిన, స్వస్వామి భావసంబంధము లేనిచోటనే విభాష ప్రవర్తింపవలెను గాన నపుడప్రాప్త విభాషయనుట. పర విప్రతిషేధము నాశ్రయించిన, ఈశ్వరత్వ మున ప్రాప్తవిభాషయు, అనీశ్వరత్వమున అప్రాప్త విభాషయు అగును. ఇట్టి సంశయమున ప్రాప్తవిభాషయే సిద్ధాంతము.

వా॥ "దివ స్తదర్థస్య" (2-3-58), "విభాషోపసర్గే" (2-3-59)- ఈ సూత్ర ద్వయము ఉదాహరణ వార్తికముగ బఠింపబడినది.

కర్మను శేషముగ వివక్షించినపుడు ద్యూతార్థకమును, క్రయవిక్రయ రూప వ్యవహారార్థకమును అగు దివుధాతు ప్రయోగమున షష్ఠీవిభక్తిని విధించినది ప్రథమ సూత్రము. ఆ ధాతువు సోపసర్గమైనపుడు వికల్పముగ షష్ఠీ విధాయకము ద్వితీయ సూత్రము. "శతస్య దీవ్యతి" - అనునది మొదటిదాని కుదాహరణము. 'శతస్య శతంవా ప్రతిదీవ్యతి' అనునది ద్వితీయ సూత్రోదాహరణము ప్రాప్తా ప్రాప్తోభయత్ర విభాషా సంశయాక్షేపమును, తదుపపాదనమును, పూర్వ పర విప్రతిషేధాశ్రయణమున అప్రాప్త, ఉభయత్ర విభాషాత్వ ప్రాప్తియు, పర్యవసానమున ప్రాప్తవిభాషయే అను సిద్ధాంతమును గమనీయములు.

ఇక నుభయత్ర విభాషలు నాలుగు.

(1) "హృక్రోరన్యతరస్యామ్" (1-4-53)

(2) "విభాషాసాకాంక్షే" (3-2-114)

(3) "విభాషాశ్వేః" (6-1-30)

(4) "విభాషా సంఘుషాస్వనామ్" (7-2-28)- ఇవి ఉ॥ విభాషలు.

ఇది దిక్ప్రదర్శన మాత్రమే. ఇంకను నిట్టి త్రిసంశయ విభాషలకు సంభవము గలదు.

"గతిబుద్ధిప్రత్యవసానార్థ శబ్ద కర్మాకర్మకాణా మణికర్తాసణౌ" (1-4-52) అను సూత్రము, గత్యాద్యర్థక ధాతువుల అణ్యంతావస్థలోని కర్తకు, ణ్యంతావస్థలో కర్మసంజ్ఞను విధించునది.

"శత్రవః స్వర్గమగచ్ఛన్" అను అణ్యంతావస్థలోని కర్తలగు శత్రువులకు "శ్రీహరిః శత్రూన్ స్వర్గ మగమయత్" అను ణ్యంతావస్థయందు కర్మత్వమువల్ల ద్వితీయాప్రత్యయము వచ్చినది.

ఇట్టివి ఈ సూత్రమున కుదాహరణములు.

ఈ సూత్రముచే, ప్రత్యవసానార్థక హృధాతువును అకర్మక కృధాతువును ణ్యంతములయినపుడు, వాని అణ్యంతావస్థలోని కర్తకు ఈ ణ్యంతావస్థయందు కర్మసంజ్ఞ నిత్యముగ ప్రాప్తించుచుండగా, "హృక్రోరన్యతరస్యామ్" (1-4-53) అను సూత్రము వికల్పముగ నా సంజ్ఞను విధించుచున్నదా ?

లేదా - ఈ సూత్రమున గతిబుద్ధ్యాది సూత్రమనువర్తింపదు. గత్యర్థకములును, ప్రత్యవసానార్థకములును అకర్మకములునైన 'హృ' 'కృ' ధాతు

వుల కంటె భిన్నములయిన ధాతువుల ణ్యంతము నందు, నిత్య సంజ్ఞకు అవకాశమును, గతిప్రత్యవసానార్థాకర్మక భిన్నములయిన, 'హృ' 'కృ' ధాతువుల ప్రయోగమున ణ్యంతములలో విభాషకవకాశమును కలిగియుండి రెండును గతి ప్రత్యవసానార్థాకర్మక 'హృ' 'కృ' ధాతువుల ణ్యంతములందు ప్రాప్తింపగా పూర్వ విప్రతిషేధముచే అట నిత్యసంజ్ఞయే సమ్మతమయిన యెడల విభాష కిక, గతిప్రత్యవసానార్థాకర్మకభిన్న హృ కృల ణ్యంతము లందే ప్రవృత్తి స్వీకరణీయము. అప్పుడట నిత్యసంజ్ఞకు ప్రాప్తి లేనందున అప్రాప్త విభాషయే అట నగునా ?

లేక, పర విప్రతిషేధము నాశ్రయించి, గతిప్రత్యవసానార్థాకర్మక 'హృ' 'కృ'ల ణ్యంతములందు ప్రాప్త విభాషయు, తద్భిన్న హృ, కృ ప్రయోగమున అప్రాప్త విభాషయునగును గాన ఉభయత్ర విభాషయా ? అని సంశయము. ఉభయత్ర విభాషయే అని సిద్ధాంతము.

"అభ్యవహారయతి సైంధవాన్, అభ్యవహారయతి సైంధవైః" అనియు, "వికారయతి సైంధవాన్", 'వికారయతి సైంధవైః'– అనియు, ప్రాప్త విభాషోదాహరణ ములు.

"హారయతి భారం దేవదత్తమ్", "హారయతి భారం దేవదత్తేన" అని అప్రాప్త విభాషోదాహరణము. దీని అణ్యంతావస్థ 'హరతి భారమ్' అనునది. అట్లే, 'కారయతి కటం దేవదత్తమ్', 'కారయతి కటం దేవదత్తేన' అనునదియు నుదాహర ణము. 'కరోతి కటం దేవదత్తః' అనునది దాని అణ్యంతావస్థ యగును.

**వా॥ "నయది, విభాషాసాకాంక్షే"**- అనునది **ఉదాహరణ వార్తి కాంతరము.**

"అభిజ్ఞావచనే ల్రృట్" (3-2-112) అను సూత్రము, స్మృతిబోధకమగు శబ్దము ఉపపదముగా ఉన్నపుడు, అనద్యతన భూత కాలమునందు ధాతు మాత్రమునకు ల్రృడ్లకారమును విధించుచున్నది. "స్మరసికృష్ణ, గోకులే వత్స్యామః" అని యుదాహరణము. 'కృష్ణుడా, మనము గోకులమున నుంటిమి. జ్ఞప్తికి వచ్చినదా?' అని యర్థము. 'అభిజానాసి కృష్ణ యద్వనే అభుజ్మహి' అను స్థలమున నీ ల్రృట్టు రాలేదు. ఈ వాక్యమునందు 'యత్' అను పద మధికముగ ప్రయోగింపబడి యున్నది. 'కృష్ణా! మనము వనములో భుజించి తిమి అను నంశమును గుర్తించితివా?' అని యర్థము.

"నయది" (3-2-113) అను సూత్రము, 'యత్' అను శబ్దముయొక్క యోగమునందు, స్మృతిబోధకము ఉపపదముగా నున్నపుడు ల్రృట్ప్రత్యయ మును నిషేధించుచున్నది. అందువలన ఇట ల్రృట్టు రాలేదు.

ఇక "విభాషా సాకాంక్షే" (3-2-114) అను సూత్రము, ధాత్వర్థములు లక్ష్యలక్షణములయి, పరస్పరాకాంక్షములయినపుడు, ఉక్త విషయమున లృడ్న్ప్రత్యయము విభాష యని బోధించుచున్నది. ఉదాహరణము – స్మరసికృష్ణ! యద్వనేవత్స్యామః, తత్రగాశ్చారయిష్యామః, లేదా అవసామ, అచారయామ. ఇయ్యది యచ్ఛబ్ద యోగమున విభాష కుదాహరణము. 'నయది' అను సూత్ర మిందను వర్తించును కావున నిది ప్రాప్త విభాషయగును. నిషేధీయ ప్రాప్త విభాష యనుట. కాగా పైన చెప్పిన చొప్పున నిది ప్రాప్త విభాషయా? అని యొక సందేహము–

'యది' అసున దిందనువర్తింపదు. నిత్య నిషేధమే యదోగ్యగమున ప్రవర్తించును. యదోగ్యగములేని నిత్యసాకాంక్ష స్థలమున ఈ నిషేధవికల్పము సావకాశము.

ఇక యదోగ్యగమును సాకాంక్షతయు నున్న కావున పూర్వ విప్రతిషేధము నాశ్రయించిన యెడల విభాషకు యదోగ్యగరహితమే అవకాశమగును గాన నపు డప్రాప్తయా? అని 'అప్రాప్తేవా?' అని సంశయము. లేక అట పర విప్రతిషేధమును స్వీకరించిన ఉభయత్ర విభాషయా? అను సందేహము.

ఇట్లు త్రిసంశయమునందు ఉభయత్ర విభాషయేయని సిద్ధాంతము.

అందు, ప్రాప్తోదాహరణము– "అభిజానాసికృష్ణ! యత్కశ్మీరేషువత్స్యామః (అవసామ)యత్ర ఓదనంభోక్ష్యామహే (అభుంజ్మహి)" అనునది. 'కృష్ణా' మనము కశ్మీరదేశమున నివాసము చేసితిమనియు నచ్చట నన్నములను దింటిమనియు జ్ఞాపకమున్నదా? అని యర్థము.

అప్రాప్తోదాహరణము– అభిజానాసి దేవదత్త! కశ్మీరాన్ గమిష్యామః (కశ్మీరాసగచ్ఛామ) తత్రౌదనంభోక్ష్యామహే (తత్రౌదన మభుంజ్మహి)అనునది. దేవదత్తా గురుతు కలదా? మనము కశ్మీర దేశము వెళ్ళి యచట వన్నమును దింటిమి అని యర్థము. ఇట, యదోగ్యగము లేనందున, నిషేధప్రాప్తి లెదు. కావున నప్రాప్త విభాష కుదాహరణమగును.

## "విభాషాశ్వేః" (6-1-30)

ఇది ప్రాప్త విభాషయా? అప్రాప్త విభాషయా? ఉభయత్ర విభాషయా? అను సందేహము తుల్యము.

ఎట్లైనను నే మేమగును? అని సందేహాక్షేపము. ఇందు, 'కితి' అను పద మనువర్తించినచో ప్రాప్త విభాష యగుననియు, అనువర్తింపజేయక పూర్వ విప్రతిషేధము నంగీకరించిన, అప్రాప్త విభాషయగుననియు, పర

విప్రతిషేధాశ్రయణ పక్షమున ఉభయత్ర విభాషయగునని యీ సందేహమున కుపపత్తి యూహ్యము.

ఉభయత్ర విభాషయేయని సిద్ధాంతము.

'శుశువతుః' 'శుశువుః' 'శిశ్వియతుః' 'శిశ్వియుః' అను స్థలమునందు కిత్తులు ధాతువుకు పరముగా నుండుటచేత నట, ప్రాప్త విభాషయగును. 'శుశావ' 'శుశవిథ' 'శిశ్వాయ' 'శిశ్వయిథ'- అను స్థలములందు, పకారేత్సంజ్ఞకమగు లిట్టు పరమగుటవలన, సంప్రసారణము ప్రాప్తము కానందున నట అప్రాప్తి. కాగా నుభయత్ర విభాషయని సిద్ధాంతము.

**వా॥ "విభాషా సంఘుషాస్వనామ్"**-అనియు నుదాహరణ వార్తికము.

సంపూర్వకమగు ఘుషధాతువు కంటెను, 'ఆఙ్' పూర్వకమగు స్వన ధాతువు కంటెను బరమయిన నిష్ఠా ప్రత్యయమునకు ఇడాగమము "రుష్యమత్వర సంఘుషాస్వనామ్" (7-2-28) అను సూత్రముచే విధింపబడినది. అది విభాష. అందు 'సంఘుష' 'ఆస్వన' ధాతువులకు సంబంధించిన విభాష ఉభయత్ర విభాష యని సిద్ధాంతము॥

అందు, సందేహమును, తదాక్షేపమును, తదుపవాదనమును, సిద్ధాంత ప్రతిపాదనమును, పూర్వ విభాషలందువలె ద్రష్టవ్యము.

"ఘుషిరవిశబ్దనే" (7-3-23) అను సూత్రము, ఘుషధాతువు నిష్ఠకు, విశబ్దనభిన్నమగు నర్థమున ఇడాగమమును నిషేధించుచున్నది. ఈ సూత్రము 'రుష్యమత్వర' సూత్రము నందనువర్తించిన, నిత్యానిత్యము ప్రాప్తము కావున నపుడీ విభాష ప్రాప్త విభాషయగును.

'అవిశబ్దనే' అనున దిందనువర్తింపని పక్షమున, విశబ్దనభిన్నార్థమున ధాతువు ఉపసర్గరహితమయినపుడు నిత్యమగు నిడ భావము సావకాశము.

విభాషకు, విశబ్దన మర్థమయినపు డవకాశము. ఇక 'సం' అను నుపసర్గ మును గలిగియుండి, విశబ్దనము ప్రతీతము కాని 'సంఘుష్టారజ్జుః' అను స్థలమున నిత్యవైకల్పికానిత్యములు ప్రాప్తములు. అట, పూర్వ విప్రతిషేధము నాశ్రయించిన, విభాషకు విశబ్దనము నందే ప్రాప్తి. అట నిత్యానిత్యమునకు ప్రాప్తిలేదుగాన అప్రాప్త విభాషయగును.

ఇక, పర విప్రతిషేధ స్వీకరణము సమ్మతమయిన, అవి శబ్దనార్థమున ప్రాప్తవిభాషయు, విశబ్దనమున, "సంఘుష్టః శ్లోకః" అనుచోట అప్రాప్త విభాషయు నగునుగాన నుభయత్ర విభాష యగును అని సిద్ధాంతము. ప్రాప్తే "సంఘుష్టారజ్జుః సంఘుషితారజ్జుః" అని యుదాహరణము. అప్రాప్తే- "సంఘుష్టం వాక్యమాహ। సంఘుషితం వాక్యమాహ" అని యుదాహరణము.

ఇక ఆఙ్పూర్వక స్వనధాతువున కుదాహరణము-

దీని కంచెజరమగు నిష్ఠకు, ఇడాగమము వికల్పముగ నిషేధింపబడు చున్నది.

ఈ సూత్రమునకు "క్షుబ్ధస్వాంతధ్వాంత (7-2-18) సూత్రమునుండి, 'స్వాంతం మనసి' అను, లక్ష్యసంస్కారక వాక్యము ననువర్తింపజేసి, 'మనస్సు' అర్థమగునపుడు స్వనధాతువు నిష్ఠకిడాగమమురాదు' అని యర్థమును వర్ణించిన, నిత్యానిత్త్వము ప్రాప్తము. ఈ స్థితిలో ఆఙ్పూర్వకమగు నపుడు దాని నిష్ఠకు ఇడాగమ నిషేధము విభాషగ విధింపబడుచున్నది గాన నపుడు ప్రాప్త విభాషయగును 'స్వాంతంమనసి' అనునది యనువర్తింపని పక్షమున, 'స్వాంతం(మనః)' అనుచో నిత్యానిట్త్వమును, "ఆస్వాంతో దేవదత్తః" అను స్థలమునందు, మనస్సు అను నర్థమునకు ప్రసంగము లేనిచోట, విభాష యును చరితార్థములు.

ఇక 'ఆస్వాంతం మనః' అనుచోట నుభయప్రాప్తి.

ఇట్టియెడ, పూర్వ విప్రతిషేధమే సమ్మతమయి నిత్యానిట్త్వమే స్వీకృతమయిన యెడల, విభాషకు, మనస్సు అర్థముకానిచోటనే ప్రవృత్తి వక్తవ్యము. అపుడచట ననిట్త్వమునకు ప్రాప్తిలేదు గాన నిది అప్రాప్త విభాషయగును.

పర విప్రతిషేధముచే విభాషయే ప్రవర్తించిన, మనోర్థమున ప్రాప్త విభాషయు, తద్భిన్నార్థమున అప్రాప్త విభాషయునగును గాన నుభయత్ర విభాష కావలె. ఇది సందేహబీజము.

ఉభయత్ర విభాషయని సిద్ధాంతము.

'ఆస్వాంతంమనః' 'ఆస్వనితంమనః'- ప్రాప్తోదాహరణము.

ఆస్వాంతోదేవదత్తః, ఆస్వనితోదేవదత్తః- 'అప్రాప్తే' ఉదాహరణము.

భగవత్పతంజలి కృత మహాభాష్యమునందు, ప్రథమపాదమున షష్ఠాహ్నికమున కాన్దర్పివర్తము ముగిసినది.

# సప్తమాహ్నికము

## "ఇగ్యణస్సంప్రసారణమ్" (1-1-44)

'ఇక్ యణఃభవతి'='య, వ, ర, ల, ల స్థానమున, ఇ, ఉ, ఋ, ఌ వర్ణములు వచ్చును' అను వాక్యమునకా యీ సంప్రసారణసంజ్ఞ ?

లేక- యణ్ణుల స్థానమున, ప్రవర్తించిన ఇగ్వర్ణములకు సంప్రసారణ మను సంజ్ఞ '- అని వర్ణములకా యీ సంజ్ఞ? అని యాక్షేపము.

ఎట్లైననేమి విశేషము? అనిన-

**వా॥ సంప్రసారణ సంజ్ఞాయాం వాక్యస్య సంజ్ఞాచేద్వర్ణవిధిః"** అని దూషణ వార్తికము. సంప్రసారణ సంజ్ఞ వాక్యమునకనిన వర్ణస్థానమున నది సిద్ధింపకపోవును. వార్తికమునందలి 'వర్ణవిధి' అను పదమునకు, వర్ణమునాశ్రయించిన, పూర్వరూపము, దీర్ఘము మున్నగు కార్యమని యర్థము.

"సంప్రసారణాచ్చ" (6-1-108) అను సూత్రము, సంప్రసారణ వర్ణమునకు పరమయిన అచ్చునకు పూర్వరూపమేకాదేశముగా వచ్చునని చెప్పుచున్నది. ఇచె వర్ణము పరమగునపుడు వర్ణమునకు రాదగిన విధి. వాక్యమునకు సంజ్ఞ యను పక్షమున, వాక్యమనగా వాక్యార్థమనుట. వాక్యార్థమునకు వచ్చు పరమగుట అసంభవము. వాక్యార్థము క్రియారూపము గదా!

అట్లే "సంప్రసారణస్య" 6-1-139) అను సూత్రము సంప్రసారణమునకు దీర్ఘమును విధించునది. వాక్య సంజ్ఞాపక్షమున నీ నిర్దేశమే ఉపపన్నము గాదు. వర్ణరూపముగాని వాక్యార్థమునకు, పూర్వరూప దీర్ఘములను కార్యములు ప్రవర్తించుటయు సంభవరహితము.

'అటులైన వర్ణమునకే ఇది సంజ్ఞ అనవచ్చును' అనిన

**వా॥ "వర్ణసంజ్ఞా చేన్నిర్వృత్తిః"** అని దూషణము.

వర్ణమునకు సంప్రసారణమను సంజ్ఞ అన నిర్వృత్తి సిద్ధింపదు. నిర్వృత్తి అనగా సంప్రసారణ వర్ణ విధానము.

"ష్యఙః సంప్రసారణం పుత్ర పత్యోస్తత్పురుషే" (6-1-13) అను సూత్రము, సంప్రసారణము ష్యఙంత పూర్వపదమున కగునని చెప్పుచున్నది. యణ్ణు స్థానమున నిక్కు ప్రవర్తించిన తరువాత గదా దానికి సంప్రసారణమని

సంజ్ఞ కలుగునది. ఇంతకు పూర్వము ఇక్కు లేదుగదా! ఇక శబ్దములు శాస్త్ర నిష్పాద్యములుగావు. నిత్యములేయను పక్షమున అది లక్ష్యమైనను అయ్యావి యణ్ణు స్థానమున ప్రవర్తించినదని యే ప్రమాణముచే తెలియును? ప్రయోగ మున నగపడుచున్న ఇక్కునకు యణ్‌స్థానికత్వము శాస్త్రైకవేద్యమే కావ లెను. ఇందువలన ఇది ఇతరేతరాశ్రయమని తేలుచున్నది. ఇతరేతరాశ్రయము లగు కార్యములు సిద్ధింపవు. ఈ యాక్షేపములకు సమాధాన వార్త్తికము.

**వా॥ "విభక్తి విశేష నిర్దేశస్తు జ్ఞాపక ఉభయసంజ్ఞాత్వస్య"** అనునది. ఆయా భిన్నభిన్న విభక్తుల నిర్దేశము తత్తత్సూత్రములందగుపడునది, ఈ సంజ్ఞ వాక్యమునకును, వర్ణమునకును నని తెలియజేయును.

'సంప్రసారణముకంటె బరమయినది పూర్వరూపము నొందున'ని పంచమి విభక్తి నిర్దేశముచేతను, 'సంప్రసారణమునకు దీర్ఘమగును' అని షష్ఠీ నిర్దేశము చేతను నియ్యది వర్ణసంజ్ఞయనుట జ్ఞాపితము. 'ష్యఙంత పూర్వపదమునకు సంప్రసారణమగును'- అను ప్రథమా నిర్దేశము, వాక్యసంజ్ఞకు జ్ఞాపకము. కావున నియ్యది ఉభయసంజ్ఞ.

లేదా- ఇది వాక్యసంజ్ఞయే అనినను అనవచ్చును. ఆ పక్షమున వర్ణము నకు విధింపబడిన కార్యములు సిద్ధింపవంటిరేయనిన, సిద్ధింపవచ్చును. ఎట్లనిన,- 'సంప్రసారణాచ్చ' 'సంప్రసారణస్య' ఇత్యాది సూత్రములందు,సంప్రసారణ పదము నకు, 'సంప్రసారణ నిష్పన్నము' అని యర్థము. 'కాకివలన బుట్టినది కాకము' 'గ్రద్దవలన బుట్టినది గ్రద్ద' యనుచుంటిమి. అట్లే 'సంప్రసారణముకంటె' పర మయినదనగా నా సంజ్ఞగల వాక్యార్థమువలన నిష్పన్నమయినదనియు, సంప్ర సారణమునకనిన, దత్సంజ్ఞక వాక్యార్థ నిష్పన్నమునకనియు నర్థము. కావున వాక్య సంజ్ఞయే యను పక్షమును నుపపన్నమే.

లేదా సమాధానాంతరమును ఇట్లు చెప్పనగును.

అర్థబోధనమునకై సమగ్ర వాక్యములను బ్రయోగించినట్లు, వాక్యైక దేశములను బ్రయోగించువారలను, పదైకదేశములను బ్రయోగించు వారలను మనము లోకమున చూచుచున్నాము.

ప్రవిశ- పిండీమ్- ప్రవిశ- తర్పణమ్- అను నివి వాక్యైకదేశ ప్రయోగ ములు. అనగా, 'ప్రవిశ గృహమ్' అను వాక్యమునకు బదులు, తదేక దేశమగు క్రియా పదమాత్రమును, 'పిండీంభక్షయ' అను వాక్యమునకు బదులు, తదేక దేశమగు 'పిండీమ్' అను కర్మపదమును మాత్రమును, 'ప్రవిశగంగామ్' అను వాక్యమున నేకదేశమగు క్రియాపదమును, 'తర్పణంకురు' అనుదాని యేక

దేశమగు కర్మ పదము మాత్రమును ప్రయోగింపబడుచున్నవి. అట్లే, పదములకు బదులు తదేకదేశముల ప్రయోగములు- 'దేవదత్తః- దత్తః', 'సత్యభామా-భామా' అనునవియు గలవు

అట్లే, 'సంప్రసారణ నిర్వృత్తాత్' 'సంప్రసారణ నిర్వృత్తస్య' అను పదముల యేకదేశములగు 'సంప్రసారణాత్', 'సంప్రసారణస్య' అను వాని నా సూత్రములందు పాణిని ప్రయోగించెను. కావున తన్నిష్పన్నములందాయా కార్యములు ప్రవర్తించునని మనము తెలిసికొందము.

లేదా వేరొక సమాధానమును గలదు చూడుడు. 'బ్రాహ్మణ శతంభోజ్యతామ్' అందురు. 'బ్రాహ్మణుల యొక్క వందకు భోజనమును బెట్టుడు'- అని యర్థము. శతమనగా 'వంద' అను సంఖ్య. సంఖ్యకు భోజన కర్మత్వము సంభవ రహితము. కావున నది, సంఖ్యేయులగు బ్రాహ్మణులకు భోజనము పెట్టుడని అర్థము గ్రహింపబడుచున్నది గదా! అట్లే, సంప్రసారణ మనగా వాక్యార్థము. అది అసత్త్వ రూపము. దానికి, పౌర్వాపర్యమును స్థానిత్వమును సంభవించునవి కావు. కాగా 'సంప్రసారణ జాతమునకు' అని సామర్థ్యము వలన గ్రాహ్యము. కావున వర్ణకార్యములు ఈ పక్షమునను నిర్బాధములే.

లేదా- వర్ణమునకే సంప్రసారణ సంజ్ఞ. వాక్యమునకు గాదు. అట్లైన నిర్వృత్తి సిద్ధింపదంటిరి గదా! యనిన, సత్యమే. కాని అది దోషము గాదు. 'ఇతరేతరాశ్రయత' గదా వర్ణ సంజ్ఞా పక్షమున దోషము. ఇతరేతరాశ్రయ కార్యములు సిద్ధింపవు అను నాక్షేప మొక్క వాక్యముచే పరిహరింపబడినవి. ఏమని?

'సిద్ధంతు నిత్య శబ్దత్వాత్' అని చెప్పబడినదిగదా! శబ్దములు నిత్యములే గాని వ్యాకరణ నిష్పాద్యములు కావు. కాగా పరస్పరాశ్రయత లేదు అని తాత్పర్యము.

కాని యీ సమాధానము సరిపడదు. వృద్ధి సంజ్ఞ మున్నగు నితరేతరాశ్రయములతో నిది తుల్యము గాదు. అట ఆకారైకారౌకారములు వృద్ధి సంజ్ఞ కలవియనియే చెప్పబడినది గాని ఈ వర్ణము స్థానమున వచ్చిన ఆకారైకారౌకారములని చెప్పబడలేదు. ఇట నట్లుకాదు. యణ్ణుల స్థానమున విహితములైన ఇక్కులు సంప్రసారణములని ఇట చెప్పబడుచున్నది. 'నిత్యశబ్ద వాదమునైనను ఇక్కుల యణ్ స్థానికత్వము శాస్త్రైక సమధిగమ్యమే. కాగా నితరేతరాశ్రయత పరిహృతముగాదు' అనిన,

ఇట నీ సంజ్ఞ భావి సంజ్ఞగా గ్రహింపబడును గాన దోషములేదు. భావి సంజ్ఞలచే వ్యవహారము లోకసిద్ధము. ఎట్లనగా,

ఒక చేనేత పనివాని కడకు కొంత నూలును తీసికొని వెళ్లి యొకడు 'అయ్యా! ఈ నూలుతో నొక బట్టను నేసి యిమ్ము' అనును. అపుడు ఆ తంతువాయుడిట్లాలోచించును. 'ఈతడే బట్టను నేయుమనుచున్నాడు. బట్ట యయిన దానికిక నేయపని లేదు. అది నేయవలసినది యయిన నది బట్ట కాదాయె. 'బట్ట' 'నేయవలసినది' అను నీ రెండు మాటలును పరస్పర విరుద్ధములుగనున్నవి. కావున నీతని యాశయ మిట్లయియుండనోపును. భావి సంజ్ఞ నీతడు వ్యవహరించుచున్నాడు 'నేసిన తరవాత దేనికి శాటకమను వ్యవహారము కలుగునో దానిని నేయుమని యీతని తాత్పర్యము అని తలంతును' అని యాతడను కొనును.

అట్లే, యణ్ణుల స్థానమున ప్రవర్తించిన పిదప దేనికి సంప్రసారణమను సంజ్ఞ కలుగునో ఆ ఇక్కులు యణ్ణుల స్థానమున ప్రవర్తించునని భావి సంజ్ఞా విజ్ఞానము విధి ప్రదేశములందు గలుగునని తాత్పర్యము.

లేదా సమాధానాంతరమును నిట్లు చెప్పదగును. 'యజ్' 'వప్'- అను ధాతువులు, 'యజతి'-'వపతి' మున్నగు ప్రయోగములందు, స్వస్వరూపముతో ప్రయుక్తములయి యున్నను నవియే 'ఇష్టమ్' 'ఉప్తమ్' మున్నగు స్థలములందు 'ఇజ్' 'ఉప్' అని మారియున్నవి. ధాతూపదేశమునందు 'యజ్' 'వప్' అనుట వలన, 'ఇజ్' 'వప్' మున్నగునవి యసాధువులు కావలెను. కాని 'ఇష్టమ్' 'ఉప్తమ్' మున్నగు రూపములను లోకమున ప్రయోగించుచున్నారు. దాని వలన, వాని యణ్వర్ణములకు బదులు ఇగ్వర్ణములను ప్రయోగించుచున్నారని తలంతుము

స్థానాదేశ భావమనగా బుద్ధి యొక్క మార్పు మాత్రమే. యణ్వర్ణమునకు ప్రయోగము ప్రసక్తమయినప్పుడు దానికి బదులుగా ప్రయోగింపబడు ఇగ్వర్ణము సంప్రసారణమగునని ఈ సూత్రమున కర్థము. అట్టి జ్ఞానము 'వచిస్వపి' త్యాది సంప్రసారణ విధాయక శాస్త్రముల జ్ఞానము లేకున్నను గలుగును. కాబట్టి అన్యోన్యాశ్రయ ప్రసక్తి లేదు.

వచిస్వపిత్యాది సూత్రము, 'ఈ ధాతువుల యణ్వర్ణములకు, ప్రయోగము ప్రాప్తము కాగా, ఇగ్వర్ణముల ప్రయోగము సాధువగును' అని సంప్రసారణమునకు పూర్వము అసాధువులుగా భావింపబడిన వానికి సాధుత్వమును బోధించును. కాగా, కిత్తులు పరమగునపు డీ రూపము సాధువు. జిత్తులు పరమగు నపుడియ్యవి సాధువులు అని చెప్పుటయే శాస్త్రకృత్యము గాని, తన్నిష్పాదనము శాస్త్రమునకు బనికాదు. శబ్దములు నిత్యములే అని భావము.

ఇగ్యణస్సంప్రసారణమ్ - ఈ సూత్ర వివర్తము ముగిసినది.

"ఆద్యన్తౌటకితౌ" 1-1-45

టశ్చక్చ = టకౌ, టకౌ ఇతౌ యయోస్తౌ టకితౌ, ఆదిశ్చ అంతశ్చ= ఆద్యంతౌ. టిత్తులును కిత్తులును ఆద్యంతావయవములగునని యర్థము. ఆద్యంతౌ అను పదమును, టకితౌ అను పదమును సమాసములు. కావున టిత్కిత్తులలో నెయ్యవి యాద్యవయవములో ఎయ్యవి యంత్యావయవములో దెలియుటలేదు. సమాస నిర్దేశ స్థలములందు సముదాయార్థమే ప్రతిపాదిత మగును. లోకమునందును దేవదత్త యజ్ఞదత్తులు 'అజాతి ధనులు' అనిన నందెవనికి మేకలు సొమ్ములో, ఏ వానికి గొఱ్ఱెలు ధనమో తెలియదు గదా!

'దేవదత్తునకును యజ్ఞదత్తునకును అజలును, ఆవులును ధనము' అని వ్యస్తముగ జెప్పినపుడును నా వివరము తెలియనపుడు సమాస నిర్దేశమున ఇక చెప్పనేల ? అని, అన్వయానుపపత్త్యాక్షేపము కలుగగా, లౌకిక ప్రయోగము లందదియట్లేయనుకొనుడు. కాని పురుషారంభము, లౌకిక దృష్టాంతమునకు నివర్తకమగును అని సమాధానము॥

అట్టి పురుషారంభము ఏదేని శాస్త్రమునందు కలదా అనిన, కలదు. పురుషారంభమనగా శాస్త్రప్రవర్తక పురుషుని సూత్రము. సంఖ్యాతాను దేశమను పురుషారంభము, సముదాయ నిర్దేశ స్థలములందు క్రమాన్వయమును బోధించునది కలదు. సంఖ్యాతాను దేశమనగా "యథా సంఖ్యమనుదేశస్సమానామ్" (1-3-10) అను శాస్త్రము. కావున నన్వయానుపపత్తి పరిహృత మగును.

ఆద్యంతములుగా ప్రవర్తించు నీ టిత్కిత్తులు ఎయ్యవి ? ఆగమములా ? ఆదేశములా ?

ఆగమములు, ఆద్యంత పదములు, అవయవ విశేష వాచకములు గదా ! ఆది అనగా ప్రథమావయవము. అంతమనగా చరమావయవము.

ఏమండీ ! శబ్దములు నిత్యములు గదా ! అపుడాగమ విధానము ఎట్లు ఉపపన్నమగును ? అవి ఆకాశమువలె చేర్పులును కూర్పులునులేనివి. కూటస్థములు, నాశరహితములును కావలెను కదా ? అపాయము గాని, ఉపజనము గాని వికారము గాని నిత్యములయిన వానికి ఉండరాదే ? ఆగమ మనగా అపూర్వముగ వేరొక శబ్దము వచ్చిచేరుట గదా ? అని ఆక్షేపము రాగా, శబ్దములు నిత్యములు శాస్త్ర నిష్పాద్యములు కావు అనునపుడాదేశ విధానము మాత్రము ఎట్లు ఉపపన్నమగును ? అని ప్రత్యాక్షేపము.

చక్కగ నుపపన్నమగును. ఆదేశ విధాన స్థలములందు 'ఇవి శబ్దాంతరములు' అను ప్రతిపత్తి కలుగును. శబ్దాంతరబుద్ధి, అనగా 'స్థానిబుద్ధి తొలగును' అని సమాధానము.

అట్లైన నాగమములును నాదేశములే కాగలవు. ఆగమరహితములకు తత్సహితములు ఆదేశములు అనుట. అది యెట్లు?

అనిన- ఇది సంజ్ఞాధికారము. ఆద్యంతౌ అను పదము పూర్వోచ్చారితము. 'ట కి తౌ' అనునది పరోచ్చారితము. ఆద్యంతములకు సంకీర్తనమును, టిత్కిత్తుల కుదాహరణమును సూత్రమున చేయబడినవి. సంజ్ఞా సంజ్ఞిభావము గల స్థలములందెల్ల, పూర్వోచ్చారితము సంజ్ఞియు, బరోచ్చారితము సంజ్ఞయును అగునుకాన, ఆద్యంతములకు, ఇత్సంజ్ఞకటకారకకారములు సంజ్ఞలగును. "ఆర్ధధాతుకస్యేడ్వలాదేః"- అను మున్నగు విధి ప్రదేశములందు ఈ సంజ్ఞాసూత్ర ముపస్థితమగును. 'ఇట్' అను పదమునందు ఇత్సంజ్ఞకటకారము కలదుగాన అట 'ఆదిః' అని యుపస్థితమయి 'తవ్య' అను నార్ధ ధాతుకమునకు, 'ఇతవ్య' అను నికారాద్యాదేశము వచ్చును అని యర్థమగును.

"ఆర్ధధాతుకస్యేడ్వలాదేః"- అను సూత్రమున 'ఇట్' అను పదము మాత్రమే కలదుగదా. అంత మాత్రమగు సూత్రమునకు, అనగా సూత్రావయవమునకు, ఇకారాద్యాదేశమగునని యర్థము ఎట్లు లభించుననిన, ఇది బహువ్రీహి నిర్దేశము కాన లభ్యముకావచ్చును. 'ఇ=ఇకారము, ట్=ఆదిగా, యస్యసః=దేనికి గలదోయది' అని 'ఇట్' అనుపదమునకర్థము.

సరి. ఇచట అట్లు సిద్ధింపవచ్చును. కాని "లుఙ్లఙ్లృఙ్క్ష్వడుదాత్తః" (6-4-71) అను సూత్రమున ఎట్లు? అచటను 'అట్' అను పదమునకు 'అకారాది ధాతువు' అనిగదా యర్థము. అందుదాత్తః అనునది అకారమునకు విశేషణము గాని అకారాదికి కాదుగదా అపుడంగాంతవర్ణముదాత్తము కావలసివచ్చును. అది అనిష్టము.

అనిన అదియును కుదురును. ఆ సూత్రమున 'అడుదాత్తః' అనునది యేకపదము. అవి రెండు పదములుకావు. త్రిపద బహువ్రీహి యగుటవలన, అః, ట్, ఉదాత్తః యస్యసః అని విగ్రహము. అందలి మూడు పదములలో, ఉదాత్తః అనునది అకారమునకువిశేషణము. ఉదాత్తమగు అకార మాది యందు కల ఆదేశమగును అని యర్థమగును. ఉదాత్తః అను పదమిపుడు విశేషణమగుటచే పూర్వ నిపాతార్హమైనను పరనిపాతము సౌత్రమగుటచే సాధువు.

కాని, 'ఆడజాదీనామ్' (6-4-72) అను సూత్రమునసెట్లు? అందుదాత్త పదములేదు. అట అది అనువృత్తి లభ్యముగదా అనిన ఆ సూత్రమే ప్రత్యా

ఖ్యాతము కానున్నది. అజాది ధాతువులకు గూడ అడాగమమే రావచ్చును. కాబట్టి ప్రకృత సూత్రము సంజ్ఞాసూత్రమయినను నెట్టి దోషమును లేదు.

లేదా- పాణిని, సామాన్యముగ నుపదేశింపగలదానిని ముందుపదేశించు చుండును- ప్రకృతిని, తరువాత వలాద్యార్ధధాతుకమును, ఆ తరువాత చివరగా ఇకారమును. అందుచేత నీతడు విశేషముగ 'ఇతవ్య' అనుదానిని 'తవ్య' అనుదానికంటె భిన్నమగు శబ్దమునుగనే భావించుచున్నాడు. లౌకిక ప్రక్రియలోగూడ ఈతీరు అగపడుచున్నది. ఖదిరము, బర్బురమును రెండు వృక్షములు. వాని ధర్మములను ప్రతిపాదింపదలంచినపుడు ముందుగ, 'ఖదిర బర్బురములు తెల్లని కాండముగలవియు, చిన్నచిన్న ఆకులుగలవియుగా నుండును' అని వాని సామాన్య ధర్మమును ఉపదేశించి,తరువాత 'అందు ఖదిరము కంకటము గలది' అని చెప్పును. కంకటమనగా త్వక్కుయొక్క సంవాహము-చర్మముమీద ఎత్తుగా ఉండు కణుపులు కావచ్చును. ఈ విశేష ప్రతిపాదనముచే ఖదిరము ద్రవ్యాంతరమనియు కంకటములు దాని అవయవములనియు దెలిసికొనును. అంతియగాని కంకటములపుడు క్రొత్తగ నా వృక్షమునందు ఆరోపింపబడుట లేదు. అది ప్రతిపాదనోపాయము మాత్రమే. ఆ విధముగనే, 'తవ్య' అనుదానికి అపూర్వముగ నికారము చేర్పబడునని అర్థముకాదు. కాగా ఆదేశ స్థలములందు వలె నాగమ విధానములందును బుద్ధి విపరిణామ మాత్రమే. కావున శబ్దముల నిత్యత్వమునకు హానిలేదు.

లేదా-వేరొక రీతిగను సమాధానము చెప్పనగును. ఎట్లన పాణిన్యాచార్యుడు, ప్రకృత్యుపదేశ, వలాద్యార్ధ ధాతుకోపదేశములను జేసి, తరువాత ఇకారోపదేశము చేయుట అను ఈ ఆనుపూర్విచే, బోధకమగు సత్యశబ్దముకంటె భిన్నమగు, రేఖాగవయస్థానీయమగు శబ్దమును ప్రతిపాదింపదలంచినాడు. తరువాత ఉపదేశించిన ఇకారమునందు అతనికి ఆగమ మిదియను బుద్ధి కలుగును. ఇది అసత్య శబ్దముగాన నిండాగమబుద్ధికలిగినను శబ్ద నిత్యత్వమునకు భంగము లేదని భావము. గవయమృగము నెరుంగదలంచినవానికి రేఖలలో దాని రూపమును గీచి చూపుదురు. ఈ రేఖాత్మక గవయము సత్యగవయము కానట్లే వ్యాకరణ నిష్పాదితమగు ఈ శబ్దమును సత్యముగాదు' సత్యశబ్దమఖండము దానికిది వ్యుత్పాదకము మాత్రమే అని నిష్కర్షము. ఈ సమాధానమునకు ముందుచెప్పిన సమాధానములో సత్యశబ్ద వ్యుత్పాదన ప్రణాళియే ఇది అనియు, ఈ సమాధానమున కల్పిత శబ్దబోధన ప్రణాళి ఇది అనియు భేదము గమనింపదగినది.

**వా॥ "ఏకితోరాద్యంత విధానే ప్రత్యయప్రతిషేధః"** అని యాక్షేపవార్తికము.

'టిత్తులు ఆద్యవయవములగును, కిత్తులు అంతావయవములగును' అని విధించినపుడు, 'ప్రత్యయములు మాత్రము టిత్తులును కిత్తులునయినను అట్లు ఆద్యంతావయవములుగ ప్రవర్తింపవని వచింపవలసియుండును' అని వార్తికార్థము. లేనిచో 'చరేష్టః' (3 2-16) అను 'ట' ప్రత్యయము చరధాతువునకాద్యవయవముగను, "ఆతోనుపసర్గేకః" (3-2-3) అను 'క' ప్రత్యయము అంతావయవముగను రావలసివచ్చును

ఈ సూత్రముస్థానే యోగత్వమునకే అపవాదము కావలెను. అది ప్రత్యయపరత్వమున కపవాదము కారాదు.

ఈ యాక్షేపమునకు **"పరవచనాత్సిద్ధమ్"** అనునది సమాధాన వార్తికము. "ప్రత్యయః" (3-1-1) "పరశ్చ" (3-1-2) అని ప్రత్యయమునకు పరత్వము విధింపబడుటవలన అది యాదిగాగాని అంతముగాగాని రాదని యర్థము.

మరల నాక్షేపవార్తికము **"పరవచనాత్సిద్ధమితిచేన్న అపవాదత్వాత్"** అనునది. పరవచనము వలన సిద్ధించుననిన కాదు. ఇది అపవాదము. కావున ఇయ్యది తనకు బాధ్యములయిన వానినెల్ల బాధించును. ఏ విధముగ "మిదచోంత్యాత్పరః" అను యోగము స్థానే యోగత్వమునకును ప్రత్యయ పరత్వమునకును నపవాదమో యట్లే ఇదియును కావలసివచ్చును.

ఈ ఆక్షేప దృష్టాంతోపన్యాసము విషమము.

'నుమ్' 'శ్నమ్'- మున్నగువాని మిత్కరణము నిరవకాశముగాన అది స్థానే యోగత్వ ప్రత్యయ పరత్వములను బాధించుననుట యుక్తమే. ఇట నట్లు కాదు. ఇట నుభయమును సావకాశము. టిత్కరణమువలన జీప్పు ప్రవర్తించును. "టిడ్ఢాణఞ్" 4-1-15) ఇత్యాది సూత్రము టిదంతములకు స్త్రీత్వమున జీప్పును విధించుచున్నది. కిత్కరణమునకు అవకాశము. 'గతి' అని అనగా "గమహనజనఖనఘసాం లోప క్జిత్యనఙి" ... "ఆతోలోప ఇటిచ" (6-4-64) అని కిత్తులు పరమగునపుడు వచ్చెడి ఆకారలోపము. కాగా ఆగమముల టిత్త్వ కిత్త్వములు అనవకాశములును, ప్రత్యయముల 'టిత్త్వ' కిత్త్వములు సావకాశములును నగుటచే, 'యేన నాప్రాప్తి' న్యాయముచే నియ్యది స్థానేయోగత్వమునకే అపవాదము.

ఇట ఒక ప్రశ్న. టిత్త్వమున కీకార ప్రత్యయము ఫలమంటిరి. కాని ఈ టిత్తు అవశ్యము పరముగ ప్రవర్తించిన యెడల, తదంతమున కపుడు జీప్పు రావచ్చు. అది ఫలము కావచ్చును. టిత్కరణమువలన ఇది పరముగనే ప్రవర్తించును. 'ఆద్యవయవముగ కాదు' అనియు, 'కిత్కరణమువలన పరమే యగును, అంతావయవముగా ప్రవర్తింపదు' అని ఎట్లు చెప్పనగును? నియమ

ముగ ప్రవర్తించునదియే ప్రయోజనము. అట్టి దానినే ప్రయోజనముగ చెప్పవలెను.

టిత్తున కీపరిహారము = 'అనగా ననవకాశము బాధకమగును' అనునది యుక్తమైన కావచ్చును. అది పరముగా ప్రవర్తించుటయు, ఆద్యవయవమగుటయు సంభవింపదు గదా! కిత్తునకీది పరిహారము కాజాలదు. అట పరత్వమును నంతావయవత్త్వమును సంభవముగలవి. సమాసాంత ప్రత్యయముల వలె పరముగ ప్రవర్తించినది గూడ నవయవమగును.

అయిననేమి దోషమనిన,

ఆధి శబ్దమును, ప్రధి శబ్దమును కిప్రత్యయాంతములు. వానికి షష్ఠీ ద్వివచనాంత రూపములగు 'ఆధ్యోః' 'ప్రధ్యోః' అను వానిలో "నోఙ్ధాత్వోః" (6-1-175) అను సూత్రముచే, ధాత్వవయవమైన యణ్ణుకు బరమైన శసాది విభక్తికి ఉదాత్త స్వర ప్రతిషేధము రావలసి వచ్చును. అచట "ఉపసర్గేఘోః కిః" (3-3-92) అను సూత్రముచే ధాతువునకు పరముగ 'కి' అను ప్రత్యయము ప్రవర్తించినది ధాతువు చివరి ఆకారమునకు లోపము. కిప్రత్యయముయొక్క ఇకారము ధాత్వవయవమైన, దాని స్థానమున వచ్చిన యకారము కంటె పరముగ విభక్తి కలదుగాన, పై స్వర నిషేధము రావలసి వచ్చును.

టిత్తునకును ఇది పరిహారముగాదు. ఇది టిత్త్వమువలన నాదియేయగును గాని పరముగాదు గదా! 'చరేష్టః' (3-2-16) ఇత్యాదులందును, "ఆద్యంతౌ టకితౌ" (1-1-46) అను సూత్రమే, బాధ్య సామాన్య చింతచే, ప్రత్యయ పరత్వమును గూడ బాధించును. కావున అట ప్రత్యయము టిత్కరణమువలన నాద్యవయవమయియే ప్రవర్తించును గాని, "పరశ్చ" (3-1-2) అను సూత్రము చేత పరముగ ప్రవర్తింపదు.

'ఉదంత ప్రాతిపదికమునకు పరముగ డీప్ప్రత్యయము వచ్చును'. అను విధికిక టిత్తులగు ప్రత్యయములందుగల ప్రాతిపదికములలో నెచ్చట సార్థక్యము లభించును? టిత్తులన్నియు నాద్యవయవములే యగునుగదా యనిన,

టిత్త్వ కిత్త్వములు రెండును గల ప్రత్యయము అంతమునగల 'సామగీ' 'సురాపీ' ఇత్యాదులందు సార్థక్యముకలదు. టక్ప్రత్యయము టిత్త్వ కిత్త్వములు రెండును గలది. అది కిత్త్వము వలన అంతావయవమే యగును. దానికి టిత్త్వమును నున్నను, 'ఆద్యంతౌ' అను సూత్రమున 'కిదంతః' అను వాక్యము పరమగుటచే శబ్ద పరవిప్రతిషేధమువలన నదియే ప్రవర్తించును. ప్రకృతికది పరమును నగును. కాన నట డీప్ప్రత్యయమురాదగును. అందువలన 'చరేష్టః' అను ట ప్రత్యయము మున్నగు టిత్తులు ఆద్యవయవములే కావలసివచ్చును.

బాధ్య సామాన్య చింతాశ్రయణపక్షము నంగీకరించినను నీసూత్రము ప్రత్యయ పరత్వమును బాధింపదు. అది యెట్లు సిద్ధమనిన 'షష్ఠ్యధికారమున నీ సూత్రమునకు నిర్దేశమువలన సిద్ధించును' అను నాశయముతో వార్త్తికకారుడు, "సిద్ధంతు షష్ఠ్యధికారే వచనాత్" అని పఠించెను.

అనగా నీ సూత్రమును షష్ఠ్యధికారమున నిర్దేశింపదగును. ఎట్లు ? "ఆద్యంతౌ టకితౌ షష్ఠీ నిర్దిష్టస్య" అను నర్థము లభించునట్లు, 'షష్ఠీస్థానే యోగా' అనుచో దీనిననువర్త్తించి వ్యాఖ్యానించుట గాని దానినిట కపక ర్షించుటగాని కర్తవ్యమని భావము.

ఈ సూత్రము ప్రత్యయ విధులందు ప్రవర్త్తింపదనుటకు నిమిత్తాంత రమునుగూడ వార్త్తికకారుడిట్లు చెప్పుచున్నాడు.

**వా॥ "ఆద్యంతయోర్వా షష్ఠ్యర్థత్వాత్ తదభావే అసంప్రత్యయః"** షష్ఠ్యధికార సంబంధ మీ సూత్రమునకు లేకున్నను, షష్ఠ్యంత పదార్థము, ఆద్యంతావయవ నిరూపకముగాన, ఆద్యంతములు షష్ఠ్యర్థములు. అనగా షష్ఠ్యంత పదార్థ ప్రయోజకములు. షష్ఠ్యర్థము నాకాంక్షించునవి. కావున షష్ఠ్యంతార్థమును, తద్బోధనమునకై షష్ఠ్యంత పదప్రయోగము అట ఉండును. 'ఇపుడది లేనందున, ఆద్యంతముల ఉపస్థితి లేదని తెలియుచున్నది' అని భావము.

అర్థమునకు శబ్దము నిమిత్తమగుట యుక్తమగునా? శబ్దమునకే అర్థము నిమిత్తము కావలదా? షష్ఠ్యంత పదముండిన, దాని యర్థమునుండును. కావున నాద్యంతముల యుపస్థితి కలుగును. షష్ఠి లేనపుడు దాని యర్థమును లేదు. 'ఆద్యంత ప్రతీతియు లేదు' అని చెప్పుటవలన, శబ్ద మర్థమునకు కారకమని పర్యవసితమగుచున్నది. అది యుక్తముగాదు. శబ్ద మర్థమునకు జ్ఞాపకమేగాని కారకముగాదు. అట్లైన అన్ని శబ్దములును వాని వాని యర్థములను ఉత్పాదింప వలసి వచ్చును. రత్నశబ్దము రత్నముల నుత్పాదింపదు గదా? అని యాక్షే పము.

అర్థ నిమిత్తకమే శబ్దము. అర్థమే శబ్దమునకు గారణము. అర్థ ప్రతిపాద నముకొరకే శబ్దప్రయోగము చేయబడునుగదా! ఆద్యంతములు షష్ఠ్యర్థములు. ఇటనేమో షష్ఠ్యంత పదము అగపడదు. దానివలన ఇట్లు మనము తలంతుము= ఆద్యంతములిచట లేవు. అవి లేనందువలన షష్ఠ్యంత పదమును లేదు అని సమా ధానము.

శబ్దము లేనపుడు దానికి ప్రయోజకమగు నర్థమిట లేనందున అది లేదని యూహింపవలసి యుండును. కార్యాభావమును హేతువుచేసి కారణాభావ

ముని ననుమానింతుము. ఇట్లే కారణాభావమువలన కార్యాభావమును సిద్ధించును. ఆద్యంత రూపకారణము లేనందున, షష్ఠరూప పదమును లేదనుట.

కావున, 'ఆద్యంతౌటకితౌ' అనునీ శాస్త్రము ప్రత్యయ విధులయందుశి షష్ఠిలేనందున నుపస్థితముకాదు. కాగా నియ్యది ప్రత్యయ పరత్వమున కప వాదముకాదు.

"ఆద్యంతౌటకితౌ" అను సూత్రమునకు ఆంధ్ర వివర్తము ముగిసినది.

## ॥మిదచోంత్యాత్పరః॥ (1-1-46)

మకార మిత్సంజ్ఞక వర్ణముగాగలది. అచ్చులలో జివరి దానికి పరమై సముదాయమున కంతావయవమయి ప్రవర్తించును.

ఏతత్పరి భాషా బాధ్యమేమియని విచారింతము.

ఈ సూత్ర మే ప్రయోజనమునకై చెప్పబడినది? దీనికి స్థానే యోగత్వ వ్యావృత్తి మాత్రమే ప్రయోజనమా ? లేక ప్రత్యయ పరత్వ వ్యావృత్తియు ప్రయోజనమగునా ? అను ప్రశ్నకు,

**వా॥ "మిదచోంత్యాత్పర ఇతి స్థాన పరప్రత్యయాపవాదః"-** అను వార్తికము సమాధానము॥

"మిదచోంత్యాత్పరః" అనునది స్థానే యోగత్వమునకును, ప్రత్యయ పరత్వమునకును అపవాదముగ చెప్పబడుచున్నది. అందు, 'కుణ్డాని', 'వనాని' 'పయాంసి' 'యశాంసి' అను స్థలముల స్థానే యోగత్వమున కపవాదము. 'భినత్తి' 'ఛినత్తి' అనుచో, ప్రత్యయ పరత్వమున కపవాదము.

కుండ, వన శబ్దములకు సర్వనామస్థానము పరమయినపుడు. 'నపుంసకస్య ఝలచః'———— అను సూత్రముచే అజంతత్వ ప్రయుక్తమును, పయస్, యశస్, శబ్దములకు ఝలంతత్వ మూలకమునునగు నుమాగమము, అజంత ఝలంతాంగముల స్థానమున నంతాదేశముగ ప్రవర్తింపకుండగ, అంత్యాచ్చుకు పరమగు నవయవముగ బ్రవర్తించుట ఒక ప్రయోజనము. "రుధాదిభ్యః శ్నమ్" (3-1-78) అని విధింపబడిన శ్నమ్ము ప్రత్యయమగుటచే పరముగ ప్రాప్తించు చుండ నంత్యాచ్చుకు పరావయవముగ ప్రవర్తించుటయు ప్రయోజనము.

ఇట నొక యాక్షేపముపస్థితమగుచున్నది. 'కుణ్డాని', 'వనాని' యను నుదాహరణములందు, అంత్యాచ్చుకు పరముగ ప్రవర్తించుటయు దాని స్థానమున నది వచ్చుటయు సంభవ రహితములుగాన ఆ యుదాహరణము యుక్తముగా వచ్చును. 'పయాంసి' 'యశాంసి' అను నుదాహరణమయుక్తము. ఏలయనగ, ఇట సకార స్థానమున నుమ్ము ప్రవర్తించినను అంత్యాచ్చుకు పర

మగుట, స్థానమున వచ్చుటయు సంభవించును గదా ? కాగా నదియె ట్లుదాహరణమగును ? అనిన,

ఇదియు యుక్తమే యగును. ఎట్లన, అపవాద శాస్త్రములచే ఉత్సర్గ శాస్త్రములు బాధింపబడవలెనని ఈశ్వరు డాజ్ఞాపింపలేదు. ధర్మశాస్త్రకారులును శాసింపలేదు. ఇది లోక సిద్ధమగు వ్యవహారము. అనగా లోక దృష్టమయిన దానిని అనుసరించి చేయబడిన నిశ్చయము. లోకమునందు, రెండింటికిని సంభవ మున్నను, అపవాదము ఉత్సర్గమును బాధించుట కనబడుచున్నది.

"బ్రాహ్మణుల కందరకును పెరుగు వడ్డించుడు. కౌండిన్యునకు మజ్జిగ పోయుడు" అని భోజన ప్రకరణమున వ్యవహారమొకటి కలదు. అట కౌండి న్యునకు తక్రమును వడ్డించుటకు ముందుగాని తరువాతగాని పెరుగును వడ్డింప వచ్చును. కావున నుభయదానమున కవకాశము లేకపోలేదు. అయినను తక్ర దానము దధిదానమునకు నివర్తకమే యగుచున్నది.

"బ్రాహ్మణేభ్యో దధి దీయతామ్ తక్రం కౌణ్డిన్యాయ" అను వ్యవహారమున కౌండిన్యుడును బ్రాహ్మణుడే అయినను అతనికి తక్రమేగాని దధిలేదు. ఆ విధము గనే 'పయాంసి' 'యశాంసి' అను స్థలమున, నుమాగమము సకారస్థానమున ప్రవర్తించిన, అంత్యాచ్చుకు పరమగుటయు, స్థానమున వచ్చుటయు సంభ వించుననుకొనుడు. అయినను స్థానేయోగత్వము బాధింపబడవలసినదే. లోకము నందలి వృద్ధవ్యవహారమున అట్లగపడుటవలన, విశేషవిహితము, సామాన్య విహితమును నివర్తింపజేయునేగాని వానికి సముచ్చయముగాని వికల్పముగాని ఉండబోదని పర్యవసానము.

**వా॥ "అంత్యాత్పూర్వో మస్జేర్మిదనుషంగ సంయోగాది లోపా ర్థమ్"**- అను వార్తికము, ఈ సూత్రమునకు ప్రవృత్తి విషయము కానిస్థల ములను బ్రదర్శించును.

'టుమస్జో' శుద్ధౌ- అని యొక ధాతువు. 'మగ్నః' అనునది దీని క్త ప్రత్యయాంతరూపము. 'మస్ జ్+త' అను నవస్థలో "మస్జినశో ర్ఝలి" (7-1-60) అను సూత్రముచే 'నుమ్' అను నాగమము ప్రవర్తించును. అది చివరి అచ్చు నకు బరముగ బ్రవర్తించిన 'మస్న్ జ్' అనియగును. అపుడు నకారము ఉపధ కాదుగాన, "అనిదితాంహల ఉపధాయాః క్ఙితి" (6-4-24) అను సూత్రముచే రాదగిన లోపము రాకుండును. కావున నుమాగమము జకారమునకు బూర్వము ప్రవర్తింపవలెను. అపుడు 'మస్న్ జ్' అని యగును గాన నలోపము సిద్ధిం చును. పిదప, సంయోగాదిలోప, కుత్వనత్వములు రాగా మగ్నః అను రూపము ఏర్పడును. ఉపధా నకారమున కనుషంగమని పూర్వ వైయాకరణుల పరిభాష. కావునకు లోపము సిద్ధించుటకు, ఈ ధాతువునందు, మిత్తున కంత్యాచ్పరమ

నకు ముందుగ ప్రవృత్తియని చెప్పుటకు ఫలము. 'మగ్నవాన్' అనునదియు లక్ష్యము.

ఇట్లే, సంయోగాది లోపము కొరకు గూడ అట్లు చెప్పవలసి యున్నది. 'మక్త్వా' 'మఙ్క్తుమ్' మఙ్క్తవ్యమ్-మున్నగునవి యుదాహరణములు. 'మస్ న్ జ్' అనుచో, -సనజ-ల సంయోగమునకు సకారమాదివర్ణమగును గాన సంయోగాది లోపము సిద్ధించును. ఇట ననుషఙ్గ లోపమునకు ప్రసక్తి లేదు.

వేరొక యాక్షేప వార్తికము —వా॥ భర్చిమరీచ్యోశ్చ"- అనునది.

'భ్రుజీభర్జనే'- అను ధాతువునందును, "మర్చ శబ్దార్థే"- అనుధాతువు నందును మిత్తు అంత్య వర్ణమునకు పూర్వము వచ్చును గాని అంత్యాచ్చునకు పరముగరాదు అని చెప్పవలెనని వార్తికార్థము. 'భరూజా' అనునదియు, 'మరీచయః'- అనునదియు నుదాహరణములు.

అందు, 'భ్రుజీ' అను ధాతువుకంటె పరముగ ఔణాదికమగు 'అచ్' అను ప్రత్యయమువచ్చును. గుణము ప్రవర్తించిన తరువాత భర + అ అను నవస్థలో జకారమునకు ముందు ఊమాగమమువచ్చి 'భరూజా' అను రూపము కావలెను.

మరీచి శబ్దమున చకారమునకు ముందు 'ఈమ్' అను నాగమము రావలెను. ఇందు 'ఇ' అనునది ఔణాదికమగు ప్రత్యయము. 'ఊమ్' 'ఈమ్' అను నాగమములు గూడ నౌణాదికములే.

అట్లైన నీ లక్ష్యముల సిద్ధికై "అంత్యాత్పూర్వోమిత్" అని చెప్పక తప్పదని యభిప్రాయమా?

వార్తికకారుని యభిప్రాయమదియే. కాని నిపాతనమువలన నీ రూపములు సిద్ధించును కాన నీ వార్తికముతో పనిలేదు.

'భరూజా' శబ్దమంగుళ్యాది గణమునందు నిపాతితము. మరీచి శబ్దము బాహ్వాదులందు పఠితము. కాబట్టి వచనమనావశ్యకము.

**మిత్తులకు, పూర్వాంతత్వ స్థాపన విచారము**

ఇది పూర్వాంతమా? పరాదియా? అభక్తమా? అని విచారము.

ఎట్లైన, పూర్వాంతమగును? పరాది యెట్లగును? అభక్తమెట్లగును?

"ఆద్యంతౌటకితౌ" అను పూర్వ సూత్రము నుండి అంత పదమిందను వర్తించిన, మిత్తు పూర్వాంతమగును. ఆది పదమనువర్తించిన, పరాదియగును.

ఆ రెండును ననువర్తింపకున్న అభక్తమగును. అభక్తమన బూర్వమునకుగాని పరమునకు గాని సంబంధింపక తటస్థమై ఉండునదియని యర్థము. అందేమైన నేమి ? అనిన -

**వా॥ "అభక్తే దీర్ఘ నలోప స్వరణత్వాను స్వారశీభావాః"** అని దూషణములు వార్తికకారునిచే చెప్పబడినవి. అభక్తమయిన నివి సిద్ధింపక పోవును అని తాత్పర్యము.

(1) అందు మొదటిదిదీర్ఘము- 'కుణ్డాని' 'వనాని' అనుచో, "నపుంసకస్యఝలచః" (7-1-72) అను సూత్రముచే విధింపబడిన నుమాగమము, అంగమునకు సంబంధించినది కాదు కాన, "సర్వనామ స్థానేచా సంబుద్ధౌ" (6-4-8) అను దీర్ఘము సిద్ధింపకపోవును.

(2) రెండవ దూషణమునలోపాసిద్ధి॥ 'తాని' అను లౌకిక భాషయందలి రూపము, వేదమునందు 'తా' అని యుండును. అట "శేశ్ఛన్దసి బహులమ్" (6-1-70) అను సూత్రముచే శిప్రత్యయమునకు లోపమురాగా, తాన్ అని యున్నపుడు "నలోపః ప్రాతిపదికాంతస్య" (8-2-7) అను సూత్రముచే నకారమునకు లోపము రావలెను. ఈ నకార మభక్తమగుటవలన ప్రాతిపదికాంతావయవము కాదుగాన నది సిద్ధింపదు.

(3) మూడవ దూషణము స్వరాసిద్ధి- "సర్వాణిజ్యోతీంషి" అనుచోట, "సర్వస్యసుపి" (6-1-191) అను సూత్రముచే, సుప్పుపరమగునపుడు సర్వ శబ్దమున కాద్యుత్తము విధింపబడినది. నుమాగమముచేత సుప్పు వ్యవహితమగు నందున నిపుడది సిద్ధింపకపోవును.

(4) ణత్వాసిద్ధి చతుర్థ దూషణము- 'మాషవాపాణి' 'వ్రీహివాపాణి' (క్షేత్రాణి). మినుములను జల్లు పొలములు, ధాన్యమును నారుపోయు పొలములు అని యర్థము.ఇట మాషవాపాన్ + ఇ అనునవస్థలో నకారము ప్రాతిపదికాంతముగాన, "ప్రాతిపదికాంత నుమ్విభక్తిషుచ" (8-4-11) అని ణత్వము సిద్ధించును. ఇది పరాదియైనను, నపుడు విభక్తిస్థమగును గాన నది సిద్ధింపవచ్చును. అభక్తమను పక్షమున సిద్ధింపదు. అందుకొరకు, నుమాగమస్థ నకారమునకు గూడ నా సూత్రముచే ణత్వమును విధింపవలసియుండును, కాని యిది దూషణముకాదు. ఆ సూత్రమున 'నుమ్' అనునది చేర్పబడియేయున్నది.

(5) అనుస్వారా సిద్ధి పంచమ దూషణము-

'ద్విషంతపః' 'పరంతపః'- అను రూపములు 'ఖచ్' అను కృత్ప్రత్యయమంతమువందు గలవి. "ద్విషత్పరయోస్తాపేః" (3-2-39) అనునది దద్విధాయకము. "ఖచిహ్రస్వః" (6-4-94) అను సూత్రముచే 'తాప్' అనుచో తకార దీర్ఘమునకు హ్రస్వమును, "అరుర్ద్విషదజంతస్యముమ్" (6-3-67) అని ముమాగమ

మును రాగా ఆ రూపములు నిష్పన్నములు. 'ద్విషంతం తాపయతి' 'పరం తాపయతి' అని విగ్రహము.

అట ముమాగమ మకారమునకు "మోనుస్వారః" (8-3-23) అని అనుస్వారమురావలెను. అయ్యది మకారాంత పదమునకు విహితము. ఈ మకారము అవయవమయిన నది సిద్ధింపకపోవును.

పోనిమ్ము. "నశ్చాపదాంతస్యఝలి" (8-3-24) అను సూత్రముచే సిద్ధించును గదా. అపదాంత మకారమునకు గూడ ననుస్వారము విహితము గదా ఆ సూత్రముచేత ? కాగా నిది యెట్లు దూషణమగును ? అనిన,

'వహంలిహో గౌః' 'అభ్రంలిహో వాయుః'- అనుచో సిద్ధింపదు. ఇట "వహాభ్రే లిహః" (3-2-32) అను సూత్రముచే ఖశ్ప్రత్యయము. పూర్వోక్త సూత్రముచే ముమాగమము. ఆ నకారము పూర్వాంతము కానిచో, పూర్వ సూత్రముచేత ననుస్వారము సిద్ధింపదు. ఝల్లు పరము కానందున 'నశ్చాపదాంతస్య' అను సూత్రము చేతను లభింపదు, కాగా ఇది దూషణమే.

(6) శీభావాసిద్ధి ఆరవ దూషణము."త్రపుణీ" 'జతునీ' 'తుంబురుణీ'-అను స్థలములందు, 'త్రపు + ఔ', అను నవస్థలో, పరత్వ నిత్యత్వములను బురస్కరించుకొని, నుమాగమము ముందుగా బ్రవర్తించిన పిదప, దానితో వ్యవధానము వలన, ఔకార విభక్తికి, "నపుంసకాచ్చ" అను సూత్రముచే విహితమయిన శీ ఆదేశము ప్రాప్తింపకపోవును- ఇవి అభక్తత్వ పక్షమున దోషములు.

అట్లైన నీ మిత్తు పరమున కవయవముగా జేయబడును.

అనిన నీ పక్షమున,

**వా॥ "పరాదౌ గుణ వృద్ధ్యౌత్వ దీర్ఘ నలోపానుస్వారశీభావే నకార ప్రతిషేధాః**

అని దూషణ వార్తికము. ఈ పక్షమున, గుణము, వృద్ధి, ఔత్వము - వీనిని నిషేధింపవలసియుండును. దీర్ఘ నలోపానుస్వారములును సిద్ధింపక పోవును. మరియు, శీభావము విధీయ మానమగునపుడు నకారమునకు స్థానిత్వమును బ్రతిషేధింపవలసి యుండును.

(1) "త్రపుణే' 'జతునే' 'తుమ్బురుణే' - అను రూపములలో, నుమాగమానంతరము త్రపు + నే అను స్థితిలో 'ఘేర్ఙితి' (7-3-111) అని గుణము ప్రాప్తించుచున్నది. అది ప్రతిషేధ్యమగును.

(2) వృద్ధి— 'అతి సఖీని బ్రాహ్మణకులాని' అను స్థలమున, అతిసఖ + ని అను స్థితిలో "సఖ్యురసంబుద్ధౌ" (7-1-92) అని ణిద్వద్భావము సర్వనామ స్థాన

మునకు ప్రాప్తించిన, "అచోఞ్ణితి" (7-2-115) అని వృద్ధి రావలసి యుండును. దానిని ప్రతిషేధింపవలసి యుండును. అతిశయ విశిష్టులైన మిత్రులుగలవి బ్రాహ్మణ సంఘములు అని యర్థము.

(3) ఔత్వము- 'త్రపుణీ' 'జతుని' 'తుమ్బురుణి' అను స్థలములందు గూడ, త్రపు+ని అను నవస్థలో "అచ్చఘేః" (7-3-119) అను సూత్రముచే, 'ఙి' ప్రత్యయమునకు ఔత్వము ప్రాప్తము. అది ప్రతిషేధ్యమగును.

(4) దీర్ఘాసిద్ధి- 'కుణ్డాని' 'వనాని' అను స్థలములందు, పరాదిత్వ పక్షమున, అంగమునకారాంతము కానందున "సర్వనామస్థానే చాసంబుద్ధౌ" (6-4-8) అను దీర్ఘము సిద్ధింపదు.

పోనిమ్ము "సుపిచ" (7-3-102, అను సూత్రముచేత సిద్ధింపవచ్చును గదా. అపుడు 'ని' అనునది యఞాదిసుప్పు. అది పరముగనున్నది. అంగము అదంతము. కావున దోషమేమి? అనిన, 'అస్థీని' 'దధీని' 'అతిసఖీని' అనుచో నెట్లు? అట అంగము అదంతము కాదుగదా? కావున దోషము తప్పదు-

(5) నలోపాసిద్ధి- 'తాని తాని' అను నర్థమున 'తాతా' అని ఛాందస మగు ప్రయోగము. అట నలోపము సిద్ధింపదు.

(6) ఇక అనుస్వారాప్తి అరవదోషము- 'ద్విషంతపః' 'పరంతపః'- అను స్థలములందు "అనుస్వారాప్రాప్తి రూపదోషమును, అట "నశ్చాపదాంతస్య" అని సిద్ధింపవచ్చుననిన, 'వహంలిహః' 'అభ్రంలిహః'అనుచోట్ల తదప్రాప్తి రూప దోషమును నీ పక్షమున దుష్పరిహారములు,

7. శీ భావమున నకార ప్రతిషేధము-

నుమాగమము పరాదియయిన పక్షమున, 'త్రపుణీ' 'జతునీ' 'తుమ్బురుణీ' అను స్థలములందు, త్రపు+ఔ, అనునవస్థలో నుమాగమోత్తరము, త్రపు+నౌ-అని యున్నప్పుడు శీ ఆదేశము 'నౌ' అనుదాని స్థానమున రావలసి యుండును. అందువలన 'నకారమునకు 'శీ' ఆదేశము రాదు' అని యపూర్వ ముగ నిషేధమును వచింపవలసి యుండును. కాని, నిర్దిశ్యమాన పరిభాషనాశ్ర యించి యీదోషమును పరిహరింపవచ్చునని 'ఆపాతతః'తో చదవవచ్చును. ఎట్లన- ఆదేశములు, తద్విధాయక శాస్త్రములందుచ్చరింపబడిన నిర్దిశ్యమాన మునకే ప్రవర్తించును. శీభావ విధాయక శాస్త్రమున నిర్దిశ్యమానము. 'ఔఙ్' అనునది. నకారము, తరువాత దానికి, అవయవముగ జేరినది. అయ్యది యుచ్చారితముగాదు. కాగా తద్విశిష్టమున కాదేశ ప్రసంగములేదు. ఇట్లు వాదింపవచ్చును గాని, అట్లైన, ఔకారమాత్రముపకుము, నకార వ్యవధానము వలన సిద్ధింపక పోవును. కావున నీ పక్షమున నీ యేడును దోషములే.

అట్లైన, నీ మిత్తు, పూర్వమున కంఠావయవముగ చేయబడును.

అనిన నా పక్షమున,

**వా॥ "పూర్వాంతత్వే నపుంసకోపసర్జన హ్రస్వత్వం ద్విగుస్వరశ్చ"** అను వార్త్తికము చే దూషణములు ప్రదర్శింపబడినవి.

'ఆరాశస్త్రిణీ' 'ధానాశష్కులినీ' 'నిష్కౌశాంబినీ' 'నిర్వారాణసినీ'-అను స్థలములందు నపుంసకహ్రస్వమును ఉపసర్జనహ్రస్వమును సిద్ధింపకుండుట పూర్వాంతత్వ పక్షమున నొక దూషణము.

ఆరాశ్చ శస్త్ర్యశ్చ- తాసాంసమాహారః- ఆరాశస్త్రి. అట్టి సమాహారము రెండగు న 'ఆరాశస్త్రిణీ' అని యగును. ఆరలు=కమ్మీచ్చ కట్టలు, శస్త్రి= కత్తి. ఈ విధముగనే, ధానలు=వేపాలు లేదా వేపిన బియ్యము. శష్కులి=చక్కిలము వాని సమాహారములు రెండు="ధానా శష్కులినీ" ఇట నుమాగమము. "ఇకోచి విభక్తౌ" (7-1-73) అను సూత్రముచే నిత్యత్వము వలన ముందుగనే ప్రవర్త్తించును. ఈ ఆదేశము ప్రవర్త్తించిన వెనుక, ధానా శష్కులీ+న్+ఈ అను నవస్థలో నీ నకారము పూర్వాంశమగుటచే, "హ్రస్వో నపుంసకే ప్రాతిపదికస్య" (1-2-47) అను సూత్రముచే విధింపబడిన హ్రస్వము, ప్రాతిపదికమజంతము కావందున రాకపోవును

'ఆరా శస్త్రిణీ' అనుచో గూడనిదియే ప్రక్రియ.

'ఇక నిష్కౌశాంబినీ నిర్వారాణసినీ - అను స్థలములందు, నపుంసక హ్రస్వత్వమును పరత్వమువలన బాధించి, సూ॥ "గోస్త్రియోరుపసర్జనస్య" (1-2-48) అను హ్రస్వము ప్రవర్త్తించును. అదియును, నుమాగమానంతరము స్త్రీ ప్రత్యయాంతాంత ప్రాతిపదికమున కజంతత్వము లేనందున ప్రవర్త్తింపక పోవును.

కౌశాంబీ నగరము నుండి నిష్క్రమించిన రెండు కులములు అనియు వారాణసి నుండి వెడలిన రెండు కులములనియు నర్థము

ద్విగు స్వరమునకసిద్ధిని జూతము -

'పఞ్చారత్నినీ' 'దశారత్నినీ' అనుచో ద్విగు స్వరమురావలె. అయిదు అరత్నులు ప్రమాణముగాగల రెండు వస్తువులు. పది అరత్నులు ప్రమాణముగాగల వస్తువులు రెండు అని యర్థము. సమాహారద్విగువనియు నవ వచ్చును.

ఇట పఞ్చారత్నిన్ + ఈ అనుపవస్థలో, నకారము పూర్వాంతమగుటచేత, ద్విగువు ఇగంతము కానందున, సూ॥ "ఇగంత కాల, కపాల, భగాల, శరావేషు ద్విగౌ" (6-2-29) అను సూత్రముచే విధింపబడిన పూర్వపద ప్రకృతి స్వరము సిద్ధింపక పోవును. ఈ పక్షమున ఈ దోషముల నాపాదించి, వార్తిక కారుడు వా॥ "నవాబహిరంగ లక్షణత్వాత్" అను వార్తికముచే పరిహారమును చెప్పి యుంచెను.

ఇది దోషము కాదనియు చెప్పవచ్చును. ఏ మనిన, 'బహిరంగ లక్షణత్వమువలన నది పరిహృతమగును.' నుమాగమము బహిరంగము. హ్రాస్వములు రెండును, విభక్తి యొక్క అపేక్ష లేనివగుటచె అంతరంగములు. కనుక నవియే నుమాగమమునకు ముందు ప్రవర్తించును.

అంతరంగ విధి కర్తవ్యమయినపుడు బహిరంగ విధి, సమాన కాల ప్రవృత్తికలదయినను, జాత పూర్వమయినదయినను, 'అసిద్ధం బహిరంగమంతరంగ' అను పరిభాషచె అసిద్ధమగును.

ద్విగుస్వర విషయముగ బరిహారాంతరమును గలదు. ఈ నుమాగమము 'పంచారత్ని' అను సంఘాతమునకు భక్తముగాని, అవయువమగు అరత్ని అను దానికి సంబద్ధము గాదు. కాబట్టి, సంఘాతభక్తమగుదాను అవయవము ఇగంతత్వమును పోగొట్టుట కుత్సహింపదు. కాగా ద్విగు స్వరము అప్రతిహతముగ ప్రవర్తించును.

కావున, నపుంసక హ్రాస్వత్వా సిద్ధి, ఉపసర్జన హ్రాస్వత్వాసిద్ధి, ద్విగు స్వరాసిద్ధియను మూడు దూషణములును దగులవుగాన ని పూర్వాంతత్వ పక్షము నిర్బాధము॥

"మిదచోంత్యాత్పరః"- అను సూత్రమునకు వివర్తము ముగిసినది.

## ॥ఏచఇగ్ఘ్రస్వాదేశే॥

### సూత్రప్రయోజన నిరూపణము

ఈ సూత్రమును రచింపకున్నను ఇష్ట ప్రయోగ సిద్ధి కలుగును గదా, అట్టి యెడ ఇది యెందులకు రచింపబడినది ?

వా॥ "ఏచఇగ్వచనం సవర్ణాకార నివృత్త్యర్థమ్"- అని ప్రయోజన వార్తికము.

ఏచ్చులకు హ్రాస్వము లాదేశింపబడినపుడు వానికి ఇక్కులే హ్రాస్వములు ప్రవర్తించును అని సూత్రార్థము. ఈ సూత్రమును రచించకుండిన, వానికి

సవర్ణములును, అకారమును నాదేశములుగా రావలసి వచ్చును. తన్నివృత్తి కొరకీ సూత్రము.

ఏచ్చులు నాలుగు. అందు ఏకార ఓకారములలో అకారము ప్రశ్లిష్టమై యున్నది. అ+ఇ=ఏ, అ+ఉ=ఓ. ఇందకారము ప్రశ్లిష్టము. అనగా వాని పూర్వభాగమయిన అకారము పాంసూదకములవలె దుర్వివేచము. ఇకారోకారములును నట్లే దుర్గ్రహములు. కనుక వాని స్థానమునందు ప్రశ్లిష్టావర్ణము లగు అర్ధ ఏకార, అర్ధ ఓకారములు అంతరతమములగుటచేత రావలసివచ్చుచున్నవి. వానిని వారించుటకు, అనగా సవర్ణ నివృత్త్యర్థము అనుట ఈ సూత్రము.

ఇక అకార నివృత్తి కొరకును నిది యావశ్యకము. ఎచ్చుట నవగా నీ ఐచ్చులు రెండును సమాహార వర్ణములు. సమామ్నాయమానములగు నవయవములు గలవి. అందవర్ణము మాత్రాకాలికమగు నవర్ణముతో సదృశము. అందలి ద్వితీయ భాగములగు నివర్ణోవర్ణములును నట్టివి. ఇవి ప్లిష్టావర్ణములగుటచే, దీనికి హ్రస్వము విధింపబడినపు డొకసారి అకారమును, పర్యాయాంతరమున నికారోకారములును వాని స్థానమున రావలసి యుండును. అట్టి యెడ నివర్ణోవర్ణములే సతమ్మములు. అవర్ణ మెపుడును రారాదు. అందులకీ సూత్రము. ఐకార ఔకారములు, ఏ ఓలవలె సగము వర్ణములు లేవు. కాగా వాని ప్రసంగమందు లేదు. అందు అకార నివృత్తియే ప్రయోజనము.

## అనిష్టాపత్తి నిరాకరణము

వా॥ "దీర్ఘ ప్రసజ్గస్తు" అని వార్తికము -

ఏచ్చులు నాలుగును దీర్ఘములగుటవలన వాని స్థానమున విధింపబడు ఇక్కులు. ఆంతరతమ్యమువలన దీర్ఘములే ప్రాప్తించుచున్నవి. ఇది స్వతంత్ర విధాయక శాస్త్రము. అని యాక్షేపము.

సూత్రమునందు 'హ్రస్వాదేశే' అను పదము కలదుగదా. 'ఏచ్చులకు హ్రస్వములు విధింపబడినపుడు హ్రస్వములగు ఇక్కులే వచ్చును' అని సూత్రమున కర్థము గాన దీర్ఘములకేమి ప్రసంగము ?

అనిన - ఈ సూత్రము విషయ ప్రదర్శనార్థము. హ్రస్వములు విధింపబడిన స్థలములందే యీ సూత్రమునకును ఉపస్థితి కలుగును గాని "గురోరనృతోనంత్యస్యాప్యేకైకస్య ప్రాచామ్" (8-2-86) అను మున్నగు ప్లుత విధాయకము

ళుందు, ఇది ప్రవర్తింపదని సూచించుటకు 'హ్రస్వాదేశే' అను పదము గ్రహింపబడినది అనవచ్చును. కావున దీర్ఘ ప్రసంగము కలదని యాక్షేప భావము.

వా॥ "దీర్ఘాప్రసఙ్గస్తు నివర్తకత్వాత్" అని సమాధానము.

దీర్ఘములగు నిక్కులకు ప్రసంగము కలుగదు. ఈ సూత్రము నివర్తకము గాని నిర్వర్తకము గాదు. దీనిచే ఇక్కులు కానివి నివర్తింప బడునేగాని, ఇక్కులు విధింపబడవు.

"హ్రస్వోనపుంసకే ప్రాతిపదికస్య" (1-2-47) మున్నగు హ్రస్వ విధాయకములతో నీ సూత్రమున కేకవాక్యతగలదు. ఇట హ్రస్వవదశ్రుతి యుండుట వలన "అచశ్చ" (1-2-28) అను పరిభాష ఉపస్థితమగును అందు ఏచ్చులు గూడ నంతర్భూతములు గాన వానికి హ్రస్వము విధింపబడినపుడు ఈ "ఏచ ఇక్" అను సూత్రముపస్థితమై, భిన్న వాక్యముగ, ఏచ్చునకు హ్రస్వము ఇక్కే వచ్చును గాని వేరొండు రాదు అని చెప్పి ఇగ్భిన్నమేచ్చు స్థానమున రాకుండ వారించును. కాగా నిది నియామకమనుట.

## సూత్ర ప్రత్యాఖ్యానము

వా॥ "సిద్ధమేఙః సస్థానత్వాత్"

వా॥ "ఐచోశ్చోత్తర భూయస్త్వాత్"- అను రెండు వార్తికములచే నీ సూత్రము ప్రత్యాఖ్యాతము.

ఏకార ఓకారముల స్థానమున, సమాన స్థానకములగుటచే 'ఇకార' ఉకారములే ప్రవర్తించును. అకారమురాదు. అర్ధైకారార్ధౌకారములును రావు.

అవి యేల రావు. అవి సస్థానతరములగును గదా? అనిన నవి లేనే లేవు. అవి యుండిన అక్షర సమామ్నాయమున నవియే యుపదేశింపబడి యుండెడివి గదా? అట్లైన నర్ధమాత్రాలాఘవమును సిద్ధించెడిది. కావున నవి లేవనుట.

లేకపోవుటయేమి? ఛందోగులలో సాత్యముగ్రి రాణాయనీయులు సఘమపు ఏకారమును, సగము ఒకారమును, "సుజాతే ఎశ్వసూనృతే" "అధ్వర్యో ఒద్రిభిస్సుతమ్" "శుక్రంతే ఎన్యత్" "యజతంతే ఎనయత్" అని పఠించు చున్నారే యనిన,

అది తచ్ఛాఖీయుల ప్రత్యేక పాఠము. అంతియగాని వేదాంతరము నందుగాని, లోకమునందుగాని అర్ధైకారౌకారములెచ్చటను ఎవరును ఉచ్చరించుటలేదు.

ఇక ఐకార ఔకారములకు హ్రస్వము రావలసినపుడు అకారమును వారించుటకు గూడ నీ సూత్ర మనావశ్యకము. వానిలో నుత్తర భాగమునకు భూయస్త్వముకలదు. ఐకారము కణ్ఠ్యతాలవ్యము. ఔకారము కణ్ఠ్యోష్ఠ్యము. అట్టి హ్రస్వమేదియు లేదు. కాన వాని యవయవములకు అంతరతమ మయిన యాదేశము రావగియుండును. ఆ రెండు వర్ణములందు నుత్తర భాగములయిన ఇవర్ణ ఉవర్ణములకు మాత్రన్నర ప్రమాణము. పూర్వ భాగమయిన అవర్ణ సదృశమునకు అర్ధమాత్రయే ప్రమాణము. "అకారార్ధ మైకారౌకారయోరాదిః", "ఇకారోధ్యర్ధః పూర్వస్యశేషః" "ఉకార స్తూత్తరస్య" అను తైత్తిరీయ ప్రాతిశాఖ్య సూత్రములు పై విషయమునకు సంవాద ప్రమాణమగును.

అధిక సంఖ్యను పురస్కరించియే వ్యవహారము లోకసిద్ధము. "బ్రాహ్మణ గ్రామమును బిలుచుకొని రండు" అందురనుకొనుడు. అట బ్రాహ్మణ గ్రామమనగా బ్రాహ్మణు అధికసంఖ్యలోనున్న గ్రామమనియే గదా యర్థము. ఇతరులెవ్వరునులేని, కేవలము బ్రాహ్మణుల గ్రామమెచ్చటను నుండదు. ఆ బ్రాహ్మణ గ్రామము అని వ్యవహరింపబడు వానియందైనను, చివరకు 'పంచకారుకి' అయిన నుండక తప్పదు.

'పంచకారుకులు' అనగా నయిదుగురు శిల్పులు. వారు ఏ గ్రామమునందైనను నుండక తీరదు. వారెవరనగా- 'కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, మంగలి, చాకలి'- వీరులేని గ్రామముండుట సామాన్యముగ నసంభవము.

కాగా, అధికార యవాంతర తమ్యమునుబట్టి, ఇవర్ణో వర్ణములేవచ్చును గాని అవర్ణమునకు ప్రసంగమే లేనందున సూత్రము అనావశ్యకము అని భావము-

ఏచఇగితి సూత్రవివర్తము సమాప్తము.

## "షష్ఠీస్థానేయోగా" (1-1-48)

ఈ సూత్రమున నీ 'స్థానేయోగా' అనునది యేమి? ఇది సమస్త పదమా? లేక 'స్థానే' అనియు, 'యోగా' అనియు రెండు పదములా? సమస్తమైన 'స్థానయోగా' అని యుండగును. అసమాసమైన స్థానే, యుక్తికి అని షష్ఠీ అను స్త్రీలింగ పదానురోధముగ నుండదగును అని యాక్షేపము,

సమ స్త పదమే అని సమాధానము. 'స్థానే యోగో అస్యాః', సా=స్థానే యోగా, నిపాతనమువలన సప్తమికి 'అలుక్' లేదా 'స్థానే నయోగోయ స్యాస్సా' అని విగ్రహము. నిపాతనమువలన తృతీయకు ఏత్వము. 'దేవదత్తుని యజ్ఞదత్తుడు' అనిన వారి సంబంధము పుత్రత్వాది ద్వారకము అని యవగత మగునట్లు "అస్తేర్భూః" (2-4-52) అను సూత్రమున, 'అస్తేః' అను షష్ఠికి స్థాన నిమిత్తక సంబంధ మర్థమని ఈ పరిభాష వలన తెలియనగును. స్థానమనగా అర్థము, లేదా ప్రసంగము. తిష్ఠంతి అస్మిన్ శబ్దాః=స్థానమ్. అనగా నర్థము. అర్థమునందు శబ్దములు వాచకత్వమను సంబంధముచే నుండును. ప్రసంగమనగా ప్రాప్తి. అస్తికి ప్రాప్తి కలిగినపుడు 'భూ' ప్రయోగింపబడునని అర్థము.

॥సూత్ర ప్రయోజన విచారము॥

"ఎందులకీ పరిభాష రచింపబడినది? ఇది లేనున్నను నిష్ఠ, సిద్ధి కలుగును గదా? పైగా నీ పరిభాష నంగీకరించిన నతి ప్రసంగములు గూడ నగపడు చుండెను"- అని యాక్షేపము.

వా॥ షష్ఠ్యాః స్థానేయోగ వచనం నియమార్థమ్"- అని సమాధాన వార్తికము. ఏతదారంభము నియమముకొరకు. ఏలయన-

షష్ఠికి ఒక వంద యర్థములు కలవని 'షష్ఠీ దండకపాఠము'- అను గ్రంథమువలన దెలియును. వందయే అననేల? ఎన్నియైన నుండవచ్చును. అవి యన్నియు షష్ఠ్యంత ముచ్చారితమైనతోడనే ఉపస్థితములగును. బోధ విష యములును గావలసివచ్చును.

వ్యాకరణ సూత్రములందలి షష్ఠికి స్థానపదార్థ నిరూపిత సంబంధము మాత్రమే అర్థమగుట సమ్మతము. అయ్యది యత్నము లేక సిద్ధింపదు. కావున నీ పరిభాష నియమమునబోధించుటకు ఆవశ్యకమము.ఈ ప్రయోజనసిద్ధికై ఈ సూత్రము రచింపబడినది. అన నీ ప్రయోజనము కలదనుట తథ్యమేనా?

ఆహా! తథ్యమే॥

## అనిష్టాపత్తి నిరాకరణము

వా॥ "అవయవషష్ఠ్యాదిష్వతిప్రసంగః శాసోగోహ ఇతి" ఈ నియమము వలన సంబంధాంతరములు నివర్తింపబడుటచే "శాసఇదజ్హలోః" (6-4-34) అను సూత్రముచే విధింపబడిన ఇదాదేశము, 'శాస్' అనుధాతువున నంత్య వర్ణమునకును, ఇందు 'ఉపధాయాః' అనుపదమను వర్తించుటవలనను, దానికి

శాసుధాతువుతో సంబంధము లేనందువలనను, పచాది ధాతువుల యుపధకును రావలసివచ్చును. 'శాసః' అను షష్ఠి స్థానషష్ఠియే యగును. అవయవార్థక షష్ఠి కాదు. కావున 'శాసు ధాత్వవయవమగునుపధకు' అను నర్థము లభింపదు.

అట్లే, "ఊదుపధాయాగోహః" (6-4-89) అను సూత్రమునను, "గోహః. 'ఉపధాయాః' అనునవి స్థానషష్ఠులే కావలెను. కాగా ఆ సూత్రముచే విధింపబడిన ఊకారము, 'గోహ్' అను దాని అంత్యవర్ణ స్థానమునను, పచాదుప యుపధకును గూడ రావలసి యుండును. ఇది యాక్షేపమునకు తాత్పర్యముల

వా॥ "అవయవషష్ఠ్యాదీనాంచాప్రాప్తిర్యోగస్యా సందిగ్ధత్వాత్" అని ఆక్షేప బాధక సమాధాన వార్తికము॥

అవయవావయవి భావము, ఆనంతర్యము, వాచ్యావాచక భావము, మున్నగు సంబంధములను నివర్తింపజేయుట కీ నియమము ప్రాప్తింపదు, సందేహమున్నచోటనే నియమము ప్రవర్తించును గదా! సంబంధ విశేషము నిర్ధారితము కాని షష్ఠికే స్థాన సంబంధమర్థము. పై రెండు సూత్రములందును నుపధాపదముండుట వలన, 'శాసః' 'గోహః' అను షష్ఠ్యంత పదముల షష్ఠ్యర్థ మవయవావయవి భావమని నిర్ధారితమై యున్నది. కావున నట నీ నియమమునకు ప్రవృత్తి కలుగదు.

అట్లైన, సంబంధ విశేషనిర్ధారణములేని షష్ఠి స్థానయోగషష్ఠియగుననియు జెప్పవలెను గదా!

అక్కరలేదు. చెప్పనిచో నెట్లు తెలియును?

అయ్యది లౌకికదృష్టాంతానుగృహీతము. ఎట్లన :- లోకములో నొకడింకొకనిని, 'అయ్యా నే నింకొక యూరికి పోవలెను. త్రోవను జెప్పుడు' అని యడిగినపుడు అతడిట్లు చెప్పును. "ఇదిగో చూడుము. ఇచ్చోట నీ కుడి చేతికి సన్నిహితమయిన బాటను బొమ్ము. అచ్చోట నెడమ చేతివైపున పొమ్ము" అని చెప్పును. ప్రక్కల బాటలున్నచోటనే యటు చెప్పును. ఏలయన నచట సందేహము కలుగును. తూర్పుకో పడమటకో బోవువానికి అడ్డముగ దక్షిణోత్తరములకు బోవు త్రోవ తగిలినపుడు అట సందేహము కలుగదు గావ మార్గోపదేశమున కట పనిలేదు. అందువలన అచట నిటు బొమ్మని గాని అటు బొమ్మని గాని చెప్పరు.

ఆ విధముగనే ప్రకృతమునను, సందేహము కలిగిన స్థలముననే యీ షష్ఠి స్థాన నిరూపిత సంబంధ మర్థముగ గలదియేయని నియమించును. అవయవ

షష్ఠ్యాదులందు సందేహమే కలుగదు గాన నీ సూత్రమున కట ప్రసంగమే లేదు.

లేదా సమాధానాంతరము నిట్లు చెప్పనగును. స్థానే అయోగా అని విభాగము. 'అయోగా షష్ఠీ, స్థానే' అయోగ షష్ఠి స్థాన షష్ఠి, యగును. అయోగ యనగా నవ్యక్తమగు సంబోధముగలది. అవ్యక్తత యనన నిర్ధారితత్వము. కాగా అనిర్ధారిత సంబంధ విశేష షష్ఠి స్థానాద్యాదేశ భావరూపమగు సంబంధము గలది యని యర్థము.

లేదా—అయోగా=యోగరహితా—యోగా=యోగవతీ మత్వర్థమున వచ్చిన "అర్శ ఆదిభ్యోచ్" (5-2-127) అను అచ్ప్రత్యయమంతమున గలది 'యోగా' అను పదము. యోగవతి యననేమి? ఏ సంబంధమును నర్థము గాని షష్ఠి యుండుటయే పొసగదు గాన, 'బహు యోగములు గలది' అని యర్థము. ఆ యర్థమెట్లు లభించుననగా, అచ్ప్రత్యయము భూమార్థమున వచ్చినదిగాన లభించును. కాగా బహు సంబంధము లర్థమగుటకు వీలుగనున్న షష్ఠి స్థలము లందీ సూత్రముపస్థితమై స్థాననిరూపిత సంబంధమే అట షష్ఠ్యర్థమని బోధించును. కావున అవయవ షష్ఠ్యాదులందీ సూత్రమునకు ప్రసంగము లేదు.

వా॥ "విశిష్టా వా షష్ఠీస్థానేయోగా"- అని ఆక్షేప బోధక వార్తికము. లేదా - ఏదేని యొక లింగమును షష్ఠ్యంత పదమునకు చేర్చి 'ఈ లింగముగల షష్ఠి స్థానే యోగషష్ఠియగును' అని చెప్పెదను. ఆ లింగము అవయవ షష్ఠ్యాద్యర్థక షష్ఠ్యంత పదము లందు చేర్పబడదు. లింగము లనగా కలాది దోషములు.

అట్లయిన లింగా సంగము కొరకు అట్టి సూత్రము లందెల్ల షష్ఠ్యంత పదమును చర్చింపవలసి యుండును. 'శాస ఇత్' అను సూత్రమున 'శాసః' అను పదమున్నను, అనంతర సూత్రమగు 'శాహౌ' (6-4-35) అను దానిలో లేనందునను, పూర్వ సూత్రమున నవయవావయవి భావమర్థముగల 'శాసః' అనునదిందు స్థానే యోగార్థకమని సూచించుటకై న లింగా సంగమునకు తదుచ్చారణము ఆవశ్యకమగును. అనిన -

'శాసః' అను పదమును 'శాహౌ' అను సూత్రములో మరల నుచ్చరింప బనిలేదు. పూర్వ సూత్రమున నవయవ షష్ఠ్యర్థముగ నుపక్రాంతమయిన యా పదమే ఉత్తర సూత్రమున ననువర్తించి, స్థానసంబంధమర్థముగాగలది యగును. ఎట్లుందురా?

అధికారము మూడు విధములు. అందొక యధికారము ప్రదీపమొకచోటనుండి గృహముక తను, తాను స్వప్రజ్వలితమై ప్రకాశవంతమును చేసినట్లు, శాస్త్రమునంతను ప్రకాశింపజేయును.

వేరొక యధికారము, త్రాటితోగాని యినపతీగతోగాని కట్టబడిన దండముపైకి లాగబడినట్లు చకారముచే ననుకర్షింపబడును

మూడవ యధికారము- ఉత్తర సూత్రములందెల్ల మరలమరల నుచ్చరింప బనిలేకయే ఉపస్థితమగునది.

ఈ మూడు, పక్షములందును ప్రతి సూత్రమునందును నుచ్చారణమునకావశ్యకత లేకయే కార్యకరమగు నధికారపక్షమిట గ్రహింపనగును. అపుడు 'శాహా' అనుచో ననువృత్తమైన శాసః అనునది స్థానషష్ఠికాగలదు.

మరలనొక యాక్షేపము— 'పాణిని, ఒకానొక పదమున కుత్తర సూత్రములందు, స్వరితత్వ బలమువలన, నుపస్థితి మాత్రమును బోధించెను గదా! తానుచ్చరించిన పదమెక్కటియే బోద్ధలు అనుమాన పూర్వకముగ దానిని మరల నుత్తర సూత్రముల నుచ్చరించుకొందురు. వక్తచే నుచ్చరింప బడిన శబ్దము పూర్వ సూత్రమునందలిదియే. కావున దానికి లింగాసంగము చేయవలెననిన తాను మరల దానినట నుచ్చరింపక యెట్లుచేయును ?

అట్లయిన నా లింగము స్థానియందుకాక యాదేశమునందాసంజిత మగును. అయ్యది స్థానషష్ఠీత్వ జ్ఞాపకము. ఆదేశ బోధకపదమున షష్ఠిలేనందున, సామర్థ్యమువలన నది తత్సంబంధియగు స్థానినాక్రమించును. లింగాసంగ ఫలము స్థానికి కలుగునవుట.

## సూత్రప్రత్యాఖ్యానము

ఇట్లు షష్ఠీస్థాన నిమిత్తక సంబంధార్థకమే యను నియమము చేయబడినచో, నొకచోట నొక షష్ఠ్యంతమున కనేకములగు విశేష్యములున్నపుడు, అది అవయవావయవి భావాది సంబంధములు గూడ నర్థముగాగలదికాజాలదు. "హలః" (6-4-2) అను సూత్రమును జూడుడు. ఇట నంగస్య అను షష్ఠ్యంతము విశేషణము. 'హలః' అనునదియును,ఇందనువర్తించిన 'అణః' 'సంప్రసారణస్య' అను పదములును, విశేష్యములు. అవయవావయిభావాదులుగూడ నిట షష్ఠ్యర్థమును కావలసియున్నది.

'అంగావయవమగు హలుకంటె బరమగునదియు, అంగాంత్యమునునగు అణ్రూప సంప్రసారణమునకు దీర్ఘము వచ్చును'- అని యీ సూత్రమున

కర్థము సిద్ధింపవలెను. 'అంగస్య' అనునది. 'శాఖా' అను స్థలమున స్థానషష్ఠి యైన నిక దానికి అవయవ షష్ఠిత్వము కుదురదు. నియమము లేనపుడు, ఆ షష్ఠి సంబంధ సామాన్యార్థకమయి, పిదప పదాంతర సంబంధము వలన సంబంధాంతరములను అది బోధింపగలదు. "దేవదత్తస్య పుత్రః, పాణిః, కంబలః" దేవదత్తుని కుమారుడు, హస్తము, కంబళి అని యందుము. 'అట 'దేవదత్తుని'అను షష్ఠి సంబంధ సామాన్య బోధకమయి, పుత్ర,పాణి, కంబలాది పదముల సంబంధమున. జన్య జనకభావాది సంబంధ విశేష బోధకమగుచున్నది కదా. కనుక నీ నియమ మనావశ్యకము' అని ప్రత్యాఖ్యానవాది తాత్పర్యము.

షష్ఠ్యర్థము లేక శతము. అధికముగను ఉండవచ్చును. షష్ఠి యుచ్చరింపబడిన స్థలములందెల్ల నా యర్థములన్నియు ప్రాప్తించుచుండ, నియమమును బోధించుటకీ సూత్ర మావశ్యకమంటిరిగదా ?

అనిన వినుడు. లోకమున షష్ఠ్యర్థములు వివిధములుగా నుండవచ్చుట సత్యమే. అందు స్వస్వామి 'భావాదు'లు ఆర్థసంబంధములు, జన్య జనకభావాదులు యౌనములు. అనగా యోనికృతములు గురు శిష్యభావాదులు మౌఖములు. ముఖ కృతములనుట. ఋత్విక్కులకను యజమానులకును గల సంబంధములు శ్రౌవములు. అనగా స్రువమను యజ్ఞాంగకృతములనుట లోకమున నిట్లు వివిధముగా ఉన్నను, శాస్త్రమునందు శబ్దమునకు వేరొక శబ్దముతో సంబంధము, స్థానసంబంధముగాక వేరొండేమి సంభవించును ? కాగా సూత్రముతో పనిలేదు.

అనిన అట్లుకాదు. శాస్త్రమునందును నానంతర్యాది సంబంధములు శబ్దములకు పరస్పరము ఉండవచ్చును. 'అస్తికి భూ వచ్చును' అని చెప్పిన, అస ధాతువు స్థానముననా ? దాని కనంతరముననా ? లేక సమీపముననా భూ ఆదేశము ప్రవర్తింపవలసినది ? అని సందేహము కలుగవచ్చును గదా ? అనిన,

ఓహో ! ఇంతియ కదా ! సందేహ మాత్రమే కదా ! సందేహమునకు విషయములగు స్థలము లందెల్ల నుపస్థితమై విశేష ప్రతిపత్తిని కలిగించు పరిభాషయగు "వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిర్నహి సందేహాదలక్షణమ్" అను పరిభాష, సందేహ నివృత్తికై వ్యాఖ్యానము నాశ్రయింపవలెనని బోధించునుగాన 'అస్తే ర్భూః' అను చోట గూడ 'అసధాతువు స్థానమున భూ వచ్చును' అని వ్యాఖ్యానింతుము. కావున నీ 'షష్ఠీస్థానే యోగా' అను పరిభాషతో పని లేదు.

అయిన ఇక ఇది సర్వథా అనావశ్యకమనియే తాత్పర్యమా ? 'అనిర్ధారిత సంబంధ విశేష షష్ఠికి స్థానసంబంధమే యర్థముగాని సంబంధాంతరము గాదు' అను నియమమును బోధించుటకు ఇది అనావశ్యకమే.

కాని దీనికి ప్రయోజనాంతరము సంభవించవచ్చును. అది యేది? అనిన,

"నిర్దిశ్యమానస్యాదేశాభవంతి" అని యొక పరిభాష గలదు. ఆ పరిభాష ప్రకృత సూత్రార్థ సిద్ధమే. అది యపూర్వము గాదు. కనుక నా పరిభాషను బోధించుట కిది యావశ్యకము.

ఈ సూత్రము నందలి 'షష్ఠీ' అను పదమునకు 'షష్ఠ్యంతము' అని యర్థము. ఉచ్చారితమగు షష్ఠ్యంతమే స్థాన పదార్థ నిరూపిత సంబంధార్థక మగును గాని ప్రతీయమానకు ఆ సంబంధము కలుగదు అని బోధించును.

ఉదాహరణమునకు, సూ॥ "పాదఃపత్" (6-4-130) అను సూత్రమును జూతము. అట 'పాదః' అను పదము షష్ఠ్యంతము. అది నిర్దిశ్యమానము. అనగా సూత్రమున నుచ్చార్యమాణమనుట. ఈ సూత్రము అంగాధికారస్థ మగుటచే 'అంగస్య' అనునది ఉపస్థితమయి 'పాదంతమగు నంగమునకు' అను నర్థములభించును. కాని అది ప్రతీయమానము గాని నిర్దిశ్యమావము గాదు. కావున పదాదేశము 'సుపాద్' అను శబ్దమునందు, పాదంతాంగావయవమగు పాద్ అను దానికే వచ్చును గాని 'సుపాద్' అను సముదాయ స్థానమున ప్రవర్తింపదు.

ఈ విధముగ నిర్దిశ్యమాన కార్య బోధన మీ సూత్రమునకు ప్రయోజనము. ఆ పరిభాష అపూర్వముగ కర్తవ్యము కాదు అని భావము॥

**"షష్ఠీస్థానే యోగా" అను సూత్రమునకు వివర్తము ముగిసినది.**

## ॥స్థానేంతరతమః॥ (1-1-50)

### సూత్రోదాహరణ విచారము

'స్థానే=ప్రసంగము కలిగినపుడు, అంతరతమః=సదృశతమ మగు ఆదేశము ప్రవర్తించును' అని సూత్రార్థము.

దీని కేమి ఉదాహరణము?

'ఇకో యణచి' అను లక్షణమును, దాని లక్ష్యములగు 'దధ్యత్ర' 'మధ్వత్ర' అనునవియు దీనికి ఉదాహరణములు.

తాలువు స్థానముగాగల యకారము, తాలు స్థానకమగు ఇకారమునకును, ఓష్ఠ స్థానకమగువకారమే అట ఉకార స్థానమునకు ఆదేశమగుటకీ సూత్రము.

సంఖ్యాతానుదేశముచే నీ యుదాహరణము సిద్ధింపవచ్చును గాన నిది వని కుదాహరణము కానక్కరలేదు. ప్రత్యాహార పాఠమున ఇ, ఉ, ఋ, ౡ, దీర్ఘములకును, య, వ, ర, ల - లకును సంఖ్యాసామ్యము కలదు గదా యనిన, పోనిమ్ము. అపుడు,

"తస్థస్థమిపాం తాంతంతామః"(3-4-101) అనునది యుదాహరణము. అట నే కార్థమునకు, ఏ కార్థకమును, ద్వ్యర్థ బహ్వర్థములకు, ద్వ్యర్థ బహ్వర్థ ములును నంతరతమము లాదేశములగుట దీనికి ప్రయోజనము.

ఇదియు సంఖ్యాతానుదేశముచేతనే సిద్ధింపవచ్చునే ?

అనిన - "అకస్సవర్ణే దీర్ఘః" (6-1-101) అనునది దీనికి నిరాక్షేపమగు ముదాహరణము.

'దండాగ్రమ్', 'క్షుపాగ్రమ్', 'దధీంద్రః', 'మధూష్ట్రః'- ఇత్యాదులందు కంఠ స్థానకములగు రెండకారములకును, అట్టిదియేయగు అకార దీర్ఘ మాదేశమగు టయు, తాలు స్థానకములగు నికారములకు, అట్టి దీర్ఘేకార మాదేశముగ వచ్చుటయు ఓష్ఠస్థానకములగు నుకారములకు అట్టి ఊకార మాదేశముగ బ్రవ ర్తించుటయు నేతత్సాధ్యములు ఇట సంఖ్యాతానుదేశమునకు ఇట ప్రసం గము లేదు. ఆంతరతమ్యము వలననే ఇవి సిద్ధింపవలెను.

'షష్ఠీస్థానే యోగా' అను పూర్వ సూత్రమునుండి స్థానే అను పదమిందను వర్తింపవచ్చును గదా మరల నిందు స్థానే అను పదమెందులకు ? అని యాక్షేపము.

ఒక వర్ణము లేదా పదము - వీని స్థానమున వేరొకటి యాదేశముగ ప్రసక్తమయినపుడు, సదృశతమమయిన యాదేశము ప్రవర్తించుననియు, విభిన్నాంతర్యముల వలన భిన్న భిన్నములగు నాదేశములు ప్రసక్తములయి నపుడు, స్థానకృతమగునాంతర్యమే అట నాశ్రయింపబడవలెననియు బోధించుట కును 'స్థానే' అను పదము గ్రహింపబడినది.

అది యెట్లనగా-'చేతా', 'స్తోతా'- అను లక్ష్యములందు, 'చి' 'స్తు' ధాతువుల ఇకారోకారముల స్థానమున, ప్రమాణకృతమగు నాంతర్యమును గ్రహించినచో అకారము గుణముగా రావలసియున్నది. స్థానకృతాంతర్యము వలన, ఏ కారమును ఓ కారమును ప్రాప్తములు. అట్టియెడ నేమి కర్తవ్యమని విచారింప స్థానకృతమగు నాంతర్యమే పరిగ్రాహ్యమని, "యత్రానేక విధమాంతర్యం తత్ర స్థానత ఆంతర్యం బలీయః" అను ఒక పరిభాష వలన తెలియుచున్నది. ఆ పరిభాషకును, నిందలి 'స్థానే' అను పదముచేతనే బోధింపబడుచున్నది. కాగా, అనువృత్తమగు 'స్థానే' అను పదమునకు ప్రసంగేసతి అని యర్థము. సూత్రస్థము

నందలి స్థాన పదము తాల్వాది స్థానవాచి, సప్తమి తృతీయార్థకము దీనితో రెండవ వాక్య మేర్పడి, 'ఏ స్థానికైనను సదృశతమాదేశమే ప్రవర్తించును' అని మొదటి వాక్యము బోధించిన పిదప, అనేక విధాంతర్యములు విభిన్నాదేశము లను ప్రాప్తింపజేసినపుడు స్థానకృతమగు సాదృశ్యమే అట బలవత్తరమని దీని వలన బోధింపబడును.

### తమప్గ్రహణ ప్రయోజన విచారము

ఇందు తమ గ్రహణమెందులకు? 'స్థానేంతరః' అనినను పై ప్రయోజనము సిద్ధించును గదా? అనిన,

'వాగ్ఘసతి' 'త్రిష్టుభ్భసతి' అను లక్ష్యములందు హకార స్థానమున వర్గ చతుర్థము లాదేశములుగా సిద్ధించుట దానికి ప్రయోజనము.

వాక్ + హసతి — త్రిష్టుప్ + హసతి॥ అనుచోట, సూ॥ "ఝయోహోఽన్యతరస్యామ్" (8-4-62) అను సూత్రముచే హకార స్థానమున విహితమయిన పూర్వసవర్ణము, స్థాని ఊష్మత్వగుణము కలదియగుటచే నట్టిదియేయగు వర్గ ద్వితీయ వర్ణమాదేశముగా ప్రసక్తమగుచున్నది. అట్లే, స్థాని, నాదమను బాహ్య ప్రయత్నము కలదియగుటవలన, నాదమైన వర్గతృతీయము ప్రాప్తించు చున్నది.

ఈషత్సదృశమును లోకమున సదృశమనియే తలంపబడును గదా. తమ గ్రహణమువలన, ఆదేశము, సదృశతమము = సర్వాత్మనా సదృశము కావలెనని సిద్ధించుటచే, సోష్మములును నాదవత్తులునగు వర్గ చతుర్థములే ప్రవర్తించునని సిద్ధించును. ఇది తమ గ్రహణ సిద్ధము.

### ॥సూత్ర ప్రయోజన విచారము॥

ఈ సూత్రమెందుల కుద్దేశింపబడినది? ఇది లేనిచో నేమి?

సమాధాన వార్తికము—

**"స్థానిన ఏకత్వ నిర్దేశాదనేకాదేశ నిర్దేశాచ్చ సర్వప్రసంగ స్తస్మాత్ స్థానేంతరతమవచనం నియమార్థమ్"** ——— అనునది.

"అకస్సవర్ణే దీర్ఘః (6-1-101) అను సూత్రమునందు, దీర్ఘ స్థాని అక్కు– అది ప్రయోగములందు ఏకత్వ సంఖ్యా విశిష్టమే యుచ్చరింపబడి యుండును. ఒక్కటిగా నిర్దేశింపబడిన స్థానికి, 'దీర్ఘః' అను పదముచే ప్రతి నిర్దేశింపబడిన దీర్ఘములు అనేకములు. కాగా నేకైక స్థానికి, పర్యాయముగ ననేక దీర్ఘములు ప్రాప్తించుచున్నవి. సర్వ ప్రసంగః అను పదమునకు, సకల దీర్ఘము లును సర్వత్ర రావలసివచ్చును అని యర్థము. అది యసమ్మతము. అంతరతమ

మయిన దీర్ఘమే సమ్మతము. ఆ అభీష్టము యత్నము లేనిచో సిద్ధింపదు. అందువలన ఈ స్థానేంతరతమవచనము నియమార్థము ఆవశ్యకమని చెప్ప బడినది.

అయిన ఈ ప్రయోజనము అనన్యథా సిద్ధమే అనుటయా ?

ఆ ! అట్లే. అనిష్టనివారణమునకిది ఆవశ్యకము.

## పాఠ నిర్ణయము

స్థానే,- అంతరతమే,- అని భేదమా ? లేక స్థానే-అంతరతమః అని ప్రథమాంత ఛేదమా కర్తవ్యము ? ఈ అంతరతమ నిర్వృత్తి ప్రకృతి ననుస రించియా ? లెక ఆదేశానురోధముగనా కలుగును ? ప్రకృత్యనురోధముగ అంతరతమ నిర్వృత్తి అను పక్షమున, 'స్థానే, అంతరతమే షష్ఠీ' అని వాక్యా ర్థము. షష్ఠీపదము పూర్వ సూత్రము నుండి యనువర్తించును. 'తిష్ఠంతి అస్మిన్నాదేశాః' అను నధికరణవ్యుత్పత్తిచే స్థానే అను దానికి స్థానియందు అని అర్థము. ఆదేశాను రోధముగ అంతరతమముల ప్రవృత్తి యనుపక్షమున, ఒకానొక స్థానిక ప్రాప్తించు అనేకాదేశములలో 'అంతరతమాదేశమే ప్రవ ర్తించును' అని అర్థమగును. ఇందు ఎయ్యది వివక్షితము ? అని విచారణ. అస లిట్టి విచారణకు, ప్రసక్తియేమి ? అనిన,

పాణిని సూత్రములు మొదట సంహితా రూపముననే పఠింపబడినది. సూత్ర విభాగము తరువాత చేయబడినది. అపుడు, 'స్థానేంతరతమ ఉరణ్రపర' అను సంహితననుసరించి, 'అంతరతమే' అనియు, 'అంతరతమః' అని యుచ్ఛేద మున కవకాశము కలదుగదా? కావున, ప్రకృతినియమమా? ఆదేశనియ మమా? అను విచారణ.

ఎట్లైననేమి ? అందురా ?

ప్రకృతి నియమపక్షమున, యణ్ణులకు అంతరతమములయిన ఇక్కులున్న లక్ష్యములందె 'ఇకః' అను షష్ఠ్యంత పదమునకు ఉపసంహారము. 'షష్ఠి యున్న చోటనే ఆదేశములు ప్రవర్తించును' అని అర్థమగును గాన, 'దధి+అత్ర', 'మధు+అత్ర' అనుచోటనే యణాదేశము ప్రవర్తించునుగాని, 'కుమార్యర్థమ్' 'బ్రహ్మబంధ్వర్థమ్' అనుచోట ప్రవర్తింపకపోవును. యణ్ణులు అర్ధమాత్రి కములు. వాని కంతరతమములయిన, ఇక్కులు అర్ధమాత్రికములు సంభవింపవు కాన, కించిత్సదృశములగు హ్రస్వములకే యాదేశములగునుగాని దూర విప్ర కృష్టములగు దీర్ఘములకు రాకపోవును. ఆదేశ పురస్కారముగ అంతరతమములు నిర్వృత్తములగుననిన పక్షమున, షష్ఠికి సర్వత్ర ఉపసంహారము కలుగును. అట వెల్ల ఆదేశములు ప్రవర్తించుటయు సిద్ధమగును.

అటులనే, ఇక్కుల స్థానమున గుణవృద్ధులు రాదగిన స్థలములందు, దీర్ఘములగు ఆదేశములు తమకు అంతరతమములగు స్థానులయిన దీర్ఘములకే వచ్చును గాని హ్రస్వములకు రాకపోవును. కాగా 'నేతా', 'లలితా', 'నాయకః', 'లావకః'- అను స్థలములందు ధాతువును, 'చేతాః' 'స్తోతా' 'చాయకః' 'స్తావకః' -అనుచో 'చిః' 'స్తు' ధాతువుల హ్రస్వేకారోకారములకు గుణవృద్ధులు సిద్ధింపకుండును.

ఆదేశములనుబట్టి యంతరతమములయినవి ప్రవర్తించునను పక్షమున అంతటను షష్ఠి యుపసంహృతమయి తత్తదాదేశములు ప్రవర్తించును గాన దోషములేదు.

మరియు ఆ విధముగనే, ఋవర్ణ స్థానమునందు గుణవృద్ధులు ప్రసక్తము లయినపుడు, వాని కంతరతమములగు స్థానులందే యవి ప్రవర్తించును. అనగా హ్రస్వఋకార స్థానముననే 'అర్' అనునదియు, దీర్ఘ ఋకారముననే ఆర్ అను వృద్ధియు రాదగియుండును. 'కర్తా' 'హర్తా' అనుచో గుణము, 'ఆస్తారకః' 'నిపారకః' అనుచో, 'స్తౄ', 'పౄ' ధాతువుల దీర్ఘ ౠకారమునకు వృద్ధియు సిద్ధించును. కాని 'ఆస్తరితా' 'నిపరితా' అనుచో గుణమును, 'కారకః' 'హారకః' అనుచో వృద్ధియు రాకపోవును. ఆదేశానురోధముగ అంతరతమ ప్రవృత్తి అనుపక్షమున అంతట షష్ఠీయోజనమును, ఆ షష్ఠికాదేశములును సిద్ధించును.

సప్తమ్యంత ఛేదమున నిట్టు లక్ష్యాసిద్ధి ప్రసక్తముగాన నా పక్షము సమంజసముగాదని భావము.

ఇక ఆదేశముల ననుసరించి యంతరతమ నిర్వృత్తియగునను పక్షమునను ఈ దోషము కనబడుచున్నది. "వాంతోయి ప్రత్యయే" (6-1-79) అను సూత్రమునందు, స్థాని నిర్దేశింపబడియుండలేదు. "ఏచోయవాయావః" (6-1-78) అను సూత్రమునుండి, 'ఏచః' అను పదమనువర్తించునుగావ ఏచ్చులు నాలుగింటికిని వాంతాదేశములు రెండును ప్రాప్తించుచున్నవి. అవి ఓకారమునకును ఔకారమునకును మాత్రమే రాదగును. ఏకారమునకును ఐకారమునకును వానిని నివారించుటకు, 'ఓదౌతోః'='ఓకార ఔకారములకు' అని స్థాని నిర్దేశమును చేయవలసియుండును. సప్తమ్యంతచ్ఛేదము నాశ్రయించి, ప్రకృతి నియమపక్షమును గ్రహించిన, వాంతాదేశములకు ఏచ్చులలో నేయవి అంతరతమములో వానికే అవి సిద్ధించును గాన స్థాని నిర్దేశమనావశ్యకము" అని భావము.

కాని, "ఆదేశతోంతరతమ నిర్వృత్తిః" అను పక్షమునను దోషములేదు. ఎట్లనగా- "యిప్రత్యయే" అని మాత్రమే సూత్రము రచింపబడును. 'వాంతః'

'ద

అను పదము అందు చేర్పబడదు. 'యకారాది ప్రత్యయము పరమగునపుడు ఏచ్చుల కయాదులు వచ్చును' అనియే యర్థము. అట్లైన 'చే+యమ్', 'జే+యమ్' అను స్థలములందును, అవి రావలసియుండునే యనిన,

'క్షి' 'జి' ధాతువుల ఏచ్చునకే యాంతాదేశమగును, ఇతర ధాతువుల ఏచ్చునకు రాదు అని "క్షయ్యజయ్యౌ శక్యార్థే" (6-1-81) అను సూత్రము నియమించును.

అట్లయిన, 'శక్యార్థమునందే' అను నియమము లేనందున, 'క్షేయం పాపమ్' 'జేయోవృషలః' అను స్థలమున గూడ అయాదేశము ప్రాప్తించునే అనిన, 'క్షి' 'జి' ధాతువుల ఏచ్చునకే, అందును శక్యార్థమునందేయని యోగ విభాగముచే, ఉభయతోనియమము ఆశ్రయింపబడును గాన నాదోషములేదు.

అపుడు, 'లవ్యమ్' 'పవ్యమ్' 'అవశ్యలావ్యమ్' 'అవశ్యపావ్యమ్' అను చోటగూడ అవావాదేశములు రాకుండునే? 'యాది ప్రత్యయము పరమగునపుడు ఆయవాయావాదేశములు వచ్చునెడల నవి 'క్షి' 'జి' ధాతువుల ఏచ్చునకే అని సామాన్య నియమముగదా యాశ్రయింపబడునది?

కాదు. తుల్యజాతీయమగు ఏచ్చునకే నియమము.

ఏది తుల్యజాతీయమగును?

'క్షి' 'జి'-ధాతువుల ఏచ్చు ఎట్టిజాతికి ఆశ్రయమో అట్టిది. అనగా కంఠ్యతాలవ్యము అన్నమాట. కాగా 'లూఞ్' 'పూఞ్' ధాతువుల ఏచ్చునకు 'యిప్రత్యయే' అను పూర్వసూత్రముచే అవావాదేశములు సిద్ధించును. అట్లు కాకున్న నా విధియే వ్యర్థమగును.

కాని, రై శబ్దమునకు 'రాయమిచ్ఛతి' అను నర్థమున, "సుపః ఆత్మనః క్యచ్" (3-1-8) అను సూత్రముచే క్యచ్ప్రత్యయము వచ్చినపుడు 'రైయతి' అని రూపమగును. అట ఐకారమునకు యాది ప్రత్యయము పరమయినది గదా 'అయ్' ఆదేశము రావలసియుండునే? అనిన, "రాయిచ్ఛాందసః।దృష్టాను విధిశ్ఛం ద భవతి" 'గోహ్' అను గుణ ప్రవృత్త్యనంతర నిష్పన్నరూపమునందలి, గుహ ధాతు సంబంధి ఓకారమునకు ఊకారమును విధించుచున్నది. అంతరతమమగు స్థానికి ఆదేశములు ప్రవర్తించునను సప్తమ్యంతపాఠ సిద్ధమగు నర్థమును గ్రహించిన, ఆదేశమగు నూకారమునకు గోహ్ అను స్థానియందు అంతరతమమగు ప్రకృతి ఉపధావర్ణమే యగునుగాన నచటనే 'షష్ఠి' అను పదమున కుపస్థితియు, వాదేశ ప్రవృత్తియు సంభవించునుగాన నిక 'ఉపధాయాః' అను పదమును సూత్రమున గ్రహించుట యనావశ్యకము.- తదకరణప్రయుక్తలాఘవము సప్తమ్యంత పాఠమున గలదు అని రూపణ తాత్పర్యము.

కాని ప్రథమాంత పాఠ పక్షమునను నిది సుపరిహారమే. ఎట్లనగా, "స్థానేంతరతమః" (1-1-49), "అలోంత్యస్య" (1-1-51) అను నీ రెండు పరిభాష లలో "అలోంత్యస్య" అనునది పదముగదా ? కాగా ఆ పరిభాషచే 'గోహః' అను షష్ఠికి, అంత్యాల్వునందుపసంహారము పరత్వమువలన ప్రాప్తమయ్యెడి. దానిని వారించుటకు, ఆ పక్షమునందును "ఉపధాయాః" అను పదము అవశ్య కర్తవ్యమేగాన, లాఘవమున కవకాశములేదు. అందుకనియే, ఉపధాపదము న్యాసమున నే కృతమైయున్నది.

ప్రథమాంత పాఠపక్షమున దూషణా భాస మింకొకటి కలదు. "రదా భ్యాంనిష్ఠాత నః పూర్వస్యచదః" (౮-౨-౪౨) అను సూత్రము నిష్ఠాతకారమునకు నత్వమును విధించినది. 'ఆదేశములంతరతమములు ప్రవర్తించును'- అను ప్రథమాంత పాఠ పక్షార్థము నందు, ఈ సూత్రమున స్థాన నిర్దేశము, 'ఏ స్థానిక నకారము వచ్చును ? అను సందేహమును వారించుట కర్తవ్యమయినది.

ప్రకృత్యంతరతమ నిర్వృత్తి పక్షమునసైన, నకారమునకు, నిష్ఠా ప్రత్యయమున నయ్యది యంతరతమ ప్రకృతియో దాని కెనత్వము సద్ధించును గాన ను అది తకారమేయగును కనుకను తకార గ్రహణ మక్కర లేదు.

కాని ఈ దూషణమును నిలువదు. ఆదేశానుబోధ్యంతరతమ నిర్వృత్తి పక్షమునను దోషములేదు. ఉభయపక్షములందును, తకార గ్రహణ మావశ్యక మగునను నాశయము చేతనె, పాణిన్యాచార్యుడు 'నిష్ఠాతః' అని సూత్రమున నె చెప్ప యుంచెను. 'భిన్నవద్భ్యామ —అను పదమును సంస్కరించునపుడు, భిద + తవత + భ్యామ్- అను నవస్థలో ప్రవర్తించునత్వము తనకు సుసదృశమగు దకార స్థానమునందె వచ్చును గాన తకారము స్థానమున ప్రవర్తించి యుండె డిది కాదు. వర్గ పంచమములును తృతీయములును బాహ్య ప్రయత్న సామ్యము గలవిగదా ? -

మరియు 'భిన్నమ్' అనుచోట నత్వము చరితార్థము గాన, నిటి చోట, నిష్ఠానత్వము ప్రవర్తించియే యుండెడిది కాదు. అట "ఆదేః పరస్య" (1-1-౫౪) అను పరిభాషకును అంతరతమ పరిభాషకును, విరోధము లేదు గదా. అందు వలన విరోధ విషయములగు స్థలములందు ప్రవృత్తియే లెకుండ పోవునను నాశయముతో స్థాని నిర్దేశము చేయబడినది. కాగా ప్రథమాంత షష్ఠ్యంత పాఠవాదు లుభయులకును నా సూత్రమున తకార గ్రహణ మవశ్య కర్తవ్యమే.

కావున, ప్రథమాంత పాఠము నిర్దోషమని పర్యవసితము - సప్తమ్యంత చ్ఛేదము వెనుక నుపపాదించిన రీతిగ దోషయుతము -

## "ఇది స్వతంత్ర విధి కాదు"

ఈ స్థానేంతరతమ వచనము నిర్వర్తకమా? అనగా అంతరతమములగు వాదేశముల నిది విధించుచున్నదా? లేక స్వతంత్రముగ వాని నియ్యది విధింపకున్నను, శాస్త్రాంతరములు విధించిన వాని కియ్యది నియమ ప్రతిపాదకమా? అని విచారము.

అందు నిర్వర్తక మిది యనుపక్షమున దూషణవార్తికము.

వా॥ "స్థానేంతరతమే నిర్వర్తకే సర్వస్థాని నివృత్తిః"- అనునది.

ఇది నిర్వర్తకమైన సర్వస్థానులకును నేదియో యొక అంతరతమాదేశము వచ్చియే తీరవలెను. స్థానియే యుండదు. 'దధి' 'మధు' ఇత్యాదులు పరినిష్ఠిత రూపము లనుకొనుచున్నాముగదా? అవియు నపరినిష్ఠితములే కావలెను. వానికిని నొక యంతరతమాదేశము రావలసియున్నది. పోనిమ్ము. వానికవియే యాదేశములందుమనిన అది నిష్ప్రయోజనము. భిన్నరూపవగు నాదేశవేదియేని వచ్చిన అది స్థాన్యర్థాభిధాన సమర్థముగాదయ్యె. ఇక పర్యాయ శబ్దములు ఆదేశములయి వచ్చుననిన అందు 'ఇది స్థాని, ఇది యాదేశము' అని నిర్ణయించుటకు వినిగమకమేదియు లేనందున రెండు పర్యాయ పదములను స్థానులును నాదేశములును నగునని చెప్పవలసి యుండును. అపుడీ సూత్రమే నిష్ఫలమగును అని వార్తిక తాత్పర్యము.

కాని, వచన సామర్థ్యమువలన నా శబ్దమున కదియే సాదృశ్య నిమిత్తముగ నాదేశమగునని చెప్పవచ్చును. అట్లుకాకున్న అంతరతమాదేశవచనమే వ్యర్థమగును. శబ్దముల వ్యవహారము అనాది పరంపరగ వచ్చుచున్నదిగదా యనిన,

ఆదశమునందు వైరూప్యమునకు ప్రసక్తిలేని 'బిసమ్' 'ముసలమ్' ఇత్యాదులందు వానికవియే యాదేశములనినను చిక్కులేదుగాని యచట నే వర్ణములకు అవర్ణములే యాదేశములయినపుడు అందలి సకారమునకు, "ఆదేశప్రత్యయయోః" (౮-౩-౫౯) అని షత్వము రావలసియుండును. అది అచట దోషము.

మరియు నిష్టమగు సాధుత్వ వ్యవస్థయే యేర్పడజాలదు. వేడి మంగలమునందు మస్తాల గింజలను వేసిన వందవి క్షణమైన నిలువనట్లు ఈ వర్ణములు

గూడ నొక ముహూర్తమయినను నిలువవు. ప్రయోజనము లేకున్నను ఎపుడు శాస్త్రము వర్తించుచునేయుండును గాన నన్ని స్థానులకు నివృత్తికి అభిముఖములయియే యుండును. ఏయ పరినిష్ఠితమనిశ్చుకొనదు పరినిష్ఠితమునకు సాధుత్వ బోధనమే వ్యాకరణ శాస్త్రకృత్యము అది యిప్పుడు సాధ్యము కాదాయె. కావున శాస్త్రమంతయు దోషావహమగును. సర్వాదేశము కావచ్చుననినను నిష్టమగు సాధుత్వ వ్యవస్థ దుర్ఘటమగును.

అట్లైన నీ సూత్రము ప్రతిపాదకమేయగుగాక. అనగా శాస్త్రాంతరముచే విహితములయినవానిలో నంతరతమములగు నాదేశములే సాధువులగునని నియమించుట యీ సూత్రమునకు కృత్యము. అనిన,

వా॥ "నిరకప్రత్త ప్రతిపత్తౌ నిర్వృత్తిః" అని యాక్షేప వార్తికము. 'ఇతర శాస్త్రములచే విధింపబడినవానిలో అంతరతమయినను ఇది నియమ ప్రతిపాదకము'- అనిన అభిమతమగు శబ్దము ఆదేశముగ సిద్ధింపదు. ఏలయన, శాస్త్ర విహితమగువానిలో గొన్నింటికి అసాధుత్వ బోధన మనుచితమగును. కావున పాక్షికముగ నుభయములకును, సాధుత్వము నంగీకరింపవలసివచ్చును.

నిర్వృత్తి సిద్ధింపనే సిద్ధిపదముదు వేమి? సిద్ధించియే యున్నదిగదా? అనిన వసలే సిద్ధింపదనికాదు. ఇష్టమగు నాదేశము సిద్ధింపదు. అన్ని యాదేశములును అంతట నిష్టములు కావుగదా?

"అకస్సవర్ణేదీర్ఘః" అను సూత్రము, దీర్ఘములగు నక్షత్ర్యాహార వర్ణములకెల్ల సాధుత్వమును బోధించుచున్నది. కాని, 'దైత్యారిః' అనుచో ఇకారోకార దీర్ఘములు నిష్టములు కావుగాన వానికసాధుత్వమును జెప్పవలసి యుండును. అది యశక్యము.

అట్టియెడ నీసూత్రము వ్యర్థము కాదాయనిన,

వా॥ "ఆనర్థక్యంచ" అని ప్రత్యాక్షేప మాధానవార్తికము. అనర్థకమే యగును. భోజనముచేసిన పిరువాత భోజనము చేయకుమని అనుటకేమి ప్రయోజనము?

వా॥ "తక్తం వా" అను వార్తికము ఆనర్థక్య పరిహారబోధకము.

"ఇకోగుణవృద్ధీ" (1-1-3) అను సూత్రమునందే యాక్షేపమునకు సమాధానము చెప్పబడియున్నది గాన నానర్థక్యములేదు అని భావము.

ఏమిచెప్పఁబడునది? అనిన, "సిద్ధంతు షష్ఠ్యధికారేవచనాత్" అని చెప్పఁబడియున్నది. అట 'ఇకోగుణవృద్ధీ' అను సూత్రమునకును స్వతంత్ర విధిత్వ నిరాకరణమునకై 'షష్ఠీ స్థానేయోగా' అను స్థలమున పాఠము కర్తవ్యమని యభిప్రాయము. షష్ఠ్యధికారపఠితమైన ప్రకృత సూత్రమునకు, "అకస్సవర్ణే దీర్ఘః" (6-1-101) ఇత్యాదులతో నేకవాక్యతగలిగి, విధాన కాలముననే అంతరతమాదేశములు సిద్ధించును. అంతరతమములుకాని యాదేశములకు విధానమే లేదు. కావున నిష్టవ్యవస్థ యుపపన్నమగును.

## అనిష్ట నిరాకరణము

### వా. "ప్రత్యాత్మవచనంచ" అను వార్తిక మాక్షేప వార్తికము.

"స్థానేంతరతమః ప్రత్యాత్మమ్" అని సూత్రమును రచింపవలసియున్నది. ఆత్మనమాత్మానం ప్రతి=ప్రత్యాత్మమ్॥ ఏది దేని కంతరతమమో అదియె దాని స్థానమున రావలెను. వేరొక దానికి అంతరతమ మగు నది వేరొక దాని స్థానమున రారాదు. ఆ ప్రయోజనము సిద్ధించుటకు 'ప్రత్యాత్మమ్' అని గూడ వచింపవలసి యుండునని ఆక్షేప్త భావము.

సమాధాన వార్తికము- "ప్రత్యాత్మవచన మశిష్యం స్వభావ సిద్ధత్వాత్" అనునది. స్వస్వస్థానవ్యంతరతమములే ఆదేశమగుట స్వభావసిద్ధము కావున, నా వచనము అనావశ్యకమని యర్థము.

"మీ రెల్లరుపోయి సమాజము లందును, సమాశములందును, సమవాయములందును కూరుచుండుడు" అని యనిన, వారు వారు పోయి తమ తమ సమాజ, సమాశ, సమవాయములలోనె కూర్చుందురు గాని వేరొక సమాజమున నసమాజమునకు చెందని వ్యక్తి కూరుచుండడు. 'మీ మీ' సమాజ సమాశ సమవాయములందని చెప్పకున్నను నట్లే జరుగును. సమాజములనగా నుత్సవ సమాజములు, సమాశములనగా, సంతర్పణ భోజన సంఘములు. ధర్మ నిర్ణయాది క్రియలందు సమావేశమగుట సమవాయము. అట్లు చేయుట స్వభావ సిద్ధము. కావున 'ప్రత్యాత్మమ్' అను వచనముతో పనిలేదు.

అంతరతమాదేశవచనము గూడ శాసింప బనిలేదు. అనగా నీ సూత్రమె యనావశ్యకమని "వా॥ అంతరతమవచనంచ" అను ప్రత్యాఖ్యాన వార్తిక భావము. కారణము స్వభావ సిద్ధత్వమే.

'సమాజ, సమాశ, సమవాయములందుగూర్చుండుడు అనిన, సన్నపాటి వ్యక్తులు తమవలె సన్ననైన వారికడను, తెల్లనివారు తెల్లని వారితోడను,

గూర్చుండఁబోరు. గుణకృతమగు సాదృశ్యముగాని, ప్రమాణకృత సాదృశ్యము గాని యచట గ్రహింపబడదు. ఎవరికెవ్వరితో విద్యావయోర్థకృతమగు నంతర్యముండునో వారితోనే కలసి మెలసి కూరుచుండుదురు.

తిర్యగ్జంతువులలో గూడ నిట్టి వ్యవహారమే లోకమున నగపడుచున్నది. చూడుడు.

గోవులు, పగటిపూట మేతకు బోయి, సాయంకాలము తిరిగివచ్చి, వాని వాని దూడలున్న తావులకు జేరి నిలుచుండును.

అట్లే, బండిలాగు నెద్దులు గాని దుక్కి దున్నునవిగాని, తమలోని రెండవ ఎద్దు కనబడనపుడు, వాని కొరకై, సహవాస పరిచయమువలన, అరచుచుండును. కావున నంతరతమవచనమును, అనేక విధాంతర్యము లున్న పుడు 'స్థానకృతాంతర్యమే గ్రాహ్య' మను వచనమును, అపూర్వముగ చెప్ప పనిలేదు.

ఈ ప్రక్రియ చేతనములందేకాదు. అచేతన పదార్థములందును గాన నగును.

ఒక రాయిని దీసికొని వేగముతో పైకి విసరిన నది పృథివీ వికారమగు టచే మరల పృథివినే చేరుచున్నది. అది అడ్డముగా గాని, పైకి గాని పోదు. ఎక్కదు.

ధూమము అంతరిక్షమున నుండు సూక్ష్మములగు నుదకముల వికారము. ఆ పొగకు స్వభావము పైకిపోవుటయే. అయ్యది యడ్డముగా గాని క్రిందకు గాని, గాలి లేనపుడు, వ్యాపింపదు. ఏలయనగా నది అబ్వికారము గాన నంతరిక్షమునందలి యుదకములనే చేరుచున్నది.

ఆ విధముగనే సూర్యుని వికారమగు తేజస్సు, ఆకాశావకాశము నిర్వాతమై యున్నపుడు బాగుగ ప్రజ్వలించును అపుడామంట, అడ్డముగ గాని అధోముఖముగ గాని మండుట ఉండదు. సూర్యుని వికారమగుటచేత నాంతర్యము వలన సూర్యుని వైపునకే పోవుచున్నది.

ఇట్లు లోక వ్యవహారమున నభీష్ట సిద్ధి కలుగ వచ్చును గావున నీ సూత్రము అనావశ్యకము.

అట్లయినను, మంద బుద్ధ్యనుగ్రహమునకై సూత్ర మావశ్యకమగు ననియు దలంపవచ్చును. కాగా సూత్రారంభ పక్షమున ప్రాప్తములగు దూషణము లను వాని పరిహారములను, వార్తికకారుడు ఆక్షేప సమాధాన వార్తికములచే నీ క్రింది విధముగ జూపియున్నారు.

అందు మొదటి వార్తికము-వా॥ "వ్యంజన స్వర వ్యతిక్రమేచ తత్కాల ప్రసఙ్గః"-అనునది

ఈ శాస్త్రము స్వతంత్రముగ అనేకవర్ణాదేశ విధాయకమయిన వ్యంజనములకును స్వరములకును వర్తించునది కాగి పుడు, ఆ వర్ణాదేశములచే నివృత్తి చెందు స్వరములు పడు, తత్కాలములగు = అనగా స్థానిభూత వర్ణములకు ఆదేశత ప్రాప్తించుచున్నది.

'ఇష్టమ్' అనునది యజధాతు ప్రకృతికి క్తాంతము ఇట ధాతువు నందలి యకారమునకు సంప్రసారణమయిన ఇకారము వచ్చినది. స్థానియగు యకారమర్ధమాత్రికముగాన నాదేశమునకును తత్కాలత ప్రాప్తించుచున్నది. ఇట్లే 'ఉప్తమ్' అనుచోట నుకారమును నట్టిదియే కాదగియున్నది ఇది ఆక్షేపము

లోకమునందు గాని వేదమునందు గాని మాత్రాకాలికమగు ఇక్కు ఎన్నటికు లేదు. మాత్రికమే యంతయును గలదు. కావునదియే వచ్చును. శబ్దములు నిత్యములు గదా! అవి శాస్త్ర కార్యములు కావు అని సమాధానము -

స్వరవ్యతిక్రమోదాహరణము - 'దధ్యత్ర' 'మధ్వత్ర' 'కుమార్యర్థమ్' 'బ్రహ్మబంధ్వర్థమ్' అనునవి. అట హ్రస్వదీర్ఘములగు ఇక్కుల స్థానమున, అంతర్యము వలన, మాత్రికము లను, ద్విమాత్రికము లనునగు యణ్ణులను ఈ సూత్రము విధింపవలసియున్నది.

లోక వేదములందు మాత్రిక ద్విమాత్రికములు యణ్ణులు లేవు గాన ఆ యాపత్తి లేదని సమాధానము. ఉన్నవానికి, ప్రయోగమును శాస్త్రము, నిరూపించి సాధుత్వమును బోధించునదే గాని వర్ణముల వయ్యది యపూర్వముగ నిష్పాదింపదు.

వా॥ "అక్షుచానేక వర్ణాదేశేషు" అని దూషణాంతర వార్తికము.

"ఇదమ ఇశ్" (5-3-3) అను సూత్రము, ఇదం శబ్దమునకు, 'ఇహ' మున్నగు రూపములందు ఇకారాదేశమును విధించుచున్నది. అందు త్యదా

ద్యత్వ పరరూపత్వములు ప్రవర్తించిన పిదప, 'ఇద' అను అనేక వర్ణస్థానికి, రెండున్నర మాత్రలు ప్రమాణము గాగల ఇకార మర్థ తృతీయ మాత్రికము ప్రాప్తించుచున్నది. "అర్థైవ తృతీయా మాత్రా యస్య" అను విగ్రహముచే, మూడవ మాత్రకు సగము తక్కువగా నుండునది = అనగా రెండున్నర మాత్రలు గలది.

ఈ దూషణము భావ్యమాన పరిభాషచే సుపరిహారము. అనగా భావ్యమానము = విధీయమానము సవర్ణములను గ్రహింపదు. కావున ఈ ఇకాదేశము అర్థ తృతీయ మాత్రికమునకు గ్రాహకము కాదు కాన నిది దూషణము కాదు.

వా॥ "గుణ వృద్ధ్యోర్ప్లుతేషుచ" అని వేరొక దూషణ వార్తికము. గుణ వృద్ధుల విషయమునను, ఏకాదేశ విషయమునందును, స్థాని భూత వర్ణ సమానకాలత ఆదేశములకు ప్రసక్తమగుచున్నది.

ఖట్వా + ఇన్ద్రః — ఖట్వేంద్రః — అను స్థలమున త్రిమాత్రికములగు, ఆకార ఇకారముల యేకాదేశమగు గుణమాంతరతమ్యమువలన త్రిమాత్రికము ప్రాప్తించుచున్నది.

'ఖట్వా + ఉదకమ్'— అనుచో త్రిమాత్రికోకారము ప్రాప్తము. 'ఖట్వా + ఈషా = ఖట్వేషా॥ ఖట్వా + ఊఢా = ఖట్వోఢా— అనుచోట్ల చతుర్మాత్రికములగు స్థానులకు చతుర్మాత్రములగు ఏకారోకారములును, ఖట్వా + ఏలకా = ఖట్వైలకా, ఖట్వా + ఓదనః = ఖట్వౌదనః, 'ఖట్వా + ఐతికాయనః = ఖట్వైతికాయనః, ఖట్వా + ఔపగవః = ఖట్వౌపగవః, అను స్థలములందు చతుర్మాత్రికము లగు 'ఐ' ఔలు వృద్ధివర్ణములాదేశములు కావలసివచ్చునని యాక్షేపము.

గుణవృద్ధి వర్ణములు తపరములగుటచే వయ్యవి తత్కాల సవర్ణములకే గ్రాహకములు గాన, గుణవృద్ధి సంజ్ఞా విధాయక శాస్త్రములు ద్విమాత్రికము లగు నేచ్చులకే ఆయా సంజ్ఞలను విధించును. కాగా త్రిమాత్ర చతుర్మాత్రికములు గుణ వృద్ధులే కావు అని సమాధానము -

తపరమనగా తకారము పరముగా గలదియని గదా యర్థము. 'వృద్ధిరాదైచ్' 'అదేఙ్గుణః' అను సూత్రములందలి 'ఏఙ్' 'ఐచ్' అనునవి తకారము పరముగా గలవి కాదు గదాయనిన, తకారము కంటె బరమైనవియు తపరములే.

అట్లయిన, "ఋూదోరప్" (3-3-57) అను సూత్రముచే విహితమయిన 'అప్' అను ప్రత్యయము, హ్రస్వోకారాంత ధాతువులకు పరముగనే గాని దీర్ఘోకారాంతములకు పరముగ సిద్ధింపక పోవును. ఆ సూత్రమున ఋూత్, ఉః అని విభాగము. ఉకారమిపుడు తకారము కంటె పరముగ నున్నది గదా. అపుడు, యవః, 'పవః' అను రూపములు సిద్ధించినను, 'లవః' 'పవః' అను దీర్ఘోకారాంత ప్రకృతికములయిన అప్ప్రత్యయాంతములు సిద్ధింపవు గదా యనిన,

అవ్విధాయక సూత్రమున నుచ్చరింపబడినది, దకారముగాని తకారము కాదు.

దకారము నుచ్చరించుటలో నభిప్రాయమేమి ? అది యెందులకు ? తకారోచ్చారణ మెయ్యది ఫలముగా గలదో దకారమును అంతియ. తకారము అసందేహార్థమో ముఖ సుఖార్థమోయనిన దకారము నంతియ.

తపర పదమున సమాస ద్వయము వివక్షితము. అట్లు కాక బహువ్రీహిమాత్రమే వివక్షితము అను పక్షమున, తకారము కంటె పరమయినది తత్కాలములకే గ్రాహకము అను నర్థము సిద్ధింపదు. 'ఋూదోరప్' అను చోట ఋూకారము అణ్ణుకాదు కావున, తత్కాలములకే యది గ్రాహకమగునని చెప్పబనిలేదు. ప్రాప్తియే లేదు గదా ఇక నది యసందేహముకొరకే యనవలె. ఇపుడు దకారము నందులకే యనవచ్చును.

వార్త్తికమునందు, 'గుణవృద్ధ్యేజ్భావేషు' అనునపుడు. గుణశ్చ.వృద్ధిశ్చ. ఏజ్భావశ్చ= అని ద్వంద్వము వివక్షితము. ఏ జ్భావములు అనగా ఏజాదేశములు. ఉదాహరణములు 'కుర్వాతే' 'కుర్వాథే' అనునవి. అందు, 'ఆతామ్' 'ఆథామ్' అను ప్రత్యయములు టి సంజ్ఞక భాగమగు, 'ఆమ్' అనునది అర్ధ తృతీయ మాత్రికోత గుటచే, రెండున్నర మాత్రలు గల ఏకారము. "టిత ఆత్మనే పదానాం టేరే" (3-4-79) అను సూత్రముచే విధింపబడవలసి యుండును. అనగా ఆ ఏకారము సవర్ణములయిన అర్థ తృతీయ మాత్రికములను గ్రహించును.

ఈ యాక్షేపమునకు సమాధానము పూర్వోక్తమే. లోకము నందును వేదమునందును నెచ్చటను నర్ధ తృతీయ మాత్రికము ఏచ్చులేదు. శాస్త్రము లేనిదానిని కల్పింపదు - అంతే.

వా॥ "ఋకారవశ్చ గుణ వృద్ధి ప్రసంగే సర్వప్రసంగో విశేషాత్" అని వేరొక యాక్షేప వార్త్తికము,

ఋకారమునకు గుణము. 'అర్' అనునది. వృద్ధి 'ఆర్', దీర్ఘ ఋకారమునకును నివియే గుణవృద్ధులు. కాని, ప్రకృత సూత్రము స్వతంత్ర విధియయిన, హ్రస్వ ఋకారమునకు అకారమే గుణముగాన నది సమ్మతమే యయినను, దీర్ఘ ౠకారమునకు, తల్లప్రమాణములగు ఏ ఓలు గుణములుగా రావలసి యుండును. అట్లే హ్రస్వ దీర్ఘ ఋకారములు రెండింటి స్థానమునను వృద్ధి వర్ణములయిన ఆ, ఐ, ఔ లు అన్నియు రావలసివచ్చును. ఎందువలననగా ఈ గుణవృద్ధి సంజ్ఞక వర్ణములే ఋకార స్థానమున వచ్చునని విశేషమేదియు గ్రహింపబడలేదు గదా అవిశేషమువలన=విశేషోపాదానము లేనందున హ్రస్వ దీర్ఘ ఋకారములకు మొత్తము సర్వగుణ వృద్ధి ప్రసంగమని యాక్షేపము॥

ఈ ఆక్షేపమునకు సమాధానముగ నవతరించిన వార్తికము-

వా॥ "నవా ఋవర్ణస్య స్థానేరపరప్రసంగా దవర్ణస్యాంతరత్వమ్" అనునది.

నవా=ఇది దోషము కాదనియు చెప్పనగును. ఏమనిన, ఋవర్ణ స్థానమున, ప్రసంగాకస్థయందే, అణ్ రపరమై ప్రవర్తించును. "ఉరణ్రపరః" (1-1-50) అను సూత్రముతోనేకవాక్యతను బొంది గుణవృద్ధి శాస్త్రములు తత్సంజ్ఞక వర్ణములను విధించును. కాగా, రశ్రుతి గల ఋకారను యొక్క స్థానమున, ఏకదేశ ద్వారమున స్థానకృతాంతర్యము గల రేఫవత్తగు అకారమే అంతరతమాదేశమగును. ఏచ్చులు రపరములు కావుగాన నవి ఋకారమున కంతరతమాదేశములు కాజాలవు॥

వా॥ "సర్వాదేశప్రసఙ్గస్త్వనేకాల్త్వాత్" వేరొక యాక్షేపము ఋవర్ణాంతాంగమునకు విహితములయిన 'అర్' 'ఆర్' అను గుణవృద్ధులు సర్వాదేశములుగ ప్రాప్తించుచున్నవి. అవి అనేకాల్లులు గదా! అలోంత్య పరిభాషకు "అనేకాల్శిత్సర్వస్య" అనునది యపవాదము ఋవర్ణాంతాంగమునకు అ, ఆకారములు విహితములయినను, 'ఖట్వా+ఋశ్యః' అనుచో ఆకార ఋకారముల స్థానమున ప్రవర్తించిన గుణము ఋకార స్థానికము గూడనయినట్లే ఋస్థానికములును నగునుగాన రపరత్వము సంభవించును.

సమాధాన వార్తికము - వా॥ "నవానేకాల్త్వస్యతదాశ్రయత్వాత్ ఋవర్ణాదేశస్యావిఘాతః"- అనునది,

నవా=అథవా, అయందోషఃన=లేదా ఇది దోషము కాదు. ఎందువలన? 'అనేకాల్త్వస్యతదాశ్రయత్వాత్ = అణ్ ఋకార స్థానమున

ప్రవర్తించిన పిదపనే గదా అనేకాల్లగునది? కావున మునుముందు అంగాంత్యమగు నిక్కుకు అలోంత్యా పరిభాషచే గుణవృద్ధులు ప్రవర్తించును. అనేకాల్త్వమునకుపజీవ్యము ఋస్థానికత్వము. కావున అనేకాల్శిత్పరిభాష, ఉపజీవ్యమును, పూర్వ ప్రవృత్తమును నయిన అంత్యాలుపసంహారమును బాధింపదు' అని సమాధాన వార్త్తిక తాత్పర్యము.

ఋకార స్థానమున, అకారాకారములు, ప్రవర్తించు సమయముననే రపరములయిన, స్థానాద్యేశములకు రేఫవత్త్వ రూపమగు ఆంతర్యము సంభవము. అట్లుగాక, ప్రవర్తించిన తరువాత రపత్వమును 'ఉరణ్‌పరః' అను సూత్రము విధించును అను పక్షమున స్థానాద్యేశముల కాంతర్యమేమి? అనిన నపుడును దోషము లేదు. ఆంతర్యమనునది స్థానార్థగుణ ప్రమాణ కృతమే కాదు. వర్ణ సామ్యాశ్రిత సాదృశ్యాదులును, ఆంతర్యములుగ గ్రహింపబడుట స్థలాంతరమున దృష్టము. ప్రకృతమున, ఋకారమునకును, అకారాకారములకును 'అనాంతర్యమే' ఆంతర్యము. ఆదేశమునకు ఆంతరతమమగు ప్రకృతి లేదు. స్థానికి అంతరతమమగు నాదేశము లేదాయె. 'హ్రస్వము' 'దీర్ఘము', అను నవాంతర భేదములను పరిగొనక ఋకార మాత్రమును గ్రహించిన, దానికి, ఏ ఆదేశముతోడను స్థానకృతమగు నాంతర్యము లేకుండుటయే వాని కాంతర్యము. అనగా స్థాన కృతాంతరతమము వానికి లేకుండుటయే వానికి పరస్పర సాదృశ్యమనుట. అవియే సాధారణ ధర్మముగా గ్రహింపబడునని భావము. అభావ రూపము సాదృశ్యమెట్లగుననిన, సమాధానాంతర వార్త్తికము - వా॥ "సంప్రయోగో వా నష్టాశ్వదగ్ధరథవత్" అనునది. లేదా వానికి. నష్టాశ్వుడగు యోధునకును, దగ్ధరథుడగు వేరొక యోధునకును యుద్ధరంగమున సంప్రయోగమువలె అత్యంత భిన్నములును అసదృశములును నగువానికి స్థానాద్యేశ భావము కలుగునని చెప్పవచ్చును. "నీకు గుఱ్ఱము చచ్చినది, నాకు రథము తగులబడినది మనముభయులమును గలసి యుద్ధము చేయుదము" అని ఆశ్వికుడును రథికుడును సంప్రదించుకొనునట్లు, నీకు అంతరతమమగు స్థాని లేదు గదా నాకునునంతరతమమగు నాదేశము లేదు, కావున మనము స్థానాద్యేశ భావ సంబంధమును ఏర్పరచుకొందము' అని అవి భావించుననుట.

కాని ఈ దృష్టాంతోపన్యాసము విషమము. చేతన పదార్థములలో, లోకమున, అర్థమువలన గాని ప్రకరణము వలనగాని ఆ విధమగు సంప్రయోగము సంభావితమయినను, నది అచేతనములగు వర్ణముల విషయమున నెట్లు పొసగును? అట్టి సంప్రయోగ బీజమేమియుండును? అని యాక్షేపించుటకు అవకాశము కలదు.

కాని, వర్ణముల చేతనముకైనను, వానిని ప్రయోగించు పురుషుడు చేతనుడేగాన నట్టి సంప్రయోగము సుఘటమే

ఏకాదేశ స్థలములందు దూషణోద్భావన నిరాకరణములు.

**వా॥ "ఏజవర్ణయోః ఆదేశే అవర్ణం స్థానినో అవర్ణ ప్రధానత్వాత్"** అని యాక్షేప వార్తికము -

ఖట్వా+ఏలకా=ఖట్వైలకా, మాలా+ఔపగవః=మాలౌపగవః, అను చోట ఆకార ఏకారము కును, ఆకార ఔకారములకును, ఐకార ఔకారములు ఆదేశముగ ప్రవర్తించినవి. ఈ రేకాదేశముగ అవర్ణము రాతగియున్నది. ఎందు వలననగా, స్థాని అవర్ణము ప్రధానముగాకలది అగుట వలన, స్థానియగు ఆ+ఏ—ఆ+ఔ- అనునవి అవర్ణము ప్రధానముగ గలవై యున్నది. ప్రధాన మనగ నధిక భాగముగలది యర్థము ఏకారము నందును అకారము కలదు. ఔకారము నందును నదికలదు. కనుక స్థాని అవర్ణ భూయస్త్వము కలది.కనుక నవర్ణ ప్రధానము గాన నట్టియే ఏకాదేశముగ రాదగియున్నది అని యాక్షేప వార్తిక భావము.

**వా॥ "సిద్ధంతూభయాంతర్యాత్"** అని సమాధాన వార్తికము.

సిద్ధంతు=సిద్ధమేతత్=ఘటనేజాదేశము సిద్ధించును. ఎట్లు ? అనిన,

ఉభయాంతర్యాత్=ఉభయ వర్ణములకును నేది యంతరతమమో అది ప్రవర్తింపవలెను గదా ?

అవర్ణము కంఠస్థానకము ఐకారఔకారములును, కంఠ్యతాలవ్య, కంఠోష్ఠ్యములును గదా. కనుక స్థానమునుబట్టి సమువా యాంతరతమమగునని, ఐకారఔకారములు సంభవము గలవి. అవర్ణ మా విధముగనుభయాంతరతమము గాదు. అది కంఠమాత్ర స్థానకము గదా! కనుక ఇది భూయస్త్వన్యాయ మునకు తావులేదు. అని తాత్పర్యము

"స్థానేంతరతమః"- అను సూత్రమునకు, ఆంధ్ర వివర్తము ముగిసినది.

# "ఉరణ్రపరః" (1-1-50)

## సూత్రార్థ విచారము

"ఋకార స్థానమున అణ్ప్రత్యాహార బోధ్యవర్ణమే యాదేశమగును. ఆదేశాంతరములు ప్రవర్తింపవు. ఆ ఉణ్వర్ణము రపరము నగును అని యర్థమా? లేక, "ఋకార స్థానమున లక్షణాంతరముచే నిష్పన్నమయిన అణ్ణుకు ఈ సూత్రము రపరత్వమును విధించునని యర్థమా ? అని విచారము.

అందేమి విశేషము ? ఎట్లైన నేమి ? అను ప్రశ్నకు సమాధాన వార్తికము—**ఉరణ్రపరవచనమన్య నివృత్త్యర్థం చేత్ ఉదాత్తాదిషు దోషః**"— అనునది,

ఈ సూత్రమన్య నివృత్త్యర్థమనిన, ఉదాత్తాద్యాదేశ విషయమున దోషము కలుగును.

ఉదాత్తాదు లెయ్యవి ? ఉదాత్త=అనుదాత్త, స్వరిత అను నాసికా దేశములు ఉదాత్తాదులు. ఋకార స్థానమున నివి విధింపబడినపుడు, అంతర తమ వర్ణములకు బాధకముగ అణ్ ప్రవర్తింపవలసి వచ్చును. ఉ॥ కృతిః హృతిః। 'కృతమ్, హృతమ్'। 'ప్రకృతమ్. ప్రహృతమ్। నౄః పాహి॥-

'కృతిః', 'హృతిః'- అన నవి క్తిన్ప్రత్యయాంతములు. ఆ ప్రత్యయ మునకా నిత్సంజ్ఞకము గాన నయ్యది పరమగునపుడు "ఞ్నిత్యాదిర్నిత్యమ్" (6-1-197) అను సూత్రముచే, కృ, హృ, ధాతువుల ఋకార స్థానమున ఉదాత్తమగు ఋకార మాదేశముగ విధింపబడినది.

కృతమ్, హృతమ్,- అన నవి క్తాంతములు. ఇట, ప్రత్యయస్వరముచే, అంతముదాత్తము కాగా, శేషనిఘాతచే, ఋకారమున కనుదాత్తా దేశము.

'ప్రకృతమ్, ప్రహృతమ్.- అను స్థలమున ఋకారమునకు, "ఉదాత్తా దను దాత్తస్యస్వరితః" (8-4-66) స్వరితమాదేశము.

'నౄః పాహి'— అను చోట, ఋకారమునకు, "అత్రానునాసికః పూర్వ స్యతువా" (8-3-2) అను సూత్రముచే అనునాసికాదేశము.

పై స్థలములందెల్ల ఋకారముల స్థానమున, ఉదాత్తాదులు, ఆంతర తమ్యమువలన, ఉదాత్తాదులే ప్రవర్తించినవి. ఉదాత్తాది ఋకారములే అగుట,

ఈ సూత్ర మన్య నివృత్త్యర్థమైన యెడల, ఋకార మణ్ణుకాదు గాన, దాని స్థానమున ఋకారాదేశములు సిద్ధింపకపోవును.

పోనిండు. ఋకారస్థానమున, అణ్ణు, తద్భిన్న వర్ణమును గూడ వచ్చును. అందు అణ్వర్ణము రపరమగును' అని దీని కర్థమనిన,— ద్వితీయ పక్ష దూషణ వార్తికము, వా॥ "యః ఉః స్థానే అణ్ సరపర ఇతిచేత్, గుణవృద్ధ్యో రవర్ణా ప్రతిపత్తిః"

'ఋకార స్థానమున వచ్చియున్న అణ్ణురపరమగును'- అని అర్థమయి నచో, గుణవృద్ధులు విధింపబడినపుడు, అవర్ణము సిద్ధింపనే సిద్ధింపదు. హ్రస్వ ఋకారమునకు, గుణమయిన అకారము, 'కర్తా' 'హర్తా' ఇత్యాదులందు, ప్రమాణ కృతాంతర్యము వలన లభించినను, దీర్ఘ ౠకారమునకు, గుణము అకారము లభింపదు. 'వార్ష గణ్యః' ఇత్యాది తద్ధితాంతములందు ఆదివృద్ధి నియతముగ ఆకారమే వచ్చుటయు గుమందు. వృషగణుని పుత్రుడు వార్ష గణ్యుడు. గర్గాదియఞంతము.

ఋవర్ణము స్థానమున రాదగన సవర్ణము లేనందున, ఇక అసవర్ణములే రావలసియున్నపుడు, అవర్ణమే వచ్చును గాని ఏఙ్లును, ఐచ్చులును రావను టకు ప్రబలమగు కారణమేమి ?

అనిన, మొదటి పక్షమునందును నీ దోషముండనేయున్నదే ? ప్రకృత సూత్రమే, ఋకార స్థానమున నణ్విధాయికమను పక్షమునందును, స్థాన సామ్యము గల వర్ణములు లేక అసవర్ణములే రావలసి వచ్చినపుడు, ఇకారో కారములు రావు. అణ్ణేవచ్చుననుటకు మాత్రము ఏమి దృఢతర కారణమట గలదు ? నియమ వాద పక్షమునను ఈ శంకకు అవకాశము కలదు గదా ?

ఇక, 'ఋకార స్థానమున, అణ్వర్ణమును తద్భిన్న వర్ణమును ప్రసక్తము లయినపుడు, అణ్వర్ణమేవచ్చును. అది రపరము నగును' అని సూత్రమున కర్థము. ఈ సూత్రము ఇతర వర్ణములకు బాధకముగ నపూర్వముగ అణ్ణును విధింపదు. 'అణ్ణును అనణ్ణును రావలసివచ్చునపుడు, అణ్ణే వచ్చునని నియ మించును. అది రపరమగుననియు బోధించును' అని యభిప్రాయమైనచో అపుడు అవర్ణమునకే ప్రతిపత్తి సిద్ధించును. ఇకారోకారములును అణ్ణులే అయినను గుణవృద్ధి ప్రసంగమున వానికి ఏమి ప్రసక్తి కలదు ?

ఆ పక్షమునను దాహృతాదులందు దోషము వచ్చునని చెప్పబడినదే అది యాపక్షమున నుండునా యుండదా ? నియమ వాదియగు నీ వేమి తలంతువు ?

ఆ దోషము ఉండును. ఎట్లన, 'ఉదాత్తము వచ్చును' అనగా నయ్యవి అణ్ణులను, అవి కానివియు నుండును గదా ! రెండును నిర్దిష్టములే.

అణ్ణులను ప్రతి నిర్దిష్టములే యనుకొనుము. కాని యవి ప్రాప్తింపవు గదా ! ఎందువలన అనగా, అంతరతమమే గదా ఆదేశముగ ప్రవర్తింప వలసినది. స్థానము, ప్రమాణము, స్వరూపము - మూడింటిని పురస్కరించు కొని ఋకార స్థానమున అట్టి ఋకారమే ప్రవర్తించును.

అనిన- 'స్థానేంతరతమః' 'ఉః ణపరః' అను నీ రెండు పరిభాషలును, పరస్పర ప్రాప్తిలేని వేరు వేరు లక్ష్యములందు చరితార్థములు. 'అకస్సవర్ణే దీర్ఘః' అను స్థలమున నంతరతమ పరిభాష కవకాశము. '...' '...' అను మున్నగు గుణ విషయమున 'ఉరణ్ పరః' అను దాని కవకాశము. ఇక 'కృతిః' 'హృతిః' ఇత్యాదులందు, ఉదాత్త స్వరాద విషయమున రెండును ప్రాప్తించుచున్నవి. ఇట స్థానేంతరతమ పరిభాషయే వ్యవస్థాపకము గాని 'ఉరణ్పరః' అనునది గాదని ఎట్లు చెప్పగలము. పైగా పర్వతము వలన, ఉరణ్పరః అనునదియే వ్యవస్థాపకము గావలసియున్నది. అయిన నేమందురా ? "ఉదాత్తాదిషు దోషః" అని చెప్పిన దోషము తప్పదని తేలుచున్నది.

మరియు, ఋవర్ణ స్థానమున ప్రతిపద విహితములయిన ఇత్వము, ఈత్వము, ఉత్వము' అనునవి యేవికలవో వాని విషయమున రపరత్వము ప్రాప్తింపదు. "ఋత ఇద్ధాతోః"(7-1-100) "అప్ జ్ఞప్యృధామీత్" (7-4-55), "ఉదోష్ఠ్య పూర్వస్య" అను సూత్రములు తద్విధాయకములు. భిన్న వర్ణము నకు ప్రాప్తిలేదు. అనియమము ప్రసక్తంగు స్థలముననే, ఉరణ్పర సూత్రము నియమమును, తచ్ఛేషముగ రపరత్వమును బోధించును. 'ప్రకృత మున నట్టి అనియమ ప్రసక్తిలేదు కావున రపరత్వమును నట సిద్ధింపక పోవును'. అను ఈ యాక్షేపమునకు సమాధాన వార్తికము, వా॥ "సిద్ధంతు ప్రసంగే రపరత్వాత్" అనునది,

సిద్ధంతు = పై స్థలములందును రపరత్వము సిద్ధము, ఎట్లన, ప్రసంగే రపరత్వాత్ = ప్రసంగావస్థలోనే రపరత్వము ప్రవర్తించును. ఋవర్ణ స్థానమున అణ్ణులను విధించిన వాక్యములతో ఈ సూత్రమునకు వాక్యైకవాక్యత కలుగును. కాన విధాన కాలమునందే రపరత్వ మాత్రము దీనిచే విధింప బడును. కావున దోషములేదని భావము.

అనగా "ప్రసంగే ఉరణ్ రపరః" అని చెప్పవలసి యుండునా ? కాదు. చెప్పబడనిది యెట్లు గమ్యమగును ? 'స్థానే' అను పదమిందనువర్తించు చున్నది. స్థాన శబ్దమునకు ప్రసంగ మర్థముగదా.

అట్లైన స్థానపదముచే ఆదేశము విశేషింపబడలేదే ? ఆదేశమును విశేషిత మగును? ఎట్లనిన,

పూర్వ సూత్ర ప్రస్తుతమయిన స్థానే అనునది రెండవదిందనువర్తించును. కాగా, 'ఉః స్థానే అణ్ స్థానే రపరః' అని వాక్యాన్వయము. ఋకార స్థానమున అణ్ణు ప్రసంగమునందే అనగా 'ప్రసజ్యమానమగుచునే రపర మగును' అని యర్థము. ఇపుడిక నుదాత్తాదులందు దోషములేదు. 'కృతిః' 'హృతిః' ఇత్యాదులందు ఋకారమునకు, స్థాన ప్రమాణ స్వరూపముల చేత నంతరతమమగు ఋకారమే ప్రాప్తముగాన అణ్ణున కచట ప్రసంగమే లేదు. ఋకార స్థానమున విధీయమానమగు గుణవృద్ధులు, ఆంతరతమ్యము వలన, 'అర్' 'ఆర్' అనునవియే వచ్చును గాన అవర్ణ ప్రతిపత్తియు నిరాఘాతముగ సిద్ధించును.

## అణ్గ్రహణ ప్రయోజన విచారము

ఈ సూత్రమున అణ్పదమేందులకు ? 'ఉరపరః' అనియే సూత్రమును రచించి యుండ కూడదా ? అని విచారము.

'ఉరపరః' అని మాత్రమే సూత్రమైన, రపరమగునదియేది ?

ఏది ఋకార స్థానమున విహితమో అది ఋకార స్థానమున వచ్చునది యేది ? ఆదేశము.

**వా॥ "ఆదేశో రపర ఇతిచేత్ రీరివిధిషు రపర ప్రతిషేధః"** అని యాక్షేప బాధక వార్తికము. రీరి విధులందును ఋకార స్థానికములవి యగుటచే రపరత్వము ప్రాప్తమగుటచేత నది ప్రతిషేధ్యము అగును.

రీరివిధు లనగా నెయ్యవి ? రీఙాదేశము, రిఙాదేశము రెండు విధులేకదా. విధిషు అను బహువచనమున కర్థమేమి ? అనిన రీరి గ్రహణ మితర విధులకు గూడ ఉపలక్షణమని సూచించుటకు బహువచనముపాత్తము. అవి, అకఙ్ ఆదేశము, లోపాదేశము, ఆనఙాదేశము, అనఙాదేశమును, రీఙ్ రిఙాదేశము లతో గలసిన మొత్త మారు ఆదేశములు.

'అకఙ్' ఆదేశోదాహరణము- 'సౌధాతకిః,' ఇట, "సుధాతురకఙ్ చ" (4-1-97) అను సూత్రముచే. 'ఇఙ్' అను ప్రత్యయమును, ప్రకృతికి అకఙాదేశమును విధింపబడినవి. ఆ ఆదేశము గూడ ఋకార స్థానికమగుటచే రపరము కావలసివచ్చును. అపుడా రూపము సిద్ధింపదు. కావున దాని నట ప్రతిషేధింపవలసి యుండును. సుధాతుః అపత్యమ్ = సుధాత పుత్రుడు అని యర్థము.

'పైతృష్వ సేయః' అను రూపము నందు, పితృష్వసుః అపత్యమ్' అను నర్థమున, "ఢకలోపః" (4-1-133) అను సూత్రముచేత, ఢక్ప్రత్యయము పర మగునపుడు అంత్యలోపము విధింపబడినది. అదియు రపరమైనది ఋకార స్థానమున యణాదేశముచేతనే సిద్ధించును గాన వ్యర్థమేయగును.

"హోతాపోతారౌ" అను ద్వంద్వ సమాసమున. పూర్వపదమగు హోతృ శబ్దము యొక్క ఋకార స్థానమునందు, "ఆనఙ్ ఋతో ద్వంద్వే" (6-3-25) అని విధింపబడిన 'ఆన్' అను ఆనఙాదేశము గూడ రపరమైన నట రేఫ వినబడవలసి వచ్చును.

'కర్తా' 'హర్తా' అనుచోట "ఋదుశనస్ పురుదంసోనేహసాంచ" (7-4-27) అను సూత్రముచే విధింపబడిన అనఙాదేశము గూడ రపరము కావలసి వచ్చును.

'మాతర మిచ్ఛతి', 'పితర మిచ్ఛతి'- అను నర్థములందు క్యజంత రూప ములు 'మాత్రీయతి' 'పిత్రీయతి' అనునవి అట క్యచ్ప్రత్యయము పరమగు నపుడు, ఋకారస్థానమున "రీఙ్ ఋతః" (7-4-27) అను సూత్రముచే విహిత మయి నరీఙ్ ఆదేశము గూడ రపరము కావలసవచ్చును.

ఇక 'క్రియతే' 'హ్రియతే' అను రూపములందు ధాతువు ఋకారము నకు, "రిఙ్, శ, యక్, లిఙ్ షు" (7-4-28) అను సూత్రముచే విధింపబడిన 'రిఙ్' అను నాదేశము గూడ ఋకారస్థానమున, రపరమై 'రిర్' అని ఆదేశము కావలసివచ్చును.

వా॥ "ఉదాత్తాదిషుచ" అని వేరొక యాక్షేపబాధక వార్తికము.

'ఉదాత్తాదుల విషయమునను'- అని వార్తికార్థము; ఏమి? అని ప్రశ్న. రపరత్వము ప్రతిషేధింపబడవలసి యుండును.

'కృతిః,' 'హృతిః,' 'కృతమ్', 'హృతమ్', 'ప్రకృతమ్', 'ప్రహృతమ్', 'కృష్ణః' 'పాహి' ఉదాత్తానుదాత్తస్వరితానునాసికాదేశములు గూడ రపరములు కాకుండుటకు, సూత్రము నందణ్పద మావశ్యకమని భావము॥

## ఏకాదేశ స్థలములందు రపరత్వ సాధనము

వా॥ "ఏకాదేశ స్యోపసంఖ్యానమ్" అని వార్తికము.

ఖట్వా+ఋశ్యః=ఖట్వర్శ్యః। మాలా+ఋశ్యః = మాలర్శ్యః. ఇట అకారము గుణము. అది (అ+ఋ) ఆకార ఋకారముల స్థానమున ప్రవర్తించినది. అది పూర్వపరములకేకాదేశము. కనుక సముదాయమే స్థాని. అది ఋవర్ణరూపము గాదు. కాబట్టి ఏకాదేశము గూడ ఋస్థానికము రపరమగునని ఉపసంఖ్యానము కర్తవ్యమని వార్తికార్థము.

ఏ కారణమువలన సూత్రముచే సిద్ధింపదు ? అనిన,

ఋకారస్థానికమగు అణ్ణు ప్రసంగావస్థలో రపరమని గదా చెప్పబడు చున్నది. ఇట అణ్, ఋకార మాత్ర స్థానమున విధింపబడలేదు. ఋకార స్థానమునను, వేరొక వర్ణము స్థానమునను విధింపబడుచున్నది అని భావము.

ఈ యాక్షేపమునకు సమాధాన వార్తికము "అవయవగ్రహణాత్సిద్ధమ్" అనునది.

పూర్వపర సముదాయము స్థానియైనను వా సముదాయము, ద్వాభ్యాం షష్ఠ్యంతాభ్యాం వలన నుద్భూతావయవ భేదము కలదియే వివక్షితము. కాబట్టి ఆ సముదాయావయవ ఋవర్ణము నాశ్రయించి రపరత్వము సిద్ధించును. ఇయ్యది లోక సిద్ధము. లోకమునందు "మాషాఃనభోక్తవ్యాః"— 'మినుములను భుజింపరాదు' అని విషేధించినపుడు, ఆ మినుములు ఏ కందులతో గలసి యున్నను, ఆ మిశ్రములయిన మినుములకును వా విషేధము వర్తించు చున్నదిగదా!

వా॥ "అవయవ గ్రహణాత్సిద్ధమితిచే దాదేశరాంత ప్రతిషేధః"- అనునది పై సమాధానమునకు నిరాసకమగు వార్తికము.

అవయవమును గ్రహించి సముదాయాంతర్గత ఋకారమునకు రప రత్వము సిద్ధింపజేయవలెనన్నచో ఆదేశమునందు రాంతత్వము ప్రాప్తము. దానికి

ప్రతిషేధింపవలసి యుండును. వార్తికమున, రాంతస్య=అనగా రాంతత్వ్యస్య అని యర్థము. అనగా, ఋకారమును తద్భిన్నమగు వేరొక వర్ణమునకును వచ్చిన అణ్ణు రపరమయినట్లు, ఋకార స్థానమున ప్రవర్తించు అణానణ్ణము దాయ రూపమగు నాదేశము నందలి అణ్ణును గ్రహించి, అదియు నణాదేశ మగును గాన రపరత్వము ప్రసక్తమగుచున్నది. ఉదాహరణము "హోతా పోతారౌ" అనునది. ఆ ద్వంద్వ సమాసమున, పూర్వపదాంత ఋకారస్థానము నందు "ఆనఙ్ ఋతోద్వంద్వే" (6-3-25) అను సూత్రముచే విహితమయిన ఆన్ అను నాదేశము గూడ, అణ్ అనణ్ సముదాయమయినను యుక్తితోల్యముచే రపరము కావలసివచ్చును.

కావున అవయవ గ్రహణ మతివ్యాపకమగుట వలన, సాక్షాత్తుగ, ఋవర్ణమునకు మాత్రమే అణాదేశము విహితమగు స్థలములందే యీ పరిభాష ఉపస్థితమగునని చెప్పవలసి యున్నది. కాగా ఉప సంఖ్యానము కర్తవ్యమే యగును.

'ఉరణ్' అను సూత్రమున, 'ఉః' అనునది వర్ణగ్రహణము. "వర్ణ గ్రహణంచ సర్వత్రతదంత విధిం ప్రయోజయతి" అను న్యాయముచేత, ఋవర్ణాంతమగు స్థానికి రపరత్వము విధింపబడినదని గ్రహించిన, 'ఖట్వర్శ్యః' 'మాలర్శ్యః' ఇత్యా ల్లక్ష్యములందు, 'ఖట్వా+ఋ' మాలా+ఋ అనునది ఋవర్ణాంతమగు స్థాని కావున దాని అణ్ణురపరమగును అపుడు అవయవ గ్రహణము లేకున్నను, ఉప సంఖ్యానముతో పని కలుగదేమో యనిన నటు గ్రహించుట శక్యముకాదు. అప్పుడు, 'కర్తా' 'హర్తా' 'కిరతి' 'గిరతి' అను స్థలములందు, స్థాని ఋవర్ణ మాత్రమే గాని ఋవర్ణాంతము కాదుగాన రపరత్వము సిద్ధింపకుండును కృ, ఇత్యాద్యధికము ఋవర్ణాంతమయినను అలోంత్య పరిభాషచే, అంగాంత్యవర్ణము స్థానియగును. అది ఋవర్ణమేగాని ఋవర్ణాంతముగాదు.

వ్యపదేశివద్భావముచే ఋవర్ణమే ఋవర్ణాంతము కావచ్చునుగదా యనిన, "అర్థవతా వ్యపదేశివద్భావః అని అర్థవంతమగు = అర్థబోధకమగు శబ్దముచే, ముఖ్య వ్యవహారము కలదానితో తుల్యముగ, కార్యము పొందబడును." ఈ ఋకారము అర్థవంతము కాదు గదా, అందువలన నట్లు చెప్పుట కుదురదు. కాగా ఉపసంఖ్యానము కర్తవ్యమేయనుట. మరియు, 'మాతుః' 'పితుః' అను లక్ష్యములందును, రపరత్వమునకు ప్రతిషేధము వక్తవ్యమగుచున్నది. అట్లు, మాతృ+అస్ అను నవస్థలో, ఋకారాకారముల స్థానమున "ఋతఉత్" (6-1-111) అను సూత్రముచేత, ఏకాదేశముగ విహితమయిన ఉకారము రపరము కావలసియున్నది. అపుడు 'మాతుర్స్' అని యగును. అపుడు

పకారముకకు రుత్వము రాగా, దానికి, "రోరి" (8-3-14) అని లోపమును, "ఢ్రలోపేపూర్వస్యదీర్ఘోణః" (6-3-112) అని ఉకారమునకు దీర్ఘమును గలుగగా మాతూః' అని కావలసివచ్చుచున్నది. ఇది యాక్షేపము.

దీనికి సమాధానము - ఉభయమును వక్తవ్యము కాదు. అనగా ఉప సంఖ్యానమును చెప్పనక్కరలేదు. దాని వలన గలిగిన అతి వ్యాప్తి నివారించు టకు, రపరత్వ ప్రతిషేధమును, జెప్పపనిలేదు. ఏలయన - షష్ఠీ నిర్దిష్టముగు రెండు స్థానములందు ప్రవర్తించు ఆదేశము, పూర్వ స్థాని ఆదేశమియ్యది అనియు పరస్థానిక మిది అనియు అన్యతరవ్యపదేశమును బొందవచ్చును ఒక పిల్ల వానికి దలిదండ్రులు, దేవదత్తుడును దేవదత్తయును. అపుడీ బాలుడు, దేవ దత్తుని కుమారుడు అనియు, దేవదత్త కొడుకీతడ అనియును అందురు గదా. ఇక 'మాతుః', 'పితుః' అనుచో అతి ప్రసక్తికేమి సమాధానము ? అనిన అచట రపరత్వము కలుగనిండు దాన నేమి దోషము?

రూప సిద్ధి యెట్లు ? అందురా వినుడు. "రాత్సస్య" (8-2-24) అను సూత్రముచే సకారమునకు లోపము వచ్చును. రుత్వము సిద్ధమగుటచేరాదు. రేఫకు విసర్జనీయము వచ్చును. కాగా 'మాతుః' 'పితుః' అనియే రూప ములు సిద్ధించును గాని, 'మాతూః' 'పితూః' అని యనిష్ట రూపములు ప్రాప్తింపవు -

కాని ఈ విధముగ రూపములు సాధితములయినను, వేరొక యనుపపత్తి తోచుచున్నది. 'మాతుఃకరోతి' 'పితుఃకరోతి' అను స్థలములందు "ఇదుదుపధ స్యచా ప్రత్యయస్య" (8-3-41) అను సూత్రముచే విసర్గ కపుడు షత్వము రావలసివచ్చును.

ప్రత్యయరూప విసర్గము కానిదానికి షత్వమగునని గదా యర్థము. ఇపుడీ విసర్గము ప్రత్యయ రూపము కానిదే యగును. 'అస్' అను షష్ఠు ప్రాయము ప్రత్యయము. అందు సకారము లోపించి, రేఫకు విసర్జనీయము వచ్చినది. ఈ రేఫ అకార స్థానికము. కాగా అది ప్రత్యయ భిన్నమే - అనిన,

ఇది ప్రత్యయ రూపమే. తద్భిన ముగాదు. సూత్రమునందలి ప్రత్యయపదమునకు ప్రత్యయావయవ సి [illegible] ర్థము. అ[illegible] ము ప [illegible] నా వయవమే అగును కావ దాని వి[illegible]ర్గ ప్రత్యయమే.

'కవిభిః కృతమ్' అనుచోట షత్వము ప్రవర్తింప [illegible] డుటకు, విసర్గము ప్రత్యయావయవమగుటయే [illegible]దా కారణము. కావున షత్వ[illegible] ప్తిరూపదోషము

లేదని సమాధానము. కాని, "రాత్సస్య" (8-2-24) అని, యిచట ప్రత్యయము లోపించినది గదా అని మరల నాక్షేపము తప్పదు. సకారమున్నపుడకారమాత్రము ప్రత్యయము గాదు. కావున, తదాదేశమగు 'ఉత్' అనునది - అనగా హ్రస్వోకారము ప్రత్యయము కాదు. ఉత్వానంతరము అవశిష్టమగు సకారము లోపించిన దాయె. కాగా ఈ విసర్గమునకు ప్రత్యయ సంబంధిత్వమును లేదు. తత్ఫలితంగా షత్వ మనివార్యమని తాత్పర్యము.

ఈ యాక్షేపమునకు పరిహారముగ నవతరించిన వార్తికము.

**వా॥ "భ్రాతుష్పుత్ర గ్రహణం జ్ఞాపకమేకాదేశనిమిత్తాత్ షత్వ ప్రతిషేధస్య"- అనునది.**

"కస్కాదిషుచ" (8-3-48) అను సూత్రముచేత, పాణిని, కస్కాదిగణమని తానేర్పరచిన యొక గణమునందు పఠించిన శబ్దములలో, ఇణ్ప్రత్యాహార వర్ణములకు పరమైన విసర్గకు షత్వమును తద్భిన్నవర్ణములకు పరమైన విసర్గమునకు సత్వమును నిపతించి యుండెను.

ఆ గణమున, "భ్రాతుష్పుత్రః" అను శబ్దమును బఠింపబడియున్నది. అందు విసర్గకు షత్వము, 'ఇదుదుపధస్య' అను సూత్రముచే సిద్ధించుచున్నందున నా పాఠము వ్యర్థము. అది అట్లు వ్యర్థమయి, 'ఏకాదేశ శాస్త్రము నిమిత్తము గాగల దాని కంటే బరమయిన విసర్గకు షత్వముురాదు' అను నంశమునకు జ్ఞాపకమగును. ప్రకృత లక్ష్యమున, ఏకాదేశశాస్త్రము "ఋత ఉత్" అనునది. తన్నిమిత్తముగ వచ్చినది ఉకారము. దానికి పరమయినది విసర్గము. కావున భ్రాతుష్పుత్రః అనుచోట షత్వము ప్రాప్తింపనందున దానికి గణమునందు పాఠము సార్థకము. దాని ఫలితముగ 'మాతుఃకరోతి', 'మాతుఃకృపా' మున్నగు స్థలములందు షత్వము రాదు, అని భావము.

... ఇక ఈ రేఫము, పూర్వాంతమా ? పరాదియా ? లేక అభక్తమా ? అని విచారము. ఏమైన నెట్లగును ? అనిన, "ఆద్యంతౌటకితౌ" (1-1-46) అను సూత్రమునుండి ఆది పదమిందనువర్తించిన నీ రేఫము పరాదియగును. అంతపదమనువర్తించిన, పూర్వాంతము. అవి రెండును అనువర్తింపనిచో అభక్తమగును.

ఇటనొక ప్రశ్న కలదు. ఋకారస్థానమున విధింపబడు అణ్వర్ణము రపరముగ ప్రవర్తించునని గదా సూత్రార్థము. రేఫకు విధానము, లేదే. కాగా అది ప్రధాన విధేయము కానపుడు, అనువర్తించిన ఆద్యంత పదములు రేఫకు నెట్లు విశేషణములగును ? ఈ ప్రశ్నకు సమాధాన మిట్లు చెప్పవచ్చును - [illegible] అని విగ్రహము. షష్ఠీ

మవయవత్వము కాగా రపరశబ్ద తాత్పర్య విషయమగుటచే ప్రధాన విధేయము రేఫయే. దానికే అంత శబ్దము విశేషణమయి,పూర్వాంతావయవమయిన రేఫము పరముగా గల అణ్ణువచ్చునని యర్థమగును. ఎట్లైననేమి విశేషమనిన,-

అభక్తమను పక్షమున దోషములను నిరూపించు వార్త్తికము -

**"అభక్తే దీర్ఘ, లత్వ, యగత్వ స్తస్వర, హలాదిశేష, విసర్జనీయ ప్రతిషేధః ప్రత్యయా వ్యవస్థాచ॥"** అనునది. గీర్షముమున్నగు, వార్త్తికోక్త కార్యములు అభక్తమను పక్షమున సిద్ధింపవు అని యర్థము, అందు.

(1) దీర్ఘము — 'గీః' 'పూః'- అను రూపములలో, రేఫవకారాంతమగు ధాతువు నుపధకు విహితమయిన దీర్ఘము ప్రాప్తింపదు.

'గౄనిగరణే' అను ధాతువునకు 'క్విప్' ప్రత్యయము రాగా ఏర్పడిన రూపము, గీః అనునది. ఋకార స్థానమునందు, "ఋతఇద్ధాతోః" (7-1-100) అను సూత్రముచే ఇకారము రపరమయి ప్రవర్త్తించినది.

"ర్వోరుపధాయా దీర్ఘ ఇకః" (8-2-76) అను సూత్రముచే 'గిర్' అనుచో నికారమునకు దీర్ఘము. ఇక 'పూః' అను స్థలమున "ఉదోష్ఠ్య పూర్వస్య" (7-1-102) అను సూత్రముచే ఉత్వమును, పై సూత్రముచే దీర్ఘమును రావలసియున్నవి. ఈ రేఫ అవయవము కానిచో, నా ధాతువులు రేఫాంతములు కానేరవు. తత్ఫలితముగ దీర్ఘము దుర్లభమగును. సరియే కాని,

రేఫవకారములచే ధాతువునే యేల విశేషింపవలెను ? ఆ సూత్రమున 'పదస్య' అనునదియు నధికార ప్రాప్తమయినది కలదు గదా. దానినేల విశేషింపరాదు? అట్లైన రేఫాంతమును, వకారాంతమును నగు పదమున నుపధయగు నిక్కునకు దీర్ఘమగునని యర్థముగదా. 'గిర్' 'పుర్' అనునవి రేఫాంత పదములాయె. కావున నీ దోషము కలుగదేయనిన, అట్టి యన్వయము కుదురదు 'అగ్నిః' 'వాయుః' అను పదములందు 'అగ్నిర్,' 'వాయుర్' అనునవియు రేఫాంతపదములే గాన వాని యకారోకారములకు దీర్ఘము రావలసి వచ్చును.

పోనిండు. రేఫవకారములచే పదమును విశేషించి, ధాతువుచే ఇక్కును విశేషింతము. అపుడా యిక్కు ధాత్వవయవమయిన పల దీర్ఘముప్రాప్తించును గాన, 'అగ్నిః' అనుచో నికారము ధాత్వవయవము కానందున దోషము లేదందురా? అపుడును 'ప్రియగ్రామణీః', 'ప్రియసేనానీః' అను స్థలములందతి ప్రసంగము కలుగును. 'గ్రామణి' 'సేనాని' అనునవి నపుంసకములు. గ్రామ మును నడిపించు కులము, సేనను నడుపువారి కులము అని వాని కర్థము.

అయ్యాది ప్రియముగ గలవాఁడు ప్రియగ్రామణి, ప్రియసేనాని ప్రియగ్రామణిప్ అను నవస్థలో, పదము రేఫాంతమును, ఇకారము ధాత్వవయవమును గనుక దీర్ఘ మనివార్యము. అందువలన 'ర్వోః' అను పదము ధాతువునకే విశేషణము కావలెను. అపుడు 'గీః', 'పూః' అను స్థలములందు అభక్తత్వ పక్షమున దోషము తప్పదు —

(2) లత్వము — 'నిజే గిల్యతే' అనునది లత్వోదాహరణము. అయ్యాది నిపూర్వకమగు గౄధాతువు యజాత రూపము. ఇత్వానంతరము రేఫకు, "గ్రో యఙి" (8-2-20) అను సూత్రముచే లత్వమురావలెను. ఆ లత్వము గౄధాత్వవయవమగు రేఫకు విధింపబడినది. ఆ రేఫ అభక్తమయిన నియ్యాది సిద్ధింపదు అని భావము

కాని యిది దోషము కాదు. ఆ సూత్రమున 'గ్రః' అనునది 'అవయవ షష్ఠి' అనియే యేల చెప్పవలెను. ఆనంతర్యార్థకమగు షష్ఠియనియు చెప్పనగును గదా ? అపుడు గౄధాతువున కనంతరమగు రేఫకు అని యర్థమగును. కావున నీ రేఫ అవయవము కాకున్నను దోషము లేదు.

కాని అపుడు, స్వర్ జే గిల్యతే అనుచోట 'స్వర్' అను నవ్యయము నందలి రేఫకు గూడ లత్వము రావలసి యుండును. ఆనంతర్యము పూర్వపర సాధారణముగదా. ఇక యఙుచే ఆనంతర్యమును విశేషించి, గౄధాతువు నందు యఙనంతర రేఫకులత్వమని చెప్పిన ఆదోషము కలుగదు. లేదా 'గ్రః' అనునది షష్ఠికాదు. పంచమి. దానికంటే పరమగు రేఫకు, యఙు పరమయి నపుడు లత్వము వచ్చునని ఆ సూత్రమున కర్థము అని చెప్పినను లత్వా సిద్ధి దోషము కాదు.

(3) యక్స్వరము—యక్స్వరాసిద్ధియు నీ పక్షమున దూషణాంతరము. "అచః కర్తృ యకి"(6-1-195) అను సూత్రముచే విధింపబడిన ఆద్యుదాత్తము యక్స్వరము. ఉపదేశమున నజంతములగు ధాతువుల ఆద్యచ్చు, కర్త్రర్థక మగు యక్ప్రత్యయము పరమగునపుడుదాత్తమగునని దాని యర్థము.

'లూయతే కేదారః స్వయమేవ' ఇత్యాదులు ఉదాహరణములు. ఇది కర్మ కర్తృ ప్రయోగము. పొలము తనంతతానే కోసికొనుచున్నది అని యర్థము. ఇట లకారము కర్త్రర్థమునందు విహితమే. ఆ కర్తకు కర్మ వద్భావమును విధించుటవలన యగాత్మనేపదములు వచ్చినవి. కాగా స్థితి కర్తృ యక్కగుట వలన నై సూత్రముచే నాద్యుదాత్తము ప్రవర్తించినది,

ఇట్లే, 'గృ', 'పృ' ధాతువుల కర్మ కర్తృ ప్రయోగములు 'గీర్యతే స్వయమేవ' 'పూర్యతే స్వయమేవ' అనునవి. ఇట 'రేఫమభక్తమయిన, దానితో; వ్యవధాన ముండునుగాన వా స్వరము ప్రవర్తింపకపోవును' అని వార్తిక కర్త తాత్పర్యము.

కాని ఇదియు దోషము గాదు. స్వర విధి విషయమున విద్యమాన మయిన వ్యంజనమయినను నది అవిద్యమానముగ భావింపబడునని చెప్పి యుండుటచే రేఫ వ్యవధాయకము కాదు. "స్వర విధౌ వ్యంజనమవిద్యమాన వద్భవతి"

(4) అభ్యస్త స్వరము—ఈ స్వరము సిద్ధింపకుండుటయు నింకొకదోషము.

"అభ్యస్తానామాదిః" (6-1-186) అను సూత్రము, అభ్యస్త సంజ్ఞక ధాతువులకు లసార్వధాతుకము పరమగునపుడు ఆద్యుదాత్తమును విధించు చున్నది. "మాహిస్మతే పిపరః" "మాహిస్మతే బిభరః" అను స్థలములందు ప్రవర్తింప వలసిన యీస్వర మిపుడు రేఫతో వ్యవధానమువలన ప్రవర్తింపకపోవును. 'పిపరః=' 'పృ' ధాతువు. లకారము 'లఙ్', 'ఝి', 'ఉస్' శప్ శ్లు, ద్విత్వము "అర్తిపిపర్త్యోశ్చ" (7-4-77) అని ఇత్వము. మాఙ్ప్రయోగము వలన నడా గమము రాలేదు. కావున, అట్ స్వరమునకు ప్రసక్తి లేదు. "హిచ" (8-1-34) అను సూత్రముచే నిఘాత నిషేధము ప్రవర్తించుటకు 'హి' యొక్క ప్రయోగము. "స్మోత్తరే లఙ్ చ" (3-3-176) అను సూత్రముచే 'లఙ్'. వారు పాలింపకుందురు గాక, భరింపకుందురు గాక అని వాక్యముల కర్థము.

ఇదియు దోషము కాదు. "స్వర విధిలో వ్యంజనమవిద్యమానము వంటిదగు'నని పైన చెప్పిన సమాధానమే ఇట గూడ వర్తించును.

(5) హలాదిశేషా సిద్ధి దూషణాంతరము - 'వవృతే' 'వవృధే' అను రూపములలో, వర్+వృ+త్+ఏ అను నవస్థయందు, అభ్యాసావయవమగు రేఫకు లోపమును, ఆది హల్లగు వకారమునకు శేషమును "హలాదిశ్శేషః" (7-4-60) అను సూత్రమువలన సిద్ధింపవలెను రేఫము అభక్తమయినచో నది సిద్ధింపకపోవును. ఇది దోషమే॥

(6) విసర్జనీయ ప్రతిషేధము = విసర్జనీయమునకు ప్రతిషేధమునుగూడ నిఘంటువున జెప్పవలసియుండునని దూషణాంతరము.

వార్కుటః' 'నార్ప్రత్యః'- అనునవి తద్ధితాంతములు. 'నృ కుటాల్యాం భవః' 'నృపతేరపత్యం పుమాన్' అని వానికి క్రమముగ అర్థములు. మొదటిది భవార్థతద్ధితాంతము రెండవది అపత్యార్థక ణ్యప్రత్యయాంతము. అందు

పూర్వపదము యన 'వృ' అను దాని ఋకారము స్థానమున ఆరే వృద్ధియగు నాకారము రపరము. ఈ రేఫము "యస్మాత్ప్రత్యయ విధిస్తదాది ప్రత్యయేఙ్గమ్" (1-4-13) అను నంగ సంజ్ఞా సూత్రమునందు తదాదిగ్రహణము వలన రేఫ విశిష్టమగు 'నార్' అనునది పదమగును గాన, "ఖరవసానయోర్విసర్జనీయః" (8-3-15) అను సూత్రమునే దానికి విసర్గ ప్రాప్తించుచున్నది. దాని నీ పక్షమున, ప్రతిషేధింపవలసి యుండునని తాత్పర్యము.

(7) ఇక ప్రత్యయావ్యవస్థ=ఇది చివరి దోషము

'కిరతః' 'గిరతః' అనునవి 'కౄ' 'గౄ' ధాతువుల ప్రథమ పురుష ద్వివచనాంత రూపములు. ఇట ధాతువును, దానికి పరముగ వికరణ ప్రత్యయ మును, చివర తిఙ్ ప్రత్యయమును నున్నవి. అదియే సమీహితమగు వ్యవస్థ. అభక్తత్వ పక్షమున, 'కి, గి' అనునవియే ధాతువులు. రేఫము అభక్తమే, వికరణ ప్రత్యయమగు 'అ' కారమును అభక్తమే. రేఫధాత్వవయవము కానందున, దానికి పరముగ వికరణము ప్రాప్తింపదు. కాన వికరణమునకు పరముగ అది వచ్చిన అపుడది ఋస్థానికమగు నణ్ణునకు పరముగాదు కాగా నిష్ట వ్యవస్థ సిద్ధింపకుండును అని భావము.

ఈ అభక్తత్వ పక్షమునందు, హలాది శేషా సిద్ధియు, దీర్ఘాసిద్ధియు, విసర్జనీయ ప్రతిషేధ వక్తవ్యతయు, ప్రత్యయావ్యవస్థయు నపరిహార్యములగు దోషములు. లత్వ, యక్స్వర, అభ్యస్తస్వరముల అసిద్ధియను దోషము అన్యథా పరిహృతము॥

అట్లైన నీ రేఫము పూర్వాంతముగ చేయబడును. అపుడా దోషములును బరిహృతములగును. అనిన, ఆ పక్షమునందు, దూషణ వార్తికము — "పూర్వాంతే, ర్వవధారణం, విసర్జనీయ - ప్రతిషేధో, యక్ స్వరశ్చ" - అనునది

పూర్వాంత మీ రేఫమనిన, 'రు అవధారణము' కర్తవ్యమగును ర్వవ ధారణమనగా, రుత్వమునకే విసర్జనీయమగునను నియమము. 'సర్పిఃషు' 'ధనుఃషు' అను రూపములందు రుస్థానమున విసర్జనీయము వచ్చినట్లు, 'గీర్షు' 'పూర్షు' అను స్థలములందును రావలసియుండ, దానిని వారించుటకు "రోః సుపి" (8-3-16) అను సూత్రముచే, సప్తమీ బహువచనము పరమగునపుడు రుస్థానము నకే విసర్గ ప్రవర్తించునుగాని, అన్య రేఫకు ప్రవర్తింపదు అను నియమము చేయబడుచున్నది. రేఫ పూర్వాంతమను పక్షమునవే విసర్గకు ప్రాప్తియు, తద్వారణమునకై ర్వవధారణమును ప్రసక్తములు. పరాదియను పక్షమున నీ

దోషము కలుగదు. అథ కర్తృత్వపక్షమునను నిది యావశ్యకమే. తచాద గ్రహణము వలన విసర్గ ప్రాప్తి కలుగును

మూడు పక్షములందును ర్వవధారణము కర్తవ్యమే యగునుగాన దోషము తప్పదు. 'చతుష్షు' అనుచోట రేఫ ఉరణ్రపర సూత్రసిద్ధము కాదు గదా. అది పూర్వాంతమే అచట విసర్జనీయాపత్తి కారణమునకై ర్వవధారణ కర్తవ్యతా గౌరవము తదవస్థయే॥

పూర్వాంతత్వ పక్షమున, నార్కుటి వార్పత్యాదులందును రేఫకు విసర్జనీయ ప్రతిషేధము కర్తవ్యమగునని రెండవదోషము.

కాని, 'నార్కుల్పిః' ఇత్యాదులందు విసర్జనీయ ప్రతిషేధము, పరాదిత్వ పక్షమందును నావశ్యకమే గాన, తదకర్తవ్యతా లాఘవము కలుగదు.

నృకల్పుని కుమారుడు నార్కల్పి. నృకల్పుడనగా మనుష్యకుల్యుడని అర్థము ఇది కల్పప్ ప్రత్యయాంతము. దానికి, అపత్యార్థమున 'ఇఞ్' ప్రత్యయమును ఆది వృద్ధియు రాగా 'నార్కల్పి' అని యేర్పడినది. ఈ రేఫము, పరాదిత్వ పక్షమునందు, కల్పపక సంఘాత భక్తము. 'కల్ప' అను ప్రత్యయమును, 'ఇ' అను ప్రత్యయము గల సంఘాతము 'కల్పి' అను నది. పదమనగా ఇట ప్రత్యయము దాని కవయవమనుట. అంతే గాని అది 'కల్ప' శబ్దమున కవయవము గాదు నృ శబ్దమునకు కప్రత్యయము పరమగునపుడు విధింపబడు పదసంజ్ఞ, రేఫాంతమునందే ప్రవర్తించును. సంఘాత భక్తమగుటచే అవయవమునకు పదాంతత్వమును అయ్యది విహతము చేయుటకు ఉత్సహింపదు. అందువలన పక్షత్రయమునందును విసర్జనీయ ప్రతిషేధము వక్తవ్యమే గాన ఈ పక్షమునకే ఇది దోషము కాదు.

ఇక 'గీర్యతే స్వయమేవ' అను చోట రేఫాంత మజంతము కాదు గాన "నచః కర్తృయకి"(6-1-195) అను ఆద్యుదాత్తము, పూర్వాంతత్వ పక్షమున సిద్ధింపకపోవును అను దోషమును వార్తికకర్త చెప్పి యుండెను గాని అదియు దగులదు. ఆ సూత్రముతోని కుపదేశ పదము అనువర్తించును, గౄ ధాతువు ఉపదేశమున అజంతమే అగుటచే, ఉపదేశము నందు అజంతములగు వానికి కర్తృ యక్కు పరమగునపుడు ఆద్యుదాత్తమగునని చెప్పిన యక్స్వరము నిర్బాధమే అగును.

కావున, పూర్వాంతత్వ పక్షమున నే దోషమును లేదు.

లేదా, ఈ రేఫము పరాదియగునన్నను అనవచ్చును.

కాని, యీ పక్షమున కొన్ని దోషములను వార్తికకారు డిట్లు చెప్పి యున్నాడు—

**వా॥ పరాదావకారలోపౌత్వ పుక్ప్రతిషేధః, చఙ్యుపధాహ్రస్వత్వ మిటోఽ వ్యవస్థా, అభ్యాసలోపం అభ్యస్త తాదిస్వరో దీర్ఘత్వంచ"** అని.

1. అకార లోప ప్రతిషేధము 2. ఔత్వ ప్రతిషేధము 3. పుగాగమ్మ ప్రతిషేధము ఇవి కర్తవ్యములగును. 4. చఙ్పరమగునపుడు రావగిన ఉపధాహ్రస్వత్వము సిద్ధింపక పోవును. 5. ఇశాగమమునకు ఇష్టవ్యవస్థ సిద్ధింపదు 6 అభ్యాసలోపము వక్తవ్యమగును 7. అభ్యస్తస్వరాసిద్ధి 8. తాదిస్వరాసిద్ధి 9 దీర్ఘత్వాసిద్ధి చివరి దోషము.

ఈ రేఫము పరాది అయినచో, 'కర్తా' 'హర్తా' అను స్థలము లఘు గుణమైన అకారమునకు "అతోలోపః" (6-4-48) అను సూత్రముచే లోపము ప్రాప్తించుచున్నది, అని మొదటి ఆక్షేపము

ఇది దోషము కాదు ఆ సూత్రములోనికి, "అనుదాత్తోపదేశ" ఇత్యాది సూత్రము నుండి ఉపదేశ పదమనువర్తించును. అర్ధ ధాతుకోపదేశ కాలమున అవి అకారాంతములు కానందున ఆ దోషము ప్రసక్తము కాదు.

ఉపదేశ పదమనువర్తించినచో. 'ధినుతః' 'కృణుతః' అను 'ధివి' 'కృవి' ధాతువుల, లట్ప్రథమ ద్వివచనాంత రూపములో "ధిన్వి కృణ్వ్యోరచ" (3-1-80) అను సూత్రముచే నకార స్థానము నందు విహితమైన అకారమునకు, ఉప్రత్యయ నిమిత్తకముగ రాదగిన లోపము రాక పోవునే ? అనిన,

ఉపదేశ పదముచే ధాతువు విశేషింపబడదు. 'ఆర్ధధాతుకే' అను పద ముతో దానికి సంబంధము. అర్ధధాతుకోపదేశ కాలమునందు అకారాంత మయిన లోపము వచ్చును అని యర్థము. ఆర్ధధాతుకమగు, 'ఉ' అను ప్రత్యయముతో సహవిధానము ఈ అకారమునకు కలదుగాన లోపము ప్రవర్తించుటకు ప్రతిబంధములేదు.

## ఔత్వ ప్రతిషేధోదాహరణము

'చకార' 'జహార' అను రూపములలో వృద్ధ్యుత్తరము .ధాతువాదుం కమగు ప. రేఫము పరాదె గావున, "ఆత ఔ ణలః 7-1-34) అను సూత్రముచే,

ణల్లుకు ఔత్వము ప్రాప్తించుచున్నది. కాని పరేఫమునకు ణల్ప్రత్యయము 'నిర్దిశ్యమానస్యాదేశాభవంతి' అను పరిభాషచే సమాధానము చెప్ప నగును

'పోనిమ్ము. ఏది నిర్దిశ్యమానమో దానికేల రారాదు' అనిన, రేఫతో వ్యవధానము కలదు గాన, నిర్దిశ్యమానమగు అకారమునకు ఔత్వమురాదు. కావున ఇదియు ఈ పక్షమున దోషము గాదు.

## పుగాగమ ప్రతిషేధోదాహరణము

'కారయతి' 'హారయతి' అనునవి 'కృ' 'హృ' ధాతువు లణ్యంత రూప ములు. వీనిలో వృద్ధ్యుత్తరము, 'కా' 'హా' అనునవి ఆకారాంతములుగానను రేఫము పరాది కావునను "అర్తిహ్రీవ్లీరీ క్నూయీక్ష్మాయ్యాతాంపుఙ్ణౌ" (7-3-36) అని పుగాగమము ప్రాప్తించుచున్నది. అయ్యది యీ పక్షమున, ప్రతిషేధింప బడ వలసియున్నది. ఇదె అపరిహార్యమగు దోషము.

## చఙ్పరమగునప్పుడుపధాహ్రస్వాసిద్ధ్యుదాహరణము

'అచీకరత్' 'అజీహరత్'— అను చఙంత రూపములలో, 'కార్' 'హార్' అనువానికి, చఙ్పరకణిచ్చు పరమగునపుడు. "ణౌచఙ్యుపధాయాహ్రస్వః" (7-4-1) అను సూత్రముచే నంగావయవమగునుపధయైన ఆకారమునకు హ్రస్వము సిద్ధింపవలెను. రేఫ పరాదియను పక్షమున ఆకారముపధ కాదు గాన హ్రస్వము ప్రాప్తింపదు.

ఇదియు పరిహారరహితమగు దోషమే.

## ఇడాగమా వ్యవస్థోదాహరణము

'ఆస్తరితా' 'నిపరితా' అను రూపములలో గుణము ప్రవర్తించిన తరు వాత, 'ఉరణ్రపరః' అని ప్రవర్తించిన రేఫ పరాదిత్వ పక్షమున, తృచ్ప్రత్య యమునకే అవయవము కానగును. ఇడాగమమును దాని యవయవమే అయె. కాగా వానికి ఇష్ట వ్యవస్థ సిద్ధింపకున్నది. అని యాక్షేపము. నిత మగుట వలన ముందుగ గుణము రపరమై ప్రవర్తించిన, ఆ రేఫ పరాదియగుటచే కృత్ప్రత్యయము వలాదియగును. అపుడు "నేడ్వశికృతి" (7-2-8) అని ఇడా గమము ప్రవర్తింపకుండుటయే అవ్యవస్థ. ఇక, నేడ్వశీతి సూత్రములోనికి ఉపదేశ అను పదము నపకర్షించి ఉపదేశమున వలాదియగు కృత్తునకే ఇడాగమ నిషేధమనిన, ఇట తృచ్ప్రత్యయము ఉపదేశమున వలాది కాదు కావున నిషే ధము ప్రవర్తింపదు. కాని ఆ ఇడాగమము రేఫకు పూర్వము ప్రవర్తింపవలసి యుండును. అయ్యది అనిష్టమగుటచే 'నట్టియు' నవ్యవస్థయే.

## అభ్యాసలోపాసిద్ధి

'వవృతే' 'వవృథే'-అను స్థలములందు ఉరదత్త్వమురపరమై ప్రవర్తింపగా, ఆ రేఫ ఉత్తర ఖండమున కవయవమగుటచే అభ్యాసావయవమగు హల్లుకు విహితమయిన లోపము సిద్ధింప కుండుటయు ఈ పక్షమున అపరిహార్యమగు దోషము.

## అభ్యస్తస్వరాసిద్ధ్యుదాహరణము

'మాహిస్మతే పిపరుః' "మాహిస్మతే బిభరుః" అను చోట్ల, అజాది అసార్వధాతుకము పరమగునపు డభ్యస్త ధాతువుల ఆద్యచ్చు ఉదాత్త మగునని విధింపబడిన స్వరము ఈ పరాదిత్వ పక్షమునందు అసార్వధాతుక మజాది కాదు గాన ప్రాప్తింపకపోవును॥

## తాదిస్వరాసిద్ధ్యుదాహరణము॥

'ప్రకర్తా' ప్రకర్తుమ్ అను నుదాహరణములలో "తాదౌ చ నితి కృత్యతౌ" (6-2-50) అను సూత్రముచేత, తుశబ్ద భిన్నమును, తకారాదియునగు నకారేత్సంజ్ఞక కృత్ప్రత్యయము పరమగునపుడు అనంతరమగు గతి సంజ్ఞకమునకు విధింపబడిన ప్రకృతి స్వరము రేఫవ్యవధానమువలన ప్రాప్తింప కుండుట దోషమని వార్తిక కారుని తాత్పర్యము.

కాని యీ దోషమునకు పరిహారము కలదు. **"కృదుపదేశే వా తాద్యర్థ మిడర్థమ్"** అని, వార్తికము పఠింపబడి యున్నది. 'తాదౌచ' అను సూత్రము నందలి 'కృతి' అనునది, కృదుపదేశ కాలికతాది ప్రత్యయ ప్రతీతి కొరకు గ్రహింపబడినది అని యీ వార్తికమున కర్థము 'ప్రలపితా' ఇత్యాది తృన్నంతములందు ఇడాగమముతో వ్యవధానమున్నను, ఈ స్వరము సిద్ధించుటకై పై వార్తికమునందు 'కృదుపదేశే వా' అని చెప్పబడినది. ప్రకృతము నను, రేఫము పరాది అయినను, తృచ్ప్రత్యయమునకు ఉపదేశమున తాదిత్వము కలదు గాన దోషములేదని భావము.

## దీర్ఘత్వాసిద్ధ్యుదాహరణములు

'గీః' 'పూః' అనునవి దీర్ఘము రేఫాంతమగు ధాతువునకు విధింపబడుట వలన, పరాదిత్వ పక్షమున అవి యిట సిద్ధింపకున్నది. ఇవి క్విబంతములు. "వేరపృక్తస్య" (6-1-67) అని వకారలోపము. ఇత్వర పరత్వములు. రేఫ ము ప్పునకు అవయవమగుట చేత ధాతువునకు రేఫాంతత్వము లేదు. దీర్ఘము సిద్ధింపదు. 'ధవర్తః' అనునది వష్ఠ్యర్థ బహువ్రీహి. పరశబ్ద మవయవవాచి,

అథ కర్తృత్వము గాని పరాదిత్వము గాని దోష దూషితములగుటచే, పూర్వాంత త్వమే సిద్ధాంతితము॥

ఉరణ్ రపర సూత్ర వివరము ముగిసినది.

## "అలోంత్యస్య" (1-1-51)

## అల్గ్రహణ విశేషణతా విచారము

ఈ సూత్రమునందలి 'అలః' అనునది అంత్య విశేషణమా ? లేక ఆదేశ విశేషణమా ?

'అలః' అను పదము ప్రథమా బహువచనాంతమైనను, షష్ఠ్యేకవచ నాంతమయినను గావచ్చును ప్రథమాంతమయిన, అల్రూపాదేశములు అంత్యా మున కాదేశములగునని యర్థమగును. షష్ఠ్యేకవచనాంతమాపదమనిన, అల్ రూపమయినను, అనేకాల్లయినను ఆదేశమాత్రము అంత్యాల్లునకు వచ్చును అని యర్థమగును కావున ప్రశ్నకవకాశము కలదు.

ఎట్లైననేమి? అనిన,

అది అంత్య విశేషణమయినచో, ఆదేశమిట్టిదియను విశేషము లేనందున, అనేకాల్లుగల యాదేశముగూడ అంత్యమునకు రావలసివచ్చును. అది ఆ పక్ష మున దోషము

మరియు, 'అలంత్యాస్య' అని చెప్పిన నొక లాఘవముగూడ కలదు. 'అనేకాల్ శిత్సర్వస్య' అను సూత్రమున 'అనేకాల్' అను పదమిక నక్కర లేకుండును. అపుడా అల్పదము అనల్ వ్యావర్తకమగును అనగా, అల్ రూప మగు నాదేశమే అంత్యమునకగును. అన్యముకాదు' అని ఈ అల దము నియ మమును బోధించును 'అలంత్యాస్య' అని సూత్రమును మార్చి పఠింపవలెనని యభిప్రాయము కాదు. 'అలః' అను బహువచనమునకు వివక్ష చేయకుండిన అల్ రూపాదేశమని యర్థము లభించును. ఇట్టి నియమమువలన అనేకాలాదేశము సర్వాదేశముగ సిద్ధించునుగాన ఆ సూత్రము 'శిత్సర్వస్య' అనిమాత్రమే పఠింప బడవచ్చును.

అట్లయినను, అంత్యమగు స్థాని వర్ణరూపమే కావలెనని లభింపదే? అపుడు దోషమేమనిన, నది వాక్యమైనను, పదమయినను దానికంతకును నాదే శము ప్రవర్తింపవలసివచ్చును.

షష్ఠీనిర్దిష్టములగు వాక్యములు సంభవింపకున్నను, అట్టి పదములు సంభ వింపవచ్చును గాన, 'పరమానడుద్భ్యామ్' అనుచోట "వసుస్రంసు ధ్వంస్వనడు

హాంవదః"(8-2-72) అని చెప్పబడిన దత్వము, 'పరమానడుహ్' అను పదము నందంత్యపదమగు 'అనడుహ్' అనుదాని కాదేశము కావలసివచ్చును.

'అనేకాల్శిత్సర్వస్య' అను సూత్రమునందనేకాల్లను పదము అకర్తవ్య మగుట అనులాఘవము అభిప్రేతమయినచో, 'అలః' అనునది అంత్య విశేషణ మయినను నది అకర్తవ్యమేయగునే? ఎట్లన, 'ఙిచ్చ' "అలోంత్యస్య" (1-1-52) అనునది నియమార్థమగును. ఙకారేత్సంజ్ఞకమగు ననేకాలాదేశమే అంత్యమున కగును. తద్భిన్నముకాదు అని నియమమునది బోధించును. కాగా నీ అలోంత్య సూత్రము అనేకాలాదేశములందు ప్రవర్తింపదు. దాని సాహచర్యమువలన, "ఆదేః పరస్య" (1-1-53) అనునదియు నట ప్రవర్తింపదు కావున ఐసాదేశము అదికి ప్రసక్తముకాదు అని తాత్పర్యము.

ఈ సూత్రమేయుద్దేశముతో రచింపబడినది? కిమర్థం పునరిదముచ్యతే? ఇది స్థానషష్ఠీ నిర్దేశ విషయమా? లేక షష్ఠీమాత్ర నిర్దేశ విషయమా? ఈ ప్రశ్నకు సమాధానవార్తికములు- **"అలోంత్యస్యేతి స్థానే విజ్ఞాతస్యాను సంహారః"** అనునదియు

**"ఇతరథాహ్యనిష్ట ప్రసంగః" - "యోగశేషేచ"** అనునవియు.

"షష్ఠీస్థానేయోగా" అను సూత్రమిందనువర్తించును. కాగా ఏ షష్ఠీ రూపప్రత్యయము, స్థాననిరూపితమగు సంబంధ మర్థముగాగలది అని తెలియ బడునో, దానికి అంత్యాల్లునందు ఉపసంహారము చేయబడును. ఒకానొకదాని స్థానమున ప్రసక్తమగుదానికి, ఉపసంహారము లేదా అనుసంహారము అనగా తన్మాత్ర స్థానికత్వ నిశ్చయమనుట. ఇది మొదటి వార్తికమున కర్థము.

'అట్లుకాకున్న ననిష్టము ప్రసక్తమగును' అని రెండవ వార్తికము బోధించును. టిత్తులును, కిత్తులును మిత్తులననగు నాగమములుగూడ నంత్యమునకు రావలసివచ్చును. 'లవితా' ఇత్యాదులందు ఇడాగమము తృప్రత్యయ ఋకారమునకు, పూర్వావయవముగ రావలసివచ్చును. ఇది ద్వితీయ వార్తికార్థము.

ఈ సూత్రమును యోగశేషముగా గ్రహించిన నాగాషణము ప్రాప్తిఅపదేమో? అనగా, ముందు సముదాయస్థానమున దు ప్రసక్తమయిన దానికి, తరువాత నంత్యాల్లునందు ఉపసంహారమనిన, ప్రతిపత్తి గౌరవమగును గాన దీనికి 'షష్ఠీస్థానేయోగా' అను సూత్రముతో ఏకవాక్యతను కల్పించి, "సార్వధాతుకార్ధధాతుకయోః" (7-3-84) ఇత్యాదియోగములకు ఇది శేష మనిన, అపుడు ప్రతిపత్తి గౌరవము కలుగదేమోయనిన నపుడును ననిష్టము

తప్పదని "యోగశేషేచ" అనువార్త్తికమున కర్థము. అపుడేమగుననిన, టిత్తు లును, కిత్తులును, మిత్తులును గూడ నంత్యమునకు వచ్చును అందువలన, అలోంత్యస్య అనుదానిచే, స్థానమున దు ప్రసక్తమయినదానికంత్యాల్లు నందు ఉపసంహారము. కాకున్న అనిష్టప్రసగము అని చెప్పబడినది యుక్తమే. అద్య "తౌటితౌ" "మిదచోఽంత్యాత్పరః" అనునివి స్థానేయోగస్య బాధ కములేగాని ఉపసంహారమునకు బాధకములుకావు కాగా ఇవాగమము అంత్యాల్లునకు పూర్వావయవమగుట తప్పదు. కావున నిది స్థానషష్ఠీ నిర్దేశవిష యమే.

'అలోంత్యస్య' అను సూత్రమునకు వివర్తము ముగిసినది.

## "ఙిచ్చ" (1-1-52)

ఙకారము ఇత్సంజ్ఞక వర్ణముగా కల యాదేశము గూడ అంత్యమునకే ఆదేశమగును. అని సూత్రార్థము. 'అనఙ్' మున్నగునవి యుదాహరణములు. ఇంటు 'అన్' అనునది ఆదేశము. అది అనేకాల్లగుటచే "అనేకాల్శిత్సర్వస్య" అను పరిభాషవలన, సఖి శబ్దమునకు సర్వాదేశముగ ప్రసక్తమగుచున్నది. శేనే నా ప్రాప్తి న్యాయముచేత నీ 'ఙిచ్చ' అను సూత్రము' అనేకాల్త్వా క్రమున కపవాదముగాన సఖి శబ్దాంత్యేకారమునకే ఇది ప్రవర్తించును.

"తుహ్యోస్తాతఙాశిష్యన్యతరస్యామ్" (7-1-35) అను సూత్రము 'తు' అనుహాసికి ఆశీరర్థమునందు వికల్పముగ 'తాతఙ్' అను నాదేశమును విధించుచున్నది. ఇదాదేశము 'తాత్' అనునది ఙకారమిత్సంజ్ఞకము. కావున నిదియు ఙిత్తు. కాగా ఇది యేల అంత్యాదేశముగ ప్రవర్తింపలేదు? ఙిచ్చ అను నీ పరిభాష అనేకాల్పరిభాషకు అపవాదము గదా? అని యాట నాక్షేపము కలుగుచున్నది. ఈ ఆక్షేపమునకును సమాధానముగ

వా॥ తాతఙి ఙిత్కరణస్య సావకాశత్వాత్ విప్రతిషేధాత్సర్వాదేశః" అను వార్త్తికమవతరించినది.

ఉడ

తాతఙాదేశమునందలి ఙిత్త్వము సావకాశము. అనగా నయ్యది, 'తాత్' అనునది పరమగునపుడు, 'స్తుతాత్' 'బ్రూతాత్' ఇత్యాదులందు వృద్ధి గుణములకు "క్ఙితిచ" (1-1-5) అను సూత్రముచే ప్రతిషేధము సిద్ధించుటకు కుదేశింపబడినది. ఇట్లది సావకాశమగుటచేత, విప్రతిషేధముచే ఈ ఆదేశము సర్వాదేశమే యగును గాని అంత్యాదేశముగాదు, అని వార్త్తికార్థము. ఇట గమనింపదగిన విషయము=ఈ 'ఙిచ్చ' అను పరిభాష అపూర్వముగా

అంత్యాదేశ విధాయకము కాదు. ఇది అనువాద మాత్రమే. అచ్చటచ్చట అనజాదులందలి జిత్త్వము నిష్ఫలమగును గాన, సామర్థ్యము చేతనే అనే కాల్సూత్రమునకు, దీనిచే బాధ సిద్ధించుచున్నది గాన ఇది అనువాద రూపమే. పరిభాషలకు నియమ బోధకత్వము లక్షణము. కావున వానికి అనువాదత్వము గుణమే గాని దోషము గాదు. అనువాదమునకు ఫలమేమనిన జిత్కరణ సామర్థ్యము వలన అర్థాంతర కల్పనమున కవకాశములేకుండుటయే ఫలము.

కావున తాతజాదేశ విషయమున నీ 'జిచ్చ' అనునది ప్రవర్తింపదు. ప్రవర్తించిన నిది యపూర్వ విధాయకమే కావలసివచ్చును. అపుడు గౌరవము ప్రసక్తమగును. అనువాద రూపమిదియగుటంచేసి, ఎచట సర్వాదేశత్వము గలిగిన జిత్త్వము వ్యర్థమగునో అచ్చట 'అనేకాల్సర్వస్య' అనుదానికి బాధ కలుగును. కాని తాతజాదేశము నందలి జిత్త్వము గుణ వృద్ధి ప్రతిషేధములు ఫలముగాగలది కావున వ్యర్థము కాదు. కాగా అనేకాల్త్వము వలన సర్వాదేశత్వమే అట్టి తావులందు గలుగును గాని బాధ కలుగదు అని పద్మూ ధావ వార్తికమునకు భావము. వార్తికము నందలి 'విప్రతిషేధాత్' అను పదమునకు 'విరోధమువలన' అని యర్థము. అనగా పరిభాషా ప్రకరణ విరోధము వలన అని భావము.

'విప్రతిషేధ శాస్త్రము వలన'— అని యర్థము కాదు. "విప్రతిషేధే పరం కార్యమ్"—అనునది విప్రతిషేధ శాస్త్రము. తుల్య బలమగు రెంటు శాస్త్రములకు పరస్పర విరోధము విప్రతిషేధము. పరస్పరాప్రాప్తి విషయమున నొండొంటికి అవకాశము కలిగియుండుట తద్బీజము. కాగా సూత్రములకు సావకాశత, విప్రతిషేధ శాస్త్ర ప్రవృత్తి విషయమగును గాని, జిత్త్వమునకు సావకాశత్వము కాదు. 'జిచ్చ' అను శాస్త్రమునకు, సర్వా దేశా ప్రాప్తి విషయమున నెచ్చటను చారితార్థ్యము లేదు గదా.

ఇట నొక శంక కలుగవచ్చును.

'ఇయ్యది దీనికి ప్రయోజనము' అని చెప్పినపుడు, ఆ ప్రయోజనము నియతముగ సిద్ధించునదియే కావలెను. అట్టిదియే ప్రయోజనమని చెప్ప దగినదగును. ఈ తాతజాదేశము, నిశ్చితముగ సర్వాదేశమయిన, గుణవృద్ధి ప్రతిషేధ రూపమగు ప్రయోజనము కలుగును. జిత్కరణమువలన, ఇది సర్వాదేశమే యగును గాని యంత్యాదేశము గాదని చెప్పుట కెట్లు సాధ్య మగును ?

గుణవృద్ధి ప్రతిషేధార్థత్వము సిద్ధించిన, సర్వాదేశత్వము కలుగును. సర్వాదేశ మయిన నపుడు గుణవృద్ధి ప్రతిషేధములు ప్రవర్తించునాయె.

ఇట్లు అన్యోన్యాశ్రయత వలన సర్వాదేశత్వము సిద్ధింపకున్నది. కాగా అంత్యాదేశమే కావలెను అని ఆశంక.

'ఈ జిత్కరణమే వ్యర్థమయి 'తాతఙాదేశ మంత్యాదేశము కాదు' అని జ్ఞాపనచేయును' అని సమాధానము.

అట్లు కానిచో తృతీయాధ్యాయము నందే, "పరః" (3-4-86) అను సూత్రమునకు తరువాత, "తిహ్యోస్తాదాశిష్యన్యతరస్యామ్" అని, జిత్వ రహితమగు 'తాత్' అను ఆదేశమును విధించి యుండిన అంత్యాదేశత్వము సిద్ధించెడిది గదా ? జిత్వముతో పని యేమి ? కావున నది గుణవృద్ధి ప్రతిషేధార్థమే. ఆ ప్రతిషేధము, అది సర్వాదేశమయిననే సిద్ధించును అని సమాధానమునకు తాత్పర్యము॥

"జిచ్చ" అను సూత్రమునకు వివర్తము ముగిసినది.

## "ఆదేఃపరస్య" (1-1-53)

'ఒకదానికంటె, పరమైనదాని స్థానమున విధింపబడిన కార్యము, ఆ పరమైనదాని యాద్యక్షరస్థానమున ప్రవర్తించును' అని యర్థము. 'ద్వీపమ్' 'అంతరీపమ్' 'ప్రతీపమ్' మున్నగునవి యుదాహరణములు. "ద్వ్యంత రుపసర్గే భ్యోప ఈత్" (6-3-97) అను సూత్రము, 'ద్వి' మున్నగువానికంటె పర మయిన 'అప' అనుదానికి ఈత్వమును విధించుచున్నది. ఆ ఈత్వము, 'అప' అనుదాని యాద్యక్షరమగు అకారస్థానమున ఈ సూత్రమువలన ప్రవ ర్తించును.

ఈ ఆదినియమముకంటె, సర్వాదేశత్వము బలీయమని,

వా॥ "అలోంత్యస్యాదేః పరస్యానేకాల్ శిత్వర్వస్యే త్యపవాద విప్రతిషేధాత్ సర్వాదేశః"- అను వార్తికము సిద్ధాంతీకరించుచున్నది. "అతోభిస ఐస్" (7-1-9) అను సూత్రము, అకారాంతాంగముకంటె పరమగు 'భిస్' ప్రత్యయ స్థానమున 'ఐస్' అను నాదేశమును విధించుచున్నది.

ఇందు "ఆదేఃపరస్య" (1-1-53) అనునది ప్రవర్తించునా? లేక 'అనేకాల్శి ర్వస్య' అనునది ప్రవర్తించునా? అను నాశంక కలిగినపుడు, అపవాద విప్రతి

షేధమువలన, 'అనేకాల్సర్వస్య' అనునదియే ప్రవర్తించును అని వార్తిక కారుని తాత్పర్యము.

"అలోఽంత్యస్య" (1-1-51) అనునది యుత్సర్గము. దానికి, "ఆదేఃపరస్య" (1-1-53) "అనేకాల్శిత్సర్వస్య" (1-1-54) అనునవి అపవాదములు. ఆ అపవాద శాస్త్రములలో "అనేకాల్సర్వస్య" (1-1-54) అనునది పరమగుటచే అదియే ప్రవర్తించును.

"ద్వ్యంతరుపసర్గేభ్యః అప ఈత్" (6-3-97) అనునది ఆదినియమమున కవకాశము. "అస్తేర్భూః" (2-4-52) అనునది సర్వాదేశత్వమున కవకాశము. "అతోభిస ఐస్" (7-1-9) అను స్థలమునం దుభయమునకును ప్రాప్తికలదు. ఇట్టి యెడ, పరత్వమువలన 'అనేకాల్సర్వస్య' అనునదియే ప్రవర్తించును.

ఇక్లే, శిత్తగు వాదేశము విషయమునను విప్రతిషేధము నిట్లు ఉపపాదింపవచ్చును.

'ఇతః' 'ఇహ' అను రూపములందు, 'ఇద' అను నిదమ్ శబ్దభాగమునకు ప్రవర్తించిన 'ఇశ్' అను నాదేశము సావకాశము అట నాదినియమమునకు ప్రాప్తిలేదు. ఈత్వమనేకాల్లుగాదు తద్విధాయకము, ఆది నియమమున కవకాశము "అష్టాభ్యఔశ్" (7-1-21) అను స్థలమున నుభయమును ప్రాప్తింపగా, అపవాద విప్రతిషేధమువలన సర్వాదేశమే ప్రవర్తించును.

'ఆదేః పరస్య'- అను సూత్రభాష్య వివర్తము ముగిసినది

## "అనేకాల్శిత్సర్వస్య" (1-1-54)

## శిద్గ్రహణ ప్రయోజన ప్రత్యాఖ్యానము

ఇందు, 'శిత్సర్వస్య' = 'శిత్తుసర్వాదేశమగును' అనుదానికేమి యుదాహరణము?

"ఇదమ ఇశ్"(5-3-33) అనునది యుదాహరణము. 'ఇతః' 'ఇహ' లక్ష్యములు. శిత్కరణమువలననే ఇది అనేకాల్ అగుచున్నదిగాన సర్వాదేశత్వము సిద్ధించును ఇకారమొక అల్లు, శకారమొక అల్లును కలవుగాన నిది యనేకములగు అల్లులుగల యాదేశమగుచున్నది శకారోచ్చారణ సామర్థ్యమువలన, నదిలోపించినను, భూతపూర్వగతిచే, ననేకాల్త్వము నాశ్రయించి సర్వాదేశత్వము ప్రవర్తింపవచ్చును. ఫలాంతరము లేకున్నను అనేకాల్త్వ సంపాదనమే తదుచ్చారణమునకు ఫలమగును కావున నిది ప్రయోజనముకాదని యాక్షేపము.

పోనిమ్ము. "అష్టాభ్యఔశ్" (7-1-21) అనునది యుదాహరణమగును. అట 'ఆదేః పరస్య' అనుదానిని బాధించి సర్వాదేశముగ నౌశాదేశము ప్రవర్తించుట 'శిత్సర్వస్య' అనుటకు ప్రయోజనమగుననిన,

అచ్చటను, అపవాద విప్రతిషేధమువలన, శిత్కరణము మూలముననే సర్వాదేశత్వము సిద్ధించునుగాన నదియు ప్రయోజనముగాదు.

అట్లయిన, "జసశ్శి" (7-1-17) "జశ్శసోశ్శిః" (7-1-20) అనునవి ప్రయోజనములగుననిన ఇటగూడ శిత్కరణమువలననే సర్వాదేశత్వము సిద్ధింపవచ్చును.

అట్లు సిద్ధింపదు శిత్కరణమునకు వేరుప్రయోజనముకలదు. ఆ శకారము విశేషణార్థము సప్రయోజనము ఎచ్చట విశేషణార్థమనిన, "శిసర్వనామస్థానమ్" (1-1-42) "విభాషాఙిశ్యోః" (6-4-136) సూత్రములందు విశేషణార్థమని యెరుంగునది ఇట్లది సప్రయోజనమగుటనలన, భూతపూర్వగతి నాశ్రయించుటలో ప్రమాణములేదు. అందువలన అనేకాల్త్వ ప్రయుక్త సర్వాదేశత్వము సిద్ధింపదు. శిత్త్వమునలననే అయ్యది సిద్ధింపవలెను. అందువలన శిద్గ్రహణమావశ్యకమే అని ప్రాప్తించుచున్నది కాని

"శిత్సర్వస్య" అనునది గ్రహింపబడకుండుట శక్యమే. ఎట్లనగా, శిత్తును అనే కాల్త్వమువలననే సర్వాదేశమగును. ఈ శిశిలు ప్రత్యయములు. అవి జశ్శస్సులకు సర్వాదేశములయిననే స్థానివద్భావముచే వానికి ప్రత్యయత్వము సిద్ధించును. అంత్యాదేశములయిన నది సిద్ధింపదు ప్రత్యయములు కానిచో వాని శకారమున కిత్సంజ్ఞ లభింపదు అది లేనిచో లోపము రాదు. లోపము రానందున అనేకాల్లుతేయగును. అనేకాల్త్వము వలన సర్వాదేశత్వము, సర్వాదేశత్వము వలన ప్రత్యయత్వము. ప్రత్యయము లగుటవలన, "లశక్వతద్ధితే"— అని ఇత్సంజ్ఞ. ఇత్సంజ్ఞ వలన లోపము. కావున నీ సూత్రము నందు శిద్గ్రహణము వ్యర్థమని స్పష్టమయినది.

ఇట్లు సిద్ధించినను, 'శిత్సర్వస్య' అని సూత్రమున గ్రహించుట వలన, పాణిన్యాచార్యుడు, "నానుబంధకృతమనేకాల్త్వమ్" అను పరిభాష ఒకటి కలదని జ్ఞాపనము చేయుచున్నాడు.

'ఇత్సంజ్ఞక వర్ణకృతమగు అనేకాల్త్వము సర్వాదేశత్వమును సంపాదింపదు' అని దాని అర్థము. అనుబంధ వర్ణములకు అల్లులను వ్యవహారమే కలుగదని భావము.

ఇట్లు జ్ఞాపన చేయుటకు ప్రయోజనమేమనిన,

**"తత్రానరూప, సర్వాదేశ, దాప్రతిషేధేషు, పృథగ్నిర్దేశో నాకారాంతత్వాత్"** అని వార్తికము వక్తవ్యము కాకుండుట ప్రయోజనము.

ఇతఃంజ్ఞక వర్ణము లవయవములా ? కావా ? యని విచారించిన సందర్భమున, అవి ఉపస్థాపకమున కవయవములే యగునని సిద్ధాంతము చేయబడియున్నది. తత్ర=ఆ పక్షమునందు, 'క' 'అణ్' అను ప్రత్యయములు పరస్పరము అసరూపములు గాన, అపవాద ముత్సర్గమునకు వికల్పముగ బాధకము కావలసివచ్చుననియు, "దివఔత్"— అను సూత్రముచే విధింపబడిన ఔదాదేశమీ పక్షమున, అనేకాల్లగుచున్నది గాన సర్వాదేశము కావలసియుండుననియు, "దాధాఘ్వదాప్" (1-1-10) అను సూత్రమునందు, 'అదాప్' అను ఘు సంజ్ఞా ప్రతిషేధము, దైప్ అను ధాతు వాకారాంతము కానందున, సిద్ధింపకుండుటంజేసి, దానికి గూడ పృథఙ్నిర్దేశ మావశ్యక మగుచున్నదనియు దోషము లాపాదింపబడినవి. ప్రకృత జ్ఞాపకమువలన, అనుబంధ వర్ణములకు అల్త్వ వ్యవహారాభావము సిద్ధించుటవలన నింక నా వార్తికముతో పనిలేదు. ఆ దోషములు ప్రసక్తములు గావు. కాగా ఆ వార్తికమున కవక్తవ్యత జ్ఞాపనమునకు ఫలమగునని తాత్పర్యము.

'అనేకాల్శిత్సర్వస్య' అను సూత్రమునకు ఆంధ్ర వివర్తము ముగిసినది.

॥సప్తమాహ్నికమును సమాప్తము॥

# అష్టమాహ్నికము

## సూ॥ స్థానివదాదేశోఽనల్విధౌ (1-1-55)

'ఆదేశము స్థానివంటిదగును. కాని అలాశ్రయ విధి కర్తవ్యమగునపు డట్లుకాదు' అని సూత్రార్థము.

వత్కరణ మెందులకు? వతి ప్రత్యయము లేకున్నను, సూ॥ "గాఙ్కుటాదిభ్యోఽఞ్ణిన్ఙిత్" (1-2-1), "అసంయోగాల్లిట్ కిత్" (1-2-5) అను సూత్రము లందువలె, 'స్థానివంటిది' అను నర్థము లభించునుగదా? అని ప్రశ్న.

వతి ప్రత్యయము లేనిచో, "స్థాన్యాదేశోఽనల్విధౌ" అనియే సూత్రమగును. ఇది సంజ్ఞాధికారమగుటచే స్థాని ఆదేశమునకు సంజ్ఞ యని యర్థమగును. అపుడు, "ఆఙోయమహనః" (1-3-28) అను సూత్రముచే విధింపబడిన ఆత్మనే పదప్రత్యయము, ఆఙ్ కంటె బరమయిన వధధాతువునకు బరముగా వచ్చును. హనధాతువునకు రాకయేపోవును. ఏలయన హనధాతువునకు వధాదేశము విధింపబడియున్నది. ప్రకృత సూత్రము 'స్థాని ఆదేశమునకు సంజ్ఞ' యని చెప్పుచున్నది. కాగా, సూ॥ "ఆఙోయమహనః" (1-3-28) అను సూత్రమునందును స్థానియగు 'హన్' అనునది తదాదేశమగు 'వధ'కే బోధకమగునుగదా!

వత్కరణముండిన, ఇది అతిదేశ బోధకమని స్పష్టమగును. "గురువద్గురుపుత్రే వర్తితవ్యమ్" అనిన, గురుపుత్రునకు గూడ గురువునకువలె మర్యాద లను బాటింపవలెనని యర్థము యునటులు, స్థానియొక్క కార్యమాదేశమునందతిదేశింపబడునని యే అర్థమగును గాని, స్థానికి ఆదేశము సంజ్ఞ అని అర్థము కాదు.

ఆదేశ పదమెందులకు? అని వేరొక కృత్యవిచారము. అనగా స్థాని శబ్దము సంబంధి శబ్దము. పితృ, మాతృ మున్నగువాని వంటిది. 'పితృవదధీతే' అనిన, తండ్రివలె చదువువాడు కుమారుడే గాన, 'కుమారుడు' అని వేరుగ చెప్ప పనిలేనట్లు, ఆదేశమే స్థానివంటిదని యర్థమగును. ఆదేశపదము లేకున్నను దోషములేదని తాత్పర్యము. కాని

"స్థాని వదనల్విధౌ" అని మాత్రమే సూత్రమయిన నెయ్యది స్థానివంటిదగును? అను ప్రశ్న కలుగును, స్థానమున వదివచ్చిన అది అని తోచును. స్థాన

మున సంభవించునదేది ? ఆదేశము. ఆదేశములు రెండు విధములుగా నుండును. కొన్ని ప్రత్యక్షాదేశములు, కొన్ని అనుమానికాదేశములు. "ఏరుః" (3-4-86) అను సూత్రము, లోట్సంబంధి 'ఇ' వర్ణమునకు ఉకార మాదేశమగునని చెప్పు చున్నది. ఇట ఉకారము ప్రత్యక్షాదేశము. కాని స్థానికార్యమే యదియు ఈ ఉకారమున కతిదేశింప బనిలేదు. 'తి' అను స్థాని ఘటితమునందున్న తిఙ్త్వము 'తు' అనుదానికి కావలెను. 'తి, తు'లు స్థాన్యాదేశములు కావాయె. అందు వలన ఇట ఆనుమానిక స్థాన్యాదేశములు కల్పింపబడవలెను. అపుడు 'భవతు' అనుదానికి తిఙంతత్వ ప్రయుక్తమగు పదత్వము లభించును. ఈ ప్రయోజన సిద్ధికై ముందు "ఏకదేశ వికృతస్యానన్యత్వాదుపసంఖ్యానమ్" అని యుపసంఖ్యానము ఆపాదింపబడనున్నది. ఇపుడనావశ్యకమగును. అదియులాఘవము. అందులకై సూత్రమున 'ఆదేశః' అనునది ఆవశ్యకము.

ఇక 'అనల్విధౌ' అను పదమునందు విధిపదమెందులకు ? అనల్ అని ప్రాతిపదిక మాత్రమునే నిర్దేశించినను విధిపదమున కధ్యాహారము చేయనగును గదా ? అనియు వేరొక ప్రశ్న.

విధిపదము సూత్రమున నున్నపుడు అది సమస్త పదమగును. ఆ సమా సము సర్వ విభక్త్యంత సమాసముగా గ్రహింప వీలుకలుగును. సర్వవిభక్త్యంత మనగా, తృతీయా, పంచమీ, షష్ఠీ, సప్తమ్యంతములగు పదములు పూర్వపద ములుగా గల సమాసమనుట. అపుడు అల్విధి అనగా, అల్లుకంటె పరమయిన దానికి ప్రవర్తించునది అల్లు స్థానమున ప్రవర్తించునది, అల్లు పరమగునపుడు వర్తించునది, అల్లుతో వ్యవధానమున ప్రవర్తించునదియు అల్విధియను నర్థము సిద్ధించి, ఆయా విధులు కర్తవ్యము గునపుడు, స్థానివదతిదేశము ప్రవర్తింపదని చెప్పుట కనువగును. విధి పదముండిననే ఆ విశేషము లభ్యమగును. అపుడు సంబంధ సామాన్య బోధకమగు షష్ఠ్యంతమయిన, 'అలః' అనుపదమునకు విధి పదముతో సమాసము కలుగగా, అల్సంబంధి కార్యము విషయమున స్థానివద్భా వము ప్రవర్తింపదను నర్థమేర్పడుటచే, ద్వితీయా, చతుర్థీ, ప్రథమలతో స్థాన్యల్లు ఏ సూత్రమునందును నిర్దేశింపబడలేదుగాన, పైన పేర్కొనబడిన ఆయా ఇతర విభక్త్యంతములు పూర్వపదములుగా గల సమాసము పర్యవసిత మగును. సర్వశబ్దము బహ్వర్థకమనుట. ఇది ఆ ప్రశ్నకు సమాధానము.

కాని ఇది దానికి ప్రయోజనముగాదు. విధిగ్రహణము లేకుండగ, 'అనల్' అని మాత్రమే నిర్దేశింపవచ్చును కేవల ప్రకృతికి ప్రయోగముండ రాదు గాన, శబ్దసాధుత్వమునకై ప్రథమావిభక్తి ప్రత్యయ ముపాత్తమైనను, దాని యర్థము వివక్షితముగాదు. కనుక ప్రాతిపదిక నిర్దేశములు అర్థతంత్రము అగును. అనగా స్వార్థమాత్ర బోధక విభక్త్యంతములు అనుట. ప్రధానముగ విభక్తిని అవి ఆశ్రయింపవు. ప్రాతిపదికార్థమును బోధించిన వెనుక, అన్వయ

యోగ్యమగు ఏయే విభక్తిని ఆశ్రయింపవలెననిన ఆయా విభక్తిని అది ఆశ్రయించును. కనుక విధిగ్రహణము లేకున్నను దోషములేదని వరల ఆక్షేపము.

కాని విధిగ్రహణము అవశ్యకమే. 'అల్విధిః' అను పదమున ఉత్తర పదమునకు లోపము కలిగినది గ్రహింపవలెను.

ఆశ్రీయతే ఇతి=ఆశ్రయః. అల్ ఆశ్రయః యస్యసః=అలాశ్రయః సచాసౌ విధిశ్చ అని విగ్రహము.

'అనల్' అని మాత్రమే విధి పదఘటితము కాకయుండిన, ఎచ్చట ప్రధానముగ అల్లు ఆశ్రయింపబడునో అచ్చటనే నిషేధము ప్రవర్తించెడిది కాని విశేషణముగ అయ్యది గ్రహింపబడిన స్థలములందు సిద్ధింపకపోవును. ఉదాహరణములకు జూతము—

'క ఇష్టః' 'స ఇష్టః'॥ ఇట, కస్+ఇష్టః॥ కర్+ఇష్టః॥ కయ్+ఇష్టః = క ఇష్టః॥ అని ప్రక్రియాక్రమము. 'సఇష్టః' అను చోటను నిట్లే.

ఇట రుస్థానమున యత్వము ప్రవర్తించినది. హ్రస్వాత్వ్యాహార వర్ణము పరముగా లేనందున ఉత్వమురాలేదు.

'ఇష్టః' అనునది యజధాతు ప్రకృతిక క్త ప్రత్యయాంతము. యకార స్థానమున సంప్రసారణము ఇకారము. దానికి స్థాని వదతిదేశముచే, స్థానిగతమగు హాశ్త్వము లభించినచో హాశ్వర్ణము పరమగునపుడు ప్రవర్తించు ఉత్వము రావలసివచ్చును.

కాని, "హశిచ" (6-1-114)" అను సూత్రమునందు హాశ్వర్ణమగు అల్లు ప్రధానముగ ఆశ్రయింపబడి యుండుటవలన ఈ విధి అల్లు పరమగునపుడు ప్రవర్తించు విధి. కావున 'అనల్విధౌ' అను నిషేధము లభించును.

లేనిచో, ఉత్వము, గుణము, అవాదేశమును ప్రవర్తించి 'కవిష్టః' అను రూప మేర్పడును. ఆ వకారమునకు "లోపశ్శాకల్యస్య" (8-3-19) అని లోపము వికల్పముగ ప్రవర్తించి. 'క ఇష్టః' అను రూపము సిద్ధించినను, పక్షమున, 'కవిష్టః' అను అనిష్ట రూపమును ప్రాప్తమగును. తద్వారణమునకై స్థానివద్భావమునకు నిషేధమావశ్యకము. ప్రకృత స్థలమున అల్లు ప్రధానముగ ఆశ్రయింపబడియే యున్నది కాన తన్నిషేధము నిర్బాధము గాని విశేషణముగ అది యాశ్రయింపబడిన "ఆర్ధధాతుకస్యేడ్వలాదేః" (7-2-35) అను ఇడాగమము, 'ప్రదీవ్య', 'ప్రసీవ్య' మున్నగు లక్ష్యములందు వారింపబడకుండును.

అట, 'య' అను ల్యప్పుకు స్థాని 'క్త్వా' అనునది. తద్గతమగు వలాదిత్వము స్థానివద్భావముచే 'య' అను నాదేశమునందు ప్రసక్తమయినచో, దానికి ఇడాగమము రావలసియుండును. దానిని "అనల్విధౌ" అను ఈ నిషేధముచే వారింపవలెను.

కాని ఇడాగమ విధాయకమునందు, వల్ అను అల్లు విశేషణముగ నాశ్రయింపబడినది గాని ప్రధానముగ ఆశ్రయింపబడలేనందున నిషేధము ప్రవర్తించకపోవును. కాగా సకలవిధ విధి పరిగ్రహార్థము విధి గ్రహణమును ఆశ్రయించి, దానివలన, ప్రధానాప్రధాన న్యాయమును బాధింపవలసి యున్నది. అందులకై విధి పదమావశ్యకమే.

## సూత్రారంభ ప్రయోజన విచారము

ఈ స్థానివదతిదేశము ఎందులకు చెప్పబడుచున్నది ?

తత్ స్థానమునవచ్చినది తద్ధర్మమును గలిగియుండుట చూచుచున్నాము గాదా ? ఆ న్యాయము చేతనే స్థానికార్యముల నాదేశములు పొందవచ్చును. అనిన, దానికి సమాధాన వార్తిక మిట్లవతరించినది.

**వా॥ "స్థాన్యాదేశ పృథక్త్వాత్ ఆదేశే స్థానివదనుదేశో గురువద్గురు పుత్ర ఇతి యథా"**—అని

స్థాని వేరు. ఆదేశము వేరు. స్థాన్యాదేశములు వేరు వేరగుట అను నీ కారణము వలన, స్థాని యొక్క కార్యము ఆదేశము నందు ప్రాప్తింపకున్నది.

అయిన నేమి దోషము ? అనిన,

"ఆఙోయమహనః" (1-3-28) అను సూత్రముచే విధింపబడిన ఆత్మనేపద ప్రత్యయము, హన ధాతువునకు బరముగనే గాని తదాదేశమగు 'వధ' కు రాక పోవును. వధ ధాతువు ఆఙ్ కంటె బరమయినపుడు గూడ నాత్మనేపదము సమ్మతము. యత్నములేనిచో అయ్యది సిద్ధింపకున్నది అందువలన నీ స్థానివదనుదేశము ఆరంభింపబడినది. ఇందుకొరకే ఈ సూత్రము.

లోక న్యాయముచే నిది సిద్ధింపదు. శాస్త్రమునందు శబ్దమునకు స్వరూపమే సంజ్ఞ అని చెప్పబడినదిగదా ?

"గురువద్గురు పుత్రే ఇతి యథా" అనగా, "గురువద్గురు పుత్రే వర్తితవ్యమ్" గురువునందు వలె తత్పుత్రుని విషయమునందు సత్కార విషయములందు వర్తింప

వలెను అని చెప్పబడినపుడు, గురు పుత్రునియందు గురు కార్యమును అతిదే శించుటయే గదా తాత్పర్య విషయము. అట్లే స్థాని కార్యమును ఆదేశమున నతిదేశించుట ప్రకృత సూత్ర తాత్పర్య విషయమని సమాధాన వార్తిక తాత్పర్యము.

ఇది దీనికి ప్రయోజనము కాదు. ఇయ్యది లోక సిద్ధము. లోకము నందు, ఒకని ప్రసంగమున వేరొకడు పనిచేయునపుడు, ఆతడా కార్యములను బొందుట కనబడుచున్నది. తత్ స్థానాపన్నునకు తద్ధర్మములు లభించుటకు వచన మక్కరలేదు. ఎట్లన- ఉపాధ్యాయునకు బదులుగ శిష్యుడు యాజ్య కులముల కాహ్వానింపబడి వెళ్ళినపుడు ఆతడును అగ్రాసనాదులను తన ఉపాధ్యా యునివలె పొందును గదా. కావున ఇది సూత్ర ప్రయోజనము కాదని ఆక్షేపము.

లోకమున నా దృష్టాంతము గలదు గాని, లోక దృష్టాంతములకు గూడ శాస్త్రకారుల నిబంధనలు నివర్తకములగుచుండుటయు కలదని సమాధానము.

అట్టి శాస్త్రీయ పురఃపారంభ మిట నేదియైన గలదా? అనిన, లేకేమి? కలదు. అది యేది? స్వరూప విధి. హన ధాతువునకు బరముగ నాత్మనే పదము విధింపబడు చున్నదనిన నది హన ధాతువునకే వచ్చును గాని, దాని యాదేశమగు వధకు రాకపోవును. స్వరూప విధియనగా శబ్దమునకు స్వరూ పమే బోధ్యమను "స్వంరూపం శబ్దస్యా శబ్ద సంజ్ఞా" (1-1-67) అను పాణిని శాసనము. ఆరంభమనగా ఆరభ్యమాణమగు శాసనము. అందువలన నతిదేశము.

అట్లైన- పాణిన్యాచార్యుని ప్రవృత్తివలన, స్థానికార్య మాదేశమునందు ప్రవర్తించునని జ్ఞాపితమగుచున్నది గాన నీ యతిదేశమనావశ్యకమే యగునని మరల నాక్షేపము. పాణిని, "యుష్మ దస్మదోరనాదేశే" (7-2-86) అని యొక సూత్రమును రచించినాడు. ఆదేశరూపము కాని హలాది విభక్తి పరమగునపుడు 'యుష్మద్' 'అస్మద్' అను శబ్దములకు ఆకారమాదేశమగునని దాని యర్థము 'యువాభ్యామ్' 'ఆవాభ్యామ్' ఉదాహరణములు. ఇట విభక్తి 'భ్యామ్' అను నది. అది ఆదేశముకాదు. 'యుష్మభ్యమ్' 'అస్మభ్యమ్' అనుచోట నీ యాకా రాదేశమురాలేదు. అట 'భ్యమ్' ఆదేశము. "భ్యసోభ్యమ్" (7-1-30) అని విధింపబడినది. ఇట 'భ్యస్' స్థాని విభక్తి, భ్యమ్ విభక్తి కాదు. అట్టియెడ ఆత్వమునకు ప్రసంగమె లేదే? 'అనాదేశే' అనునది వ్యర్థము. కాని, పాణిని ఆదేశము స్థానవంటిదగునని చూచినాడు. కావున ఆదేశము పరమగునపుడు

అత్వమనిష్టమగుటచే, 'అనాదేశే' అని పఠించినాడు. దానివలన ఆదేశమునకు స్థానివదనుదేశము అతనికి సమ్మతమని జ్ఞాపితమగుచున్నది. సూత్రమనావశ్య కము

పోనిండు. అలాశ్రయమగు విధికర్తవ్యమగునపుడు ఈ అతిదేశము నాతడు 'అనల్విధౌ' అని చెప్పి నిషేధింపనున్నాడు తాను ముందు, ప్రతిషేధ్యమును జూపిగదా ప్రతిషేధింపవలెను? 'స్థానివదాదేశః' అని చెప్పక 'అనల్విధౌ' అని యెట్లు చెప్పుట పొసగును? కాగా, ప్రతిషేధ్య ప్రదర్శనమునకై విధ్యంశ మును నావశ్యకము.

అనిన- అదియు ప్రయోజనముకాదు. అల్విధులు కర్తవ్యములగునపుడు స్థానివద్భావము ప్రవర్తింపదను నంశముగూడ జ్ఞాపకసిద్ధమే గాన ఆ యంశ మును అనావశ్యకమే. నిషేధాంశమును ఆచార్య ప్రవృత్తిచేతనే జ్ఞాపితము పాణిని "అదోజగ్ధిర్ల్యప్ తి కితి" (2-4-36) అను సూత్రము చేత, అదధాతువునకు, ల్యప్ప్రత్యయము పరమగునపుడును, తకారాది కిత్ప్రత్యయము పరమగునపుడు, 'జగ్ధ్' అను ఆదేశమును విధించును. 'ప్రజగ్ధ్య' అనునదియు, 'జగ్ధ్వా' అను నదియు క్రమముగ నుదాహరణములు ల్యబాదేశమిట క్త్వా ప్రత్యయ స్థానము నవేగదా ప్రవర్తించినది? స్థానివద్భావముచే, స్థానిధర్మమగు నాతాదికిత్త్వము, దాని ఆదేశమగు ల్యప్పునందు సులభము గదా? ఇక ల్యబ్గ్రహణమునకు పని యేమి? కాగా అది వ్యర్థమయి, అలాశ్రయ విధి కర్తవ్యమయినపుడు స్థాని వదనుదేశము ప్రవర్తింపదనియు, జగ్ధ్యాదిలో తకారమను అల్లు విశేషణముగ నాశ్రితమయి యున్నది గాన సాధర్మ్య మతిదేశ లభ్యముకాదు. అందువలన సూత్రమున ల్యబ్గ్రహణ మావశ్యకమనియు, జ్ఞాపన చేయుచున్నది.

ఈ విధముగా లింగమువలన నఖిమతార్థము సిద్ధించుచున్నది గాన నీ "స్థానివదాదేశోఽనల్విధౌ" అను యోగము నిష్ప్రయోజనమని పర్యవసి తము.

మందమతులయినవారి యందు అనుగ్రహము కొరకై స్థానివత్సూత్రము రచింపబడినను, అందు విధి పదఘటితమగు "అనల్విధౌ" అనునది అనావశ్య కమే అను తాత్పర్యముతో, వార్తికకారుడు,

"వా॥ అల్విధౌ ప్రతిషేధేఽవిశేషణే ప్రాప్తిస్తస్యాదర్శనాత్"- అని వార్తికము నవతరింపజేసెను. "అల్విధి కర్తవ్యమగునపుడు స్థానివద్భావము నకు ప్రతిషేధము లేకున్నను, విధిలో నాశ్రితమయియున్న విశేషణము, కనబడనపుడు, ఆ విధికి అట ప్రాప్తియుండదు" అని వార్తి కార్థము.

విధిగ్రహణమునకు ప్రయోజనము, 'ప్రదివ్య, ప్రసీవ్య' మున్నగు స్థలము లందు ఇడాగమవారణము. ఇడాగమ విధాయక శాస్త్రమునందు, 'వలాదేః' అని యార్ధధాతుకమునకు విశేషణ మాశ్రయింపబడియున్నది. ల్యప్ప్రత్యయ మునందావలాదిత్వములేదు. అది స్థానివద్భావముచేత నతిదేశింపబడదు. క్త్వా ప్రత్యయమునందుండు కృత్త్వము, ప్రత్యయత్వము, ఆర్ధధాతుకత్వము మున్నగు సామాన్య ధర్మములు దాని యాదేశమునందతిదేశ లక్ష్యములగును గాని విశేష ధర్మము ఆదేశింపబడదు. విశేష ధర్మాతిదేశమును అపేక్షితమయిన అందులకు యత్న విశేషము ఆవశ్యకము.

ఈ క్త్వా ప్రత్యయము, కొన్ని స్థలములందు, 'ఇత్వా' అనియు, మరి కొన్ని చోటులందు 'స్నాత్వీ' అని ఈకారాంతముగను, ఒకానొకచో 'దత్త్వాయ' అని యగంతముగను, 'ఇష్ట్వీనమ్' అని మాంతముగను, భిన్న భిన్న రూపములతో అగపడుచున్నది కావున ఈవలాదిత్వము దానికి సామాన్య ధర్మముగాదు. కాబట్టి ల్యప్పునందు 'స్వతః' గాని స్థానితః గాని వలాదిత్వము లేనందున నిడాగమాపత్తికి ప్రసంగము లేదు. కాగా విధిగ్రహణముతో పని లేదని భావము.

ఒకదానికి చెప్పబడిన కారణము వేరొక దానికి సిద్ధించుటకేగదా యీ స్థాని వదతిదేశ రూపయత్నము చేయబడినది? కావున వలాదిత్వము ల్యప్పునకేల ప్రాప్తింపదు? అను ప్రశ్నమునకు సమాధాన వార్తికము.

**వా॥ "సామాన్యాతిదేశే విశేషానతిదేశః"** అనునది.

సామాన్య దర్మ బోధకమగు శబ్దమును గ్రహించి, కార్యమతిదేశింపబడి నపుడు, విశేషమతిదిష్టము కాదు విశేషాశ్రయమగు కార్యమున కతిదేశము కలుగదనుట. ఇదే వార్తికార్థము.

ఈ విషయము లోకసిద్ధము. "బ్రాహ్మణవదస్మిన్ క్షత్రియే వర్తితవ్యమ్" = ఈ "క్షత్రియుని బ్రాహ్మణునివలె చూచుచని" అని చెప్పబడి నపుడు, సామాన్యమగు బ్రాహ్మణ కార్యమునకే అచట అతిదేశము గనబడు చున్నది గాని, బ్రాహ్మణులలో విశిష్టుడగు మాఠరు నందలి కార్యమును గాని కౌండిన్య నందలి కార్య విశేషమును గాని క్షత్రియు నందు అతిదేశించుట లేదు.

ఇట్లయినచో, 'అగ్రహీత్' అను లక్ష్యమునందు, "ఇట ఈటి" (8-2-28) అను సూత్రముచే సిచ్చునకు లోపము ప్రాప్తింపదే?

"అ-గ్రహ్-ఇట్-స్-ఈ-త్" అనునది యచటి స్థితి. అందు ప్రథమా కారము అడాగమము. 'గ్రహ్'-అనునది. ధాతువు. 'ఇ' అనునది సిచ్చునకు

వచ్చిన ఇడాగమము యొక్క స్థానమున, "గ్రహో లిటి దీర్ఘః" (7-2-37) అని వచ్చిన దీర్ఘము. సకారము సిచ్చు. ఆ తరువాతి ఈకారము, 'అస్తిసిచ' అను నీడాగమము. చివరి తకారము తిప్రత్యయము అట సిచ్చు వెనుక నున్న ఇడాగమమునకును, పైన ఈడాగమమునకును నడుమ నుండుటచే, పై సూత్రముచే లోపింపవలెను. సకారమునకు వెనుకటి ఈకారమునందు ఇట్త్వము స్థానివద్భావముచే సిద్ధించిననే ఆలోపము సాధ్యమగును.

గ్రహోలిటీతి సూత్రమున దీర్ఘపదోచ్చారణముచే అచ్చు విధింపబడుటచే నట 'అచశ్చ' (1-2-28) అను పరిభాషయుపస్థితమగును. కాగా దీర్ఘమునకు స్థాని 'ఇట్' అను సముదాయము కాదు ఇకార మాత్రమే. ఇద్రూపమగు నచ్చునకు దీర్ఘమని యర్థము. కావున నిట్కార్యము విశేష కార్యమగుటచే ప్రాప్తించుటలేదు. అందువలన "అనల్విధౌ" అనునది వక్తవ్యము. అది విశేష ధర్మాతిదేశమును జ్ఞాపనచేయును.

విశేషాతిదేశము చేయబడని యెడల దూషణాంతరమును గలదు. 'ప్రదీవ్య', 'ప్రసీవ్య' అను స్థలములందు గుణ ప్రతిషేధమును సిద్ధింపకపోవును. కిత్త్వమును వలాదిత్వమువలె విశేష ధర్మమే, ఇడాగమ విధివల్లను అల్లు నాశ్రయించిన దగుటచే అల్విధి. కావున స్థానివద్భావ ప్రతిషేధము సిద్ధించును.

'అగ్రహీత్' అనుచోట, తత్ప్రతిషేధము వారింపబడును. ఈ సలోప విధి, విశిష్టమగు అనల్లును 'ఇట్' అను సముదాయము నాశ్రయించినది గదా.

"గ్రహో లిటి దీర్ఘః" (7-2-37) అను సూత్రము నందును, అనియమములేనందున నియమ ఫలకమగు అచ్పరిభాష ఉపస్థితము కాదు గాన, 'ఇట్' అను సముదాయమునకే స్థానిత్వమని భావము.

'అనల్విధౌ' అను జ్ఞాపకము వలన, సామాన్యమును, విశేషమును గూడ అతిదేశింపబడునని యెడల, వా॥ "సతాశ్రయే విధిరిష్టః"- 'అరుదితామ్' 'అరుదితమ్' 'అరుదిత'- అను లక్ష్యములందు, ఆశ్రయే = ఆశ్రీయమాణమగు అలాదిత్వ మున్నపుడు ఇడాగమము రావలసి యుండును గదా !

అవును. అయిన నేమి ?

వా॥ "ప్రతిషేధస్తు ప్రాప్నోత్యల్విధిత్వాత్" అని యాక్షేప వార్తికము.

అనగా, 'ఆదేశము స్థానివంటిదగును. అలా (శ్రయవిధిలో, కాదు' అని సూత్రార్థము గాన, ఇడాగమ మల్విధియగుటచే, స్థానివద్భావము ప్రవర్తింపదు. స్థానులగు 'తస్' 'థస్' థల సార్వధాతుకత్వము తాం, తం, త-లకు లేనందున నయ్యాది లభింపదు. 'అనల్విధౌ' అని ప్రతిషేధము ప్రవర్తించును గదా!

పై మూడు రూపములందును, "రుదాదిభ్యస్సార్వధాతుకే" (7-2-76) అను సూత్రముచే సార్వధాతుకముల కిడాగమము రావలె. అది వలాదియు గావలెను. వలాదిత్వ మార్ధధాతుకమునకు విశేష ధర్మము. అది స్థాని వద్భావముచే సిద్ధింపవలెననిన, అనల్విధౌ అని ప్రతిషేధము ప్రాప్తించుచున్నది. ఇడాగమము వల్లు అను నల్లును విశేషణముగ ఆశ్రయించి యుండుటచేత అల్విధి అని భావము.

ఈ యాక్షేప వార్తికమునకు సమాధానముగా, వా॥ "నవా ఆను దేశికస్య ప్రతిషేధాదితరేణభావః" అను వార్తిక మవతరించినది.

నవా = లేదా, ఇది దోషము కాదని యునవచ్చును. ఎందువలన?

ఆనుదేశికస్య = అనుదేశః ప్రయోజనం యస్యతత్ = తస్య అనగా, అతిదేశ ప్రయుక్తమగు స్థానిగత వలాదిత్వమునకు ప్రతిషేధము కలిగిన కలుగనిమ్ము. దాననేమి? స్వాశ్రయమగు వలాదిత్వము అనగా నాదేశ గతమగునది యుండును గదా! ఇపుడివి వలాదులా? కావా? అని వివాదముకాదు. మరి యేమి? వీనికి సార్వధాతుకత్వము కావలెను. అది స్థాన్యాశ్రయము. స్థాని వద్భావైక లభ్యము. ఇడాగమవిధి అల్విధి కావున సార్వ ధాతుకత్వము విషయమున గూడ 'అనల్విధౌ' అను నిషేధము ప్రవర్తించును అని ఆక్షేప సంహారము.

ఇక నిపుడు, ప్రకృత విషయమున స్థానివద్భావ ప్రతిషేధము ప్రవర్తింప దను విషయమును, విచారపూర్వకముగ వార్తి ముఖమునసే ప్రతిపాదింపదలంచి స్థాన్యలాశ్రయ విధి విషయమునసే ప్రతిషేధ సాధన విచారము చేయబడును. దానివలన నీ యాక్షేపమునకు సమాధానము లభ్యమగును.

"ఆదేశము స్థానివంటిదగును కాని అలాశ్రయమగు ధర్మము నాశ్ర యించిన కార్యము కర్తవ్యమైనపుడు స్థానివంటిదిగాదు" అనిగదా సూత్రా ర్థము. 'అల్లు' అనగా ఆదేశి గతమగునదియా? లేక ఆదేశ్యాదేశోభయాన్యతర గతమగునదియా? వివక్షితము. ఆదేశియనగా స్థాని. ప్రత్యాసత్తిన్యాయము నను సరించి, స్థాన్యలాశ్రయకార్యముననే ప్రతిషేధము ప్రవర్తించునందురా?

వ్యాప్తి న్యాయాశ్రయణముచే నుభయాశ్రయ కార్యములందును నిషేధము తాత్పర్య విషయమా ?

ఎట్లైననేమి విశేషము ? అనిన,

**వా॥ ఆదేశ్యల్విధి ప్రతిషేధే గుణవృద్ధి ప్రతిషేధః కురువధపిబామ్"**

'కురు' అను స్థలమున, 'కృ' అనునది ధాతువు. లోణ్మధ్యమ పురుషైక వచనమగు 'సి' అను ప్రత్యయమునకు 'హి' అను నాదేశము 'ఉ' అనునది వికరణ ప్రత్యయము సార్వధాతుక గుణము. కర్+ఉ+హి అను స్థితిలో, హిలోపము, ధాతువునందలి అకారమునకు "అత ఉత్సార్వధాతుకే" (6-4-110) అను సూత్రముచే ఉత్వము ప్రవర్తించి, కుర్+ఉ, హి, అను దశలో వచ్చును. 'కురు' రూపము.

ఇట ఉప్రత్యయ నిమిత్తముగ, ధాతువు నుకారమునకు లఘూపధ గుణము ప్రాప్తించు చున్నది. లఘూపధమగు నంగమునకు గుణము

లఘూ పధత్వము దానికి స్వతస్సిద్ధమైనను నంగసంజ్ఞ స్థానివద్భావ ముచే కలుగవలెను. గుణమిట స్థాన్యలాశ్రయముకాదు గాన స్థానివద్భావ ప్రతిషేధము ప్రాప్తింపకున్నది కావున గుణ ప్రతిషేధము వక్తవ్యమగుచు.

'వధకమ్'- అను రూపము హన హింసాగత్యోః అను ధాతువునకు ణ్వుల్ప్రత్యయము పరమయినపుడు "బహులంతణి" అన్న 'వధక గాత్ర విచక్షణాజిరాద్యర్థమ్' అను వచనముచేత వధాదేశము రాగా నిష్పన్నము. ఇట స్థానివద్భావముచేత నంగసంజ్ఞ యును, అదుపధత్వము స్వాశ్రయమును గలవు. కాన "అత ఉపధాయాః" (7-2-116) అని వృద్ధి ప్రాప్తించుచున్నది.

"పిబ" అనుచోటను, స్థానివద్భావము వలన నంగసంజ్ఞయు, స్వాశ్రయ మయిన లఘూ పధత్వమును నుండుట వలన లఘూపధగుణము ప్రాప్తించు చున్నది.

అట్లైన, ఆదేశమునందలి యల్లు ఆశ్రయింపబడినపుడును ఆదేశి=స్థాని యందలి అల్లు ఆశ్రయింపబడినపుడు, ప్రతిషేధము ప్రవర్తించునను.

**అపుడు "ఆదేశ్యాదేశ ఇతిచేత్ సుప్తిఙ్ కృత్**

**అతిదిష్టేషూపసంఖ్యానమ్" అని యర్థ్యోపపదమగును।**

అతిదిష్టేషు = ఆదేశములందు, సుబాదేశములందును, తిఙాదేశములందును, కృదాదేశములందును, స్థానివద్భావముచే సుప్సంజ్ఞయు, సార్వధాతుకసంజ్ఞయు, ప్రత్యయ సంజ్ఞయు లభించునుగాన, స్వాశ్రయములగు యఙాదిత్వ, వలాదిత్వ, అజాదిత్వముల నాశ్రయింపని వృఞాయ, ప్లఞాయ-అనుచో "సుపిచ"(7-3-102) అని దీర్ఘమును, 'అ దితామ్' 'అరుదితమ్' 'అరుదిత' అను స్థలములందు, ఇడాగమమును, 'భువనమ్' 'సువనమ్' 'ధువనమ్' అనుచోట ఉవఙాదేశమును, రావలసినవి, స్థానివద్భావ ప్రతిషేధము ప్రాప్తించుటచే రాకపోవుచున్నవి.

ఇట్లు రెండు పక్షములును దోషయుక్తములే అయినపుడు, ఏదేపక్షమును స్వీకరించి దోషములకు ప్రతి విధానమును చేయుట న్యాయోపపన్న మగును ?

స్థాన్యలాశ్రయ విధి కర్తవ్యమగునపుడు ప్రతిషేధము ప్రవర్తించునను పక్షమును పరిగ్రహించుటయే యుచితమని సమాధానము.

ఏ దువలనఅనగా, ఈ సూత్రము విశిష్టమగు స్థానికార్యము వాదేశమునం దతిదేశించుచున్నది. విశిష్టమనగా, ఆదేశమునందు, స్వరూపతః లభ్యముకానిది. కావున, తచ్ఛేషమగు, అతిదేశ నిషేధముగూడ, అతిదేశ ద్వారకమగు అల్కార్యమునందే ప్రవర్తించుట యుక్తము. అరుదితామిత్యాదులందు, ఆదేశములును వలాదులే యగుటంజేసి వలాదిత్వాతిదేశముతో పనిలేదు. సార్వధాతుకత్వము వానికి స్వతః లేదు. కావున నయ్యదియే యతిదేశ సాధ్యము. తదపేతము.

"గురు వదస్మిన్ గురు పుత్రే వర్తితవ్యమ్
అన్యత్రోచ్ఛిష్ట భోజనాత్పాదోప సంగ్రహణాచ్చ"

అని శాస్త్ర మతిదేశించుచున్నది. గురుపుత్రుని విషయమునను గురువునందు వలెనె వర్తింపవలెను. అట ఉచ్ఛిష్ట భోజనమును, పాదోపసంగ్రహణమును మాత్రము వర్జింపవలెను" అని యర్థము. స్వతః ప్రాప్తములు కాని కార్యములకె అతిదేశమును, ఉచ్ఛిష్ట భోజన, పాదోపసంగ్రహణములకు వర్జనమును, అతిదేశ ప్రాప్తములకే. ఆ గురుపుత్రుడును గురువే అగునను కొనుము. అపుడా కార్యములును కర్తవ్యములే యగును. అది గురుత్వ ప్రయుక్తములే. ఆ విధముగ్గా, అలంశమునను, అతిదేశ ప్రాప్తమగు అల్కార్యముననే ప్రతిషేధము ప్రవర్తించును, అని తాత్పర్యము.

అట్లైన, భావపక్షమునే సిద్ధాంత పక్షముగ స్వీకరింతము. అనిన,

శం-) ఆ పక్షమున, క్షుధ, వధ, పిబలలో గుణవృద్ధి ప్రతిషేధము వక్తవ్యమగు నని దోషమాపాదింపబడినది గదా ?

సత్యమే. కాని యీ దోషము సుపరిహారము.

"కరోతౌ తపరకరణాత్సిద్ధమ్" అనగా 'కురు' అనుచోట గుణప్రాప్తి, "అత ఉత్సార్వధాతుకే" (6-4-110) అని విధింపబడిన ఉకారమునందలి తపరకరణమువలన వారింపబడును. భిన్న కాలవ్యావృత్త్యర్థమగు తపరకరణము, శాస్త్రాంతర ప్రాప్తమగు భిన్నకాలమును గూడ వ్యావర్తించును.

ఇక 'వధకమ్' అనుచోట ప్రత్యయము 'ణ్వుల్' కాదు. "హనోవధచ" ఉ.సూ. 2 పా॥ 194 సూ॥ అను ఔణాదికసూత్రముచే విధింపబడిన క్వున్ ప్రత్యయము. అది ణిత్తుకాదు గాన వృద్ధి ప్రసంగము లేదు, 'రుచకః' అను క్వునంతమువంటి రూపము.

ఇక 'పిబ' లో గూడ దోషములేదు. 'పిబ' అనునది అదంతమగు నాదేశము. కాగా నందలి ఇకారముపధకాదు, గుణాపత్తియే లేదు.

కావున, 'ఆదేశమునకు స్థాని యయినదిగాని, ఆ స్థానికి సంబంధించినవి గాని యగు వర్ణమాత్రమున కసాధారణమయిన ధర్మ మతిదేశ్యమయినపుడు స్థానివద్భావము ప్రవర్తింపదు'- అని "అనల్విధౌ" అనుదాని కర్థము నిష్కృష్టము.

## ఏకదేశ వికృత న్యాయవిచారము

**వా॥ ఏకదేశ వికృత స్యోపసంఖ్యానమ్"** అని యాక్షేపవార్తికము. ఏకదేశ వికృతమునకు స్థానివద్భావమును జెప్పవలసి యుండును' అని వార్తికార్థము. ప్రయోజనమేమి ? అనిన, 'పచతు' 'పచంతు' అనుచోట 'తు' అనునది తిఙ్గా గ్రహింపబడుట ప్రయోజనము.

ఇచట, "ఏరుః" (3-4-86) అను సూత్రముచేత, ఇకార స్థానమున నుకార మాదేశింపబడినది. ఇకారము తి అనుదాని యేకదేశము. 'తి' అనునది తన యేకదేశము వికృతమగుట వలన దానును వికృతమగుచున్నది. అంతియు గాని 'తి' అను సముదాయమునకు 'తు' ఆదేశముగాదు. కావున 'తి' అనుదాని యందు గల తిఙ్త్వమునకు 'తు' అనుదానియందతిదేశము ప్రాప్తించుటలేదు. అది లేనిచో, తిఙంతము తిఙంతముగాదు. పదత్వము సిద్ధింపదు.

కావున ఏకదేశ మాత్రమునందు మార్పుగలదానికి గూడ స్థానివద్భావము నతిదేశించుట ఆవశ్యకము, ఇకారోకారముల స్థాన్యాదేశభావము ప్రత్యక్షము. తి తుల కయ్యది అనుమేయము. కావున, ఆనుమానికమగు ఆదేశము

వంతు గూడ స్థానివద్భావమునకు ఉపసంఖ్యానము కర్తవ్యమని ఆక్షేప వార్తికాశయము.

**వా॥ "ఏకదేశ వికృతస్యా నన్యత్వాత్సిద్ధమ్"** అని సమాధాన వార్తికము.

"ఏకదేశ వికృత మనన్యవత్" అను లోక న్యాయముచే సిద్ధించును గాన ఉప సంఖ్యానమనావశ్యకమని భావము. అది యెట్లన,

కుక్క, చెవిగాని తోకగాని తెగి మార్పునందినను, కుక్కయే అగును గాని, గుఱ్ఱముగాని గాడిద కాని కాదు గదా ! కొన్ని అవయవములందు మార్పు కలిగినను మిగిలిన వాని వలన శ్వత్వజాతి అభివ్యక్తమయినట్లు, 'పచతు' అనుచో నికార ముకారముగా మారినను, శేషించిన తకారము తిఙ్త్వమునకు వ్యంజకమగును.

'అపచత్' అను రూపములో తిఙ్ప్రత్యయ యేకారము లోపించినది. అయినను తకార మాత్రమునకు తిఙ్త్వమును, అర్థప్రతీతి హేతుత్వమును, ఈ లోక న్యాయము వలననే సిద్ధించుచున్నవి. లేనిచో లోపము వికారము కాదుగాన నుపసంఖ్యానము వలన నట కుదురదుగదా.

**వా॥ "అనిత్య విజ్ఞానంతు తస్మాదుపసంఖ్యానమ్"** అని ఆక్షేప సాధక వార్తికాంతరము.

శబ్దములు నిత్యములు. కావున నయ్యవి, కూటస్థములును, అవి చాలులునుగ ఉండదగును. వానికి అపాయము గాని ఉపజనము గాని వికారము గాని కలుగరాదు. ఈ వర్ణ నిత్యతా పక్షమున ఇది వికృతము అనుటయు, మరల నదియే ఇది అనుటయు, పొసగని మాట. కాని వాని కనిత్యములను భావమును వారించుటకు ఉపసంఖ్యాన మావశ్యకము. శబ్దములు కార్యములు=అనిత్యములు అను పక్షమున లోక న్యాయముచే సిద్ధించినను నిత్య శబ్ద వాదమున వచనారంభము తప్పదని భావము.

ప్రకృతాంశమున ఋష్యంతర సంవాదమును గలదు. కాత్యాయనీయులు ఏకదేశ 'వికృతస్యోపసంఖ్యానమ్' అని పఠించినట్లే, భారద్వాజీయులు, "ఏకదేశ వికృతేషూపసంఖ్యానమ్" "అనాదేశత్వాత్" "రూపాన్యత్వాచ్చ" అని వార్తికములను పఠించియున్నారు. ఈ పాఠమునందు హేత్వభిధానమును, 'వికృతేషు' అని బహువచన నిర్దేశమును విశేషము. బహువచన నిర్దేశము వలన లోపము గూడ సంగ్రహింపబడును. కావున 'అపచత్' అనుచోటగూడ స్థానికత్వము సిద్ధించును॥

ఉప సంఖ్యానమునకు హేతువు అనాదేశత్వము. ఆదేశము గదా స్థాని వంటిదగునది? తు మున్నగునవి ఆదేశములు కావు గదా?

రూప భేదమువలన, లోక న్యాయముచే ఆదేశత్వము సిద్ధింపదు. అవయవాదేశమువలన రూపము నందు భేదము కలుగుచున్నది. అందువలన "ఇది అదియే" అను ప్రత్యభిజ్ఞ కలుగుట కవకాశము లేదు. ఇకారముకారముగ మారుటలో సగము భాగమునకు మార్పు కలుగుటవలన, శేషించిన భాగమువలన జాత్యభివ్యక్తి కలుగదు. కావున నుపసంఖ్యాన మావశ్యకమని భారద్వాజీయ వార్తికముల తాత్పర్యము.

ఆక్షేప సమాధానము— ఈ 'తు' మున్నగునవియు నాదేశములే. ఆదేశింప బడునది యాదేశము. ఇవియు నాదిశ్య మానములే గదా! సూత్రమున నాదేశ పదము, అనుమాసికాదేశములను గూడ సంగ్రహించుటకే యేర్పడినది. లేదేని సోనది సంబంధి శబ్దమగుట చేత నాదేశము నాక్షేపింప వచ్చును గనుక దానితో పనియేలేదు.

**వా॥ "ఆదేశః స్థాని వదితిచేన్న అనాశ్రితత్వాత్"** అని ఆదేశ పదముచే ప్రత్యక్షాదేశమునకే గ్రహణము న్యాయ్యమను నభిమానముతో బంధింపబడిన ఆక్షేపసాధక వార్తికము.

ఆదేశము స్థానివంటిదగుననిన నది కుదురదు. ఎందువలనన అది ఆశ్రితము కాలేదు గనుక. ఇట నాదేశమేమి? ఇకారమునకు ఉకారము. అది పద సంజ్ఞా విధిలో నాశ్రయింపబడలేదు. పద సంజ్ఞ తి శబ్ద నిబంధనము. తిఙంతము పదము. ఇక నా సంజ్ఞలో ఆశ్రీయమాణము తు శబ్దము. అది ఆదేశము కాదయ్యె. కావున అనుమాసికాదేశము ఆదేశపదముచే గ్రహింప బడదని యాక్షేప భావము.

సమాధానము — సముదాయ మాశ్రితమయినపుడవయవ మాశ్రితము కానట్లు భావింపబడ రాదు. అవయవము సముదాయాభ్యంతరమే గదా? వృక్షము తాను గదలుచున్న నవయవముల తోడనే కదలును గదా.

సుప్తిఙన్తం పదమను సూత్రమునందు 'తి' అను సముదాయము పద సంజ్ఞానిమిత్తముగ నాశ్రయింపబడినది. సముదాయ మవయవాతిరిక్తము గాదు. కావున తకారోత్తరేకారాంతము అంతమున [illegible] ఇకారమున [illegible] గావ దాని యందు ఇకార బుద్ధి కలుగును.

కాగా అది తిజ్ త్వావచ్ఛిన్నమున కవయవము ఆ ధర్మము తదాదేశమగు మకారమునకును గలదు గాన పదసంజ్ఞ సిద్ధించును అని భావము.

దీనిపైన నొక యాక్షేపము వార్తికకారునిచే చూపబడినది.

వా॥ "ఆశ్రయ ఇతిచేదల్విధి ప్రసంగః" అని వార్తికము.

పద సంజ్ఞలో ఇకార మగు నవయవమును ఆశ్రీయమాణ మనినచో, నది యల్విధి కావలసివచ్చును. 'అనల్విధౌ' అని ప్రతిషేధము ప్రాప్తించును.

సమాధానము - 'ఇది దోషముగాదు. అట్లనిన నేదియు, అనల్విధికాకుం డును. అన్నియు నలాశ్రయములేయగును. కాన 'అనల్విధౌ' అని చెప్పుట వ్యర్థమే కావలసివచ్చును. అందువలన నట ప్రకర్షము వివక్షింపబడును. అనగా, ఎయ్యది సాక్షాత్తుగ నల్విధియో = ఎచట ప్రత్యక్షముగ అల్లు నిర్దిష్టమో అదియే అల్విధి అగునుగాని, అనుమీయమానమునందు, అల్లుకు సంభవమున్నంత మాత్రమున అది అల్విధిగాదు' అని గ్రహింపవలె. సముదాయాశ్రయణ స్థలము లందును నాంతరీయకముగ అవయవాశ్రయణము అనివార్యము గదా ?

లేదా, సిద్ధాంతభూతమగు సమాధానాంతరమును ఇట్లు చెప్పనగును.

ఆదేశ పదప్రయోజన కథన ప్రసంగమున, స్థానిశబ్దము సంబంధి శబ్ద మగుటచేత ఇక ఆదేశపదమునకు సూత్రమునందు ప్రయోజనము లేదు కాన అయ్యది ఆదేశమాత్రము గ్రాహ్యమని బోధించును. అనగా, ప్రత్యక్షాదేశ మును, ఆనుమానికాదేశమును గూడ- స్థానివద్భావమునందును, కానీ ఎట్టి దోషములు కలుగవు.

## శబ్ద నిత్యతాపక్షమందును స్థాన్యాదేశ భావమున కుపపత్తి విచారము

వా॥ "అనుపపన్నం స్థాన్యాదేశత్వం నిత్యత్వాత్" అని యాక్షే పము శబ్దములు నిత్యములు. అవి శాస్త్రకార్యములుగావు, అనికదా సిద్ధాం తము. ఈ పక్షమునందు, "ఇయ్యదిస్థాని, దీని కియ్యది ఆదేశము" అను వ్యవ హారమెట్లు పొసగును ?

స్థానియనగా, పూర్వముండి తరువాత ఉండనిది.

ఆదేశమనగా అదివరకు లేకుండ అపుడున్నది, అని అర్థము. శబ్దములు నిత్యములయినపుడు, ఉన్నదానికి వినాశమును, లేనిదానికి ప్రాదుర్భావమును

కలుగుననుట ఉపపత్తిరహితము. నిత్యమనగా ప్రాగభావ ప్రధ్వంసాభావములు రెండును లేనిదిగదా అని ఆక్షేప్త తాత్పర్యము.

సమాధానవార్తికము- వా॥ "సిద్ధంతు యథాలౌకిక వైదికేష్వభూత పూర్వేఽపి స్థానశబ్ద ప్రయోగాత్"

అనునది- లౌకిక వ్యవహారములయందును, వైదిక వ్యవహారములందును, భూతపూర్వముకాని దానియందును, స్థాన శబ్ద ప్రయోగ మగపడుచున్నది. కావున స్థాన్యాదేశ వ్యవహారము ఉపపన్నము కావచ్చును అని వార్తికార్థము.

లోకమున, "ఉపాధ్యాయుని స్థానమునందు శిష్యుడు యజ్ఞమునకు వెడలెను" అనుచున్నారు. ఇచట, ఉపాధ్యాయుడంతకు పూర్వము ఉండియుండనక్కరలేదు. అట్లుండదుగదా. ఉపాధ్యాయుని స్థానమున అనిన ఆతని ప్రసంగమున అని అర్థము.

"సోమస్యస్థానే పూతీక తృణాన్యభిషుణుయాత్" అని వేదమున కలదు. 'సోమలత స్థానమున పూచిక గడ్డిపరకలను అభిషవము చేయవలెను' అని అర్థము. అభిషవమనగా రసమును పిండుట. అటగూడ, సోమము సన్నిహితము కానపుడే, తత్ప్రసంగమున పూతీకతృణాభిషవమనియే అర్థము గాని సోమలత అచట అంతకుమునుపుండియుండవలెనని కాదు. అనగా స్థానశబ్దము ప్రసంగ వాచి అనుట.

సమాధానాంతర వార్తికము- "కార్య విపరిణామాద్వాసిద్ధమ్" లేదా, కార్య విపరిణామమువలన ఇది సిద్ధించును.

కార్య విపరిణామమనగా బుద్ధి విపరిణామము, బుద్ధియే మారుననుట. విపరిణామమును చెందునది బుద్ధియే కావున, కార్యశబ్దముచే దానికే గ్రహణము.

కార్యశబ్దము బుద్ధికి పర్యాయమైనయెడల, 'కార్య విపరిణామాత్' అనవలెనుగదా అనిన, "ఙ్యాపోస్సంజ్ఞా ఛందసోర్బహులమ్" (6-3-63) అను సూత్రమునందలి బహుల గ్రహణముచే హ్రస్వము వచ్చినదని గ్రహింపనగును. ఇట్లు ఔత్తరపదికములయిన హ్రస్వములు ప్రవర్తించుట కలదు.

అదియును గాక, బుద్ధి యనినను సంప్రత్యయమనినను ఒక్కటియే. 'కార్యాబుద్ధిః' 'కార్యః సంప్రత్యయః' అని అనవచ్చును. కార్య విపరిణామః= కార్యస్య=సంప్రత్యయస్య విపరిణామః అని యర్థము చేయవచ్చును.

'కార్య విపరిణామాద్వా' అను ఇది, స్థానాన్యాదేశ భావానుపపత్తి శంకకు పరిహారాంతరము అను తలంపుతోనే పఠింపబడినది. పూర్వ పరిహారమున ఉపాయముగ పఠింపబడలేదు.

బుద్ధి విపరిణామము ఉభయత్ర తుల్యమేగదా ? ఇది పరిహారాంతర మెట్లగును ?

'భూతపూర్వము' అను అర్థమున స్థానశబ్దమునకు ప్రయోగముండిన, ఇది పరిహారాంతరమగును. కాని 'సోమస్యస్థానే' ఇత్యాదులందు భూతపూర్వ భిన్నార్థముననే అది ప్రయోగింపబడినది.

భూత పూర్వమునందుగూడ స్థానశబ్దము కలదు. ఎట్లు ? అపుడది నివృత్తి వచనమగునుగాని ప్రసంగవాచి కాదే ? కాగా శబ్దముల నిత్యత్వమునకు భంగము కాదా ? అనిన,

బుద్ధిచే, స్థాన శబ్దము భూత పూర్వార్థ బోధకమగును. అది ఎట్లో చూతము -

ఒకడొకనికి, 'ఆ గ్రామమునకు తూర్పున మామిడి చెట్లుండును' అని ఉపదేశించెను. అపుడాతడు ఆ యూరికి తూర్పున ఉన్న చెట్లన్నియు మామిళ్లే యని తలంచును. తరువాత ఆ యుపదేష్ట, మరల, అందు, పాలున్నవి, ఊడలు గలవి, 'పెద్ద ఆకులు గలవియునగు చెట్లు మఱ్ఱి చెట్లు' అని చెప్పును. అపుడీతడు న్యగ్రోధములందు, ఆమ్రములను బుద్ధిని విడచి ఇవి న్యగ్రోధము లను భావమును గలిగించు కొనును. తనకు, ముందు కలిగిన 'ఆమ్రము లివి అని న్యగ్రోధము లందలి బుద్ధి నుండి, ఆమ్రములు అపకృష్టములయి అట న్యగ్రోధములు ఉపహితములై నిగ్రహించును. ఆమ్రములును, న్యగ్రోధములును తమ తమ స్థానములందు స్థిరముగనే ఉన్నవి. అట కలిగినదెల్ల బుద్ధిలో మార్పు మాత్రమే.

అట్లే ప్రకృతముననను, సాధు శబ్ద బుభుత్సువగు అధికారికి, పాణిని, 'అసభువి' అని యుపదేశించినాడు. వాని కపుడు, 'సత్త' అను అర్థమున అంతటను అసధాతువే ప్రయోగింపబడునను అభిప్రాయము కలుగును తరువాత, "అస్తేర్భూః" (2-4-52) అను సూత్రమును చూచి, అతడు ఆర్ధధాతుక

విషయమున, 'అస్తి' బుద్ధిని వదలి, 'భూ' బుద్ధిని కలిగించుకొనును పిదప ఆతడు తనకు కలిగిన 'అస్తి' బుద్ధి నుండి, ఆ 'అస్తి' అపకర్షింపబడి, అందు 'భవతి' ఉత్పాదికమయినదని గ్రహించును. అస్తియు, భవతియు, స్వస్వ విషయము లందు మార్పు లేకయే ఉండును. అవి నిత్యములే. వీని బుద్ధియే మారినది.

కాగా బుద్ధి యొక్క, అపకర్షను, ఉపధానమును, ఆమ్రము లందును న్యగ్రోధములందును ఆరోపించినట్లే, బుద్ధి గతములగు ఉత్పాద వినాశములకును, స్థానాన్యాదేశ భావమునకును, శబ్దములందు ఆరోపము చేయబడు చున్నది అని పర్యవసితము.

'ఇట్లు బుద్ధి విపరిణామ మాత్రమే స్థానాన్యాదేశ భావమయిన యెడల, ఉత్సర్గాపవాద స్థలము లందును, అపవాదమున ఉత్సర్గ కార్యములు ప్రాప్తింప వలసి వచ్చునే.' అని **"అపవాద ప్రసంగస్తు స్థాని వత్త్వాత్"** అను వార్తికము చేత నాక్షేపించి,

**వా॥ "ఉక్తంవా"** అను వార్తికము చేతను, **"సిద్ధంతు షష్ఠీ నిర్దిష్టస్య స్థాని వద్వచనాత్"** అను వార్తికముచేతను ఆ ఆక్షేపమును వార్తికకారుడు పరిహరించినాడు.

"కర్మణ్యణ్" (3-2-1),"ఆతో నుపసర్గే కః"(3-2-3) అని రెండు సూత్రములు. అందు మొదటి దానిచే, కర్మవాచక శబ్దము ఉప పదముగా ఉన్నపుడు, ధాతుమాత్రమునకు పరముగ అణ్ ప్రత్యయము విధింపబడినది. 'కుంభకారః' 'నగరకారః' మున్నగునవి ఉదాహరణములు.

రెండవది 'ఆతో నుపసర్గే కః' అనునది. అది ఉపసర్గభిన్నమయిన సుబంత ముపపదముగా ఉన్నపుడు, ఆదన్త ధాతువునకు అణ్ప్రత్యయమునకు అపవాద ముగా, కప్రత్యయమును విధించినది.

ఇట కూడ, ముందంతటను నణ్ బుద్ధిని గలిగించి, పిదప దానిని విడచి, కబుద్ధిని కలిగించుకొనవలెను అనియే గదా భావము. కావున, కప్రత్యయాంత ములందును అణ్ కార్యమగు జీప్పు ప్రాప్తమగుచున్నది. ఇదియు బుద్ధి విపరిణామ మాత్రమే గాన స్థానాన్యాదేశ భావమే యగును.

దీనికి సమాధానము ఉక్త పూర్వమని **"ఉక్తంవా"** అను వార్తికము చెప్పును.

'అ ఇ ఉణ్'- అను సూత్రమునందు, అకారము లన్నియు నొక్కటియే అను పక్షమును ఉపపాదించి, దానిపైన, 'అట్లైన అనుబంధ వర్ణ ప్రయుక్త కార్యములకు సాంకర్యము ప్రాప్తించుచున్నది. కప్రత్యయాంతమున నప్రత్యయ కార్యమును గూడ రావలసియుండును' అని సమాధానము చెప్పబడినది.

'అణ్' 'క' మున్నగు విషయములందు, ణకార కకారాది రూపము అగు వేరువేరు లింగములు నేర్పరచుటవలన, ఎచ్చట ఏ లింగముతో అకారము వచ్చరింపబడునో అచ్చట తల్లింగ ప్రయుక్త కార్యమునే యది పొందును కాని ఇతరానుబంధ కార్యమును పొందదు అది లోకవ్యవహార దృష్టము.

"సిపి గ్రామమున నున్నపుడు శిఖ గలిగి యుండుము."

"ఈ యూరిలో బోడతల గలిగి వర్తింపుము".

"గ్రామాంతరమున జటలను ధరించి తిరుగుచుండుము" అని ఇట్లొకనికి చెప్పినపుడు ఆ వ్యక్తి ఒక్కడే అయినను తత్తత్ స్థలములందు ఆయా విశేషణములను కలిగియే ఉపస్థితుడగును. కాని వాని ఆ శిఖత్వాది లింగములకు సాంకర్యము అగపడలేదు కనుక అనుబంధ సంకరము ప్రసక్తముగాదు అని అచట చెప్పబడినది. అదియే ప్రకృతమునను సమాధానమగుట.

వార్తికమునందు "వా" అనుటవలన సమాధానాంతరమును సూచితము అదియే "సిద్ధంతు షష్ఠీ నిర్దిష్టస్య స్థానివద్వచనాత్" అను తృతీయ వార్తికముచే చెప్పబడినది.

'సిద్ధంతు'='అపవాదమునందుత్సర్గ కార్యములకు స్థానివద్భావము చే ప్రసంగము కలుగును' అను దోషమునకు పరిహారము సిద్ధము. ఎట్లనగా- స్థానివత్సూత్రములోనికి 'షష్ఠీ' అను పదమును అనువర్తించి, దానికి లక్షణావృత్తిచే 'షష్ఠీ నిర్దిష్టము' అని యర్థమును వదించి, దానిని షష్ఠ్యంతముగ మార్చి, 'షష్ఠీ నిర్దిష్టమగు స్థానియందు విహితమగు ఆదేశమే స్థానివంటిదగును' అను అర్థము గ్రహింపబడును గాన ఈ దోషము ప్రసక్తముకాదు. అపవాదము షష్ఠీ నిర్దిష్టమయిన దాని స్థానములో విహితము కాదుగదా అని భావము.

అట్లయిన ఈ సూత్రమును "షష్ఠీ నిర్దిష్టస్య స్థానివదాదేశోనల్విధౌ" అని పఠింపవలెనని తాత్పర్యమా ? అనిన,

అట్లు పఠింపనక్కరలేదు "షష్ఠీ స్థానేయోగా" (1-1-49) అనుచో ప్రకృతమయిన షష్ఠీ పదము ననువర్తింపజేయవచ్చును.

లేదా- పాణిన్యాచార్యుని సూత్ర రచనా ప్రవృత్తివలన అపవాదము నందుత్సర్గ కార్యమునకు ప్రసక్తి కలుగదని జ్ఞాపితమగును. కాన నా దోషము కలుగదు- అని చెప్పవచ్చును. పాణిని, కర్త్రర్థకమగు సార్వధాతుకము పర మగునపుడు, ధాతువునకు పరముగా 'శప్' అను వికరణ ప్రత్యయమును విధించి, దాని కపవాదములుగ 'శ్యన్' 'శ్నమ్' 'శ్నా' 'శ'- 'శ్ను'- అను శకారేత్సంజ్ఞక ప్రత్యయములనే విధించియున్నాడు. అపవాదమునందు ఉత్సర్గ కార్యములు ప్రవర్తించుట ఆతనికి సమ్మతమయిన అయ్యది అవావశ్య కము. శిత్త్వ ప్రయుక్త కార్యములు శ్యన్నాద్యంతములందు స్థానివద్భావము వలననే లభింపవచ్చును గదా- పక్షాంతరా, స్థానివద్భావమనగా బుద్ధి విపరిణామ మాత్రమే యనుటలో నెట్టి దోషములును లేవని సిద్ధాంతము.

## స్థానివత్త్వ ప్రాప్త దూషణ నిరాకరణము

**వా॥ తస్యదోషస్తయాదేశ ఉభయ ప్రతిషేధః"** అని మొదట ఆక్షేప వార్తికము.

తస్య='స్థానివదాదేశః' అను లక్షణమునకు, దోషః = అతివ్యాప్తి. జాత్యేకవచనమగుటచేత నతివ్యాప్తులని అర్థము. 'సంతి' అని యధ్యాహారము కలవు. అట్టి స్థలములందు స్థానివద్భావమునకు ప్రతిషేధమును జెప్పవలసి యుండును.

అందు మొదటి దోషము,

(1) **"తయాదేశ ఉభయ ప్రతిషేధః"** అనునది. 'ఉభయే' అనునది ఉభయ శబ్ద ప్రకృతిక ప్రథమా బహువచనాంతము. ఇట నిత్య సర్వనామ సంజ్ఞ. 'సర్వాదీని' అను సూత్రముచే ప్రవర్తించినది. ఇందు ఉభశబ్ద ప్రకృతిక తయప్ ప్రత్యయము స్థానమున 'అయచ్' అను నాదేశము ప్రవర్తించినది. కాన ఇది స్థానివద్భావముచే తయబంతమయిన, "విభాషా జసి"(1-1-32) అను సూత్రముచే వైకల్పికమగు సర్వనామ సంజ్ఞ ప్రాప్తించుచున్నది. అది అని ష్టము. కావున, స్థానివద్భావ ప్రతిషేధము వక్తవ్యము అని యభి ప్రాయము.

ఉభయే (దేవమనుష్యాః) అనునది, తయప్ స్థానికాయజంతము కాదు. 'అయచ్' ఇట స్వతంత్ర ప్రత్యయము. కావున ఇది దోషము కాదనివ;

"ఉభయీ" అనుచో ఈకారము అనగా జీప్పు సిద్ధింపదే ?

పోనిమ్ము, తయబాతము కాకున్నను మాత్రజంతము కావచ్చును కాన, "టిడ్ఢాణఞ్ద్వయసచ్, దఘ్నచ్, 'మాత్రచ్' తయప్, ఠక్ ఠఞ్ కఞ్ క్వరపః" (4-1-15) అను సూత్రముచేత ఙీప్ప్రత్యయమువచ్చును.

అది యెట్లు ? ఇది మాత్రచ్ ప్రత్యయాంతము కాదు గదా ?

అందు, 'మాత్రచ్' అనగా ప్రత్యయము గాదు. అది ప్రత్యాహారము.

ఎచ్చటనున్న వానికి ప్రత్యాహారము ?

"ప్రమాణేద్వయసచ్" అను సూత్రమునందలి మాత్ర శబ్దము మొదలుకొని అయచ్ ప్రత్యయము నందలి చకారము వరకును గల ప్రత్యయముల ప్రత్యాహారము.

అటులైన డతి ప్రత్యయమును తదంతఃపాతియగును గాన 'కతి' (తిష్ఠంతి) అను డత్యంతము నందును ఙీప్పు ప్రాప్తించునే ?

ఙీబ్విధాయక సూత్రములోనికి 'అతః' అను పదమనువర్తించును గాన అదంతమగు మాత్రజంతమునకే ఙీప్పు ప్రాప్తించును. కాన ఇట తత్ప్రసంగము కలుగదు.

అట్లైనను, "తైలమాత్రా" "మృతమాత్రా" ఇత్యాదులందు మాత్ర శబ్దమున గూడ ఙీప్పురావలసి వచ్చునుగదా అనిన,

అందు 'మాత్ర' అనుదానిచే, ప్రత్యాహారసంనివిష్టమునకే గ్రహణము సదృశమయినంత మాత్రమున, తదసంనివిష్టము గ్రహింపబడదు. సాహచర్యము వలన నందు 'మాత్ర' అనునది ప్రత్యయానుకరణమే గాని ప్రాతిపదికానుకరణము గాదు.

(2) వేరొక చోటను స్థానివద్భావమున కతివ్యాప్తి కలదు గాన ప్రతిషేధము వక్తవ్యమగును.

"జాత్యాఖ్యాయామేకస్మిన్ బహువచన మన్యతరస్యామ్" (1-2-59) అను సూత్రము, ఏకత్వ సంఖ్య వివక్షితమగునపుడు ప్రాప్తించు ఏకవచన స్థానమునందు బహువచనాదేశమును, జాతి వివక్షింపబడినపుడు, విధించినది. "వ్రీహిభ్యః ఆగతః" అని యుదాహరణము 'ధాన్యము కొరకై వచ్చినాడు' అని యర్థము. ఇట నేకవచనమగు 'ఙే' ప్రత్యయ స్థానమున 'భ్యస్' అను బహువచన ప్రత్యయము వచ్చియుండుటచే, స్థాని వద్భావమువలన, "ఘేర్ఙితి" (7-3-111) అని గుణము ప్రాప్తించుచున్నది కాన, స్థానివద్భావ ప్రతిషేధము వక్తవ్యమని దోషము.

వా॥ జాత్యాఖ్యాయాం వచనాదేశే స్థానివద్భావ ప్రతిషేధః" అని ఆక్షేప వార్త్తికము.

ఇది దోషము కాదు. "అర్థాతిదేశాత్సిద్ధమ్" అని చెప్పబడియే యున్నది. ఆ సూత్రము నందలి బహువచన శబ్దము అర్థపరము గాని ప్రత్యయ పరము గాదు. అర్థమునకే అది అతిదేశము. ఏకవచన స్థానమున బహువచనాదేశము కాదు. అని సమాధానము.

(8) "జ్యాఙ్గ్రహణే అదీర్ఘః" అని దూషణ వార్త్తికాంతరము.

జ్యాఙ్గ్రహణే = 'ఙీ' 'ఆప్' ప్రత్యయములనుగా గ్రహించుట విషయమున, దీర్ఘ భిన్నమగు జ్యాబాదేశము స్థాని వంటిది కాదు. అని చెప్పవలెను అని వార్త్తికార్థము.

"హల్ జ్యాభ్యో దీర్ఘాత్ సుతిస్యపృక్తం హల్" (6-1-68) అను సులోపము, 'నిష్కౌశాంబిః' 'అతిఖట్వః' అనుచోట ప్రవర్త్తింపకుండుట ప్రయోజనము. 'నిష్క్రాంతః కౌశాంబ్యాః' అనియు, 'ఖట్వామతిక్రాంతః' అనియు అర్థము.

కౌశాంబీ ఖట్వా శబ్దము లందలి 'ఙీప్' 'టాప్' ప్రత్యయములకు, "గోస్త్రియోరుపసర్జనస్య" (1-2-48) అని హ్రస్వము వచ్చినది. దీర్ఘభిన్నాదేశమగు నీ హ్రస్వమునకు స్థానివద్భావము లేనందున, సులోపము రాలేదు.

ఈ వార్త్తికమున 'అదీర్ఘః' అను విశేషణము లేని యెడల, 'ఖట్వా' అను రూపమునందు సులోపము లేకపోయెడిది. అట, టాప్ప్రత్యయపు అకారమునకును, ప్రాతిపదిక ఆకారమునకును ఏకాదేశమగు సవర్ణ దీర్ఘమునందు ఆప్త్వమావశ్యకము గదా.

"హల్జ్యాప్" సూత్రమున 'దీర్ఘాత్' అను పదము కలదు గదా! స్థానివద్భావముచే, ఆబంతత్వాదికము వచ్చినను, 'అతిఖట్వః' 'నిష్కౌశాంబిః' అనునవి దీర్ఘాంతములు కానందున లోపాపత్తి లేదే యనిన,

అందా పదమును తీసివేయవచ్చును.

ఆ ప్రయోజనము సిద్ధించుటకు, స్థానివద్భావ ప్రతిషేధము ఉచితమా? దీర్ఘగ్రహణము ఉచితమా?

స్థానివద్భావ ప్రతిషేధమే ప్రశస్యతరము. 'అతిఖట్వాయ' 'అతిమాలాయ' అను రూపములలో "యాడాపః" (7-3-113) అను యాడాగమమును వారించుటయు దీనివలన సిద్ధించును.

సరియే, స్థానివద్భావము లేకున్నను, భూత పూర్వమగు పకార వత్త్వమును శ్రూయమాణమగు నాకారమును ఆశ్రయించిన, అట ఆకార రూపమగు అప్ కలదు గదా, యాడాగమ మేల రారాదు? అనిన,

'లక్షణ ప్రతిపదోక్తయోః ప్రతిపదోక్తస్యైవ గ్రహణమ్' అను పరిభాష వలన రాదు.

ఏమయ్యా! "జ్యాఙ్గ్రిహణే అదీర్ఘః" అను వార్తికమును రచింపకున్నను, 'నిష్కౌశామ్బిః' ఇత్యాదులందును జ్యాప్త్వము లాక్షణికమే గనుక ఈ పరిభాష ఇట ఉపస్థితముగావచ్చునే?

అనిన, కాదు. అట్లయినచో స్థానివద్భావమిక ఎచ్చటను ప్రవర్తింపనే ప్రవర్తింపదు. స్థానివదతిదేశ ప్రాప్తమెల్ల లాక్షణికమే యగునుగదా.

అట్లైన, ప్రకృత వార్తిక మవశ్య కర్తవ్యమే యగునా?

కాదు. ప్రశ్లిష్ట నిర్దేశమువలన సిద్ధించును. అనగా 'జ్యాప్' పదమునందు, జీ+ఈ=జీ, అనియు, ఆ+అప్=ఆప్ అనియు, ఈకారమును, ఆకారమును ప్రశ్లేషించి ఆ పదమా సూత్రమునందు నిర్దేశింపబడినది. కావున, ఈకారాంతమగు జీబంతముకంటె పరమగు, 'సు' తి 'సి' లకు లోపము వచ్చును. అట్లే ఆకారాంతమగు ఆప్పుకు పరమగు, వానికేలోపము కలుగుననియు అర్థము.

"యాడాపః" (7-3-113) మున్నగు సూత్రములందును నీ ప్రశ్లేషము సమ్మతము. కావున "అతిఖట్వాయ" ఇత్యాదులందును దోషములేదు. కాగా "జ్యాఙ్గ్రిహణే అదీర్ఘః" అను వార్తికము ప్రత్యాఖ్యేయము అని పర్యవసానము.

(4) వా॥ "ఆహిభువోరీట్ప్రతిషేధః" వార్తికము.

'బ్రూఞ్ వ్యక్తాయాంవాచి' అని ధాతువు దాని లట్టు స్థానమున వచ్చిన- తిప్, తస్, ఝి, సిప్, థస్- అను నయిదు ప్రత్యయములకును, క్రమముగ- ణల్, అతుస్, ఉస్, థల్, అథుస్- అను నాదేశములును, ధాతువు

నకు, వానితోపాటు ఆహ అను నాదేశమును "బ్రువః పంచానామాదిత ఆహో బ్రువః" (8-4-84) అను సూత్రముచే విధింపబడినవి.

"బ్రువఈట్" (7-3-93) అను సూత్రము, బ్రూధాతువునకు పరమగు హలాది పిత్ప్రత్యయమునకు 'ఈట్' అను ఆగమమును విధించుచున్నది. 'ఆత్థ' అను దాని లణ్మధ్యమైక వచనాంతరూపము. ఇట ఆహాదేశమునకు స్థానివద్భావము ప్రవర్తించినయెడల నీ ఈడాగమము ఇట రావలసియుండును. కావున దానిని ప్రతిషేధింపవలెను.

'అభూత్' అనునది 'అసభువి' అను ధాతువుయొక్క లుఙ్ ప్రథమైక వచనాంతము. "అస్తేర్భూః" (2-4-52) అను సూత్రముచేత అస్ అనుదానికి 'భూ' ఆదేశము. దానికి స్థానివద్భావముచేత అస్ అను బుద్ధికలుగుటవలన "అస్తిసిచోఽపృక్తే" (7-3-96) అను శాస్త్రముచే 'ఆసీత్' అను స్థలమునందు వలె నిటను నీడాగమము ప్రాప్తించుచున్నది. తత్ప్రతిషేధమును వక్తవ్యము. ఇవి స్థానివద్భావ దోషములు. కాని, ఆహ విషయమున నీ ప్రతిషేధము వక్తవ్యముకాదు. 'ఆత్థ' అనుచోట నీడాగమము రాదని పాణిన్యాచార్య ప్రవృత్తి జ్ఞాపనచేయును. ఈతడు ఝలాది ప్రకరణమునందు గదా "ఆహస్థః" (8-2-35) అని థత్వమును విధించినది. ఈడాగమము వచ్చిన, ఝల్పరత్వము సంభవింపదు గాన నది వ్యర్థమే యగును.

ఈ జ్ఞాపకము కుదురదు. థత్వ విధానమునకు ఫలాంతరము గలదు. అదియేమి ? అనిన, భూత పూర్వగత్యాశ్రయణము. భూతపూర్వమగు ఝలాది ప్రత్యయము పరమగునపుడని యర్థము. ణలాదు లయిదింటిలో నట్టిది 'థల్' ఒకటియే యగును. అనిన,

కాదు అపుడు థవచనమే అనర్థకమయ్యెడిది. "బ్రువః పంచానామాదిత ఆథోబ్రువః" అని ఈతడు 'ఆథ్' అను నాదేశమునే యుచ్చరించి యుండును గదా. తిబాదులయిదును ఝలాదులే గావున ణలాదులయిదును భూతపూర్వ ఝలాదులే యగును కావున భూతపూర్వ గత్యాశ్రయణ మది సార్థకము గాదు. కాగా జ్ఞాపకము సుస్థమే.

ఇక భవతికి గూడ ఈప్రతిషేధము వక్తవ్యముగాదు. "అస్తి సిచోఽపృక్తే" (7-3-96) అని ద్విసకారక నిర్దేశము పాణినిచే జేయబడినది. కాగా సకారాంతమగు అసధాతువుకంటె పరమయిన అపృక్త హల్లునకు ఈడాగమ మని యర్థము. 'అభూత్' అను స్థలమున స్థానివద్భావముచే అస్తిత్వము లభించినను, భవతికి సకారాంతత్వము లేదు గాన దోషములేదు.

(5) వా॥ "వధ్యాదేశే వృద్ధి తత్వ ప్రతిషేధః" ఆ॥ వా॥ హనధాతువునకు 'వధ' అను ఆదేశము వచ్చినపుడు స్థానివద్భావముచేత అంగసంజ్ఞ కలిగి, "అత ఉపధాయాః" (7-2-116) అనివృద్ధియు "హనస్తోఽచిణ్ణలోః" (7-3-32) అని తకారాదేశమును ప్రాప్తించుచున్నవి. వానిని ప్రతిషేధింపవలసి యున్నది అని యాక్షేపము. 'వధకమ్ పుష్కరమ్' అనునది లక్ష్యము.

ఇట 'అక' అనునది ణ్వుల్ప్రత్యయముగాదు. 'రుచకః' అను పదమునందువలె నిది ఔణాదికమగు క్వున్ప్రత్యయముయొక్క అకాదేశము. కావున ఇది ణిత్తుకాదు. వృద్ధితత్వములకు ప్రాప్తియే లేదు. కాగా ఇది దోషముకాదు అని సమాధానము.

(6) వా॥ "ఇడ్విధిశ్చ" 'ఇడాగమము విధేయమగును' అని ఈ ఆక్షేప వార్తికమున కర్థము యథాశ్రుతముగ స్ఫురించును. ఇది స్థానివద్భావ నిషేధ ప్రకరణమగుటచే ఆ అర్థము ప్రకరణాననుగుణము. కావున, ఇడాగమ విధి సిద్ధించుటకు వీలుగ, దాని నిషేధ విషయమునందు స్థానివద్భావ ప్రతిషేధము వక్తవ్యమగునని యర్థము.

'అవధిషీష్ట' అను రూపము, ఆఙ్ పూర్వకమగు హన ధాతువునకు, ఆశీర్లిఙ్ఙునందు ప్రథమైకవచనాంతము.

"హనోవధలిఙి" (2-4-42) అను సూత్రముచే వధాదేశము. ఈ ధాతువుపదేశమున ఏకాచ్చును అనుదాత్తమును అయియున్నది. తదాదేశమగు 'వధ' స్థానివద్భావము చేత అంగ సంజ్ఞ కలది యగును గాన, "ఏకాచ ఉపదేశేనుదాత్తాత్" అని ఇడాగమ ప్రతిషేధము ప్రాప్తించుచున్నది. ఇడాగమ నిషేధ రూపమగు కార్యము కర్తవ్యమగునపుడు స్థానివద్భావమును ప్రతిషేధించి అంగ సంజ్ఞను వారించుటవలన ఇడాగమము సిద్ధించును. 'సీష్ట' అనునది వలాద్యార్ధధాతుకము. "ఆఙోయమహనః" (1-3-28) అని ఆత్మనేపదము.

ఈ దోషము ప్రసక్తము గాదని సమాధానము. ఏలయన, వధాదేశమున కాద్యుదాత్త నిపాతనము చేయబడును. ఆ నిపాతన స్వరము ప్రకృతి స్వరమునకు, అనగా స్థాన్యనురూపముగ ప్రాప్తించు ప్రకృతి ప్రయుక్తమగు అనుదాత్తత్వమునకు బాధకమగును.

ఇట ఈ నిపాతన స్వరము ప్రకృతి స్వరమును బాధించినట్లే ప్రత్యయ ప్రయుక్త స్వరమగు శేష నిఘాతను గూడ బాధింపవలసి వచ్చుచున్నది. దానిని వారించుటకు, ఉపదేశివద్భావము గూడ వక్తవ్యమగునని ప్రత్యాఖ్యానము.

"ఇది దోషము గాదు. ఆర్ధధాతుకీయములు సామాన్యముగ. ప్రత్యయము లవస్థితములు కానపుడే ప్రవర్తించుచుండును. 'ఆర్ధధాతుకే' అను సప్తమియు, 'లిజి' అను సప్తమియు, విషయ సప్తములు గాని పర సప్తములు గావు. కావున ఆర్ధధాతుకార విహిత కార్యములు, ఆర్ధధాతుక ప్రత్యయ ప్రవృత్తికి పూర్వమే, తద్విషయతా సత్తను పురస్కరించుకొని ప్రవర్తించును.

కాబట్టి, ముందే, వధాదేశము ప్రవర్తించి, ఆద్యుదాత్త నిపాతనము సిద్ధించును గాన ఉపదేశివద్భావ వచన గౌరవము కలుగదు. స్థానివద్భావము చేత అంగ సంజ్ఞ కలిగినను, స్థాన్యుపదేశమున ఇది అనుదాత్తమయినను, ఆదేశోపదేశమున, ఆద్యుదాత్తమగుటవలన, ఉపదేశత్వావచ్ఛేదమున ననగా సకలోపదేశములందును, అనుదాత్తము కానందున, "ఏకాచ ఉపదేశేఽనుదాత్తాత్" (7-2-10) అను ఇడాగమ నిషేధము ప్రాప్తింపదు కాగా స్థానివత్త్వ ప్రతిషేధము అనావశ్యకమని భావము.

(7) వా॥ "ఆకారాంతాన్నుక్ షుక్ ప్రతిషేధః" ఆ ॥వా॥ 'లీ' 'లిఙ్' ధాతువుల ణ్యంతరూపము 'లాపయతి' అనునది.

"విభాషాలీయతేః" (6-1-51) అను సూత్రముచేత, 'ణిచ్చు' పరమగునపుడు ధాతువునకు ఆత్వము, ఆత్వానంతరము, 'లా' అనునది స్థానివద్భావముచేత 'లీ' గా గ్రహింపబడును కాన, "లీలోర్నుగ్లుకావన్య తరస్యామ్ స్నేహవిపాతనే" (7-3-39) అను సూత్రముచేత నుగాగమము ప్రాప్తించుచున్నది.

"ఞి భీ భయే" అను ధాతువునకు ణిచ్చు పరమగునపుడు, "భిభేతేర్హేతుభయే" (6-1-56) అను సూత్రముచేత ఆత్వము వచ్చిన పిదప "భియోహేతుభయేషుక్" (7-3-40) అని షుగాగమము, 'భాపయతే' అను రూపమునందు ప్రాప్తించుచున్నది.

కావున స్థానివద్భావ ప్రతిషేధము వక్తవ్యమగుచున్నది అని యాక్షేపము.

'లీ' 'భీ' ల ప్రశ్లిష్ట నిర్దేశము వలన ఇది సిద్ధించును కాన దోషము కాదు.

నుగాగమ షుగాగమ విధాయకములగు సూత్రములందు, ల భ అనునవి, ప్రశ్లిష్టములగు ఈకారములతో, లీ+ఈ=లీ, భీ+ఈ=భీ, అని నిర్దేశింపబడినవి. కావున, ఈకారాంతములగు 'లీ' 'భీ' లకే, పై ఆగమముల

ప్రాప్తి గాని ఆకారాంతముల కది కలుగదు. కావున నిషేధ మనావశ్యకము.

(8) "**లోడాదేశే, శాభావ, జభావ, ధిత్వ, హిలోప, ఏత్వ ప్రతిషేధః**"— అని ఆక్షేపాంతర వార్తికము.

'**శిష్టాత్**' = అనునది శాసు అనుశిష్టౌ అను ధాతువు లోణ్మధ్యమైకవచనాంతము. హిస్థానమున తాతజాదేశము.

'**హతాత్**'=అను రూపము "**హన హింసాగత్యోః**" అను ధాతువు లోణ్మధ్యమము.

'**భింత త్**'= '**భిదిర్ విదారణే**' లో॥మ॥ఏ॥

'**కురుతాత్**'=డుకృఞ్ కరణే ,,

'**స్తాత్**' = '**అసభువి**' ,,

"'**శాధి**' '**జహి**' '**భిన్ధి**' '**కురు**' '**ఏధి**' అనునవి హ్యంతములు. పై రూపములందు '**హి**' స్థానమున, '**భిన్ధి**' అనుచో ధి భావమును, '**కురు**' అనుచో లోపమును, ఏధి అను స్థలమునను ధిభావమును ప్రవర్తించినవి. శా భావము, జ భావము, ఏత్వమును హి నిమిత్తకములు, హ్యంతములందువలె తాతజంతము అందును, స్థానివద్భావము చే "శాహి" (6-4-35), "హంతేర్జః" (6-4-36) "హుఝల్భ్యోహేర్ధిః" (6-4-101), "ఉతశ్చ ప్రత్యయాదసంయోగ పూర్వాత్" (6-4-106), ఘ్వసోరేద్ధావభ్యాసలోపశ్చ" (6-4-119) అను సూత్రములచే, క్రమముగ ప్రాప్తములయిన. '**శా**' ఆదేశము, '**జ**' ఆదేశము, '**ధి**' ఆదేశము, హిలోపము, ఏత్వమును వారణీయములు. కావున వానికి ప్రతిషేధము వక్తవ్యమగు చున్నది. అది స్థానివద్భావ కృతాతిప్రసంగము అని ఆక్షేప తాత్పర్యము.

కాని, పై లక్ష్యములందు లోడాదేశము ముందు ప్రవర్తింపవలెనా? లేక ఈ ఆదేశములా ముందు ప్రవర్తింపవలసినవి? అని సంప్రధారణము చేయవలెను. చేయగా, పరత్వమువలన లోడాదేశమే అని తేలును. విప్రతిషేధ సూత్ర ప్రవృత్తికి అవశ్యకమగునది, స్వ, స్వనిమిత్తములకు ఆనంతర్యము లేకుండుట అను అసంభవము. రెండును ఒక్కసారి ప్రవర్తించిన అట్టి అసంభవము సంభవి. తాతజాదేశమునకు స్థానివద్భావము చేసిన, ఆయానంతర్యము సుసంపాదమగును గదా అనిన, కార్య ప్రవృత్త్యుత్తరముగదా స్థానివద్భావము, ప్రవృత్తికాలికమగు యుగపదసంభవము అపరిహార్యమే కాగా స్థానివదతిదేశ ప్రయుక్తమగు అతివ్యాప్తి ఇట లేదని పరిహారము.

పోనిమ్ము. లోడాదేశము ముందు ప్రవర్తించినను, పునః ప్రసంగ విజ్ఞానముచే ఈ కార్యములు ఏల ప్రాప్తింపవు ? అనిన, "సకృద్గతౌ విప్రతిషేధే యద్బాధితం తద్బాధితమేవ" అను న్యాయముచే, ఇవి మరల ప్రాప్తింపవు. ఒక పర్యాయము బాధితములయినవి ఇక బాధితములే అగునని భావము.

(9) వా॥ "త్రయాదేశే స్రంతస్య ప్రతిషేధః" ఆ ॥వా॥ స్రంతమయిన తిసృ మున్నగు దానికి స్థాని వద్భావము త్రయాదేశ విషయమున రాదని చెప్పవలసి యుండును. త్రి శబ్దమునకు, స్త్రీ లింగమున షష్ఠీ బహువచనాంత రూపము "తిసృణామ్" అనునది, త్రి+ఆమ్ అను నవస్థలో "త్రిచతురోః స్త్రియాం తిసృచతసృ" (7-2-99) అను సూత్రముచే 'తిసృ' అనునది ఆదేశము. దీని యందు స్థాని వద్భావముచే త్రిబుద్ధి కలుగును గాన "త్రేస్త్రయః" (7-1-53) అను సూత్రముచే, 'త్రయ' అను ఆదేశము ప్రాప్తించుచున్నది. కావున, ప్రతిషేధము ఆవశ్యకమగునని ఆక్షేపము.

కాని ఇదియు దోషముగాదు. ఇచట గూడ, తిసృభావ మాత్ర యాదేశమా ప్రథమ ప్రవర్తనీయమని సంప్రధారణము చేసినపుడు, పరత్వము వలన తిసృభావమే ప్రథమ ప్రవర్త్యమని తేలును.

పునః ప్రసంగ విజ్ఞానముచే, తిసృభావానంతరము మరల త్రయాదేశము ఎందులకు రాదు ?

"సకృద్గతౌ విప్రతిషేధేయద్బాధితం తద్బాధితమేవ" కనుక రాదు.

(10) వా॥ "అమ్విధౌ చ" అని ఆక్షేప వార్తికము.

అమ్విధి విషయమునను, స్రంతమునకు ప్రతిషేధము వక్తవ్యము. అమ్విధి అనగా, "చతురనడుహోరాముదాత్తః" (7-1-98) అను సూత్రముచే విధింపబడిన 'ఆమ్' అను ఆగమము.

'చత్వారః' అనునది ఉదాహరణము.

'చతస్రస్తిష్ఠంతి' అనుచోట గూడ, 'చతసృ' అను ఆదేశము స్థాని వద్భావము చేత 'చతుర్' వంటి దగును కాన, ఈ ఆగమము రావలసి వచ్చుచున్నది. అది స్థాని వద్భావదోషము.

ఇదియు దోషము కాదు. ముందుగ చతసృ భావమా ? ఆమాగమమా కర్తవ్యమని సంప్రధారణము చేసిన, పరత్వము వలన చతసృ భావమే

ప్రవర్తించునని తెలును కాన నిక ఆమాగమమునకు ప్రాప్తియేలేదు. స్థానివద్భావప్రతిషేధము తో పనిలేదు అని సమాధానము.

చతస్ృ భావానంతరము పునః ప్రసంగ న్యాయముచే ఆమ్ ఎందు వలన రాదు ?

"సకృద్గతౌ విప్రతిషేధే యద్బాధితం తద్బాధితమేవ" తుల్య బలముల విరోధము నందు ఒక సారి బాధితమయినది మరల ప్రవర్తింపదు, కనుక దోషము లేదనుట.

## (11) వా॥ "స్వరే వస్వాదేశే" ఆక్షేప వార్తికము.

స్వర విషయమున, 'వసు' అను నాదేశమునకు, స్థానివద్భావ ప్రతిషేధము వక్తవ్యమగును అని వార్తికార్థము.

'విదుషఃపశ్య'— అను వాక్యమునందలి 'విదుషః' అను విద్వచ్ఛబ్ద ద్వితీయా బహువచనాంత రూపమునందు, విద ధాతువునకు పరమయిన 'శతృ' అను ప్రత్యయము స్థానమునందు, "విదేశ్శతుర్వసుః" (7-1-36) అను సూత్రముచే వస్వాదేశము.

"శతురనుమోనద్యజాదీ" (6-1-173) అనునది యొక స్వర సూత్రము. నుమాగమ రహితమయిన శతృప్రత్యయాంతము కంటె పరమగు 'నదీ' యు, అజాది అగు శసాది విభక్తియు ఉదాత్తమగునని దాని అర్థము. ఆ స్వరము ఇచట ప్రవర్తించుట సమ్మతము కాదు. స్థానివద్భావము చేత వస్వంతము శత్రంతమగుట వలన ప్రాప్తించుచున్నది. అందువలన ప్రతిషేధము వక్తవ్యము అని యాక్షేపము.

ఆస్వరము ప్రాప్తింపదు కాన ఇది దోషము కాదని పరిహారము. ఎట్లు ? 'అనుమః' అని అది నిషేధింపబడినది గదా ?

అది యెట్లు ? ఇట నుమ్మ లేదే ?

'అనుమః' అనిన నుమాగమ రహితమని అర్థముగాదు. మరి యేమి ? అది ప్రత్యాహార గ్రహణము. 'ఉమ్' అని ప్రత్యాహారము.

ఎచ్చట ఉన్న వానికి అది ప్రత్యాహారము ?

"తనాదికృఞ్భ్యఉః" (3-1-79) అను సూత్రము నందలి ఉకారము మొదలు నుమాగమ మకారము వరకును.

ప్రత్యాహార గ్రహణమయిన యెడల, 'శ్నా' ప్రత్యయమును అందంత ర్భూతముగాన, 'లునతా' 'పునతా' అను స్థలములందును నిషేధము స్వరము నకు ప్రాప్తించువే అనిన,

'అనుమ్' అనునది శత్రంతమునకు విశేషణము కాదు. మరి దేనికి? శతృ ప్రత్యయమునకే విశేషణము. 'ఉమ్రహితమగు శతృ ప్రత్యయము అంతమందు కల దానికంటే బరమయిన, అని అర్థము. ఇట 'శ్నా' ప్రత్య యమునకు చేయబడలేదు కాన నది ఉమ్రహితమే యగును. కావున దోషము లేదు.

నుమ్ అను పదముచే నుమాగమము గ్రహింపబడిన 'ముంచతా' 'ముంచతః' అను లక్ష్యము లందు ఈ స్వరము ప్రవర్తించకపోవును. శత్రంత మట నుమ్యుక్తము గదా! కనుక ఆగమాంతము నందైనను శతృ ప్రత్యయమే విశేషణీయము గాన, ప్రత్యాహార పక్షమునను అదియే విశేషింపబడునని తాత్పర్యము.

కావున ఈ ఆక్షేపము పరిహృతము.

**వా॥ "గోఃపూర్వణిత్త్వాత్వస్వరేషు"— ఆక్షేప వార్తికము.**

గో శబ్దమునకు, పూర్వత్వము = పూర్వరూపము, ణిద్వద్భావము, ఆత్వము, స్వరము—దీని విషయమున స్థానివద్భావ ప్రాప్తి దోషము. కావున దానికి ప్రతిషేధము వక్తవ్యము. చిత్రగు+అగ్రమ్ 'చిత్రగ్వగ్రమ్', 'శబలగ్వగ్రమ్' అను స్థలములందు యణాదేశమే ప్రవర్తించినది గాని, గో+ అగ్రమ్=గవాగ్రమ్, గో అగ్రమ్, గోగ్రమ్ అని, అవఙ్ ప్రకృతి భావ పూర్వ రూపములచే రూపత్రయము నిష్పన్నమయినట్లు ఇట రూపత్రయము కాలేదు.

చిత్రగో శబ్దమునందు, "గోస్త్రియోరుపసర్జనస్య" (1-2-48) అను సూత్రముచే, హ్రస్వము ప్రవర్తించినది. 'చిత్రగు' అనున పిమ్మట నిదియు స్థానివద్భావముచే గో శబ్దాంతమగును గాన, "సర్వత్ర విభాషా గోః"(6-1-122) అని ప్రకృతి భావమును, "అవఙ్ స్ఫోటాయనస్య (6-1-123) అని అవఙాదేశమును, అవి వైకల్పికములగుటచే తదభావ పక్షమున "ఏఙః పదాంతాదతి" (6-1-109) అని పూర్వ రూపమును ప్రాప్తించుచున్నవి. వార్తికమున, పూర్వత్వమనగా, లక్షణ చేత పూర్వ రూపాపవాదములగు ప్రకృతి భావావఙాదేశములును గ్రాహ్యములు. కావున స్థానివద్భావమునకు ప్రతిషేధము వక్తవ్యమగునని యాక్షేప భావము.

సమాధానము — 'ఏజః అను పదమిందనువర్తించును. అందువలన నిది ఏజ్ రూపాలాశ్రయ విధి యగును. 'అనల్విధౌ' అనియే నిషేధము సిద్ధించును.'

కాని యీ సమాధానముతో నాక్షేపము నిరస్తము గాదు. ఎందువలన "నన, వైచిత్రగో+అగ్రమ్" అను స్థలమున నేజంతత్వము స్వతస్సిద్ధముగాన నట స్థాన్యలాశ్రయణములేదు. ఆ నిషేధము ప్రవర్తింపదు. దోషము తదవస్థము. అందువలన, తత్ప్రతిషేధవచనము తప్పదు.

### ణిత్వమును, ఆత్వమును

"గోతోణిత్" (7-1-90) అను సూత్రమువలన, గో శబ్దము కంటె పరములగు సర్వనామ స్థాన ప్రత్యయములకు ణిత్త్వమును, "అచోఞ్ణితి" (7-2-115) అని వృద్ధియు, 'గౌః గావౌ గావః'— అను రూపములలో ప్రవర్తించినవి. "ఔతోమ్శసోః" (6-1-98) అను సూత్రమునకు బదులు. "ఆగోతోమ్శసోః" అను న్యాసము షష్ఠాధ్యాయమున వార్తికకారునిచే ఆదరింపబడినది. ఆ సూత్రము, 'అమ్' 'శస్' ప్రత్యయములు పరములగునపుడు ఆత్వమును విధించునది. 'గామ్' 'గాః' ఉదాహరణములు. ఈ ణిత్వాత్వములు 'చిత్రగుః' మున్నగు చోట్లను, 'చిత్రగుమ్' 'పశ్య' అను స్థలమునందుమ ప్రాప్తించుచున్నవి. కావున స్థానివత్త్వ ప్రతిషేధము ఆవశ్యకమని ఆక్షేప తాత్పర్యము.

సమాధానము— ఆ సూత్రములందు తపరకరణము నిష్ఫలము గాన, తత్సామర్థ్యము వలన 'గోతః' అను పదమునందలి గకారమవివక్షితము, కాగా నవి యలాశ్రయ విధులగుటచే, 'అనల్విధౌ' అను నిషేధమువలన స్థానివద్భావము ప్రవర్తింపదు. దోషములేదు.

స్వరము— 'బహుగుమాన్' అనునది మతుబంతము. అనేక గోవులు గల వ్యక్తిగల ప్రదేశము అని యర్థము. "హ్రస్వ నుడ్భ్యాం మతుప్"(6-1-176) అని యొక సూత్రము. అంతోదాత్తమగు హ్రస్వాంత ప్రకృతి కంటెను, నుడాగమము కంటెను బరమగు మతుప్ ప్రత్యయము ఉదాత్తమగునని దాని అర్థము. 'బహుగుమాన్' అను స్థలమున, ఆ సూత్రముచే మతుబుదాత్తత్వము సిద్ధింపవలెను. "నగోశ్వన్ని" త్యాది సూత్రముచేత(6-1-182) అయ్యది నిషేధింపబడుచున్నది. అట ఓకారమునకు ఉపసర్జనహ్రస్వము వచ్చినది. దానికి స్థానివద్భావముచే నిషేధము ప్రాప్తించుచున్నది. గోత్వము అల్ధర్మము కావందున 'అనల్విధౌ' అను నిషేధము ప్రవర్తింపదు. కాగా 'బహుగుమాన్' అను రూపమునందు, 'నగోశ్వన్నిత్యా'ది సూత్రముచేత ప్రాప్తమయిన మతు

బుదాత్తత్వ ప్రతిషేధమును వారించుటకు స్వర విషయమున మాత్రము, గోశబ్దమునకు స్థాని వత్త్వ ప్రతిషేధ మావశ్యకము.

(13) వా॥ "కరోతిపిబతోః ప్రతిషేధః"— ఇది చివరి యాక్షేపము.

'కురు' 'పిబ' అను రూపములలో, స్థానివద్భావము వలన అంగ సంజ్ఞ కలిగిన పిదప లఘూపదమునకు గుణము ప్రాప్తించుచున్నది. అది దోషము అని ఆక్షేపము — వా॥ "ఉత్తంవా" అను వార్తికముచే నది సమాహితము.

అత ఉదితి సూత్రమునందు తపరకరణమువలన కరోతి యందును, 'పిబ' అదంతాదేశమగుట వలనను, లఘూపధ గుణాపత్తి రూప స్థానివద్భావ ప్రయుక్త దోషము ప్రాప్తింపదని పూర్వమే చెప్పబడినది అని సమాధానము॥

"స్థాని వదాదేశో నల్విధౌ" అను సూత్రము వివర్తము ముగిసినది॥

## "అచః పరస్మిన్ పూర్వవిధౌ" (1-1-56)

'స్థానివత్' 'ఆదేశః' అను రెండు పదములును, పూర్వసూత్రమునుండి ఇందనువర్తించును. 'పరస్మిన్ అచః ఆదేశః పూర్వవిధౌ స్థానివద్భవతి' అని అన్వయము.

"పరముగ ఉన్నదానిని నిమిత్తముగ ఆశ్రయించి, అచ్చు స్థానమున వచ్చిన ఆదేశము, ఆ అచ్చునకు ముందున్నదానికి శాస్త్రీయ కార్యములు కర్తవ్యములగునపుడు, అవి అల్విధులయినను, స్థానివంటిదగును" అని సూత్రార్థము.

## ఇక పదకృత్య విచారము

ఇందు, 'అచః' అను పదమునకు, ప్రయోజనమేమి ? అని ప్రశ్న. అది లేనిచో, 'ప్రశ్నః' 'విశ్నః' అను స్థలములందును, 'ద్యూత్వా' 'స్యూత్వా'- అను రూపములందును. 'అక్రాక్షామ్' అనుచోటను, 'ఆగత్య' అను లత్యము నందును, అనిష్టములగు కార్యములు ప్రవర్తింపవలసి వచ్చును.

ప్రశ్న విశ్న శబ్దములందు, 'ప్రచ్ఛ' 'విచ్ఛ' అను ధాతువులకు, భావార్థమున, 'నఙ్' అను ప్రత్యయము వచ్చినది.

ప్రచ్+న—అను అవస్థలో "ఛ్వోః శూడనునాసికేచ" (6-4-19) అను సూత్రముచే ఛకారము స్థానమున శకారము ఆదేశము. దీనికి నిమిత్తము, పర మయిన అనునాసిక వర్ణమగు నకారము. కావున ఇది పరనిమిత్తకాదేశము. దానికి పూర్వమున ఉన్నది అకారము 'ప్రచ్'లో ఇకారము. ఛకార స్థానిక శకారమునకీ సూత్రముచే స్థానివద్భావము ప్రవర్తించిన, "ఛేచ" (6-1-73) అను సూత్రముచేత,అకార ఇకారములకు తుగాగమము రావలసివచ్చును.'అచః' పదము సూత్రమున ఉన్న, శాదేశము అజాదేశము కాదుగాన ఆ దోషము కలు గదు అని 'అచః' అనుదాని కృత్యము.

కాని 'అచః' అను పదమునకు ఇది అనన్యథాసిద్ధమగు ప్రయోజనము కాదు. ఛకారస్థానమున శకారాదేశము ప్రవర్తించుటకు పూర్వమే, అంతరంగ త్వమువలన అట తుగాగమము ప్రాప్తించుచున్నది. కావున, తదభావ విష యమున యత్నము ఆవశ్యకము. ఆ యత్నము సూత్రమునందే చేయబడి యున్నది. అది తుక్సహిత నిర్దేశము తుగాగమ విశిష్టమగు ఛకారమునకే శకా రాదేశమగునని అర్థము కాగా ఈ ప్రయోజనమునకు అచ్ పదమక్కరలేదని భావము.

**'ద్యూత్వా', 'స్యూత్వా'-** అనునపుడు ప్రయోజనమందుము. 'దివ్+ త్వా' 'సివ్+త్వా' అనుచోట, ఛ్వోరితి సూత్రముచే వకారమునకు 'ఊఠ్' అను నాదేశము. తరువాత యణాదేశము. ఆ ఊఠాదేశమునకు ఇపుడు స్థానివద్భా వము వచ్చిన, అచ్స్వరత్వముండదుగాన యణాదేశము రాకపోవును. 'అచః' అను పదము ఉండుటవలన, ఆదేశము అచ్ స్థానికము కాదు గాన దోషము లేదు.

కాని ఊఠాదేశమునకు స్థానివద్భావముచే హల్త్వము కలిగినను, స్వాశ్రయమగు అచ్త్వము నివర్తింపదు గాన యణాదేశమునకు ప్రతిబంధము కలుగదు కాన ఇదియు ప్రయోజనముకాదు. అయోగవాహములందు, అచ్త్వ హల్త్వములకు సమావేశము దృష్టము. కావున వానికి విరోధములేదు.

ఇంకొక విధముగ గూడ ఇది ప్రయోజనముకాదు. ఇట ఆదేశ మొకటి. పూర్వ విధిలో ఆశ్రయింపబడినది వేరొకటి. ఆదేశము, 'ఊఠ్' అను ఊకార ఠకార సముదాయము. అదియు ణాదేశవిధిలో ఆశ్రితముగాదు. ఊకారమాత్రమే అందు ఆశ్రయింపబడినది. అది ఆదేశము కాదాయె. యణా దేశ మాదేశావయవ ప్రయుక్తముగాని, ఆదేశప్రయుక్తముకాదు గాన అది వారింపబడదనుట.

అట్లైన 'ఆక్రాష్టామ్' అనునది ప్రయోజనమగును. ఆక్రామ్+స్+ తామ్. "ఝలోఝలి" (8-2-26) అని సకారలోపము. ష్టుత్వము. ఇట ణాదేశ

మగు లోపమునకు స్థానివద్భావము ప్రవర్తించిన, "షఢోఃకస్సి" (8-2-41) అను సూత్రముచే షకారమునకు కత్వము రావలసివచ్చును. లోపమజాదేశముకాదు గాన ఆయాపత్తి కలుగదని, సూత్రమున అచ్పదముండిన సిద్ధించును.

కాని ఇయ్యదియు ప్రయోజనముకాదు. ఈ సూత్రముననే ముందు, "పూర్వత్రాసిద్ధే నస్థానివత్" అని చెప్పబడును. త్రిపాదిస్థమగు కార్యము కర్తవ్యమయినపుడు స్థానివద్భావ మీ సూత్రముచే ప్రవర్తింపదని అర్థము షఢో రితికత్వము త్రిపాదిస్థ కార్యముగదా.

అటులైన, పరిహారాంతరములేని ప్రయోజనములు, 'ఆగత్య' 'అధిగత్య' అనునవి. ఆగమ్+య. ఇది ల్యబంతము. అనునాసికమగు మకారమునకు "వాల్యపి" (6-4-38) అను సూత్రముచే లోపము. తరువాత పిత్ కృన్ని మిత్తకమగు తుగాగమము అది పూర్వవిధి. లోపము పరనిమిత్తకాదేశము. దానికి స్థానివద్భావము కలిగినయెడల, "హ్రస్వస్య పితికృతితుక్" (6-1-71) అని తుగాగమము ప్రాప్తింపకపోవును. మకార లోపమునకు తుగ్విధిలో ఆశ్రయణమెట్లు చెప్పవలెను? అనిన అది హ్రస్వమునకు ప్రత్యయ పరత్వమును సంపాదించునది గాన ఆ విధమున అదియు ఆశ్రితమగును.

'అచఃపరస్మిన్' అను ఈ సూత్రమునకు, 'స్థాని ఉన్నపుడు ప్రవర్తించు కార్య మాదేశమున్నపుడు నుండును' అనియు, స్థాని ఉన్నప్పుడు ప్రాప్తింపని కార్యము. ఆదేశావస్థ యందును ప్రవర్తింపదు అనియు అర్థము. భావాభావ ములు రెండును అతిదేశింపబడుననుట. అజ్గ్రహణ ప్రయోజన మభావాతిదేశ మున ఉపపన్నమగును.

ఇక 'పరస్మిన్' అనునది యెందులకు?

"యువజానిః ॥ వధూజానిః॥ ద్విపదికా॥ వైయాఘ్రపద్యః॥ అదీధ్యే" ఇవి సిద్ధించుటకు.

"యువజానిః" "వధూజానిః" అనుచోట "జాయాయానిఙ్" (5-4-114) అను నిఙాదేశము పర నిమిత్తకము కాదు. అది ఆకార స్థానమున వచ్చిన పిదప, "లోపోర్వ్యోర్వలి" (6-1-66) అను సూత్రముచే యకారలోపము. ఇట నిఙా దేశమునకు స్థానివద్భావము వచ్చిన యెడల లోపము సిద్ధింపదు. 'పరస్మిన్' అను పదమువలన, పరనిమిత్త కాజాదేశమునకే స్థానివద్భావము గాన ఈ నిఙా దేశము పరనిమిత్తకము కానందున దోషములేదు॥

కాని ఇది ప్రయోజనము కాదు. నకారమునందు స్వాశ్రయమగు వల్త్వము ఉండును గాన దోషములేదు,

లేదా- ఇట ఆదేశము నిజ్ అను సముదాయమును, యలోప విధియం దాశ్రయమాణము నకార మాత్రమును కానను దోషము లేదు.

అట్లైన, 'ద్విపదికా' 'త్రిపదికా' - అను నివి కావచ్చును.

ద్వౌ ద్వౌపాదౌ దదాతి = ద్విపదికా। రెండు రెండు చతుర్థాంశములను నిచ్చుచున్నాడని యర్థము. "తద్ధితార్థో త్తర పదసమాహారేచ" (2-1-51) అని సమాసము. "పాదశతస్య సంఖ్యాదేర్వీప్సాయాంవున్‌లోపశ్చ" (5-4-1) అను సూత్రముచే వున్ప్రత్యయము.ద్విపాద+అక అను స్థితిలో పాదశబ్దాకారమునకు లోపము గూడ ఈ సూత్రముచేతనే వచ్చును. తరువాత "పాదఃపత్" (6-4-130) అను సూత్రముచే పదాదేశము. ఈ వున్ప్రత్యయాంతము స్త్రీ లింగము. "ప్రత్యయ స్థాత్" అని ఇత్వము. ఇట అకార లోపమునకు స్థానివద్భావము ప్రవర్తించు నెడల, పదాదేశము సిద్ధింపదు. లోపము పర నిమిత్తకము కాదు కావున స్థానివద్భావములేదు. అది సిద్ధించును.

'పరస్మిన్' అను పదము సూత్రమున లేకున్నను నిచట దోషములేదు. ఏలయన, పాదశతస్య అను సూత్రమున లోప విధానము స్థానివద్భావ నిషేధమునకే సంశర్థితము. 'ఆ అకారమునకు లోపమేగాని, కార్యములందు దానికి ఆశ్రయణముండదు'- అను ఆశయముతోడనే లోపము విధింపబడినది. లేనిచో, "యస్యేతిచ" (6-4-148) అనియే లోపము సిద్ధింపవచ్చును గదా !

పోనిమ్ము, "వైయాఘ్రపద్యః" అనునది ప్రయోజనమగును. వ్యాఘ్రము యొక్క పాదముల వంటి పాదములు కలవాడు=వ్యాఘ్రపాత్। అతని అపత్యము వైయాఘ్రపద్యుడు. అది గర్గాదియఞంతము. 'నయ్వాభ్యాం' అని ఐజాగమము. పదాదేశము. అంతకు పూర్వము, "పాదస్యలోపో అహస్త్యాదిభ్యః" (5-4-138) అకారమునకు లోపము. ఈ లోపముకు స్థానివద్భావము వచ్చిన, పదాదేశము సిద్ధింపకపోవును. ఈ లోపము పరనిమిత్తకము కాదు కావున దోషములేదు.

ఇచ్చట కూడ, యస్యేతి లోపము సిద్ధించుచున్నను మరల లోపవచనము వలన స్థానివద్భావము రాదని చెప్పవచ్చును గదా ! అనిన ఇట లోపవచనమునకు ప్రయోజనము కలదు. భసంజ్ఞ లేని చోట గూడ లోపము సిద్ధింపవలె. ఎచ్చట అనగా, 'వ్యాఘ్రపాత్' 'శ్యేనపాత్' అను స్థలములందు. అచట యస్యేతి లోపము రాదు కదా। కావున నిది 'పరస్మిన్' అను దాని కనన్యథా సిద్ధ ప్రయోజనమే.

'అదీధ్యే' 'ఆవేవ్యే' అనునవియు, ప్రయోజనము. 'దీధిఙ్ దీప్తి దేవనయోః' 'వేవీఙ్' 'వేతినాతుల్యే' అని రెండు ఛాందస ధాతువులు. అఙ్

పూర్వకములగు వాని లడుత్తమైకవచనాంత రూపములు 'అదిధ్యే' 'ఆవేశే' అనునవి. ఆట తిఙ్ప్రత్యయము 'ఇట్'. దానికి "టిత ఆత్మనే పదానాంటేరే" (3-4-79) అను సూత్రముచే ఏకారాదేశము. 'ఏరనేకాచః' అని యణా దేశము. ఈ ప్రక్రియలో, ఏత్వమునకు స్థానివద్భావము వచ్చినచో నది ఇవర్ణము వంటిదగును గాన, "యీవర్ణయోర్దీధీవేవ్యోః" (7-4-53) అను సూత్రముచే ఈకారమునకు లోపము రావలసి యుండెడిది. సూత్రమున, 'పరస్మిన్' అనుటవలన, ఏత్వము పరనిమిత్తకము కాన దోషములేదు.

ఇక ఇందు, 'పూర్వ విధౌ' అను పద మెందులకో విచారింతము. స॥-హే గౌః।బాభ్రవీయాః।నైధేయః।- అనునవి సిద్ధించుటకు. హే గౌః అను చోట, గకారోత్తరమయిన ఓకారము స్థానమున, పర నిమిత్తకమగు నాదేశము వృద్ధియగు ఔకారము ప్రవర్తించినది. దీనియందు స్థానివద్భావముచేత ఓకార బుద్ధి కలిగిన యెడల, "ఏఙ్హ్రస్వాత్సంబుద్ధేః" (6-1-69) అను సూత్రము చేత సంబుద్ధికి లోపము రావలసి యున్నది. కాని సంబుద్ధి లోపము పూర్వ విధి కాదు కావున ఆ దోషము కలుగదు.

కాని ఇది 'పూర్వ విధౌ' అను పదమునకు ప్రయోజనము కాదు. సంబుద్ధి లోపవిషయమున స్థానివద్భావము ప్రవర్తింపదని, పాణిన్యాచార్యుని, "ఏఙ్హ్రస్వాత్సంబుద్ధేః" అను సూత్రము నందలి ఏఙ్ గ్రహణ రూపమగు ప్రవృత్తి జ్ఞాపనచేయును.

ఆ సూత్రము, హ్రస్వము కంటె పరమగు సంబుద్ధికి లోపము విధించి, మరల ఏఙంతము కంటె పరమగు దానికిని, లోపము కలుగునని చెప్పుట వ్యర్థము. ఎట్లన, హే అగ్నే హే వాయో। అను స్థలములందు, గుణములయిన ఏకారోకారములకు, స్థానివద్భావముచే హ్రస్వత్వము లభించవచ్చును. అపుడు హ్రస్వ గ్రహణమువలననే సిద్ధించును గదా! కావున ఆ విషయమున స్థానివద్భావము ప్రవర్తింపదని పాణిని తాత్పర్యముగా గ్రహింప నగును అని భావము.

కాని ఆ విషయమున అది జ్ఞాపకమనుట కుదురదు. ఏలయన, గో శబ్దమున సంబుద్ధి లోపము రావలెననియే పాణిని తాత్పర్యము కావచ్చును. హ్రస్వ గ్రహణమువలన అది సిద్ధింపదు గనుక, అనిష్ట లోపము సిద్ధించుటకే ఏఙ్పదమును సూత్రమునందు గ్రహించెనని యేల అనుకొనరాదు ?

అట్లైన, "ఓఙ్హ్రస్వాత్సంబుద్ధేః" అనినను జాలునుగదా ప్రత్యాహార గ్రహణముతో భిన్నిషేమి? కావున ఏఙ్ అని ప్రత్యాహారమును గ్రహించుట ఆ విషయమున జ్ఞాపకమని చెప్పవచ్చును.

అటులైన, బాభ్రవీయాః, మాధవీయాః అనునవి ప్రయోజనములు. మధు బభ్రుల అపత్యములు, మాధవ్య బాభ్రవ్యులు వారి ఛాత్రులు మాధవీయులును బాభ్రవీయులును నగుదురు. మధు + య॥ ఆదివృద్ధి, ఓర్గుణము, అవాదేశము = మాధవ్య॥ అతని ఛాత్రులను నర్థమున "వృద్ధాచ్ఛః" (4-2-114) అని ఛప్రత్యయము. యస్యేతిలోపము = మాధవ్య్ + ఈయ, బాభ్రవ్య్ + ఈయ. ఈ స్థితిలో, "హలస్తద్ధితస్య" (6-4-150) అను సూత్ర మనువర్తింపగా, "ఆపత్యస్య చ తద్ధితేఽనాతి"(6-4-151) అను సూత్రము అపత్య ప్రత్యయ యకారమునకు లోపము రాగా, 'బాభ్రవీయాః', 'మాధవీయాః'— అని రూపము లేర్పడును.

ఇట, పరనిమిత్త కాజాదేశము వాంతాదేశము. దానికి స్థానివద్భావము వచ్చినయెడల, యకారము హల్లునకు పరమగుట సంభవింపదు. కాగా లోపము సిద్ధింపకపోవును. యలోపము పూర్వవిధి కాదు గాన స్థానివద్భావము వారితమగును.

కాని ఇదియు ప్రయోజనముగాదు. స్వాశ్రయమగు హల్త్వమువలన యలోపము సిద్ధింపవచ్చును.

లేదా, వాంతమగు 'అవ్' అను సముదాయమాదేశము. అది లోప విధిలో నిమిత్తముగ ఆశ్రయింపబడలేదు. అట్లాశ్రయింపబడినది వకారము. అది ఆదేశముకాదు. కావున ఈ ప్రయోజనమును, సుస్థముగాదు.

ఇక "నైధేయః" అనునదియే 'పూర్వవిధౌ' అని పదమునకు వ్యావర్త్యము.

'ని' అను ఉపసర్గము పూర్వమందు గల 'ధా' అను ధాతువునకు, "ఉపసర్గే ఘోః కిః" (3-3-92) అను సూత్రముచే 'కి' అనునది కృత్ప్రత్యయము నిధా + ఇ అను స్థితిలో, "ఆతోలోప ఇటిచ" (6-4-64) అని ఆకార లోపము ఇపుడికారాంతమగు నిద్వ్యచ్క ప్రాతిపదికముకంటె పరముగ అపత్యార్థమున, "ఇతశ్చానిఞః" (4-1-122) ఢక్ప్రత్యయమును, యస్యేతిలోపమును కాగా నైధేయః అనునది నిష్పన్నము. ఆకారస్థానమున వచ్చిన లోపము ఇట, పరనిమిత్తకాజాదేశము. దానికి స్థానివద్భావము వచ్చినయెడల, ప్రాతిపదికము త్ర్యచ్కమగును. అపుడు ముగ్గురు కుమారులు గలవానికి 'ద్విపుత్రుడు' అను వ్యవహారము లేనట్లు, దీనికి ద్వ్యచ్క వ్యవహారము ఉండదు. కాగా ఢక్ప్రత్యయము సిద్ధింపకపోవును.

"పూర్వ విధౌ" అనుటవలన ఢక్ప్రత్యయ విధి అచ్చునకు పూర్వమున్న దానికి విధి కాదు గాన స్థానివద్భావము ప్రవర్తింపదు. దోషమును లేదు.

విధి పదమెందులకు? "అచః పరస్మిన్ పూర్వస్య" అని సూత్రమును రచించినను, షష్ఠిచే విధ్యర్థమాతిష్ఠమై. 'పూర్వమునకు, కార్యము కర్తవ్యమయినపుడు' అని యర్థము కావచ్చునుగదా! కార్యమనగా విధియే గదా! అని ఆక్షేపము.

సమాధానము, విధి పదఘటితమయిన అది సమాసపదమగును. అపుడు సర్వ విభక్త్యంతావయవక విగ్రహమును జెప్పవచ్చును. 'పూర్వమునకు విధి పూర్వవిధి, పూర్వమయినదానికంటె పరమగుదానికి విధిగూడ పూర్వవిధి' అని గ్రహింపవగును.

పూర్వమయినదానికంటె పరమగుదానికి కార్యములు కర్తవ్యములయినపుడు, స్థానివద్భావమునకు ప్రయోజనములేమి ?

బేభిదితా, చేచ్ఛిదితా॥ మాథితికః॥ అపీపచన్॥- అనునవి.

'బేభిద్య' అను యజంతధాతువునకు పరముగ 'తృచ్' అనునది కృత్ప్రత్యయము. నిత్యములగు నలోపయలోపములు ముందు ప్రవర్తించును. తరువాత ఇడాగమము= బేభిదితా॥ ఇపుడు "ఏకాచ ఉపదేశే నుదాత్తాత్" (7-2-10) అను సూత్రముచే ఇడాగమ నిషేధము ప్రాప్తించుచున్నది. అకారలోపమునకు స్థానివద్భావముచేసి, దానితో వ్యవధానమును గల్పించి, ఆ ప్రతిషేధమును వారింపవలెను. పరనిమిత్తాజాదేశము అకారలోపము. కాని, కర్తవ్యమగు విధి స్థాన్యచ్చుకంటె పరమగు తృచ్ప్రత్యయమునకు గాని పూర్వమునకు గాదు. కాగా ఇది ప్రయోజనము.

ఇక- "మాథితికః" అనునది రెండవ ప్రయోజనము. మథితము పణ్యవస్తువుగా కలవాడు, మాథితికుడు. మథితమనగా తక్రభేదము. నీరుపోయకుండగ, చిలికిన చిక్కని మజ్జిగ. 'దానినమ్మువాడు' అని యర్థము. మథిత= ప్రాతిపదికము. ఠక్ ప్రత్యయము. ప్రాతిపదికాంత్యాకారమునకు లోపము. "ఠస్యేకః" (7 3-50) అని ఇకాదేశము. ఇట, తకారాకారమునకు, లోపానంతరము ప్రాతిపదికము తాంతమగును కాన, "ఇసుసుక్ తాంతాత్కః" (7-3-51) అను సూత్రముచేత, 'క' అను నాదేశము ప్రాప్తించుచున్నది. అకారలోపమునకు స్థానివద్భావముచేసి దానిని వారింపవలెను. పరనిమిత్తకాజాదేశము= లోపము కర్తవ్యమగు విధి కాదేశము. అది స్థాన్యచ్చునకు పరమయినదానికి గాని, పూర్వ దృష్టమునకు కాదు. కావున ఇది పంచమ సమాస సాధ్యమగు అత్యమే.

'అపిపచన్' అనునదియు వేరొక ప్రయోజనము. ఇది ణ్యంతమగు పచ ధాతువునకు లుఙ్ప్రథమైకవచనాంతము, – అ, పి, పచ్, ఇ అ, అన్- ఇందాద్యకారము అడాగమము. పి=అభ్యాసము, ఇత్వ దీర్ఘ నిష్పన్నము. పచ్=ఉత్తర ఖండము. ఇ=ణిచ్చు, అ=చఙ్, అన్=అంతియొక్క ఇకార తకారములకు లోపము వచ్చిన పిదప శేషించిన తిఙ్ప్రత్యయము. ఇందుణి లోపము చఙంత్యకారములకు, పరరూపమును రాగా ఏర్పడిన రూపము 'అపి పచన్' అనునది 'అపిపచ్'= అభ్యస్తధాతువు పరమగు ఝిప్రత్యయమునకు "సిజభ్యస్త విదిభ్యశ్చ" (3-4-109) అను సూత్రముచే 'జుస్' అను నాదేశము ప్రాప్తించుచున్నది. అది, ణిలోపమునకు కాని, పరరూపమునకు కాని స్థాని వద్భావముచే వ్యవధానమును సంపాదించి వారింపబడవలెను.

ణిలోప పరరూపములు పరనిమిత్తకాజాదేశములయినను, కర్తవ్య విధి యగు జుసాదేశము. పరవిధి యగుటచే పంచమ సమాసాశ్రయణ మావశ్య కము. అది విధిపదము సూత్రమునందున్ననే సాధ్యమని భావము.

కాని, విధి గ్రహణమున కివి ప్రయోజనములు కావు. "అచః పరస్మిన్ పూర్వ" – అనునంతమాత్రమే సూత్రము పఠింపబడినను, "పూర్వ" అనునది ప్రాతిపదిక నిర్దేశము గాన అది ప్రథానముగ నేయొక విభక్తిని నాశ్రయింపదు. ప్రాతిపదిక నిర్దేశములు అర్థతంత్రములు. అట నిర్దిష్టమయినది ప్రాతిపది కార్థము మాత్రమే. తదన్వయయోగ్యమగు ఏ విభక్తి ఆ ప్రాతిపదిక మాశ్ర యింప నిచ్ఛగించునో దానినెల్ల అది ఆశ్రయింపవచ్చును. కావున విధి గ్రహ ణముతో పనిలేదు.

అట్లైన ఇది ప్రయోజనమగును. విధి మాత్రమునందు స్థానివద్భావము ప్రవర్తించుట దానికి ప్రయోజనము. అనగా, ప్రకృతి=స్థాని, ఆకార్యము నందు నిమిత్తముగ నాశ్రయింపబడినను, లేకున్నను స్థానివద్భావము ప్రవర్తింప వలెను. అది యెట్లు లభించుననగా, "అచః పరస్మిన్, పూర్వ"- అనునంత వరకు ఒక యోగము. అది లుప్తవిభక్తికము. 'పూర్వస్య' అని యర్థము. విధౌ అనునది ద్వితీయయోగము అందు పూర్వసూత్రముచే సిద్ధించుచున్నదానిని నియమించుట దానికి ఫలము. స్థానివంటిదే యగును=స్థాని ప్రయుక్త కార్య మునే పొందును. 'స్వాశ్రయ కార్యమును బొందదు' అని నియమాకారము. అందువలననే, 'వాయ్వోః' 'అధ్వర్య్వోః' అను లక్ష్యములందు, యణాదేశో త్తరము "లోపో వ్యోర్వలి" (6-1-66) అను లోపమురాదు. ఇందువల్ల నిమి త్తము, అందు స్థానియగు ఉకారమాశ్రయింపబడలేదు. అయినను స్థానివద్భా వము ఈ నియమముచే ప్రవర్తించునుగాన యలోపమురాలేదు. "స్థానిని పతి యన్నభవతి తదాదేశేపి నభవతి" స్థాన్యవస్థలో యలోపము రాదుగాన, ఆదేశావస్థ

యందును రాదనుట. ఇది విధిగ్రహణమునకు అన్యథాసిద్ధముగాని ప్రయోజనము.

## స్వవిధియందును స్థానివద్భావము ప్రవర్తించుననను విచారము

వా॥ "అపరవిధావితితు"- అని యాక్షేపవార్తికము. "అచః పరస్మిన్న పరవిధౌ" అని సూత్రము రచింపవలసియున్నది అని అర్థము. అందులకేమి ప్రయోజనము? అనిన, స్వవిధిలోగూడ స్థానివద్భావము సిద్ధించుట అని సమాధానము. స్వశబ్దముచే స్థానియు, ఆదేశమును చెప్పబడును. కాగా, పరనిమిత్తక మగు అజాదేశము, స్థాని అగు అచ్చుకు పూర్వమున ఉన్నదానికి విధికర్తవ్య మయినపుడు స్థానివంటిదగును, పరమునకు విధి కర్తవ్యమయినపుడుమాత్రము గాదు అని పర్యవసితమగును.

స్వవిధిలో స్థానివద్భావమునకు ప్రయోజనములేమి ?

ఆయన్, 'ఆసన్॥' 'ధిన్వంతి' 'కృణ్వంతి॥ దధ్యత్ర మధ్వత్ర॥ చక్రతుః చక్రుః॥- అనునివి.

'ఆయన్' అనునది 'ఇణ్ గతౌ'అను ధాతువు లఙ్ ప్రథమ పురుష బహువచనాంతము. ఇ+అన్, అను స్థితిలో, "ఇణోయణ్" (6-4-81) అను సూత్రముచే యణాదేశము ప్రవర్తింపగా, 'యన్' అని యగుచున్నది. ఇపుడు ధాతువజాదికానందున, "ఆడజాదీనామ్" (6-4-72) అని ఆడాగమము సిద్ధించుట లేదు. యణాదేశమునకు స్థానివద్భావముచేసి దానిని సాధింపవలెను. పరనిమిత్తాజాదేశము యణాదేశము. కర్తవ్యమగు విధి ఆడాగమము. ఇది స్థానియగు, 'ఇ' అను ధాతువునకు స్వవిధి అగుచున్నది కాని పూర్వవిధి గాదు.

'ఆసన్'- అనునది 'అసభువి' అను ధాతువునకు లఙ్ ప్రథమ పురుష బహువచనాంతము. అస్+అన్ అనునవస్థలో "శ్నసోరల్లోపః"(6-4-111) అను సూత్రముచే అకారమునకు లోపమురాగా, అజాదిత్వము లేనందున ఆడాగమము ప్రాప్తింపకపోగా, ఆ లోపమునకు స్థానివద్భావముచే దానిని సాధింపవలసి యున్నది. ఇదియు స్వవిధిలో స్థానివద్భావమునకు ఉదాహరణము.

ద్వితీయ ప్రయోజనము, ధిన్వంతి, కృణ్వంతి అనువాని సిద్ధి. 'ధివి', 'కృవి' ధాతువులు. అంతి బహువచన ప్రత్యయము. నుమాగమము=ధిన్వ+ అంతి. "ధిన్వి కృణ్వ్యోరచ" (3-1-80) అను సూత్రముచేత 'ఉ' అను ప్రత్యయ ఘునకు, వకార స్థానమున అకారాదేశమును, దానికి "అతోలోపః" (6-4-48) అని లోపము. ఉప్రత్యయ స్థానమున యణాదేశముచే వకారమును ప్రక్రియ= ధిన్వంతి.

ఈ వకారమునకు, "ఆర్ధధాతుకస్యేడ్వలాదేః" (7-2-35) అని ఇడాగమము ప్రాప్తించుచున్నది. దానిని వారించుటకు యణాదేశమునకే సూత్రముచే స్థానివద్భావమును చేయవలసియున్నది. ఇదియు స్వవిధి.

తృతీయ ప్రయోజనము- 'దధ్యత్ర' 'మధ్వత్ర' అనునది. ఇట యణా దేశాంతరము. 'దధ్య్'అనుచో యకారము సంయోగాంత పదాంతమయినందున ప్రాప్తించు లోపము, ఈ"అచఃపరస్మి"న్నను స్థానివద్భావముచే వారణీయము. సంయోగాంత లోపము ఆదేశమునకు విధి.

చతుర్థ ప్రయోజనము 'చక్రతుః' అను వాని సిద్ధి.

ఇట, కృ+అతుస్ అను స్థితిలో, యణాదేశానంతరము క్ర్+అతుస్ అని నిష్పన్నమగును. కాగా, ధాతువు అజ్రహితము. అందువలన ఏకాచ్చు కాదు. ద్విత్వము రాదు. స్థానివద్భావముచే ఏ కాచ్త్వమును సంపాదించి ద్విత్వమును జేయవలెను. కాగా ఇది స్వవిధి. స్వవిధిలో స్థానివద్భావము ప్రవర్తింపనిచో ఇది సిద్ధింపదు.

కావున ఈ ప్రయోజనముల కొరకై స్వవిధిలో స్థానివద్భావ మావశ్యకమని, 'అపరవిధావితితు' అను నాక్షేప వార్తిక భావము.

స్వవిధి విషయము నందును స్థానివద్భావము ప్రవర్తించునెడల, 'ద్వాభ్యామ్', 'దేయమ్' 'లవనమ్' - అను స్థలము లందును నది ప్రాప్తించు చున్నదే?

'ద్వాభ్యామ్' అనుచోట, త్యదాద్యత్వము. 'సుపిచ' (7-3-102) అను దీర్ఘము ప్రవర్తించినది. త్యదాద్యత్వమునకు స్వవిధియగు, దీర్ఘము విషయమున స్థానివద్భావము వచ్చిన దీర్ఘము రాదు.

దేయమ్ = దా+యమ్, దీ+యమ్, దే+యమ్=దేయమ్. "ఈద్యతి" (6-4-65) అని ఆకారమునకు వచ్చిన ఈ కారాదేశమునకు స్థానివద్భావము ప్రవర్తించిన స్వవిధియగు గుణము సిద్ధింపకపోవును.

లవనమ్=గుణము పర నిమిత్తకాజాదేశము. దానికి స్వవిధి అవాదేశము, స్థానివద్భావము ప్రవర్తించినది సిద్ధింపకపోవును.

ఇది దోషము కాదు. ఈ విధులు, అనగా దీర్ఘ, గుణ, అవాదేశములు స్వాశ్రయములు గాన సిద్ధించునని సమాధానము.

స్వాశ్రయములనగా, జ్ఞాపకాశ్రయములు. శబ్దములకు స్వమ్ము లక్షణము. లక్షణములనగా నిర్దేశములు. 'ద్వయోరేకస్యడతరచ్' 'దేయమృశే' "కిరతౌలవనే" మున్నగునవి ఆదేశాశ్రయ కార్యములు ప్రవర్తించుననుటకు జ్ఞాపకములనుట. స్వాశ్రయములనగా, అతిదిశ్యమాన ధర్మ విరుద్ధ స్వాశ్రయములని అర్థము కాదు. పై నిర్దేశములు స్వవిధిలో స్థానివద్భావానిత్యత్వ జ్ఞాపకములు అనియు చెప్పవచ్చును గాన ఉక్తానిష్టములు వారితములగును.

అట్లైన, 'అపరవిధౌ' అని చెప్పవలసియే యున్నదా ?

అక్కరలేదు. 'పూర్వ విధౌ' అను పదమువలననే సిద్ధించును. ఎట్లనగా- 'పర నిమిత్త కాజాదేశము, పూర్వమునకు విధికర్తవ్యమయినపుడు స్థానివంటి దగును అని గదా సూత్రార్థము. అపుడు దేనికంటె బూర్వమునకు ? అని ప్రశ్న కలుగును. పూర్వపదముచే ఆదేశము సంబంధింపజేయబడిన, ఆదేశము కంటె పూర్వమయిన దాని కని అర్థమగును. కాని ఆదేశము సంబద్ధము కాదు. నిమిత్తము సంబంధింపబడును. అపుడు, 'పరనిమిత్త కాజాదేశము నిమిత్తము కంటె పూర్వమునకు విధి కర్తవ్యమగునపుడు స్థానివద్భావము నందును' అని అర్థమగును. 'ఆయన్' 'ఆసన్'- ఇత్యాదులందు నిమిత్తము కంటె బూర్వమునకే విధి కర్తవ్యము గాన అట స్థానివద్భావము సుస్థము. నిమిత్తములు లాజ్ లజ్ ల్యబ్లులు. తత్పూర్వము ధాతువు దానికి ఆగమము.

సరి, నిమిత్త మభిసంబంధింపబడినపుడు. "అచఃపరస్మిన్" అను నీ యోగమునకు, వృత్తి గ్రంథము లందెల్ల నుదాహరింపబడిన, మూర్ధాభిషిక్తోదాహరణము గూడ సంగృహీతమగు నందురా ?

ఆ! అదియు సంగ్రహింపబడును. ఆ ఉదాహరణమేది ? 'పట్వ్యా' 'మృద్వ్యా' అనునది. పటు + ఈ + ఆ- అను స్థితిలో ఈకార స్థానమున ప్రవర్తించిన యణాదేశముచే వ్యవహితమగుట వలన ఉకారము నిమిత్తముకంటె పూర్వమయినది కాదే ?

కావచ్చును. పూర్వమనగా వ్యవహిత పూర్వమును బూర్వ పదార్థమగును. అవ్యవహితత్వాంశోప స్థితి కిది తావుగాదు. సూత్రమునందే పూర్వ శబ్ద ముచ్చరింపబడుటచే 'తస్మాన్'ఇతిపరిభాష కిది విషయము కాదు. కావున 'పాటలిపుత్రము మధురకు పూర్వమున ఉన్నద'నిన అవ్యవహిత పూర్వమున అని అర్థము కావట్లే ప్రకృతమునను, గ్రహింపవచ్చును. కాగా ఈకార యణ్ణుకు స్థానివద్భావముచేత, తత్పూర్వోకారమున కది సిద్ధింపవచ్చును.

లేదా— పూర్వ గ్రహణముచే ఆదేశమే సంబంధింప జేయబడు ననుము.

అపుడు స్వవిధి స్థానివద్భావ ప్రయోజనము లెట్లు సిద్ధించును? అవి ప్రయోజనములు కావు. అన్యథా సిద్ధములు.

'ఆయన్' 'ఆసన్' 'ధిన్వంతి' — అను స్థలము లందన్యథా సిద్ధి ఎట్లనగా,

విధి శబ్దము కర్మ సాధనమును గలదు. 'విధీయతే ఇతి=విధిః' విధీయ మాన కార్యమనుట. అట కర్మార్థమున 'కి' ప్రత్యయము. భావ సాధనమును నది గలదు. అపుడు భావార్థమునందు 'కి' ప్రత్యయము. ఇపుడు, విధి యనగా - విధానము, భావము, సత్త, ఉనికి అని యర్థము. కర్మార్థకమగు విధి శబ్దమును గ్రహించిన, సర్వేష్ట సంగ్రహము కలుగదు. కావున భావ సాధన విధి శబ్దము గ్రహింపబడును. పూర్వ విధియనగా నిపుడు, పూర్వ సంబంధి సత్త విషయమున - అనగా, దాని భావము విషయమున - అయ్యాది ప్రవర్తింపవలెనను నుద్దేశముతో స్థానివద్భావము ప్రవర్తనీయము అనియు, విధి గ్రహణము స్వాశ్రయ నివారణార్థము గాన, పూర్వము రాకుండు గాక యని స్థానివద్భావము కర్తవ్యమనియు నర్థము.

కావున, 'ఆయన్' 'ఆసన్' అనుచో, పూర్వమగు ఆడాగమము సిద్ధించు టకు స్థానివద్భావము. 'ధిన్వంతి' 'కృణ్వంతి' అనుచోట ఆదేశమగు వకారము నకు బూర్వము ఇడాగమము రాకుండుటకు స్థానివద్భావము. స్థాని ప్రయుక్త మగు కార్యమును అతిదేశించుటయు ఆదేశ ప్రయుక్తమును వారించుటయు అను, కృత్యద్వయమును నీ సూత్రము చేయునని భావము.

ఇక, 'దధ్యత్ర' 'మధ్వత్ర' అనుచోట యకార వకారములకు సంయో గాంతలోప ప్రతిషేధము ముందు చెప్పబడును.

'చక్రతుః' 'చక్రుః' అనుచో, ద్విత్వమునకు నిమిత్తమగు అచ్చు ర మగునపుడు, ద్విత్వమునకు ముందుగా అజాదేశము ప్రవర్తింపదని, "ద్విర్వచ నేఽచి" (1-1-58) అను సూత్రముచే ముందు చెప్పబడును. కావున నెట్టి దోషములును లేవు.

యథాన్యాసముగనే సూత్రము ఉండదగును.

## సూత్రప్రయోజన నిరూపణము

ఈ యోగమునకు ప్రయోజనములేమి? అను ప్రశ్నకు సమాధానమగు శ్లోకవార్తికము—

శ్లో॥ వా॥ "స్తోష్యామ్యహం పాదిక మౌదవాహిమ్।
తతః శ్వోభూతే శాతనీం పాతనీంచ।
నేతా రావాగచ్ఛతం ధారణిం రావణించ।
తతః పశ్చాత్ స్రంస్యతే ధ్వంస్యతేచ॥" అనునది.

ఈ శ్లోకమునందు ఆ ప్రయోజనములు సంగృహీతములై యున్నవి.

శ్వోభూతియని శిష్యునిపేరు. 'ఓ శ్వోభూతీ !' నేను మొదటి పాదికుని, ఔదవాహిని, స్తుతించెదను. తరువాత శాతనిని, పాతనిని ప్రస్తావించెదను. ఓ శిష్యులారా! మీరుభయులును రండు ధారణిని, రావణిని ప్రశంసించెదను. అటు తరువాత స్రంసనమును ధ్వంసనమును నగును అని శ్లోకమునకు యథాశ్రుతార్థము.

ఇందు చెప్పబడిన (1) పాదికః॥ (2) ఔదవాహిః॥ (3) శాతనీ॥ (4) పాతనీ॥ (5) ధారణిః॥ (6) రావణిః॥ (7) స్రంస్యతే॥ (8) ధ్వంస్యతే- ఇవి యుదాహరణములు.

(1) పాదికః=పాదః అస్య అస్తీతి పాదికః। "అత ఇని ఠనౌ"(5-2-115) అను సూత్రముచే ఠన్ ప్రత్యయము ఇకాదేశము, యస్యేతిలోపము=ఇట అకార లోపానంతరము, "పాదః పత్" (6-4-130) అని పదాదేశము ప్రాప్తించుచున్నది. పరనిమిత్తాజాదేశమగు అకారలోపమునకు, పూర్వవిధియగు పదాదేశము కర్తవ్యము కాన నీ సూత్రముచే స్థానివద్భావముచేసి దానిని వారింపవలెను.

(2) "ఔదవాహిః"=ఉదకమును వహించువాడు ఉదవహుడు. ఆ నీళ్ళు మోయువాని కొడుకు ఔదవాహి. అపత్యార్థమున ఇఞ్ ప్రత్యయము యస్యేతి లోపానంతరము, "వాహ ఊఠ్" (6-4-132) అను సూత్రముచే 'ఊఠ్' ఆదేశము ప్రాప్తించుచున్నది. తద్వారణము ఈ స్థానివద్భావ కృత్యము.

(3)+(4) = శాతనీ పాతనీ శబ్దములు గౌరాదిజీషంతములు. యస్యేతి లోపానంతరము, 'శాతన్', 'పాతన్' అనునవి అన్నంతములగుట వలన అల్లోపోఽనః అని లోపము ప్రాప్తించుచున్నది. అదె ఈ స్థానివద్భావము చేతనే వారణీయము.

(5)+(6) ధారయతీతి ధారణః। తస్యాపత్యం ధారణిః।

రావయతీతి రావణః। తస్యాపత్యం రావణిః। ఇఞంత రూపము లివి. యస్యేతి లోపానంతరము, "ఢ్రద్ధితే" (6-4-144) అను సూత్రముచే ప్రాప్తించుట లోపము, ప్రస్తుత స్థానివద్భావముచే వారణీయము.

(7)+(8) = 'ప్రసంస్యతే', 'ధ్వంస్యతే' అనునవి ణ్యంతములు.

ణి లోపానంతరము "అనిదితాంహల ఉపధాయాః క్ఙితి" (6-4-24) అను నలోపమును, ఏతత్ స్థానివద్భావముచే కార్యము.

కాని యివి అనన్యథాసిద్ధములగు ప్రయోజనములు కావు "అసిద్ధ వదత్రాభాత్" (6-4-20) అను అసిద్ధవద్భావముచే ఇవి సిద్ధించును. సమాన నిమిత్తములు గల యొక ఆభీయకార్యము కర్తవ్యమయినపుడు, వేరొక అట్టి ఆభీయము అసిద్ధమగును అని సూత్రార్థము. సూత్రమునందలి 'ఆభాత్' అను పదమునకు, 'భస్య' అను నధికారము చివరవరకు అని యర్థము 'భస్య' అను సూత్రము సంఖ్య 6-4-129. అది పాద పరిసమాప్తివరకును నధికరించును. కాగా, షష్ఠాధ్యాయ చతుర్థ పాదములో ఇరువదిరెండవ సూత్రమునుండి పాదాంతము వరకును గల శాస్త్రములచే విధింపబడు కార్యములు ఆభీయము లనబడును. ప్రకృతమున "యస్యేతిచ" (6-4-148) అను లోపమును, పద్భావ, ఊఠ్ అల్లోప టి లోపములును పరస్పరము సమానాశ్రయములగు నాభీయములు. కావున పద్భావాదులు కర్తవ్యములగునపుడు లోపము అసిద్ధమగును కాన వానికి ప్రసక్తి కలుగదు. కాగా స్థానివద్భావమునకు అవి ప్రయోజనములు కావు అని తాత్పర్యము.

పోనిమ్ము. 'యాజ్యతే' 'వాప్యతే' అనునవి సిద్ధించుట, 'అచః పరస్మిన్' అను స్థానివద్భావమునకు ప్రయోజనములగును. ఇవి ణ్యంతములగు 'యజ' 'వప' ధాతువుల భావకర్మ లకారాంతములు. ణి లోపానంతరము యక్ప్రత్యయ నిమిత్తకముగ "వచి స్వపియజాదీనాం కితి" (6-1-15) అను సూత్రముచే సంప్రసారణమట ప్రాప్తించుచున్నది. దాని నీ స్థానివద్భావముచే వారింప వలసి యున్నది.

అనిన ఇదియు ప్రయోజనము కాదు. యజాదులకిత్తు పరమగునపుడు సంప్రసారణము వచ్చునని సూత్రార్థము. యజాదుల కిత్తు అనగా, వాని కంటె విహితము గునదని యర్థము. ఇట యక్ ప్రత్యయము ణ్యంత ధాతువు కంటె పరముగ విహితము కాన నది యజాదుల కిత్తు గాదు.

'పట్వ్యా' 'మృద్వ్యా'- ఇత్యాది రూపముల సిద్ధి యీ సూత్రమునకు ప్రయోజనము అగును.

పటు + ఈ + ఆ = పట్వ్యా. మృదు + ఈ + ఆ = మృద్వ్యా.

ఇట ఉకార స్థానమున ఒక యణాదేశమును, ఈకార స్థానమున ఒక యణాదేశమును ప్రవర్తింపవలెను. అందు పరమగు ఈకార యణాదేశము ప్రవర్తించిన తరువాత, దానితో వ్యవధానము వలన, ఉకార స్థానమున యణాదేశము ప్రాప్తించుటలేదు. ప్రకృత సూత్రముచే స్థానివద్భావము వలన నది సిద్ధించును.

ముందుగ, పరమగు ఇక్కునకే యేల యణాదేశమును చేయవలెను? పూర్వమునకే యేల చేయరాదు అనిన, నిత్యము గాన అదియే ముందు ప్రవర్తించును

పూర్వ యణాదేశమునకు పూర్వమునను పరమునను గూడ దానికి ప్రసంగముండుట చేత నది కృతాకృత ప్రసంగి. కాగా పర యణాదేశమునకు స్థానివద్భావము చేతనే అది సిద్ధింపవలె.

కాని, ఇది యు అసిద్ధ పరిభాషచే సిద్ధింపవచ్చును కాన ఇదియు అనన్యథా సిద్ధముగాదు.

నిత్యము కంటెను అంతరంగము బలీయము. పూర్వ స్థిత నిమిత్తక కార్యమగుటచే పూర్వ యణాదేశము అంతరంగము. పర స్థిత నిమిత్తక మగుటచే జేసి పర యణాదేశము బహిరంగము. "అసిద్ధం బహిరంగ లక్షణ మంతరంగ లక్షణే" అను పరిభాషచే, బహిరంగ లక్షణ పర యణాదేశ మసిద్ధముగాన అంతరంగ లక్షణమగు పూర్వయణాదేశమే పూర్వము ప్రవర్తించును.

మరియు ఈ పరిభాష అనిత్యా శ్రయణీయము. స్థానివద్భావమున్నను ఇది లేనిచో స్వరము సిద్ధింపదు.

'కర్త్ర్యా' 'హర్త్ర్యా' అను రూపములందు, "ఉదాత్తయణోహల్పూర్వాత్" (6-1-174) అను సూత్రముచేత విభక్తికి ఉదాత్తము సిద్ధింపవలెను.

ఉదాత్త స్థానమున వచ్చిన యణ్వర్ణము, హల్లు పూర్వమున కలదై అగునపుడు, దానికి పరమగు న నది సంజ్ఞక వర్ణమును, శసాది విభక్తియు నుదాత్తమగునని యా సూత్రమున కర్థము.

కర్తృ + ఈ + ఆ - అను స్థితిలో నిత్యత్వమువలన ముందు పర యణా దేశము ప్రవర్తించి, పిదప స్థాని వత్త్వముచేత, పూర్వ యణాదేశము ప్రవర్తించిన, తృతీయైకవచన మయిన, ఆకారము, ఉదాత్తయణ్ణున కనంతరము కాదు గాన దానికి ఉదాత్తత్వము ఈ సూత్రముచే సిద్ధింపదు.

అంతరంగత్వము వలన ముందుగనే పూర్వయణాదేశము ప్రవర్తించి నపుడు జీప్ ప్రత్యయమునకు, 'ఉదాత్తయణ' యను సూత్రముచె నుదాత్తత్వము గలిగి, దాని స్థానమున యణాదేశము ప్రవర్తించిన పిమ్మట ఆకారమునకు ఉదాత్తత్వము సిద్ధించును.

సత్యమే. కాని ఆ స్వరమును, ఈ అచః పరస్మిన్నను స్థానివద్భావము చేత సిద్ధింపగలదు. ఎట్లనగా,

శ్లో॥ వా॥ "ఆరభ్యమాణే నిత్యోఽసౌ" అను నిది శ్లోక వార్తిక పాదము.

ఆరభ్యమాణే = అచఃపరస్మిన్నను నీ యోగ మారంభింప బడినపుడు, అసౌ = ఈ పూర్వ యణాదేశమును, నిత్యః = నిత్యమే. రెండును నిత్యములయి నపుడు, ఉచ్చారణ క్రమమునందలి ప్రాథమ్యమువలన, ముందు, పూర్వ యణాదేశమే ప్రవర్తించును. పర యణాదేశము కృతమయినను, ప్రసంగించు నది గాన, పూర్వయణాదేశమును నిత్యమే.

పర యణాదేశమును నట్టిదియే గదా ? అనిన,

"పరశ్చాసౌ వ్యవస్థయా" భాష్య వార్తిక ద్వితీయ పాదము. ఔను. వ్యవస్థచేతను గూడ ఇది పరమే. వ్యవస్థ యనగా శబ్దతః పరత్వము. ఉచ్చారణ క్రమమునందలి ప్రాథమ్యము శాస్త్రముచే బాధింపబడును. విప్రతిషేధ సూత్రమునందు పరత్వము, సూత్ర పాఠకృతమును, శబ్ద కృతమును గ్రహింప బడును. యణ్విధాయక శాస్త్ర మొక్కటియే గదా! అభేదమున, పౌర్వాపర్య మెట్లు పొసగును ? అను శంక కలుగును గాని, వ్యక్తి పక్షమునందు, ఒక్కొక్క లక్ష్యవ్యక్తిని సంస్కరించుటకు ఒక్కొక్క లక్షణము భిన్న భిన్నముగ కల్పితమగును. కావున అనుపపత్తి లేదు. విప్రతిషేధశాస్త్రము ప్రవర్తించుటకు వలయు యౌగపద్యాసంభవమును ఇట కలదు. కార్యిత్వ నిమిత్తత్వము లొక్కదానికి యుగప ద్విరుద్ధములు గదా ! కనుకనే,

"యుగపత్సంభవోనాస్తి" అను భాష్య వార్తికతృతీయ పాదము. ఐన, ఎట్లు సిద్ధించును ?

"బహిరఙ్గేణ సిధ్యతి" చతుర్థ పాదము. బహిరంగేణ=అసిద్ధం బహిరంగ లక్షణ మంతరంగ లక్షణే అను దానిచేతనే కాని సూత్రముచేత 'కర్త్రాి' ఇత్యాదికము సిద్ధింపదు. కాగా శబ్దతః పరత్వము నాశ్రయించి విప్రతిషేధ శాస్త్రము ప్రవర్తింపదని తాత్పర్యము.

అట్లైన అంతరంగ పరిభాష నాశ్రయింపకున్నను, ఉదాత్త యణ్ణగు పూర్వ యణ్ణును ఆశ్రయించి స్వరము సిద్ధించును గదా !

అనిన, ఈకార స్థానికమగు యణ్ణుతో వ్యవధానముండును కాన ప్రాప్తింపదు.

'స్వరోద్దేశ్యక విధిలో, వ్యంజనము విద్యమానమయినను అది లేని దానితో తుల్యమే అగును' అను పరిభాష కలదుగదా ! కావున వ్యవధాన ముండదే? అనిన, ఆ పరిభాషను కల్పింపవలసియుండును గదా ! అది గౌరవ పరాహతము.

అది యెట్లు ? "అసిద్ధం బహిరంగ లక్షణ మంతరంగ లక్షణే" అను నీ పరిభాషయు గల్పింపవలసినదియే గదా ! అందుమాత్రము గౌరవము లేదా ? అనిన,

ఇయ్యది బహుప్రయోజనములు గలది. కాబట్టి అవశ్య కర్తవ్యము కాగా, ఆ పరిభాషవలననే సిద్ధించునుగాన "స్వర విధౌ వ్యంజన మవిద్యమానవత్" అను దానికిది యుదాహరణముగాదు.

మరియు ఆ బహిరంగ పరిభాషలోకసిద్ధము. ఎట్లన, జనులు లోకమున, సామాన్యముగ, ప్రత్యంగవర్తులుగ నుందురు. అయ్యది అందరును చూచు చున్నది. అంగమనగా, ప్రత్యాసన్నమయినది. ప్రతిప్రత్యాసన్నవర్తి అని యర్థము. ప్రత్యాసన్నత అనగా ముందుపస్థితమగుటయే. లోకమున ప్రతి మనుష్యుడును ఉదయము నిద్రనుండి మేల్కొని వెంటనే, తనుతమ శరీరము లకు సంబంధించిన పనులను నిర్వర్తించుకొందరు. శరీరము భోగాయతన మగుటచేత ప్రత్యాసన్నము. తరువాత ఆ ప్రత్యాసత్తి వశముననే సుహృ త్కార్యములను, పిదప సంబంధుల పనులను జూతురు.

ఆ రీతిగనే ప్రాతిపదికముగూడ నుపదిష్టమైన వెంటనే, విశేషణ భూతమైయున్న, 'సామాన్యము' అని వ్యవహరింపబడుచున్న జాతిని ముందు బోధించును. విశేష్య జ్ఞానమునకు పూర్వమే విశేషణ జ్ఞానము కలుగవలెను గదా. పిదప సామాన్యముచే ననురంజితమగు ద్రవ్యము ప్రతీతి విషయ మగును. శాస్త్రీయ కార్యములు జాతియందు సంభవింపవు గాన, జాత్యాశ్రయ మగు వ్యక్తి శబ్దార్థముగా కల్పింపబడుననుట. అదియే ద్రవ్యము.

లింగ సంఖ్యాకారకములు ద్రవ్యాశ్రితములు అందువలన, లింగాద్యభి ధానమునకు ముందు ద్రవ్యాభిధానము ప్రాప్తము.

పిదప ఆ లింగ సంఖ్యాకారకములలో, లింగము, ప్రత్యాసన్నమగుటం జేసియు, ద్విత్వాది సంఖ్యలవలె వస్త్వంతరాపేక్ష దానికి లేమింజేసియు, అంత రంగమగుటవలన, ముందు ప్రతీతి విషయమగును.

ఇక సంఖ్యాకారకములలో సంఖ్య, విజాతీయమగు క్రియ నపేక్షించు కర్మాదులవలెగాక, సజాతీయ పదార్థాపేక్షమగుటచే అంతరంగము. కావున ముందు సంఖ్యాప్రతీతియు, తరువాత కర్మత్వాదికారక ప్రతీతియు కలుగును. ఇది న్యాయప్రాప్తమగు క్రమము.

లింగ, సంఖ్యా, కారకములను నర్థముల ప్రతీతి క్రమమునను సరించియే తద్బోధకములగు శబ్దముల ప్రాదుర్భావమును కలుగును శబ్దములనగా స్త్రీ ప్రత్యయ విభక్త్యాదులు.

శబ్దముల యుపస్థితి క్రమమునను సరించియే వానివాని కార్యములును ప్రవర్తించును.

కావున, ప్రకృతమున, లింగబోధక ప్రత్యయమగు ఈకారమును నిమి త్తముగ రాదగు యణాదేశముముందుగ ప్రవర్తించునని భావము.

స్వార్థ, ద్రవ్య, లింగ, సంఖ్యా, కారకములను, ప్రాతిపదికార్థములకు, శాస్త్రకర్తలచే కల్పింపబడిన న్యాయప్రాప్తమగు క్రమమిది. ఇదియే ప్రక్రియా దశలో నందరును నాశ్రయింపదగినది. శబ్దముల యన్వాఖ్యానమున రెండు పక్ష ములు కలవు. ఒకటి పదములను విభజించి అన్వాఖ్యానము చేయుట. ఆ పక్షము నందు పైన చెప్పబడిన క్రమము ఆశ్రయింపదగినది. ఇక క్రమికాన్వాఖ్యాన పక్షము రెండవది. అపుడు, పటు+ఈ+ఆ అను విభాగముండదు. పటు+ఈ = పట్వీ, పట్వీ+ఆ=పట్వ్యా అన్నదియే యన్వాఖ్యానరీతి. ఆ పక్షమునందు

అ తరంగత్వమనగా పూర్వ ప్రవృత్తికత్వ రూపమే. ఏరయణాదేశ మసిద్ధమగుట అనగా నిమిత్తము లేనందున, ప్రాప్తింపకుండుటయే.

కాగా లోక న్యాయాన గృహీతమయిన, పూర్వోపస్థిత నిమిత్తకత్వ రూపమగు న తరంగత్వము నాశ్రయించిన 'అసిద్ధం బహిరంగ మంతరంగే' అను పరిభాష చేతనే పట్వ్యా, 'మృద్వ్యాః' ఇత్యాద్యుదాహరణములను సాధింప నగును, కాన అవి స్థానివత్సూత్రమున కుదాహరణములు కావు అని స్పష్టము.

ఇక ఎయ్యవి సూత్రోదాహరణములగు ననిన,

'పటయతి' 'లఘయతి' 'అవధీత్' 'బహుఖట్వాకః' అనునవి.

పటుమాచష్టే = పటయతి। లఘుమాచష్టే = లఘయతి॥ "ప్రాతిపది కార్థాత్ప్రాద్ధే బహుల మిష్ఠవచ్చ" అను చురాది గణ సూత్రముచే పటులఘు శబ్దముల కంటె బరముగ ణిచ్ప్రత్యయమును అణిచ్ప్రత్యయమున కిష్ఠ వద్భావ మును విధింపబడినవి. ఇష్ఠవద్భావమువలన టి లోపమును, తప్పను గుణముకు అయాదేశమును ప్రవర్తించును. టిలోపానంతరము పట్ + ఇ = అను స్థితిలో, "అత ఉపధాయాః"(7-2-116) అను సూత్రముచే ప్రాప్తమగు వృద్ధిని, ఉకార లోపమున కీ సూత్రముచే స్థానివద్భావము చేసి వారింపవలెను.

'అవధీత్' అనుచోట, అదంతమగు వధాదేశము యొక్క ఆకారమునకు వచ్చిన "అతోలోపః (6-4-48) అను లోపమునకు స్థానివద్భావముచేసి, "అతో హలాదేర్లఘోః (7-2-7) అను వైకల్పిక వృద్ధి వారణీయము.

'బహుఖట్వకః'— ఇట "ఆపోన్యతరస్యామ్" (7-4-15) అను సూత్రముచే 'కప్' ప్రత్యయము పరమగునప్పుడు వికల్పముగ 'టాప్' ప్రత్యయమునకు హ్రస్వము వచ్చియుండుటచేత ఉత్తరపదము హ్రస్వాంతమయినది. కావున, "హ్రస్వాంతేంత్యాత్పూర్వమ్" (6-2-174) అను సూత్రముచే ఉపాంత్యాకారము ఉదాత్తముకావలసి యున్నది. అది హ్రస్వమునకు, స్థానివద్భావము చేసి వారింపవలసియున్నది.

అచఃపరస్మిన్నను నీ స్థానివద్భావము వలన అనిష్టమును ప్రాప్తించు చుండ, తద్వారణోపాయమును, వార్తికకారుడు,

వా॥ "అచఃపూర్వత్వ విజ్ఞానాద్వైచోః సిద్ధమ్" అను వార్తికముచే తెలియచేయుచున్నాడు.

'వై యాకరణః' 'సౌవశ్వః' అనునవి తద్ధితాంతములు. 'వ్యాకరణ', 'స్వశ్వ' అనునవి ప్రాతిపదికములు. అట తద్ధిత ప్రత్యయ నిమిత్తముగ ప్రాప్తించిన ఆది వృద్ధిని, నిషేధించి, పదాంత యకారవకారములకు పూర్వముగ 'ఐకార ఔకారములు ఆగమములు'గా, "నయ్వాభ్యాం పదాంతాభ్యాం పూర్వౌతు తాభ్యామైచ్"(7-3-3) అను సూత్రముచే విధింపబడినవి. ఆ ప్రాతిపదికములలో, 'వి', 'సు' అనునవి ఉపసర్గలు. వాని ఇకారోకారములకు యణాదేశముచే యకార వకారములు వినబడుచున్నవి. ఇపుడా యణాదేశములకు ప్రకృత సూత్రముచే స్థానివద్భావము ప్రవర్తించిన యెడల, 'అయ్' 'అవ్' ఆదేశములు ప్రాప్తించుచున్నవి. వానికి ప్రతిషేధము చెప్పవలసి యుండును అని యాక్షేపము.

వార్తికార్థము— అచః=అచ్చుకంటెనే = అనగా దాని కాదేశము ప్రవర్తిపక పూర్వమే అనుట. పూర్వత్వ విజ్ఞానాత్=పూర్వత్వమును ఆశ్రయించుట వలన. ఐచోః=ఆగమములయిన ఐకార, ఔకారములకు, సిద్ధమ్=ఆ యావాదేశముల అప్రవృత్తి వలన శ్రవణము సిద్ధించినది.

అనాదిష్టమగు=ఆదేశరహితమగు అచ్చుకంటె పూర్వముగ దృష్టమైన దానికి విధి కర్తవ్యమయినపుడు స్థానివద్భావము ప్రవర్తించును. ఇట నైకారౌకారములు ఆదిష్టాచ్చుకు=అనగా ఆదేశభూతములయిన యకార వకారములకు, అతిదేశమువలన నచ్చులుగ గ్రహింపబడువానికి పూర్వములు అయి యున్నవి. ఇకారోకారములు ఉన్నపుడవి దృష్టములు కావుగదా! కావున స్థానివద్భావ ప్రాప్తి లేదని వార్తికాశయము.

అట్లయిన సూత్రమునందు 'అనాదిష్టాత్' అనియు జెప్పవలసి యుండునని తాత్పర్యమా ?

కాదు. చెప్పబడనిది యెట్లు జ్ఞాతమగును ?

సూత్రమునందు 'అచః' అనునది పంచమ్యంతము దానికి 'పూర్వవిధౌ' అను పదమునందలి 'పూర్వ' అనుదానితో సంబంధము. కాగా స్థానిభూతమగు అచ్చుకంటె పూర్వదృష్టమునకు విధి కర్తవ్యమగునపుడే స్థానివద్భావము ప్రవర్తించును అని ఫలితము. పై లక్ష్యములందు ఐకార ఔకారములు, యకార వకారములకంటె పూర్వములు. వాని స్థానవ్యవస్థలో నవి లేనేలేవు.

అట్లయిన 'అచః' అనునది 'ఆదేశః' అనుదానిని విశేషింపకుండిన, హలాదేశమునకు కూడ స్థానివత్త్వము రావలసియుండును కదా ? అనిన,

ఆదేశమును విశేషితమగును. ఎట్లనిన, షష్ఠీ నిర్దిష్టమగు 'అచః' అనుదానిని పంచమ్యంతమున్నుగా గ్రహింపుమని మేము చెప్పుటలేదు,

వేరొక 'అచః' అను పదమును కర్తవ్యమని భావమా ? వేరొకటియు అక్కరలేదు. షష్ఠ్యంతమగు ఈ పదమే దిక్ శబ్దమగు పూర్వశబ్దముతో సంబంధించినపుడు పంచమ్యంతమగును. 'పరనిమిత్తకమగు అజాదేశము పూర్వమునకు విధి కర్తవ్యమయినపుడు స్థానివంటిదగును' అని వాక్యార్థము నిష్పన్నమయిన పిదప దేనికంటె పూర్వమైన ? అని ప్రశ్న కలుగును. అపుడు 'అచః' అనునది పంచమ్యంతముగా ఉత్థితమగును.

'పూర్వ విధౌ' అనుదానికి, ఆదేశముకంటె పూర్వమగునదానికి విధి కర్తవ్యమయినపుడు- అను పక్షముగూడ కలదు గదా ! ఆ పక్షమునందు దేనికంటె? అను ప్రశ్న కలిగినపుడు, ప్రథమా నిర్దిష్టమగు 'ఆదేశః' అననది, దిక్శబ్దయోగమున 'ఆదేశాత్' అని పంచమ్యంతముగ మారుచున్నది. అట్లే షష్ఠ్యంతమగు అచః అనునదియు పంచమిగా మారవచ్చును అని తాత్పర్యము.

## భావాభావాతిదేశ విచారము

**వా॥ "తత్రాదేశ లక్షణ ప్రతిషేధః"** అని ఆక్షేప వార్తికము.

ఆదేశ ప్రయుక్తమగు కార్యమును స్థానివద్భావము నాశ్రయించి ప్రతిషేధింపవలెను స్థాని ఉన్నపుడు రాని కార్యమాదేశము ఉన్నపుడు రాదని చెప్పవలెను. "వాయ్వోః" "అధ్వర్య్వోః" అను స్థలమునందు, "లోపోవ్యోర్వలి" (6-1-66) అను సూత్రముచే, ఆదేశమగు వకారము నిమిత్తముగ యకారమునకు లోపము ప్రాప్తించుచున్నది. స్థానివద్భావమువలన వకారమునందచ్త్వబుద్ధి కలిగినను, స్వాశ్రయమగు వత్వము నివర్తింపదు గాన స్వాశ్రయ వత్వ ప్రయుక్తమగు లోపమనివార్యము. కావున దానిని ప్రతిషేధింపవలసి యుండును అని వార్తికాశయము.

దీనికి సమాధానము, **వా॥ "అసిద్ధ వచనాత్సిద్ధమ్"** అను వార్తికము. 'పరనిమిత్తమగు నజాదేశము, పూర్వదృష్టమునకు విధి కర్తవ్యమయినపుడు, అసిద్ధమగును' అని స్థానివద్భావమునకు బదులుగా అసిద్ధత్వమును చెప్పవలెను. దానివలన 'వాయ్వోః' అను స్థలమునందు యకారలోపము ప్రాప్తింపదు అని భావము.

**వా॥ "అసిద్ధ వచనాత్సిద్ధ మితిచే దుత్సర్గ లక్షణానామనుదేశః"** అని సమాధాన బాధకాక్షేపము.

అసిద్ధ వచనమువలన 'వాయ్వోః' ఇత్యాదులు సిద్ధించినను, 'పట్వ్యా' 'మృద్వ్యా' ఇత్యాదులందు ఉత్సర్గ లక్షణ కార్యములకు—అనగా స్థాని లక్షణ

కార్యములకు అనుదేశమును జెప్పవలసియుండును. ఉత్సృజ్యతే ఇతి= ఉత్సర్గః=నివర్తింపజేయబడునది. అనుదేశమనగా అతిదేశము. అపవాదము చేతవలె ఆదేశముచేతను స్థాని నివర్తింపజేయబడునది. 'పట్వ్యా' అనుచో యణా దేశము స్థానియగు ఇకార ప్రయుక్తము. అది నివర్తింపబడుటచేత పూర్వ యణాదేశము సిద్ధింపకపోవునమట.

ఇదియు అసిద్ధ వచనముచేతనే సిద్ధింపవచ్చునే? ఎట్లనగా అసిద్ధత్వము శాస్త్రమునకుగాని లక్ష్యమునందు ప్రవర్తించిన కార్యమునకు కాదు. కావున స్థాని నివర్తింపదు గదా! అనిన,

**వా॥ "అసిద్ధ వచనాత్సిద్ధ మితిచేన్నాన్యస్య వచనాదన్యస్య భావః"** అని సమాధాన బాధకాక్షేప వార్తికము.

అసిద్ధ వచనము వలన సిద్ధించుననిన కాదు. ఏలయనగా, వేరొకదాని అసిద్ధత్వము వలన వేరొకదానికి ప్రాదుర్భావము కలగదు. ఎట్లనగా- దేవ దత్తుని నొకడు చంపెను ఆ చంపినవానిని యజ్ఞదత్తుడు చంపినాడు. అయిన దేవదత్తుడు జీవించినాడా? కావున అసిద్ధత్వారోపమువలన స్థాని లభింపదు. కాబట్టి,

**వా.** "**స్థానివద్వచన మసిద్ధత్వంచ**" అని యాక్షేపోపసంహారవార్తి కము. 'పట్వ్యా' 'మృద్వ్యా' అనుచోట, పరయణాదేశమునకు, స్థానివద్భావ మును, 'వాయ్వోః' 'అధ్వర్య్వోః' అనుచో అసిద్ధత్వమును, రెండును చెప్ప వలసియుండునని భావము

**వా॥ "ఉక్తంవా"** అను వార్తికముచే సమాధానాంతరము. వచన ద్వయమును చేయుటకంటె, అసిద్ధత్వ మాత్రమును చెప్పుటయే యుక్తతరమని, "షత్వతుకోరసిద్ధః" (6-1-81) అను సూత్రమునందు చెప్పబడినది. "**స్థాని వద్వచనానర్థక్యం శాస్త్రాసిద్ధత్వాత్**" అని అచట వార్తికము. కార్యము నకు అసిద్ధత్వమనిన, లక్ష్యమునందు ఆ కార్యమునకు ప్రవృత్తి అవశ్యకమగును గాన దేవదత్తహంతృహత న్యాయమునకు ప్రసంగము కలుగును. శాస్త్రము నకే, లక్ష్యమునందు కార్య ప్రవృత్తికి పూర్వమే అసిద్ధత్వము చెప్పబడునుగాన ఆ దోషము అపుడుండదు.

కాని ఇట ఒక ప్రశ్న కలుగవచ్చును. తుక్ శాస్త్రమును, ఏకాదేశ శాస్త్రమును భిన్న భిన్న శాస్త్రములు. కావున ఒకదాని దృష్టిలో ఇంకొకటి అసిద్ధమగుట యుక్తిసహమగును. కాని ప్రకృతమున నట్లు చెప్పుట యెట్లు పొసగును? "ఇకోయణచి" (6-1-77) అను శాస్త్రము ఇచట అభిన్నముగదా!

తన విషయమున తానే అసిద్ధమగుననుట అర్థవిరహితముగాదా? కాగా ఇట అసిద్ధత్వోపన్యాసము అయుక్తము. అను ప్రశ్నకు సమాధానము = స్వవిషయమున స్వస్మిన్ కసిద్ధత్వమును శాస్త్ర సమ్మతమే అగును అని.

వార్తికాచార్యుడు "చిణోలుకిత గ్రహణానర్థక్యమ్, సంఘాతస్యా ప్రత్యయత్వాత్తలోపస్య చాసిద్ధత్వాత్" అని ముందు జెప్పబోవును. చిణ్ ప్రత్యయమునకు ప్రవర్తించిన లుక్కు, చిణ్ లుక్కు విషయముననే అసిద్ధ మగుచున్నది. కావున అది దోషము కాదు అనే భావము.

భావ కర్మ వాచకమగు తశబ్దము పరమగునపుడు, చ్లి ప్రత్యయమున కాదేశముగ 'చిణ్' అను ప్రత్యయములు లుఙ్లో వచ్చును. "చిణోలుక్" (6-4-104) అను సూత్రముచే, ఆ చిణ్ణు కంటె పరమగు దానికి లుక్కు విధింప బడినది. 'అకారి' 'అపాచి' మున్నగునవి ఉదాహరణములు. ఇక 'అకారితరామ్' అను మున్నగు రూపములును కలవు. అవి తిఙంత ప్రకృతిక తరబంతములు అట,

అకారి+త+తరామ్ అను అవస్థలో ముందు తశబ్దమునకును, తరువాత తరప్' ప్రత్యయమునకును, ఆ తరువాత 'ఆమ్' ప్రత్యయమునకును లుక్కు ప్రవర్తించునా? లేక, 'తతరామ్' అను సంఘాతమునకది వచ్చునా? అని విచారించి, సంఘాతము ప్రత్యయము కాదు గాన, తశబ్దమునకు ముందుగ లుక్కు ప్రవర్తించును. తరవాత, తరప్ ప్రత్యయమునకు ప్రాప్తమయిన లుక్కు, ముందు తశబ్దమునకు వచ్చిన లుక్కు అసిద్ధముగాన ప్రవర్తింపదు కాబట్టి, చిణోలుక్సూత్రమున తగ్రహణ మనర్థకమని నిర్ణయింపబడినది. కాగా అసిద్ధ వచనముచే సర్వ నిర్వాహము కావచ్చును అని తాత్పర్యము ॥

అయినను, సూత్రకారుని స్థానివద్భావ వచనమును సమర్థనీయమే. యథా సూత్రముగను భావాభావోభయాతిదేశములు సంభవించును, చూడుడు.

**వా॥ "తాసుమతిదిశ్యతాం వా సచ్చా నచ్చాపినేహ భారోస్తి ॥ కల్ప్యోహి వాక్య శేషో వాక్యం వక్త్రధీనం హి ॥" అని వార్తికము॥**

వా= లేదా. 'స్థానివత్' అను పదమునందు వతి ప్రత్యయము నిర్దేశింప బడియున్నది. వతి నిర్దేశ స్థలములందు వాక్యశేషమును వక్తయథేచ్ఛముగ కల్పించుకొనవచ్చును. "ఉశీనర దేశమునంధు వలెనే, క్షుద్ర దేశమునందును

యవలు" అనిన ఏదియో క్రియా పదమును కల్పించి వాక్యమును ముగింపవలెను గదా. 'కలవు' అనియు కల్పింపవచ్చును. 'లేవు' అనియు అనవచ్చును

"ఈ అమ్మాయికి కళలు తల్లికి వలె" అనిన, కలవు అనియో లేవు అనియో వక్త తాత్పర్యానురోధముగ కల్పింపనగును.

ఆ ప్రకారముగనే, "స్థానివత్" అనిన, భవతి, అనియు అనవచ్చును, లేదా 'కాదు' అనియైన ననవచ్చును కాన ఉభయథా వాక్య శేషము అట సమర్థింపగలము.

'పట్వ్యా' 'మృద్వ్యా' అను లక్ష్యముల విషయమున, 'స్థానివద్భవతి' = స్థానియగు 'ఈ' కారమున్నపుడు వలె, ఆదేశమున్నపుడును, యణాదేశము ప్రవర్తించును, అని చెప్పవచ్చును.

ఇక 'వాయ్వోః' 'అధ్వర్య్వోః'— అను విషయమునన్నా, స్థాని యున్నపుడు యకారలోపము రానట్లే ఆదేశమగు వకారమున్నపుడును, తన్నిమిత్తకమగు లోపము రాదు.

ఈ సూత్రమునందు, సచ్చ = భావమును, అసచ్చాపి = అభావాశమును, కామం = యథేష్టముగ, అతి దిశ్యతామ్ = అతిదేశింప దలిందు ఇహ = సూత్రమునందు, భారః = అధిక పదముల భారము నాస్తి = లేదు. వాక్య శేషము గదా కల్పనీయము. అదియథేచ్ఛముగ కల్పింపవచ్చును. హి = కలయన, వాక్యం వక్తరి అధీనమ్ = వాక్య శేష కల్పనము వక్తకు స్వాశయానురోధముగ ఉండును గదా. అతడు దానిని యథా యథముగ కల్పించుకొనును, అని వార్తికార్థము.

## పూర్వ పదార్థ విచారము

"స్థానియైన అచ్చునకు బూర్వముగ దృష్టమయిన దానికి శాస్త్రీయ కార్యము కర్తవ్యమయినపుడు, పర నిమిత్త కాజాదేశము, స్థానివద్భావము పొందును" అని గదా సూత్రార్థము. అందు పూర్వమనగా అవ్యవహిత పూర్వమని అర్థమా? వ్యవహిత పూర్వముననుగావచ్చునవియా? అని విచారము. లోకమునందు పూర్వ శబ్ద ముభయసాధారణముగ ప్రయుక్తమగుట చేత ఈ విచారము ప్రసక్తము. ఎట్లైన నేమి? అనిన,

**"అనంతరస్య చే దేకానుదాత్త, ద్విగుస్వర, గిలినిషూతేషాష సంఖ్యానమ్"** అని అనంతర గ్రహణ దూషణ వార్తికము.

పూర్వశబ్దమునకు అవ్యవహిత పూర్వమనియే యర్థమయిన ఏకానను దాత్తము, ద్విగుస్వరము, గతిస్వరము- ఇవి కర్తవ్యములగునపుడును, స్థాని వద్భావము ప్రవర్తించునని చెప్పవలసి యుండును.

ఏకాననుదాత్తమనగా = శేష నిఘాతము. ఒక పదమునందొక యచ్చును, అననుదాత్తమయినదానిని అనగా ఉదాత్తమునుగాని స్వరితమును గాని విడచి, మిగిలిన యచ్చులన్నియు నా పదమునందనుదాత్తములే యగునని "అనుదాత్తం పదమేకవర్జమ్" (6-1-158) అను సూత్రము బోధించును అదియే శేష నిఘాతము.

(1) **ఏకాననుదాత్తము** - లునీహి+అత్ర= నీహ్యత్ర॥

పునీహి+అత్ర=పునీహ్యత్ర. ఇట 'హి' ఉదాత్తము. ఆ ఇకారము నకు యణాదేశము ప్రవర్తించిన తరువాత ఇక ఉదాత్తము లేదు గాన, వర్జ్య మాన స్వరమనబడు ఈ ఏకాననుదాత్తము ప్రాప్తించుటలేదు. దానిని స్థాని వద్భావోపసంఖ్యానముచేత సాధింపవలెను 'స్థాని యున్నపుడు వచ్చునదెల్ల ఆదేశమున్నపుడును వచ్చును' అను, భావాతిదేశముచేత నది సిద్ధించును. ఇట ఈ స్వరము అవ్యవహిత పూర్వమునకు కర్తవ్యముగాదు. అందువలన ఉపసంఖ్యా నము ఆవశ్యకమగును

(2) **ద్విగుస్వరము** - 'పంచారత్న్యః' 'దశారత్న్యః'—

"ఇగంత కాల కపాల భగాల శరావేషు ద్విగౌ"(6 2-29) అను సూత్రము చేత, ఇగంతాదులు పరములయినపుడు, ద్విగు సమాసమునందు, పూర్వపద మునకు, ప్రకృతి స్వరమగు నాద్యుదాత్తము విహితము. అది అవ్యవహిత పూర్వమునకు విధిగాదు అందువలన యణాదేశమునకు స్థానివద్భావము ఉప సంఖ్యానీయము.

(3) **గతినిఘాతము** - "గతిర్గతౌ" (8-1-70) అను సూత్రమునకు తరు వాతిదగు "తిఙిచోదాత్తవతి" (8-1-71) అను సూత్రముచే అనుదాత్తము విహి తము. 'యత్ర్పలునీహ్యత్ర', 'యత్ర్పపునీహ్యత్ర' అని యుదాహరణములు. ఇదియు అవ్యవహిత పూర్వమునకు విధికాదు. యణాదేశమునకు స్థానివద్భా వముచేత నుదాత్తవత్త్వము సంపాదనీయము. కావున ఉపసంఖ్యానము ఆవర్జ నీయము.

పోనిండు, పూర్వశబ్దముచే పూర్వమాత్రమును గ్రహింతము అనిన, **వా॥ "పూర్వమాత్రస్య చే దుపధాహ్రస్వత్వమ్"** అని భాష్యకార వార్తికము,

అనగా, వ్యవహిత పూర్వమును పూర్వ శబ్దార్థమందు లేని, 'అవీవదద్వీణాం పరి వాదకేన' అనుచో, ఉపధాహ్రస్వము వక్తవ్యమగును. 'వీణ వాయించువానిచే వీణను వాయింపించెను' అని యర్థము. ఇట వాదయతి అను ణ్యంతముపైన నింకొక ణిచ్ప్రత్యయము. ఆ రెండవ ణిచ్చు మూలమున మొదటి ణిచ్చుకు లోపము. "ణౌ చఙ్యుపధాయా హ్రస్వః" (7-4-1) అను సూత్రముచే హ్రస్వము వచ్చును. ప్రథమ ణిల్లోపమునకు స్థానివద్భావము వచ్చినయెడల, తద్వ్యవధానమువలన హ్రస్వము రాకపోవును. కాగా అది వక్తవ్యమగును.

వా॥ "గురుసంజ్ఞాచ" అని దూషణాంతర వార్తికము.

అట్లైన గురుసంజ్ఞయు సిద్ధింపకపోవును. అదియు వక్తవ్యమగును అని యర్థము.

శ్లేష్మఘ్న॥ పిత్తఘ్న॥ దధ్యశ్వ॥ మధ్వశ్వ॥ — ఇట "హలోనంతరాః సంయోగః" (1-1-7) అని సంయోగ సంజ్ఞము. "సంయోగే గురు" (1-4-11) అని గురుసంజ్ఞ, "గురోరనృతోనంత్యస్యాప్యేకైకస్య ప్రాచామ్" (8-2-86) అని ప్లుతము, ప్రాప్తించుటలేదు.

శ్లేష్మాణం హంతీతి=శ్లేష్మఘ్నః, హే శ్లేష్మఘ్న ? ఇచట, ఘకార నకారముల అనంతర్యము సంయోగసంజ్ఞకు ప్రయోజనము. దాని మూలమున మకారాకారమునకు గురు సంజ్ఞ కలుగును దాని మూలమున "గురోరనృతః" అని ప్లుతమును సిద్ధింపవలెను.

పరనిమిత్తకమగు అజాదేశమిట హనధాత్వకారమునకు వచ్చిన గమ హనేత్యుపధాలోపము పూర్వవిధి=ప్లుతవిధి. అది వ్యవహితమునకు విధి. అది కర్తవ్యమగునపుడును స్థానివద్భావము ప్రవర్తించిన అది సిద్ధింపదు సంయోగత్వము సముదాయగతముగాన సంయోగ సంజ్ఞ స్వతః పూర్వవిధి కాదు. సంయోగసంజ్ఞ వ్యవహిత విధియుకాదు గాని, సంజ్ఞలు కార్యార్థములుగాన, ప్లుతరూప కార్యముద్వారా సంజ్ఞ వ్యవహిత పూర్వవిధి యగును.

ఏహి శ్లేష్మఘ్న ! ఏహి పిత్తఘ్న ! ఇత్యాది వాక్యములు ఉదాహరణములు. వాక్యస్య సిద్ధికొరకు, 'ఏహి' అను పదమును ముందు చేర్ప వలెను. అపుడా అకారము వాక్యమునకు 'టి' యగును.

ఓయీ ! అవ్యవహిత పూర్వమునకు కార్యము కర్తవ్యమయినపుడు స్థానివద్భావము ప్రవర్తించుననువాని మతమునను, సంయోగ సంజ్ఞ అనంతర

లక్షణ విధియోగాన విధేయమే అగునుగదా ? ప్లుతరూప కార్యపర్యాలోచనము లేకున్నను సంయోగ సంజ్ఞ ప్రవర్తించు పక్షమును కలదుగదా, ప్రత్యేకముగ సంయోగ సంజ్ఞ ప్రవర్తించును పక్షమును కలదుకాన అపుడు పూర్వ పరవిధి కాదుగాన స్థానివద్భావము ప్రవర్తించునుగదా ! అనిన,

**వా॥ "నవా సంయోగస్యా పూర్వవిధిత్వాత్"** అని సమాధానము. ఈ దోషము ప్రాప్తింపదు. ఎందువలన ? సంయోగము పూర్వవిధికాదు. అది సముదాయమునకు సంజ్ఞ. కాబట్టి, అవ్యవహిత పూర్వమునకు కార్యము కర్తవ్యమయినపుడు స్థానివద్భావము ప్రవర్తించుననినను దోషములేదు.

## ఏకాదేశ స్థలములందు స్థానివద్భావ సాధనము

**వా॥ "ఏకాదేశస్యోపసంఖ్యానమ్"**

**వా॥ "ఉభయ నిమిత్తత్వాత్"**

**వా॥ "ఉభయాదేశత్వాచ్చ"**— అని వార్తికత్రయము.

పర నిమిత్తకమగు నకారాదేశమునకు స్థానివద్భావము విహితము. ఉభయ నిమిత్త కాదేశములు కేవల పర నిమిత్తకములు కావు. వానికి స్థానివద్భావము ప్రాప్తించుటలేదు. మఱియు ఏకాదేశము అజ్మాత్రాదేశము కాదు. అనగా ఏకాచ్చాదేశము కాదు. రెండచ్చుల కాదేశము. ఉభయాదేశములు అచ్చు పర్యాస్త్యాధికరణా దేశములు కావు. అట్టి స్థలములందు స్థానివద్భావము సిద్ధించుట కుపసంఖ్యాన మావశ్యకమని ఆక్షేప వార్తిక తాత్పర్యము.

'శ్రాయసౌ' 'గామతే' 'చాతురే' 'ఆనడుహా' 'పాదేఉదవాహే' అందు 'శ్రాయసౌ' 'గామతే' అను ఇణ్ణంతములందు వృద్ధి రూపైకాదేశా నంతరము, ఉగిదచామను నుమాగమమును, 'చాతురౌ' 'ఆనడుహా' అను స్థలమున, "చతురనడుహోః" (7-1-98) అని ఆమాగమమును పాదే అను సప్తమ్యంతమునందు గుణానంతరము పదాదేశమును 'ఉదవాహే' అను చోట, 'ఊఠ్' అను నాదేశమును ప్రాపించుచున్నవి.

శ్రేయసిభవౌ=శ్రాయసౌ॥ శ్రేయ శ్శబ్దమునందలి అద్యచ్చునకు, "దేవికాశింశపాదిత్యవాట్ దీర్ఘ సత్రశ్రేయసామాత్" (7-3-1) అను సూత్రముచే, అణ్ప్రత్యయము పరమగునపుడు ఆత్వమువచ్చినది. ఇట శ్రాయస+ఔ అను అవస్థలో వచ్చిన వృద్ధికి, పరాదివద్భావముచే సర్వనామత్వము కలుగును,

'శ్రాయస్' అనునది ఏకదేశ విక్రృత న్యాయముచే అంగమగును. కాగా 'ఈయసున్' అను ప్రత్యయము ఉగిత్తు అగుటవలన, "ఉగిదచాం సర్వనామ స్థానే ఽధాతోః"(7-1-70) అను సూత్రముచే ప్రాప్తించుచుండ స్థానివద్భావము చేత ఇకార వ్యవధానమును గల్పించి దానిని వారింపవలెను.

'గోమతా' అను చోటను అంతే.

'చాతురా' 'ఆనడుహా' అను నవియు ఆణంతములే.

ఇట పరాదివద్భావముచే సర్వనామత్వము. లోక న్యాయ సిద్ధమగు ఏక దేశ వికృత పరిభాషచే అంగత్వము.

"చతురనడుహోరాముదాత్తః" (7-1-98) అను సూత్రము చేత ఆమాగమాపత్తి. స్థాని వద్భావముచేత వ్యవధానమును సంపాదించి, అది వారణీయము

'పాద' 'ఉదవాహ' శబ్దముల సప్తమ్యేక వచనాంతములు 'పాదే' 'ఉదవాహే' అనునవి. అట గుణము ఏకాదేశము. అందును, పరాదివద్భావముచే ఏకారమునందు అజాది స్వాదిత్వమును, ఏక దేశ వికృత న్యాయముచే 'పాద్' 'ఉదవహ్' అను వానికి అంగత్వమును గలుగగా పదాదేశమును, ఊఠాదేశమును భసంజ్ఞా కార్యములు యథాక్రమముగ ప్రాప్తించుచున్నవి. అవి స్థానివద్భావ వాక్యములు. ఆదేశము పరమాత్ర నిమిత్తకము గాదు. పకారాన్మాత్ర స్థానికమును గాదు కాన అది ప్రాప్తించుట లేదు, అని ఆక్షేప్త భావము.

'ఇది దోషము కాదు' అని సమాధానము.

అజాదేశము పర నిమిత్తకము కావలెను. ఇది ఉభయ నిమిత్తకము అంటిరే. దానికి సమాధానమును వినుము. ఒకని కొక గ్రామములో గాని పట్టణములో గాని యనేక కార్యముల మూలముగ నివాస మేర్పడును. అపుడు అతడు తన నివాసమునకు కారణముగ ఆ పనులలో ఒక దానిని గూడ నిర్దేశించును తామాయూర గురువుగారి కొరకును, అధ్యయనము కొరకును నివసించుచున్నను, 'మే మిచ్చట గురు నిమిత్తముగ ఉంటున్నాము' అనియు, మే మిట అధ్యయన నిమిత్తముగ ఉంటున్నాము, అనియు చెప్పుదురు. అట్లే, ఉభయ నిమిత్తక స్థలమున అన్వయ వ్యతిరేకముల వలన పరమును నిమిత్తము కావచ్చును.

ఇక, ఉభయాదేశమగుటవలనను, అచ్చున కాదేశమనబడదంటివేని, దానికిని వినుము. రెండు షష్ఠీ నిర్దిష్టముల స్థానమున ప్రవర్తించునది వానిలో దేనినైనను దనకు వ్యవహార నిమిత్తముగ కలిగియుండును.

ఒకనికి, తండ్రి దేవదత్తుడు. తల్లి దేవదత్త. అతడుభయుల పుత్రుడు నయినను ఈతడు దేవదత్తుని పుత్రుడందురు, లేదా దేవదత్త పుత్రుడనియును వ్యవహరింతురు. కావున రెండచ్చుల యాదేశమును నజాదేశమని వ్యవహరింపబడ వచ్చును. కాగా నుపసంఖ్యానముతో బని లేదని తాత్పర్యము.

ఒక హల్లునకును నొక యచ్చునకును గలిపి వచ్చిన యాదేశము అజాదేశముగ నీ స్థానివద్భావ విషయమున గ్రహింపబడునా ? లేదా ? యని విచారము.

'సౌధాతకిః' అను చోట, సుధాతృ శబ్ద ఋకార స్థానమున 'అక్' అను హలచ్ సముదాయ రూపమాదేశము. కాని అది అణ్ రూపముగ గ్రహింప బడలేదు. కావున రపరత్వము లేదు.

'అత్యరరాజత్' అని యొక రూపము. 'రాజానమతిక్రాంతవాన్ = రాజును మించినాడు' అని యర్థము. ప్రాతిపదికణిచ్చు. ఇష్టవద్భావము. టిలోపము. అందు టి 'రాజన్' శబ్దములోని 'అన్' అనునది. అందు అకార మాత్రమే అక్కు. కాని అకార నకార లోపము అగ్లోపముగ గ్రహింపబడినది. కాగా శాస్త్రమున ద్వివిధ వ్యవహారమును నగపడు చుండుటచే నీ విచారము ప్రసక్తము.

వా॥ "హలచో రాదేశః స్థానివదితిచేత్

వింశతే స్తిలోప ఏకాదేశః" - అను వార్తికము సముదాయాదేశ మునకు స్థానివద్భావము కలుగుననిన దూషణమును జెప్పుచున్నది. 'వింశకమ్' 'వింశంశతమ్' 'వింశః'- ఇత్యాదులందు వింశతి శబ్దముయొక్క 'తి' అనుదానికి లోపము వచ్చినప్పుడు దానినజాదేశముగ గ్రహించి స్థానివద్భావమును ప్రవర్తింపజేసిన, పరరూపము రాకపోవును. అది వక్తవ్యమగును.

'వింశకమ్' అనునది, వింశత్యా క్రీతమ్ అను నర్థమున, సూ॥ "వింశతి త్రింశద్భ్యాండ్వున్న సంజ్ఞాయామ్" (5-1-24) అను సూత్రముచే విధింపబడిన డ్వున్ప్రత్యయాంతము. 'వింశతి+అక' అను స్థితిలో "తి వింశతేర్డితి"(6-4-142)

లోలుపః, పోపువః, సగీసృపః, మరీమృజః— అనుచోట్ల యఙ్లోప నంత రము, ప్రాప్తించు గుణవృద్ధులకు ప్రతిషేధముచు చెప్పవలసి యుండును. స్థాని వద్భావము నంగీకరించిన, అపూర్వముగ ప్రతిషేధము ఆవశ్యకము కాదు అని యాక్షేపాశయము.

కాని "నధాతు లోప ఆర్ధ ధాతుకే" (1-1-4) అను సూత్రముచే గుణ వృద్ధుల నిషేధము సిద్ధింపవచ్చును గాన హలచ్ సముదాయాదేశమునకు స్థాని వద్భావము రాదనియే సిద్ధాంతము.

ఇక నే కార్యము నందు ప్రకృతి అనగా స్థాని ఆశ్రయింపబడి యుండునో అట్టి కార్యము కర్తవ్యమయినపుడే స్థానివద్భావము ప్రవర్తించునా ? అని విచారింపబడును.

ఈ విచారమింతకు మునుపు చేయబడియే ఉన్నది. విధి పదము వలన భావా భావములు రెండును అతిదేశింపబడును అను సిద్ధాంతమును ఉపపాదింప బడినది. కాని ప్రకృత విషయమున ఇతర వార్తికకారుల భావములను సూచించు కొన్ని వార్తికములు ఇట వ్యాఖ్యానింపబడును

ఎట్లన నే మనిన,

వా॥ "అవిశేషేణ స్థాని వదితిచేల్లోపయణాదేశే గురువిధిః"- అనునది ద్వితీయపక్ష దూషణ వార్తికము.

ప్రకృత్యాశ్రయణా నాశ్రయణములతో నిమిత్తములేకయే స్థాని వద్భావము ప్రవర్తించుననిన, లోప యణాదేశములు వచ్చిన స్థలములందు గురు విధి సిద్ధింపదు.

శ్లేష్మఘ్నః। పిత్తఘ్నః। దధ్యశ్వః। మధ్వశ్వః। - అనుచో "హలోనంతరాస్సంయోగః" (1-1-7) అని సంయోగ సంజ్ఞయు, తన్మూలకమగు "సంయోగే గురు" (1-4-11) అను గురు సంజ్ఞయు, తత్కార్యమగు, "గురో రనృతోనంతస్యాప్యేకైకస్యప్రాచామ్" (8 2-86) అను ప్లుతమును సిద్ధింపక పోవును.

సంయోగ సంజ్ఞా విధిలో లోప యణాదేశముల స్థాని ఆశ్రయింప బడలేదు గాన అది అనాశ్రిత స్థానిక కార్యము. లోపమనగా, గమహనేత్యుప ధాలోపము.

వా॥ "ద్విర్వచనాదయశ్చ ప్రతిషేధే" అని రెండవ దూషణము. ద్విర్వచవాదులందును స్థాని ఆశ్రయింపబడలేదు. ద్విర్వచన విధిలో ఆశ్రయింప బడినది అభిన్నమగు హల్లుగాని అచ్చుగాదు గదా. అది కర్తవ్యమయినపుడు

స్థానివద్భావము ప్రవర్తించినచో, ద్విత్వము సిద్ధింపకపోవును. కావున నప దాంత సూత్రమునందు ద్విర్వచనాదులు వక్తవ్యములగును.

**వా॥ "క్సలోపేలుగ్వచనమ్"- అను నదియు దూషణాంతరము.**

క్సలోపము వచ్చునపుపుడు లుగ్వచనము కర్తవ్యమగును. 'అదుగ్ధ' అదుగ్ధాః- ఇవి దుహధాతువు ప్రథమ మధ్యమైక వచనాంత రూపములు. అట, అదుహ్+స+త అను స్థితిలో "లుగ్వాదుహదిహలిహగుహామాత్మనే పదే దంత్యే" (7-3-73) అను సూత్రముచే క్సప్రత్యయమునకు లుక్కు విధింప బడినది.

"క్సస్యాచి" (7-3-72) అనునది దీనికి వెనుక సూత్రము. అది దానికి లోపమును విధించిన సూత్రము. లోపము సకారాకారమునకు, 'అలోంత్యస్య. అను పరిభాషచే వచ్చును. లోపింపవలసినది సకారాకార సముదాయము' అందులకే లుక్కు చెప్పబడినది.

కాని అకార లోపానంతరము సకారమునకు "ఝలోఝలి" (8-2-26) అని లోపము రావచ్చును. అపుడీ లుగ్విధాన మనావశ్యకమగును. అంత్యా కార లోపమునకు, సలోపము కర్తవ్యమగునపుడు, స్థానివద్భావము వచ్చిన నది సిద్ధింపదను తలంపుతో ఈ లుక్కు విధింపబడినది. సలోపమునందును స్థాని ఆశ్రయింపబడలేదు.

**వా॥ "హంతేర్ఘత్వంచ" అని దూషణాంతరము.**

'ఘ్నంతి' 'అఘ్నంతు' 'ఘ్నన్' అను రూపములో,గమహన అని ఉపధా లోపమును, 'హోహంతేః' అని కుత్వమును ప్రవర్తించినవి. ఉపధా లోపమునకు స్థానివద్భావము వచ్చిన ఘత్వము అనగా కుత్వము రాకుండెడిది. కావున నది వక్తవ్యము కావలసివచ్చును.

పోనిండు. స్థాని ఆశ్రయింపబడిన కార్యముల విషయమునసే స్థానివద్భావము ప్రవర్తించునను ప్రథమ పక్షమునే ఆశ్రయింతము. కావున,

(1) వా॥ "గ్రహణేషు స్థానివదితిచేజ్జగ్ధ్యాదిష్వాదేశ ప్రతిషేధః"

(2) వా॥ "యణాదేశే యులోపేత్వానునాసికాత్వ ప్రతిషేధః"

సూత్రముచే 'తి' లోపము అది హలచ్చుల యాదేశము. దానికి స్థానివద్భావము వచ్చినయెడల, పరరూపము శకారోత్తరాకారమునకును 'అక' అకారమునకును సిద్ధింపకపోవును.

ఇంకొక యుదాహరణము 'వింశమ్' అనునది. 'ఇరువది అధికముగాగల వంద' అని యర్థము. వింశతి+అ(డ) అను స్థితిలో "శదంత వింశతేశ్చ"(5-2-46) అను సూత్రముచే వచ్చిన డప్రత్యయాకారమునకును తి లోపానంతరము, శకారాకారమునకును పరరూపము సిద్ధించుటకై స్థానివద్భావమును ప్రతిషేధింపవలసి యుండును.

వింశః=అనునది పూరణార్థమున డట్ ప్రత్యయాంతము. ఇచటను, తి లోపానంతరమేకాదేశము వక్తవ్యమగును.

వేరొక దూషణ వార్తికము - "స్థూలాదీనాం యణాదిలోపే అవాదేశః" అనునది. 'స్థవీయాన్, దవీయాన్' అను రూపములు ఈయసున్ ప్రత్యయాంతములు. అందు 'స్థూల' 'దూర' ప్రాతిపదికములు. వీనిలో యణాది పరమునకు, అనగా 'ల' 'ర' అను భాగములకు లోపమును, పూర్వమునను్న ఊకారమునకు గుణమును, ఇష్ఠ, ఇమ, ఈయస్ అను ప్రత్యయములు పరము లగునపుడు విధింపబడినవి. "స్థూలదూరయువ హ్రస్వ క్షిప్ర క్షుద్రాణాం యణాది పరంపూర్వస్యచగుణః" (6-4-156) అని సూత్రము. ఇట అవాదేశము కర్తవ్యమయినపుడు స్థానివద్భావము ప్రవర్తించిన నది దుర్లభమగును.

వా॥ "కేకయ మిత్రయ్వోరియాదేశ ఏత్వమ్" అని దూషణాంతర వార్తికము. కేకయ శబ్దము జనపద క్షత్రియవాచకము. 'కేకయస్య అపత్యమ్' అను నర్థమునందును, 'కేకయి నాం రాజా' అను నర్థముననను, సూ॥ "జనపద శబ్దాత్ క్షత్రియాదఞ్" (4-1-168) అని అఞ్ ప్రత్యయము. ఆదివృద్ధి. కైకయ+అ- అను స్థితిలో "కేకయ మిత్ర యుప్రలయానాం యాదేరియః" (7-3-2) అను సూత్రముచే 'య' అను యకారాకార సముదాయమునకు 'ఇయ్' ఆదేశము. గుణము. 'కైకేయః' అని రూపము. గుణము కర్తవ్యమయినపు డియాదేశమునకు, స్థానివద్భావము వచ్చినయెడల నది సిద్ధింపకుండును. వార్తికమున నైత్వమనగా గుణము. కాగా ఆ గుణము వక్తవ్యమగును.

'మిత్రయోరపత్యమ్' అను నర్థమున, "గృష్ట్యాదిభ్యశ్చ" (4-1-136) సూత్రముచే, 'ఢఞ్' అను ప్రత్యయము విధింపబడినది.

మిత్రయు+ఏయ అను స్థితిలో, పై సూత్రముచే 'యు' అను యకారాది భాగమునకు ఇయాదేశము వచ్చినయెడల, మైత్రేయేయః అని కావలసి వచ్చును. అందువలన "దాండినాయన". (6-4-174) సూత్రమునందు ఇయాదేశమునకు బాధకముగా యులోపము నిపతింపబడినది. తరువాత పరరూపముచే 'మైత్రేయః' అను రూపము ఏర్పడును. పరరూపము కర్తవ్యమగునపుడు యులోపమసిద్ధమయిన అది సిద్ధింపకుండును గాన దానికి వక్తవ్యత ప్రాప్తమగును.

వా॥ "ఉత్తర పదలోపేచ" అనునదియు దూషణాంతరము. అచ్ హల్లుల సముదాయమున కాదేశమయినదిగూడ, అజాదేశముగ గ్రహింపబడిన యెడల 'దధిసక్తవః'- అను పదమునందు, దధిశబ్దేకారమునకు యణాదేశము ప్రసక్తమగును. ఇది శాకపార్థివాదులవంటిది. దధిచే ఉపసిక్తములగు సక్తువులు గాన దధిసక్తువులు ఉత్తర పదమగు ఉపసిక్తపదమునకు లోపము. ఆ లోపమునకు స్థానివద్భావము వచ్చిన, యణాదేశాపత్తి దోషము.

వా॥ "యణ్ లోపే యణ్ ఇయఙ్ ఉవఙః" - అనునదియు దూషణ వార్తికాంతరము-

చేచ్యః। నేన్యః॥ చేకియః। చేక్రియః॥ లోలువః। పోపువః॥ అనునివి యఙంత ప్రకృతి కాచ్ప్రత్యయాంతములు. చేచీయ+అ—ఇత్యాది స్థితిలో "యఙోచిచ" (2-4-74) సూత్రముచే, యఙ్ ప్రత్యయమునకు లుక్కు. చేచీయతేఇతి=చేచ్యః। లుగుత్తరము యణాదేశము ఇటులే 'నేన్యః'అనుచోటను ప్రక్రియ. ఇట యఙ్లోపమునకు స్థానివద్భావము వచ్చినయెడల యణాదేశము సిద్ధింపదు.

చేకీయతే ఇతి చేకియః। చేక్రీయతే ఇతి చేక్రియః। ఇట ఇయఙాదేశమును సిద్ధింపక పోవును.

లోలూయతే=లోలువః। పోపూయతే=పోపువః। ఇట యఙ్లుగుత్తరము, స్థానివద్భావము ప్రవర్తించిన, ఉవఙాదేశము సిద్ధింపదు. ఇవి దోషములు.

పోనిండు. హలజాదేశము స్థానివంటిది కాదనుడు. సూత్రమున 'అచః అను పద ముపాత్తమాయె. అజ్మాత్రము ఎచట స్థాన షష్ఠీ నిర్దిష్టమగునో అచటనే అది ప్రవర్తించుట ఉచితము గదా ?

అనిన, వా॥ "అస్థానివత్వే యఙ్లోపే గుణవృద్ధి ప్రతిషేధః". అని యాక్షేపము

వాతి సూత్రముచే, యకారమునకు లోపము ప్రాప్తించుచున్నది. స్థానివద్భావముచేసి వారించుటకు, యలోపవిధిలో స్థాని ఆశ్రయింపబడలేదుగదా! కాగా యలోపము ప్రతిషేధ్యమగును

౯. "అతోదీర్ఘో యఞి లోపవచనమ్" - అనునది పంచమ దూషణము

గర్గుని గోత్రాపత్యమగు పురుషుడు గార్గ్యుడు. స్త్రీ గార్గి. ఆ గార్గియొక్క కుత్సితాపత్యమును వివక్షించినపుడు "గోత్రస్త్రియాః కుత్సనేణచ" (4-1-147) అను సూత్రముచే 'ణ' ప్రత్యయము "భస్యాఢేతద్ధితే" అను వార్తికముచే పుంవద్భావము. కాగా 'గార్గ్య' అను పుంవాచక ప్రాతిపదికమునకు పరముగా నీ 'ణ' ప్రత్యయము వచ్చును.

'గార్గాభ్యామ్' 'వాత్స్యాభ్యామ్' అను తృతీయా ద్వివచనాంతరూపము లందు, గార్గ్య+అ+భ్యామ్ అను స్థితిలో ముందుగ "సుపిచ" (7-3-102) అని, ణప్రత్యయాకారమునకు దీర్ఘము. ప్రకృత్యకారమునకు "యస్యేతిచ"(6-4-148) అని లోపము. పిదప "ఆపత్యస్య చతద్ధితేనాతి" (6-4-151) అని యకార లోపము కాని ఈ యలోపము "అనాతి" అని ఆకారము పరముగనున్నపుడు ప్రతిషేధింపబడినది. సుపిచేతి దీర్ఘమునకు స్థానివద్భావముచే నది వారింపబడవలె. కాని 'ఆపత్యస్య' అను లోపవిధిలో స్థానియగు తద్ధితాకార మాశ్రయింపబడలేదు కాన నది సాధ్యపడదు కావున యలోపమును ఇట్టి పట్టునందు అపూర్వముగ విధింపవలసియుండును. అభావాతిదేశమును గూడ నంగీకరించిన నీ దోషముండదు. స్థాన్యవస్థలో, ఆకారము పరముగా లేనందున నా నిషేధము ప్రవర్తింపదు గాన నాదేశావస్థయందును రాదని చెప్పవచ్చును. కాని,

ఈ దోషము తగులదు, అనాతి అనుచో, పర్యుదాసమున నర్థము. ఆకారభిన్నమును ఆకారసదృశమును నగు తద్ధితపరమగునపుడని యర్థము. కాగా యలోపవిధి ఆశ్రిత స్థానికవిధియే యగును. స్థానివద్భావముచేత అద్భిన్నము పరమగుట సంభవముగాన 'య' లోపము సిద్ధించును.

ఇట్టి దోషమొక్కటి పరిహృతమైనను ఇతర దోషములకు గూడ పరిహారమొకటి సాధారణమయినది ఆవశ్యకము అని సూత్రమునందు విధి పదమును గ్రహించుట అది లేకున్నను, ఆశ్రిత స్థానిక కార్యములందు మాత్రమే స్థానివద్భావము సిద్ధించును. అనాశ్రిత స్థానిక కార్యములందును అది సిద్ధించుటకే విధి గ్రహణరూపమగు అధిక యత్నము ఆచరింపబడినది స్వాశ్రయ కార్యములు అతిదిశ్యమాన ధర్మవిరుద్ధములు నివర్తించుట విధి గ్రహణ ఫలము కావున విధి మాత్రమున స్థానివద్భావ ప్రవృత్తి పరమసిద్ధాంతము.

అవిశేషముగ స్థానివద్భావము ప్రవర్తించుననిన లోపయణాదేశములు వచ్చినపుడు గురువిధి సిద్ధింపదనియు, ప్రతిషేధ విధిలో ద్విర్వచనాదులు కర్తవ్యములగుననియు. క్నిప్రత్యయమునకు లోపము ప్రాప్తించుచున్నను వరలలుక్కు కర్తవ్యమగుననియు, హాంతికి ఘత్వము వక్తవ్యమగును అనియు దోషములు ప్రాప్తించునని ఆపాదింపబడినది గదా ! దానికేమందురు ?

ఈ దోషములేవియు కలుగవు.

"అవిశేషేణ స్థానివదితి చే ల్లోపయణాదేశే గురువిధిః" అను ఆపత్తికి, "నవా సంయోగస్యాపూర్వ విధిత్వాత్" అని సమాధానము చెప్పబడినది. సంయోగ సంజ్ఞ పూర్వ పరవిధిగాని పూర్వ మాత్రవిధి కాదుగాన దోషములేదని భావము.

ఇక "ద్విర్వచనాదయశ్చ ప్రతిషేధే వక్తవ్యాః" అను నాక్షేపము కలదు. కాని నపదాంత సూత్రమునందు ద్విర్వచనాది గ్రహణము చేయబడియే ఉన్నది. అదియే అవిశేష స్థానివద్భావమునకు జ్ఞాపకము. 'లుగ్వాదుహాదిహేతి సూత్రమునందు లుగ్వచనము, అదుహ్వహి' అను రూపముకొరకు కృతమైయున్నది. వకారము ఝుప్రత్యాహార వర్ణముకానందున అట ఝులో ఝులి అని సిద్ధింపదు.

ఇక హాంతికి ఘత్వ వచనము విషయమున, శ్రుతికృతమగు నకారానంతర్యముకలదు గాన దోషములేదని సప్తమాధ్యాయమున సమాధానము చెప్పబడును.

॥అచః పరస్మిన్ పూర్వ విధౌ॥ సమాప్తము.

## ॥"నపదాంత, ద్విర్వచన, వరే, యలోప, స్వర, సవర్ణానుస్వార దీర్ఘ జశ్చర్విధిషు॥" (1-1-57)

### పదాంత పదార్థ నిరూపణము

'పదాంతాది విధుల విషయమున, పర నిమిత్తకాజాదేశమునకు, స్థానివదతిదేశము ప్రవర్తిపదు' అని సూత్రార్థము. పదాంత విధి విషయమున స్థానివద్భావా ప్రకృతి కుదాహరణములు—

'కాని సన్తి', 'కౌస్తః'— అనునవి. వాక్య సంస్కార పక్షమునందు కాని, అస్+అన్తి, కౌ, అస్+తః అను స్థితిలో, "శ్నసోరల్లోపః" (6-4-111) అను సూత్రముచే, ధాత్వవయవాకారమునకు లోపమురాగా, సన్తి అనియు, స్తః అనియు రూపములగును,

(3) వా॥ "రాయాత్వ ప్రతిషేధశ్చ"

(4) వా॥ "దీర్ఘేయలోప ప్రతిషేధః"

(5) వా॥ "అతోదీర్ఘే యలోపవచనమ్" అని ఐదు వార్తికములచే నా పక్షమునందు దూషణములు ఆపాదింపబడి యున్నవి.

మొదటి వార్తికము నందలి 'గ్రహణేషు' అను పదమునకు, 'గృహ్యమాణేషు స్థానిషు' 'స్థానులు గ్రహింపబడిన కార్యములందు' అని అర్థము. అపుడే స్థానివద్భావము ప్రవర్తించుననిన జగ్ధ్యాద్యాదేశమున కనుట.

'నిరాద్య' 'సమాద్య'- అనునవి ణ్యంతమగు నదధాతువు ల్యబంతములు. ణిలోపానంతరము ఏకదేశ వికృత న్యాయముచే, "అదోజగ్ధిర్ల్యప్తికితి" (2-4-36) అని జగ్ధ్యాదేశము ప్రాప్తించుచున్నది. ణిలోపమునకు స్థానివద్భావముచేసి వారింపవలెననిన, జగ్ధి విధిలో స్థానియగు ణిచ్ప్రత్యయ మాశ్రయింపబడలేదు గాన అది ప్రవర్తింపనందున తత్ప్రతిషేధము వక్తవ్యమగును.

వార్తికమునందలి ఆది పదముచే 'ఘూత్యాత్' వదాదేశ ప్రతిషేధము గ్రాహ్యమగును. వదాదేశ విధాయకమునందును ణిచ్చుకు గ్రహణములేదు గదా!

2. రెండవ దూషణము- యణాదేశానంతరము యకారలోపము, ఉకారలోపము, ఈత్వము, అనునాసికత్వము- దీనికి ప్రతిషేధము వక్తవ్యమగుట. వార్తికమున, య్+ఉ=యులోప=యకార ఉకారముల లోపమని గ్రాహ్యము.

(1) 'వాయ్వోః' 'అధ్వర్వోః' = యణాదేశోత్తరము, "లోపోవ్యోర్వలి" (6-1-66) అని యకారలోపమిపుడు స్థానివద్భావముచే వారింపబడదు. ఏ కార్యమునందు స్థాని ఆశ్రయింపబడలేదు గదా.

(2) అకుర్వి+ఆశామ్=అకర్వ్యాశామ్. ఇటను యణాదేశోత్తరము "నిత్యంకరోతేః" (6-4-108), "యేచ" (6-4-109) అనువానిలో రెండవ సూత్రముచే, అకురు+ఇ+ఆశామ్ అనునవస్థలో, ఇకారస్థానమున వచ్చిన, యకారాదేశము పరమగుటచే, ప్రత్యయోకారమగు రేఫోకారమునకు లోపము ప్రాప్తించుచున్నది. "స్థానిని సతియన్నభవతి తదాదేశేపి నభవతి" స్థాన్యవస్థలో ప్రవర్తింపని కార్యము ఆదేశావస్థయందును ప్రవర్తింపదు" అనునభావాతిదేశ

ముచే నది వారణీయము కాని అనాశ్రిత స్థానిక కార్యము లోపమగుటచే స్థానివద్భావము ప్రవర్తింపదగిన తత్ప్రతిషేధమును వక్తవ్యమగును.

(3) ఇక ఈత్వము- అలుని+ఆశామ్=అలున్యాశామ్. ఇట, "ఈహల్యఘోః" అని ఈత్వము ప్రాప్తించుచున్నది.

అలునా+ఇ+ఆశామ్- అలునా+యాశామ్. శ్నా ప్రత్యయాకార లోపము- ఇట, ఆకారమున కీత్వము, యణాదేశమునకు స్థానివద్భావముచే వారింపవలసియున్నది. ఈత్వవిధిలో స్థాని ఆశ్రితముకాలేదని స్థానివత్త్వము ప్రవర్తింపనిచో, ఈత్వ ప్రతిషేధమును వక్తవ్యమగును.

(4) అనునాసికాత్వము- అజజ్ఞి+ఆశామ్=అజజ్ఞ్యాశామ్॥ అ, జ, జన్+ఇ+ఆశామ్=అను నవస్థలో, ఉత్తమైకవచనమైన 'ఇ' స్థానమున యణాదేశము రాగా, ఆ యకారమును నిమిత్తముగ గొని, "యేవిభాషా" (6-4-43) అను సూత్రముచే జనధాతువు నకారస్థానమున ఆత్వము ప్రాప్తించుచున్నది. ఇవ జననేధాతువు వ్యత్యయముచేత ఆత్మనే పదము. ఆత్వ విధిలో స్థానియగు ఇకార మాశ్రయింపబడనందున, స్థానివత్త్వము ప్రవర్తింపకుండిన, ఆత్వమపూర్వముగ ప్రతిషేధ్యమగునని భావము.

3. మూడవ దూషణము రాయాత్వ ప్రతిషేధ వక్తవ్యత.

రై+ఇ+ఆశామ్. యణాదేశము. స్థానివద్భావముచే, భావాతిదేశము వలన, ఆయాదేశము=రాయ్యాశామ్॥ ఇట నభావాతిదేశము నాశ్రయించి, "రాయోహలి" (7-2-85) అను నాత్వమును వారింపవలసి యున్నది. అనాశ్రిత స్థానిక కార్యమగుటచే స్థానివత్త్వము ప్రవర్తింపకుండిన, ప్రతిషేధము వక్తవ్యమగును.

4. "దీర్ఘేయలోప ప్రతిషేధః" అనునది చతుర్థ దూషణము

'సూర్యేణైకదిక్'= సూర్యునితో సమానమయిన దిక్కుగలది అను నర్థమునందు, "తేనైకదిక్" ( -?-112) అను సూత్రముచే అణ్ ప్రత్యయము రాగా 'సౌర్యమ్' ఉనియగును. సూర్యునితో తుల్యమగు దిక్కుగల హిమవత్పర్వత శిఖరము అని యర్థము. అట్టి శిఖరములు రెండు. అవిగలది హిమవంతము, "సౌర్యీ హిమవాన్" మత్వర్థీయమగు ఇనిప్రత్యయము: 'సౌర్యిన్' ప్రాతిపదికము. ప్రథమైకవచనమున, "సౌచ" (6-4-13) అను సూత్రముచే ఉపధాదీర్ఘము. ఇట్టి, ఈకారము పరమగుటవలన "సూర్యతిష్యాగస్త్యమత్స్యానాం య ఉపధాయాః" (6-4-149) అను "యస్యేతిచ" (6-4-148) సూత్రములవలన దను

బడినది గాన ధకారాంతము పదము కావలయును. భసంజ్ఞా విషయమున నిషేధము లేనందున ఊకారాంతమునందు భసంజ్ఞ దానికి బాధకముగాదు. కావున జశ్త్వాపత్తి దోషము.

అయిన, భావసాధన విధి శబ్దోపాదానము దోషమాత్ర ఫలకమేనా? దానివలన నిష్టసిద్ధిగూడ నేమైన గలదా?

కలదు. 'కానిసంతి' 'యానిసంతి' 'కాస్తః' 'యాస్తః'- అనుచోట పదాంతములందు 'కాని' 'కా' అనువానిలో యశాదేశావాదేశములచే రాదగిన యకార వకారములు వినబడకుండుటయే ఇష్ట సంగ్రహణము.

భావసాధన విధి శబ్దాశ్రయణమువలన వేరొక ఇష్టసిద్ధియు గలుగుచున్నది. 'షడికః' అనునది సిద్ధించుట ఇష్టము. ఆ ఇష్టసిద్ధి భావసాధన పక్షమున నసాధారణమగు ప్రయోజనము.

'షడంగులిః' అని యొక వ్యక్తికి పేరు. ఆరువేళ్ళు కలవాడని యర్థము. 'అనుకంపితుడైన షడంగులి' అను నర్థమును వివక్షించినపుడు, "బహ్వచో మనుష్య నామ్నష్ఠజ్వా" (5-3-78) అను సూత్రముచేత 'ఠచ్' అను ప్రత్యయము విహితము. ఠకారమునకు "ఠస్యేకః" (7-3-50) అని ఇకాదేశము, "రాజాదావూర్ధ్వం ద్వితీయాదచః" (5-3-83) అను సూత్రముచే ప్రకృత్యవయవమగు ద్వితీయాచ్చునకు పైననుండు వర్ణముల సముదాయమునకు లోపము. కాగా 'గులి' అనునది లోపించును పిదప "యస్యేతిచ" (6-4-148) అని అఙ్గులి శబ్దాకారమునకు శేషించినదానికి లోపము. ఇపుడు షష్+ఇక అను స్థితిలో, 'షష్' అననది అంతర్వర్తి విభక్తిని బురస్కరించుకొని పదమగును గాన నిక పదత్వ విధానములేదు. కాగా నపదాంతేతి నిషేధములేదు. యస్యేతి లోపమునకు స్థానివద్భావముచే అకారాంతము భ సంజ్ఞకమయినను షకారాంతమునందలి పదత్వమునకు భంగములేదు గాన జశ్త్వము సిద్ధించి 'షడికః' అను నిర్దిష్టరూపము నిష్పన్నమగును.

కర్మసాధన పక్షమున నిది సిద్ధింపదు॥ ఏలయన, ఆ పక్షమున, 'షష్' అనుదాని షకారము, అంతర్వర్తి విభక్తిచే పదాంతమయి సిద్ధము. కావున దానికి జశ్త్వము కర్తవ్యమయినపుడు 'నపధాంత' యను నిషేధము ప్రవర్తించును. కాగా భసంజ్ఞయు షకారాంతమునందే ప్రవర్తించును గాన సంజ్ఞాద్వయము తుల్యావధికమే కావున ఏకసంజ్ఞాధికారమునందు పరసంజ్ఞ పూర్వసంజ్ఞను బాధించును గాన జశ్త్వము సిద్ధింపకపోవును. కావున తత్సిద్ధి భావసాధన పక్షైక సాధ్యము.

కాని యీ పక్షమునందును దోషము కలదు. 'వాచికః' అనున దిపుడు సిద్ధింపదు. 'వాగాశీర్దత్తుడు' అని యొక వ్యక్తి అనుకంపా వివక్షలో ఠచ్ ప్రత్యయము. శీర్దత్త శబ్దమునకు "ఠాజాదౌ" అని లోపము. తరవాత యస్యేతిలోపము. 'వాచికః' అని రూపము నిష్పన్నము.

పూర్వోదాహృత మయిన 'షడికః' అను రూపమున జశ్త్వము ప్రవర్తించినట్లు ఇట కుత్వము ప్రాప్తించుచున్నది.

పోనిమ్ము, కర్మసాధనమే యనుమనిన,—

'షడికః' అను రూపము సిద్ధింపదు. కావున నివి రెండును నేక పక్షమున సిద్ధించునవి కావు.

అందులకై యత్నము ఆచరింపవలసి యున్నది. ఆ యత్నము పంచమాధ్యాయమునందు చెప్పబడును. అయ్యది "ఏకాక్షర పూర్వపదానా ముత్తర పదలోపో వక్తవ్యః" అను వచనము.

'వాచికః' అను స్థలమున ఉత్తర పదమగు ఆశీర్దత్త అనుదానికంతకును లోపము గాని, 'శీర్దత్త' అనుదానికి లోపమును అకారమునకు యస్యేతి లోపమును కాదు ప్రవర్తించినది. అందు ఆశీర్దత్త శబ్దలోప మ్మజ్ఝలాదేశమగుటచే స్థానివత్త్వ ప్రసంగము లేదు. భత్వము విషయమునను అది చకారాంతమే కాగా భసంజ్ఞ పదసంజ్ఞా బాధకమయి కుత్వమును వారించును. కాగా, 'వాచికః' అనునది సిద్ధించును.

ఇక 'షడికః' అను స్థలమున, "షషష్ఠా జాదివచనాత్సిద్ధమ్" అను వార్తికముచే, ద్వితీయాచ్చున కూర్ధ్వ భాగమంతయు లోపించుననుటచే 'ఙులి' అను దానికి మాత్రమే లోపమును అకారమునకు యస్యేతి లోపమును ప్రవర్తించును. భసంజ్ఞా విషయమున స్థానివద్భావము ప్రవర్తించును గాన ఆ సంజ్ఞ అకారాంతమునందు ప్రవర్తించినను, షాంతము నందలి పదత్వమునకు బాధకము గాదు. జశ్త్వము సిద్ధించును అని భావము. కావున భావసాధన పక్షమే సిద్ధాంతితము.

సరి. 'బ్రహ్మబంధ్వా' 'బ్రహ్మబంధ్వై' ఇవి యెట్లు? అనిన-

పూర్వ పదములను రెండున్ను వాశ్రయించిన చోట అంతాదివద్భావము ప్రవర్తింపదు 'ఉభయత్ర ఆశ్రయణేనాంతాదివత్' అని సమాధానము.

ఇట, అచః పరస్మిన్నను సూత్రముచే, అకార లోపమునకు స్థానివత్త్వము ప్రవర్తించిన యెడల, అచ్చు పరముగా కలదను భావము కలుగును గాన, "కాని" అనచో నికారమునకు యణాదేశమును, ఔకారమునకు ఆవాదేశమును ప్రాప్తించుచున్నవి. వానిని వారించుటకు ఈ నిషేధము విధింపబడినది. స్థానివద్భావముచే కర్తవ్యములగు యణావాదేశ విధులు పదాంత విధులు.

'వేతస్వాన్' అని యొక తద్ధితాంతము. వేతసములు కల దేశము అను నర్థమున "కుముదనడ వేతసేభ్యో డ్మతుప్"(4-2-87) అను సూత్రముచే డ్మతుప్ అను ప్రత్యయము విహితము. అందు డకారము ఇత్సంజ్ఞకము. దానికి ప్రయోజనము టిలోపము. టిలోపానంతరము, 'వేతస్' అను సకారాంతము 'స్వాదిషు' అను సూత్రముచే పద సంజ్ఞకలది అగును. కావున "ససజుషోరుః" (8-2-66) అని రుత్వము ప్రాప్తించుచున్నది. అకార లోపమునకు స్థానివద్భావముచే దానిని వారింపవలెను. కాని రుత్వము పదాంత విధియగుట వలన స్థానివద్భావము నిషేధింపబడిన ఇట రుత్వము రావలసియున్నదని ఆక్షేపము –

రుత్వమునకు ప్రాప్తి కలుగదు, "తసౌమత్వర్థే" (1-4-19) అని సకారాంతమునందు భసంజ్ఞ ప్రవర్తించి పదసంజ్ఞ కది బాధకమగును.

ఇచ్చట డ్మతుప్ ప్రత్యయము,"తదస్మిన్నస్తీతి దేశే తన్నామ్ని"(4-2-67) అను సూత్రముచే మత్వర్థమున ప్రవర్తించినదే కాని ఇతర చాతురర్థికము కాదు. లేదా ఇచ్చట వేతసము లిందుగలవను నర్థమున "తదస్యాస్త్యస్మిన్నితి మతుప్" (5-2-94) అని 'తదస్మిన్నస్తి' అను నర్థమునందే వచ్చిన 'మతుప్' ప్రత్యయమే. కావున 'తసౌమత్వర్థే" (1-4-19) అను సూత్రమున మతు శబ్దముచే ప్రసిద్ధమగు మతుప్ప్రత్యయమునకే గ్రహణమనినను దోషము లేదు అని సమాధానము.

మరల నాక్షేపము – భసంజ్ఞ పదాంత విధి కాదు. కావున నా విషయమున స్థానివద్భావ ప్రతిషేధము ప్రవర్తింపదు, స్థానివద్భావము నిర్బాధమగుటచే, భసంజ్ఞ ప్రవర్తించినను నది అకారాంతమున ప్రవర్తించునది గాన సకారాంతము నందలి పద సంజ్ఞను బాధింపదు. అవి ఇట భిన్నావధికములు గదా. కావున రుత్వాపత్తి తదవస్థయే అని ఆక్షేప సాధక పూర్వపక్షి భావము.

పదాంతవిధిలో స్థానివద్భావము ప్రవర్తింపదను వాక్యములో పదాంత విధియనగా సంప్రతి పదాంతవిధియని మా అభిప్రాయము, అనగా స్థానివద్భావ

ప్రతిషేధము లేకున్నను ఎయ్యది పదాంతముగా పూర్వసిద్ధమో దాని విధిలో నగుట. 'కాని సంతి' 'కౌస్తః' అను వాక్యములందు ఇకార ఔకారము లట్టివి. వేతస్వాన్ అనుచోట అట్లుగాదు. స్థానివత్వ నిషేధమునకు తరువాతనే అటు సకారము పదాంతమగును గాని అంతకుమునుపు పదాంతముగ సిద్ధించినది కాదు. కాగా రుత్వాపత్తి కవకాశములేదని ఒక సమాధానము.

మరల ఆక్షేపమునకు సమర్థనము-

ఈ విధిశబ్దము-విధీయతే ఇతి=విధిః అను వ్యుత్పత్తిచే, కర్మసాధనమును, 'విధానం విధిః' అని భావసాధనమును గలదు కర్మసాధనమగు విధిశబ్దమును గ్రహించిన రుత్వాపత్తి రూపమగు ఈ దోషము పరిహృతమయ్యెడిది. అపుడు సంప్రతిపాదాంతమయినదాని స్థానమున కార్యము కర్తవ్యమయినపుడు నిషేధమని అర్థమగును. కాని భావార్థక క్రిప్రత్యయాంత మాశబ్దమను పక్షమున నీ రుత్వాపత్తి అను దోషము తప్పదు. ఏల అన,

విధి శబ్దము కర్మసాధనమయినపుడు 'పదాంత విధౌ నస్థానివత్' అను వాక్యములో పదాంతస్య విధౌ=పదమునకు చరమావయవము విధీయమాన మయినపుడని యర్థమగును. అది ద్వైయాధికరణ్యముచేత నన్వయము ద్విర్వచనాదులతో విధి శబ్దము సంబంధించినపుడు 'ద్విర్వచనాది రూపములగు కార్యములు కర్తవ్యములగునపుడు' అని సమానాధికరణములకు అన్వయమగును.

అది భావసాధనమయినపుడు విధియనగా విధానమని యర్థముగాన, పద చరమావయవ విధానమునందును, ద్విర్వచనాదుల విధానమునందును నని ఏక రూపముగ సమానాధికరణాన్వయమే ఏర్పడును.

అపుడు పదచర మావయవముగా సిద్ధపూర్వమైనదానికి 'విధానము నందు' అను నర్థమును చెప్పుట కుదురదు. సిద్ధమయినదానికి విధానము వ్యర్థముకదా! కాగా పదత్వ విషయమున స్థానివత్త్వ నిషేధ ముండుటవలన, సాంతమునందే పదత్వమును, భత్వము విషయమున నిషేధము లేనందున, అకారాంతమునందు భసంజ్ఞయు ప్రవర్తించును. కావున రుత్వమునకు ఆపత్తి అని వార్యమని భావము.

మరియు, 'బ్రహ్మబంధూ' శబ్దమునందు జశ్త్వాపత్తి రూపమగు దోషమును గలదు. అది ఊకారాంతము. స్త్రీత్వ వివక్షలో ఊఙ్ అను స్త్రీ ప్రత్యయము రాగా ఏర్పడినది. బ్రహ్మబంధు+ఊ అను నవస్థలో ప్రవర్తించిన సవర్ణ దీర్ఘము ఆదివద్భావముచేత ఊఙ్‌గా గ్రహింపబడిన నది స్వాది ప్రత్యయ మగుటవలన, ధకారాంతమునందు పదసంజ్ఞ ప్రవర్తించును. కాగా జశ్త్వము పదచరమావయవకార్యమగుటచే, పదాంత విధిలో స్థానివద్భావము నిషేధింప

యలోప విధి విషయమున స్థానివద్భావ ప్రతిషేధమునకు ఉదాహరణ మేమి? క్యజంత ప్రకృతిక క్విబ తమగు 'కండూః' అనునది.

ఇది దాని కుదాహరణము కాదు క్విన్నిమిత్తక లోపమునకు స్థానివద్భావము లేదు=క్వౌలుప్తం న స్థానివత్- అను నిషేధమువలననే అది సిద్ధించును.

అట్లైన సౌరి (బలాకా) అనునది ఉదాహరణమగును. సూర్యునితో నేకదిశనున్న కొంగను. సూర్యశబ్దముకంటె పరముగా, "తేనైకదిక్" (4-3-112) అను సూత్రముచే అణ్ప్రత్యయము. అణ్ణ తమగుటవలన జీపు. అణ్ ప్రత్యయాకారమునకును, యకారాకరమునకును యస్యేతి లోపములు. వానికి స్థానివద్భావము వచ్చినయెడల యకారమున కుపధాత్వముండబోదు గాన "సూర్య తిష్యాగస్త్య మత్స్యానాం య ఉపధాయాః" (6-4-149) అను లోపము రాకపోవును. స్థానివత్త్వము నిషేధింపబడిన తరువాత పూర్వలోప మాభీయ మగుటచేత నసిద్ధముకావునను, ద్వితీయ లోపము వ్యాశ్రయమగుటవలన నసిద్ధము కాదు కావునను ఉపధాత్వమునకు భంగము గలుగదు. కావున నిది యలోపమున ఉదాహరణమగును.

ఇదియు ఉదాహరణము కాదు. ఉపధాత్వ విధిలో స్థానివద్భావము ప్రవర్తింపదని ముందొక వచనము చెప్పబడును. దానిచే ఇది సిద్ధించును.

అట్లైన 'ఆదిత్యః' అనునది యుదాహరణము కానోపును. అదితిర్దేవతా అస్య=అను నర్థమున 'ణ్య' అనునది ప్రత్యయము ఆదిత్యేభవః=అను నర్థమున మరల నింకొక ణ్యప్రత్యయము. ఆదిత్య+య అను స్థితిలో యస్యేతి లోపము. తరువాత, సూ॥ "హలోయమాం యమిలోపః" (8-4-64) అని ప్రథమ యకారమునకు లోపము అది స్థానివద్భావ నిషేధసాధ్యము అని తాత్పర్యము.

కాని ఇదియు ప్రయోజనముకాదు. "పూర్వత్రాసిద్ధీయే నస్థానివత్" అని ముందు చెప్పబడును. ఆ వచనముచే ఇది సిద్ధించును. ఈ లోపము పూర్వత్రాసిద్ధీయమే=త్రైపాదికమే గదా!

అట్లైన, 'కండూతిః' 'వల్గూతిః' అను క్తిన్నంతములు ఉదాహరణము లగును. అట లోపము పూర్వత్రాసిద్ధీయముగాదు.

ఇదియు ప్రయోజనముగాదు. కండ్వాది యగంతములకంటె పరముగా భావార్థమున, క్తిన్ప్రత్యయమున కపవాదగా "అప్రత్యయాత్" (3-3-102) అను సూత్రముచే 'అ' అను స్త్రీ ప్రత్యయమే ప్రవర్తించి, 'కండూయా' 'వల్గూయా' అనియే రూఢములగును.

అష్టైన, 'కండూయ' అను యగంతమునకంటె బరముగ, కర్మార్థమున ప్రవర్తించిన క్తిచ్ ప్రత్యయము అంతమందుగల రూపములగు 'బ్రాహ్మణ కండూతిః' 'క్షత్రియ కండూతిః' అనునవి, 'యలోపేన స్థానివత్' అనుదానికి పరిహారాంతరములేని యుదాహరణములు. 'కండూతిః' అనునది కర్మ క్తిజంతము. భావార్థక క్తిన్నంతముగాదు. 'కండూయమానము' అని యర్థము. బ్రాహ్మణ క్షత్రియ శబ్దములకు దానితో షష్ఠీ సమాసము.

"ప్రతిషేధే స్వరదీర్ఘ యలోపేషు లోపాజాదేశో న స్థానివత్" అని ఆక్షేప వార్తికము. స్వరము, దీర్ఘము, యలోపము- ఇవి కర్తవ్యములయి నపుడు లోపరూపమయిన పరనిమిత్త కాజాదేశమే స్థానివద్భావమును పొందును గాని తదితరాదేశమునకు స్థానివత్త్వము రాదు. ఉ॥ ఆకర్షికః, చికీర్షకః, జిహీర్షకః, అనునివి ఉదాహరణము "ఆకర్షాత్ష్ఠల్" (4-4-9) అను సూత్రముచే, ఆకర్ష శబ్దమునకు 'దానితో దిరుగువాడు' అను నర్థమునందు, ష్ఠల్ అను ప్రత్యయము విధింపబడినది. ఆకర్షమనగా బంగారమును బరీక్షించుటకయిన ఒరపిడి రాయి. దానిని బుచ్చుకొని తిరుగువాడని అర్థము. ఠకారమునకికాదేశమును, ప్రకృత్య కారమునకు యస్యేతి లోపమును వచ్చిన తరువాత ఆకర్ష శబ్దమునందలి కకా రాకారమునకు, "లితి" (6-1-193) అను సూత్రముచే అద్యుదాత్తము రావ లెను. యస్యేతి లోపమునకు స్థానివద్భావము వచ్చిన నది రాకపోయెడిది. ఆదేశమిట లోపరూపమే గాన స్థానివద్భావమునకు నిషేధము ప్రవర్తించి స్వరము సిద్ధించినది.

'చికీర్షక' 'జిహీర్షక' అను నుదాహరణము లందును స్వరము సిద్ధించినది.

'లోప రూపమయిన అజాదేశమునకే' అను నియమమువలన పంచా రత్న్యః దశారత్న్యః అనుచో స్థానివద్భావ నిషేధము ప్రవర్తింపదు. అట, అరత్ని శబ్దేకారమునకు గుణము, ఛాందసత్వము వలన వైకల్పికమగుటచే ప్రవర్తింపన దున, యణాదేశము చేయబడినది. దానికి స్థానివద్భావముచే ఇగంతత్వమును సంపాదించి, పూర్వపద ప్రకృతి స్వరమును ప్రవర్తింపజేయ వలెను. అజాదేశ మిట లోపరూపము కాదు గాన స్వర విషయమయినను స్థాని వద్భావ నిషేధము వర్తింపలేదు.

'ప్రతిదీవ్నా' 'ప్రతిదివ్నే' అను లక్ష్యములలో అల్లోపానంతరము, "హలిచ" (8-2-77) అని ఉపధకు దీర్ఘము వచ్చినది. అల్లోపమునకు స్థానివద్భావము, ఆదేశము లోపరూపమే గాన నిషేధింపబడినది.

స్వాది ప్రకృతి యగు పూర్వమును, స్వాది ప్రత్యయ రూపమగు పరమును పద సంజ్ఞలో నాశ్రయింపబడుట వలన, పరాదివద్భావముచే ఊఠ్త్వము సిద్ధింపదు గాన పద సంజ్ఞయు తత్ఫలముగ జశ్త్వమును రావు

'వేతస్వాన్'- అను స్థలమున రుత్వాపత్తి నెట్లు వారింపవలె ననిన,—

'పదాంత విధౌ' అనుచో, పదస్య అంతః=పదాంతః అని విగ్రహము కాదు. పదే అంతః=పదాంతః। పదాంతస్య విధిః=పదాంత విధిః। పదాంత విధిం ప్రతి న స్థానివత్ అని వివక్షితము. ఇపుడు వేతస శబ్దాంతాకారము పదము పరముగాగల పూర్వాంతము గాదు. పరమగునది ప్రత్యయము కాని పదము కాదు గదా !

ఇట్లే, బ్రహ్మబంధూ శబ్దమునందును, పరమగు 'ఊఙ్' పదము కాదు. కావున అటను నిషేధము ప్రవర్తింపదు. 'షడికః' లో ఆ 'ఇకః' అను నదియు పదము కాదు.

ఇట సమాధానాంతరమును జెప్పనగును. ఎట్లనగా, పదాంత పదము నందు షష్ఠీ సమాసమే స్వీకరింపబడినను దోషము లేదు. భసంజ్ఞయు పదాంత విధి కావచ్చును. పరత్వ నిబంధన మగు రుత్వమును ప్రతిబంధించుటకైన భసంజ్ఞ పదాంత విషయము కావున పదాంత విధి యగును. పదచర మావయవ కార్యములయిన, రుత్వ జశ్త్వాదుల వలెను, తత్ప్రాపకమగు పదసంజ్ఞవలెను, 'భసంజ్ఞ' అను పదకార్యము గూడ ఉపప్లుతమగును. ఉపప్లుతమగుటయనగా, పదాంత విధి శబ్దముచే గ్రహింపబడుట. అదియు పరంపరగా పదచర మావయవ ప్రతిబంధకము గాన పదాంత విధి యగునని తాత్పర్యము. కాగా రుత్వాభావము సిద్ధించును.

'నపదాంత' ఇత్యాది సూత్రమునకు 'పదాంత విధింప్రతి నస్థానివత్' 'ద్విర్వచన విధిం ప్రతి నస్థానివత్' మున్నగు విధమున, పదాంత విధిని గురించి, ద్విర్వచనవిధిని గురించి, చివరకు చర్విధిని గురించియు స్థానివద్భావము ప్రవర్తింపదు అని అర్థము.

ఇట్లే 'వరే యలోప విధిం ప్రతిన స్థానివత్' అను ఖండ వాక్యమునకు, వరచ్ప్రత్యయము పరమగునపుడు ప్రవర్తించిన అకారాదేశమునకు యలోపము కర్తవ్యమగునపుడు స్థానివద్భావము ప్రవర్తింపదని యర్థము కావలెను. "తే అప్సు యాయావరః ప్రవపేత పిండాన్" అనునది వైదిక వాక్యము. ఇందు

'యాాయావరః' అనుపదము వరచ్ ప్రత్యయాంతము. యజంతమగు యా ప్రాపణే అను ధాతువునకు "యశ్చయజః" (3-2-174) అను సూత్రముచే, ఆ ప్రత్యయము విధింపబడినది. తరచుగ తిరుగుచుండుట స్వభావముగ గలవాడు, అని ఆ పదమున కర్థము.

యా, యా, య, వర, అను నవస్థలో య(జ్)ప్రత్యయాకారమునకు "అతోలోపః" (6-4-48) అని లోపము తదుపరి యకారమునకు "లోపో వ్యోర్వలి" (6-1-66) అని లోపము. ఇది కర్తవ్యమగునపుడు, అకార లోప మునకు స్థానివద్భావము ప్రాప్తించుచుండ తన్నిషేధమునకై యిందు 'వరే యలోప' అనునది గ్రహింపబడినది. వరప్రత్యయ నిమిత్తకమగు యలోపము విషయమున స్థానివద్భావము రాదని యర్థము, కాని ఇంతతో 'యాయావరః' అనునది సిద్ధించుటలేదు. యలోప విషయమున స్థానివత్త్వ నిషేధము వచ్చినను యజవయవాకార లోపమునకు స్థానివత్త్వము ప్రవర్తించిన యెడల ధాతూత్తర ఖండమునందలి ఆకారమునకు "ఆతోలోపఇటిచ" (6-4-64) అని లోపము ప్రాప్తించుచున్నది. ప్రకృత నిషేధము యలోపమాత్ర విషయకమగుట చేత నాకార లోప విషయమున ప్రవర్తింపదు. అను ఆక్షే పము కలుగును.

ఈ ఆక్షేపమునకు సమాధానము- వరప్రత్యయ నిమిత్తక యలోపము విషయమున స్థానివద్భావము లేదు' అని కాదిచట వివక్షితమగు నర్థము. మరి యేమనిన, 'వరే అయలోప విధిం ప్రతిన స్థానివత్' అని. అయలోప విధి అనగా, అవర్ణ లోపవిధియు, యలోపవిధియు అని యర్థము కావున నా దోషము లేదు.

సిద్ధాంత సమాధానాంతరము - ఈ పక్షమునందు 'యాతిః' అను రూపము సిద్ధింపకపోవును. అది యజంత యా ధాతువు క్తిజంతము. అట అతో లోపము. యలోపము. ఆతోలోపము, మరల యలోపమును ప్రక్రియా క్రమము. అజాది జిన్నిమిత్తకమగు నాకారలోపము ఆవశ్యకము. స్థాని వద్భావ నిషేధమువలన నది సిద్ధింపకున్నది. కావున నీ సూత్రమునందు, 'వరే' అనునది పృథక్పదమనియు, సప్తమీకిలుగభావమును, ద్వంద్వ సమాసమును నిపాతనము వలన సాధువులగుననియు, ఈ యోగవిభాగమువలన 'వరే' అను యోగావయవమునకు వరప్రత్యయము పరమగునపుడు వచ్చిన లోపమునకు స్థానివద్భావము కలుగదు అని యర్థము. కావున 'యాయావరః' అనుచోట యలోపము సిద్ధించును. తరువాత, 'యలోప విధిం ప్రతినస్థానివత్' మున్నగు వాక్యఖండములు ఆయా విధులలో స్థానివద్భావనిషేధమును బోధించుననియు కావున ఇపుడు 'యాతిః' అనునదియు సిద్ధించును అని గ్రహింపవలెను.

'కిరోర్యోః' 'గిరోర్యోః' అనుచోట అజాదేశము లోపరూపము కాదు గాన స్థానివద్భావముచే ఆ దీర్ఘము నివారింపబడినది.

ఇక యలోప విషయమువను— 'బ్రాహ్మణ కండూతిః' క్షత్రియ 'కండూతిః' అనుచోట యలోపము కర్తవ్యమయినపుడు అతో లోపము లోపాజాదేశమే కావున దానికి స్థానివద్భావ నిషేధము ప్రవర్తించి నది.

'వాయ్వోః' 'అధ్వర్వోః' అను స్థలమున యణాదేశము లోపరూపము కానందున నిషేధము వర్తింపలేదు.

అట్లైన ఆ వచనము అపూర్వముగ కర్తవ్యమగుట గౌరవపరాహతమగు విషయము కాదా ? యనిన,

అపూర్వవచనకరణ మక్కరలేదు. లోప మిట ప్రస్తుతమై యున్నది. ఆదేశమును ప్రకృతము. విధి గ్రహణము పూర్వసూత్రము నుండి అను వర్తించును. దీర్ఘాదులును నిర్దిష్టములై యున్నవి. 'స్వర, దీర్ఘ, యలోప విధులందు లోపాజాదేశము స్థాని వంటిది కాదు' అని వానికి అభిసంబంధ కల్పనము మాత్రమే కర్తవ్యము.

ఇచ్చట నొక యాక్షేపము కలుగుచున్నది.

పదము లోక ఆనుపూర్విలో సంనివిష్టము లయినపుడు వానికి యథేష్ట ముగ అభిసంబంధము కలుగవచ్చును. ఆనుపూర్వమనగా ఆసత్తి. పదముల అవ్యవధానమే ఆసత్తి. అది ఉన్నపుడే పదార్థముల సమన్వయము అవగత మగును. ఇట నది లేదు గదా! ఎట్లన

లోపపద మొక్కటియే సూత్రమున కలదు. అదియు 'య' శబ్ద సంబద్ధము. దానికి రెండు విధములుగ నుపయోగము. లోప రూపమగు వాదేశమనియు, 'యలోపము కర్తవ్యమయినపుడు' అనియు తత్సంబంధముచే అర్థము కావలెను. స్వర దీర్ఘ యలోపములు భిన్న భిన్న ప్రదేశములందు పదాంతర వ్యవహితములై ఉన్నవి. అట్టి వానికి ఇష్ట వాక్యార్థ జనకత్వమునకు యథేష్ట సంబంధమెట్లు ? అనిన,

సమాధానము — ఆసత్తి రహితములుగ సన్నివిష్టములగు పదములకు కూడ యథేష్టాభిసంబంధము లోకమున అగపడుచున్నది. పద పదార్థ జ్ఞానా నంతరము వాక్యార్థ బోధ ప్రతిబంధింపబడదు.

ఎట్లన,— "అనడ్వాహముదహారి యాత్వం హరసి శిరసా కుంభం భగిని సాచీన మభిధావంతమద్రాక్షీః" ? అను వాక్యమును జూడుడు. ఇందలి పదములన్నియు నించుమించుగ నాసత్తి విరహితములే. అయినను, పాఠక్రమము కంటె నర్థ క్రమము బలీయమగుట వలన యథేష్టాభిసంబంధమును పదముల కిట్లు కల్పించి అర్థము చేసికొనుట ప్రసిద్ధము. అచ్చట,

"హే ఉదహారి భగిని! యాత్వం కుంభం శిరసావహసి, (సాత్వం) సాచీనమభిధా వంత మనడ్వాహం (కిం) అద్రాక్షీః" అని, యిట్లు పదముల కాసత్తిని కల్పిందుటచే వాక్యార్థ బోధ కలుగుచున్నది.

"తలపైన కడవతో నుదకమును దీసికొని వెళ్ళుచున్న ఓ అక్కా!

నీవు, అడ్డముగ బరుగెత్తి పోవుచున్న ఎద్దును జూచితివా?" అని అన్వయ బోధ కలుగుచున్నది. ఏతావతా, స్వరదీర్ఘత్వాది వచనము అపూర్వ కల్పనీయము కాదు. సూత్రలభ్యమే అని భావము.

**వా॥ "క్వౌ, లుక్, ఉపధాత్వ, చఙ్పరనిర్హ్రాస, కుత్వేషు ఉపసంఖ్యానమ్"** అని న్యూనతాక్షేప వార్తికము.

క్వౌ, లుకి, ఉపధాత్వే, చఙ్పరనిర్హ్రాసే, కుత్వే, చ విషయే స్థాని వద్భావ ప్రతిషేధస్య ఉపసంఖ్యానం కర్తవ్యమ్' అని యర్థము.

అందు, 'క్వౌ' అనుచో 'విధౌ' అను పద మధ్యాహార్యము. కాగా, క్వి నిమిత్తక విధిలో అని యర్థమగును. ఈ 'క్వౌ' అను పదమునకు అధ్యాహారముచేసి, రెండవ 'క్వౌ' అను దానికి, ఆదేశపదముతో గూడ సంబంధమును కలుగజేయవలెను.

నిమిత్తక విధి కర్తవ్యమగునపుడు, క్వి నిమిత్త కాదేశమునకు స్థాని వద్భావము కలుగదు అను నర్థముగల "క్వౌలుప్తం న స్థానివత్" అను వచన మర్థ సిద్ధమగును.

క్వి నిమిత్తక లోపమునకు స్థానివద్భావ నిషేధోదాహరణ మేమి ?

కణ్డ్వాజంత ప్రకృతిక క్విబంతమగు 'కణ్డూః' అనునది. స్థానివత్త్వ నిషేధమువలన; యలోపము సిద్ధించినది, యణాదేశాపత్తి కలుగలేదు.

యల్లోప సిద్ధికిదియు యుదాహరణము కాదు. 'యలోపేన స్థానివత్' అనియు [redacted]ూ|తమునసే కలదుగదా. ౦ని వలన అది సిద్ధించును.

అట్లైన, 'పిపఠిష' అను సన్నంత ధాతువునకు అ ప్రత్యయము=క్విప్ ప్రత్యయము వచ్చినపుడు, 'పిపఠీః' అను రూపమున, "ర్వోరుపధాయాదీర్ఘంఇకః" (8-2-76) అను సూత్రముచే దీర్ఘము సిద్ధించుట ప్రయోజనము. స్థానివద్భావము వచ్చిన, రేఫాంతము పదము కాకుండును. దీర్ఘము సిద్ధింపదు.

ఇదియు గాదు. 'దీర్ఘేన స్థానివత్' అని సూత్రమున కలదు గదా.

అట్లైన, 'లావయతీతి=లౌః'। 'పావయతీతి=పౌః' అనునవి కావచ్చును. ణిలోపమునకు స్థానివద్భావము వచ్చిన, వకారమునకు 'ఊఠ్' రాకపోవును. లోపము క్వి నిమిత్తకాదేశము.

ఇదియు కాదు. ఇచట వృద్ధ్యావాదేశములను ప్రవర్తింపజేయకయే ణిలోపముచేయబడును. తరువాత ప్రత్యయ లక్షణముచే వృద్ధి ప్రవర్తించును. కాగా స్థాని భూతమగు అచ్చునకు పూర్వము వకారము దృష్టము కాదు గాన స్థానివత్త్వ ప్రాప్తియేలేదు.

పోనిమ్ము, ఈ 'లౌః', 'పౌః'— అనునవియే, వేరొక విధముగ నిష్పన్నమయినవి యుదాహరణములు కానగును. ఎట్లనగా,

లవమాచష్టే లవయతి. ఈ లవ్ + ఇ అను ణ్యంతము కంటె పరముగా క్విప్ ప్రత్యయము వచ్చినపుడును లౌః అను రూపము,ఊఠాదేశము, ఏత్యేధతీతి వృద్ధియు రాగా ఏర్పడును.

ఇట్లే 'పౌః' అనునదియు అగును. ఇచట వకార మవాదేశ నిష్పన్నము కాదు. కావున స్థాని భూతమగు అచ్చునకు పూర్వముగ దృష్టమే. కావున స్థానివద్భావము వచ్చిన, ఊఠాదేశము సిద్ధింపదు. క్వి నిమిత్తక లోపము ఇట ణిలోపము అనిన,

ఈ సమాధానమును గుదురదు. ఎందువలననగా, ణిలోపమునకు నిమిత్తము క్విప్పు అకారలోపమునకు నిమిత్తము ణి ప్రత్యయము. ణి లోపమునకు స్థాని వత్త్వము ఈ రచనముచే నిషేధింపబడినను, అకార లోపమునకు స్థానివద్భావము తప్పనిది. ణిలోపము క్వి నిమిత్తకము కాదు గదా! అనిన,

దీనికి సిద్ధాంత భూతమగు సమాధానము —

'క్వాలు ప్తం నస్థానివత్" అనుదానికి, 'క్వినిమిత్తకలోపమునకు స్థానివత్త్వము లేదు' అని మాత్రమే అర్థము కాదు.

'క్వినిమిత్తక విధి కర్తవ్యమయినపుడు, ఏ లోపమయినను స్థానివద్భావము కలది గాదు, అను నర్థముగూడ, లక్ష్య సిద్ధి కొరకు, క్వాచిత్కముగ గ్రహింపబడును.

కావున నిట కర్తవ్యమగు ఊడాదేశ విధి క్వి నిమిత్తక విధి కావున, క్వి నిమిత్తకము కాని టిలోపమునకును స్థానివద్భావము ప్రవర్తింపదు.

'లుకి న స్థానివత్' అను దానికి ఉదాహరణము ఏమి ?

'బింబమ్' 'బదరమ్' ॥ — బింబి యొక్క ఫలము బింబము, బదరి ఫలము బదరము. బింబీ బదరీ శబ్దములు గౌరాది జీషంతములు. "అనుదాత్తాదేశ్చ" (4-3-140) అను సూత్రముచే వికారార్థము నందు అఞ్ ప్రత్యయము. దానికి "ఫలేలుక్" (4-3-163) అని లుక్కు. "లుక్తద్ధితలుకి" (1-2-49) అని స్త్రీ ప్రత్యయమునకు లుక్కు.

ఇట, జీషుకు వచ్చిన లుక్కుకు స్థానివద్భావము వచ్చిన యెడల, ప్రకృత్యకారమునకు యస్యేతి లోపము ప్రాప్తించుచున్నది. కావున లుగ్రూపమగు నాదేశము విషయమున స్థానివద్భావము ప్రవర్తింపదని చెప్పి దానిని వారింపవలెను.

ఈ ప్రయోజనము పుం వద్భావముచే సిద్ధించునుగాన ఇది ఉదాహరణము కాదు. "తసిలాది ష్వాకృత్వ సుచః" (6-3-35) అను సూత్రము నందలి 'భస్యాఢే తద్ధితే' అను వార్తికముచే పుం వద్భావము రావచ్చును. బింబ, బదర, ఆమలక శబ్దములు త్రిలింగములు.

పోనిండు, 'ఆమలకమ్' అనునది ప్రయోజనమగును. ఆ శబ్దము వృద్ధ ప్రాతిపదికమగుట వలన అట మయట్ప్రత్యయము వికారార్థమున విహితము. అది హాలాదియగుట వలవ పూర్వము భ సంజ్ఞకము కాదు. పుం వద్భావము ప్రవర్తింపదు. అనిన,

ఇదియు ఉదాహరణము గాదు. 'ఫలే లుగ్వచనానర్థక్యం ప్రకృత్యంతరత్వాత్" అని వార్తికకారుడు, ఈ సూత్రమున చెప్పనున్నాడు.

బింబ, బదర, ఆమలకమున్నగునవి, విజాతీయ ఫలజాతి వాచకములే గాని, బింబి ఫలము గాన బింబము. బదరి ఫలము గాన బదరము అని యిట్లు యౌగికార్థ బోధకములు గావు. కావున అట వికారార్థమున ప్రత్యయము గాని దానికి లుక్కు గాని ప్రవర్తింప లేదు స్త్రీ ప్రత్యయ లుక్కును లేదు.

అట్లైన 'పంచపటుః' 'దశపటుః' అనునవి యుదాహరణములగునని సమాధానాంతరము. పంచభిః పట్వీభిః క్రీతః, దశభిః పట్వీభిః క్రీతః అని అర్థము "అర్హాద గోపుచ్ఛ సంఖ్యా పరిమాణాఠక్" (5-1-19) అని ఠక్ప్రత్యయము. దానికి "అధ్యర్ధపూర్వ ద్విగోర్లుగసంజ్ఞాయామ్" (5-1-28) అని లుక్కు. 'లుక్తద్ధిత లుకి' అని జీషుకు లుక్కు. ఈ లుక్కుకు స్థానివద్భావము వచ్చిన యెడల ఉకారమునకు యణాదేశము రావలసివచ్చును. తద్వారణమునకై స్థానివద్భావ నిషేధము.

ఇదియు పుంవద్భావము చేతనే సిద్ధించును గదా !

పుంవద్భావ మెట్లు ?

భభిన్నమగు తద్ధిత ప్రత్యయము చికీర్షితమయినపుడు భసంజ్ఞకమగు స్త్రీ వాచకమునకు పుం వాచక రూపము అతిదేశింపబడును.

భసంజ్ఞకమునకు గదా యకారాది గాని అజాది గాని యగు స్వాది పరమయినపుడు గదా భసంజ్ఞ. ఇట అజాది ప్రత్యయము అగపడుట లేదే ?

అనిన, ప్రత్యయ లక్షణముచే అజాది పరత్వము సంభవించును.

అది యెట్లు కుదురును ? వర్ణాశ్రయ కార్య విషయమున ప్రత్యయ లక్షణము లేదు గదా. భ సంజ్ఞ వర్ణాశ్రయ కార్యమాయె.

అట్లనిన, 'తసిలాదిష్వాకృత్వసుచః' అను వార్తికముచే, పుంవద్భావము వచ్చును. తసిలాదులు ప్రత్యయములు పరమయినప్పుడు గదా పుంవద్భావము. ఇట అవి లేవే ?

ప్రత్యయ లక్షణముచే, తత్పరత్వము లభ్యమనిన,

"నలుమతాఙ్గస్య" (1-1-63) అను సూత్రమునకు పాఠాంతరము "నలుమ తాతస్మిన్" అనునది. దానిచే ప్రత్యయ లక్షణమునకు ప్రతిషేధము కలుగును,

మరియు ఒక తద్ధిత ప్రత్యయమే క్రీడార్థకము గాదు. తద్ధిత ప్రత్యయము లన్నియు క్రీడాద్యర్థకములే కావు లుక్ప్రయోజకము లయిన ఇతర తద్ధిత ప్రత్యయములును గలవు.

పంచ ఇన్ద్రాణ్యః దేవతాః అస్య=పఞ్చేన్ద్రః॥ దశ ఇన్ద్రాణ్యః దేవతాః అస్య=దశేన్ద్రః॥ అగ్లే పఞ్చాగ్నిః। దశాగ్నిః॥

అట, "సాస్యదేవతా" (4-2-24) అను సూత్రముచే అణ్ అను తద్ధిత ప్రత్యయము. దానికి, "ద్విగోర్లుగనపత్యే" (4-1-88) అను సూత్రముచేతను, జీష్ ప్రత్యయమునకు, "లుక్తద్ధిత లుకి"(1-2-49) అను సూత్రముచేతను, లుక్కులు ప్రవర్తించును. అందా స్త్రీ ప్రత్యయ లుక్కునకు స్థానివద్భావము ప్రవర్తించిన, తత్సంనియోగ శిష్టమగు ఆనుగాగము అట వినబడవలసి వచ్చును.

అగ్లే, పఞ్చ అగ్నాయ్యః దేవతాః అస్య=పఞ్చాగ్నిః అను చోట, జీప్ప్రత్యయ సంనియోగ శిష్టమగు ఐకారమునకు, శ్రవణము, స్థానివద్భావ ముచే, ప్రసక్తమగును. పూర్వ విధి కర్తవ్యమయినపుడు గదా స్థానివద్భావము ప్రవర్తించునది. ఇట స్థానిభూతమగు నచ్చునకు పూర్వముగ దృష్టమయిన దానికి విధి ఏదియు కర్తవ్యము కాదే అనవచ్చును. కాని పూర్వవిధి అనగా, పూర్వమునకు స్థితి=శ్రవణము అని అర్థము

కాగా 'లుకినస్థానివత్' అనుదాని కిది అనన్యథా సిద్ధ ప్రయోజనము.

ఉపథాత్వమున=ఉపధాకార్య విషయమున స్థానివద్భావ ప్రతిషేధము నకు ఏమి ఉదాహరణము?

పిపఠిష అను సన్నంత ధాతువునకు పరముగ అప్రత్యయము వచ్చినపుడు ఏర్పడు "పిపఠీః" అనునది ఉదాహరణము.

దీర్ఘము కర్తవ్యమయినపుడు స్థానివద్భావము ప్రవర్తింపదని సూత్రమునందు చెప్పబడినది గదా, ఆ నిషేధము వలననే ఇది సిద్ధించునే అనిన,

అపుడు, 'సౌరిబలాకా' అనునిది యుదాహరణమగును.

-'యలోపే న స్థానివత్' అనుదానిచే ఇదియు గతార్థమే అగుననిన, అపుడు, 'పారిఖీయః' అనునది కావచ్చును.

పరిఖా శబ్దమునకు బరముగా చాతురర్థికమగు అణ్ ప్రత్యయము రాగా 'పారిఖః' అని రూపము. యస్యేతి సూత్రముచే అకారమునకు లోపము. పిదప 'పారిఖీభవః' అను నర్థమునందు "వృద్ధాదకేకాంత ఖోపధాత్" (4-2-141) అను సూత్రముచే 'ఛ' ప్రత్యయము రాగా, 'పారిఖేయః' అని రూపమగును. ఆకార లోపమునకు స్థానివద్భావము వచ్చిన యెడల ప్రాతిపదికము ఖోపధము కాదు గాన ఛ ప్రత్యయము సిద్ధింపక పోవును. కావున ఉపధాత్వ ప్రయుక్త కార్య విషయమున స్థానివద్భావమునకు నిషేధ ముపసంఖ్యా నీయము.

చఙ్పర నిర్హ్రాసము కర్తవ్యమయినపుడును స్థానివద్భావమునకు నిషేధ ముపసంఖ్యాతవ్యము.

"వాదితవంతం ప్రయోజిత వాన్ = అవీవదద్వీణాంపరివాదకేన"

ఎందువలన సిద్ధింపదు ?

ణి నిమిత్తక ణిలోపమునకు స్థానివద్భావము కలిగిన యెడల హ్రస్వ త్వము ప్రాప్తింపకపోవును. ఇట హేతుమణ్ణిచ్చులు రెండు. రెండవ ణిచ్ప్రత్యయ మూలముగ మొదటి ణిచ్చునకు లోపము. దానికి స్థాని వద్భా వము ప్రవర్తించిన, "ణౌచఙ్యుపధాయాహ్రస్వః" (7-4-1) అను సూత్ర ముచే రావలసిన హ్రస్వము రాకపోవును. అందులకై నిషేధోప సంఖ్యానము.

ఉపధాత్వ ప్రయుక్త కార్యము విషయమున స్థానివత్త్వ నిషేధము చెప్పబడినది గదా. ఈ హ్రస్వమును ఉపధాత్వ ప్రయుక్తమే. ఆ నిషేధముచే గతార్థ మగును గదా !

అనిన 'ప్రత్యయ విధిరూప విశేష విషయముననే ఆ నిషేధము ప్రవర్తిం చును' అని చెప్పవలెను. లేనిచో 'పటయతి' 'లఘయతి' అను రూపములలో ఉపధా వృద్ధివారణము టిలోపమునకు స్థానివద్భావము చేతనే సాధ్యము. స్థానివద్భావ నిషేధమట ప్రవర్తించిన అది సిద్ధింపదు. అందులకే ఉపధా ప్రయుక్త కార్యము ప్రత్యయ విధి విషయమైననే ఆ నిషేధము ప్రవర్తించు నని చెప్పవలెను.

కుత్వము కర్తవ్య మయినను స్థానివత్త్వమునకు నిషేధము వక్త వ్యము.

ణ్యంతములగు 'అర్చమర్చ' అను ధాతువులకు, కర్మార్థమున ఘఙ్

ప్రత్యయము రాగా, "చజోఃకుఘిణ్ణ్యతోః" (7-3-52) అను సూత్రముచే కుత్వమువచ్చి 'అర్కః' 'మర్కః' అను రూపములగుచున్నవి.

అట కుత్వము కర్తవ్యమగునపుడు ణిలోపమునకు స్థానివత్త్వము ప్రవర్తించిన యెడల, కుత్వము, ఘిత్తు వ్యవహితమగుచు గాన ప్రవర్తింపక పోవును. కావున కుత్వ విషయమున స్థానివత్త్వ నిషేధ మావశ్యకము.

అనిన ఇది ఘఞంతమే కాదు కాన ఉపసంఖ్యానముతో పనిలేదు. ఇది ఔణాదికమగు కప్రత్యయము. అది పరమగునపుడు, అష్టమాధ్యాయ విహితమయిన, "చోఃకుః" (8-2-30) అను కుత్వము, చకారమునకు రాగా దానికి "ఝరోఝరిసవర్ణే"(8-4-65) అను లోపము. కనుక స్థానివత్త్వ ప్రతిషేధ మక్కరలేదని యాక్షేప్త భావము.

కాని, ఆష్టమిక కుత్వముఖనను, ణిచ్చుచే ఝల్లు వ్యవహితమయిన ప్రవర్తింపదు. కాగా కుత్వము కర్తవ్యమగునపుడు స్థానివద్భావమునకు ప్రతిషేధ మవర్జనీయమని తాత్పర్యము.

వా॥ "పూర్వత్రాసిద్ధేచ" అని ఆక్షేప వార్తికాంతరము.

పూర్వత్రాసిద్ధమనగా, తదధికారమగు త్రిపాది యందలి శాస్త్రీయ విధి. అది కర్తవ్యమగునపుడు స్థానివద్భావము ప్రవర్తింపదని చెప్పవలెనని వార్తికార్థము.

ప్రయోజనము లేమి ?

వా॥ "ప్రయోజనం క్సలోపః సలోపే" అని మొదటి ప్రయోజనము.

'అధుగ్ధ' 'అధుగ్ధాః' అను స్థలములందు చ్లి ప్రత్యయాదేశమగు 'క్స' అను ప్రత్యయమునకు దంత్యాదియగు నాత్మనేపద ప్రత్యయము పరమగునపుడు గూడ, అకారాదితఙ్ఞు పరమగునపుడువలె అంత్య లోపమునే విధించిన, శేషించిన సకారమునకు "ఝలోఝలి" (8-2-26) అని లోపము రావచ్చును. కావున 'లుగ్వాదుహదిహలిహ్యా' ది సూత్రముచే లుక్కును విధించుట వ్యర్థము. సకారమునకు లోపము కర్తవ్యమగునపుడు అకార లోపమునకు స్థానివద్భావము వచ్చునను ఆశయముతో లుక్కు విధింపబడినది. "పూర్వత్రాసిద్ధేచ" అను వచనముచే స్థానివద్భావము నిషేధింపబడినది గనుక, లుగ్విధానమనావశ్యకము. సలోపే 'ఝలోఝలి' అని సకారమునకు లోపము కర్తవ్యమయి

నపుడు, క్సలోపః = క్స ప్రత్యయాకారమునకు స్థానివత్త్వము ప్రవర్తింపకుండుట, "పూర్వత్రా సిద్ధీయే న స్థానివత్" అను ఈ వచనమునకు ప్రయోజనము అని వార్తికార్థము.

వా॥ "దధ ఆకారలోప ఆది చతుర్థత్వే" అని రెండవ ప్రయోజన వార్తికము.

ధా ధాతువునకు వచ్చిన అకార లోపమునకు, ఆది చతుర్థత్వే=ఆద్యక్షర మునకు చతుర్థ వర్ణాదేశము=భష్ భావము కర్తవ్యమయినపుడు, స్థానివద్భావము లేకుండుట ప్రయోజనాంతరమని యర్థము.

ధత్సే, ధద్ధ్వే, ధద్ధ్వమ్ — అనునవి యుదాహరణములు. 'ధా' ధాతువు. సే, ధ్వే, ధ్వమ్ అనునవి ప్రత్యయములు.

"శ్నాభ్యస్తయోరాతః" (6-4-112) అని ధాత్వాకారమునకు లోపము. ఝషంతమగు ధాత్వవయవమైనట్టి ఏకాచ్చు యొక్క బశ్వర్ణమునకు భష్వర్ణము. సకారధ్వ శబ్దములు పరమగునపుడును పదాంత మందునను వచ్చునని "ఏకాచోబశోభష్ఝషంతస్యస్ధ్వోః" (8-2-37) అను సూత్రము చెప్పుచున్నది. దాని తరువాతి సూత్రము, "దధస్తథోశ్చ" (8-2-38) అనునది. అది 'ధా' ధాతువు బశ్వర్ణమునకు 'త' 'థ' లు పరమగునపుడును, చకారము వలన 'స', 'ధ్వ' లు పరమగునపుడును భష్ భావమును విధించుచున్నది. 'ధా' అను ధాతువు ఆకారమునకు వచ్చిన లోపమునకు స్థానివద్భావము వచ్చిన యెడల ఝషంతత్వముండదు గాన "ఏకాచః"— అను సూత్రముచేత భష్ భావము సిద్ధింపదను తలంపుతో అనంతర సూత్రమునందు 'స్ధ్వోః' అను పదమును అను కర్షించుటకు చకారము గ్రహింపబడినది. భష్భావము పూర్వత్రా సిద్ధీయము. అది కర్తవ్యమగునపుడు అకార లోపమునకు స్థానివత్త్వము ఈ వచనముచే నిషేధింపబడినది గాన, పూర్వ సూత్రముచే సిద్ధించును. ఇక చకారముతో పని లేదు.

వా॥ "హలోయమాంయమిలోపే" ప్రయోజనాంతర వార్తికము.

'ఆదిత్యః' = ఆదిత్యో దేవతా అస్య=ఆదిత్యుడు దేవతగా గల క్రతువు. ఆదిత్య+య అను నవస్థలో యస్యేతి లోపాంతరము "హలోయమాంయమిలోపః" (8-4-64) అని మొదటి యకారమునకు లోపము రావలెను. అది అకార లోప స్థానివద్భావనిషేధ ఫలము.

**వా॥ అల్లోపణిలోపౌ సంయోగాంతలోపప్రభృతిషు"** ఇదియు ప్రయోజ నాంతర వార్తికము.

పాపచ్య అను యజంతము కంటె పరముగా 'క్తిచ్' ప్రత్యయము. యాయజ్య+తిః = యాయష్టిః॥ పాపక్తిః అనుచో కుత్వమును 'యాయష్టిః' అనుచో షత్వమును కర్తవ్యములగు నపుడు, అల్లోపమునకు స్థానివద్భావ నిషేధము ప్రయోజనము.

'పాచి' యాజి' — అనుణ్యంతములకు క్తిచ్ ప్రత్యయముచే నేర్పడు రూపములు పాక్తిః యాష్టిః అనునవి. అట ణిలోపమునకు స్థాని వత్త్వ నిషేధ ఫలము కుత్వషత్వముల సిద్ధి. వార్తికమునందలి ప్రభృతి గ్రహణముచే కుత్వ షత్వములు గ్రహింపబడును.

**వా॥ "ద్విర్వచనాదీనిచ"** అను నదియు ప్రయోజన **వార్తికము.** "పదాంత" సూత్రమునందు ద్విర్వచనాదులను పఠింప నక్కరలేదు. ఈ వచనము చేతనే స్థానివద్భావ ప్రతిషేధము సిద్ధించునని భావము.

ద్విర్వచనాదు లనిన, చర్త్వధ్వంతము లయినవి అన్నియు గ్రాహ్య ములా ? కాదు. **వా॥ "వరే యలోప స్వరవర్జమ్"**

పర ప్రత్యయ నిమిత్తక యలోపమును, స్వరమును వర్జించి, ద్విర్వచన, సవర్ణ, అనుస్వార దీర్ఘ జశ్చర్త్వాదులనుట. ఇవి యన్నియు సాహచర్యమువలన త్రైపాదికములే గ్రహింపబడును

**వా॥ "తస్య దోషః సంయోగాదిలోప లత్వణత్వేషు"**— అనునవి ప్రతి ప్రసవ వార్తికము. తస్య=ఆ "పూర్వత్రా సిద్ధీయే న స్థానివత్" అను లక్షణ మునకు సంయోగాది లోపము లత్వము, ణత్వము, అను వీని విషయమున, దోషః= అతి వ్యాప్తి కలుగుచున్నది కాన ఆ విషయమున స్థానివద్భావము నకు ప్రతిప్రసవమును చేయవలసి యున్నది" అని వార్తికార్థము.

సంయోగాదిలోప విషయమున, ప్రతి ప్రసవమునకు ఉదాహరణము— "కాక్యర్థమ్" "వాస్యర్థమ్" అనునవి. ఇట యణాదేశోత్తరము, పదాంత సంయోగమగు కకార యకార సంయోగాది కకారమునకును, 'సయ' సంయోగాది సకారమునకును "స్కోః సంయోగాద్యోరంతేచ" (8-2-29) అని లోపము ప్రాప్తించుచున్నది. దాని యణాదేశమునకు స్థానివద్భావము చేసి వారింపవలెను. అది పూర్వత్రాసిద్ధీయ విధియే కావున స్థానివద్భావము ప్రవ

ర్తింపనిచో, సంయోగాది లోపము వారింపబడదు. కాగా అట ప్రతి ప్రసవము క ర్తవ్యమని భావము.

ఇక లత్వ విషయమున ప్రతి ప్రసవోదాహరణము- 'నిగార్యతే' 'నిగాల్యతే' నిగారి+య+తే. నిపూర్వకమగు ణిజంత గౄధాతువునకు కర్మార్థమున లట్రూపములు, నిగార్యతే నిగాల్యతే. ఇలోపో త్తరము "అచి విభాషా" (8-2-21) అను సూత్రముచేత రేఫకు వికల్పముగా లత్వము, దానికి నిమిత్తము అచ్చు ణిలోపమునకు స్థానివద్భావముచేత అచ్పరత్వము సంపాదనీయము. ఈలత్వము త్రైపాదికమగుటచే "పూర్వత్రా సిద్ధీయే న స్థానివత్" అను నిషేధము ప్రా ప్తించుచున్నది. కావున ప్రతి ప్రసవము, స్థానివద్భావమునకవశ్యక ర్తవ్యము.

ణత్వ విషయమున ప్రతి ప్రసవ వచనోదాహరణము- "మాషవపనీ" "వ్రీహివపనీ" 'మాషదపన'- 'వ్రీహివపన'- అనునవి సమాసములు. జీప్ ప్రత్యయ ప్రవృత్త్యనంతరము యస్యేతిలోపము. ఇపుడు ప్రాతిపదికాంత నకారమునకు, "ప్రాతిపదికాంత నుమ్విభక్తిషుచ" (8-4-11) అని ణత్వము ప్రా ప్తించుచున్నది. అది స్థానివద్భావముచే వారింపబడవలెను ణత్వము పూర్వత్రా సిద్ధీయమైనను, తద్విషయమున స్థానివ త్త్వమునకు ప్రతి ప్రసవమును కల్పించిననే అది వారింపబడును అని భావము.

"న పదాంత ద్విర్వచన వరే య లోప స్వరస వర్ణానుస్వార దీర్ఘ జశ్చ ద్విధిషు"

అను సూత్రమునకు వివ ర్తము ముగిసినది.

## "ద్విర్వచనేఽచి" (1-1-58)

ద్విః ఉచ్యతే అస్మిన్నితి=ద్విర్వచనః. ఏయది పరమగునపుడు ద్విత్వము ప్రవ ర్తించునో అది ద్విర్వచనము. అట్టి అచ్చుపరమయినపుడు, అజాదేశము స్థానివద్భావమును బొందును అని అర్థము.

'చక్రతుః' చక్రుః అను రూపములలో 'కృ' ధాతువు. ఋకారమునకు యణాదేశము రేఫము ద్విర్వచనము అచ్చుతో గూడినదానికి గాని అచ్చుకు, పూర్వదృష్టమగు కకారమునకు మాత్రము గాదు. అదువలన 'అచః పరస్మిన్' అను సూత్రముచే ప్రా ప్తింపని స్థానివద్భావము నీ సూత్రము విధించుచున్నది.

వా॥ "ఆదేశే స్థానివదనుదేశాత్ తద్వతో ద్విర్వచనమ్" అని యాక్షేప వార్తికము.

ఆదేశమునందు స్థాని కార్యమతిదేశింపబడుచున్నది. కావున స్థాని కార్య మగు ద్విత్వము ఆదేశ విశిష్టమునకై ప్రాప్తించుచున్నది అని యర్థము. అయిన ఏమి దోషము ? అనిన,

వా॥ "తత్రాభ్యాసరూపమ్" అని ఆక్షేప వార్తిక ద్వితీయఖండము. అభ్యాసరూపము సిద్ధింపకపోవును. ఎచ్చట? "చక్రతుః' 'చక్రుః' అను స్థల మున. అట 'చ' అను అకార విశిష్టాభ్యాసము సిద్ధింపకపోవును.

వా॥ "అజ్గ్రహణంతు జ్ఞాపకం రూప స్థానివద్భావస్య" అని సమా ధాన వార్తికము స్థానివద్భావము రూపమునకే, కార్యమునకుగాదు. అందు వలన అభ్యాసరూపము సిద్ధించును ఈ సూత్రమునందలి 'అచి' అనునదియే రూపము స్థానివంటిదగునను అంశమునకు జ్ఞాపకము స్థానిరూపమున కతి దేశము కాని కార్యమునకుకాదు గాన అభ్యాసరూపాసిద్ధి లేదని తాత్పర్యము.

అది యెట్లు జ్ఞాపకమగును ? అనిన,

'అచి' అను పదమునకు, 'జేఘ్రీయతే' 'దేధ్మీయతే' అనుచోట స్థాని వద్భావము ప్రవర్తింపకుండుట ప్రయోజనము. అవి యఙంతరూపములు. 'ఘ్రా' 'ధ్మా' ధాతువుల ఆకారమునకు, "ఈఘ్రాధ్మోః" (7-4-31) అను సూత్రముచే, యఙ్ప్రత్యయము పరమగునపుడు ఈకార మాదేశింపజేయబడినది. ఈ ఈకారమునకీ సూత్రముచే స్థానివద్భావము ప్రవర్తించినయెడల అభ్యాస రూపములగు జే,దే, అనునవి సిద్ధింపకపోవునను తాత్పర్యముతో, 'అచి' అను పదము గ్రహింపబడినది. అనుదేశము కార్యానుదేశమయిన, అజ్గ్రహణముతో పనిలేదు 'ఘ్రీ' 'ధ్మీ' లకు ద్విర్వచనము వచ్చును. రూపమున కతిదేశమనిననే అజ్గ్రహణ మర్థవంతమగును అని సమాధానవార్తిక తాత్పర్యము.

వా॥ తత్రగాఙ్ప్రతిషేధః"అని సమాధాన బాధకాక్షేప వార్తికము.

'అధిజగే'- అనునది ఇఙ్ అధ్యయనే అను ధాతువునకు లిడంతరూపము. "గాఙ్ లిటి" (2-4-49) అని ధాతువున కాదేశము 'గాఙ్' అనునది.

'త' అనుదానికి 'ఏశ్' అను నాదేశము ప్రవర్తించిన తరువాత అది ప్రవర్తించునుగాన అది పరనిమిత్తకాజాదేశము. ఇట స్థానివద్భావము ప్రవ ర్తించిన యెడల అది రూపాతిదేశము కావున, అభ్యాస మివర్ణరూపము కావ

లసివచ్చును. కాగా గాఙాదేశమునకు స్థానివద్భావ ప్రతిషేధము వక్తవ్య మగును- అని యాక్షేపము రూపాతిదేశ పక్షమున నుత్థితమగుచున్నది.

కాని ప్రతిషేధమునకు వక్తవ్యత లేదు. అట స్థానివద్భావమునకు ప్రాప్తియేలేదు. ద్విత్వ నిమిత్తమగు అచ్చు పరమగునపుడుగదా స్థానివద్భా వము? ఇచట గాఙాదేశము లకారావస్థయందే ప్రవర్తించును గాన అది అచ్ప రకమగు నాదేశమేకాదు. 'గాఙ్లిటి' అనునది ద్విలకారక నిర్దేశము. లకారాది యగు లిట్టుపరమగునపుడు గాఙాదేశమగునని ఆ సూత్రమున కర్థము. కావున, ప్రతిషేధము అనావశ్యకము.

**వా॥ "క్నాత్యేణంత దివాదినామ ధాతుష్వభ్యాసరూపమ్"** అని ఆక్షే పాంతర వార్తికము.

'అజ్నిమిత్తకమగు నజాదేశము, ద్విత్వము కర్తవ్యమయినపుడు, స్థాని రూపమును బొందును' అని ప్రకృత సూత్రమున కర్థమను నభిప్రాయముతో నీ యాక్షేపము చేయబడినది. ఆ పక్షమునందు, 'అచికీర్తత్' అను, 'కౄత సంశబ్దనే' అను ణిజంతధాతు లుఙంతరూపమునందు ఇకార ఘటితమగు నభ్యాస రూపము సిద్ధింపకపోవును. అట, "ఉపధాయాశ్చ" (7-1-101) అను సూత్రముచే ౠకారమున కిత్వము, రపరత్వము. "ఉపధాయాంచ" (8-2-78) అని దీర్ఘము. తరువాత ద్విత్వము. అభ్యాస కార్యములు హ్రస్వము, ఇత్వము, దీర్ఘము రాగా=అచికీర్తత్.

ణ్యంత విషయమున ఉదాహరణము- 'జగ్లే', 'మమ్లే' అనునవి. 'గ్లై' 'మ్లై'- అనునవి ధాతువులు. లిట్టులో 'త' ప్రత్యయమునకు 'ఏశ్' ఆదేశము. "ఆదేచ ఉపదేశే౽శితి" (6-1-45) అని ఆత్వము. ఆ సూత్రమున, 'అశితి' అను పదమునకు, ఇత్సంజ్ఞక శకారాది కాని ప్రత్యయము పరమగునపుడు అని యర్థము. ఇట ఆత్వమునకు స్థానిరూపాతిదేశము వచ్చినచో అభ్యాసరూపము సిద్ధింపకపోవును.

ఇక దివాది విషయమున ఉదాహరణము- 'దుద్యూషతి', 'సుస్యూషతి' ఆ రూపములు, 'దివు' 'షివు' ధాతువుల సన్నంతములు. సన్ప్రత్యయమునకు వికల్పముగా ఇడాగమ నిషేధము. "హలంతాచ్చ" (1-2-10) అని సన్ప్రత్యయ మునకే కిత్త్వము, ధాతు వకారమునకు, ఊఠ్. తరువాత యణాదేశము తదు పరి ద్విత్వము=ప్రక్రియాక్రమము. ఇట అజ్నిమిత్తకాదేశము యణాదేశము. స్థానికి స్థానిరూపాతిదేశమా గలిగిన, 'దు' అను నభ్యాసరూపము సిద్ధింపక పోవును.

ఇక నామధాతు విషయమున ఉదాహరణము- "బిభవనీయిషతి" 'భవన మిచ్ఛతి=భవనీయతి. భవనీయితుమిచ్ఛతి=బిభవనీయిషతి, 'భవనీయ' అను క్యజంతముకంటె పరముగా ఇచ్ఛార్థమున 'సన్' ప్రత్యయము. తనకొక భవనము కావలెనని కోర నిచ్ఛగించువాడు. 'భవనీయిష' అను సన్నంతమునకు "సన్యఙోః" (6-1-9) అని ద్విత్వము. 'అజ్నిమిత్తకమగు నజాదేశము, ద్విత్వము కార్యమయినపుడు స్థాని రూపమును బొందును' అను నీ సూత్రార్థముచే గుణావాదేశములకు స్థానివద్భావము ప్రవర్తించిన యెడల నభ్యాసములో అకారము లభింపదు. కాగా "సన్యతః" (7-4-79) అను నిత్వమున కవకాశము కలుగదు. 'బి' అను నభ్యాస రూపము సిద్ధింపదు.

అట్లైన, "ద్విర్వచనేచి" అను సూత్రమున 'ప్రత్యయే' అని చేర్తును. అపుడు, అజాది ప్రత్యయ నిమిత్తకమగు నజాదేశము, ద్విత్వము కర్తవ్యమగు నపుడు, స్థానివద్భావమునందును, అని అర్థమగును. దాని వలన దోషము పరిహృతమగునని భావము.

**వా॥ "ప్రత్యయ ఇతిచేత్ క్నాత్యేజంత నామధాతుష్వభ్యాస రూపమ్"** అని ఈ పక్షమున దూషణ వార్తికము.

అజ్మాత్రము కాక అజాదియగు ప్రత్యయము నిమిత్తము కావలెననిన, 'దుద్యూషతి' 'సుస్యూషతి'— అను దివాది రూపములందు దోషము పరిహృతమయినను, క్నాతి, ఏజంత, నామ ధాతువుల విషయమున దోషము అట్లే ఉండును. అట 'ఊఙ్' ప్రత్యయము కాదు. కాని, 'ఏశ్' - 'ణి'- అన— అను నివి మూడును ప్రత్యయములే గదా ! అని తాత్పర్యము.

అట్లైన, ద్విత్వమునకు నిమిత్తమయిన అచ్చుపరమగునపుడు అచ్చుకు వచ్చిన ఆదేశమునకు స్థానివద్భావము కలుగునని చెప్పెదను. ణి, అన— అను నివి ద్విత్వ నిమిత్తములు కావు గాన నట దోషము పరిహృతమగును. 'జగ్లే' అనుచో 'ఏశ్' ద్విర్వచన నిమిత్తమే. అట దోషము పరిహృతము కాదు. దానికి పరిహారము ముందు చెప్పబడును.

అయినచో, సూత్రమున నిమిత్త శబ్దమును గూడ పఠింపవలసి యుండును గదా ! నిమిత్త శబ్దములేనిచో నిమిత్తార్థ మెట్లవగతమగును ?

నిమిత్త శబ్దమందు లేకున్నను నిమిత్తార్థము గమ్యము కావచ్చును. ఎట్లనిన,— "దధిత్రపు సంప్రత్యక్షోజ్వరః" అని అందురు. "గడ్డ పెరుగు సాక్షాత్తుగ జ్వరము" అని యర్థము. అట్టి పెరుగు జ్వరమునకు కారణమగును

గాని జ్వరమే కాదు. జ్వర నిమిత్తమునందు జ్వరత్వ మారోపింపబడి అట్టి వ్యవహారము కలిగినది.

ఇంకొక వ్యవహారము "నడ్వలోదకం పాదరోగః" అనునది. నడ్వల మనగా, గడ్డి మోడులు గల నేల. అందలి నీటిలో నడచిన, పాదములకు రోగము కలుగును. కాగా నది పాద రోగ నిమిత్తము, పాద రోగమేయని వ్యవహరింపబడుచున్నది. అట గూడ నిమిత్త శబ్దము లేకున్నను తదర్థావగతి కలదు.

"ఆయుర్ఘృతమ్" అని యింకొక వ్యవహారము. ఘృతమే ఆయువు గాదు. ఆయువునకు అది నిమిత్తము. అట్లే ద్విర్వచన నిమిత్తము ద్విర్వచనము.

లేదా సమాధానాంతరమును ఇట్లు చెప్పవచ్చును—

"ద్విర్వచన మస్మిన్నస్తీతి ద్విర్వచనః" తస్మిన్ ద్విర్వచనే— మత్వర్థీయ మయిన అకారము ప్రత్యయము. ద్విర్వచన మిందుగలదు=ఇది పరమగునపుడు ద్విత్వము వచ్చును గాన నిది ద్విర్వచనము. "అర్శ ఆదిభ్యోఽచ్"(5-2-127) అని, అప్ర యమనట. లేదా అధికరణార్థమున వచధాతువునకు ల్యుట్ప్రత్యయ మని చెప్పినను ఆ యర్థము లభించును. 'ద్వౌః ఉచ్యతే అస్మిన్' = ద్విర్వచనః.

సరి. కానిండు, ఎంతకాలమీ స్థానివద్భావము? 'ద్విర్వచనే' అను పదము సూత్రమున నొక్కటియే కలదు. అదియు 'అచి' అనుదానికి విశేషణ మాయె. ఇక 'ద్విర్వచనము కర్తవ్యముగునపుడే స్థానివద్భావము ప్రవర్తించును. తదనంతరము ప్రవర్తింపదు' అను కాలావధారణ మెట్లు లభించును? అట్లు చెప్పనిచో, "చక్రతుః" ఇత్యాదులందు ద్విత్వానంతరము గూడ యణాదేశము ప్రాప్తింపక పోవును.

ద్విర్వచనము కర్తవ్యమగు నపుడే స్థానివద్భావమని చెప్పిన వాని మతమున, ద్విర్వచనానంతర మిక అది రాదు. కనుక ఆ దోషము కలుగదు.

అట్లైన ఇంకొక విధముగను నీ సూత్రార్థమును వర్ణింపనగును. నపదాంత సూత్రము నందు, 'న' అని ప్రతిషేధము ప్రస్తుతమై యున్నది. అది యిందను వర్తింపజేయబడును. కాగా, "ద్విర్వచనమునకు నిమిత్తమయిన అచ్చు పర మగునపుడు, అజాదేశము ప్రవర్తింపదు" అని యర్థము. 'స్థానివత్'

అను పద మనువర్తింపదు. అజాదేశమునకు నిషేధమే విధింపబడు ననుట.

అయినను ఎంతకాలమీ నిషేధమో తెలియదే?

'ద్వర్వచనము కర్తవ్యమగునపుడు' అని అపుడును చెప్పవలసియుండును. అపుడు ద్విత్వానంతరము ఆదేశము ప్రవర్తింపవచ్చును.

ఓహో! అట్లయిన నీ సూత్రమున నుభయమును చేయబడును. ఉభయ మనగా — ప్రత్యయ విశేషణమును, ద్విర్వచనమును చికీర్షితమునుగా నిర్దే శించుటయును. కాగా 'ద్విత్వమునకు నిమిత్తమగు నజాది ప్రత్యయము నిమిత్తముగా కల అజాదేశము ద్విత్వము కర్తవ్యవగు అవస్థలో స్థాని వంటిది అగును' అని ఫలితమగును.

సూత్రమున ప్రత్యయపదము లేకున్నను ప్రాప్త ద్విత్వము ప్రత్యయ నిమిత్తకమగుట వలన నయ్యది ప్రత్యయము నాక్షేపించును. దానికి 'అచి' అనునది విశేషణ మగును. కావున పైన చెప్పిన ఫలితార్థము సిద్ధించును.

ఒకే యత్నము చేత నుభయము నెట్లు లభ్యమగును? 'ద్విర్వచనే' అను పద మొక్కటియే గదా సూత్రము నందున్నది? అనిన, —

లభ్యమే. ఎట్లన, 'ద్విర్వచనే' అన నది ఏకశేష నిర్దేశము. ద్విర్వచనంచ ద్విర్వచనఞ్చ=ద్విర్వచనమ్. ద్విర్వచనము కర్తవ్యమయినపుడనియు, ద్విర్వచ నమునకు నిమిత్తమయిన అజాది ప్రత్యయము పరమగునపుడు అనియు నర్థము సిద్ధించును.

ఏతావతా ఫలితమగు విషయము- "ఈ సూత్రమును అయిదు విధము లుగా వ్యాఖ్యానింపవచ్చును. ఆయా పక్షములందు ప్రాప్తములగు దూషణము లకు పరిహారములును గలవు.

ఆ పక్షములు —

(1) 'అజ్నిమిత్తకమగు నజాదేశము, ద్విత్వము కర్తవ్యమయినపుడు, స్థానివంటిది అగును'

(2) 'అజాది ప్రత్యయ నిమిత్తకమగు నజాదేశము, ద్విత్వము కర్తవ్యమగునపుడు స్థానిసదృశమగును'

(3) 'ద్విత్వనిమిత్తమగు నచ్పరమగునపుడు వచ్చిన అజాదేశము ద్విత్వకర్తవ్య తతో స్థానితుల్యమగును'.

(4) 'ద్విత్వ నిమిత్తమగు నచ్చుపరమగునపుడు, ద్విత్వము కర్తవ్యమయిన దశలో, అచ్చున కాదేశము రాదు'.

(5) 'ద్విత్వ నిమిత్తమగు నచ్చుపరమగునపుడు వచ్చిన అజాదేశము, ద్విత్వము కర్తవ్యమగునపుడు, స్థానివంటిది యగును, లేదా అచ్చుకు ఆదేశము రానేరాదు'.

ఈ అయిదు పక్షములలో, నైదవ పక్షమునకొక దూషణము,

వా॥ "ద్విర్వచన నిమిత్తేచి స్థానివదితిచేత్ ణౌస్థానివద్వచనమ్" అని వార్తికకారునిచే ఆపాదింపబడినది.

'అవనునావయిషతి' 'అవచుక్షావయిషతి' అనునవి ణ్యంతప్రకృతిక సన్నంత రూపములు. 'నౌతి'- నావయతి- నునావయిషతి.

అక్షే, క్షౌతి,-క్షావయతి-చుక్షావయిషతి. నావయితుమిచ్ఛతి, 'క్షావయితు మిచ్ఛతి' అని విగ్రహవాక్యములు. ఇట ధాతువునందలి ఉకారమునకు, ణిచ్చు పరమగునపుడు, వృద్ధియు నావాదేశమును వచ్చిన పిదప ద్విత్వము ప్రవర్తించిన యెడల, అభ్యాసమునందు ఉకార శ్రవణము సంభవింపదు. ణిచ్చు ద్విత్వమునకు నిమిత్తముకాదు. కావున 'ద్విర్వచనేచి' అనునది ప్రవర్తింపదు. ఇట ద్విత్వమునకు నిమిత్తము, 'ఇష' అను సన్ప్రత్యయముగాని ణిచ్చుగాదు. కాబట్టి ఈ స్థానివద్భావము ణిచ్చుపరమయినపుడును వచ్చునని చెప్పవలసి యుండునని ఆక్షేపవార్తిక తాత్పర్యము.

వా॥ "ఓః పు యణ్జిషు పచనం జ్ఞాపకం ణౌస్థానివద్భావస్య" అని ఈ యాక్షేపమునకు సమాధాన వార్తికము.

ణిచ్చు పరమగునపుడును అజాదేశమునకు స్థానివద్భావము వచ్చునని చెప్పనక్కరలేదు. అది జ్ఞాపకసిద్ధము. పాణిన్యాచార్యుడు, "ఓః పు యణ్ జి అపరే" (7-4-80) అను సూత్రముచే, 'సన్ప్రత్యయము పరముగా గల అంగముయొక్క అభ్యాసమునకు సంబంధించిన ఉకారముయొక్క స్థానమునందు, అవర్ణ పరకములయిన పవర్గీయాక్షరములును, యణ్ప్రత్యాహార వర్ణములును, జకారమును పరములైనపుడు, ఇకారాదేశమును విధించియున్నాడు. 'బిభావయిషతి' 'రిరావయిషతి' 'జిజావయిషతి'- మున్నగునవి ఉదాహరణములు. ఇందు, ధాతూకార స్థానమున వృద్ధి ప్రవర్తించిన తరువాత దానికి స్థాని రూపాతిదేశము లేనిచో, అభ్యాసమునందు ఉకారమునకు సంభవమే లేదు.

'ద్విర్వచనేచి' అను ప్రకృత సూత్రముచే స్థానివద్భావము, 'పిపవిషతె' 'యియవిషతి' అను స్థలములందు, ద్విత్వనిమిత్తమయిన అచ్చు సన్ప్రత్యయేడాగమముకలదు గాన నచటనే ప్రవర్తించును. కాగా "ఓః పయయోరపరే" అని యీ సూత్రమును బఠించిన జాలును. వర్గగ్రహణమును, 'యణ్' అని ప్రత్యాహారగ్రహణమును, జకారగ్రహణమును వ్యర్థములు. అట్లు వర్గ ప్రత్యాహార జగ్రహము వ్యర్థమయి 'ణిచ్చు పరమగునపుడు ప్రవర్తించు నజాదేశము గూడ స్థానివంటదగును' అని జ్ఞాపనము చేయును.

ఈ జ్ఞాపనమువలన, 'అచికీర్తత్' అను స్థలమునందును స్థానివద్భావము ప్రాప్తించునె? కృతసంశబ్ద 'నె' అను ధాతువునకు ణిచ్ప్రత్యయము పంమగునపుడు, అంగాంత్యమునకు వచ్చిన 'ఇర్' అను నాదేశమునకు స్థానివద్భావము వచ్చినయెడల, ద్విత్వానంతరము, అభ్యాసమున "ఉరదత్త్వ"ముచే "అచకిర్తత్" అని కావలసివచ్చును. అనిన,

అది తుల్యజాతీయమునకే జ్ఞాపకముగాన దోషములేదు. తుల్యజాతీయ మనగా ఏది? పవర్గ యణ్ జకారములు ఏజాతికి చెందినవో అట్టివి. అవి యెట్టివి? అనిన, అవర్ణపరములు అనుట. అభ్యాసోత్తరఖండముయొక్క ఆద్యాచ్చు అవర్ణముగా, ప్రక్రియలోగాని, పరనిష్ఠిత రూపములోగాని యేర్పడునటి ఆదశములకే సానివద్భావములు కలుగును.

'జగ్లే' 'మమే' ఇవి యెట్లు?

రూపాతిదేశ పక్షమునందు, లిట్ స్థానమున వచ్చిన 'ఏశ్' ఆదేశము ద్విత్వ నిమిత్తమగు నజాది ప్రత్యయమే గాన నది పరమగునపుడు ఆకారమునకు స్థానివద్భావము వచ్చినయెడల నా రూపములు సిద్ధింపవు. ఆ దోషమునకు పరిహారము చెప్పబడియుండలేదు. కాగా ప్రశ్న.

ఆత్వము అనైమిత్తికము. శిత్తుపరమగునపుడు దానికి ప్రతిషేధము అని సమాధానము. 'అశితి' అనుదానికి శిద్భిన్నమగునది పరమగునపుడని యర్థముకాదు. శిత్తుపరమైన కాదు అని యర్థము. కావున నజాదేశము ద్విత్వ నిమిత్తమగు అచ్చు నిమిత్తముగా కలది కాదుగాన దోషములేదు.

## సూత్రప్రయోజన నిరూపణము

**ఈ యోగమునకు ప్రయోజనములేమి?**

పపతుః పపుః॥ తస్థతుః తస్థుః॥ జగ్మతుః జగ్ముః॥ ఆటిటత్ ఆశిశత్॥ చక్రతుః చక్రుః॥ అనునివి ప్రయోజనములు. అందు మొదటి నాలుగు రూపములందును, "ఆతోలోప ఇటిచ" (6-4-64) అని అల్లోపమును, 'ఆటిటత్' 'ఆశిశత్' అనుచో ణిలోపమును, 'జగ్మతుః' 'జగ్ముః' అను స్థలమున నుపధాలోపమును, 'చక్రతుః' 'చక్రుః' అనుచో యణాదేశమును ప్రవర్తించిన తరువాత, ధాతువులు అనచ్కములగుటవలన ద్విర్వచనము ప్రాప్తింపలేదు. స్థానివద్భావముచే సిద్ధించును.

ఈ ప్రయోజనములు పూర్వ విప్రతిషేధాశ్రయణముచే సిద్ధింపవచ్చును. ఎట్లనగా, "దాశ్వాన్ సాహ్వాన్ మీఢ్వాంశ్చ" (6-1-12) అను సూత్రములో ఆచార్యుడు, "ద్విర్వచనం యణయవాయావాదేశాల్లోపోపధాలోప ణిలోప కికినోరుత్వేభ్యః" అని వాచనికమగు పూర్వ విప్రతిషేధమును బఠించును. దానివలన సిద్ధించును.

ఆ పూర్వ విప్రతిషేధ వచనమును బఠింప నక్కరలేదుగదాయని సూత్రారంభవాద. అయిన ఇపుడు పూర్వ విప్రతిషేధ వచన పాఠమా ? సూత్రారంభమా ? కర్తవ్యమగునది ? ఏది యుక్తతరమగునని ప్రశ్న, స్థానివద్వచనమే అని సమాధానము.

పూర్వ విప్రతిషేధము నాశ్రయించిన, 'చుక్షావయిషతి' 'ఊర్ణునావయిషతి', 'నునావయిషతి' 'తుతావయిషతి' 'శుశ్రావయిషతి'- ఇత్యాదులందు ద్విర్వచనమునకు బూర్వమే అంతరంగత్వము వలన, వృద్ధ్యావాదేశములు ప్రవర్తించుచున్నవి. అపుడభ్యాసము ఇవర్ణాంతము కావలసివచ్చును. ఉవర్ణాంతత్వ మిష్టము. అందులకై "ఓదౌ దాదేశస్య ఉద్భవతి చుటుతు శరాదే రభ్యాసస్య" అను వచనమును బఠింపవలసి వచ్చును. కావున స్థానివద్భావమే ప్రశస్యతరము.

'ఓకారము ఔకారము- వీని స్థానమున నాదేశము ప్రవర్తించిన యంగముయొక్క అభ్యాసమునకు చవర్గ, టవర్గ, తవర్గలవర్ణములును శర్వర్ణములును నాదయందు గలదానికి- 'అకారస్థానమున ఉత్వము ప్రవర్తించును' అని ఆ వచనమున కర్థము.

నీవయినను ఇత్వమును జెప్పవలసియుండును గదా ? అని ఉత్వవాది. నాకది పరార్థమగును. "సన్యతః" (7-4-79) అని విధింపబడిన ఇత్వము, సూ॥ "ఓః పుయణ్ జ్యపరే" (7-4-80) అను సూత్రమునందును వర్తించును గాన

నచట ఇత్వార్థమగుననుట. అందు వర్గప్రత్యాహార గ్రహణమువలన నది జ్ఞాపకముగూడ ప్రసంగ సంగతిచే గావచ్చును. నీకు ఉత్వవచన మపూర్వము' అని ఇత్వవాదియొక్క స్వపక్ష సమర్థనమునకైన లాఘవ ప్రదర్శనము.

'ఉత్పిపవిషతే' 'సంయియవిషతి' అను స్థలములందు గుణోత్తరము ద్విర్వచనము ప్రవర్తించును. సమానాశ్రయములగుటచే నంతరంగ బహిరంగ భావము వానికి లేదు. కనుక అచట నీవును ఇత్వమును జెప్పుట తప్పదు. అందువలన స్థానివద్భావ పక్షమే యుక్తతరమని ఫలితము ॥ద్విర్వచనేఽచి॥

॥అష్టమాహ్నిక వివర్తము సమాప్తము॥

# నవమాహ్నికము

## "అదర్శనంలోపః" (1-1-59)

అదర్శనమునకు 'లోపము' అని సంజ్ఞ అని యర్థము. అనగా అదర్శన శబ్దమునకు గాదు. దాని యర్థమునకు గావలె. అందుకొరకు, **వా॥ "లోప సంజ్ఞాయా మర్థ సంజ్ఞాకరణమ్"**— అని వార్త్తికము పఠింపబడినది.

వ్యాకరణ శాస్త్రము నందు, శబ్దమునకు స్వరూపమే సంజ్ఞయగుటచే ఈ సంజ్ఞయు శబ్దమునకే ప్రాప్తించుచున్నది. కావున నిది యర్థమునకు సంజ్ఞయని చెప్పవలెను అని వార్త్తికాశయము.

**వా॥ "ఇతరేతరాశ్రయంచ"** అని వేరొక వార్త్తికము.

అదర్శనమునకు లోపసంజ్ఞా కరణము పరస్పరాశ్రయముగనున్నది. ఇతరేతరాశ్రయ కార్యము లేవియు సిద్ధింపవు అని యాక్షేపము.

ఇందుగల అన్యోన్యాశ్రయత ఏమి ? అనిన,

అదర్శనము పూర్వ సిద్ధమై యుండిన, దానికి లోప సంజ్ఞను విధింప వచ్చును. "సంయోగాంతస్యలోపః" (8-2-23) అను సూత్రము సంయో గాంత పదాంతమునకు అదర్శనమును విధించుచున్నది. అంతకు బూర్వ మట అదర్శనము సిద్ధముగాదు అట్లది సిద్ధమై యుండిన గదా దానికి లోపసంజ్ఞ కలుగుట. ఈ సంజ్ఞ చేతనే అదర్శనము భావింపబడుచున్నది. ఇయ్యది పర స్పరాశ్రయ పరిస్థితి. కావున ఇది పొసగదని భావము.

పై రెండాక్షేపవార్త్తికములకును సమాధానముగా, **వా॥ "లోపసంజ్ఞాయా మర్థసతో రుక్తమ్"** అను వార్త్తికము పఠింపబడినది.

'అదర్శన శబ్దము యొక్క అర్థమునకు లోపమని సంజ్ఞ' అని చెప్పవలసి యుండునని మొదటి యాక్షేపము.

'సత్' అగు నదర్శనమునకే లోపమను సంజ్ఞను చెప్పవలెను గదా!

ఇట అదర్శనము సత్పదవాచ్యము=విద్యమానము గాదు. కావున నిది అనుపపన్నమని రెండవ ఆక్షేపము — ఈ ఆక్షేపములో మొదటి దానికి

**"ఇతికరణోఽర్థ నిర్దేశార్థః"**అను వార్తికముచే 'నవేతి విభాషా' అను సూత్రము నందు సమాధానము చెప్పబడినది. ఆ ఇతి శబ్దమే యీ సూత్రముననను అను వర్తించును. మరియు **"లోపః"** అనునది అర్థానుగతమగు సంజ్ఞ. ఆ యర్థము అన్వయించుటకు యోగ్యత అదర్శన శబ్దార్థము నందే గలదు గాని శబ్దమునందు **కాదు.** కాన ఇది అర్థ సంజ్ఞయే అనియు జెప్పవచ్చును.

ఇక రెండవ ఆక్షేపమునకును, "సిద్ధంతు నిత్య శబ్దత్వాత్" అని సమాధానము వృద్ధి సూత్రమునందు చెప్పబడినది. శబ్దములు నిత్యములు కాని శాస్త్ర నిష్పాద్యములు కావు. కాగా వర్ణాభావమును నట్టిదియే. సంజ్ఞచేత నది సాధింపబడునది కాదు,- అని సమాధాన వార్తికతాత్పర్యము.

**వా॥ "సర్వ ప్రసంగస్తు సర్వస్యాన్యత్రా దృష్టత్వాత్"** అని యాక్షేప వార్తికాంతరము. సర్వప్రసంగస్తు=సర్వాదర్శనములకును లోపసంజ్ఞ ప్రాప్తించుచున్నది. ఎందువలననగా, సర్వస్యాన్యత్రాదృష్టత్వాత్ = సకల శబ్దములును తమ ప్రయోగ విషయములందేగాని ఇతరత్ర ఉండబోవు. అట వాని అదర్శన ముండుననుట, ఎట్లన.- 'త్రపు' 'జతు' అను శబ్దములను చూడుడు. ఇందు, అణ్ అను ప్రత్యయమగపడలేదు. కావున దాని యదర్శన మునకు లోప సంజ్ఞ రావలసి వచ్చుచున్నది.

రానిండు. దాన దోషమేమి? అనిన,

**వా॥ "తత్ర ప్రత్యయ లక్షణ ప్రతిషేధః"** అని ఆక్షేపవార్తికము. అచ్చట ప్రత్యయలక్షణ కార్యము ప్రాప్తించుచున్నది. దానికి నిషేధమును జెప్పవలసియుండును.

ప్రత్యయమునకు లోపము కలిగినను, తదాశ్రితమగు కార్యము ప్రవర్తించును గాన 'త్రపు' 'జతు' అను శబ్దములందు, సూ॥ "అచోఞ్ణితి" (7-2-115) అని ఉకారమునకు వృద్ధి రావలసియుండును, అది దోషము- అనిన,

అది దోషముకాదు. ఞిత్తుగాని ణిత్తుగాని అగు ప్రత్యయము పరమగు నపుడు, అఙ్గాంత్యమగు నచ్చునకు వృద్ధి వచ్చును. అంగమనగా ప్రత్యయ విధానావధి. ఇట నంగముకంటె బరముగ నణ్ప్రత్యయము విధింపబడలేదు. సుప్రత్యయము విహితము. అడ్వృద్ధి నిమిత్తముగాదు. వృద్ధి నిమిత్తములు ఞిణ్ప్రత్యయములు. కాని వాని విధానావధి త్రపుగాదు. సుప్రత్యయ విధానావధికంటె బరముగ అణ్ విధానము లేదు, కాగా ఇట వృద్ధ్యాపాదనమునకు అవకాశము లేదు,

పోనిమ్ము. 'వృద్ధి అంగకార్యముగాన తదాపాదనమునకు అవకాశము లేదు' అనినను అట క్విప్ప్రత్యయాదర్శనము కలదుగాన దానికి లోపసంజ్ఞ ప్రాప్తించుచున్నది. అపుడు లుప్త ప్రత్యయ నిమిత్తక కార్యమగు తుగాగమము, "హ్రస్వస్య పితికృతితుక్" (6-1-71) అను సూత్రముచే ప్రాప్తించుచున్నది. తుగాగమాంగకార్యము గాదుగదా? అనిన, సమాధానవార్తికము,

వా॥ "సిద్ధంతు ప్రసక్తాదర్శనస్యలోపసంజ్ఞిత్వాత్" అనునది పఠింపబడినది. శాస్త్రమువలనగాని, అర్థసిద్ధముగ గాని దేనికి ప్రసంగము కలుగునో దాని యదర్శనమునకే లోపమని సంజ్ఞ.

స్థానే అను పదమింవనువర్తించును. స్థానమనగా ప్రసంగము. కాగా ప్రసక్తమయినదాని అదర్శనమే లోపమనబడును. ఇట క్విప్పుకు ప్రసంగము లేదుగాన, దాని అదర్శనమునకు లోపమను సంజ్ఞ కలుగదు అని పర్యవసితము.

ప్రసక్తాదర్శనమే లోపసంజ్ఞకమనిన, "గ్రామణీ" "సేనానీ" అను శబ్దములలో ఈకారమునకు వృద్ధి ప్రాప్తించుచున్నది.

గ్రామం నయతీతి=గ్రామణీః. "కర్మణ్యణ్" (3-2-1) అను సూత్రము కర్మవాచక ముపపదముగ నున్నపుడు, ధాతువునకు బరముగా కర్త్రర్థమున అణ్ అను ప్రత్యయమును విధించుచున్నది. ఇట నుపపదమున్నది. ధాతువును గలదు. కర్తృలక్షణమగు నర్థమునుగలదు. కాగా, అర్థతః ప్రసక్తిగలదు 'కర్మణ్యణ్' అను శాస్త్రమువలనను అణ్ ప్రత్యయమునకు ప్రసంగము అగపడుచున్నది. కావున దాని అదర్శనము ప్రసక్తాదర్శనమే. దానికి లోపసంజ్ఞ కలిగినయెడల "అచోఞ్ణితి" (7-2-115) అని వృద్ధి రావలసియున్నది. అంగసంజ్ఞా సూత్రమునందలి విధి పదమునకు ప్రసంగమనియే యర్థము. కావున తదాదిత్వమును నిర్బాధము- అను నాక్షేపమునకు సమాధానము—

'షష్ఠి' అను పదము గూడ ఇట అనువర్తించును. ప్రసక్తమగు షష్ఠ్యంతము యొక్క అదర్శనమునకే లోపసంజ్ఞ కలుగును. ఇట షష్ఠ్యంతాదర్శనము లేదు గాన అణదర్శనము లోపముగానేరదని చెప్పనగును.

షష్ఠీ నిర్దిష్ట ప్రసక్తాదర్శనమే లోప సంజ్ఞకమగుననిన, "చాహలోప ఏవే త్యవధారణమ్" (8-1-62) "చాదిలోపే విభాషా" (8-1-63) అను సూత్రములందు లోపసంజ్ఞ ప్రాప్తింపదే?

"'చ' 'అహ' అను వాని లోపమున, ప్రథమ వాక్యోచ్చారితమగు తిఙంతము, అవధారణార్థకమ్మగు శేష శబ్దము ప్రయోగింపబడినపుడు అను

దాత్తము కాదు" అని మొదటి సూత్రమున కర్థము. 'దేవ ఏవ గ్రామం గచ్ఛతు' 'దేవ ఏవారణ్యం గచ్ఛతు' అను వాక్య ద్వయ సముదాయ ముదాహరణము. ఇచట చకారమునకు అర్థతః లోపము. 'గ్రామమరణ్యంచ గచ్ఛతు' అని యర్థము.

ఇందు 'దేశ ఏవ గ్రామం గచ్ఛతు' అను మొదటి వాక్యము నందలి తిఙంతమునకు నిఘాతము నిషేధింపబడినది. 'చ' అనునది షష్ఠీ నిర్దిష్టముకాదు గాన దాని అదర్శనమునకు లోపసంజ్ఞ ప్రాప్తింపకపోవును.

'రెండవ సూత్రమునకు, చ, వా, హా, అహా, ఏవ — అను చాది పంచకము లోపించినపుడు, ప్రథమ తిఙ్విభక్తి యుదాత్తము కాదు' అని యర్థము. ఇట కూడ అర్థతః లోపమే గాని షష్ఠీ నిర్దిష్ట పదమునకు లోపము లేదు. కాగా, ఉ॥ "శుక్లావ్రీహయోభవంతి" - "శ్వేతాగా ఆజ్యాయదుహంతి" అనుచో నిఘాత వికల్పము సిద్ధించకపోవును అను ప్రసక్తాదర్శన వాది యాక్షేపమునకు, 'షష్ఠీ నిర్దిష్టవాది'.

'ప్రసక్తా దర్శనము లోప సంజ్ఞకమగునని చెప్పినపుడు మాత్ర మిది యెట్లు సిద్ధించును? శాస్త్రతః ప్రసక్తి లేదు గదా! అని ప్రత్యాక్షేపము.

శబ్దమునకు ప్రసంగమననేమి? తన యర్థము గమ్యమయి తాను ప్రయోగింపబడకుండుట గదా. అదియే అర్థతః ప్రసక్తి, అదియు గ్రాహ్యము. కాగా ప్రసక్తా దర్శనమునకే లోప సంజ్ఞ అని యుపసంహారము. అట్లైన 'గ్రామణీః' 'సేనానీః' ఎట్లు? అణ్ణుకు అర్థతః ప్రసక్తి కలదు గదా! అనిన, అయ్యది 'సత్సూద్విష' అను క్విప్పుచే బాధింపబడినది గాన ప్రసంగమే లేదు. అందు వలన వృద్ధ్యాపత్తిలేదు.

"అదర్శనంలోపః"

## 'ప్రత్యయస్యలుక్శ్లులుపః (1-1-61)

ప్రత్యయము యొక్క అదర్శనమునకు, 'లుక్' 'శ్లు' 'లుప్' అని సంజ్ఞలు.

ఈ లుగాదులు ప్రత్యయములకే విధింపబడినవి గదా! అట్టి యెడ నీ సూత్రమున, 'ప్రత్యయస్య' అను పదమిక ఎందులకు? ఆయా విధులలో గొన్ని చోట్ల సాక్షాత్తుగను, మరి గొన్ని యెడల ననువృత్తి వలనను నింకను

కొన్ని పట్లు సామర్థ్యమువలనను ప్రత్యయము నిర్దిష్టమగుటయో, ప్రతీయమాన మగుటయో కనబడుచునే యుండునుగదా ! అను ప్రత్యయ పద ప్రయోజనా క్షేపమునకు సమాధాన వార్తికము—

**వా॥ "లుమతి ప్రత్యయ గ్రహణ మప్రత్యయ ప్రతిషేధార్థమ్"** అనునది. ప్రతియోగి విశేషణముగ ప్రత్యయము గ్రహింపబడని ఆదర్శనమున కీ సంజ్ఞలు ప్రవర్తింప కుండుటకు ప్రత్యయ గ్రహణము.

ప్రయోజనమేమి ? అనిన,

**వా॥ "ప్రయోజనం తద్ధితలుకి కంసీయపరశవ్యయోర్లుకిచ గో ప్రకృతి నివృత్త్యర్థమ్"**- అని ప్రయోజన వార్తికము.

తద్ధిత ప్రత్యయమునకు లుక్కు వచ్చినపుడు, "లుక్తద్ధితలుకి" (1-2-49) అను సూత్రముచే, గో శబ్దమునకు గూడ లుక్కు ప్రాప్తించుచుండ, తద్వార ణార్థము ప్రత్యయ గ్రహణము. "లుక్తద్ధితలుకి" (1-2-49) అను సూత్రము లోనికి, "గోస్త్రియో రుపసర్జనస్య" (1-2-48) అను సూత్రము నుండి, 'గోస్త్రియోః' అను పదము అనువర్తించును. తద్ధిత ప్రత్యయమునకు లుక్కు వచ్చిన తరువాత, ఉపసర్జన స్త్రీ ప్రత్యయమునకే ఈ సూత్రముచే లుక్కు వచ్చును గాని, "పంచగుః" ఇత్యాదులందు గోశబ్దమునకు, రారాదు. ప్రత్యయ గ్రహణమున కది ప్రయోజనము.

అట్లే, "కంసీయపరశవ్యయోర్యఞఞౌలుక్చ" (4-3-168) అను సూత్రము వికారార్థమునందు కంసీయ శబ్దమునకు పరముగ 'యఞ్' ప్రత్యయమును, పరశవ్య శబ్దముకంటె 'అఞ్' ప్రత్యయమును విధించుచు లుక్కను గూడ విధించుచున్నది. ఆ లుక్కు 'యఞ్' 'అఞ్' ప్రత్యయములకయిన, వాని విధానమే వ్యర్థము. మరి వేనికా లుక్కు ? కంసీయలో 'ఈయకు'ను అనగా ఛప్రత్యయమునకును, 'పరశవ్య' లో 'యత్' ప్రత్యయమునకును అనుట. ప్రత్యయపద మిందు లేని యెడల 'కంసీయ' 'పరశవ్య' అను షష్ఠీనిర్దిష్ట ప్రకృతికే లుక్కు రావలసి యుండును.

కంసాయ హితమ్=కంసీయమ్, తస్య వికారః=కాంస్యమ్. పరశవే హితం=పరశవ్యమ్. తస్యవికారః=పారశవః అనునవి ప్రకృత సూత్రోదాహరణములు. కంచమును చేయుట కుపయోగపడు లోహము కంసీయము. దాని వికృతి కాంస్యము. గండ్రగొడ్డలిని చేయుట కుపయోగించు దారువు పరశవ్యము. దాని వికారము పారశవము.

కాని ఈ ప్రయోజనములు, **వా॥ "యోగ విభాగాత్సిద్ధమ్"**

**వా॥ "కంసీయ పరశవ్యయో ర్విశిష్ట నిర్దేశా త్సిద్ధమ్"** అను వార్తికము లచే నిరాకృతములు.

"గో స్త్రియోరుపసర్జనస్య" (1-2-48) అను సూత్రమును' "గోరుపసర్జనస్య" "స్త్రియాః" అని రెండు సూత్రములనుగా రచింపవచ్చును. అందు 'స్త్రియాః' అను సూత్రమునకు తరువాతి దగు "లుక్తద్ధితలుకి" (1-2-49) అను దాని లోనికి, 'స్త్రియాః' అనునదియే అనువర్తించును. 'గోః' అనునది నివర్తించును. కాగా స్త్రీ ప్రత్యయమునకే లుక్కు ప్రవర్తించును. గో శబ్దమునకది ప్రాప్తింపదు.

ఇక 'కంసీయ' 'పరశవ్య'—అను శబ్దములందు, 'ఛ' 'యత్' ప్రత్యయము లకే లుక్కు వచ్చుటకు వానిని సూత్రమునందు నిర్దేశించుటయే కర్తవ్యము. "కంసీయ పరశవ్యయోః యఞఞౌ, లుక్చఛయతోః" అని పఠింపవలెననుట. అదియే వార్తికోక్త విశిష్ట నిర్దేశము.

ఆ విశిష్ట నిర్దేశము అవశ్య కర్తవ్యము గూడ నగును. ప్రకృత సూత్రమునందు, 'ప్రత్యయస్య' అను పదమున్నను, 'కంస' లోని సప్రత్యయ మునకును, 'పరశు' లోని 'ఉ' ప్రత్యయమునకును లోప మాపన్న మగును.

ఆ శబ్దములు, "కమేఃసః" అని ప్రత్యయాంతముగను "ఆఙ్పరయోః ఖని శృభ్యాండిచ్చ" అని ఉప్రత్యయాంతముగను ఉణాది నిష్పాదితములు. కావున, 'ఛయతోః' అని విశిష్ట నిర్దేశము అవశ్య కర్తవ్యము అని వార్తి కాశయము.

కాని ఆ శబ్దములు ఉణాది ప్రత్యయాంతములు, అతి ప్రకృతి ప్రత్యయ విభాగ రహితములు, అవ్యుత్పన్నములు అని పాణిని మతము. కావున సప్రత్యయ, ఉప్రత్యయములకు లుగ్నివృత్తికై విశిష్ట నిర్దేశమక్కరలేదు. కాగా ప్రకృతి నివృత్త్యర్థము అది కర్తవ్యము. లేదా ప్రకృత సూత్రమున ప్రత్యయ గ్రహణము కర్తవ్యము' అని పర్యవసితము.

**వా॥ "ఉక్తంవా"** అని ప్రత్యయ గ్రహణ ప్రత్యాఖ్యాన వార్తికము.

"జ్యాప్ప్రాతిపదికాత్" (4-1-1) అను సూత్రమునందు, ఒక వార్తికము పఠింపబడియున్నది. **"వా॥ జ్యాప్ ప్రాతిపదిక గ్రహణ మంగభ సంజ్ఞార్థమ్ యత్ ఛయోశ్చ లుగర్థమ్"** అని.

కంసీయేత్యాది సూత్రము ప్రాతిపదికాధికార పఠితము. కావున నీ సూత్రము నందు 'ప్రాతిపదికాత్' అనునది అధికార ప్రాప్తము. దానికి ఫలము 'యత్' 'ఛ' ప్రత్యయములకు లుక్కు సిద్ధించుట. ప్రాతిపదిక కంటె ఫలమగు దానికి లుక్కు రావలెను. 'యఞ్' 'అఞ్' అను ప్రత్యయములు ప్రాతిపదికము కంటె బరములయినను, విధాన సామర్థ్యమువలన వానికి లుక్కు రాదు. ఇక 'ఉ' 'స' — అనునవి ప్రాతిపదికము కంటె పరములు కావు. పరిశేషమువలన, 'కంసీయ' 'పరశవ్య' అను వాని యవయవమగు ప్రాతిపదికము కంటే పరములైన 'ఛ' 'యత్' ప్రత్యయములకే లుక్కు వచ్చును. కావున విశిష్ట నిర్దేశమును నావశ్యకము గాదు. ప్రకృత సూత్రమున ప్రత్యయ గ్రహణము అక్కరలేదు అని తాత్పర్యము. తదుపరి, వార్తికములు రెండు-

వా॥ "షష్ఠీ నిర్దేశార్థంతు" వా॥ "అనిర్దేశే హి షష్ఠ్యర్థాప్రసిద్ధిః" అనునవి. స్థానే యోగత్వమను షష్ఠ్యర్థమును నిర్దేశించుటకై ప్రత్యయ గ్రహణ మావశ్యకము. సూత్రమునందు 'ప్రత్యయస్య' అనునది లేనియెడల అయ్యది సిద్ధింపదు. అపుడు ఆనంతర్యాది రూపమగు షష్ఠ్యర్థము గూడ గ్రహింపబడ వలసి వచ్చును. "జనపదేలుప్" (4-2-81) అను సూత్రమునందు షష్ఠి పదియు లేదు.

విచారింపగా, షష్ఠీ నిర్దేశార్థమయిన ప్రత్యయ గ్రహణమునకు ప్రయోజనము ఎచ్చట గలదు? "అణిఞోః" అని "ణ్యక్షత్రియార్ష ఞితోయూని లుగణిఞోః"(2-4-58)అను సూత్రమునందు, "తద్రాజస్య బహుషు తేనైవాస్త్రియామ్" (2-4-62) అను సూత్రమునందు'తద్రాజస్య' అనియు "యఞఞోశ్చ" (2-4-64) అను సూత్రమున, 'యఞఞోః' అనియు, "అది ప్రభృతిభ్యః శపః" (2-4-72) అను సూత్రమునందు 'శపః' అనియు నిట్లంతటను షష్ఠి ఉచ్చరింప బడియే యున్నది గదా? అను ప్రశ్న కలుగుచున్నది. కాని పైన చెప్పిన "జనపదేలుప్" (4-2-81) అను సూత్రమున నది లేదు. అందువలన నట 'జన పదార్థ వాచకమగు శబ్దమున్నపుడు తదనంతరమునకు లుప్పగును' అని యర్థము కావలసియుండును. అపుడు "పంచాలాః శోభనాః" ఇత్యాది వాక్యము నందు, 'శోభనాః' అను పదమునకును లుప్పు రావలసియుండెడిది అనిన,

ఇందును, ప్రత్యయగ్రహణము ప్రకృతమయిన దనువర్తించునే?

ఎచ్చట, ప్రకృతమయినది?

"ప్రత్యయః" "పరశ్చ" (3-1-1, 3-1-2) అనుచోట ప్రకృతము.

అది అచట ప్రథమా నిర్దిష్టముగదా ? ఇచట షష్ఠీ నిర్దిష్టమగు ప్రత్యయ పదము కావలసినదాయె అనిన,

'జ్యాప్ప్రాతి పదికాత్' అను పంచమి, 'ప్రత్యయః' అను ప్రథమాంత మును షష్ఠ్యంతమునుగా ప్రకల్పించును. 'తస్మాదిత్యుత్తరస్య' అను సూత్రమే పంచమికి షష్ఠీ ప్రకల్పకము.

ఇది ప్రత్యయవిధి గదా ! ప్రకల్పకత్వము, ప్రత్యయ విధీతర విధు లందే. ప్రత్యయ విధులందు పంచమికాశక్తి లేదే ?

ఇది ప్రత్యయ విధికాదు. ప్రత్యయ మింతకు పూర్వమే విహితము. అది యిందు అనువర్తించును. అంతియె.

**వా॥ "సర్వాదేశార్థం వా వచన ప్రామాణ్యాత్"** అని ప్రయోజన వార్తికము. వార్తికమునందలి 'వా' అను శబ్దమునకు, 'తర్హి'=అట్లైన అని యర్థము. 'లుక్' 'శ్లు' లుప్పులు సర్వాదేశములుగా ప్రవర్తించుటకై 'ప్రత్య యస్య' అను పద మావశ్యకమనుట.

ప్రత్యయ గ్రహణమున్నను, అలోంత్య పరిభాషచే, ఆ ప్రత్యయాంత్య మునకే వచ్చును గాని అవి సర్వాదేశములెట్లగును ? అను ప్రశ్నకు సమా ధానము, 'వచన ప్రామాణ్యాత్' అను వార్తిక ఖండము.

వచనమనగా 'ప్రత్యయస్య' అను పదమును గ్రహించుట. దాని ప్రామాణ్యమనగా సామర్ధ్యము. 'ప్రత్యయస్య' అను వచనము సామర్థ్యము వలన అలోంత్య పరిభాష బాధింపబడుననుట. కావుననే అది షష్ఠీ నిర్దేశార్థమును గాదు. అట్లైనది అందులకై ఆవశ్యకమగును గాన అలోంత్య పరిభాషా బాధ నము కుదురదు.

కాని ఇదియు ప్రయోజనముకాదు. పాణిన్యాచార్యుని ప్రవృత్తియే, 'లుక్' 'శ్లు' లుప్పులు సర్వాదేశములగునని జ్ఞాపనము చేయును.

"లుగ్వాదుహదిహలిహగుహామాత్మనేపదే దంత్యే" (7-3-73) అను సూత్ర ముచే, దుహ, దిహ, లిహ. గుహ-ధాతువుల క్సప్రత్యయమునకు, దంత్యాది యగు ఆత్మనే పద ప్రత్యయము పరమగునపుడు లుక్కును పాణిని విధించెను. "క్సస్యాచి" (7-3-72) అనునది దీనికి వెనుక సూత్రము. అది లోప విధాయ కము. కాగా లోపము ప్రస్తుతమయియున్నది. కావున దీనిచేతను గూడ లోప మునే విధింపవచ్చును గదా ! 'లుక్కును విధించుటవలన, లోపమంత్యాదేశ మగును సర్వాదేశమిట వాంఛితము' అను ఆశయముతో లుక్కు విధింపబడిన దని భావము.

అట్లైన 'ప్రత్యయస్య' అనునది కేవలము ఉత్తర సూత్రమున అనువర్తించుటయే ప్రయోజనముగాగలది అని వా॥ "ఉత్తరార్థంతు" అను వార్తిక సిద్ధాంతము.

"ప్రత్యయ లోపే ప్రత్యయ లక్షణమ్" అను ఉత్తర సూత్రమునందు ప్రత్యయ పదము కలదుగదా యనిన, వేరొక ప్రత్యయ పదముకూడ కావలెను.

"ప్రత్యయస్య ప్రత్యయ లోపే ప్రత్యయ లక్షణమ్" అని వాక్యార్థ మపేక్షితము. అనగా కృత్స్న ప్రత్యయమునకు లోపము వచ్చినపుడే ప్రత్యయ లక్షణము ప్రవర్తించునుగాని, ప్రత్యయైకదేశమునకు లోపము వచ్చినపుడు ప్రత్యయ నిమిత్తక కార్యములు ప్రవర్తింపకుండుట, ప్రత్యయ పద ప్రయోజనము.

'ఆఘ్నీత' అను పదమునందును, "సంరాయ స్పోషేణగ్మీయ" అనుచో 'గ్మీయ' అను పదమునందును, ప్రత్యయ లక్షణము ప్రవర్తించిన అనునాసిక లోపము ప్రాప్తించుచున్నది. అది అనిష్టము.

'ఆఘ్నీత' అనునది విధి లిఙాత్మనేపద ప్రథమైక వచనాంతము. 'గ్మీయ' అనునది ఉత్తమైక వచనాంతము. ఇట ప్రత్యయావయవ సకారమునకు, "లిఙస్సలోపో౽నంత్యస్య"(7-2-79) అని లోపము. తరువాత ఉపధా లోపము. అవయవ సకారలోపముగూడ ప్రత్యయలోపముగా గ్రహింపబడిన యెడల, ప్రత్యయ లక్షణము ప్రవర్తించి, "అనుదాత్తోపదేశ" (6-4-37) అను సూత్రముచేత అనునాసికలోపము రావలసి యుండెడిది. తద్వారణము ప్రత్యయ గ్రహణ ప్రయోజనమని పర్యవసానము.

॥ప్రత్యయస్య లుక్ శ్లు లుపః॥ సమాప్తము.

## "ప్రత్యయ లోపే ప్రత్యయ లక్షణమ్" (1-1-61)

### ప్రథమ ప్రత్యయ గ్రహణ ప్రయోజన విచారము

ప్రత్యయమునకు లోపము వచ్చినను, ఆ ప్రత్యయము మూలముగ రాదగిన కార్యము ప్రవర్తించునని సూత్రార్థము. 'ప్రత్యయ లక్షణమ్' అనునది బహువ్రీహి. లక్షణ పదమునకు నిమిత్తమని యర్థము.

"లోపే ప్రత్యయ లక్షణమ్" అని సూత్రమును రచించిన పోదా? లోపమనగా, ప్రసక్తిచే ప్రత్యయలోపమనియే గ్రహింపబడునుగదా? అనిన.

'లోపే ప్రత్యయ లక్షణ'మ్మని మాత్రమే సూత్రమును రచించిన యెడల 'సౌరథీ' 'వైహతీ' అను రూపములలో, గురూపోత్తమ లక్షణమగు ష్యఙ్ప్రత్యయము ప్రాప్తించును. సురథుడనువాని గోత్రాపత్యమగు స్త్రీ 'సౌరథి', విహతుని గోత్రాప్రత్యయమగు స్త్రీ 'వైహతి'.

ఈ ఇఞంతములకు, "ఇతో మనుష్యజాతేః" (4-1-65) అని ఙీష్ప్రత్యయము. లక్షణమనగా ప్రాదుర్భావమని యర్థమగును. అపుడు, దేనికయినను లోపము కలిగినపుడు, దాని సద్భావకాలమున ప్రాప్తించు ప్రత్యయము లోపానంతరమును ప్రాదుర్భవించునని యర్థమగును. "రమేఃక్థన్" అను ఔణాదిక సూత్రముచే రథశబ్దమును, హనధాతువునకు క్త ప్రత్యయము రాగా హతశబ్దమును నిష్పన్నములు. మకార నకారములకు "అనుదాత్తోపదేశేత్యాది" సూత్రముచె లోపము. ఈ లోపమునకు పూర్వము సురథ విహితశబ్దములు గురువర్ణము ఉపోత్తమముగా గలవి. వానికి లోపము వచ్చిన తరువాతగూడ, "అణిఞో రనార్షయోః గురూపోత్తమయోః ష్యఙ్ గోత్రే" (4-1-78) అను సూత్రముచే విహితమయిన ష్యఙ్ప్రత్యయము రావలసియుండును. మకార నకారముల లోపము ప్రత్యయలోపము కాదుగాన ప్రత్యయ పదమువలన నాదోషము వారింపబడునని తాత్పర్యము.

ఇది దోషముగాదు. లోపము వచ్చినపుడు ప్రత్యయమునకు ప్రాదుర్భావము కలుగునని యర్థము గ్రహింపబడదు. మరి యేమి? ప్రత్యయమేకార్యమునకు లక్షణమో అనగా నిమిత్తమో, ఆ కార్యము ఆ ప్రత్యయము లోపించినను ప్రవర్తించును అని యర్థము.

ఇట్టి సమాధానము నిరాకృతమయిన సమాధానాంతరమును సువచము. ఎట్లన,

'ప్రత్యయలోపే' అనుచోట ప్రత్యయ పదము లుప్త సప్తమ్యంతము. ప్రత్యయమున్నపుడే కార్యము దృష్టమో అది దాని లోపానంతరమును ప్రవర్తించును. ప్రత్యయ సద్భావకాలమున ప్రాప్తిలేనిది, లోపోత్తరమే ప్రాప్తికలదియునగు కార్యము ప్రవర్తింపదు. ఇట్లు చెప్పుటకేమి ప్రయోజనమనిన, 'గ్రామణికులమ్' 'సేనానికులమ్' అను సమాసములలో, ఉత్తర పదనిమిత్తకమగు హ్రస్వము ప్రవర్తించిన పిదప, "హ్రస్వస్య పితికృతితుక్" (6-1-71) అని ప్రాప్తించుచున్న తుక్కు రాకుండుట. 'గ్రామణీః' అను రూపములో క్విప్ ప్రత్యయమున్నపుడు తుగాగమము హ్రస్వము లేనందున ప్రవర్తింపలేదు. క్విలోపానంతరము, హ్రస్వము ప్రవర్తించిన పిదపగదా తుగాగమమునకు ప్రాప్తియని ప్రయోజనవాది.

'ప్రత్యయ సద్భావమున ప్రాప్తించునదే, ప్రత్యయ లక్షణముచే ప్రవర్తించును', 'లోపోత్తరము ప్రాప్తించునది ప్రవర్తింపదు' అని చెప్పినచో, 'జగత్' 'జనగత్' అనుచో గూడ క్విబ్లోపానంతరము తుగాగమము రాకుండ పోవును. అది క్విప్పున్నపుడు ప్రాప్తింపదు. తల్లోపానంతరమే దానికి ప్రాప్తి. కాబట్టి ఆ ప్రయోజనము సిద్ధించుటకై ప్రత్యయ గ్రహణ మావశ్యకముగాదని ప్రయోజన నిరాకరణవాది.

'గ్రామణికులమ్' 'సేనానికులమ్' అనుచో నెందులకు రాదు ? అనిన, హ్రస్వము బహిరంగమును, తుగాగమ మంతరంగము నగుటచే, నంతరంగము కర్తవ్యమయినపుడు బహిరంగ మసిద్ధముగాన తుగాగమము రాదు.

అయినను, ప్రత్యయమున కంతకును లోపము వచ్చినపుడేగాని దాని యేకదేశమునకు లోపము వచ్చినపుడు ప్రత్యయ లక్షణము ప్రవర్తింపదని బోధించుటకు ప్రత్యయ గ్రహణ మావశ్యక మందము. ఎచ్చట ? 'ఆఘ్నీత' "సంరాయ స్పోషేణగ్మయ" అను స్థలములందు.

వెనుకటి యోగమునందును, అనగా "ప్రత్యయస్య లుక్ శ్లు లుపః" అను సూత్రమునందల ప్రత్యయ గ్రహణమునకును నిద ప్రయోజనమని చెప్పబడినదిగదా యనిన,

రెండింటిలో నేదియో యొక ప్రత్యయ పదమును వదలిపెటవచ్చును. ప్రత్యయమనగా, ప్రత్యయత్వమునకు పర్యాప్తమగు యధికరణమనుట అవయవ మాత్రము పర్యాప్త్యధికరణము కాదని భావము.

## ద్వితీయ ప్రత్యయ పదప్రయోజన విచారము

సరి, రెండవ ప్రత్యయ పదమెందులకు ? 'ప్రత్యయలోపే, తల్లక్షణమ్' అనవచ్చును గదా ? అనిన,

అపుడు, ఏ కార్యమునందు, ప్రత్యయము, ప్రత్యయ రూపముననేగాక వర్ణరూపముతోగూడ నిమిత్తముగ నాశ్రయింపబడదో అట్టి కార్యములెల్ల ప్రాప్తింపవలసి వచ్చును.

తల్లక్షణమనక ప్రత్యయ లక్షణమనుటవలన, ప్రత్యయము, ప్రత్యయముగా నాశ్రయింపబడిన కార్యము మాత్రమే ప్రత్యయ లక్షణముచే ప్రవర్తించునని సిద్ధించును. వర్ణ లక్షణకార్యములు రావు.

'గవేహితమ్ = గోహితమ్'. 'రాయఃకులమ్ = రైకులమ్' ఇట అవాదేశమును, ఆయాదేశమును వర్ణాశ్రయములుగాని, ప్రత్యయముగా ప్రత్యయ

మా(శ్రయింపబడిన కార్యములుగావు గాన ప్రత్యయ లక్షణముచే ప్రవర్తింపవు. అది ద్వితీయ ప్రత్యయ గ్రహణ ప్రయోజనము.

ఈ సూత్ర మెందులకు రచింపబడినది ? ప్రత్యయమునకు లోపము వచ్చినపుడు, ఆ లోపమునకు స్థానివద్భావము నాశ్రయించిన ప్రత్యయత్వము లభించి, తన్నిమిత్తక కార్యములు స్థాని వత్సూత్రముచేతనే సిద్ధించును గదా! అని యాక్షేపము.

దీనికి సమాధాన వార్తికము - వా॥ **"ప్రత్యయలోపే ప్రత్యయ లక్షణ వచనం సదన్వాఖ్యానాచ్ఛాస్త్రస్య"** అనునది.

ప్రత్యయమునకు లోపము కలిగినను తన్నిమిత్తక కార్యము ప్రవర్తించునని యెందులకు చెప్పబడినదనగా, శాస్త్రము సదన్వాఖ్యాపకము గనుక. సత్ = విద్యమానము. అది శాస్త్ర సాధనముతో, స్మర్తయగు నాచార్యునిచే నన్వాఖ్యానము చేయబడుచున్నది. లేదా, 'సదన్వాఖ్యానాచ్ఛాస్త్రస్య' అను దానిని అన్యథా కూడ వ్యాఖ్యానింపవచ్చును.

శాస్త్రము, అవిచ్ఛిన్న సంప్రదాయ ప్రవర్తకముగాన, తానే విద్యమానమగు దానికి అన్వాఖ్యాపకమగుచున్నది.

"ఉగిదచాం సర్వనామస్థానే"(7-1-70) అను నుమాగమమునకు, నిమిత్తము సర్వనామ స్థానము. ఆ సర్వనామ స్థానమున్నపుడే తన్నిమిత్తక కార్యములు ప్రవర్తించును. 'గోమంతౌ' 'గోమంతః' అను పదములందు సర్వనామ స్థాన ప్రత్యయము వినబడుచున్నది. కావున అటనే నుమాగమము వచ్చును. 'గోమాన' 'యవమాన్' అను స్థలములందు రాదు. అట సర్వనామ స్థానము సత్ = విద్యమానము గాదు. కాని అటను నది సమ్మతము. యత్నములేనిచో నది సిద్ధింపదు. అందులకై ప్రత్యయ లోపస్థలము నందు ప్రత్యయ లక్షణవచనమనుట.

స్థానివద్భావముచేత ఆ ప్రయోజన మంతటను సిద్ధింపదు. అది అలాశ్రయ విధులందు ప్రవర్తింపదుగదా !

అయిన నీ ప్రయోజనము కలదగుట చేత నీ సూత్రము నిర్దోషమే యందువా? అని ప్రశ్న. అస్తి ప్రయోజనమేతత్?

"కింతర్హి ఇతి" అని సమాధానము. అయిన నేమందువు నీవు? నాకు సర్వథా నిర్దోషమే. నీ కేమైన దోషము భాసించిన, చెప్పుము.

**వా॥ "లుక్యుపసంఖ్యానమ్" వా॥ "లోపేహి విధానమ్"** - అను రెండు వార్తికములచే నీ సూత్రము పైన దూషణ మాపాదింప బడినది.

'పఞ్చ' 'సప్త'—అనునవి, పంచన్ సప్తన్ శబ్దముల, ప్రథమా ద్వితీయా బహువచనాంత రూపములు అచట 'జస్' 'శస్'— ప్రత్యయములకు "షడ్భ్యోలుక్"(7-1-22) అను సూత్రముచే లుక్కు వచ్చినది. ప్రత్యయ లక్షణముచే సుబంతత్వము. పదత్వమును గావలసియున్నవి. పదములు కానిచో దానికి ప్రయోగార్హత లేకపోవును. నలోపమును రాకపోవును. ప్రత్యయ లక్షణ విధాయకమగు ప్రకృత సూత్రమునందు 'ప్రత్యయలోపే' అని నిర్దేశింపబడుటవలన లోపసంజ్ఞ ప్రవర్తించినపుడే అది ప్రవర్తించును. లుగాది సంజ్ఞలు తక్రకౌండిన్య న్యాయముచే లోపసంజ్ఞకు బాధకములు. కాగా లుక్కు ప్రవర్తించినపుడును ప్రత్యయ లక్షణము సంఖ్యానీయమని ఆ వార్తిక ముల భావము.

**వా॥ "నవా అదర్శనస్య లోపసంజ్ఞిత్వాత్"** అని సమాధాన వార్తికము.

ఉప సంఖ్యాన మక్కరలేదు. అదర్శనము సంజ్ఞి. అందు సామాన్యముగ ప్రత్యయాప్రత్యయోభయాదర్శనములకును 'లోపః' అనునది సంజ్ఞ. లుమచ్ఛబ్దములగు లుక్, శ్లు, లుప్పులు. ప్రత్యయాదర్శనమునకు సంజ్ఞలు. అదర్శన మాత్రమునకు విధీయమానమగు లోపసంజ్ఞ, లుగాది సంజ్ఞల విషయమునను ప్రవర్తించును.

సంజ్ఞలకు పరస్పరము బాధ్య బాధక భావములేదు. కృత్సంజ్ఞయు కృత్య సంజ్ఞయు నేకత్ర సమావిష్టములగుట అగపడుచున్నది గదా. వార్తి కము నందలి 'లోపసంజ్ఞిత్వాత్' అను పదమునకు, 'లోపస్య సంజ్ఞీ=లోప సంజ్ఞీ. తస్యభావః=లోపసంజ్ఞిత్వమ్—తస్మాత్ అని విగ్రహము అని సమా ధాన వార్తికాశయము.

అట్లైన, లుక్, శ్లు, లుప్ సంజ్ఞలకు పరస్పరమును లోపశబ్ద భావిత ప్రత్యయాదర్శన విషయమున, లోప సంజ్ఞతోడను సాంకర్యము। ప్రాప్తించు నను నాశయముతో, **వా॥ "ప్రత్యయాదర్శనంతు లుమత్సంజ్ఞమ్"** అను నాక్షేప వార్తికముద్ధితము.

**అయిన నేమి దోషము ? అనిన,**

వా॥ "తత్ర లుకి శ్లు విధిః ప్రతిషేధ్యః" అని దూషణ వార్తికము.

'అస్తి' 'హంతి'— అను రూపములలో, 'శప్' ప్రత్యయమునకు "అది ప్రభృతిభ్యః శపః" (2-4-72) అని లుక్కు విధింపబడినది. అట నిపుడు శ్లు విధియగు, "శ్లౌ" (6-1-10) అను సూత్రముచే విహితమైన ద్విత్వము ప్రాప్తించు చున్నది. అది ప్రతిషేధ్యమగును.

అట్లే, 'జుహోతి' అనుచో, శ్లు విషయమున లుగ్విధియగు "ఉతోవృద్ధి ర్లుకిహలి" (7-3-89) అను వృద్ధి ప్రాప్తించుచున్నది.

'హరీతకీ'- అను స్థలమునందు, "హరీతక్యాదిభ్యశ్చ" (4-3-117) అను సూత్రముచే ఫల ప్రత్యయమునకు లుప్పు వచ్చినది. హరీతకి యొక్క ఫలము='కరకకాయ' అని యర్థము. లుప్పుకును లుక్సంజ్ఞ ప్రవర్తించిన, "లుక్తద్ధితలుకి" (1-2-49) అను సూత్రముచే స్త్రీ ప్రత్యయమునకు లుక్కు రావలసి యుండును — అట్లే, లుగ్విషయమున లబ్విధిసాంకర్యోదాహరణము—

'లవణః (సూపః)' అనునది. లవణముతో సంసృష్టమగు నదియను నర్థమున, "సంసృష్టే" (4-4-22) అను సూత్రముచే విధింపబడిన ఠక్ప్రత్యయమునకు, "లవణాల్లుక్" (4-4-24) అని లుక్కు వచ్చినది. అచట లుబ్విధి యుక్తవద్భావము రావలసి యుండును. కాగా లవణం (సూపః) అని ప్రయోగింపదగి యుండును. "లుపియుక్తవద్వ్యక్తివచనే" (1-2-51) అనునది, యుక్తవద్భావ విధాయకము. ఇవి సాంకర్యము కలిగినపుడు దోషములు.

వా॥ "నవా పృథక్సంజ్ఞాకరణాత్" అని సాంకర్య వారణ వార్తికము.

వా=లేదా, న=ఇది దోషముకాదు. ఎందువలన? అనగా పృథక్సంజ్ఞాకరణాత్=వేరు వేరుగా లుగాది సంజ్ఞలను జేయుటవలన. ఒక సంజ్ఞచేతనే ప్రదేశ వాక్యములందు సంజ్ఞి ప్రత్యాయనమును చేయవచ్చును. ఇట్లుండ, ప్రత్యయాదర్శనమునకు అనేక సంజ్ఞలను జేయుటవలన. తత్తత్సంజ్ఞా భావితములకే ఆయా సంజ్ఞలు ప్రవర్తించునని తెలియుచున్నది. అదర్శనమును బోధించు లుగాది శబ్దములు ప్రత్యయాదర్శనమునకు సంజ్ఞలనిన, ప్రత్యాసత్తిన్యాయముచే, ఏ సంజ్ఞచేత నె యదర్శనము బోధింపబడునో దానికే అది సంజ్ఞ యగుననుట. కాగా అదర్శన సామాన్యము వలన లోపసంజ్ఞ, లుమత్సంజ్ఞల నవగాహించును. కావున దత్కృతాదర్శనమును _ లోపమని

వ్యవహరింపబడునని భావము. లోప సంజ్ఞ వ్యాపక సంజ్ఞ కావున సాంకర్యము కలుగదు.

అట్లైన, అదర్శనమనునది తుల్యమగుటంజేసి లోపసంజ్ఞ లుమత్సంజ్ఞల నవగాహించినట్లే లుమత్సంజ్ఞలు గూడ లోపసంజ్ఞ నవగాహింపవలసి యుండునే? కాగా సాంకర్యము తప్పదే?

దాన దోషమేమనిన, 'అగోమతీ గోమతీ సంపన్నా = గోమతీ - భూతా', అనుచోట గోమతీ శబ్దమునకు పరమైన 'చ్వి' అను ప్రత్యయమునకు "వేరపృక్తస్య" (6-1-67) అను సూత్రముచే లోపము వచ్చినది. అది లుక్కు గాదు కాని ప్రత్యయాదర్శనమే. దానికి నీవుడు లుక్సంజ్ఞ కలిగిన యెడల "లుక్తద్ధితలుకి" (1-2-49) అను సూత్రముచే స్త్రీ ప్రత్యయము నకును లుక్కు రావలసి యుండును. కావున నా విధమగు సాంకర్యము తప్పదు.

ఇచ్చట గూడ, పృథక్సంజ్ఞాకరణము వలననే లోపమునకు 'లుక్' అను సంజ్ఞ కలుగదు గదా? అనిన, వేరు వేరు సంజ్ఞలను జేయుటవలన లుగాది సంజ్ఞలలో తద్భావిత గ్రహణము కలిగినట్లు, లోపసంజ్ఞ కూడ లుగ్విషయమున ప్రవర్తింపదు' అని చెప్పవచ్చునే అనిన,

పృథక్సంజ్ఞాకరణ సామర్థ్యమువలన లుమత్సంజ్ఞలు లోప సంజ్ఞ నవగాహింపనట్లే, లోపసంజ్ఞ గూడ లుమత్సంజ్ఞ నవగాహింపక పోవును. కాగా, "లుక్యుపసంఖ్యానమ్" అని చెప్పిన ఆ వెనుకటి దోషము తప్పదు. లోప సంజ్ఞా విషయమునను తద్భావిత పక్షాశ్రయణము ప్రాప్తమగు ననుట.

కాదు. లోప సంజ్ఞలో తద్భావిత గ్రహణము కలుగదు.

లోప సంజ్ఞను వేరుగా జేయుటలో ప్రయోజనాంతరము కలదు. అది యేమనిన, లుమత్సంజ్ఞ లందు జెప్పబడినది, లోప మాత్రము నందు ప్రవర్తింప కుండుట. చ్వి లోప స్థలము నందు, 'లుక్తద్ధితలుకి' అనునది ప్రవర్తింప కుండుటయని అర్థము.

వా॥ "లుమతి ప్రతిషేధాద్వా" అని సమాధానాంతరము.

వా = లేదా. లోప సంజ్ఞా విషయమునను తద్భావిత గ్రహణము నంగీక రించినను, 'నలుమతాంగస్య' అను నిషేధముచే లుగాది సంజ్ఞల విషయమునను

లోప సంజ్ఞా నిమిత్తక కార్యములు ప్రవర్తించునని జ్ఞాపితమగునుగాన దోషము లేదు. లుమచ్ఛబ్దికృతాదర్శనమునకు లోపసంజ్ఞ లేకున్నను, నలుమతేతి నిషేధముచే నచట లోపత్వ నిమిత్తక కార్య ప్రవృత్తి జ్ఞాపితమగునని పర్యవసితార్థము.

## ఇష్టానుపపత్తి పరిహారము

వా॥ "సతో నిమిత్తాభావాత్పద సంజ్ఞా భావః" ఆక్షేప వార్తికము.

సతః = ఉన్న ప్రత్యయమునకు, నిమిత్తాభావాత్ = నిమిత్తత్వము లేనందు వలన, ఆ ప్రత్యయము, లోపించినపుడును నది నిమిత్తము కాకపోవును. 'రాజ్ఞః పురుషః' "రాజపురుషః". ఇట విగ్రహమున షష్ఠీ ప్రత్యయమున్నది అది యపుడు పదసంజ్ఞకు నిమిత్తము కాదు. అట ప్రవర్తించునది భ సంజ్ఞ. తత్కార్యమగు అల్లోపము ప్రవర్తించినది పద సంజ్ఞా కార్యమగు నలోపము ప్రవర్తింపలేదు.

'రాజపురుషః' అను సమాసమున నది ప్రవర్తించినది పదసంజ్ఞ ప్రవర్తింపదు గాన నపుడును నది రాకపోవలె.

ఇక నీ యాక్షేపమునకు సమాధానము.

"స్వాదిష్వ సర్వనామ స్థానే" (1-4-17) అను పద సంజ్ఞకు 'జస్' ప్రత్యయము నిమిత్తము కాకపోవచ్చును. కాని, "సుప్తిఙంతంపదమ్" (1-4-17) అను పదసంజ్ఞ ప్రవర్తించును. 'రజ్ఞః' అనుచోట జస్ప్రత్యయమున్నపుడు, భసంజ్ఞచే, అవయవమగు రాజన్ అను దానికి ప్రాప్తించు పద సంజ్ఞయే బాధింపబడును. సుబంతత్వ నిమిత్తకమగు సముదాయగత సంజ్ఞ బాధింపబడదు. అవధి భేదముండుట దానికి గారణము. ఈ సజ్ఞచే నలోపము వచ్చును. దీనిచే రాదనుట, అపుడు, ఇపుడు, సమాసము నందు, ప్రత్యయము లోపించిన తరువాత, అవధి భేదము లేదు గాన ప్రత్యయ లక్షణ ప్రాప్త భ సంజ్ఞచే రెండు పద సంజ్ఞలును బాధింపబడును. అపవాదమగుటవలన స్వాదిష్వితి సంజ్ఞను, పరత్వము వలన సుప్తిఙంతమను సంజ్ఞను గూడ బాధించును అపుడు రాజన్ + జస్ అను సముదాయమునందు పదసంజ్ఞయు, 'రాజన్' అను ప్రకృతి యందు భసంజ్ఞయు అయిన ఇపుడు రెండును 'రాజన్' అను ప్రకృతి భాగము నందే ప్రాప్తించుచున్నవి గాన, ప్రత్యయ

లక్షణము చేత అజాది పరత్వము వలన భసంజ్ఞ రావలసి యున్నది అని భావము.

వా॥ "తుగ్దీర్ఘత్వయోశ్చ విప్రతిషేధా నుపపత్తి రేకయోగలక్షణత్వాత్ పరివీరితి"- అని ఆక్షేపాంతర వార్తికము.

'పరివీః' అను రూపము, పరిపూర్వకమగు 'వ్యేఞ్ సంవరణే' అను ధాతువు క్విబంతరూపము. యకారమున కికారము సంప్రసారణము. పూర్వ రూపము. ఆ ఇకారమునకు, "హ్రస్వస్య పితికృతితుక్" (6-1-71) అను సూత్రముచే తుగాగమమును, "హలః" (6-4-2) అను సూత్రముచే దీర్ఘమును ప్రాప్తించుచుండ, పరత్వమువలన వచ్చునను నిర్ణయము విప్రతిషేధ శాస్త్రము నాశ్రయించి చేయబడినది. కాని ఈ విప్రతిషేధ ముపపన్నముగాదు. ఇట 'క్విప్' ప్రత్యయము లోపించినది. కావున, తదాశ్రయ కార్యము లన్నియు, ప్రసక్తానుపపన్నములు=మృతములు—నిర్జీవములు అగును అని ఈ "ప్రత్యయ లోపే ప్రత్యయలక్షణమ్" అను నతిదేశ శాస్త్రము చేతనే ప్రత్యుజ్జీవితములు కావలెను. కాగా, తుగ్విధాయకమును, దీర్ఘ విధాయకమును నిదియేగాని వాని వాని యుపదేశ శాస్త్రములుకావు. అదియే ఏకయోగ లక్షణత్వము. ఏకయోగ లక్షణములగు కార్యములు విప్రతిషేధ విషయములుగావు. పౌర్వాపర్యమపుడు వానికి దుర్వచముగదా యని ఆక్షేప తాత్పర్యము.

ఇక ఈ యాక్షేపమునకు సమాధాన వార్తికము.

వా॥ "సిద్ధంతు స్థాని సంజ్ఞానుదేశాదాన్యభావ్యస్య" అనునది.

సిద్ధంతు=సిద్ధమేతత్. విప్రతిషేధ ముపపన్నమగును. కథమ్=ఎట్లు, ఆన్యభావ్యస్య=అన్యశ్చ సౌభావశ్చ అన్యభావః, అన్యభావ ఏవ ఆన్యభావ్యమ్. స్వార్థమున ష్యఞ్ ప్రత్యయము. అన్యభావము=అన్యవస్తువు. అన్యమనగా స్థానికంటె వేరయినది. అట్టి భావము=వస్తువు=ఆదేశమనుట. అదియే ఆన్యభావ్యము. ఆదేశమునకు స్థాని సంజ్ఞ కలుగునని చెప్పదగును.

దానివలన నేమగును? అనిన, సత్తామాత్రమును ఈ యతిదేశ శాస్త్రము చేయును తుగ్దీర్ఘత్వములు మాత్రము యథాప్రాప్తములే. అనగా, స్థానియైన 'క్విప్' ప్రత్యయమునకు గల, 'ఇది పకారేత్సంజ్ఞక కృత్ప్రత్యయము' అను వ్యపదేశము=వ్యవహారము, ఆదేశమగు లోపమునకు దీనిచే విహితమగును. ఇక 'పరివీః' అనుచోట, తుగాగమమును దీర్ఘమును తత్తదుపదేశ శాస్త్రముల వలననే ప్రవర్తించును కావున పౌర్వాపర్యమును విప్రతిషేధమును ఉపపన్నములే యని భావము.

సరి. కాని అట్టి వచనమొకటి అపూర్వముగ చెప్పవలసియుండునుగదా ? వచనాంతరము నాశ్రయించి సూత్రాక్షేప పరిహారము యుక్తమా ? అనిన, సత్యమే. అది వచనాంతరమే. అపూర్వమే యనుకొనుడు. కాని లఘుభూతమగు నా వచనము నాశ్రయించుటవలన స్థానివద్భావమును ఇక ఆరంభింప పనియుండదు. "స్థాని సంజ్ఞాన్యభూతస్యానల్విధౌ" అని చెప్పెదను కనుక లఘుతరమగుటచే వచనాంతరము నాశ్రయించి ఆక్షేప పరిహారము యుక్తమే.

ఆదేశమునకు, స్థానిసంజ్ఞ అతిదేశింపబడునని చెప్పినయెడల "ఆఙోయమహనః" (1-3-28) అని హనధాతువునకు విధింపబడిన ఆత్మనేపదప్రత్యయము, ఆ ధాతువునకే వచ్చునుగాని, దాని ఆదేశమగు 'వధ'కు రాకపోవునే? ఆదేశమునకతిదేశింపదగిన స్థానిసంజ్ఞ ఏదియు లేదుగదా ? హనధాతువు ఆత్మనేపదవిధాయక శాస్త్రమునందు స్వరూప పురస్కారముగ నుపాత్తమేగాని సంజ్ఞాశ్రయణముచే దాని కాత్మనేపదము విధింపబడలేదుగదా ? అనిన

హంతికి గూడ సంజ్ఞ కలదు. ఏసంజ్ఞ ? హంతిస్వరూపమే. అదియెట్లు ? "స్వంరూపం శబ్దస్యాశబ్ద సంజ్ఞా" అను వచనమువలన స్వరూపమే శబ్దమునకు సంజ్ఞ అగుటవలన, హంతికి హంతియే సంజ్ఞ కావచ్చును. అందు, "ఆఙోయమహనః" (1-3-28) అను సూత్రమునందలి హంతిసంజ్ఞయు, ప్రయోగస్థమగు హనధాతువు సంజ్ఞియు అగును. కావున వధికి హంతి సంజ్ఞానుదేశము నసంభవమే.

వా॥ "భసంజ్ఞా, జీప్, ష్ఫ, గోశాత్స్వేషుచ సిద్ధమ్" అని వార్తికము.

"స్థాని సంజ్ఞాన్యభూతస్యానల్విధౌ" అను నీ వచనాంతరమునకు ఫలాంతరముగూడ గలదని యీ వార్తికము బోధించుచున్నది.

సిద్ధమ్=వీని విషయమున నిష్టము సిద్ధమని యర్థము.

(1) "భసంజ్ఞ" - రాజ్ఞః పురుషః=రాజపురుషః అను స్థలమునందు, సమాసమున షష్ఠీ ప్రత్యయమునకు లుక్కు వచ్చిన తరువాత ప్రత్యయ లక్షణముచే భసంజ్ఞ ప్రాప్తించుచున్నది. "స్థాని సంజ్ఞాఽన్యభూతస్యానల్విధౌ" అను నీ వచనమువలన వారింపబడును. భసంజ్ఞ అలాశ్రయ విధిగదా ?

(2) "జీప్" - చిత్రా నక్షత్రమున పుట్టిన స్త్రీ చిత్ర. 'చిత్రా' అను పదమునందు "నక్షత్రేణయుక్తః కాలః" (4-2-3) అను సూత్రముచే విధింపబడిన, అణ్ప్రత్యయమునకు, "లుబవిశేషే" (4-2-4) అని లుప్పు. తరువాత 'చిత్రా

నక్షత్ర యుక్తకాలమున పుట్టినది' అను నర్థమునందు. సూ॥ "సంధి వేలాది ఋతునక్షత్రేభ్యోఽణ్" (4-3-16) అను సూత్రముచే విధింపబడిన అణ్ప్రత్యయమునకు, "చిత్రా రేవతీ రోహిణీభ్యః స్త్రియా ముపసంఖ్యానమ్" అను వార్త్తికముచేత లుక్కు ప్రవర్త్తించినది.

ఇట ప్రత్యయ లక్షణము చేత అణంతత్వము వచ్చినయెడల 'టిడ్ఢాణ్' సూత్రముచే ఙీప్ ప్రత్యయము ప్రాప్తము ప్రత్యయ లక్షణమునకు బదులుగ నీవచన మాశ్రయింపబడుటవలన, ఙీ యాపత్తి వారితము టిడ్ఢేతి సూత్రమునందు 'అతః' అను పదమనువర్త్తించును గాన నది యల్విధి యగుటచే స్థాని సంజ్ఞానుదేశము లేదు.

(3) "ష్ఫ" - 'వతణ్డీ' అనుచోట ష్ఫ ప్రత్యయాపత్తి వారణము ఫలము.

వతండుని గోత్రాపత్యమయిన స్త్రీ వతండీ,"వతణ్డాచ్చ" (4-1-108) అను సూత్రముచే 'యఞ్' ప్రత్యయము. దానికి "లుక్ స్త్రియామ్" (4-1-109) అని లుక్కు.

శార్ఙ్గరవాది పాఠమువలన, 'ఙీన్' అను స్త్రీ ప్రత్యయము.

ప్రత్యయ లక్షణముచే నిది యఞంతమయిన, "యఞశ్చ" (4-1-16) అను సూత్రమునుండి 'యఞః' అను పదము అనువర్త్తింపగా, "ప్రాచాంష్ఫ తద్ధితః" (4-1-17) అనుసూత్రముచేత ష్ఫ ప్రత్యయము ఇట ప్రాప్తించుచున్నది. కాని 'స్థాని సంజ్ఞాన్యభూతస్యానల్విధౌ' అను వచనమువలన ప్రవర్త్తింపదు. అతః అను నధికారమువలన ష్ఫ విధి అల్విధి.

శార్ఙ్గరవాది పాఠమువలన నిట పగశ్ఞముచే ఙీనే ప్రవర్త్తించునే యను శంక కలుగవచ్చునుగాని, "అవట్యాయనీ" అను స్థలములో "అవట్యాచ్చ" (4-1-72) అని ప్రాప్తమయిన చాప్ ప్రత్యయమును బాధించి ష్ఫ ప్రత్యయము ప్రవర్త్తించినట్లు ఙీనును గూడ బాధించి 'ష్ఫ' రావలసివచ్చును.

(4) గోరాత్వము - గామిచ్ఛతి=గవ్యతి. ఇట "సుపో ధాతు ప్రాతిపదికయోః" (2-4-71) అని వచ్చినది, 'అమ్' ప్రత్యయలోపము. ప్రత్యయ లక్షణముచేత "ఔతోమ్శసోః"(6-1-93) అని వచ్చు ఆత్వము గోరాత్వము. అది "స్థాని సంజ్ఞాన్యభూతస్యానల్విధౌ" అను ప్రకృత వచనముచేత ప్రవ

ర్తింపదు. ఆ సూత్రమునందు 'అచి' అను పదము అనువర్తించును గాన అది యల్విధియగును.

వా॥ "తస్య దోషః జానకారలోపేత్వే మ్విధయః" అను వార్తికము, "స్థాని సంజ్ఞానుదేశాదాన్య భావ్యస్య" అను వచనమునకు దూషణము కలదని చెప్పుచున్నది.

(1) ఙానకార లోపమనగా – 'ఆర్ద్రేచర్మన్' 'లోహితేచర్మన్' అను వైదిక ప్రయోగములందు, చర్మన్ శబ్దోత్తర సప్తమ్యేకవచన ప్రత్యయమునకు, "సుపాంసులుక్ పూర్వ సవర్ణాచ్ఛేయా డాడ్యాయాజాలః" (7-1-39) అను సూత్రముచే లుక్కు వచ్చినది. ప్రత్యయ లోప సూత్రారంభ పక్షమునందు, "యచిభమ్" (1-4-18) అని భసంజ్ఞ ప్రవర్తించును గాన పదసంజ్ఞ లేదు. అందు వలన నలోపము రాలేదు. ఇపుడీ వచనముచలన, ఆ భసంజ్ఞ ప్రాప్తింపకున్నది. నలోపమని కార్యమగుచున్నది. ఇదియొక దోషము.

(2) – ఇత్వము – 'ఆశీః' అను శబ్దమునందు, "శాస ఇదఙ్ హలోః" (6-4-34) అను సూత్రముచే హలాది కిత్తుపరమగునపుడు విధింపబడిన ఇత్వము, ప్రత్యయ లక్షణముచే సిద్ధింపవలెను. వచన స్వీకారపక్షమున అది సిద్ధింపదు.

(3) – ఇమ్విధి – "అతృణేట్" అను రూపమునందు, "తృణహ ఇమ్" (7-3-92) అను సూత్రముచే హలాది పిత్ప్రత్యయము పరమగునపుడు విధింపబడిన 'ఇమ్' అను నాగమము ప్రత్యయ లక్షణముచే సాధ్యము. "స్థాని సంజ్ఞాన్య భూతస్యానల్విధౌ" అను వచనము నాశ్రయించిన నది సిద్ధింపదు.

సూత్రభేదము గూడ దూషణాంతరము.

కాబట్టి, పాణిని న్యాసమే ఆశ్రయణీయము. అట్లైన, "సతో నిమిత్తాభావాత్పద సంజ్ఞాభావః" అనియు, "తుగ్దీర్ఘయోశ్చ విప్రతిషేధానుపపత్తేః యోగలక్షణత్వాత్పరిపీరితి" అను వార్తికద్వయముచేత దూషణములు సూచింపబడినవి గదా? అవి యెట్లు?

అనిన, ఈ రెండు వార్తికములలో మొదటిదగు "సతో నిమిత్తాభావాత్పద సంజ్ఞాభావః" అను వార్తికముచే నాపాదింపబడిన దూషణమునకను పదమే పరిహారము చేయుటనే చెప్పబడును. అనగా, "నఙిసంబుద్ధ్యోః" (8-2-8) అను సూత్రము 'ఙి' అను ప్రత్యయము పరమగునపుడు నలోపమును నిషేధించుచున్నది. ప్రత్యయ లక్షణముచేత, నచట భసంజ్ఞ ప్రవర్తించిన పక్షమున స్థానివద్భా

ధము వ్యర్థమగును. కావున నా నిషేధమే, ప్రత్యయ లక్షణమట ప్రవర్తింప దని జ్ఞాపనముచేయును. ఇది ఆవక్ష్యమాణ పరిహారము

ఇక రెండవ దోషము, 'హావిః' అనుచోట తుగాగమ దీర్ఘత్వములకు విప్రతిషేధానుపపత్తి. దానికి పరిహారమును వినుడు.

ప్రత్యయ లక్షణ సూత్రమునకు, ప్రత్యయమున్నపుడు దృష్టమైన కార్యము, (ప్రసక్తమయినంత సూత్రమున కాదు) ప్రత్యయము లుప్తమయి నపుడును ప్రవర్తించును అని అర్థము. ప్రత్యయమున్నపుడుదీర్ఘమే దృష్టము, తుగాగమము గాదు. కావున ఉపదేశ శాస్త్రములందు గల పర విప్రతిషేధము వలన దీర్ఘత్వము సిద్ధించును విప్రతిషేధ శాస్త్ర ప్రవృత్తి కుపయోగపడు నది, అతిదిశ్యమాన కార్యముల ఉత్పత్తి దేశగత పౌర్వాపర్యమేయని సిద్ధాంతము. ప్రత్యయలక్షణ సూత్ర మాయా శాస్త్రముల నిమిత్త ములను సంపాదించి వాని వాని ప్రవృత్తికి కారణమగును. అంతియ.

ఈ యోగమునకు ప్రయోజనము లేయవి ?

ఈ సూత్రారంభమున కేమి యుక్తి ? అని విచారించితిమి.

ఇది ప్రయోజన విచారము. అందు మొదటి ప్రయోజన వార్తి కము వా॥ **"అపృక్త శి లోపే నుమ్, అనూమౌ, గుణవృద్ధీ, దీర్ఘత్వేమడాట్ శ్నమ్విధయః"** అనునది.

**'హాల్ జ్యాబి'** తి సూత్రముచే అపృక్తమునకు లోపముకలిగి నపుడును, **'శి'** ఆదేశమునకు లోపము కలిగిన తరువాతను, నుమాగమము, అనూగమము, అమాగమము, గుణము, వృద్ధి, దీర్ఘము, ఇమాగమము, అడాగమము, ఆడా గమము, శ్నమ్విధి— ఇవి ప్రవర్తించుట ప్రయోజనములు.

అందు నుమాగమము— "అగ్నే త్రీతే వాజినా త్రీషధస్తాతాకా పిణ్డానామ్" అను వైదిక ప్రయోగమునందుగపడుచున్నది.

తాని తాని అను పదములలో శి లోపము. ఇట ప్రక్రియాక్రమములో ముందు "శేశ్ఛన్దసిబహులమ్" (6-1-70) అను సూత్రముచే 'శి' కి లోపము రాగా, ప్రత్యయ లక్షణము చే, "నపుంసకస్య ఝలచః" అను నుమాగమము సిద్ధించుట ఫలము

అమ్, ఆమ్— 'అనడ్వన్', 'అనడ్వాన్' అను స్థలము లందు సంబుద్ధి

లోపము ప్రవర్తించిన తరువాత, సంబుద్ధి నిమిత్తకమగు 'అమ్' ఆగమమును, సర్వనామస్థాన నిమిత్తకమగు 'ఆమ్' అను నాగమమును సిద్ధించుట ప్రయోజనము. సంబుద్ధిలోపమే అపృక్తలోపము.

గుణము — 'అధోక్' 'అలేట్' అను రూపములలో హాల్ఙ్యాది లోపానంతరము, పుగంతే త్యాది గుణము సిద్ధించుటయు ప్రయోజనము.

వృద్ధి — 'న్యమార్ట్' — ఇది మృజూశుద్ధౌ అను ధాతువు లఙంత రూపము. ఇట ధాతు ప్రత్యయ నిమిత్తకమగు వృద్ధి, 'హల్ఙ్యాది' లోపానంతరము ప్రత్యయ లక్షణముచే ప్రవర్తింపవలె. కావున వృద్ధి సిద్ధియు ప్రయోజనము.

దీర్ఘము — "అగ్నిచ్ఛిత్" అని వైవైదిక ప్రయోగము నందు, శిలోపానంతరము, "సర్వనామ స్థానే చాసంబుద్ధౌ" (6-4-8) అను దీర్ఘ సిద్ధియు ప్రత్యయ లక్షణ సాధ్యము.

ఇమ్ — 'అతృణేట్' అను తృహధాతు లఙంత రూపమున, అపృక్త లోపానంతర మీ ఆగమము "తృణహఇమ్" (7-3-92) అను సూత్రముచే సిద్ధించుటయు ఏతదధీనము.

అట్ ఆట్ — ఇవి ఆగమములు. "లుఙ్ లఙ్ లృఙ్ క్ష్వడుదాత్త" (6-4-71), "ఆడజాదీనామ్" (6-4-72) అను సూత్రములచే ధాతువునకు విధింపబడినది. 'అధోక్' 'అలేట్' — అను లఙంత రూపమునందు, అడాగమము, 'ఐయః' 'ఔనః'— అను స్థలము ఆడాగమము జుహోత్యాది గణ పఠితమగు ఋధాతువునకు లఙ్ ప్రథమైకవచనాంతము 'ఐయ' అనునది. అట్, లఙ్, తిప్, శప్, శ్లు, ద్విత్వము, అభ్యాసములో "అర్తిపిపర్త్యోశ్చ" (7-4-77) అని ఇత్వము ఇయఙ్, అపృక్త లోపము, విసర్గమును క్రమ ప్రక్రియా సిద్ధములగు కార్యములు. ఆడాగమ మచట ప్రత్యయ లక్షణసాధ్యము.

'ఔనః' అను రూపము, 'ఉన్దీ క్లేదనే' అను ధాతువునకు లఙ్ ప్రథమైక వచనాంతము.

శ్నమ్విధి — 'అభినోత్' 'అచ్ఛినోత్' అను రూపములందు అపృక్త లోపోత్తరము ప్రత్యయ లక్షణ సాధ్యము. 'భిదిర్' 'ఛిదిర్' అనునవి రుధాది ధాతువులు. శ్నమ్ ప్రత్యయము కర్త్రర్థక సార్వధాతుక నిమిత్తము.

ఈ ప్రయోజనములన్నియు స్థానివద్భావముచే సిద్ధింపవచ్చును గాన ఇవి ప్రకృత సూత్ర ప్రయోజనములు కావని ప్రత్యాఖ్యానవాదుల వాదము.

అట్లు సిద్ధింపవు ఆదేశమునకు గదా స్థానివద్భావము ప్రవర్తించునది. ఆదేశింపబడునది ఆదేశము. ఆదేశించుట=ఉచ్చరించుట. దిశధాతువున కుచ్చారణ మర్థము. లోపమనగా అభావము. దాని కుచ్చారణము అసంభవముగదా ? అను నాక్షేపము కలదు.

కాని, ఆ ధాతువునకు 'ప్రతిపాదనము' అను నర్థమును గలదు. లోపమును ప్రతిపాద్యమే గావున నాదేశము కావచ్చును అని సమాధానము.

లోపమాదేశము కావనిన, "అచః పరస్మిన్ పూర్వవిధౌ" అని స్థానివద్భావమున కుదాహరణములు లోపాదేశములే యధికసంఖ్యాకములు ప్రదర్శితముల నుపపన్నములు కావలసివచ్చును. కాగా స్థానివద్భావముచేత ప్రకృత సూత్రప్రయోజనములు సిద్ధింపవచ్చును గాన నీ సూత్ర మనావశ్యకమని నిర్బాధముగ చెప్పవచ్చునని భావము.

అట్లైన, స్థానివద్భావము ప్రవర్తింపని స్థలములందు లుప్త ప్రత్యయ నిమిత్తక కార్యములు ప్రవర్తించుటకై ఈ సూత్రము వక్తవ్యమగును.

ఎచ్చట స్థానివద్భావము ప్రవర్తింపదు ? అల్విధి కర్తవ్యమయినపుడు, ఏమి ప్రయోజనము ? అనిన, ప్రయోజన వార్తికము-

**వా॥ "ప్రయోజనం నకారలోపే త్వే మ్విధయః"** అనునది.

నకారలోపము ప్రవర్తింపకుండుటయు, ఇత్వమును, ఇమ్విధియు, ప్రవర్తించుటయు, ప్రయోజనములు.

- జిప్రత్యయాంతమున నకారలోపమున కుదాహరణము- 'ఆర్ద్రే చర్మన్' 'లోహితే చర్మన్' అను రూపములు. అట, ప్రత్యయ లక్షణముచేత భసంజ్ఞను ప్రవర్తింపజేసి పదత్వము లేనందున లోపము లేదని చెప్పవలెను. భసంజ్ఞ విశేషణముగ, అల్లు ఆశ్రయింపబడిన విధియగుటచే నల్విధిగాన స్థానివద్భావము ప్రాప్తింపదు.

- ఇత్వమునకు - 'ఆశీః' అనునది యుదాహరణము.

అట శాసుధాతువుకంటె పరముగా క్విప్ ప్రత్యయము. "శాస ఇదఙ్ హలోః" (6-4-34) అని ఆకారమున కిత్వము. అది ప్రత్యయ లక్షణ సంపా

ద్యము. హాల్లను నల్లు విశేషణముగ నాశ్రయింపబడుటచేత నది యల్విధి గాన స్థానివద్భావము ప్రవర్తింపదు.

– ఇయ్విధి కుదాహరణము – 'అతృణేట్' అను లక్ష్యము. హలాదిపిత్సార్వధాతుకము పరమగునపుడిది ప్రవర్తించును. ఆ ప్రత్యయమిట ప్రత్యయలక్షణ ప్రవృత్తి సంపాద్యము. హాల్లను అల్లు విశేషణముగ ఇందాశ్రయింపబడుటవలన ఇది అల్విధి. అందువలన స్థానివద్భావము ప్రాప్తింపదు.

ఇక సూత్రారంభ దూషణ వార్తికము, "భసంజ్ఞా, జీప్, ష్ఫ, గోరాత్వేషు చ దోషః" అనునది. ప్రత్యయ లక్షణ సూత్రపక్షమున నివి దోషములు. స్థానివద్భావము నాశ్రయించి, ప్రకృత సూత్రమునకు గతార్థతను చెప్పు పక్షమున నీ దోషములు ప్రాప్తింపవు.

రాజ్ఞః పురుషః=రాజపురుషః ఇట నలోపము కావలెను. ప్రత్యయలక్షణ సూత్రపక్షమున భసంజ్ఞ ప్రవర్తించిన పదసంజ్ఞ ప్రతిబద్ధమైన లోపము రాకుండపోవును.

స్థానివద్భావ పక్షమైన, 'అనల్విధౌ' అను నిషేధమువలన నది ప్రాప్తింపదు గాన భసంజ్ఞ రాదు.

–జీప్– చిత్రాయాం జాతా=చిత్రా– ప్రత్యయ లక్షణముచేత అణంతమైన జీప్ రావలసివచ్చును. ఈ సూత్రము లేనపుడు దోషములేదు. స్థానివద్భావమును 'అనల్విధౌ' అను నిషేధమువలన ప్రాప్తింపదు.

–ష్ఫ– వతండీ అనుచోట ప్రత్యయ లక్షణముచే యఞంతమైన, "ప్రాచాం ష్ఫతద్ధితః" (4-1-17) అని ష్ఫ ప్రత్యయము ప్రాప్తించుచున్నది. అపుడు యఞంతమగు అకారాంతమగుటవలన తత్ప్రాప్తి. ఇట, "వతండాచ్చ" (4-1-103) అని యఞ్. "లుక్స్త్రియామ్"(4-1-109) అని లుక్కు. శార్ఙ్గరవాది పాఠమువలన జీన్ప్రత్యయము. స్థానివద్భావముచే నీ సూత్రము గతార్థమగునను పక్షమున నా దోషములేదు. 'అనల్విధౌ' అను నిషేధము కలదుగదా!

–గోరాత్వము=గోశబ్దమునకు అమ్ప్రత్యయము పరమగునపుడు విధింపబడిన ఆకారము. గామిచ్ఛతి=గవ్యతి. అమ్ప్రత్యయమునకు ధాత్వవయవత్వమువలన లుక్కు. సూత్రారంభవాది మతమున, ఆకారాదేశ ప్రాప్తియుండును స్థానివద్భావ పక్షమున 'అనల్విధౌ' అని నిషేధము వలన నది ప్రాప్తింపదు గాన ఆ ఆపత్తిలేదు.

## ఇక సూత్రారంభవాదియొక్క దూషణోద్ధారము

'భసంజ్ఞ ప్రాప్తించును. అందువలన నలోపము రాకపోవును' అనునది దోషముకాదు. ప్రత్యయ లక్షణముచేత భసంజ్ఞ ప్రవర్తింపదను విషయమును ఆచార్యుని ప్రవృత్తి తెలియచేయుచున్నది. "నఙిసంబుద్ధ్యోః" (8-2-8) అను సూత్రముచే, ఙిపరమగునపుడును, సంబుద్ధి పరమగునపుడు, నకార లోపమును పాణిని ప్రతిషేధించి యున్నాడు. ప్రత్యయ లక్షణము ప్రవర్తించిన, భసంజ్ఞ చేతనే వారించునుగదా! నిషేధము వ్యర్థము.

ఇక 'చిత్రా' అనుచోట ఙీబాపత్తి- అదియు దోషముకాదు. 'అణ్ప్రత్యయాంతమగు అకారాంతముకంటె ఙీప్ వచ్చును అనికాదు దాని యర్థము. ఇక నేమని ?

'అణ్ అయిన అకారము అంతమందుగల అదంత ప్రాతిపదికముకంటె బరముగా ఙీప్పు వచ్చును' అని వివక్షితార్థము. అకారముచే అణంతముగాదు విశేషింపబడునది, అణ్ణే. అకార రూపమగు అణ్ణు అని చెప్పబనిలేదు. అణ్ప్రత్యయములెల్ల నకార రూపములేగదా ! కావున, సామర్థ్యమువలన, అకారముగా వినబడుచున్న అణ్ణు కావలెనని యర్థము ఫలితము. 'చిత్రా' అను స్థలమున అణ్ప్రత్యయము లుప్తము గాన శ్రూయమాణముగాదు.

ఇక ష్ఫప్రత్యయ విషయమున గూడ— 'యఞంతమగు అకారాంతము కంటె' — అని గాక అకార మవయవముగా గల యఞంతము కంటె బరముగా ఙీప్పగునని వివక్షింతుము. ఇట నట్టి యఞ్ లేదు గనుక దోషము లేదు.

గో శబ్దము నందాత్వ విషయమునను — 'అజాదియగు అమ్ము పరమగునపుడు ఆత్వము వచ్చును'— అని గాక అచ్చును ప్రధానముగా గ్రహించి, అమ్ప్రత్యయమును దానికి విశేషణముగా చేసిన,అమ్ప్రత్యయము నందలి అచ్చు పరమగునపుడని యర్థమగును గాన ఆత్వము వర్ణ నిమిత్తమగును గాని ప్రత్యయ నిమిత్తముగాదు. వర్ణాశ్రయ కార్యములందు ప్రత్యయ లక్షణము ప్రవర్తింపదు. కావున దోషములేదు.

ఇట్లు, సూత్రారంభ పక్షమున ప్రసక్తములగు దోషములను పరిహరింపగా, ప్రత్యాఖ్యానవాది, సూత్ర ప్రయోజనమునకు అన్యథా సిద్ధములగునని ప్రతిపాదించును.

ఙి నకార లోపము, ఇత్వము, ఇమ్విధియు గదా ప్రయోజనములు.

ఞిత్ప్రత్యయము పరమగునపుడు నకార లోపాభావ రూప ప్రయోజనమునకు, "నఞిసంబుద్ధ్యోః" అను న్యాసముండనే యున్నది. ప్రత్యయ లక్షణముచే ఘసంజ్ఞ ప్రవర్తింపదని జ్ఞాపనచేయుటకు అవశ్యముగ నా సూత్రము కర్తవ్యమాయె.

ఇక ఇత్వమా ? "ఆశాసః క్వౌ ఉపధాయా ఇత్వమ్" అను వక్ష్యమాణ వార్తికముచేతనది సిద్ధించును. ప్రకృత సూత్రమున్నను, 'ఆశాస్తే' అను చోట ఇత్వమును వారించుటకు 'క్విప్ప్రత్యయము వచ్చినపుడే' అను నియమమును బోధించుటకది ఆవశ్యకము.

ఇమ్విధియు ప్రయోజనముకాదు. ఎందువలననగా "తృణహ ఇమ్" (7-3-92) అను సూత్రములోనికి "ఉతోవృద్ధిర్లుకిహలి" (7-3-89) అను సూత్రము నుండి 'హలి' అను పదమనువర్తింపదు.

అది అనువర్తింపని పక్షమున అజాది ప్రత్యయము పరమగునపుడును తృణహాని' మున్నగు రూపములందిమాగమముకాదా ? అనిన, "నాభ్యస్తస్యాచి పితి సార్వధాతుకే" (7-3-87) అను సూత్రమునుండి, 'న' 'అచి' అనునవి యనువర్తించునుగాన నా దోషము లేదు.

అయిన నీ సూత్ర మక్కర లేదందురా ? అక్కరలేకేమి ? నియమము బోధించుట కావశ్యకమే. ఎట్లనగా- స్థానివద్భావముచేత నీ సూత్ర ప్రయోజనములు సిద్ధించునుగాన నిది నియమార్థమగు. ప్రత్యయమే లక్షణముగాగలది ప్రత్యయ లోపమునందు ప్రవర్తించును. శబ్దమును గ్రహించి అనగా ప్రత్యయత్వ తద్వ్యాప్యవ్యధర్మములకంటె భిన్నమగు ధర్మములను గ్రహించి విహిత మయిన కార్యము ప్రవర్తింపదు అని నియమము. దీనికి ప్రయోజనము, 'శోభ నాదృపదోస్య-సుదృపత్' అనుచోట "సోర్మనసీ అలోమోషసీ" (6-2-117) అను నాద్యుదాత్తము ప్రవర్తింపకుండుట. అస్త్వము ప్రత్యయా సాధారణ ధర్మముకాదు. ఆ సూత్ర మసంతమునకు స్వరవిధాయకము.

॥ప్రత్యయ లోపే ప్రత్యయలక్షణమ్॥

## నలుమతాఙ్గస్య (1-1-62)

'లు' అనునది ఘటకముగా గల శబ్దములు లుమంతములు. అవి 'లుక్' 'శ్లు' 'లుప్' అనునవి. వీనిచే ప్రత్యయమున కదర్శనము ప్రతిపాదింపబడి నపుడు, ఆ ప్రత్యయము నిమిత్తముగ గల అంగకార్యము ప్రవర్తింపదని సూత్రమున కర్థము.

'కతి' అను జసంత ముదాహరణము. ఇట 'జస్' ప్రత్యయమునకు "షడ్భ్యోలుక్" (7-1-22) అను సూత్రముచే అదర్శనము ప్రతిపాదింపబడినది. కావున, "జసిచ" (7-3-109) అను సూత్రముచే, గుణము ప్రవర్తింపదు.

వా॥ "లుమతి ప్రతిషేధే ఏక పద స్వరస్యోపసంఖ్యానమ్" అని న్యూనతా పరిహార వార్తికము. లుమచ్ఛబ్దముచే ప్రత్యయాదర్శనము ప్రతిపాదింపబడినపుడు, ఏకపద స్వరము కర్తవ్యమగుచో ప్రత్యయ లక్షణ ప్రతిషేధమును చెప్పవలసి యుండునని వార్తికార్థము. ఏక పదస్వరమనగా నేకపదాశ్రయమగు, "ఞ్నిత్యాదిర్నిత్యమ్" (6-1-197), "కితః" (6-1-165) అను సూత్రములచే విధింపబడిన స్వరము. అవి అంగాధికారీయములు కానందున సూత్రముచే ప్రతిషేధము ప్రాప్తింపదు.

"తిఙ్ఙతిఙః" (8-1-28) మున్నగు స్వరములు ద్విపదాశ్రయములు. వాని విషయమున ప్రత్యయ లక్షణము ప్రవర్తించును.

'గర్గాః', 'వత్సాః', 'బిదాః' 'ఉర్వాః' 'ఉష్ట్రగ్రీవాః' 'వామరజ్జూః' 'అత్రయః'- అనునవి యుదాహరణములు.

'గార్గ్య' అను యఞంత శబ్ద ప్రథమా బహువచనాంత రూపము= 'గర్గాః' అనునది. ఇట్లే వత్సాః అనునదియు. "యఞఞోశ్చ" (2-4-64) అను సూత్రముచే బహుత్వమున, యఞ్ ప్రత్యయమునకు లుక్కు.

'బిదాః' 'ఉర్వాః' అనునవి అఞ్ ఽగంతములు.

'ఉష్ట్రగ్రీవా' 'వామరజ్జూః' అను స్థలమునందు. 'ఒంటె మెడవంటి ప్రతికృతి' 'చక్కని త్రాడువంటి ప్రతికృతి' అను నర్థములందు వచ్చిన 'కన్' అను ప్రత్యయమునకు, "దేవపథాదిభ్యశ్చ" (5-3-100) అని లుప్పు.

"అత్రయః" అనునది ఆత్రేయ శబ్దమునకు ప్రథమా బహువచనాంత రూపము "ఇతశ్చానిఞః" (4-1-122) అను సూత్రముచే, అపత్యార్థమున వచ్చిన ఢక్ప్రత్యయమునకు, "అత్రి, భృగు, కుత్స, వసిష్ఠ, గోతమాఙ్గిరోభ్యశ్చ" (2-4-64) అని బహుత్వమున లుక్కు.

పై స్థలమునందు, ప్రత్యయాదర్శమునకు దరువాత, యథాయోగముగ, "ఞ్నిత్యాదిర్నిత్యమ్" (6-1-197), "కితః" (6-1-65) అను సూత్రములచే, ఆద్యుదాత్తత్వమును, 'అత్రయః' అను స్థలమున నంతోదాత్తత్వమును,

ప్రత్యయ లక్షణముచే ప్రాప్తించుచున్నవి. వానికి, ప్రతిషేధ మావశ్యకము. ప్రకృత సూత్రమున, 'అంగస్య' అనునది అధికారపదము.

ఇట్లే, 'పథిప్రియః' 'మథిప్రియః' అను స్థలమున, సర్వనామస్థాన ప్రత్యయమునకు, సామాసిక లుక్ప్రవృత్త్యుత్తరము, ప్రత్యయ లక్షణ సూత్రముచే, సర్వనామ స్థాననిమిత్తకమగు, "పథిమథోః సర్వనామస్థానే"(6-1-199) అను నాద్యుదాత్తము రాకుండుటకు ఉపసంఖ్యాన ప్రయోజనములని.

వా॥ "ప్రయోజనం ఙనికిలుకిస్వరాః" "పథిమథోస్సర్వనామస్థానే ఙకి" అను వార్తికములచే ప్రతిపాదింపబడినది. ఆ వార్తికమున ఙకార నకారోత్తరేకారము లుచ్చారణార్థములు. 'ఙిత్, నిత్, కిత్తులగు ప్రత్యయములకు ల్లుక్కు ప్రవర్తించిన తరువాత స్వరములు నివర్త్యమానములుగ ప్రయోజనములు' అని వార్తికార్థము—

ఈ ఏక పదస్వర విషయమున ప్రత్యయ లక్షణ ప్రతిషేధోపసంఖ్యానము సకలైకపదస్వర విషయమా ? లేక విశేషము గలదా ? అనిన,

అవిశేషముగ కాదు. వా॥ "సర్వామంత్రిత సిజ్లుక్ స్వరవర్జమ్". సర్వస్వరము, ఆమంత్రిత స్వరము, సిజ్లుక్స్వరము. తప్ప తదితరైక పదస్వర విషయముననే యనుట.

— సర్వస్వర మనగా — "సర్వస్య సుపి" (6-1-191) అను ఆద్యుదాత్తము.

'సర్వస్తోమః' 'సర్వపృష్ఠః' అను స్థలములందు ప్రత్యయ లక్షణము ప్రవర్తించి ఆద్యుదాత్తము రావలెను.

— ఆమంత్రిత స్వరమనగా — "ఆమన్త్రితస్యచ" (6-1-198) అను నాద్యుదాత్తము.

అయ్యది, 'సర్పిరాగచ్ఛ' 'సప్తాగచ్ఛత' అనుచో సంబుద్ధికి లుక్కు వచ్చినను, ప్రత్యయలక్షణముచే ఆమంత్రితత్వమును సంపాదించిన, ప్రవర్తించును. సంబుద్ధికి లుక్కు "స్వమోర్నపుంసకాత్" (7-1-23) అని విహితము. 'సప్త' అను చోట సంబోధన ప్రథమా బహువచనమైన జస్సుకు, "షడ్భ్యోలుక్" (7-1-22) అని లుక్కు.

— సిజ్లుక్ స్వరమనగా, "ఆదిః సిచోన్యతరస్యామ్" 6-1-187 అను సూత్రముచేత సిజంతమునకు విహితమగు నాద్యుదాత్తము సంఖ్య. అయ్యెది,

'మాహిదాతామ్' 'మాహిధాతామ్' అనుచో, "గాతిస్థాఘుపాభూభ్యః సిచః పరస్మైపదేషు" (2-4-77) అను లుక్కు ప్రవర్తించిన తరువాత, ప్రత్యయ లక్షణ సాధ్యము. ఇవి తప్ప, మిగిలిన ఏకపద స్వరముల విషయమున, ప్రత్యయ లక్షణ ప్రతిషేధమావశ్యకము.

ఈ స్వర విధాయకములు అంగాధికారీయములు కావు. కాని వాని విషయమునను, తత్ప్రతిషేధము వాంఛితము. ఈ వర్ణనమునకు ప్రయోజనమే, "ఞ్నిని కిల్లుకిస్వరాః" "పథిమథోస్సర్వనామ స్థానే లుకి" అను వార్తికములు బోధించుచున్నవని వివరింపబడినది.

"వా॥ "అహ్నోరవిధౌ" అనునది దూషణాంతర వార్తికము.

'అహన్' శబ్దమునకు, "రోఽసుపి"(8-2-69)అను సూత్రముచే రత్వము విధింపబడినది. అది 'సుప్' ప్రత్యయము పరమగునపుడు రాదు అని అందలి 'అసుపి' అను దానివలన దెలియుచున్నది. అట నఞర్థము ప్రసజ్య ప్రతిషేధము. 'అహర్దదాతి' అనునది యుదాహరణము, అట స్వమ్మోల లుక్కుకు ప్రత్యయ లక్షణము ప్రవర్తించినచో, సుప్పరత్వము వలన రత్వము సిద్ధింపకపోవును. ప్రకృత సూత్రముచే నిషేధము రత్వమంగాధికారీయము కానందున సిద్ధింపదు.

వా॥ "ఉత్తర పదత్వే చాపదాది విధౌ" అనునదియు నాక్షేప వార్తికాంతరము. వార్తికము నందలి ఉత్తర శబ్దమునకు ఉత్తరపదమని యర్థము. ఉత్తరస్య=ఉత్తరపదస్య=సమాసచరమావయవస్య, పదత్వే=పద సంజ్ఞా కర్తవ్యమయినపుడును, ప్రత్యయ లక్షణము ప్రవర్తింపదు.

ఆ పద సంజ్ఞా కార్యము పదాదికి విధికాని యెడలనే ఈ నిషేధమని 'అపదాదివిధౌ' అనునది బోధించుచున్నది.

అందు ప్రత్యయ లక్షణ ప్రతిషేధోదాహరణములు - 'పరమవాచా' 'పరమవాచే' 'పరమగోదుహా' 'పరమగోదుహే', 'పరమశ్వలిహా' 'పరమశ్వలిహే' — అనునవి. ఈ సమాసములలో నుత్తర పదములు, సామాసిక లుక్ప్రవృత్త్యనంతరము ప్రత్యయ లక్షణము ప్రవర్తించిన సుబంతములయి పదములగును

గాన, "చోఃకుః" (8-2-30) అని కుత్వము వాచ్ అను దాని చకారమునకును, 'గోదుహ్' లోని హాకారమునకు, "దాదేర్ధాతోర్ఘః" (8-2-32) అని ఘత్వమును, 'శ్వలిహ్' లో, "హోఢః" (8-2-31) అని ఢత్వమును రావలసి యుండును. అవి రాకుండుటకు ప్రత్యయ లక్షణ ప్రతిషేధము వ_క్తవ్యము.

ఇక, 'అపదాదివిధౌ' అనునది యెందులకనగా, 'దధిసేచౌ' 'దధిసేచః'- అను స్థలములందు, "సాత్పదాద్యోః" (8-3-111) అను సూత్రముచే షత్వ నిషేధము సిద్ధించుటకు. 'దధ్నఃసేచౌ' అని విగ్రహము. 'సేచ్' అను ను_త్తరపదమునకు, ప్రత్యయ లక్షణముచే, సుబంతత్వము లభించిన నది పద మగును. కాగా, పదాది సకారమునకు షత్వ ప్రతిషేధమును సిద్ధించును. పదాది విధి భిన్న కార్యముల విషయమున ప్రత్యయ లక్షణ ప్రతిషేధము. కుత్వ, ఘత్వ, ఢత్వములు పదాంత విధులు గాన పదాదివిధి భిన్నములు. కాన వాని విషయమున ప్రతిషేధము వలన పదత్వము లేదు. షత్వ నిషేధము పదాది విధి. దీని విషయమున ప్రత్యయ లక్షణము ప్రవ_ర్తించును గాన 'సేచ్' అనునది పదమై షత్వ నిషేధము సిద్ధించి నది.

"ఉ_త్తర పదత్వే చాపదాదివిధౌ" అను వా_ర్తికముచే బోధితమగు ప్రత్యయ లక్షణ ప్రతిషేధము నంగీకరించిన, ఉ_త్తర పదాధికారము వ్యర్థము కావలసి వచ్చునేయని యాక్షేపము. అయిన నేమి దోషము? అందురేని, "ఉ_త్తరపదాదిః" (6-2-111) అని స్వర ప్రకరణమున నొక యధికార సూత్రము. ఆ యధికారము నందలి సూత్రములెల్ల వ్యర్థములు కావలసి వచ్చును.

అందు కర్ణోవర్ణ లక్షణాత్" (6-2-112) అను సూత్రము, వర్ణవాచకము లును లక్షణ వాచకములును నగు పూర్వ పదముల కంటె బరమగు కర్ణశబ్దము నకు, బహువ్రీహి సమాసము నందు, ఆద్యుదా_త్తము కలుగునని బోధించు చున్నది. 'శుక్ల కర్ణః' 'శంకుకర్ణః' ఇత్యాద్యు లుదాహరణములు. అట ను_త్తర పదత్వము ప్రత్యయ లక్షణ సాధ్యము. అయ్యది నిషేధింపబడినదాయె. కావున నా యు_త్తర పదాధికారస్థ విధులన్నియు నిరర్థకములు కావలసి వచ్చు చున్నదని ఆక్షేప భావము.

ఇక నీ యాక్షేపమును బరిహరించుటకు, "ఉ_త్తర పదత్వే చాపదాదివిధౌ" అను వచనమునకు బదులుగా, "పాదిలోప విధౌ ప్తత్యంతే" అను న్యాసమును జేసి,

నలోపము మొదలుకొని, ప్లుతి చివరగల విధి విషయమున, లుమల్లోపమున ప్రత్యయ లక్షణము కలుగదు అని చెప్పుదుము. ఇపుడు, నలోప విధికి, బూర్వమైన ఉత్తర పదాద్యుదాత్త్వము విషయమునను, ప్లుతికి బరమయిన షత్వ ప్రతిషేధ విషయమునను, ప్రత్యయ లక్షణము ప్రవర్తించును. కుత్వాదులు తదంతర్భూతములు. కావున వాని విషయమున ప్రత్యయ లక్షణ ప్రతిషేధము ప్రవర్తించి, 'పరమవాచా' ఇత్యాదులందు, కుత్వాదులు ప్రవర్తింపకుండుటయు సిద్ధించును అని చెప్పుదమనిన నది సాధ్యపడదు. ఏలయన, -అపుడు,

'రాజకుమార్యౌ' 'రాజకుమార్యః'- అను స్థలమున, ప్రత్యయ లక్షణముచే, పదాంతమగు ఇక్కునకు, "ఇకోసవర్ణే శాకల్యస్య హ్రస్వశ్చ" (6-1-127) అని శాకల ప్రకృతి భావము రావలసివచ్చును.

ఇక నీ దోషమును పరిహరించుకొనుటకు 'సితిశాకలం న' అని పఠింపబడినదానిని 'ప్రత్యయేశాకలంన' అను మార్పు చేయవచ్చును. అపుడీ దోషము వారించును అందురేని యపుడు.

'దధి+అధునా', 'మధు+అధునా' అను స్థలమునందుగూడ, 'అధునా' అనునది ప్రత్యయమగుటచే శాకలము ప్రవర్తింపకపోవును.

ఈ దోషము ప్రసక్తముగాదు. 'ప్రత్యయము పరమగునపుడు శాకలము రాదన'గా నెట్టి ప్రత్యయమని మీ యభిప్రాయము ? ఏదియో యొక ప్రత్యయమనికాదు. తత్ప్రకృతి విహిత ప్రత్యయమని యర్థము ప్రత్యాసత్తి లభ్యము. అధునా అను ప్రత్యయము దధి మధు శబ్దవిహితముగాదు. కాగా "నలోపాది విధౌ ప్లుత్యంతే"అని న్యాసమును మార్చినను దోషములేదు.

పోనిండు, 'పరమదివా' 'పరమదివే' అను స్థలమున, సూ॥ "దివఉత్" (6-1-131) అని, అంతర్వర్తి విభక్తి నిమిత్తక పదత్వ ముండుటవలన ఉత్వము రావలసివచ్చును. ఉత్వము నలోపాది ప్లుత్యంత విధి మధ్యపాతి కాదు గాన నీ వార్తిక న్యాసముచే ప్రత్యయ లక్షణ నిషేధము సిద్ధింపదు.

అట్లైన నలోపాది ప్లుత్యంత విధుల విషయమునను విశేషమును గ్రహింపక, సామాన్యముగనే "ఉత్తర పదత్వే చాపదాది విధౌ" అనియే వార్తికముండును.

అట్లైన నుత్తర పదాధికారము నిరుపయోగమగునంటిరి గదా ?

అనిన, వచన సామర్థ్యమువలన నది సార్థకమగును. ఉత్తర పదమనగా రూఢి శక్తిచే సమాస చరమావయవమని యర్థము. అది యౌగికము కాదు. కావున, ఉత్తర పదమను వ్యవహారమునకు పదసంజ్ఞతో బనిలేదు.

అట్లైన, "ఉత్తర పదత్వే చాపదాది విధౌ" అను వచన మపూర్వ వక్తవ్య మేనా ?

అపూర్వము కాదు. 'పరమవాచా' ఇత్యాదులందు, కుత్వాభావము పదత్వా భావమువలన సిద్ధించును. ఆయా సూత్రము లందు తత్తత్ప్రదాను వృత్తి చేయబడును. అందువలన దోషము వారించును. ఇష్టము సిద్ధించును.

అది యెట్లన — 1. "యస్మాత్ప్రత్యయ విధిస్తదాది ప్రత్యయేఙ్గమ్" (1-4-13).

2 "సుప్తిఙంతం పదమ్" (1-4-14)

3. "నఃక్యే" (1-4-15)

4. "సితిచ" (1-4-16)

5. "స్వాదిష్వ సర్వనామస్థానే" (1-4-17)

6. "యచిభమ్" (1-4-18)

ఇట్లీ క్రమములో నష్టాధ్యాయియందు సూత్రములు పఠింపబడినవి.

అందు మొదటి సూత్ర మంగ సంజ్ఞా విధాయకము. తరువాతి నాలుగు సూత్రములును, పదసంజ్ఞా విధాయకములు. చివరి ఆరవ సూత్రము భసంజ్ఞను బోధించుచున్నది.

సుప్తిఙంతం పదమ్' అను రెండవ సూత్రములోనికి, 'యస్మాత్ప్రత్యయ విధిస్తదాది' అను నంతవర కనువర్తించును. కాగా, సుప్తిఙ్విధానావధి ఆదిగాగల సుబంతతిఙంతములు పదములని యర్థము. కనుకనే, 'పరమైశ్చతుర్భిః' అను చోట, పరమ ఘటిత సముదాయమునకు పదత్వము లేదు.

"నఃక్యే" (1-4-15) అను సూత్రము నందును నయ్యాది యనువర్తించుటచే, ఆ సూత్రమునకు, 'నకారాంతము క్యప్రత్యయము పరమగునపుడు పద

సంజ్ఞకమగును' 'క్యప్రత్యయ విధానావధి ఆదిగాగల సుబంతమును క్యప్రత్యయము పరమగునపుడు పదసంజ్ఞకమగును'. అని యర్థము—

"సితిచ" (1-4-16) అను సూత్రము నందును నకువర్తించుటచే, సిత్తు పరమగునపుడు, పూర్వమును, సిద్విధానావధ్యాది సుబంతమును పదసంజ్ఞ కలది యగునని ఆ సూత్రమున కర్థము.

ఇక "స్వాదిష్వ సర్వనామస్థానే" (1-4-17) అను సూత్రమునకు, 'సర్వనామ స్థాన భిన్నములగు సర్వనామ స్థాన ప్రత్యయములు పరమగునపుడు, పూర్వము పదసంజ్ఞక- మగును, స్వాది విధి ప్రకృత్యాదియగు అవయవ సుబంత మును పదమగునని యర్థము.

ఇట్లే, "యచిభమ్" (1-4-18) అను సూత్రమునకు గూడ యజాది ప్రత్యయము పరమగునపుడు పూర్వము భసంజ్ఞకమగుననియు, అది దేనికి పర ముగా విధింపబడినదో అది యాదిగాగల సుబంతమును, భసంజ్ఞ కలది యగు నని యర్థము.

కావున 'పరమవాచా' అనుచోట 'వాచ్' అనుదానికి గూడ భసంజ్ఞ కలుగును గాన పదత్వము లేనందున- కుత్వ ప్రసంగములేదు అని తాత్పర్యము. కాని యిట నొక యాక్షేపము కలుగును. ఈ కల్పమున, "పరమవాక్" అను ప్రథమైకవచనాంతమునందు, పదసంజ్ఞకు, 'స్వాదిషు' అను సూత్రము నందలి 'అసర్వనామ స్థానే' అను ప్రతిషేధము కలుగవలసి వచ్చునే? సర్వనామ స్థానము పరమగునపుడు స్వాది ప్రకృత్యాది సుబంతము గూడ పద సంజ్ఞకము కాదు అని దాని యర్థము. కాన ప్రత్యయ లక్షణముచే సర్వనామ స్థానము పరమగుటం జేసి పదత్వ ప్రతిషేధము వలన కుత్వము ప్రాప్తింపక పోవును. ఇది యాక్షేపము.

సమాధానము— స్వాదిప్రత్యయము పరమగునపుడు పూర్వము పద సంజ్ఞకమగునని విహితమగు పదసంజ్ఞకు, 'అసర్వనామస్థానే' అను ప్రతిషేధము రానిమ్ము. సుబంతము పదమగుననియు విహితమగు పదసంజ్ఞ రావచ్చును. 'ప్రత్యయమున్నపుడు ఈ సంజ్ఞచే కుత్వము వచ్చును, దీనిచే రాదు' అనుట యెట్లు సంభవించెను. అవధి భేదము వలన సంజ్ఞలకును భేదము సుప్రత్యయ మున్నపుడు తదంతమునకు 'సుబంత పదమ్' అను పదసంజ్ఞ. దాని ప్రాగ్భగ మునకు 'స్వాదిషు' అను సంజ్ఞ.

కావున, 'స్వాదిషు' అను పదసంజ్ఞకు 'అసర్వనామస్థానే' అను ప్రతి

షేధము ప్రాప్తించినను, 'సుప్తిఙంతంపదమ్' అను పదసంజ్ఞ రావచ్చునని సమాధాన భావము.

మరల నాక్షేపము— ప్రత్యయ లోపానంతరము, 'స్వాదిషు' అను పద సంజ్ఞ ఏ భాగమునకు ప్రాప్తించుచున్నదో ఆ భాగమునందే 'సుబంతం పదమ్' అను సంజ్ఞయు ప్రాప్తించుచున్నది. అట ప్రత్యయ లక్షణమువలన సర్వ నామ స్థానము పరమగుట సపంభవము. 'సర్వనామ స్థానే పరే న'=సర్వనామ స్థానము పరమగునపుడు పదసంజ్ఞ రాదు' అనునది నిషేధము విధ్యనాన్మిలన రూపములగు నిషేధములు, అపవాదల వంటివగుటచే బలీయములు. "ప్రతి షేధాశ్చ బలీయాంసో భవంతి" కాగా ప్రతిషేధమే ప్రాప్తించునని యాక్షే పము.

దీనికి సమాధాన వార్తికము— వా॥ "నా ప్రతిషేధాత్" అనునది. 'అసర్వనామ స్థానే' అనుచో నఞర్థము ప్రతిషేధముకాదు. సర్వనామ స్థానము పరమగునపుడు పదసంజ్ఞ రాదని యర్థముకాదు. మరి యేమి? పర్యుదాసము నఞర్థము. అనగా సర్వనామ స్థాన భిన్నమయినది పరమగునపుడని యర్థము. సర్వనామ స్థాన పరతలో రానేరాదనునది లేదు గాన, నేదియేని సూత్రాంత రముచే ప్రాప్తమయినది రావచ్చును. పూర్వ సూత్రమగు సుప్తిఙంతం పద మనుదానిచే ప్రాప్తిగలదు అని భావము.

వా॥ అప్రాప్తేర్వా" అని సమాధానాంతరము.

వా=లేదా. అప్రాప్తేః=సుప్తిఙంతమను పదసంజ్ఞకు ప్రతిషేధము ప్రాప్తింపనందున— దోషములేదని శేషము.

"అనంతరస్య విధిర్వాభవతి ప్రతిషేధో వా"= విధి ప్రతిషేధము అవ్యవహిత పూర్వమునకే ప్రవర్తించును. కావున అనంతర ప్రాప్తియగు 'స్వాదిషు' అను ప్రాప్తియే, 'అసర్వనామస్థానే' అను ప్రతిషేధమునకు విషయము. పూర్వ ప్రాప్తి ప్రతిషేధింపబడలేదు. కాన నా ప్రాప్తిచే పదసంజ్ఞ రానగును.

అది యెట్లు? "స్వాదిషు" అను ప్రాప్తి "సుప్తిఙంతమ్" అను ప్రాప్తిని బాధించి వేసినదిగదా యనవచ్చును గాని తానే ప్రతిషిద్ధమగుటచేత నది పూర్వ ప్రాప్తిని బాధించుట కుత్సహింపదు.

అట్లైన, 'పరమవాచౌ' 'పరమవాచః' అను స్థలములందు, సుప్తిఙంత మను పదసంజ్ఞ ప్రాప్తించిన, కుత్వము రావలయును గదా?

అనిన, అట్లైన యోగ విభాగముచేత సకలప్రాప్తులును ప్రతిషేధింపబడును గాన దోషములేదు. అది యెట్లన,

'స్వాదిషు' — అని యొక సూత్రము. స్వాదులు పరములగు నపుడు పూర్వమునకు పదసంజ్ఞ ప్రవర్తించును అని దాని కర్థము. తరువాత —

"అసర్వనామ స్థానే యచి" అని రెండవ సూత్రము. ఇందు నఞ్ఞునకు క్రియాపదముతో సంబంధము. 'యజాది సర్వనామ స్థానము పరమగు నపుడు, పదసంజ్ఞ ప్రవర్తింపదు. హలాది పరమగునపుడు ప్రవర్తించును అని ఫలితమగును గాన 'సు' ప్రత్యయము పరమగునపుడును నది ప్రవర్తించును. యకారాద్యజాది సర్వనామ స్థానము పరమగునపుడు పదసంజ్ఞ నిషేధింపబడుట వలన, తద్భిన్నమగు సర్వనామ స్థానము పరమగునపుడది ప్రవర్తించునని సామర్థ్యమువలన లభ్యమగును.

తరువాత మూడవ సూత్రము 'భమ్' అనునది. దానికి యజాది అసర్వనామ స్థానము పరమగునపుడు పూర్వము 'భ' అను సంజ్ఞ కలది యగును అని యర్థము. యోగ విభాగ సామర్థ్యము వలన అనంతరస్య అను న్యాయము బాధితమై, సకల ప్రాప్తులకును నిషేధము సిద్ధించును.

ఇందు, ప్రథమ సూత్రముచే 'సు' అను ప్రత్యయము పరమగునపుడును పూర్వము పదసంజ్ఞ కలదియగునని ఫలితమగునది. కాని అపుడొక దోషము ప్రాప్తించుచున్నది. "ఏచో ప్రగృహ్యస్యా దూరాద్ధూతే పూర్వస్యార్ధస్యాదుత్తరస్యేదుతౌ" (8-2-107) అను సూత్రము చేత, ప్రగృహ్యము కాని ఏచ్చునకు దూరాహ్వానము కానపుడు, ప్లుతము ప్రవర్తించిన సందర్భములో ఆ ఏచ్చు మొదటి సగమునకు ప్లుతాకారమును, రెండవ సగమునకు ఇకార ఉకారములును, విధింపబడినవి.

"ఆయుష్మానేధి అగ్నిభూతఽఇ" అని యుదాహరణము.

'అగ్నిభూతే' అను పదమునందు ఏచ్చగు నేకారమునకు, పూర్వార్ధమున ప్లుత సహితాకారమును, ఉత్తరార్థమున ఇకారమును వచ్చినవి. "భద్రంకరోషి గౌః" అను స్థలమునందు ఔకారమునకీ కార్యము ప్రవర్తించుట సమ్మతము కాదు. అందులకీ సూత్రము నందు, "పదాంత ఇతి వక్తవ్యమ్" అను వచనముచేత, పదాంతముననే ఇది ప్రవర్తించునని ఆ ప్రకరణమున చెప్పబడును. ప్రకృతమున,

సుప్రత్యయము పరమగు నపుడును పూర్వము పదముగుక యెడల నా సూత్రమున, పదాంత గ్రహణము చేయబడినను, గౌః అను చోట ప్లుత వికారము=ప్లుత సహిత వికారము=పూర్వార్థమున నాకారమును, నుత్తరార్థ మున ఉకారమును అపరిహారణీయములు గదా ?

అనిన, అయ్యది వాక్య పదముల యంత్యమునందే ప్రవర్తించును గాన దోషము లేదని సమాధానము. ఔకార మిచట వాక్యాంతము గాదు.

అట్లైనను, నపుడు 'దధిసేచౌ' దధిసేచః'— అను చోట నీ యోగ విభాగ పక్షమున, "సాత్పదాద్యోః" (8-3-112) అని పదాదిలక్షణమగు షత్వ ప్రతిషేధము సిద్ధింపకపోవునే ? కుత్వము లేకుండుటకు పదత్వ నిషేధ మావశ్య కము. అది నిషేధింపబడిన, షత్వ నిషేధము ప్రాప్తింపదాయె. వార్తికారంభ పక్షముననైన, "అపదాది విధౌ" అనుట వలన దోషము లేదని భావము—

పదాది యనగా పదమునకాది. అట్టి దానికి షత్వము రాదని యర్థము కానే కాదు. మరి యేమి? పదాత్ ఆదిః=పదాదిః అని పంచమీ తత్పు రుషము వివక్షితము. పదము కంటె బరమయిన ఆది సకారమున కని యర్థము. అపుడు "సేచ్" అనునది పదము కాకున్నను, 'దధి' అనునది పదమే గనుక దోషములేదు.

అట్లు పంచమీ తత్పురుషాశ్రయణము శక్యము గాదు అలయన, అపుడు, 'ఋతుసు' 'వాక్షు' 'త్వక్షు' 'కుమారీషు' 'కిశోరీషు' — అను చోట్ల గూడు పదము కంటె బరమయిన ఆది సకారము సుప్ప్రత్యయ సకారమయి నందున ఆ నిషేధము ప్రసక్త మయ్యెడిది.

'పదము కంటె బరమయిన' అనునపుడు పదమనగా స్వాదిష్వితి సూత్రముచే పదసంజ్ఞ కలదిగాదు. సుప్తిఙంతమను పదమే గ్రహింపబడును. దధి అనునది యట్టిది. 'ఋచ్' 'వాచ్' మున్నగునవి 'స్వాదిషు' అను సూత్రము చేత పదములయినవి. అందులకు ప్రమాణమేమనిన ఆ సూత్రము నందలి 'సాతి' గ్రహణమే జ్ఞాపకమనుట.

'అగ్నిసాత్కరోతి' అనుచో సాతి ప్రత్యయ సకారమునకు షత్వ ప్రతి షేధము కొరకు 'సాత్' అని షత్వ నిషేధ సూత్రమున గ్రహింపబడినది. 'అగ్ని సాత్' అనుచో 'అగ్ని' అనునదియు 'స్వాదిషు' అను పదమే గాన, 'పదాత్పోః'

అనుటవలననే సిద్ధించుచుండగా సాత్రిగ్రహణము. 'స్వాదిషు' అని వేనికి పదసంజ్ఞ కలుగునో వాని కంటె బరమగు సకారమునకు ప్రతిషేధము కలుగదు అని జ్ఞాపనము చేయును

పదము కంటె బరమగు నాది సకారమునకు షత్వము రాదను పక్షము నందును 'బహుసేచౌ' 'బహుసేచః' అను చోట నిషేధము సిద్ధింపదు.

ఇట 'బహుచ్' అనునది ప్రత్యయముగాని పదము గాదు, అను నియాక్షేపము గలదు. దానికి సమాధానముగా నవతరించిన వార్తికము—

వా॥ "ఉత్తర పదత్వేచ పదాని విధౌ" అనునది. "ఉత్తర పదత్వేచా పదాదివిధౌ" అను వార్తిక న్యాసమును మార్చి, ఉత్తర పదత్వేచ పదాదివిధౌ అని పఠింపవచ్చును. ఉత్తర పదమునకు పదత్వము కర్తవ్యమయినపుడు, లుప్తుచ్ఛబ్దముచే లుప్తమయిన ప్రత్యయము నిమిత్తముగా గల కార్యము ప్రవర్తించునని యర్థము ప్రత్యయ లోప సూత్ర ప్రాప్తమగు ప్రత్యయ లక్షణమే మరల విధింపబడినట్లగును. కావున నది నియమార్థమయి, పదాది విధి కర్తవ్యమైనపుడే ప్రత్యయ లక్షణము ప్రవర్తించునని బోధించును. కాగా పదాంత స్థానికములగు, కుత్వ ఘుత్వ, ధత్వాదుల విషయమున ప్రవర్తింపదని ఫలితమగును దోషములేదని భావము.

సరి. కాని, ఈ నఙ్ రహిత వచన పాఠమునందైనను, 'బహుసేచౌ' 'బహుసేచః' అనునవెట్లు సిద్ధించును? ఇది సమాసముగాదు కాన 'సేచ్' అనునది ఉత్తరపదము కాదు. కనుక నీ నియమము ప్రవర్తింపదు. ప్రత్యయ లక్షణముచే పదత్వము వలన షత్వ నిషేధమువలె, కుత్వమును రావలసి వచ్చుచున్నది. పూర్వమయినది ప్రత్యయముగాని పదముగాదు అందువలన పంచమీ సమాస పక్షముననైనను షత్వాపత్తి తప్పదు అని యాక్షేపము. దీనికి సమాధాన వార్తికము, వా॥ బహుచ్ పూర్వస్యచ" అనునది. 'బహుచ్ ప్రత్యయము పూర్వమున గల దానికిగూడ, పదాది విధి కర్తవ్య మగునపుడేగాని పదాంత విధి విషయమున ప్రత్యయ లక్షణము ప్రవర్తింపదు' అని యర్థము. షత్వ నిషేధము పదాది విధి గాన ప్రత్యయ లక్షణముచే పదత్వము సిద్ధించును. "సాత్పదాద్యోః" (8-3-112) అను సూత్రమునకు దరువాత నీ వచనమును బఠించుట ఆద్యవార్తికారంభ పక్షమునను దత్ప్రత్యాఖ్యాన పక్షమునను నావశ్యకమని వార్తిక కృద్గూఢాశయము.

వా॥ "ద్వంద్వేంత్యస్య" అని వేరొక యాక్షేప వార్తికము.

వాక్ చ, స్రక్ చ, త్వక్ చ- ఆసాం సమాహారః=వాక్స్రక్త్వచమ్. ఇది బహుపద ద్వంద్వము. "ద్వంద్వాచ్చు దషహాంతాత్సమాహారే" (5-4-106) అని సమాసాంతమగు టచ్ ప్రత్యయము. ఇందు, ప్రథమ మధ్యమ పదముల చకారమునకు కుత్వము ప్రవర్తించినది. అంత్య పదమున కుత్వము రాలేదు. 'ఉత్తర పదత్వే చాపదాది విధౌ' అను వార్తికముచే ప్రత్యయ లక్షణ ప్రతిషేధము సిద్ధించును గాన నీ వార్తికము, 'ద్వంద్వ సమాసమునందు అంత్య పదమునకు కార్యము కర్తవ్యమగునపుడు మాత్రమే ప్రత్యయ లక్షణము ప్రవర్తింపదు' అను నియమమును బోధించును.

మధ్యమ పదముగూడ, పూర్వ పదమున కుత్తరపదమే యగును గాన ప్రత్యయ లక్షణ ప్రతిషేధము వచ్చినయెడల, త్వక్పదమునను, కుత్వము ప్రవర్తింపకపోవును. అందులకీ నియమమనుట. ప్రకృత వార్తికమే ఉత్తర పద శబ్దము సమాస చరమావయవమను రూఢ్యర్థమునే బోధించునుగాని యోగార్థ బోధకము గాదనుటకీ 'ద్వంద్వేంత్యస్య' అను వచన మన్వాఖ్యాపకము. ప్రత్యాఖ్యాన పక్షమునందును, మధ్యమము స్వాదిపరముగాదు గాన దోషము లేదు.

'అభూవన్' అను రూపము. భూధాతువు లుఙ్ ప్రథమ బహువచనాంతము. ఇట చ్లి ప్రత్యయాదేశమగు సిచ్చునకు, "గాతిస్థాఘుపా భూభ్యః సిచః పరస్మైపదేషు" (2-4-77) అను సూత్రముచే లుక్కు ప్రత్యయ లక్షణముచేత 'అభూ' అనునది సిజంతమగును గాన, దానికంటె బరమగు 'ఝి' ప్రత్యయమునకు "సిజభ్యస్త విదిభ్యశ్చ" (3-4-109) అను సూత్రముచేత 'జుస్' అను నాదేశము ప్రాప్తించుచున్నది. ఈ జుసాభావ మంగ స్థానికమునుగాదు అంగాధికారీయమును గాదు. కావున 'నలుమతాఙ్గస్య' ప్రత్యయ లక్షణ ప్రతిషేధము ప్రాప్తింపదు.

అను నీ యాక్షేపమునకు సమాధాన వార్తికము- **"సిచిజుసోఽప్రసంగ ఆకార ప్రకరణాత్"** అనునది.

సిచి=సిజి విషయమున, జుసః=తన్నిమిత్తకమగు జుసాదేశమునకు, అప్రసంగః=ప్రత్యయ లక్షణముచే ప్రసంగము కలుగదు. ఎందువలననగా- ఆకార ప్రకరణాత్=ఆకారస్య='ఆతః' అను సూత్రముయొక్క ప్రకరణాత్=ప్రస్తావమువలన, ఆ సూత్రము నారంభించుటవలన, "ఆతః" (3-4-110) అను సూత్రము 'సిజ్లుగంతముకంటె బరమయిన ఝి ప్రత్యయమునకు జుసాదేశము ప్రసక్తమయినపుడు, అది ఆకారాంతముకంటె బరమైనపుడే జుసాదేశము వచ్చును' అని నియమమును బోధించుచున్నది. దానికి విశిష్టమగు సంఖ

విలపదు గాన నది నియమార్థమే యగును. ప్రకృతమున 'భూ' అనునది ఆదంతముకాదు గాన దోషములేదు అని సమాధానము.

'ఇతి యుష్మకుప్పుత్రో దదాతి' 'ఇత్యస్మత్పుత్రో దదాతి' అను స్థలమున సామాసిక లుక్కునకు ప్రత్యయ లక్షణముచేత, సూ॥ "యుష్మదస్మదోః షష్ఠీ చతుర్థీ ద్వితీయాస్థయోః వాం నావౌ" (8-1-20) అను ప్రకరణమున విధింప బడిన, 'వామ్' 'నౌ'- మున్నగు వాదేశములు ప్రాప్తించుచున్నవి అని యాక్షేపము. దానికి సమాధాన వార్తికము,

**వా॥ "యుష్మదస్మదోః స్థ గ్రహణాత్"** అనునది. ఆ సూత్రమునందు, 'స్థ' అను పదము గ్రహింపబడినది షష్ఠీ చతుర్థీ ద్వితీయలయందున్న యుష్మ దస్మచ్ఛబ్దములకని యర్థము. వానియందుండుట, అవి శ్రూయమాణములగు నపుడే సంభవించునది. లుప్తములయినవానికి ఆధారత్వము సంభవింపదు. 'స్థ' అనునది, 'శ్రూయమాణములగు' అను నర్థముకలదై విభక్తులకు విశేష ణముగా గ్రహింపబడును గాన నవి లుప్తములయినపుడు, ఆయాదేశములకు ప్రసంగములేదు అని భావము.

స్థ గ్రహణమునకు వేరొక ప్రయోజనము కలదే? అది శ్రూయ మాణార్థకమై విభక్తి విశేషణ మెట్లగును? ఆ ప్రయోజనమేమి? అనిన, విభక్తి విశిష్టములగు యుష్మదస్మద్ శబ్దములకు, వాం నావాదులు వచ్చుట.

'షష్ఠీ చతుర్థీ ద్వితీయాసు' అనినచో నవి పరములయినపుడని యర్థము కావచ్చును. తత్సహితముల కను నర్థము సిద్ధింపదు. వాని యందుండుట యనగా వానిని వదలకుండుట. తపస్సున నున్న వాడనిన, తపమును వదలి పెట్టని వాడు అని గదా యర్థము. "సమయే తిష్ఠ సుగ్రీవ" అని రామాయణము. సుగ్రీవుడా! ప్రతిజ్ఞను = అన్న మాటను విడచి పెట్టకు మని యర్థము. కాగా నీ ప్రయోజనమునకై 'స్థ' గ్రహణ మావశ్యకము గాన, 'నవి లుప్తము లగునవుడు రావు' అను నర్థము సిద్ధింపదు. అనిన,

స్థగ్రహణమున కది ప్రయోజనము గాదు. ఆ సూత్రములోనికి "పదస్య" (8-1-16) అనునది అధికార ప్రాప్తము. పదమనగా విభక్త్యంతము గదా? కనుక స్థ గ్రహణము లేకున్నను సవిభక్తికములకే ఆదేశము లభించును. కాని ఈ సమాధానమునకు బాధకము గలదు. విభక్త్యంతము పదమయినపుడు,

ఆ విధముగ సిద్ధింపవచ్చునను కొనుడు. విభక్తి పరమగునపుడు పూర్వము కొన్ని చోట్ల పదమగును గదా? అట్టి స్థలము ఇందు కుదురదు. 'గ్రామో వాం దీయతే' జనపదో వాం దీయతే' అను చోట జూడుడు. గ్రామము మీ ఉభయుల కొరకు నీయబడుచున్నది. అట్లే జనపదము= దేశము. గ్రామో నౌ దీయతే = మా యిద్దరికై జనపదో నౌ దీయతే = మా ఇద్దరి కొరకు. ఇట యుష్మద్ + భ్యామ్. అస్మద్ + భ్యామ్ అను నవస్థలో భ్యామ్ పరమగునపుడు యుష్మ దస్మదులు ప్రకృతులే పదములు గాన వానికే ఆదేశములు రావలసి వచ్చును. యుష్మ దస్మద్రూపములగు పదముల కనియే ముఖ్యార్థము. తద్ఘటిత పదముల కని చెప్పుటకు బనిలేదు. అనిన,

"అనుదాత్తం సర్వమపాదాదౌ" (8-1-18) అను సూత్రము నుండి 'సర్వం' అను పదము గూడ ననువర్తించుచున్నది అది షష్ఠ్యంతముగా మార్పబడి 'పదస్య' అను దానికి విశేషణ మగుటచే సర్వ పదమునకును = అనగా విభక్తి సహితమున కాదేశములగునని యర్థము గాన దోషము లేదు.

'చతుష్కామం యాజయాంచకార' అను వాక్యములో, 'యాజయామ్' అనునది ప్రత్యయ లక్షణముచే తిఙంతమగుచున్నది. 'యాజి' అను ణ్యంతము కంటె లిట్టు లకారము. పరత్వము వలన తిబాదులు ప్రవర్తించిన తరువాత, "ఆమః" (2-4-81) అని తిఙ్కుకు లుక్కు.

దానికి బరమయిన, 'చకార' అను తిఙంతము,అతిఙంతమగు పదముకంటె బరమైనది గాన "తిఙ్ అతిఙః" (8-1-28) అని అనుదాత్తము రావలెను. కాని ప్రత్యయ లక్షణముచే నయ్యాది తిఙంతమగుటచే ప్రాప్తించుటలేదు. దాని కంటె బరమైన దానికి బ్రాప్తింపకపోగా, 'చతుష్కామం' అను తిఙంత భిన్నము కంటె బరమయిన తిఙంతమగు, 'యాజయామ్' అను దానికి బ్రాప్తించుచున్నది. ఈ స్వరమార్గము కానందున, 'నలుమతాజస్య' అను ప్రకృత నిషేధము ప్రాప్తింపదు, అని యాక్షేపము.

సమాధానవార్తికము- వా॥"ఆమిలి లోపా త్తస్యచానిఘాత స్తస్మాచ్చ నిఘాతః" అనునది. "ఆమః" (2-4-81) అను లుక్కు 'లి' అను దానికే. తి బాదులకుగాదు. అది వాని కపవాదము. కావున ప్రత్యయ లక్షణముచే తిఙంతత్వము రాదు. కావున ఆమంతమునకు నిఘాతము రాదు. దాని కంటె బరమైన 'చకార' అనుదానికే అది సిద్ధించును అని తాత్పర్యము.

## అఙ్గపద వాచ్యార్థ నిరూపణము

వా॥ "అఙ్గాధికార ఇటో విధి ప్రతిషేధౌ" అని ఆక్షేప వార్తికము.

ఈ సూత్రమునందలి 'అఙ్గస్య' అను పదము స్వరితాసంగమువలన, అంగాధికారపరము. అందువలన, లుమల్లుప్త ప్రత్యయ నిమిత్తకమగు అంగాధికార విహిత కార్యము ప్రవర్తింపదని దీనికర్థము. అపుడు, ఇడాగమ విధియు దత్ప్రతిషేధమును సిద్ధింపకపోవును అని వార్తికార్థము.

'జిగమిష' 'సం వివృత్స'- అని యుదాహరణములు. అందు మొదటి రూపమున, "అతో హేః" (6-4-105) అని పరస్మైపదమగు 'హి' అనుదానికి లుక్కు వచ్చినది. తన్నిమిత్తకమగు నిడాగమము సన్ప్రత్యయమునకు రావల యును. "గమేరిట్పరస్మైపదేషు"(7-2-58) అని ఇడాగమము.

'సం వివృత్స' అను సన్నంత ప్రకృతిక లోణ్మధ్యమ పురుషైకవచన రూపమున, సన్ప్రత్యయమున కిడాగమ ప్రతిషేధము, సూ॥ "న వృద్భ్య శ్చతుర్భ్యః"(7-2-86)అను సూత్రముచే రావలయును. ఇవి రెండును ప్రాప్తిం చుటలేదు. ఇయ్యవి అంగాధికార విహిత కార్యములయినను, అంగమునకు వచ్చునవికావు. అయినను అంగాధికార విహితములు గాన ప్రత్యయ లక్షణము ప్రవర్తింపనిచో నీ కార్యములు సిద్ధింపకుండును.

వా॥ "క్రమేర్దీర్ఘత్వంచ" అనునదియు నాక్షేపాంతర వార్తికము.

"ఉత్క్రామ" "సంక్రామ"- అను స్థలమున "క్రమః పరస్మైపదేషు" (7-3-76) అను సూత్రముచే ధాత్వవయవాకారమునకు పరస్మైపద పరక మగు శిత్తు పరమగునపుడు దీర్ఘము రావలెను. అది ప్రత్యయ లక్షణ సాధ్యము, 'నలుమతా' అను నిషేధము ప్రవర్తించిన నది సిద్ధింపదు.

వార్తికమునందు చ శబ్దము దీర్ఘత్వమను కార్యమునకు సమీపమున బఠింపబడినను, తత్సముచ్చేయమయిన కార్యాంతర మేదియులేదు. కావున దాని స్థానమును మార్చి 'క్రమేశ్చ దీర్ఘత్వమ్' అని యన్వయమును గల్పించి, 'జిగమిష' 'సంవివృత్స' అనుచో 'గము' 'వృతు' ధాతువులందు, ఇడాగమము నకు విధి ప్రతిషేధములును, 'ఉత్క్రామ' అనుచో 'క్రముధాతువునకు దీర్ఘత్వ మును సిద్ధింపవు' అని అర్థమును గ్రహింపవలెను.

కావున, 'అంగస్య' అనునది అంగాధికార పరమైన, ఇడాగమమునకు విధి ప్రతిషేధముల విషయమునను, క్రముధాతువునకు దీర్ఘత్వము విషయము

నను, ప్రత్యయ లక్షణ ప్రతిషేధమున కతివ్యాప్తియు, ఞ్నితిత్స్వరముల విష యమున నవ్యాప్తియు కలుగుటచేత నంగాధికార పరత్వము యుక్తముగాదు. లుమల్లోపము వచ్చినపుడు, ప్రత్యయ లక్షణముచే, అంగాధికార విహితములగు ఇడ్విధి ప్రతిషేధములును, క్రము దీర్ఘత్వమును నను కొన్ని కార్యములు ప్రవ ర్తించుచున్నవి గలవు. అంగాధికార బహిర్భూతములయిన ఞ్నితిత్స్వరములు ప్రవర్తించుటలేదు. అంగాధికార పరత్వమున నివి దోషములు.

**వా॥ "నలుమతాతస్మిన్"** అని న్యాసాంతర వార్తికము.

"నలుమతాంగస్య" అను సూత్రమును మార్చి, "నలుమతాతస్మిన్" అని పఠించినచో నేమగును ? అని విచారము. అపుడు, 'లుమచ్ఛబ్దముచే లోపిం చిన ప్రత్యయము పరమగునపుడు తన్నిమిత్తకముగ తత్ప్రకృతికి వచ్చెడి కార్యము అంగమైనను అంగము కాకున్నను, ప్రవర్తింపదు' అని యర్థమగును. అట్టి ప్రత్యయము పరమగునపుడు, ప్రకృతికి ప్రవర్తించు కార్యమనుటవలన 'అత్రయః' అనుచోట కిత్స్వరాపత్తి కలుగదు, అట స్వరము ప్రత్యయమునకు కాని ప్రకృతికిగాదు. ప్రత్యయము లేదాయె. లేనిదానికి కార్యిత్వముగాని, సత్తగాని వచన శతముచేతనైనను ప్రతిపాద్యముకాదు.

సరి. "నలుమతాతస్మిన్" అని పఠించునపుడు, ఇడాగమమునకు విధి ప్రతిషేధములును, క్రముధాతువునకు దీర్ఘత్వమును సిద్ధించునా ? అనిన, ఆహా, చక్కగ సిద్ధించును. ఇడాగమ విధి ప్రతిషేధములకు పరస్మైపదముగాదు నిమిత్తము. మరి యేమందురా? సకారాది నిమిత్తము. అందు, 'సేసిచి' అను సూత్రమునుండి 'సే' అనునది అనువర్తించును. 'పరస్మైపదేషు' అనునది ఆ 'సే' అనుదానికి విశేషణము. క్రముధాతువు దీర్ఘమునకు గూడ పరస్మై పదము నిమిత్తముగాదు. మరి యేమందురా ? 'శితి' అనునది. "ష్ఠివుక్లముచ మాంశితి" (7-3-75) అను సూత్రమునుండి అది యనువర్తించును. ఆ 'శితి' అనుదానికి 'పరస్మైపదేషు' అనునది విశేషణము. పరస్మైపదము పరముగా గల సార్వధాతుకమునకు అంగత్వ నిమిత్తమైనదానికి ఇడాగమము ప్రవ ర్తించునని అర్థము. కాగా నది లుప్త ప్రకృతి నిమిత్తకమగు తత్ప్రకృతి కార్యము కాదు. 'పరస్మైపదేషు' అనుదాని శక్తి విశేషణ భావమునందే యుపక్షీణమగుటవలన నిక నది కార్యమునకు నిమిత్తము కాజాలదని భావము. కావున నాన్యాసము కార్యసాధనమే.

కాని, ఆ న్యాసపక్షమునందు, 'అవధి' 'అగాయి' మున్నగు లక్ష్యము లందు, 'తలోపానంతరము, 'హన్', 'ఇఙ్' 'ఇణ్' మున్నగు ధాతువులకు విహితములయిన ఆదేశములు సిద్ధింపవు' అని వార్తికకారుడు-

వా॥ "నలుమతా తస్మిన్నితిచేత్ హనిణిజాదే శాస్త్రలోపే" అను వార్త్తికముచే నాక్షేపించుచున్నాడు. 'అవధి భవతాదస్యుః' 'అగాయి భవతాగ్రామః' 'అధ్యగాయి భవతా అనువాకః' అను నీ వాక్యములలలో, 'అవధి' 'అగాయి' 'అధ్యగాయి' అనునవి చిణంతరూపములు.

"చిణోలుక్" (6-4-104) అని చిణ్ప్రత్యయమునకు బరమయిన తశబ్దమునకు లుక్కునుజేసిన తరువాత, హనధాత్వాదేశమగు వధాదేశము "హనోవధలిఙి" (2-4-42), "లుఙిచ" (2-4-43) అను సూత్రములచే ప్రాప్తమయినది. ప్రత్యయ లక్షణ ప్రతిషేధము వలన సిద్ధింపదు. 'అగాయి' అనుచో "ఇణోగాలుఙి" (2-4-45) అని 'గా' ఆదేశమును, 'అధ్యగాయి' అను చోట "విభాషా లుఙ్ లృఙో" (2-4-50) అని గాఙా దేశమును సిద్ధింపక పోవును.

ఇది దోషము కాదని సమాధానము. పై ధాత్వాదేశములకు లుఙ్లు కాదు నిమిత్తము. ఆర్ధధాతుకము నిమిత్తము. లుఙి అనునది 'ఆర్ధధాతుకే' అనుదానికి విశేషణము. కాగా లుఙ్లు పరముగా గల చిణ్లు నిమిత్తమనుట దాని వలన, కార్యము లుప్త ప్రత్యయ నిమిత్తకము గాదని స్పష్టము.

మరియు నీ న్యాసము నందు, 'సర్వస్తోమః' 'సర్వ పృష్ఠః' అను స్థలములలో సర్వస్య సుపి అను నాద్యుదాత్తత్వము ప్రాప్తించుట లేదు.

పైగా, 'నలుమతాతస్మిన్' అని అపూర్వ వచనము కర్తవ్యమగుచున్నది. అది గౌరవగ్రస్తము. అనిన,

అపూర్వవచన మక్కరలేదు. "నలుమతాఙ్గస్య" అను యథాశ్రుత న్యాసముచేతనే ఇష్టసిద్ధికలుగును. ఎట్లనిన,—

లుమచ్ఛబ్దముచే ప్రత్యయమునకు లోపము వచ్చినపుడు, అంగాధికార విహిత కార్యము ప్రవర్తింపదు, అని యిట్లు అంగాధి కారము ప్రతి నిర్దేశింపబడదు 'అఙ్గస్య' అను పదమున స్వరి తత్వము ప్రతిజ్ఞాతము కాదు.

కాగా 'లుమచ్ఛబ్దముచే లోపించిన ప్రత్యయము పరమగునపుడు, దాని యంగమునకు ప్రాప్తమగు ప్రత్యయాశ్రయ కార్యము అది అంగము కానిండు కాక పోనిండు, ప్రవర్తింపదు' అని యర్థము.

'ఉత్క్రామ' అను స్థలమున, పరస్మైపద నిమిత్త కాఙ్గమునకు గార్యము కాదు గాన దోషము లేదు. 'జిగమష' అనుచోట సన్ప్రత్యయము నకు గార్యము ప్రకృతికి గాదు. 'అగాయి' మున్నగు స్థలము లందును, లుఙ్నిమిత్త కాంగత్వము గల చిణంతమునకు, కార్యము గాదు. కావుననే దోషమును లేదు.

అంగాధికార ప్రతి నిర్దేశము లేకున్నను, 'సర్వస్తోమః' అత్యాదులందు సర్వ స్వరము, "సర్వస్యసుపి" (6-1-191) అని విహితమగు నాద్యు దాత్తము, సిద్ధింపదే ? అది లుప్త ప్రత్యయ నిమిత్తకాంగ 'సంజ్ఞావ దుద్దేశ్యక కార్యమే గదా ? అనిన, 'అందులకై యత్నము కర్తవ్యము' అని సమాధానము.

ఆ యత్నమేమనగా, 'సౌవర్యాః సప్తమ్యా స్తదంత సప్తమ్యః' అని వచించు టయే. కాగా సుబంతస్య సర్వశబ్ద స్యాద్యదిరుదాత్తః అని యర్థము. స్వర విధు లందలి సప్తములన్నియు తదంత సప్తములే అని వచనార్థము.

॥నలుమతాఙ్గస్య॥

## ॥అలోంత్యాత్పూర్వ ఉపధా॥ (1-1-64)

'అలః'— అను పద మిందు ప్రథమా బహువచనాంతమా ? లేక పంచమ్యేకవచనాంతమా ? అని సందేహము. ప్రథమా బహువచనాంత మయిన,

అంత్యమైన దాని కంటె, పూర్వములైన అల్లులు ఉపధా సంజ్ఞ కలవి' అని యర్థము.

అది పంచమ్యేకవచనాంతమయిన, 'అంత్యాత్' అను పదమునకు విశేషణమై, అల్రూపమగు నంత్యము కంటె పూర్వమైనది 'ఉపధ' అని యర్థమగును.

అది ప్రథమాంతమగుచో, సందేహము కలుగ కుండుటకై 'అల్' అని ఏకవచనమే ప్రయుక్త మయ్యెడిది. కావున నది పంచమ్యంతమే యనుట యుక్తము.

వా॥ "ఉపధా సంజ్ఞాయా మల్గ్రహణమంత్య నిర్దేశశ్చేత్సంఘాత ప్రతిషేధః" అని యాక్షేప వార్తికము. ఈ సూత్రమున 'అలః' అనునది

అంత్యనిర్దేశమయిన యెడల, అనగా అంత్యమునకు ప్రత్యాయకమగుచో, అంత్యాల్లునకు బూర్వమగు అల్సముదాయమున కుపధాసంజ్ఞ ప్రాప్తించును. దానిని ప్రతిషేధింపవలసి యుండును. నిర్దేశ మనగా నిర్దేశక మనుట.

అయిన నేమి దోషమందురా ?

"శాస ఇదఙ్ హలోః" (6-4-34) అను సూత్రముచే విధింపబడిన ఇత్వము 'శా' అను శకారాకార సముదాయమునకు రావలసి యుండును.

'శిష్టః' 'శిష్టవాన్' అను రూపములలో ఆకారమునకే ఇత్వము ప్రవర్తించినది. అదియే సమ్మతము. అది సిద్ధింపకపోవును.

పోనిమ్ము. 'అలంత్యాత్పూర్వ ఉపధా' అని పఠించిననేమగును ?

ఆ పాఠము నందైనను, అంత్యమల్లు కావలెనను మాట లేదు గాన. అల్సంఘాత రూపమగు నంత్యము కంటె బూర్వమైన దానికా సంజ్ఞ రావలసి యుండును.

అపుడు, 'శిష్టః' 'శిష్టవాన్' మున్నగు స్థలములందే శకార స్థానమున నిత్వము ప్రసక్తమగును. మాత్రమును భేదించును.

అయిన, యథాన్యాసముగనే యుండనిండు.

'ఉపధా సంజ్ఞా సూత్రములో అల్సదమంత్యా నిర్దేశకమయిన సంఘాతమున కుపధాసంజ్ఞా ప్రతిషేధము చెప్పవలసియుండును అని దోష మాపాదింపబడినది గదా యనిన నందులకు సమాధానముగా నవతరించిన వార్తికము, వా॥ "అంత్య విజ్ఞానాత్సిద్ధమ్" అనునది.

శాసు ధాతువునందు 'శా' అను సంఘాతమున కుపధా సంజ్ఞ ప్రాప్తించినను, "శాస ఇదఙ్ హలోః" (6-4-34) అను సూత్రము నందనువర్తించిన 'ఉపధాయాః' అనునస్థాన షష్ఠీ నిర్దేశము గాన, "అలోంత్యస్య" (1-1-52) అని తరస్త్యమున కిత్వము ప్రవర్తింపవచ్చును గాన దోషములేదని ప్రకృత వార్తిక తాత్పర్యము. స్థానషష్ఠీ నిర్దిష్టమైన దాని యంత్యాల్లునకు విధులు ప్రవర్తించునని గదా ఆ సూత్రమున కర్థము.

అంత్య విజ్ఞానాత్ = అలోంత్య సూత్రము ప్రవర్తించుట వలన =

'ఉపధాయాః' అను షష్ఠి, అంత్యాల్లు నందుపసంహృతమగుట వలన, 'సిద్ధమ్'=సంఘాతమున కిత్వ హారణము సిద్ధము' అని యర్థము. దీనికి బాధక వార్తికము,

**వా॥ "అంత్య విజ్ఞానాత్సిద్ధమితిచేన్న, నానర్థకేలోన్త్య విధి రనభ్యాసవికారే"** అనునది.

అలోంత్య పరిభాష చేత నంత్యమునకే ప్రవర్తించుననుట కుదురదు. అనర్థకములందు అలోంత్య విధి ప్రవర్తింపదు గదా! 'నా నర్థకేలోంత్య విధిః' అను పరిభాష అవశ్యకర్తవ్యము.

విశేష వివక్షలేకుండగ సకలానర్థకములందును నలోంత్యవిధి ప్రవర్తింపదందురా? కాదు. 'అనభ్యాసవికారే' = అభ్యాస వికారములు తప్ప. సకలానర్ధకము లందును బ్రవర్తింపదని కాదు. అభ్యాసాతి రిక్తానర్థకములందు ప్రాప్తించు వికారముల విషయమున నలోంత్య పరిభాష ప్రవర్తింపదని దాని యర్థము.

ఇటు 'శా' అనునది అనర్థకము.

"భృ ఞామిత్" (7-4-76), "అర్తిపిపర్త్యోశ్చ" (7-4-77), మున్నగునవి అభ్యాస వికార విధులు. అభ్యాస మనర్థకము. ద్విత్వ నిష్పన్నము లందుత్తర ఖండము మాత్రమే అర్థవంతము. శబ్దమాత్రమునకే అవృత్తి గాని యర్థమున కది లేదు. ఆ సూత్రములచే విధింపబడిన ఇత్వము అభ్యాసాంత్యమునకు బ్రవర్తిలపవలెను. అందులకై 'అనభ్యాస వికారే' అను విశేష మందు జేర్పబడినది.

"నా నర్థకేలోంత్య విధి రనభ్యాస వికారే" అను నీ పరిభాష కేమి ప్రయోజనములు ?

1. "అవ్యక్తానుకరణస్యాత ఇతౌ" (6-1-98)
2. "ఘ్వసో రేద్ధావభ్యాసలోపశ్చ" (6-4-119)
3. "ఆపిలోపోకోనచి" (7-2-113)
4. "అత్రలోపోభ్యాసస్య" (7-4-58)

అను నీ నాలుగు వార్తికముల చేత నా ప్రయోజనములు సిద్ధే శింపబడినవి.

(1) "అవ్యక్తానుకరణస్యాత ఇతౌ" అను సూత్రము, ధ్వన్యనుకరణ మగు దాని అత్ అను శబ్దమునకు, ఇతి శబ్దము పరమగునపుడు, పరరూపమును విధించుచున్నది. ఆ పరరూపము 'అత్' అను అకారతకార సముదాయమున కంతకును సమ్మతము. అలోంత్య విధి ఆట ప్రవర్తించినచో నది తకార మాత్రమునకే రావలసి వచ్చును. ప్రకృత పరిభాష అనర్థకమున నలోంత్య విధి ప్రవర్తింపదని బోధించుటవలన నా దోషము లేదు.

ఈ ప్రయోజనమును జ్ఞాపకము చేత సాధింపనగును గాన నిది దీనికి ప్రయోజనము కాదని సిద్ధాంతము - "నామ్రేడిత స్యాంత్యస్యతువా" (6-1-99) అను ననంతర సూత్ర మా పర రూపమును ఆమ్రేడితమునకు నిషేధించి, అంత్యవర్ణమునకు వికల్పముగ దానిని విధించినది. పూర్వ సూత్ర విహిత పరరూపము గూడ నంత్య వర్ణమునకే వచ్చిన యెడల నీ సూత్రమును, పాణిన్యాచార్యుడు "వామ్రేడితస్య" అనియే పఠించి యుండెడి వాడు. కావున నంత్యమునకు పరరూపమురాదని జ్ఞాపిత మగుచుండుట చేత నీ పరిభాష కిది ప్రయోజనము గాదు.

(2) "ఘ్వసోరేద్ధావభ్యాసలోపశ్చ" అను సూత్రముచే హిప్రత్యయము పరమగునపుడు, ఘుసంజ్ఞక ధాతువులకును, అసధాతువునకును, ఏత్వమును, ఘుసంజ్ఞకములలో అభ్యాస లోపమును విధింపబడినది. 'దేహి' ధేహి మున్నగునవి లక్ష్యములు. ఆలోపము అభ్యాసాంతమునకు గాక సర్వలోపముగా ప్రవర్తించుట సమ్మతము. ప్రకృత పరిభాష అనర్థకమున నలోంత్య పరిభాషను నిషేధించుచున్నది గాన నాయాపత్తి లేదు.

ఇదియు దీనికి ప్రయోజనముగాదు. "లోపో యి" (6-4-118) అను సూత్రమునుండి లోప పద మనువర్తించుచున్నను మరల నీ సూత్రమున లోప పదమును గ్రహించుటకేమి ప్రయోజనమా యని విచారింప నిట్లు తెలియుచున్నది. 'ఘ్వసోరేద్ధావభ్యాసస్య' అని సూత్రమును రచించిన, వాని అభ్యాసకు కుమ్‌త్వము రావలసివచ్చును. 'ఘ్వసోరేద్ధావభ్యాసస్యచ' అని చకార ఘటితముగ దానిని రచింపవలెను. చకారముచే లోపః అనునది అనుకృష్టమగును. వ్యాఖ్యానము వలన నభ్యాసకు లోపమేవచ్చును. ఇత్వము రాదు. లేదా 'ఘ్వసోరేద్ధౌ' అని ఒక సూత్రమును, పిదప 'అభ్యాసస్య' అని సూత్రాంతర మును జేయబడును. ఇందు లోపపద మనువర్తించును. ఇట్లు నిర్వాహము కలుగుచున్నను మరల లోపపదమును గ్రహించుటవలన నది సర్వాపహారార్థ మగును. 'అనగా లోపమేగాని అవశేషమేమియు నుండదు' అని బోధించు ననుట. దానివలన అలోంత్య సూత్రము బాధింపబడును.

పరిభాషయందు 'అనభ్యాస వికారే' అను నిషేధమువలన నభ్యాస లోప విషయమున నలోంత్య విధి ప్రవర్తింపదని తలంపజనదు. వికారమువేరు. లోపమువేరు. వికారమనగా రూప విశిష్టమగు నాదేశము. లోపము నీ రూపము. వికారముగాదు. అందువలననే లోపాగమ వర్ణ వికారములు వేరువేరుగా నచ్చటచ్చట గ్రహింపబడుచుండును.

లేదా, ఈ 'అభ్యాస లోపశ్చ' అనుచో లోపము శిత్తుగా జేయబడును. అపుడు 'శిత్తు సర్వాదేశమగును'='శిత్సర్వస్య' అను విధిచే సర్వాదేశత్వము సిద్ధించును.

అట్లైన నొక శకారమును సూత్రమునందు జేర్పవలసియుండునుగదా యనిన, నక్కరలేదు. 'లోపశ్శ్చ' అనునది ద్విశకారక నిర్దేశము. లోప అను నది సంజ్ఞ. దానికర్థము సంజ్ఞి. కనుక నది ప్రాతిపదికము. కాగా విభక్తి ప్రత్యయము చేరగా, 'లోపస్' అని యగును. 'శ్' అనునది భిన్న పదముగా దానిప్రక్కన జేర్పబడును. సకారమునకు శ్చుత్వము. 'లోపశ్ శ్'చ అని నిర్దేశము ఆ శకారమున కుపదేశముననే ఇత్సంజ్ఞ. కాగా 'లోపః' అనునది శిత్తు. ఇత్సంజ్ఞాకార్యము ప్రయోగమునందు సర్వాదేశత్వమనుట.

(3) "ఆపిలోపోఽనచి" అని తృతీయ ప్రయోజన వార్తికము. "అనాప్యకః" (7-2-112), "హలిలోపః" (7-2-113) అని రెండు సూత్రములు. 'ఇదమ్' అను శబ్దముయొక్క 'ఇద్' అను భాగమునకు, అకారాదియగు తృతీయాది విభక్తి పరమగునపుడు, 'అన్' అను నాదేశమును, మొదటి సూత్రమును, హలాది విభక్తి పరమగునపుడు లోపమును రెండవ సూత్రమును విధించుచున్నవి. అందు 'హలిలోపః' అనునది ప్రకృతమున నుదాహరణము. ఆ సూత్ర న్యాసము మార్చి వార్తికకారునిచే పఠింపబడినది. అంతియ. అందు 'అనచి' అనునది 'హలి' అనుదాని యర్థమును బోధించును. 'ఆపి' అకః అను నవి, పూర్వ సూత్రమునుండి యా పదముల యనువృత్తిని సూచించును. ఆ సూత్రము ప్రత్యాఖ్యాతమై దాని స్థానమున నిట్లీ వార్తికము పఠింపబడినదని భ్రమపడరాదు.

తృతీయాది హలాది విభక్తి పరమయినపుడు లోపము అంత్యమగు దకారము స్థానమున వచ్చినయెడల,'ఆభ్యామ్' మున్నగునవి సిద్ధింపవు. నానర్థక పరిభాష అటు నలోంత్య విధిని నిషేధించును గాన దోషములేదు అని భావము. కాని,

ఇదియు నా పరిభాషకు బ్రయోజనముగాదు. 'ఆభ్యామ్' అను రూపము సిద్ధించుట కుపాయ మంతరము గలదు.

'అనాప్యకః' అను సూత్రము తృతీయాది విభక్తులు పరమగునపుడు, అవి అజాదులైనను హలాదులైనను, 'అన్' అను నాదేశమునే విధించుచున్నది. 'హలిలోపః' అను సూత్రముచే, ఆ 'అన్' అనుదానికే లోపమును విధింతుము. ఆలోపము అంత్యమగు నకారమునకు వచ్చినను, తరువాత రెండకారములకును, పరరూపమును, పిదప "సుపిచ" (7-3-102) అని దీర్ఘమును రావచ్చును. రూపసిద్ధియగును.

అట్లైన, 'హలిలోపః' అను సూత్రములో 'అనః' అను షష్ఠ్యంత పదము నుచ్చరింపవలెననియా మీ అభిప్రాయమనిన,

అక్కరలేదు. ప్రకృత మనువర్తించును. ఎచ్చట ప్రకృతము? అనాప్యకః అను సూత్రమునవే. అందది ప్రథమాంతముగదా యనిన 'హలి' అను సప్తమ్యంతము, 'అన్' అను ప్రథమాంతమును, "తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య" (1-1-66) అను సూత్రముచే షష్ఠ్యంతముగా ప్రకల్పించును.

(4) "అత్రలోపోఽభ్యాసస్య" నాల్గవ ప్రయోజన వార్తికము.

ఈ అభ్యాస లోపముగూడ సర్వాదేశము కావలెను. అనగా, ప్రకృత పరిభాషచే అంత్యాదేశత్వము నిషేధింపబడవలెననుట.

ఇదియు నీ పరిభాషకు ప్రయోజనముగాదు. 'అత్ర' గ్రహణ సామర్థ్యమువలన నంత్యాదేశము సిద్ధించును.

"సనిమీమాఘు రభ లభ శక పత పదామచ ఇస్" (7-4-54), "ఆప్ జ్ఞప్యృధామీత్" (7-4-55), "దమ్భ ఇచ్చ" (7-4-56), "ముచో కర్మకస్య గుణోవా" (7-4-57), "అత్రలోపోఽభ్యాసస్య" (7-4-58) అని యిట్లు, 'సనిమీమా' అని యారంభించి అయిదు సూత్రములు క్రమముగ బఠింపబడినవి. అందు మొదటి నాలుగు సూత్రములచే విధింపబడిన కార్యముల విషయమునందు అభ్యాసమలోపమును చివరి సూత్రము బోధించుచున్నది. 'మిత్సతి' 'మిత్సతే' ఇత్యాదు లుదాహరణములు. ఈ సూత్రములోనికి, 'మీ', 'మా' మున్నగు ధాతువుల కధికారమువలన ప్రాప్తి యుండుటచే, వాని విషయమున నభ్యాసలోపము ప్రవర్తించునని లభించుచున్నది. ఇట్లు లభించినను. 'అత్ర' అని అత్ర గ్రహణమువలన, అభ్యాసమున కంతకును లోపమగును. అంత్యాల్లునకు మాత్రము గాదని బోధింపబడుచున్నది. లేనిచో 'అత్ర' అనునది వ్యర్థముగదా.

దానికి ప్రయోజనాంతరము గలదు. వ్యర్థ మెట్లగును ?

ఆ ప్రయోజనమేమి ? సన్నధికార మపేక్షితము. సన్నధికారమునందే అభ్యాసలోపము, 'దధా దధా' అనుచో లిట్టులో రాదు. అందుకొరకు అత్ర గ్రహణ మావశ్యకము. అనిన,

'అత్ర' అనునది లేకున్నను సన్నధికారము నపేక్షింతుము. ఓహో! సకారాది సన్ప్రత్యయమునందని వివక్షితము. అది సిద్ధించుటకు, 'అత్ర' అనునది యావశ్యకమనిన, నది లేకున్నను, సకారాది సన్ప్రత్యయము పరమగు నపుడు ప్రవర్తించు కార్యముల విషయముననే అభ్యాసలోపమని తలంపవలదును. కావున 'జిజ్ఞాపయిషతి' అనుచో నభ్యాసలోపము రాదు. అట సన్ప్రత్యయమికారాది.

అట్లైన, 'మీ' 'మా' మున్నగువని సన్ప్రత్యయ ప్రకృతులయినపుడే అభ్యాసలోపము వచ్చునని ప్రకృతి విశేషాపేక్షాసిద్ధికై 'అత్ర' అనునది యావశ్యకము. 'పిపతిషతి' 'యియక్షతి' మున్నగు ప్రకృత్యంతముల సన్విషయమున నీ లోపము అసమ్మతము.

అత్రగ్రహణము లేకున్నను ప్రకృతులివియే కావలెనని,వాని ననువృత్తి చేయుటచే గ్రహింతుము.

అట్లైన విషయాపేక్షకై అత్ర గ్రహణ మావశ్యకమగును. ఎట్లన, 'మోక్షతే వత్సః స్వయమేవ' అని యొక ప్రయోగము. దూడ తానే విడివడుట కిచ్ఛగించుచున్నది అని యర్థము. ఇట ముచధాతు వకర్మకము. సాది సన్ప్రత్యయము పరమగునపుడు గుణము, "ముచో కర్మకస్య గుణో వా" (7-4-57) వికల్పముగ ప్రవర్తించినది. 'ముముక్షతే' అనియు నగవచ్చును. గుణము వచ్చినపుడే అభ్యాసలోపము. తద్విధాయకము, "అత్రలోపోభ్యాసస్య" (7-4-58) అననది. అత్ర=అనగా గుణ విషయమున అని లభించుటకు 'అత్ర' అనునది యావశ్యకముగాదా యనిన, అత్ర గ్రహణము లేకున్నను, విషయము నపేక్షింపగలము ఎట్లు ? అనిన-

సూత్రమునందు 'అకర్మకస్య' అను పదము కలదు. ఆ ధాతు వకర్మకమగుట, 'మోక్షతే ముముక్షతే వా వత్సః స్వయమేవ' అను కర్మ కర్మ కర్తృ ప్రయోగమునందే సంభవించును.

"అత్రలోపోభ్యాసస్య" (7-4-58) అను నీ సూత్రములోనికి "ముచో కర్మకస్య గుణః" అని యనువర్తించును. ఎపుడకర్మకమగు ముచిధాతువునకు గుణము ప్రవర్తించునో అపుడే అభ్యాసలోపము వచ్చునని యర్థమగును,

కావున 'ముముక్షతిగాం' అను స్థలమునను, 'ముముక్షతే వత్సః స్వయమేవ' అనుచోటను గుణము ప్రవర్తింపలేదు.

ఇట్లు విషయాపేతుగూడ, అత్ర గ్రహణము లేకున్నను సిద్ధించుచున్నది గాన, సర్వలోపార్థమేతద్గ్రహణమని పర్యవసించును. కాగా, 'నానార్థకేఽలోంత్య విధి రనభ్యాస వికారే' అను పరిభాషచే సాధ్యములగున వెల్లి యన్యథా సిద్ధములగుటం జేసి యా పరిభాష ప్రత్యాఖ్యాతము కావచ్చును.

**వా॥ ఉపధా సంజ్ఞాయా మల్గ్రహణ మంత్య నిర్దేశశ్చే త్సంఘాత ప్రతిషేధః"** అను నాక్షేపమునకు, 'అంత్య విజ్ఞానాత్సిద్ధ' మని సమాధానము వచింపబడినది తదుపరి అనర్థకమున అలోంత్య విధి ప్రవర్తింపదని, నానర్థక పరిభాష బోధించుచున్నది గాన నంత్యవిజ్ఞానము కుదురదను ప్రత్యాక్షేపము, అ పరిభాషా ప్రయోజనముల కన్యథాసిద్ధి ప్రదర్శనముచే బరిహరింపబడినది. కాగా 'అంత్య విజ్ఞానాత్సిద్ధమ్' అను వార్తికము సుస్థమైనది.

తరువాతి వార్తికము, **"అలోంత్యా త్పూర్వో ఉపధేతివా"** అనునది. **వా = లేదా,** అవధియును అవధిమంతమును **తుల్యజాతీయములు** కావలెనని వ్యక్తముగనే, ఉభయత్ర అల్గ్రహణముచేసి సూత్రమును బఠింపవగును' అని దాని భావము.

అయిన నట్లు పఠింపవలసి యుండునుగదా ? అనిన, అక్కరలేదు, అది లోక విజ్ఞానమునలననే సిద్ధించును అని **వా॥ "అవచనాల్లోక విజ్ఞానాత్సిద్ధమ్"** అను వార్తికముచే బోధింపబడినది.

వచనము లేకున్నను లోకానుభవమువలన సిద్ధించును. లోకమునందు, "ఈ బ్రాహ్మణులలో చివరివానికి ముందున్నవానిని దీసికొని రండు" అని యనినపుడు, చివరివాడెట్టివాడో, తత్పూర్వుడును నట్టి వ్యక్తియే కొనిరాబడును. అట్లే అంత్యము అల్లు అయినపుడు, పూర్వమును అల్లే గ్రహింపబడును అవధికిని అవధి మత్తునకును సాజాత్యము లోకసిద్ధము. కాని "ఇది సంయోగోపధము" అనియు వ్యవహరించుట కలదుగాని అది గౌణ వ్యవహారమనవలెను.

**॥అలోంత్యా త్పూర్వ ఉపధా॥**

## "తస్మిన్నితి నిర్దిష్టేపూర్వస్య"- (6-1-65)

## "తస్మాదిత్యుత్తరస్య" (6-1-66)

### ఉదాహరణ విచారము

ఈ సూత్రముల కుదాహరణము లేమి ? అని ప్రశ్న. 'తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య' అను సూత్రమున కుదారణము. "ఇకోయణచి" (6-1-77) అను సూత్రమును, దాని యుదాహరణములగు 'దధ్యత్ర' 'మధ్వత్ర' అను నవియు, "తస్మాదిత్యుత్తరస్య" అను దానికి "ద్వ్యంతరుపసర్గేభ్యోప ఈత్" (6-3-97) అను సూత్రమును, 'ద్వీపమ్' 'అంతరీపమ్' 'సమీపమ్' అను దాని యుదాహరణములును, నుదాహరణములని సమాధానము.

సూత్రములందు 'తస్మిన్' 'తస్మాత్' అను పదములు గ్రహింపబడినవి. పైన, పదార్థ విపర్యాస కారియగు 'ఇతి' అను శబ్దమును ఉపాత్తమయినది. 'గౌరిత్యయమాహ' అనిన, ఈతడు 'గౌః' అను శబ్దము నుచ్చరించెను, అనియే గదా యర్థము. ప్రకృతముననను, 'తస్మిన్' 'తస్మాత్' అను పదము లుచ్చరింపబడిన సూత్రము లుదాహరణములు కాదగి యున్నవి. నిర్దేశ మొక జాతి శబ్దముచే జేయబడినది. ఉదాహరణము వేరొక జాతి శబ్దము చూపబడుచున్నది. ఇది ఎట్లు ఉపపన్న మగును ? అనిన,

అయిన నేమి యుదాహరణము కాదగునందువు ?

"తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య"— అను దానికి, "తస్మిన్నణిచ యుష్మాకాస్మాకౌ"(4-3-2) అను నదియు, "తస్మాదిత్యుత్తరస్య" అను దానికి, "తస్మాచ్ఛసో నః పుంసి"(6-1-103) అను నదియు, నుదాహరణములు కావగును. అపుడు, అన్యథా జాతీయక శబ్ద నిర్దేశమును, అన్యథా జాతీయ కోదాహరణమును నను నాక్షేపమున కవకాశముండదు.

"ఇకోయణచి" "ద్వ్యంతరుపసర్గేభ్యోప ఈత్" అనునవియు నుదాహరణములు కావచ్చును. ఎట్లందువా ?

సూత్రమునందు సర్వనామ నిర్దేశముగదా చేయబడినది. సర్వనామములు. సామాన్యమును బోధించునవి. అనగా సామాన్యము నిర్దేశింపబడినదనుట, సామాన్యమనగా బుద్ధియందుండుట, అది సర్వ విశేషములందును నుండును,

విశేష నిర్ధారణములేని సామాన్యము ఈ శాస్త్రమున నెచ్చటను సంభవింపదు. కావున సర్వ విశేషములును నుదాహరణములు కావచ్చును.

'తస్మిన్' 'తస్మాత్' అను పదములు స్వరూప పదములుకావు. సూత్రాంతరములందున్నవాని కనుకరణము గాదనుట. అవి అర్థ పరములే. ఇతి శబ్ద మర్థ నిర్దేశార్థము. కాగా, 'తస్మిన్' అనునది సకల సప్తమ్యంతములును నర్థములుగాగల సర్వనామ. అట సప్తమీ ప్రత్యయ మనువాదకము. తస్మిన్నను పదముచే బోధ్యమగు నర్థమునకు, నిర్దిష్టే అనుదానితో సామానాధికరణ్యము కొరకును నది యేర్పడినది.

కావున నెచట సప్తమ్యర్థ, పంచమ్యర్థ నిర్దేశములుండునో యచట నా పరిభాష లుపస్థితములగును అని భావము.

## సామాన్య మననేమి? విశేష మననేమి?

సామాన్య విశేష భావము వ్యవస్థితము కాదే? 'తస్మిన్నితి' అనుదానికి, 'తస్మిన్నణిచ' అనునది విశేషమెట్లగును? అదియు ఞాది విశేష నిరూపిత మగు సామాన్యమేగదా! 'అచి' మున్నగునవియు విశేషము లెట్లగును? అకారాదుల దృష్టిలో నవియు సామాన్యములేగదా? ముందు గ్రహింపబడినది సామాన్యము. తరువాత గ్రహింపబడినది విశేషము అందుమా? అదియు గుదు రదు. దూరమున నొక పశువును జూతుమనుకొనుడు. అట నొకపుడు ముందుగ నది యావు అనుకొందుము. తరువాత నది నల్లనది అని దాని రంగు గ్రహింప బడును. ఒకపుడు ముందు నలుపే గ్రహింపబడును. ఇది యొక్క నల్లని పశువు అనుకొందుము. తరువాత నదిగోవని గ్రహింతుముగదా!

అనిన గోవు సామాన్యము. నలుపు విశేషము అని సమాధానము. ఏయది విశేష్యమో ప్రధానమో=పరిచ్ఛేద్యమనుట, అది సామాన్యము. ఏయది విశేషణముగా=పరిచ్ఛేదకముగా నిర్దేశింపబడునో యది విశేషము. ప్రకృతమున, 'తస్మిన్' అనుదాని యర్థము పరిచ్ఛేద్యముగా వివక్షితము గాన నది సామాన్యము అచీత్యాదులు పరిచ్ఛేదకములుగా వివక్షితములు. విశేష ములు అని పరిచ్ఛేదకము లెట్లగుననిన, ఏ సప్తమ్యంతముల యర్థము? అని ఆకాంక్ష కలిగినపుడు, 'అచి' మున్నగువాని యర్థము అని సమాధానమును జెప్పుట కవి పరిచ్ఛేదకములుగా వివక్షితములు.

అయిన నిక నెప్పుడును నలుపు సామాన్యమును, గోవు విశేషమును నగుట సంభవింపనే సంభవింపదా?

ఎందుకు సంభవింపదు ? అదియును సంభవమే.

ఆ విధముగ సామాన్యము విశేషమును, విశేషము సామాన్యమును గూడ నయిన సామాన్య విశేషములకు వ్యవస్థ యేముండును ? ఇది సామాన్యము ఇది విశేషము అని చెప్పుట కుదురనే కుదురదుగదా ? అనిన, వివక్ష వలన వ్యవస్థ సంభవింపవచ్చును. ఎట్లనగా, వక్తకు గోవు సామాన్యముగను, నలుపు విశేషముగను వివక్షితములయిన, గోవు సామాన్యమగును, నలుపు విశేషమగును. ఈతనికి నలుపు సామాన్యముగను, గోవు విశేషముగను చెప్ప బడవలెనను తలంపు కలిగిన, నలుపు సామాన్యమగు; గోవు విశేషమగును.

లేదా- సామాన్య విశేషముల వ్యవస్థ, పితా పుత్రన్యాయముచేతను గుదుర్పడవచ్చును. ఎట్లనగా, జూడుడు.

ఒకేవ్యక్తి, ఒకనికి దండ్రియు, వేరొకనికి బుత్రుడును నగును. ఆ విధముగనే ఒకే యర్థ మొకదానికి సామాన్యము, వేరొకదానికి విశేషముగా వచ్చును. "పరాశరాత్మజంవందే శుకతాతం తపోనిధిమ్" అని, ఒక వ్యాసునియందే ఆత్మజత్వ తాతత్వవ్యపదేశము ఏకకాలముననే అగపడుచున్నది గదా ! 'ఇది రాజ పురుషాశ్వము' అందుము అట పురుషుడు ఏక కాలముననే రాజునకు విశేష్యమును, అశ్వమునకు విశేషణముగను వ్యవహరింపబడుచున్నాడు. పర్యాయముగను, యౌగపద్యమునను సామాన్య విశేషభావ ముపపాదనార్హ మగును. "సామాన్యం విశేష ఇతి బుద్ధ్యపేక్షమ్"అని కణాదసూత్రము.

'సప్తమీ నిర్దిష్టే పూర్వస్య' అనియే స్పష్టార్థమేల సూత్రమును రచింప లేదు ? అనిన,

శబ్ద ప్రయోగమునకు అర్థబోధగదా ప్రయోజనము. శబ్దములు నైర్దే శికములు=నిర్దేశము=బోధ—ప్రయోజనముగా గలవి యనుట.

ఈ సర్వనామములచే జేయబడు నిర్దేశములు, అట్టివానిలో వార్తతర కములు. అనగా యుక్తతరములు పలయవ నవి వ్యాపకములు. 'సప్తమీ నిర్దిష్టే' అని పఠించిన నొకప్పుడు, 'సప్తమీ' అను శబ్దముచే నిర్దేశింపబడినది పూర్వమునకు ప్రవర్తించునని యర్థము కావచ్చును. అపుడు "సప్తమ్యాం జనేర్డః(3-2-97) ఇత్యాదులందు మాత్రమే యీ సూత్ర ముపస్థితము కావలసి వచ్చును.

సూత్రమునందు 'నిర్దిష్టే' అను పదము, 'నిర్' అను నుపసర్గముతో గూడిన దిశ ధాతువునకు క్త ప్రత్యయాంతము. అది సూత్రమునందేందులకు

గ్రహింపబడినది? అని ప్రశ్న. 'తస్మిన్నితినిర్దిష్టే పూర్వస్య' అనియే సూత్రమేల రచింపబడలేదు? అని తాత్పర్యము

అట్లు సూత్రము రచింపబడినను, ఆకాంక్షావశమున 'ఉచ్చారితే' అను పద మధ్యాహృతము కావచ్చును. ఇట్లుండ మరల నిర్దిష్ట పదోపాదానము బహిర్భావమును దెలియజేయును. నిర్దిష్టే=అనగా బహిర్భూతే అని యర్థము. ఒక శబ్దమునకు, పూర్వముగా గాని పరముగా గాని బహిర్భూతేతమయి యుండునది శబ్దమేయగును. అర్థమాంతర్భూతమేగాని బహిర్భూతముగాదు. శబ్దము సప్తమినే నిర్దిష్టమయినపుడు పూర్వమునకు కార్యము రావలెను. అర్థమట్టిది అయినపుడుగాదు. అందుకొరకై ఉపసర్గ విశిష్ట దిశ ధాతు ప్రకృతిక క్తాంతము 'నిర్దిష్టే' అనునది నిర్దేశింపబడినది అని సమాధానము. "జనపదేలుప్" (4-2-81) అనియును, "అతిశాయనే తమ బిష్ఠనౌ" (5-3-55) అనియు రెండు సూత్రములు. అందు మొదటి సూత్రమునకు, జనపదము వాచ్యమగునపుడు చాతుర్థిక ప్రత్యయమునకు లుప్పగునని యర్థము. రెండవ సూత్రమున 'అతిశాయనే' అను పదమునకు 'అతిశయ రూపార్థమున' నని యర్థము. ఈ సూత్రములందుగూడ 'తస్మిన్నితి' అను పరిభాష ప్రవర్తించిన యెడల, జనపద వాచియగు శబ్దము పరమగునపుడు అనియు, అతిశయ విశిష్టార్థ వాచి శబ్దము పరమగునపుడనియు నర్థము కావలసివచ్చును. అపుడది లాక్షణికార్థమగును. 'నిర్దిష్టే' అను పదము సూత్రమున నున్నపుడు, ఎచట ముఖ్య వృత్తిచే శబ్దపర నిర్దేశముగలదో యచటనే యీ పరిభాష కుపస్థితి కలుగును గాన దోషములేదు.

సరి. ఆ యర్థము సిద్ధించుటకు, ఆ పదము నందలి 'నిర్' అను నుపసర్గము జాలునా? లేక అధికార్థ సిద్ధికి అధిక శబ్ద గ్రహణ మావశ్యకమా?

ఉపసర్గముచే సిద్ధించును. ఈ 'నిర్' అనునది బహిర్భావమును బోధించును. ఎట్లనగా, నిర్దేశః అనిన= 'నిష్క్రాన్తోదేశాత్' 'దేశము నుండి బయటకు వెడలిన వాడు' అని యర్థము. కాగా నిట గూడ 'నిర్దిష్టే' అను పదమునకు 'బహిర్భూతమయిన దగునపుడు' అని యర్థము. శబ్దమునకు బహిర్భూతమగు నది శబ్దమే. కావున 'అచి' అను సప్తమ్యంతమున కర్థముగు నచ్చు పరముగా బహిర్భూత మయినపుడు ఉపశ్లిష్టమగు పూర్వమునకు శబ్ద రూపమైన దానికే యణ్ణగునని యర్థము పర్యవసితమగును.

నిర్దిష్టగ్రహణ మీ సూత్రమున నే ప్రయోజనము కొరకు?

ఈ ప్రశ్న మరల కలుగవచ్చును. అర్థనిర్దేశస్థలందు ఈ పరిభాష కుప

స్థితి నివారించుటకు నిర్దిష్ట గ్రహణము కావలెనని చెప్పబడినదిగాని, అట్టి అర్థముతో పౌర్వాపర్యము సంభవింపదు గాన నట్టి దీని యుపస్థితికి సంభవమే లేదు.

కాదని యంగీకరించినను, నపుడు, "తస్మిన్నితి శబ్దే పూర్వస్య" అనియే సూత్రమును రచింపవచ్చును గదా. అపుడు సందేహమే కలుగదు. కావున నిర్దిష్ట గ్రహణమునకు ప్రయోజన మేమి? అను ప్రశ్న కవకాశము కలదు. దానికి సమాధానముగ,

**వా॥ "నిర్దిష్ట గ్రహణ మానంతర్యార్థమ్"** అను వార్తిక మవతరించినది. ఈ సూత్రము నందిదియే మొదటి వార్తికము.

'నిర్దిష్టే' అను పద మీ సూత్రమునందు, 'అవ్యవహితోచ్చారిత మయినపుడే' అనునర్థము లభించుట కుపాత్తము.

సప్తమ్యంత పదములగు 'అచి' మున్నగువాని యర్థమగు అజ్వర్ణము అవ్యవహితముగ నుచ్చరింపబడినపుడే పూర్వమగు 'ఇ' కారమునకు, 'దధి+ ఉదకమ్' ఇత్యాదులందు యకారాదేశము ప్రవర్తించునుగాని, 'సమిధౌ' 'సమిధః' 'దృషదౌ' 'దృషదః' ఇత్యాది వ్యవహిత స్థలములందు ప్రవర్తింపదని బోధించుట నిర్దిష్ట పదమునకు కృత్యము.. వ్యవధానమునందు సంహితయే సంభవింపదు గదా యనవచ్చును. ఉపశ్లేషమును అసంభవము కాని సంహిత యనగా వర్ణ శూన్య కాలాభావము. తద్రూపమగు సంహిత కలదని భావము.

## నియమార్థతా విచారము

ఈ సూత్రద్వయము ఎందుకొరకు జెప్పబడుచున్నది?

ఇది నియమార్థమా? ప్రయోజనాంతరోద్దేశ్యకమా? అను ప్రశ్నకు సమాధాన వార్తికము—

**వా॥ "తస్మిన్ తస్మాదితి పూర్వోత్తరయో ర్యోగా విశేషాత్ నియమార్థం వచనం దధ్యుదకం పచత్యోదనమ్"॥**

"తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య" "తస్మాదిత్యుత్తరస్య" అనునివి అనియమము ప్రాప్తమయినపుడు నియమమును బోధించు పరిభాషలు.

"గ్రామే దేవదత్తః" = 'గ్రామమున దేవదత్తుడున్నాడు' అని నపుడు దేవదత్తున కాగ్రామ సంబంధము పూర్వ పరదిశా సాధారణము గాన, తూర్పుననా ? పడమటనా ? అను సందేహము గలుగును. అటులనే,

"గ్రామాద్దేవదత్తః" = ఊరి కంటే = ఊరునకు సంబంధించి, దేవ దత్తుడున్నాడు అను నపుడును తూర్పుగనా ? పశ్చిమము గనా ? అను సందేహము కలగును. యోగావిశేషాత్=యుజ్యమానములగు పూర్వోత్తర ముల సంబంధము తుల్యమగుటవలన నని యర్థము.

'దధి ఉదకమ్' ॥ అజుపశ్లిష్టమగు ఇక్కునకు యణాదేశము వచ్చును. ఇట రెండు ఇక్కులును రెండు అచ్చులును గలవు. వానికి పూర్వ పద సంబంధ మవిశిష్టము. అచ్చు యొక్క ఉపశ్లేషము గల ఇక్కు పూర్వమై యున్నపుడు యణాదేశమగునా ? పరమై యున్ననా ? అను సందేహము కలుగుచున్నది. అట్టియెడ, 'పూర్వమై యున్ననే' అను నీ నియమమును, సూత్రము బోధించును.

ఇట్లే, "తిఙ్ఙతిఙః" అను సూత్రము, అతిఙంత పదమునకు సంబంధించిన (అతిఙంతము కంటె) తిఙంతమునకు నిఘాత స్వరమును విధించుచున్నది. 'ఓదనం పచతి' ఉదాహరణము. అచట గూడ, పూర్వమైన తిఙంతమునకా? పరమైన దానికా ? అను సందేహము కలుగును. అట్టియెడ 'తస్మా దిత్యుత్తరస్య' అను నీ సూత్రము అతిఙంత పదముకంటె బరమైన తిఙంతమునకే అను నియమమును బోధించును.

కాగా నియమార్థ మీ సూత్రము లారంభింపబడినవి. వచనములేనిచో నది సిద్ధింపదు.

సప్తమీ నిర్దేశముచే విధింపబడిన కార్యమవ్యవహిత పూర్వమునకేవచ్చును. ఉదాహరణము — దధ్యుదకమ్.

పఞ్చమీ నిర్దేశముచే క్రియమాణమగు కార్యము వర్ణాంతరావ్యవహిత మగు పరమునకే వచ్చును. ఉదాహరణము- ద్వీపమ్, అంతరీపమ్.

ఇక గొన్ని సూత్రములందు పంచమీ సప్తమీ నిర్దేశములు రెండును గాన వచ్చుచున్నవి గదా ! అచ్చట పూర్వమునకు ఆ కార్యము ప్రవర్తింప వలెనా ? లేక పరమునకా ? ఒకే వ్యక్తి, ఏక కాలముననే

కార్య భాక్కును, ఆ కార్యమునకు నిమిత్తమును గాజాలదు గదా అని యాక్షేపము. దీనికి సమాధానముగా నవతరించిన వార్తికము.

**వా॥ "ఉభయ నిర్దేశే విప్రతిషేధా త్పంచమీ నిర్దేశః"** అనునది.

అట్టి స్థలములందు విప్రతిషేధ శాస్త్రము వలన పంచమీ నిర్దేశమే ప్రబలమని సమాధానము. ప్రకృత సూత్ర ద్వయములో, వాని పాఠ క్రమమును బట్టి పరమగుటచే 'తస్మాదిత్యుత్తరస్య' అను పరిభాషయే ప్రవర్తించును.

ఈ వ్యవస్థకు ప్రయోజనము లేమి?

**(1) వా॥ ప్రయోజన మతో లసార్వధాతు కానుదాత్తత్వే"** అనునది మొదటి ప్రయోజన వార్తికము.

**"తాస్యనుదాత్తేన్ఙిద దుపదేశాల్ల సార్వధాతుక మనుదాత్త మహ్న్విఙోః"** (6-1-186) అను సూత్రము,తాసి ప్రత్యయము. అనుదాత్తేత్తగు ధాతువు. ఙిదుపదేశము, అదుపదేశము, — అను వీని కంటె బరమగు లకార స్థానిక సార్వ ధాతుకమునకు, అనుదాత్త స్వరమును విధించుచున్నది. అందు, అదుపదేశము కంటె బరమగు ల సార్వధాతుకమునకు అనుదాత్తత్వము విషయమున నీ విప్రతిషేధమునకు ప్రయోజనము. ఇట నదుపదేశాత్తను నది పంచమ్యంత మే అయినను ల సార్వధాతుకమనునది సప్తమ్యంతము గాదు గదా సందేహమునకు ప్రసక్తి లేనే లేదే యనిన,

**"తాస్యాదిభ్యో నుదాత్తత్వే సప్తమీ నిర్దేశోభ్యస్త సిజర్థః"** అని ముందు వార్తికకారుడు చెప్పనున్నాడు. "అభ్యస్తానామాదిః" (6-1-189), "ఆదిస్సిచోన్యతరస్యామ్" (6-1-187) అను సూత్రములలో, సప్తమ్యంత మగు 'ల సార్వధాతుకే' అను పదమున కనువృత్తి ఆవశ్యకము గాన నిందును తదర్థమై 'ల సార్వధాతుకే' అని సప్తమ్యంత నిర్దేశము ఆవశ్యకము.

అపుడు, తాస్యాదుల కంటె బరమైన ల సార్వధాతుకమునకా? ల సార్వ ధాతుకము పరమగు నపుడు తాస్యాదులకా ? అను సందేహమునకు ప్రసక్తి కలుగును. తన్మూలమున, పర్యాయముగ నుభయమునకును అను దాత్తము రావలసి యుండును. కాని విప్రతిషేధము వలన, తాస్యాదుల కంటె బరమయిన ల సార్వధాతుకమునకు అనుదాత్తమే నిర్ణీత మగును.

(2) వా॥ "బహోరిష్ఠాదీనా మాదిలోపే" అది ద్వితీయ ప్రయోజన వార్తికము.

"బహోర్లోపోభూచబహోః" (6-4-158) అను సూత్రము, బహు శబ్దము కంటె, బరములగు, ఇష్ఠన్, ఇమన్, ఈయస్, ప్రత్యయములకాది లోపమును, బహు శబ్దమునకు 'భూ' అను నాదేశమును విధింపగా 'భూయిష్ఠః'— మున్నగు రూపములు సిద్ధించుచున్నవి.

"తుర్ష్ఠేమేయస్సు" (6-4-154) అను సూత్రము నుండి, ఇష్ఠేమేయస్సు' అను సప్తమంత మనువర్తించును. అందువలన, 'బహు శబ్దము కంటె బరము లయిన ఇష్ఠేమేయస్సులకు' అని యర్థమా ? ఇష్ఠేమేయస్సులు పరమగు నపుడు బహు శబ్దమునకు భూ ఆదేశమగునని యర్థము చేయవలెనా ? అని సందేహము. అపుడు బహు శబ్దమునకు లోప భూ భావములు పర్యాయముగ ప్రవర్తింపవలసి వచ్చును.

పంచమీ నిర్దేశము బలవత్తరమగుటచే, పరములగు నిష్ఠేమేయస్సుల కనియే యర్థము॥

(3) "గోతోణిత్"(7-1-90) అను సూత్రములోనికి "ఇతోత్సర్వనామస్థానే" (7-1-86) అను సూత్రమునుండి 'సర్వనామస్థానే' అను సప్తమ్యంత పదమను వర్తించును. 'గోతః' అనునది పంచమ్యంతము. కావున, గోశబ్దముకంటె బర మైన సర్వనామ స్థానమునకు ణిత్వమని యర్థమా ? సర్వనామ స్థానము పరమై నపుడు గోశబ్దమున కనియా? అని సందేహము. విప్రతిషేధ శాస్త్రమువలన, 'గోశబ్దముకంటె బరమయిన సర్వనామ స్థానమునకు' అనియే అర్థమని నిర్ణయము.

(4) "రుదాదిభ్యః సార్వధాతుకే" (7-2-76) అను సూత్రమును ఉభయ నిర్దేశములు గలది. పై సూత్రములందువలె సందేహము. రుదాదులకంటె బర మైన సార్వధాతుకమునకు ఇడాగమమగును' అని విప్రతిషేధమువలన పంచమీ నిర్దేశము బలవంతమగుటవలన సిద్ధించిన యర్థము.

(5) "అనే ముక్" (8-2-82), "ఈదానః" (7-2-83) ఆన్ కంటె నుత్తర మయిన అనకా ? 'ఆన' పరమయినపుడు 'ఆన్' కా ముగాగమని సందేహము. 'ఆన్' కంటె బరమైన 'ఆన' కు అని సిద్ధాంత సిద్ధార్థము.

(6) "అమి సర్వనామ్న స్సుట్" (7-1-52) ఆమ్ము పరమైనపుడు సర్వ నామకనియా ? సర్వనామకంటె ఉత్తరమయిన ఆముకు సుడాగమమనియా ?

అని సందేహము. సర్వనామముకంటె బరమైన ఆట్ప్రత్యయమునకు అనియే పంచమీ నిర్దేశ బలీయస్త్వ సిద్ధమగు నర్థము.

(7) "ఘేర్ఙితి" (7-3-111), "ఆణ్నద్యాః" (7-3-112) నదీ సంజ్ఞకమున కుత్తరములయిన జిత్తులకా ? జిత్తులు పరమగునపుడు నదికా ? అని సందేహము. నదికంటె బరమయిన జిత్తునకు ఆడాగమము అని సిద్ధాంతమగు నర్థము.

(8) "యాడాపః" (7-3-113) ఇందు 'జితి' అను సప్తమ్యంత మనువర్తించును. 'ఆపః' అనునది పంచమ్యంతము. అప్పుకంటె నుత్తరమయిన జిత్తుకు యాడాగమమా ? జిత్తు పరమగునపుడు అప్పునకా ? అని సందేహము ఆబంతము కంటె బరమయిన జిద్వచనమునకు యాడాగమమగుననియే యర్థము.

"ఙమో హ్రస్వాదచి ఙముణ్నిత్యమ్" (8-3-32) అనునవి తొమ్మిదవ ప్రయోజన వార్తికము. ఈ సూత్రమునందును నుభయ నిర్దేశము లుండుట చేత, ఙమంత పదముకంటె పరమగు నచ్చునకు ఙముడాగమము వచ్చునని యర్థమా ? లేక అచ్చు పరమగునపుడు ఙమంత పదమునకనియా ? అను సందేహమును, ఙమంతముకంటె బరమైన యచ్చునకనియే యర్థమని, పంచమీ నిర్దేశ బలీయస్త్వ సిద్ధాంత సిద్ధ నిర్ణయమును యథాపూర్వములు. ఙమ్వర్ణమునకే ఙమ్వర్ణ మాగమమైన యెడల 'కుర్వన్నాస్తే' అను చోట "పదాంతస్య" (8-4-37) అను ణత్వ నిషేధము సిద్ధింపదు. ద్వితీయ నకారమే పదాంతమగును గాని మొదటిది కాదు. కాగా, పూర్వోక్తములయిన ఉభయ నిర్దేశ స్థలము లందెల్ల సూత్రపాఠ కృత పర విప్రతిషేధము వలన పంచమీ నిర్దేశమే ప్రబలము గాన నాయా లక్ష్యములు సిద్ధించుట ప్రయోజనము.

విప్రతిషేధమనగా, తుల్యబలములగు రెండు శాస్త్రములకు విరోధము. ఆయా విధులందలి సప్తమీ నిర్దేశములు రెండును అన్యత్ర చరితార్థములయి యొక్క లక్ష్యమునందు పరస్పర విరుద్ధ కార్యోప స్థాపకములయిన నపుడు వానికి విప్రతి షేధము ప్రసన్నమగును.

పూర్వోపాత్తములగు సూత్రము లందెల్ల, సప్తమీ నిర్దేశమునకు గొన్ని యెడల, పూర్వ సూత్రము లందును, మరి కొన్ని పట్టుల నుత్తర సూత్రము లందును చారితార్థ్య మగపడు చున్నది. పంచమీ నిర్దేశమ నవకాశము గాన బలీయము. తుల్య బలములకు గదా విప్రతిషేధము. కాగా నీ విప్రతి షేధము దురుపపాదము.

ఈ అనుపపత్తిని సూచించు వార్తికము — **"విభక్తి విశేష నిర్దేశా నవకాశత్వాత్ అవిప్రతిషేధం:"** అననది.

విభక్తి విశేష నిర్దేశమనగా బూర్వోక్తములందు, పంచమీ నిర్దేశము. అది అవకాశ రహితమగుట వలన విప్రతిషేధము పొసగదు. పై స్థలములందు అంతటను పంచమీ నిర్దేశము బలవంతమై యది స్వార్థమునే బోధించును అచటి సప్తమ్యంతములు షష్ఠ్యంతార్థము కలవి యగునని వార్తికార్థము.

**వా॥ "యథార్థం వా షష్ఠి నిర్దేశః"** అని సమాధానాంతర వార్తికము

వా = లేదా, యథార్థం = యథా విషయముగ = పూర్వమునకు కార్యము సమ్మతమైన తావులందు, పూర్వమునను, పరమున నది ఇష్టమైన చోట్ల పరమందును, "షష్ఠి నిర్దేశః" కార్యిబోధక షష్ఠ్యంత పదములనిర్దేశము= ఉచ్చారణము కర్తవ్యన ు అని ఆవార్తికమున కర్థము.

అపుడాయా సూత్రములందు సప్తమ్యంత పదములను రెండింటిని బఠింపవలసి యుండుట గౌరవ గ్రస్తము కాదా ? అనిన,

పఠింప నక్కరలేదు. దీని చేతనే ఆ ప్రక్లప్తి సిద్ధించును. పూర్వమునకు గార్యిత్వమును బ్రతిపాదించుటకు యోగ్యమగు షష్ఠి పూర్వ బోధక పదము నందును, పరమునకు గార్యమును ప్రతిపాదించుట కనువగు షష్ఠి పరమందును నీ సూత్ర ద్వయముచేతనే కల్పింపబడును.

అట్లైన షష్ఠీ పదమును జేర్చి, "తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య షష్ఠీ" అని యును, "తస్మాదిత్యుత్తరస్య షష్ఠీ" అనియు బఠింపవలసి యుండును గదా ? అనిన, అక్కరలేదు 'షష్ఠీ' అను పదము ప్రకృతము అనువర్తించును.

ఎచ్చట ప్రకృతము? 'షష్ఠీ స్థానే యోగా' అను సూత్రమున. కావున నీ సూత్ర ద్వయమును షష్ఠీ ప్రకల్పకమని తెల్లమయినది.

**వా॥ "ప్రకల్పక మితిచే న్నియమాభావః"** అని ప్రకల్పకత్వ పక్షము నందు దూషణ వార్తికము. ఈ సూత్ర ద్వయము నియమార్థమని

గూడ 'అచి' అను సప్తమి 'యణ్' అను ప్రథమకు షష్ఠిని గల్పించును. 'తస్మిన్నితి' అను సూత్రమే తత్కల్పకము అనినను నశ్లేకానిమ్ము. ఆయణ్ణులకు వేరొక యాదేశమేదియు ప్రతినిర్దేశింపబడలేదుగదా ? అంతర్యమువలన యణ్ణుకు యణ్ణేవచ్చును. ప్రథమాంత షష్ఠ్యంత పదముల సామర్థ్యమువలన ముందుగా నిక్కుకు స్థానిత్వమును యణ్ణున కాదేశత్వమును సిద్ధించినది గాన దోషము లేదు అని తాత్పర్యము.

(4) ఇక సప్త పంచమీ పదములు రెండును నున్నందున సప్తమీ పంచములకు రెండింటికిని షష్ఠీ ప్రక్ల్పప్తి కలుగవలసివచ్చుననియు, అట్టియెడ నుభయ స్థానులకును నొక్క పర్యాయమే కార్యద్వయ ప్రసంగము కలుగుననియు జేసిన చివరి యాక్షేపము జ్ఞాపకమువలన బరిహరింపబడును.

సప్తమీ పంచములు రెండును నొక పర్యాయమే షష్ఠీ ప్రకల్పకము లయినయెడల, "అద్గుణః" (6-1-87) ఇత్యాది సూత్రములందు అచ్చు పరముగా గల అకారమునకును 'అకారముకంటె బరమగు నచ్చునకును గుణమాదేశమగును' అను నర్థము లభించును. కావున, 'ప్ర+ఇంద్రః' అనుచోట అకారమునకును ఇకారమునకును నొక ఏకార మాదేశముగా సిద్ధించును. ఇక "నేకః పూర్వపరయోః" అను సూత్రమున "పూర్వ పరయోః" అనునది వ్యర్థమగును. కాగా 'యుగపత్ప్రకల్పనమున కవకాశములేదు' అను వంశమున నని జ్ఞాపకమగుట. ఉభయ నిర్దేశమువలన పరస్పర షష్ఠీ ప్రకల్పనము చేయబడుననిన నపుడు గ్రహణక వాక్యమునుండి వాక్యాంతరము ననుమానించి, తాస్యాది పర ల సార్వధాతుకమునకును, లసార్వధాతుక పతాస్యాదులకును ననుదాత్తత్వము గలిగిన నాద్గుణః అనుచోటను నశ్లే కావచ్చును. పూర్వ పరయోః అనునది వ్యర్థము అని భావము.

### తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య॥ తస్మాదిత్యుత్తరస్య॥

## స్వం రూపం శబ్దస్యా శబ్ద సంజ్ఞా (1-1-67)

ఇది సంజ్ఞా సూత్రము. పరిభాషకాదు. శబ్దమునకు, స్వమ్=అనగా నర్థమును, రూపమ్=అనగా శబ్ద స్వరూపమును, సంజ్ఞ=అనగా బోధ్యము అగునని సూత్రమున కర్థము. ఇక అశబ్ద సంజ్ఞా=శబ్ద శాస్త్రీయ సంజ్ఞకాదు, శబ్ద శాస్త్ర కృతములగు ఘు, ఘ మున్నగు సంజ్ఞలు స్వరూప బోధకములు గావు. అవి తత్తత్సంజ్ఞులకే బోధకములు. "తరప్తమపౌ ఘః" (1-1-22) అను సూత్రముచే 'తరతమ' అను ప్రత్యయములకు 'ఘ' అను సంజ్ఞ విధింపబడినది. అది శబ్ద శాస్త్రీయ సంజ్ఞ. కాబట్టి, "ఘరూపకల్ప" (6-3-43) ఇత్యాది

సూత్రమునందు, 'ఘ' అనునది, ఘశబ్దమును బోధింపదు. 'తర', 'తమ' అను ప్రత్యయములనే బోధించును.

అట్లే "దాధా ఘ్వదాప్" (1-1-19) అను సూత్రము, దా రూపములును, ధా రూపములును నగు ధాతువులకు 'ఘు' అను సంజ్ఞను విధించినది. అందువలన, "ఉపసర్గేఘోః కిః" (3-3-92) అను సూత్రమున ఘు శబ్దముచేత దాధాలకే గ్రహణముగాని, 'ఘు' అను శబ్దరూపమునకు గ్రహణము కాదు.

ప్రకృత సూత్రోదాహరణము, "అగ్నేర్ఢక్" (4-2-33) అను సూత్రమునందలి 'అగ్ని' శబ్దము, ఆట నది స్వరూప బోధకమే. అంగార బోధకము గాదు.

ఇట నొక యాక్షేపము. "స్వం శబ్దస్యా శబ్ద సంజ్ఞా" అని సూత్రమును రచింపవచ్చునే ? స్వమ్మనగా స్వీయము. శబ్దమునకు రూపముకంటె నితరమగు స్వీయము వేరొండెయ్యది గలదు ? కావున నదియే గ్రహింపబడును. ఇక రూపశబ్ద మెందులకు ? అని యాక్షేపము. సత్యమే. రూపగ్రహణము వ్యర్థమయి, శబ్దమునకు రూపాతిరిక్తమగు స్వమ్ముగూడ వేరొండు గలదని జ్ఞాపనమును జేయునని పాణిని యాశయము. అదియే అర్థము. ఇట్లు జ్ఞాపనము చేయుటకు ప్రయోజనమేమి ? అనిన, నిక "అర్థవద్గ్రహణే నానర్థకస్య గ్రహణమ్" అను పరిభాషను రచింప బనిలేకుండుట ప్రయోజనమనుట.

అర్థ విశిష్టమునకు గ్రహణము సంభవించినపుడు తద్విరహితము గ్రహింపబడదని ఆ పరిభాష కర్థము. ఆ పరిభాష ప్రకృత సూత్రమునందలి రూప గ్రహణముచే సిద్ధమయినదే యగును. అందువలననే, "శే" (1-1-13) అను ప్రగృహ్య సంజ్ఞావిధాయక సూత్రమునందు 'కాశే' 'కుశే' మున్నగు శబ్దములందలి అర్థ విరహితమగు శే అనునది గ్రహింపబడదు.

ఈ స్వం రూప వచన మెందుకు జేయవలసి వచ్చినది ?

**వా॥ శబ్దే నార్థగతే రర్థే కార్యస్యాసంభవాత్ తద్వాచి నస్స్యంజ్ఞా ప్రతిషేధార్థం స్వంరూప వచనమ్"** అని సమాధాన వార్తికము.

లోకమునందు, శబ్ద ముచ్చరింపబడిన తోడనే దాని కర్థముతో గల సంబంధము గృహీతమయి అర్థ ప్రతీతి శ్రోతలకు గలుగును. "గోవును దీసికొనిరమ్మ" అను వాక్యమును విని గో వ్యక్తిని దెచ్చును. 'దధిని భక్షింపుము' అను మాటను విని పెరుగును ద్రావును. గోవును అనిన, 'గోవు' అను శబ్దమును అని గాని, 'దధిని' అనిన 'దధి' శబ్దమును అనిగాని అర్థము చేసి

2. ప్రత్యయ విధులందు గూడ పంచములు ప్రకల్ప్యములు కావలసి వచ్చును,

3. ప్రకృతి వికార వ్యవస్థ కుదురకపోవును.

4. సప్తమీ పంచములు రెండును గొన్ని స్థలము లందుండుటచేత నచట నుభయత్ర షష్ఠీ ప్రక్లృప్తియు, దాన నుభయ కార్య ప్రసంగమును గలుగవలసి వచ్చును అనియు జేయబడినవి. వానికి, పరిహారములిక వచింపబడును.

అందు మొదటి యాక్షేప విషయము నియమాసిద్ధి.

ప్రక్లృప్తి పక్షము నందును నియమము ఫలితమగును గాన నా దోషము లేదు అని సమాధానము. సప్తమీ నిర్దేశ స్థలములందు, పూర్వమున నున్నది షష్ఠ్యంతముగా బ్రకల్పింపబడును. పంచమీ నిర్దేశ ప్రదేశములందు పరమునకు షష్ఠీ ప్రక్లృప్తి చేయబడును. ఎచ్చట షష్ఠీ ప్రక్లృప్తి చేయబడునో అచటనే ఆ కార్యము ప్రవర్తించును. సప్తమీ నిర్దేశము తత్పూర్వమునే షష్ఠ్యంతముగా మార్చును గాన నచట నా కార్యము పరమునకు ప్రవర్తింప నుత్సహింపదు. పంచమీ నిర్దేశమును బూర్వమునకు కార్యము నాపాదింపదు. కావున నియమము అర్థసిద్ధము.

షష్ఠిలేని చోట నేయది కల్పింపబడును. అది స్థాన షష్ఠి. "ఇకో యణచి" మున్నగు స్థలములందు, 'ఇకః' అను షష్ఠ్యంత పదము కలదు గాన నట బ్రక్లృప్తికి బని లేదు. కాని 'తస్మిన్నితి' అను సూత్రము విషయ భేదముచే భిన్నమై అచటగూడ, 'పూర్వమునకే' అను నియమము బోధించును. స్థల భేదముచే విధిముఖముగను నిషేధ ముఖముగను నా సూత్రము ప్రవర్తించి బహు విషయమగును గాన నియమము ఫలరూపమున సిద్ధించును.

(2) ఇక, ప్రత్యయ విధులందును షష్ఠీ ప్రక్లృప్తికి అతి ప్రసంగము కలుగు నను నాక్షేపము రెండవది. అట పంచములు ప్రకల్ప్యకలు కానిమ్ము.

"గుప్తిజ్ కిద్భ్యస్సన్" (3-1-5) ఇత్యాదులందు, 'సన్' ప్రత్యయమునకు సన్ ప్రత్యయమే ఆంతర్యము వలన నాదేశమగును. ఇతరాదేశమేదియు

రాదు. కావున నగి దోషము గాదు, అని ఆ యాక్షేపము పరిహరింపబడియే యున్నది.

ఆదేశము గదేశము గాదు. దాని యందున్న నకారమున కిత్సంజ్ఞ ప్రవర్తింపదు, అది ఉపదేశమునందే ప్రవర్తించును కావున నట్లు చెప్పుట శక్యముగాదు, అని చెప్పబడినదిగదా ? అనిన,

ఆ దోష మెపుడు తగులును ? ఇత్సంజ్ఞ ఆదేశమును ప్రతీక్షించి, అది వచ్చువరకును దాను ప్రవర్తింప కుండగ నాగినపుడు గదా ? షష్ఠీ ప్రక్ళప్తికి బూర్వమే, ఉపదేశోత్తర కాలమునందే, సూత్రమువనే ఇత్సంజ్ఞ ప్రవర్తించును ఇత్సంజ్ఞకమునకు లోపమును వచ్చును తరువాతనే ఆదేశమగుట. కావున నిత్సంజ్ఞక వర్ణరహితమే ప్రత్యయముగా విధింపబడునది. 'ఉపదేశే' = 'ఉపదేశమున దు' అని గదా ఇత్సంజ్ఞ చెప్పబడినది? ఇట్లిత్సంజ్ఞ సూత్రము నందే ప్రవర్తించినను, సంజ్ఞా కార్యము మాత్రము ప్రయోగము నందగ పడును.

లేదా పరిహారాంతరమును నిట్లు వచింపవచ్చును.

సన్ ప్రత్యయము పుట్టకమునుపు షష్ఠీ ప్రక్ళప్తి కలుగదు గదా!

ఇక సన్ప్రత్యయ ముత్పన్నమైన తరువాత, దానిని ప్రకృతికి పరముగా నుత్పాదించుటలో నుపక్షీణమగుటచే నిక నా పంచమి ప్రకల్పకము కాజాలదు. ఒక సూత్రమున కొక పర్యాయమే ప్రవృత్తి గదా.

(3) ఇక ప్రకృతి వికారావ్యవస్థా రూపదోషమును జూతము.

"ఇకోయణచి" (6-1-77) అను సూత్రమునందు ప్రకృతి బోధకమగు పదము 'ఇకః' అనునది. అది షష్ఠ్యంతమే. వికృతి=ఆదేశ బోధకమగు 'యణ్' అనునది ప్రథమాంతముగా నిర్దేశింపబడి యున్నది. అవి రెండును శ్రుతములు. అనగా సూత్రమున కంఠతః ఉచ్చారితములు. శ్రుతానుమితములలో శ్రుత ముతోడి సంబంధమే బలీయము. శ్రుతి లింగములలో శ్రుతి ప్రబలము కావున, 'ఇకః' 'యణ్' అను పదములకు స్థాన్యాదేశ భావము సిద్ధము గాన షష్ఠీ ప్రకల్పనముతో బని లేదు. సూత్రములందు షష్ఠి లేని స్థలములందే ప్రక్ళప్తికి ప్రసక్తి కాగా స్థాన్యాదేశ వ్యవస్థ సుస్థమే.

లేదా– ఎచ్చట సౌత్రషష్ఠి యుండునో యచట నవగా 'నికోయణచి' మున్నగుచోట్ల, ఇక్కుల స్థానమున యణాదేశము ప్రవర్తింపవలెను ఇక నచట

చెప్పబడెను గదా ? ప్రకల్పమను పక్షమున నిక నియమార్థత్వ మెట్లు కుదురును ?

షష్ఠి లేనిచోట షష్ఠికి ప్రక్లృప్తియు, "ఇకోయణచి" మున్నగు షష్ఠి గల చోట్ల నియమమును నను నీ కార్యద్వయ మెట్లు పొసగును ?

మరియు నీ ప్రకల్పకత్వ పక్షమున దూషణాంతరమును గలదు.

ప్రత్యయ విధాయక శాస్త్రము లందలి పంచమ్యంతములు గూడ స్థానంతర విభక్త్యంతములను షష్ఠ్యంతములనుగా ప్రకల్పింప వలసి వచ్చును.

అయిన నేమి దోషము ? అనిన,

"గుప్తిజ్ కిద్భ్యః సన్" అనునది సన్ప్రత్యయ విధాయకము. ఇందలి గుప్తిజ్ కిద్భ్యః అను పంచమి, 'సన్' అను ప్రథమాంతమును "తస్మాదిత్యుత్తరస్య" అను నీ సూత్రముచే షష్ఠ్యంతమునుగా మార్పవలసి వచ్చును. అనిన,

కానిమ్ము. 'గుప్' 'తిజ్' 'కిత్' అను ధాతువుల కంటె బరమైన 'సన్' అనుదానికి, అని గదా ఆ సూత్రమున కర్థమగును ? దానికేమగును ? అని ప్రశ్న కలుగును గదా ! అంతర్యము వలన దాని కదియే ఆదేశమగునని సిద్ధించును. కావున వేరొక యాదేశమేదియు బ్రతి నిర్దేశింపబడదు. అందు వలన దోషములేదు.

అనిన నట్లు చెప్పుట కుదురదు. 'సన్' ప్రత్యయ నకారమునకు "హలన్త్యమ్" (1-3-3) అను సూత్రము చేత నిత్సంజ్ఞ రావలెను గదా ! దానికి వెనక సూత్రమయిన "ఉపదేశేజనునాసిక ఇత్" (1-3-2) అను సూత్రమునుండి 'ఉపదేశే' అను పదమిం దనువర్తించును. ఉపదేశమనగా నాద్యోచ్చారణము. ఉపదేశే=ఆద్యోచ్చారణ విషయే; సన్విధాయక సూత్రము నందున్న 'సన్' అను పదము పాణిన్యుచ్చారితము. కావున నది ఉపదేశ విషయమయినను నది షష్ఠ్యంతముగా మారినది. దాని స్థానమున "స్థానేంతరతమః" (1-1-49) అను పరిభాషచే ననుమీయమానమగు 'సన్' అనునది ఉచ్చారణ విషయము గాని నకారమున కిత్సంజ్ఞ సిద్ధింపక పోవును. అది దోషము.

స్థానియందున్న నకారమునకిత్సంజ్ఞా లోపములు ప్రవర్తించిన పిదప 'షష్ఠ...

అను శబ్దమునకు 'స' అనున దాదేశమనియు జెప్పనసువు పడదు. స్థానియగు 'సన్' అనునది ఉత్పత్తి కాలము నందే నివృత్తి కభిముఖమై యున్నదిగాన ప్రతిపన్నము గాన నందిత్సంజ్ఞ ప్రవర్తింపదు. ఆదేశమగు 'సన్' అనునదియు నిత్సంజ్ఞాదులకు నిరీక్షింపక యే ఆదేశమగును. ప్రయోగమునందే ఇత్సంజ్ఞాప్రసక్తి. అచటనే గదా కార్య ప్రసక్తి.

వా॥ "ప్రకృతి వికారా వ్యవస్థాచ" అని యాక్షేపాంతర వార్తికము.

ఈ ప్రకల్పకత్వ పక్షము నందు అభిమతమగు స్థానాదేశ వ్యవస్థ సిద్ధింపదని భావము. అవ్యవస్థ=వ్యవస్థాసిద్ధి, ప్రకృతి=స్థాని, వికారము=ఆదేశము.

"ఇకోయణచి" (6-1-77) అను సూత్రమునందలి 'అచి' అను సప్తమి పూర్వమున నున్న 'యణ్' అను ప్రథమకును షష్ఠిని ప్రకల్పించును. తస్మిన్నితి సూత్రము ప్రకల్పకము ఇపుడిక్కు స్థానమున యణాదేశము లభింపదు. ఇక్కుకు ఒక ఆదేశమును యణ్ణుకు వేరొక ఆదేశమును రావలసివచ్చును.

మఱియు, వా॥ "సప్తమీ పంచమ్యోశ్చ భావాత్ ఉభయత్ర షష్ఠీ ప్రక్లృప్తిస్త త్రోభయకార్య ప్రసఙ్గః"॥

అను వార్తికము ఈ పక్షమున దూషణాంతరమును ఆపాదించుచున్నది. సప్తమ్యంత పంచమ్యంత పదములు రెండును గల సూత్రము లందు, రెండు స్థలములందును షష్ఠీ ప్రక్లృప్తియు, విరోధము లేనందున నేకకాలముననే రెండు స్థానములకును రెండు కార్యములును ప్రాప్తించును.

"తాస్యనుదాత్తేన్ఙిదదుపదేశాల్ల సార్వధాతుక మనుదాత్త మహ్న్విఙోః" అనునది ఉభయ నిర్దేశములు గల స్థలము. ఇట 'తాసాృదిభ్యః' అను పంచమి, 'అసార్వ ధాతుకే' అను సప్తమిని, 'తస్మాదిత్యుత్తరస్య' అను పరిభాషచే, షష్ఠినిగా గల్పించును. అట్లే, ఆ సప్తమి 'తాస్యాదిభ్యః' అను పంచమికి షష్ఠిని 'తస్మిన్నను' సూత్రముచే కల్పించును. అపుడు, స్థానులకు భేదముండుటచే విరోధ ప్రసక్తి లేదు గాన, రెండు స్థానులకును, అనుదాత్తములను రెండు కార్యములును నేక కాలమున ప్రాప్తించును.

ఈ విధముగా, ప్రకల్పకత్వ పక్షమునందు, నాలు గాక్షేపములు.

సి. ప్రకల్ప మనుచో నియమము సిద్ధింపదు.

కొనడు. అట శబ్దమునందు కార్యమున కసంభవము ఈ వ్యాకరణమునవో అర్థమునందు కార్యము సంభవింపదు. "అగ్నేర్ఢక్" (4-2-33) అను సూత్రము ఢక్ అను ప్రత్యయమును ప్రకృతి పరముగా విధించుచున్నది అచట అగ్ని శబ్దార్థమగునిప్పుగడ్డకు బరముగా ఢక్ప్రత్యయముండుట సంభవరహితము. కాగా అంగార వాచక శబ్దములకంటె బరముగా నని యర్థముకావలను అగ్నివాచక శబ్దములు భాషలో నెన్నిగలవో వానియన్నిటికి బరముగా 'ఢక్' ప్రత్యయోత్పత్తి ప్రాప్తించుచున్నది. ఒక అగ్ని శబ్దమునకు బరముగా నది వచ్చుటయే ఇష్టము. అగ్ని పర్యాయ గ్రహణము సమ్మతముగాదు. యత్నము లేనిచో నా ఇష్టము సిద్ధింపదు. కావున నగ్నివాచక శబ్దముల కన్నింటికిని ప్రత్యయమును బ్రతిషేధించుటకు స్వంరూపవచనము.

ఇందుకొరకై యీ సూత్రము రచింపబడినది.

**వా॥ "నవా శబ్ద పూర్వకోహ్యర్థే సంప్రత్యయ స్తస్మాదర్థ నివృత్తిః"** అను వార్తికము, పై సమాధానమునకు నిరాకరణ రూపమయినది. వా=లేదా న=ఈ ప్రయోజనము దీనికి లేదు. అర్థ సంప్రత్యయః=అర్థప్రతీతి, శబ్ద పూర్వకః=శబ్ద జ్ఞానము పూర్వమున గలది, హి=కదా. శ్రోత కర్థ ప్రత్యయము శబ్ద జ్ఞానపూర్వకమని ప్రసిద్ధము అనుట. తస్మాత్=అందువలన, అర్థనివృత్తిః=అర్థవాచకములగు శబ్దాంతరములకు నివృత్తి కలుగును. శబ్ద మున్నంత మాత్రమున నర్థప్రతీతి కలుగదు. శ్రోత కాశబ్దజ్ఞానము కావలెను చాక్షుషాది ప్రత్యక్ష కరణములు సత్తామాత్రముచే విషయ ప్రత్యక్షమును గలిగించును. శబ్ద మట్లుకాదు. అది జ్ఞాతము కావలెను. శబ్దజ్ఞానము లేనిచో నర్థప్రతీతి కలుగదని లౌకిక వ్యవహారమువలన గూడ దెలియనగుచున్నది.

ఒకనిని 'రాముడా!' అని వేరొకడు పిలచెననుకొనుము. వానికామాట వినబడనపుడా సంబోధ్య వ్యక్తి "నన్నేమని పిలచితివి?" అని యడుగును. అది శబ్ద విషయక ప్రశ్న. దీనివలన నర్థప్రతీతికి ముందుగా శబ్దజ్ఞాన మావశ్యకమని వ్యక్తము. ఈ వ్యాకరణమునందు, శబ్దములందు కార్య ప్రవృత్తి ససంభవమే. అర్థమునందది యసంభవము. అట్టియెడ నర్థము నివర్తించి, శబ్దమునందే ఆ కార్యము ప్రవర్తించును. అపుడయినను దదర్థవాచక శబ్దములు దాని పర్యాయములన్నియు నుపస్థితములు గావు. ప్రత్యాసత్తివలన సంనిహితమును ఉపాత్త మునునైన శబ్దమునందే ఆ కార్యము ప్రవర్తించును గాన విప్రకృష్ట శబ్దాంతరములతో బని లేదు.

పోనిమ్ము. విధ్యర్థ మనావశ్యకమైనను, "అశబ్దసంజ్ఞా" అని చెప్పు నున్నాను గాబట్టి నిషేధ ప్రతియోగిగా జ్ఞానముకొరకు విధ్యంశము, న్యాయ

సిద్ధమయినను అనువాద రూపముగ వక్తవ్యమగును ఆ విధముగ స్వరూప విధి సప్రయోజన మనవచ్చునే? ఘు, ఘ-సంజ్ఞలలో స్వరూప విధి లేదుగదా? అనిన నదియు ప్రయోజనముగాదు. శబ్దసంజ్ఞా ప్రతిషేధమే వ్యర్థము.

**వా॥ "శబ్దసంజ్ఞా ప్రతిషేధానర్థక్యం వచన ప్రామాణ్యాత్"** అని వార్తికము.

శబ్దసంజ్ఞా ప్రతిషేధానర్థక్యం=శబ్ద శాస్త్రీయ సంజ్ఞల విషయమున స్వరూప విధి ప్రతిషేధ మనర్థకము. అట స్వరూపవిధి యేల కలుగకుండును? అనిన, వచన సామర్థ్యాత్=శబ్ద సంజ్ఞావచనము వ్యర్థము కావలసివచ్చును గాబట్టి. ఘ సంజ్ఞా ఘు సంజ్ఞా విధుల ప్రదేశములందు తరప్తమప్పులు, దాధాలు అను సంజ్ఞల ప్రత్యాయనము కలుగవలెననియేకదా సంజ్ఞాకరణము? స్వరూప గ్రహణమే యట గలిగిన నది వ్యర్థము అని వార్తిక తాత్పర్యము.

కాని వ్యాకరణ శాస్త్రమునందు ఉభయగతి=అనగా కృత్రిమాకృత్రిమములకు రెండింటికి గ్రహణ మచ్చటచ్చట, 'సంఖ్యా' 'కర్మ' 'కరణమ్'-ఇత్యాది సంజ్ఞలందగపడుచున్నది. వచన ప్రామాణ్యమువలన దాధాల ప్రతీతియు, తరప్తమప్పుల ప్రతీతియు గలుగనిమ్ము. స్వరూప గ్రహణమువలన సంజ్ఞా పదములగు ఘ, ఘు అను స్వరూపములును గ్రహింపబడును. అట్లుభయ గతి, వచనమునకు ప్రయోజనమననగునే?

అనిన నదియుగాదు. శబ్ద శాస్త్రీయ సంజ్ఞలందెచ్చటను స్వరూప గ్రహణము కలుగదని పాణిన్యాచార్య ప్రవృత్తివలన దెలియవచ్చుచున్నది. ఎట్లనగా- "ష్ణాంతాషట్" (1-1-24) అను సూత్రముచేత, షకారాంత సంఖ్యా వాచకమగు 'షష్' అనుదానికి గూడ నాతడు విధించియున్నాడు. సంజ్ఞా విధులందు స్వరూప గ్రహణము సమ్మతమయినయెడల, 'షష్' అనుదానికి స్వరూప సూత్రముచేతనే ఆ సంజ్ఞ సిద్ధించును గదా! మరల సంజ్ఞా విధానమెందులకు? శబ్ద శాస్త్రీయ సంజ్ఞలలో స్వరూప గ్రహణము లేనందుననే యాతడు షకారాంత సంఖ్యకు షష్ అను సంజ్ఞను విధించెను.

అది 'షష్' కాదు. 'షట్' అని టాతము సంజ్ఞ. అందు లేని జశ్త్వమసిద్ధమగును గాన సంజ్ఞా ప్రవృత్తి కాలమున 'షష్' అని షకారాంతమే సంజ్ఞాపదమని గ్రహింపుము. డకారాంతముగను టకారాంతముగను నది విన బడుచున్నను, జశ్త్వచర్త్వాదు లసిద్ధములగును. షకారాంతమే సంజ్ఞా స్వరూపము,

పరి. ఆ జ్ఞాపకమువలన శాస్త్రీయ శబ్దసంజ్ఞా విషయమున స్వరూప గ్రహణము కలుగదని తెలిసికొనవచ్చుననుకొనుము. శబ్ద పదార్థకములగు,అశాస్త్రీయ సంజ్ఞా పదములు. 'మంత్రే' ఋచి, 'యజుషి' మున్నగు కొన్ని సూత్రము లందుపాత్తములు. అట మంత్రశబ్దము పరమగునపుడు, 'ఋచ్' శబ్దము పరమగునపుడు, యజుశ్శబ్దము పరమగునపుడు అని యర్థము కాకుండుటకు 'అశబ్ద సంజ్ఞా' అనునది ఆవశ్యకమగునుగదా. అవియు శబ్ద పదార్థక సంజ్ఞా పదములే. అర్థసంజ్ఞలు కావుగదా యనిన,

వా॥ "మంత్రాద్యర్థ మితిచేచ్ఛాస్త్ర సామర్థ్యా దర్థగతేస్సిద్ధమ్" అను వార్తికముచే ఆ ప్రయోజనము నిరాకరింపబడినది.

శాస్త్ర సామర్థ్యాత్ = 'మంత్రే' 'ఋచి' 'యజుషి'- మున్నగు శబ్దముల నుచ్చరించి, విధించిన కార్యములకు, ఆయా శబ్దములు పరమగునపుడు సంభవము లేదు. కావున శాస్త్రము వ్యర్థము కావలసివచ్చుట వలన. అర్థగతేః = మంత్రాది శబ్దానువిద్ధమయిన యర్థమునకే అవగతి కలుగును గాన మంత్రాద్యర్థమయి "అశబ్ద సంజ్ఞా" అనునది అనావశ్యకమని, సిద్ధమ్ = సిద్ధించినది అని వార్తికార్థము.

## న్యూనతా పరిహార నిరూపణము

"స్వంరూపం శబ్దస్యా శబ్ద సంజ్ఞా" అను ప్రకృత సూత్ర మారంభింపబడినను గొన్ని న్యూనత గన్పడుచుండుటచే, వార్తికకారుడు తత్పరిహారార్థము నాలుగు వార్తికములను రచించెను. అవి-

(1) వా॥ "సిత్తద్విశేషాణాం వృక్షాద్యర్థమ్"

(2) ,, "పిత్పర్యాయ వచనస్య చ స్వాద్యర్థమ్"

(3) ,, "జిత్పర్యాయ వచనస్యైవ రాజాద్యర్థమ్"

(4) ,, "ఝిత్తస్యచ తద్విశేషాణాంచ మత్స్యాద్యర్థమ్" అనునవి.

(1) "విభాషా వృక్ష మృగ తృణ ధాన్య వ్యంజన పశు శకున్యశ్వ బడబ పూర్వాపరాధరోత్తరాణామ్" (2-4-12) అను సూత్రము వృక్షాదుల ద్వంద్వమునకు వికల్పముగ నేకవద్భావమును విధించునది. అచట వృక్ష పదముచేత వృక్ష విశేషములకే గ్రహణము సమ్మతము. 'వృక్ష' అను స్వరూపమట బోధ్యముగాదు. ఈ విశేషము సిద్ధించుటకు ఆ సూత్రమునందు సిసి శేషమును

జేయవలయును. అనగా 'వృక్షస్' 'మృగస్' అని పఠించిన నా సకారమిత్సంజ్ఞక మయి, వృక్ష మృగ పదములు సిత్తులగును. తరువాత, 'తద్విశేషములకే గ్రహణము కలుగును' అని చెప్పవలెను. వృక్షములలో ప్లక్షములును, న్యగ్రోధములును విశేషములు. వాని ద్వంద్వమునందే ఏకవద్భావము ప్రవర్తించును.

"ప్లక్ష న్యగ్రోధం ప్లక్ష న్యగ్రోధాః" అని వైకల్పికైకవద్భావ సిద్ధ రూపములు. "రురుపృషతమ్, రురుపృషతాః" అని మృగోదాహరణము.

ఈ వచనము న్యాయసిద్ధమే. అపూర్వముగాదు.

వృక్ష ద్వంద్వమనగా వృక్ష విశేషముల ద్వంద్వమే యగును. రెండు వృక్ష శబ్దములకు ద్వంద్వము ఏకశేషచేత బాధితమగును. వృక్ష పర్యాయములకును ద్వంద్వము రాదు. విరూపములయినను సమానార్థకములగుటచేత నట ఏకశేషయే రాదగును. సామాన్య వాచియగు వృక్ష శబ్దమునకును, విశేష వాచియగు 'ధవ' శబ్దమునకును ద్వంద్వమునకు ప్రసక్తియేలేదు. సామాన్యము విశేష బోధకమును నగును గాన వృక్ష శబ్దము ధవమునుగూడ బోధించును. అందువలన పదార్థభేదము లేనందున, చార్థమగు సాహిత్యమునకట సంభవములేదు. ఇక పరిశేష న్యాయముచే వృక్ష విశేషములకే అది సంభవించును. కాగా నీ వచనము న్యాయసిద్ధమని భావము.

(2) "స్వేపుషః" (3-4-40) అను సూత్రము ణముల్ప్రత్యయ విధాయకము. ఇందు స్వశబ్దము స్వరూప మాత్ర బోధకము గాదు. స్వరూపమునకును, పర్యాయములకును, విశేషములకును నది గ్రాహకము. 'స్వపోషం పుష్ణాతి' రైపోషం..., ధనపోషం..., అశ్వపోషం,..., గోపోషం...' ఇత్యాదులుదాహరణములు. 'స్వేన పుష్ణాతి'=స్వయముగ పోషించుచున్నాడు, మున్నగు రీతిగ నర్థము. కాగా పర్యాయ విశేషములకు గూడ గ్రహణము సిద్ధించుటకు, స్వశబ్దమును, సూత్రమునందు, పకారేత్సంజ్ఞకముగ నిర్దేశింపవలెను. తదుపరి, పర్యాయ వచనమునకును, తద్విశేషములకును గ్రహణము కలుగునని చెప్పవలెను. ఈ వచనము న్యాయసిద్ధము గాదు. కావున నీ విశేషము వాచనికమే. ఇది రెండవ వార్తికమునకు భావము.

(3) "సభా రాజామనుష్య పూర్వా" (2-4-23) అను సూత్రము రాజపూర్వకమును, అమనుష్య పూర్వకమును నగు సభా శబ్దాంత తత్పురుషము నపుంసక లింగమగునని చెప్పుచున్నది. ఉదాహరణము, ఇనసభమ్, ఈశ్వరసభమ్, రక్షస్సభమ్. పిశాచసభమ్—

ఇట రాజశబ్ద శబ్దముచే రాజ పర్యాయ వాచకమునకే గ్రహణమిష్టము. 'రాజ' అను స్వరూపమునకు గాని, రాజ విశేష వాచకములగు 'చంద్రగుప్త' మున్నగు వానికి గాని గ్రహణము సమ్మతము గాదు. ఆ విశేషము వచన విశేషసాధ్యము కావున, సూత్రమునందు రాజ శబ్దమును జకార మిత్సంజ్ఞకము గాగల దానిగా జేసి 'రాజజ్' అని పఠింపవలయును. అట్టి నిర్దేశమునకు ప్రయోజనము, 'పర్యాయ మాత్ర గ్రహణము' అనియు వచింపవలెను.

కావున, 'రాజ సభా' 'పుష్పమిత్ర సభా' 'చంద్రగుప్త సభా' అను స్థలములందు నపుంసకత్వము రాదు.

ఇదియు వాచనికమే యనుట యుక్తము.

(4) "ఝిత్తస్యచ తద్విశేషాణాంచ మత్స్యాద్యర్థమ్" అనునది నాల్గవ న్యూనతాక్షేప వార్తికము.

"పక్షిమత్స్యమృగాన్ హంతి" (4-4-35) అను సూత్రము ఠక్ప్రత్యయ విధాయకము.

పక్షిణో హంతి=పాక్షికః। శకునీన్ హంతి=శాకునికః। మయూరాన్ హంతి=మాయూరికః॥ మత్స్యాన్ హంతి=మాత్స్యికః। మీనాన్ హంతి=మైనికః। శకులాన్ హంతి=శాకులికః॥ మృగాన్ హంతి=మార్గికః। హరిణాన్ హంతి = హారిణికః। సారంగాన్ హంతి = సారంగికః॥ — ఇవి యుదాహరణములు.

సూత్రము నందు మూడు పదములు గలవు. ఒక్కొక్క దానికి మూడేసి యుదాహరణము .

ఇట సూత్రోపాత్తములగు, పక్షి, మత్స్య, మృగ శబ్దములకును, తద్విశేషములకును గ్రహణ మిష్టము. కనుక ఝిన్నిర్దేశము కర్తవ్యము. అనగా ఝకార మిత్సంజ్ఞక వర్ణముగా చేర్చి నిర్దేశింపవలెను. తదుపరి, 'దానికిని, దాని విశేషములకును గ్రహణము కలుగు'నని చెప్పవలెను. అట్లు చెప్పుటకు ప్రయోజనమేమనిన, 'మత్స్య' మున్నగు వాని కొరకు. 'మాత్స్యికః' = స్వరూపోదాహరణము 'శాఫరికః' 'శాకులికః' విశేషములకుదాహరణము.

శఫర, శకులములు మత్స్య విశేషములు. హూణ్యాలపు పఠనములకు

గ్రహణమసమ్మతము. కనుక 'అజిహ్మాన్ హంతి', 'అనిమిషాన్ హంతి'— అనుచో నది ప్రవర్తింపదు. కాని పర్యాయములలో నొక్క మీనశబ్దమునకు గ్రహణ మిష్టము. ఇది ప్రత్యేకేష్టి. కనుక మీనాన్ హంతి=మైనికః అని కావచ్చును.

వార్తికము నందు 'మత్స్యార్థ' మని అది పదము గ్రహింపబడినను నది వ్యర్థము. మృగముల విషయమునను, పక్షుల విషయమునను, పర్యాయ గ్రహణార్థము పిన్నిర్దేశము చేయవలసియే యున్నది. వార్తికమునందు, సూత్రమునందలి మూడు పదములలో, ఆద్యాంత్యములను వదలి మధ్యస్థమగు మత్స్యపదమును గ్రహించుట కదియే అభిప్రాయము.

కాగా, పక్షి, మృగ వాచకములలో, సూత్రోపాత్తముల కును, పర్యాయములకును, విశేషములకును గ్రహణము కలుగ వచ్చును.

మత్స్య శబ్ద విషయమున, స్వరూపమునకును, విశేషములకును, ఒక్క మీన శబ్దమునకు మాత్రము, పర్యాయము లందును గ్రహణము ప్రమాణ సిద్ధము.

సూత్రమున్న పక్షమున, బై వార్తికము లావశ్యకములు. లక్ష్యానుసారముగ వాని వాని సిద్ధి ప్రత్యాఖ్యాన పక్షమున గలుగును.

ఇందు విధ్యంశమును, నిషేధాంశమును రెండు గలవు. అందు, "స్వం రూపం శబ్దస్య" అను నంశము, "నవాశబ్ద పూర్వకోహ్యర్థే సంప్రత్యయ స్తస్మాదర్థ నివృత్తిః" అని యుపపాదించి నిరాకరింపబడినది. 'అశబ్దసంజ్ఞా' అను ప్రతి షేధము నవావశ్యకమని "శబ్ద సంజ్ఞా ప్రతిషేధానర్థక్యం వచన ప్రామాణ్యాత్" "మంత్రాద్యర్థ మితిచే చ్ఛాస్త్ర సామర్థ్యా దర్థగతే సిద్ధమ్" అని నిరూపింప బడినది.

కాగా నీ సూత్రము ప్రత్యాఖ్యాతము.

॥స్వంరూపం శబ్దస్యా శబ్ద సంజ్ఞా॥ సమాప్తము.

## అణుదిత్సవర్ణస్యచా ప్రత్యయః (1-1-68)

ప్రత్యయ భిన్నమగు అణ్వర్ణమును, ఉదిత్తును, సవర్ణమునకు సంజ్ఞ = గ్రాహకమగును.

ప్రత్యయమనగా నేమి ?

ప్రత్యయ సంజ్ఞకమా ? ప్రత్యయ పద గ్రాహ్యము ? లేక— విధింపబడునది ప్రత్యయమని యౌగికార్థమా గ్రహింపదగినది ? అని ప్రశ్న. సమాధానము — 'రూఢ్యర్థమే గ్రాహ్యము', అను తలంపుతోనే ప్రత్యయ పదము సూత్రమునందు భేద ప్రతియోగిగా పాణినిచే గ్రహింపబడినది.

"ననాశంన భిత ఉః" (3-2-168) అను సూత్రముచే విధింపబడిన 'ఉ' ప్రత్యయమును, "అసాంప్రతికే" (4-3-9) అను సూత్రముచే విహితమయిన 'అ' అను ప్రత్యయమును సవర్ణ గ్రాహకములు కారాదు.

అట్లైన, 'నప్రత్యయః' అనుట అత్యల్పమగునే ? ప్రత్యయముల వలె, ఆదేశములును, — టిత్తులును, కిత్తులును, మిత్తులునగు ఆగమములును గూడ సవర్ణ గ్రాహకములు కారానివి గలవు గదా ? అట్టి యెడ, "అప్రత్యయాదేశ టిత్కిన్మితః" అని చెప్పవలయును గదా? చూడుడు. "ఇదమ ఇశ్" (5-3-3) అను సూత్రముచే విధింపబడిన 'ఇ' అను నాదేశమును, 'ఇతః' 'ఇహ' అను లక్ష్యములందు సవర్ణ గ్రాహకము కారాదు. లేకున్న నది త్రిమాత్రికము రావలసివచ్చును.

'లవితా' 'లవితుమ్' అను లక్ష్యములందు ఇడాగమము. దీర్ఘము రావలసి యుండెడిది.

'బభూవ' అనుచో వుగాగమము అనునాసికము ప్రాప్తించుచున్నది. 'హే అనడ్వన్' అను స్థలమున ప్రవర్తించిన "అమ్సంబుద్ధౌ" (7-1-99) అను నమాగమము 'ఆమ్' గా గూడ ప్రవర్తింపవలసివచ్చును

టిత్తుకు పరిహారము కలదు— పాణిన్యాచార్య ప్రవృత్తివలన టిత్తులగు నాగమములు సవర్ణ గ్రాహకములు కావని దెలియుచున్నది. ఆతడు "గ్రహోలిటిదీర్ఘః" (7-2-37) అను సూత్రముచే గ్రాహధాతువు కంటె బరమైన ఇడాగమమునకు లిడ్భిన్న స్థలములందు దీర్ఘమును విధించుచున్నాడు. ఇడాగమ రూపమగు ఆ అక్షు గూడ సవర్ణ గ్రాహకమయిన యెడల దీర్ఘ విధానము వ్యర్థము గదా. దాని వలన టిత్తులు సవర్ణ గ్రాహకములు కావని చెప్పవచ్చును.

అనిన నట్లు గాదు. ఆ దీర్ఘము వ్యర్థము గాదు. ఇపుడది నియమార్థమగును. సవర్ణ గ్రహణముచే సిద్ధించుచుండగా ఆరంభింపబడినదియగుట వల

నది 'గ్రహాధాతువున నార్ధధాతుకమునకు వచ్చునట్టి ఇడాగమము దీర్ఘమే గాని హ్రస్వము రాదు అని యిట్లు నియమమును బోధించును. కావున నది సవర్ణ గ్రహణ నిషేధమునకు జ్ఞాపకము గాదు.

అట్లయిన, "వౄతోవా" (7-2-38) అను సూత్రము చేత జేయబడిన వైకల్పిక దీర్ఘ శాసనమపుడు టిత్తులు సవర్ణ గ్రాహకములు కావని జ్ఞాపక మగును.

"భావ్యమానము=విధీయ మానమగు దానిచే సవర్ణములకు గ్రహణము కలుగదు" అను నిషేధముచే సవర్ణ గ్రహణము కలుగదు అనునది, టిత్తులకే గాక యన్నిటికిని పరిహారము. ఇది పరిభాష, అణుదిత్సూత్రముచేతను, జాతి గ్రహణముచేతను, గుణములు భేదకములు కావు' అను సిద్ధాంతమును పురస్కరించుకొనియు ప్రాప్తమగు సవర్ణ గ్రహణమును, అణ్ అనణ్ సాధారణముగ వారించుటకు ఇది ఆవశ్యకము కాన సూత్రమున అప్రత్యయ పదముగాని, 'అప్రత్యయాదేశ' ఇత్యాద్యది వార్త్తికముగాని ఆవశ్యకములు కావు.

ప్రత్యయముల విషయమున అధికముగ పరిహారాంతరమును కలదు. 'ప్రత్యయః'- అను సంజ్ఞ అర్థానుగతము. అర్థ ప్రత్యయకమగునది ప్రత్యయము. 'ఉ' 'అ'- అనునవియు సవర్ణములను గ్రహించినచో అవియు ప్రత్యయములనబడుటకు అర్థప్రత్యాయకములు కావలెను. అట్లగుట లేదుకదా. అర్థానభిధానమువలన అవి సవర్ణ గ్రాహకములు కావు.

పోనిండు. అప్రత్యయ గ్రహణమున కిది ప్రయోజన మనవచ్చును. వర్ణములందు కొన్ని ప్రతీయమానములు. మరికొన్ని ప్రత్యాయ్యమానములు. ఇట ప్రతీయమానములు సవర్ణములను గ్రహించుట సమ్మతముగాని, ప్రత్యాయ్యమానములచే తద్గ్రహణము నభీష్టముకాదు. ఆ విషయము నెరింగించుటకు అప్రత్యయ గ్రహణము చేయబడినదనవచ్చును. 'ప్రత్యాయ్యతే అనేనేతి ప్రత్యయః'. అందు హ్రస్వములు ప్రతీయమానములు. అనగా సాక్షాచ్ఛ్రూయమాణములు. అవి దీర్ఘములకు గ్రాహకములు గాన దీర్ఘములు ప్రత్యాయ్యమానములు. 'అప్రత్యయ' అనుదానిచే "ప్రత్యాయ్యమానేన సవర్ణానాం గ్రహణం న=ప్రత్యాయ్యమానములు సవర్ణములను గ్రహింపవు" అని చెప్పుట అనుట. ఇణ్ ధాతువాపదమునందు, అంతర్భావిత ణ్యర్థమనుట. "అష్టన ఆ విభక్తౌ" (7-2-84) అను ఆకారము ప్రత్యాయ్యమానము. అది ప్రతీయమానము కాదు. అయ్యది సవర్ణములను గ్రహింపదు. అప్రత్యయ పదము లేనిచో, ఆకారము అణ్ణగుటచే రపరత్వాదులను బొందినట్లు గ్రాహకత్వమును గూడ పొందెడిది,

అది గ్రాహకమయిన ఏ సవర్ణమును గ్రహించునందువు ? హ్రస్వమును గ్రహించును.

అట్లైన ఆ సూత్రమును, అష్టన అవిభక్తౌ అనియే రచింపవచ్చునుగదా! యత్నాధిక్యముచే దీర్ఘమును ఎందుల కుచ్చరింపవలెను ? కావున అది హ్రస్వమును గ్రహింపదు.

పోనిమ్ము, దీర్ఘమును గ్రహింపకున్న ప్లుతమును గ్రహించును. అనిన, అణ్ణు కాదుగాన గ్రహింపదు అని సమాధానము. అణుదిత్సూత్రమున వణ్పదముచే ప్రత్యాహార సూత్ర నిర్దిష్టమే గ్రహింపబడును. అనగా హ్రస్వములే అణ్ణులు. అవియే సవర్ణములను గ్రహించును. "అస్య చ్వౌ" (7-4-32) అను సూత్రమునందు గ్రహణక శాస్త్రము ప్రవర్తించి దీర్ఘాకారాదులకును ఈత్వమును బోధించును. అట్లే "యస్యేతిచ" (6-4-148) అను సూత్రముచే విధింపబడిన లోపము హ్రస్వా వర్ణమునకు వలెనే దీర్ఘము మున్నగువానికిని సిద్ధించును. అంతియేకాని తనయందే తానీ సూత్రము ప్రవర్తింపదు. తనకు తానే లక్ష్యము కాదనుట. దానికి హేతువు అనిష్పాదము. అదియే వాక్యార్థా పరిసమాప్తి. అనిష్పాదమనగా సూత్రము లేకుండుటగాదు. సూత్రమున్నను అర్థబోధ నిష్పత్తి లేకుండుట. వేరొక గ్రహణక శాస్త్రము లేదాయె. అది యుండినగదా ఇందది ప్రవర్తించి అకారాదులచేత అకారాదులకు గ్రహణమీ సూత్రమునను సంభవమయ్యెడిది? కావున "అష్టన ఆ విభక్తౌ" (7-2-84) అను సూత్రమునందలి ఆకారము సవర్ణమయిన ప్లుతమును గ్రహింపదు గాన అప్రత్యయ పదము వ్యర్థమగుచు, "భావ్యమానేన సవర్ణానాం గ్రహణం న" అను పరిభాషను జ్ఞాపనచేయును.

భావ్యమానమనగా విధీయమానము. అట్టి వర్ణముచేత స్వ సవర్ణములు గ్రహింపబడవు అని యర్థము. ప్రత్యయ సూత్రపరమగు ప్రత్యయపదము 'విధీయమానము' అను సామాన్యార్థము నెట్లు బోధించునను శంక కలుగును. ప్రత్యయ పదమునకు 'ప్రతీయతే ఇతి ప్రత్యయః' అని విగ్రహమును గ్రహించిన నా యర్థము లభించును. 'ప్రతీయతే' అనగా 'విధీయతే' అని యర్థము. 'అప్రత్యయః' అను ప్రతిషేధమును శాసించుటచేత పాణిన్యాచార్యుడు ఈ పరిభాషను, యౌగికార్థాశ్రయణముచే బోధించుచున్నాడని యర్థము. వైయర్థ్యమూలకమగు అపూర్వార్థ కల్పనమని యర్థముకాదు.

లేదా, అట్లును జెప్పనగును. ప్రత్యయము విషమున సవర్ణ గ్రహణాభావము నంగీకరించుటచే, 'ఏకదేశానుమత్యా సర్వానుమతిః' అను న్యాయ రీతిగా సకల భావ్యమానములకును సవర్ణ గ్రహణాభావమును జ్ఞాపనము చేయుననియు చెప్పవచ్చును.

# అణ్ గ్రహణ ప్రయోజన విచారము

ఈ సూత్రము ఎందులకు రచింపబడినది ? అని ప్రశ్న. ఇందు రెండంశములు గలవు. అణ్ణు సవర్ణమునకు గ్రాహకమగుననునదొకటి. ఉదిత్తు సవర్ణమునకు సంజ్ఞ యగుననునదియు నింకొకటి. అందు 'అణ్ సవర్ణస్య' అను నంశమెందులకు ? ప్రత్యాహార సూత్రములందును, "అస్యచ్వౌ" మున్నగు సూత్రములందును ఆకృతియే నిర్దేశింపబడినదిగదా! కావున తజ్జాతీయములకెల్ల గ్రహణము లభించును. కాగా 'అణ్ సవర్ణస్య' అనుదానికేమి ప్రయోజనము? అని తాత్పర్యము.

'ఉదిత్సవర్ణస్య' అను అంశమునకు ఈ ప్రశ్న సంబంధింపదు. అత్వము, ఇత్వము మున్నగు జాతులవలె చుత్వమత్వాది జాతులు ప్రమాణ సిద్ధములు కావు. కావున ఆకృతి నిర్దేశమువలన సవర్ణ గ్రహణమట సిద్ధింపదు. కావున ఆ యంశ మావశ్యకమైనను, 'అణ్ సవర్ణస్య' అను నంశము ఆవశ్యకము కాదని యాక్షేపము. దీనికి సమాధానముగా పఠింపబడిన వార్తికము "అణ్ సవర్ణస్యేతి స్వరానునాసిక్య కాలభేదాత్" అనునది.

వ్యక్తి నిర్దేశ పక్షమునందది ఆవశ్యకమని సమాధానము.

ఆ పక్షమున, స్వర భేదమువలనను, అనునాసిక్య భేదమువలనను, హ్రస్వదీర్ఘాది కాల భేదము వలనను, భిన్నములయిన వానికి గ్రహణము ప్రాప్తించుటలేదు. అందులకు ఆ యంశము ఆవశ్యకము.

అకార మొక్కటియే వ్యక్తి. ఇక ఇది యుదాత్తము, ఇది అనుదాత్తము అను వ్యవహార ఉపాధి కృతము అని ఒక పక్షము. ఈ పక్షమునందైనను, ఔపాధిక భేదముచే వర్ణములు భిన్న భిన్నములగుట వలన సూత్రము తప్పదు. ఇక అకారాదివ్యక్తు లనంతములను పక్షమున తదావశ్యకత అప్రధృష్యమే కదా.

**వా॥ తత్రప్రత్యాహార గ్రహణే సవర్ణా గ్రహణ మనుపదేశాత్"** అని ఆక్షేప వార్తికము.

'అకః సవర్ణే'— అను సూత్రమున 'అకః' అనియు, 'ఇకోయణచి' అను సూత్రమున 'ఇకః' అనియు, "అణోప్రగృహ్యస్య" ఇత్యాదులందు 'అణః' అనియు, ఇట్లు 'అక్' మున్నగు ప్రత్యాహార సంజ్ఞలచే ఇకారాదుల ప్రత్యా

యనము చేయబడుచున్నది. అట్టి స్థలములందు ఆ ఇకారాదులచే వాని సవర్ణములయిన దీర్ఘాదులకు గ్రహణము కలుగదు. ఏక కాలముననే ఇకారాదులు ప్రత్యాయ్యములును ప్రత్యాయకములును కాజాలవు. దానికి కారణము అనుపదేశము. అనగా అనుచ్చారణము. "ఆదిరంత్యేన సహేతా" (1-1-71) అను సూత్రముచే, ఆ సంజ్ఞలు హ్రస్వములకే చేయబడినవిగాని దీర్ఘములకుగాదు అని ఆ యాక్షేప వార్తిక తాత్పర్యము. ఇట 'అఇఉణ్' మున్నగు సూత్రములందు, దీర్ఘము లుచ్చరింపబడలేదు కాబట్టి అనిగాని 'అకః' 'అచి' మున్నగు పదములందు ఇకారాదు లుచ్చరింపబడలేదు కనుక అనిగాని యర్థము.

ఏమయ్యా! హ్రస్వములు తాము ప్రతీయమానములగుటచే దీర్ఘములను ప్రత్యాయనము చేయవచ్చునుగదా! ఉచ్చార్యమాణములే ప్రత్యాయకములు గావలెనను మాటలేదు. బుద్ధి సన్నిహితములేవియైనను ప్రత్యాయకములు కావచ్చును. లేనిచో మౌనముగ పుస్తకములను చదువువారలకు అర్థప్రతీతి కలుగకపోవలసి యుండును. శబ్దములు ఉపస్థితి విషయములయి అర్థబోధకము లగును. ఆ ఉపస్థితి ప్రత్యక్షరూపమే కానక్కరలేదు. అది స్మృతి రూపమును కావచ్చును. లిపిని చూచి పదములను స్మరించినపుడును అర్థబోధ కలుగు చున్నది. ఆ సంనిధానము=ప్రతీతి ఉచ్చారణముచే కొన్ని యెడలను, సంజ్ఞలచే కొన్ని యెడలను ఉండును. కావున మీ ఆక్షేపమెట్లు ఉపపన్నమగును? అనిన, ఆక్షేప సాధకముగ వార్తికాంతరము,

"హ్రస్వ సంప్రత్యయాదితిచే దుచ్చార్యమాణ శబ్ద సంప్రత్యాయకత్వాచ్ఛబ్దస్యావచనమ్" అనునది.

హ్రస్వ సంప్రత్యయాత్=ప్రతీయమానములగు హ్రస్వములచేత దీర్ఘములకు ప్రత్యాయనము కలుగుననిన కుదురదు. ఉచ్చరింపబడు శబ్దమే అర్థబోధకమగును గాని ప్రతీయమానము కాదు. అందువలన, 'శబ్దస్యావచనమ్=ప్రతీయమాన శబ్దముచే శబ్దాంతరమునకు వచనమనగా ప్రత్యాయనము సంభవింపదు' అని వార్తికార్థము. "ఇది ఋక్కు" అనిన 'అగ్నిమీళే' ఇత్యాది సంపాఠము మాత్రమే ఉపస్థితి విషయమగును కాని దాని అర్థము గమ్యము కాదు,

'బయట కుచ్చరింపకుండ గ్రంథావలోకనము చేయువారుగూడ జపములు చేయువారలవలె సూక్ష్మోచ్చారణమును జేయుచునేయుందురు. జపములందుగూడ మంత్రము లుదాత్తానుదాత్త స్వరములతో నుచ్చరింపబడవలెను గదా. తాల్వాది స్థానములందుచ్చ నీచ దేశముల నిష్పన్నములే ఉదాత్తాదులు.

కావున నచ్చటను, స్వీయ సూత్రోచ్చారణ మపరిహార్యము' అని యీ ఆక్షేప సాధక వార్తికాంతర్యము.

'అక్షైన వర్ణపాఠమునందే ఉపదేశము చేయబడును' అని సమాధానము. వర్ణ పాఠమనగా 'అఇఉణ్' మున్నగు ప్రత్యాహార సూత్రపాఠము. అందే అకారాదులచే ఆకారాదులకు గ్రహణము కలుగును గాన వానికిని 'అక్' మున్నగు సంజ్ఞావదములచే గ్రహణము కలిగింపబడును. ఉపదేశము=ప్రత్యాయనము చేయబడుట=వ్యాఖ్యానింపబడుట. ఆ ప్రత్యాయన మీ అణుదిత్సూత్రముచే జేయబడును.

ఈ సమాధానమునకు బాధకమగు వార్తికము.

**వా॥ వర్ణ పాఠ ఉపదేశ ఇతిచేదవరకాలత్వాత్పరిభాషాయా అనుపదేశః" అని.**

అఇ ఉణాది సూత్రములందే అకారాదులచే ఆకారాదుల ప్రత్యాయనము చేయబడుననిన అది కుదురనిమాట. ఈ పరిభాష అనగా 'అణుదిత్సవర్ణస్య' అను సంజ్ఞ అవరకాలమగుటవలన=తరువాతి దగుటవలన, అనుపదేశః=ప్రత్యాయనము సంభవింపదు అని వార్తికార్థము. ఉపదేశాదు లంగము లన్నియు నిష్పన్నములయిన పిదప నీ సూత్రముచేత, "అస్య చ్వౌ" (7-4-32) అను మున్నగు స్థలములందు సవర్ణ గ్రహణము కలుగునుగాని స్వాంగములగు నుపదేశాదులందుగాని, తనయందే అనగా అణుదిత్సూత్రమునందేగాని ఇది ప్రవర్తింపదు.

ఈ సూత్ర మవరకాలమనగా ప్రత్యాహార సూత్రమనాదియును, ఇది పాణినికృతమగుటవలనను నవరకాలికమనియును భావమా ?

కాదు సర్వథా అవరకాలమే. అనగా శబ్ద క్రమముచేతనేగాక అర్థ క్రమమువలనను అవరకాలికమే ఎట్లన-

మునుముందు వర్ణోపదేశము. ఉపదేశానంతర మిత్సంజ్ఞ, ఇత్సంజ్ఞ ప్రవర్తించిన తరువాత "ఆదిరంత్యేన సహేతా" (1-1-70) అని ప్రత్యాహారము. తరువాత సవర్ణ సంజ్ఞ. సవర్ణ సంజ్ఞోత్తర కాలమున 'అణుదిత్సవర్ణస్య' అను సూత్రముచేత, "అస్యచ్వౌ"(7-4-32) ఇత్యాదులందు సవర్ణ గ్రహణము, అప్పటి అంగములన్నియు నిష్పన్నములగును గాన కలుగును. స్వ, స్వాంగము లందు ప్రవర్తింపకుండుటకు, వాక్యార్థానిష్పత్తియే కారణము. ఇట్లిది ఉపదేశోత్తర కాలికము గాన అఇఉణ్ సూత్రమునందు ఇదియే ఆకారాది వర్ణముల ప్రతీతిలో నిమిత్తభావమును పొందుట అసంభవము.

**వా॥ "తస్మా దుపదేశః"**- అని సమాధాన బాధక వార్తికశేషము. ప్రత్యాహారమునందే దీర్ఘ ప్లుతములకు గూడ నుపదేశము కర్తవ్యమేయనుట.

'అఇఉణ్' మున్నగు ప్రత్యాహార సూత్రములందు సవర్ణ గ్రహణము నకీ సూత్రముతో బనిలేదని వ్యక్తము. ఇక అనువృత్తి నిర్దేశ స్థలములందును దీనికి పనిలేదని, **వా॥ "తత్రానువృత్తి నిర్దేశే సవర్ణా గ్రహణమనణ్త్వాత్"** అను వార్తిక ముపపాదించుచున్నది.

అనువృత్తి నిర్దేశములనగా, "అస్యచ్వౌ" (7-4-32), "యస్యేతిచ" (6-4-148) మున్నగునవి. వృత్తి=వర్ణ సమామ్నాయము. దాని ననుగతమయి నది అనువృత్తి. వృత్తి వంటిదనుట. అది అకారాదికము దానికి 'నిర్దేశము' అనగా స్వరూపోచ్చారణము. అట్టి స్థలములందు, ఆ అకారాదులు అణ్ణులు కావు గాన వానికి గ్రహణము సిద్ధింపదు. వర్ణ సమామ్నాయమున నుచ్చరింప బడినవే అణ్ణులగునుగాని, అనువృత్తి నిర్దేశములందలివి కావు. అకార వ్యక్తు లనంతములు అవాంతర భేదముచే భిన్న భిన్నములు అని ఆక్షేప వార్తిక తాత్పర్యము.

అటులైన వచన సామర్థ్యమువలన సవర్ణ గ్రహణము కలుగును. అనువృత్తి నిర్దేశ స్థలములందలివి అణ్ణులు కానందునను, 'అక్' 'అచ్' ఇత్యాది ప్రత్యాహార గ్రహణ స్థలములందలివి అనుచ్చారణమువలనను, సవర్ణ గ్రాహ కములు కానిచో ఇక నీ సూత్రమే వ్యర్థమగునుగదా ! అది వ్యర్థము కాకుండుటకు, అణ్పదము లక్షణావృత్తిచే "అణ్ వంటిది" అను అర్థముగలది అగును గాన ఆ ఆక్షేపము ప్రసక్తముకాదు. అనిన

**వా॥ వచనాద్యత్ర తన్నాస్తి"**- అని యాక్షేప సాధక వార్తికము.

ఇది వచన సామర్థ్య లభ్యముకాదు. వచనమునకు ప్రయోజనాంతరము గలదు. ప్రత్యాహారముల ఆది వర్ణములు స్వసవర్ణములను గ్రహించుటకు వచన మావశ్యకము. 'అకః' 'అచి' ఇత్యాదులందు, అనుబంధ వర్ణములగు కకార చకారములవలన అకారములు ప్రత్యాహారస్థములే నిర్దిష్టములని తలంచుట కవకాశముకలదు. కావున అవి అణ్ణులగును. వానికి ఉచ్చార ణమును కలదు. 'అనణ్త్వము, అనుపదేశము అను పూర్వోక్త హేతువులు అచ్చట లేవు. అందు ఉచ్చరింపబడిన అకారము, 'ఆదిరంత్యేన సహేతా' అని మధ్య పతితములకును స్వరూపమునకును సుగ్రాహకమయినట్లు సవర్ణములకు గూడ నీ వచనముచే గ్రాహకమగును' అని భావము. ప్రత్యావర్త్యబంధముచేత, వ్యక్తి పక్షమున సూత్రము నారంభించినను ఇష్టసిద్ధి కలుగకందున ఆకృతిపర కమే గ్రాహ్యమని తెలినది.

ఆకృతి పక్ష మవలమ్బ్య గ్రాహ్యమయినప్పుడిక సూత్రమును వ్యర్థమే అను నాశయముతో సిద్ధాంత సమాధాన పరమును, అణ్గ్రహణ ప్రత్యాఖ్యాన రూపము నగు వార్తికము— **"సవర్ణేఽణ్గ్రహణ మపరిభాష్య మాకృతి గ్రహణాత్"** అనునది అవతరించినది.

సవర్ణే=సవర్ణ గ్రాహక సూత్రమునందు, అణ్గ్రహణమ్='అణ్ సవర్ణస్య' అని చెప్పబడిన సవర్ణ గ్రహణము. అపరిభాష్యమ్=అవచనీయము. ఎందు వలన ? 'ఆకృతి గ్రహణాత్' = ఆకృతియే ఉపదేశింపబడినందున.

'అ ఇ ఉణ్' మున్నగు సూత్రము లందును, "అస్యచ్వౌ" (7-4-32) మున్నగు చోట్లను, ఆకృతియే ఉపదేశింపబడినది ఆకృతి యనగా జాతి. వ్యక్తి నుచ్చరింప కుండగ జాత్యుచ్చారణము అసంభవము కాన తదుచ్చారణము పరిహార్యము. హ్రస్వ, దీర్ఘ, ప్లుతాకారము లందుండు అత్వము అను జాతి ఒక్కటియే గోవ్యక్తులందు గల గోత్వము, వ్యక్తులు స్థూలములయినను, కృశములయినను, తెల్లనివైనను, నల్లనివైనను, ఏకమే గాని వేరు వేరు కాదు గదా.

అది యెట్లు ? అకారమునకును, ఆకారమునకును శ్రవణోపలబ్ధిలో భేదము కలదు గదా. కావున అత్వము వేరు. ఆత్వము వేరును కాదా అనిన, సమాధాన వార్తికమునకు ద్వితీయ ఖండముగా, **"అనన్యత్వాచ్చ"** అని పఠింపబడినది

అకార, ఆకారముల ఆకృతి అనన్యము శ్రుతి భేదమున్నను ఏకాకృతి యోగమే వానికి కలదు. అకారము హ్రస్వమయినను దీర్ఘమయినను, 'ఇది హ్రస్వాకారము' 'ఇది దీర్ఘాకారము' అని యిట్లు అత్వజాతి సమానాధికరణముగు అనుభవమే కలదు. శ్రుతిభేదము వలన వ్యక్తి భేదము సిద్ధించినను జాతి భేదము ప్రాప్తింపదు.

కాగా ఉపదేశింపబడిన అవర్ణాకృతి అవర్ణకులము నంతను గ్రహించును. ఇవర్ణో వర్ణా ధ్రుతులును అట్లే. కావున సూత్రముతో పని లేదని భావము.

వా॥ **"అనేకాంతోహ్యనన్యత్వ కరః"** అని వార్తికాంతరము.అనేకాంత భేదమనగా అనియత భేదము. అది అన్యత్వమును స్ఫురింపజేయదు. గోవ్యక్తుల భేదము గోత్వజాతికి భేదమును బోధింపదు గదా. గవాశ్వముల భేదము నియతభేదము అది వాని జాతులకును భేదమును బోధించును.

వేరొక వార్తికకారుడీ వార్తికములను కించిద్భేదముతో బఠించెను.

"సవర్ణగ్రహణ మపరిభాష్య మాకృతి గ్రహణాదనన్యత్వమ్" అని ఒకటే వార్తికమా పాఠమున నగపడుచున్నది.

ఆకృతి గ్రహణము వలన నభేదము వ్యక్తులకు సిద్ధించును. ఆకారా కృతియు అకారాకృతియు నొక్కటియే. ఆ అనన్యత్వము అణ్గ్రహణమక్కర లేదనుటకు హేతువు.

ఆకృతి గ్రహణమనగా జాతిని విశేషణముగ నాశ్రయించుట. దాని వలన ఏకాకారమగు ప్రతీతి కలుగును అని యీ పాఠమున నర్థము.

పూర్వ వార్తికమున అణ్గ్రహణాకరణమునకు ఆకృతి గ్రహణము హేతువు. ఆ ఆకృతికి కూడ భేదము కలదను శంక కలుగ కుండుటకు "అనన్యత్వాచ్చ" అను వార్తిక ఖండము ఉపాత్తము.

వా॥ "తద్వచ్చ హల్గ్రహణేషు" అని జాత్యాశ్రయణావశ్యకతా సూచకము.

తద్వత్ = ఆకృతి గ్రహణమువలన అణ్విషయమున సవర్ణ గ్రహణము సిద్ధించినట్లు హల్విషయమునను ఆకృతి గ్రహణము వలననే కార్యసిద్ధి కలుగును.

"ఝలోఝలి" (8-2-26) అను సూత్రము ఝల్వర్ణమునకు పరమైన సకారమునకు ఝల్వర్ణము పరమగునపుడు లోపమును విధించుచున్నది. 'అవాత్తామ్' 'అవత్తమ్' 'అవాత్త' అని ఉదాహరణములు. అవాత్+స్+తామ్ అను నవస్థలో సకారమునకు లోపము రావలెను.

ఇట ఝల్లు అనగా తకారము. అది ఆప్రత్యాహారమున చేరియున్నది. 'ఖఫ, ఛఠ, థచ, ట, తవ్' అను సూత్రమున ఉచ్చరింపబడిన దొక్కటియే ఝల్లగును పరముగా ఉన్నది కాదు. లేదా పూర్వము గాదు. ఆ తకార సవర్ణతకారములను అణుదిత్సూత్రముచే గ్రహించుననుటకు అది అణ్ణు కాదాయె. కాగా జాత్యాశ్రయణమే శరణ్యము. జాతి నిర్దేశ పక్షమున పూర్వ పద త కారములు రెండును ఝల్లులగును. కాన లోపము సిద్ధించును. వస=నివాసే ధాతువు. లుఙ్, తస్=తామ్ వృద్ధి "సస్యార్ధధాతుకే" — అని ధాతుతకారమునకు తాదేశము. తరువాత ప్రకృత లోపమును అట ప్రక్రియ.

వా॥ "అనేకాంతో హ్యనన్యత్వకర:"— ఈ వార్తిక మిట పఠితము. వ్యాఖ్యాతృత పూర్వము ధాతు ప్రత్యయావయవ తకార వర్ణకృతులకు భేదమున్నను నది అనేకాంతము గదా. కనుక నది భేదకముగాదు. ఝత్వమను ధర్మము వాని యందు ప్రత్యభిజ్ఞను కలుగజేయును.

వర్ణములన్నియు మధ్యమ వృత్తిలో నుపదేశింపబడినవి. కాని ఇతర వృత్తులలో పఠింపబడిన వానికిని గ్రహణము సిద్ధింపవలెను. అది ఆకృత్యుపదేశము వలన సిద్ధించునను తాత్పర్యముతో నొక వృత్తి యందే తదుపదేశము చేయుబడినది. కావున ఆకృత్యుపదేశము ఉద్దిష్టమని విదిత మగు చున్నది.

వా॥ "వృత్తి పృథక్త్వంతు నోపపద్యతే" — అని వేరొక ఆక్షేప వార్తికము.

వృత్తియనగా హ్రస్వ దీర్ఘాదికాల ప్రమాణము. తద్ధేతుకమయిన పృథక్త్వము ఉపపన్నము గాదు అని వార్తికార్థము. అందువలన 'ఖట్వాభి:' అనుచో దీర్ఘాకారమునకు పరమైన భిస్ ప్రత్యయమునకు కూడ, హ్రస్వాకారముకంటె పరమైనదానికి విధింపబడిన 'ఐస్' అను నాదేశము ప్రసక్తమగు చున్నదని ఆక్షేప వార్తిక తాత్పర్యము.

"వా॥ "తస్మాత్తత్ర తపర నిర్దేశాత్సిద్ధమ్" అని ఆక్షేపోపసంహార వార్తికము. ఆ ఆపత్తిని వారించుటకై ఐసాదేశ విధాయక శాస్త్రము నందు తపర నిర్దేశము కర్తవ్యము అని యాక్షేప భావము.

తపర నిర్దేశ మపూర్వముగ జేయనక్కరలేదు. అది పాణిని చేసియే యున్నాడు. "అతోభిసఐస్" (7-1-9) అనియే న్యాసము.

వ్యక్తి పక్షమున సూత్ర ప్రాప్తమగు సవర్ణ గ్రహణమును, జాతి పక్షము నందాకృతి గ్రహణ ప్రాప్తమును వారించుట కది యవశ్య కర్తవ్యము. ప్రకృత సూత్రమున 'అణ్ సవర్ణస్య' అనునని గ్రహణ వ్యాఖ్యాతమైనను 'ఉదిత్సవర్ణస్య' అను నంశ మావశ్యకమే. వర్గీయాక్షరములకేకాకృతి యోగము లేదు గదా.

॥అణుదిత్సవర్ణస్య చాప్రత్యయ:॥

## "తపర స్తత్కాలస్య" (1-1-69)

తపరమగు వర్ణము తత్కాలమునకు సంజ్ఞ=గ్రాహకమగును అనగా ఉచ్చార్యమాణమగు వర్ణము యొక్క కాలము వంటి కాలముగల వర్ణమునకని

అర్థము. అట్టి అర్థమున ఈ 'తత్కాలస్య' - అను నిర్దేశము అయుక్తము. 'అది కాలముగాకలది' అని గదా దాని యర్థము. అది అనగా కాలము. కాల శబ్దముతో సమానాధికరణముగ నిర్దిష్టము గదా తచ్ఛబ్దము. కాని తపరము అవర్ణము గాన నదియే 'తత్కాలస్య' అను పదమునందలి తచ్ఛబ్దముచే బరామర్శింపదగినది. కాగా వర్ణవాచియగు తచ్ఛబ్దమునకు కాల వాచితో సామానాధికరణ్యము యుక్తము గాదు. ఏలయన, కాలము క్రియారూపము. వర్ణము గుణము గాని ద్రవ్యము గాని యగును "పగలు చదువుచున్నాడు" అందురు. పగలనగా నాదిత్యుని పరిస్పందముల సంతానము. అది ఉదయాద్యస్తమయాంతము జరుగు క్రియ. అది అధ్యయనమునకు పరిచ్ఛేదకము గాన క్రియయగును. పరిమాణము తెలియని ఒక క్రియకు పరిచ్ఛేదకమగు ప్రసిద్ధ పరిమాణక క్రియయే కాలము. కావున నిట 'తత్కాలస్య' అను నిర్దేశ మిట అయుక్తమని ఆక్షేపము. అయుక్తమనగా అసంబద్ధమని యర్థము. దేనితో సంబద్ధము కానిది ? అనిన న్యాయముతో అని గమ్యమగును. కాగా 'న్యాయ సంబద్ధము కానిది' అని పర్యవసితము.

అయిన ఎట్లు నిర్దేశింపవలెను ?

'తత్కాల కాలస్య' అని నిర్దేశింపదగును. అనగా ఏమి ? తస్య కాలః=తత్కాలః. తత్కాలః కాలో యస్య=సోయం తత్కాలకాలః= తత్కాల కాలస్య.

తత్కాలమనగా అవర్ణమునకు పరిచ్ఛేదకమగు నిమేషాది క్రియ. తజ్జాతీయమగు క్రియయే వేరొకటి పరిచ్ఛేదకముగా గల రెండవ వర్ణము= తత్కాల కాలము.

అపుడు, 'తపరస్తత్కాల కాలస్య' అని సూత్రింపవలెను గదా? అనిన అక్కరలేదు. ఉత్తరపద లోప మిట కలిగినదనవచ్చును. ఎట్లనగా, ఉష్ట్రముఖః మున్నగు శబ్దములందు వలెననుట,

ఉష్ట్రముఖమివ ముఖం యస్యసః = ఉష్ట్రముఖః। ఖర ముఖ మివముఖం యస్యసః=ఖరముఖః అనునట్లు తత్కాల కాలము=తత్కాలము. ఇట్టి స్థలములందు "ఉష్ట్రః ముఖం యస్యసః" అనియే విగ్రహ వాక్యము. సామర్థ్యము వలన నుష్ట్ర శబ్దమునకు ఉష్ట్ర ముఖము నందు లక్షణ.

ఒక ప్రాణికి వేరొక ప్రాణి ముఖము కానేరదు. ఉష్ట్రముతో ముఖమునకు సాదృశ్యమును వివక్షితము గాదు. దాని ముఖముతోడనే ముఖాంతరమ్ము

నకు సాదృశ్యము ససంభవము. కావున సుప్త్రిముఖమువంటి ముఖము గలది యను నర్థము గమ్యము.

అట్లే ప్రకృతమునను వర్ణము కాలము కానేరదు గావ నావర్ణమునకు సంబంధించిన ఉచ్చారణ క్రియ, తాను క్రియాంతరముచే పరిచ్ఛిన్నమై వర్ణాంత రోచ్చారణ క్రియకు పరిచ్ఛేదకమగుటచే వర్ణమే కాల మనబడినది.

లేదా వర్ణము కాల సహచరితము గాన కాలమనబడును. తూకపు రాయిని సువర్ణమునకు మానముగా గ్రహించుటకు బూర్వము దానిని వేరొక పరిచ్ఛేదకముతో పరిచ్ఛేదించి యేగదా అట్లుచేయుదురు. అట్లే క్రియయు క్రియాంతర పరిచ్ఛిన్నమై. పరిచ్ఛేదకమగు చుండును. వర్ణమునకు కాలసాహచర్యము కాలమునాదు లక్షణకు బీజము.

ఈ తపరసూత్రము నియామకమా? ప్రాపకమా? అని విచారము. ప్రాపకమనగా స్వతంత్ర విధి.

ఏమైన నియమార్థమగును? ఎట్లైన స్వతంత్ర విధియగును? పూర్వ సూత్రమునుండి 'అణ్' అను పదము ఇందనువర్తించునని నపుడు నియమార్థ మగును. అది నివర్తించిన విధ్యర్థకమగును.

ఎట్లైననేమి విశేషము? అనిన, నియమ పక్షమున దూషణ వార్తికము, **"తపరస్తత్కాలస్యేతి నియమార్థమితిచేత్ దీర్ఘ గ్రహణే స్వరభిన్నాగ్రహణమ్"** అనునది.

'తపరస్తత్కాలస్య' అనునది నియమార్థమను పక్షమున, "వృద్ధిరాదైచ్" మున్నగు దీర్ఘ గ్రహణ స్థలములందు, దీర్ఘాకారమునకు మాత్రమే వృద్ధి సంజ్ఞ ప్రాప్తించునుగాని అన్ని ఆకారములకును ప్రాప్తింపదు. అనగా వేనికి?

స్వరభిన్నములకు=స్వరమువలన వేరువేరయిన ఉదాత్తానుదాత్త స్వరితాకారములకనుట.

పోనిండు, ఇది స్వతంత్ర విధాయకమే యనుడు. అనిన,

వా॥ **"ప్రాపకమితి చేద్ధ్రిస్వ గ్రహణే దీర్ఘ ప్లుత ప్రతిషేధః"** అని దూషణ వార్తికము.

ఆ పక్షమున, "అతోభిస ఐస్" (7-1-9) మున్నగు హ్రస్వతపర[illegible] గ్రహణ[illegible]చోట నీ సూత్రముచేత హ్రస్వముకంటె పరమైన భిస్సునకు

వలె, వెనుకటి సూత్రముచేత దీర్ఘ ప్లుతాకారములకును గ్రహణము గలిగి వానికి పరమైన భిన్నునకు గూడ ఐసాదేశము రావలసివచ్చును. కావున దానిని ప్రతిషేధింపవలసి యుండును. 'అణ్భిన్నములగు తపరములు గ్రహింప బడిన తావులందిది చరితార్థము గాన దీనిచే తద్వారణము సుకరముగాదు' అని పై వార్తికమునకు తాత్పర్యము. కాని,

ప్రతిషేధము వక్తవ్యముగాదు. అది అనావశ్యకము.

**వా॥ "విప్రతిషేధాత్సిద్ధమ్"** అని సమాధాన వార్తికము.

అట్టి స్థలములందు విప్రతిషేధమువలన తపర సూత్రమే ప్రవర్తించును గాన దీర్ఘ ప్లుతములకు ప్రసక్తియేలేదు. అట అణ్ణు సవర్ణములను గ్రహించు నను పూర్వ సూత్రమా ? తపరస్తత్కాలస్య అనునదా ప్రవర్తింపవలెను ? అను విచారములో పరమయిన దగుటవలన తపర సూత్రమే ప్రవర్తించునని తేలును.

విప్రతిషేధమనగా, తుల్య బలములగు రెండు శాస్త్రములకు విరోధము. హ్రస్వములును, అతపరములును నగు అణ్ణులు, పూర్వ సూత్రమునకు అవకాశము. దీర్ఘములగు అణ్భిన్నతపరములు తపర సూత్రమున కవకాశము ఈ విధముగ వానికి దుల్యబలత్వము. ఇక హ్రస్వములగు తపరములందు సమావేశము ప్రాప్తము. ఏదియో యొక్కటియేగదా ప్రవర్తింపవలె. పరవిప్రతిషేధమువలన, తపర సూత్రమే ప్రవర్తించునని నిర్ణయము.

## ధ్వని స్ఫోటుల భేద నిరూపణము

ఈ తపరసూత్రము తత్కాలములకే గ్రహణమును, భిన్నకాలములకు వ్యావృత్తిని, బోధించినయెడల, ద్రుతవృత్తిలో తపరముగా నుచ్చరింప బడిన వర్ణము, మధ్యమ విలంబిత వృత్తులలో ఉచ్చరింపబడిన సవర్ణములను గ్రహింపదు గాన వానికిని గ్రహణమును బోధింపవలసియుండును. కాల భేదము కలదు గదా! అట్లే, మధ్యమ విలంబిత వృత్తులలో ఉచ్చారితమయిన తపరము, తదితర వృత్తులలో ఉచ్చరింపబడినవానిని గూడ గ్రహించునని ఉప సంఖ్యానము కర్తవ్యమగును. వానికి కాలభేదము స్పష్టము. ఎట్లనగా- ద్రుత వృత్తిలో ఒకడొక శ్లోకమునుగాని ఋక్కునుగాని యుచ్చరించినపుడు, వాని సుషుమ్నా నాడినుండి తొమ్మిది అమృత బిందువులు స్రవించును.

ఇదియే మధ్యమ వృత్తిలో నుచ్చరింపబడునప్పుడు, అందు మూడవభాగ

మధికముగాగల యమృత బిందువులు స్రవించును. అనగా పండ్రెండు పలము లనుట.

విలంబిత వృత్తిలోనయిన, పండ్రెండులో మూడవభాగము దానికి కలియగా పదునారు బిందువులు స్రవించును.

అభ్యాసముకొరకయిన, అనగా మరల మరల నావృత్తి చేయుట-వల్లించుటకు, ద్రుతవృత్తి నాశ్రయింతుము. ప్రయోగమునకు మధ్యమ వృత్తి గ్రహింపబడును. శిష్యుల కుపదేశము చేసినపుడు, విలంబిత వృత్తి నాశ్రయింతుము. శ్లో॥ "అభ్యాసార్థే ద్రుతావృత్తిః ప్రయోగార్థేతు మధ్యమా శిష్యాణా ముపదేశార్థే వృత్తిరిష్టా విలంబితా॥" ఈ వృత్తుల భేదము కాలభేద కృతము. ఈ విషయమునందు పూర్వసూత్రము ప్రవర్తింపదనిన, 'ఒక వృత్తిలో నుచ్చరింపబడిన తపర వర్ణములు, వృత్త్యంతరములందలి వానిని గ్రహింపకపోవును'- అను నాశయముతో నవతరించిన వార్తికము-

వా॥ "ద్రుతాయాం తపరకరణే మధ్యమ విలంబితయో

రుపసంఖ్యానం కాలభేదాత్" అనునది.

ఆ యాక్షేపమునకు సమాధాన వార్తికము "సిద్ధం త్వవస్థితా వర్ణా వక్తుశ్చిరాచిర వచనాద్వృత్తయో విశిష్యంతే" "భేర్యాఘాతవత్" అనునవి-ద్రుత, మధ్యమ, విలంబిత వృత్తులలో ఉచ్చరింపబడు వర్ణములు, అవస్థిత ములే-నియతకాలములే. వానికి కాలభేదము లేదు.

అట్లైన వృత్తి భేదము దేనివలన గలుగును ? అనిన,

ఉచ్చరించువాని చిరాచిరోచ్చారణమే వృత్తులకు భేదకము. ఒకానొక వక్త శీఘ్రముగ మాట్లాడు స్వభావము కలవాడు. అతడు వర్ణములను త్వర త్వరగా నుచ్చరించును. వేరొక వక్త కొంచెదిగ నాలసించి ఉచ్చరించును. ఇంకను నొకానొక వక్త విలంబముగ, నెమ్మదిగ బలుకు నలవాటుగలవాడుగ నుండును. ఏ వృత్తిలోనైనను వర్ణములకు వృద్ధిహ్రాసములు కలుగవు. ఒక కిలోమీటరు ప్రయాణముగల బాటను, ఒకడు శీఘ్రముగ పది నిముషముల లోనే నడచును. వేరొకడాబాటనే పదునైదు నిమిషములలో నడువవచ్చును. మరియొక్కడు ఇరువది నిమిషములు విలంబితముగ నడచును. అధ్వ పరిమాణమునందు మార్పులేకున్నను, ఆ దూరమునే యంత్ర శకటముతో బోవువాడు శీఘ్రముగను, గుఱ్ఱమునెక్కినవాడంతకంటె నాలస్యముగను,

పదార్థియైన నిజకను విలంబముగను బోవుదురు. అట, గంతల గతిలో భేదమే గాని మార్గభేదము లేదుగదా !

కాని యీ సమాధానమునకొక బాధక మగపడుచున్నది. వర్ణముల కధ్వ దృష్టాంతోపన్యాసము సమంజసముగ దోపదు. అధ్వ, వ్రజి క్రియకధికర ణము అది వ్యవస్థితమేగాని ఈ గంతల గమన క్రియాజన్యము గాదు. అధికర ణమునకు వృద్ధి హ్రాసములు కలుగుట అనునది అచట యుక్తము గాదు. అసంభవము.

వర్ణములట్లుగాదు. అవి ప్రయత్నజన్యములు. ప్రయత్నభేదముచే ద్రుతాది వృత్తి భేదము కలుగును. అందువలన నవి భిన్నకాలములే యగును. కావున నవి 'చిరోపలబ్ధికిని అచిరోపలబ్ధికిని నుపయుక్తములగు వృద్ధి హ్రాస ములు కలవియే యగును' అని దృష్టాంత వైషమ్యమును శంకించి, భేర్యా ఘాత దృష్టాంతముచే, నట ఉపలబ్ధిలో భేదము మాత్రమేగాని నిత్య శబ్దమున నెట్టి భేదమును లేదని నిరూపింపబడుచున్నది.

అట్లైన, స్ఫోట శబ్దము. ధ్వని శబ్దము గుణము. ఎట్లనిన, చిరాచిరోప లబ్ధి, భేరీవాదకుని ధ్వన్యుపలబ్ధి వంటిది.

శబ్దము స్ఫోటరూపము. అది వర్ణ రూపము కాదు. వర్ణము లనిత్యములు, స్ఫోటశబ్దము నిత్యము. ధ్వని రూపమగు వర్ణము స్ఫోట శబ్దముయొక్క గుణము. అనగా ఉపకారకము=వ్యంజకము. దానిచే వ్యంగ్యమగునది స్ఫోటము. చిరాచిరోపలబ్ధి, వ్యంజకములగు ధ్వనులకు సంబంధించునదిగా నిత్య మయిన స్ఫోట శబ్దమునకుగాదు.

భేర్యాఘాతవత్ = భేరీమాహంతీతి = భేర్యాఘాతః = భేరిని ప్రయోగించిన వాడని యర్థము. ఒకడు భేరిని ప్రయోగించి ఆ శబ్దమును వినుచు, అది వినబడు కాలములో ఇరువది యడుగుల దూరము పోవును. ఇంకొకడు ముప్పది యడుగులును, వేరొకడు నలుబది యడుగులును నా కాలములోనే పోవ చ్చును. భేరీ శబ్దప్రమాణ మొక్కటియే. దాని యుపలబ్ధికాలమునందలి వృద్ధి హ్రాసములు దానికి వ్యంజకములగు ధ్వనుల మూలమున కలిగినవి. అట్లే స్ఫోటశబ్దమును నియత ప్రమాణకమే. ఆయా వృత్తిలో అంతంత కాలమును తత్తదభివ్యంజకములగు ధ్వనుల రూపముచే రూషితమయి అది ఉప లభ్యమానమగును. అంతియ.

శ్లో॥ ధ్వనిః స్ఫోటశ్చ శబ్దానాం, ధ్వనిస్తు ఖలు లక్ష్యతే।
అల్పో మహాంశ్చ కేషాంచి దుభయం తత్స్వభావతః॥

ధ్వని అనియు స్ఫోట అనియు రెండు గలవు.

అందు మొదటిది వ్యంజకము.

రెండవది వ్యంగ్యము. వ్యంగ్య వ్యంజకమగు ఆ ధ్వనియే=వ్యంగ్యము లగు స్ఫోట శబ్దములకు వ్యంజకముగ సంబంధించిన ధ్వని మాత్రమే ఒకానొకటి చిరకాలోపలబ్ధి కలదిగను, నింకొకటి అల్పకాలోపలబ్ధి కలదిగను గనబడుచుండును.

"ధ్వనిః స్ఫోటశ్చ స్తః। శబ్దానాం (సంబంధి) ధ్వనిస్తు అల్పః మహాంశ్చ లక్ష్యతే। స్ఫోటస్తుతావానేవ॥" అని అన్వయము.

"కేషాంచి దుభయం తత్ స్వభావతః గృహ్యతే"

తదుభయం=ఆ వ్యంగ్య వ్యంజక రూపద్వయమును, ప్రమాణాంతరాపేక్షలేకయే యోగులకు ప్రత్యక్ష గమ్యమగును. స్వభావతః=ప్రమాణాంతరం వినా.

అందు, పరిస్ఫుటమగు కత్వము గత్వము మున్నగు వర్ణ ధర్మములు గలవాని విషయమున, వ్యంగ్య వ్యంజకోభయ రూపమును గ్రహింపబడును.

వ్యక్త వర్ణ ధర్మములు లేనివాని విషయమున ధ్వని మాత్రమే గ్రహింపబడును. కేషాంచిత్=వ్యక్తానామ్॥ అని యా శ్లోకమున కర్థము.

"తపర స్తత్కాలస్య"

## "ఆదిరంత్యేన సహేతా" (1-1-70)

### సంజ్ఞా విచారము

1. వా॥ ఆది రంత్యేన సహేతేత్య సంప్రత్యయః సంజ్ఞినో అనిర్దేశాత్"

2. "సిద్ధంత్వాదిరితా సహ తన్మధ్యస్యేతి వచనాత్"

3. "సంబంధి శబ్దైర్వాతుల్యమ్"—

అని మూడు వార్తికము లీ సూత్రమునందు విచారింపబడినవి.

ఈ సూత్రమున, సంజ్ఞి ఏదియో నిర్దేశింపబడలేదు. 'చివరిదయిన ఇద్వర్ణముతో గూడిన ఆది సంజ్ఞ యగును అని మాత్రమే చెప్పబడినది. అడ్

దేనికి సంజ్ఞ యగునో చెప్పలేదు. కావున అసంప్రత్యయః = సూత్రార్థ ప్రతిపత్తి కలుగదు.

అని ప్రథమ వార్త్తిక తాత్పర్యము.

సూత్రన్యాసమును కొలదిగ మార్పుచేసి, "ఆదిరితాసహ తన్మధ్యస్య" అని పఠించిన యెడల సూత్ర వాక్యార్థ ప్రతిపత్తి కలుగవచ్చును.

అంత్యమగు నిత్సంజ్ఞక వర్ణముతో గలిపి యుచ్చరింపబడు ఆది, స్వరూపమునకును, అనగా ఆది వర్ణమునకును, ఆద్యంత వర్ణముల మధ్యమున్న వానికిని గ్రాహకమగునని చెప్పదగును. అపుడా దోషము కలుగదు అని ద్వితీయ వార్త్తికార్థము.

**వా॥ "సంబంధి శబ్దై ర్వా తుల్యమ్" అనునది యథాన్యాస సమాధాన ప్రతిపాదక వార్త్తికము॥**

సూత్రము నందలి ఆద్యంత్య శబ్దములు రెండును సంబంధి శబ్దములు. కనుక నవియే సంజ్ఞి నాక్షేపించును.

లోకమున — "మాతరి వర్తితవ్యమ్" "పితరిశుశ్రూషితవ్యమ్" అను ఉపదేశ వచనములు గలవు. తల్లిమాటను వినవలెను. తండ్రికి సేవ చేయవలెను అని యందురు గదా.

'తన తల్లికి' 'తన తండ్రికి' అని యచట వచింపలేదు. అయినను జన్య జనక సంబంధము వలన, 'తన తల్లి విషయమునందు', 'తన తండ్రి విషయమున' ననియే యర్థము గ్రహింపబడుచున్నది.

ఆ రీతిగనే ప్రకృతమునను, దేనికి ఎయ్యది ఆదియు నంతమునో ఆ సముదాయము ఆక్షేపింపబడును. అట్టి సముదాయమున కాది వర్ణములును మధ్య వర్ణములును సంజ్ఞులు అగును.

'యణ్' అనునది సంజ్ఞ. అందాది వర్ణము యకారము. మధ్య వర్ణములు, వ, ర, ల,- లు. కాగా నవి సంజ్ఞులనుట.

॥ఆదిరంత్యేన సహేతా॥

## "యేన విధి స్తదంతస్య" (1-1-71)

'విశేషణము తదంతమునకు సంజ్ఞ యగును' అని సూత్రార్థము.

'యేన' అనుచో తృతీయ కరణ తృతీయ. విధి పదము కర్మార్థమున 'కి' ప్రత్యయాంతము. కర్త పాణినాచార్యుడు. కరణము = సాధనము.

కర్తయగు పాణిని, ఏ సాధనముతో ఆయా కార్యములను విధించునో, ఆ సాధనము తదంతమునకు బోధకమగునని ఫలితము.

"అచోయత్" (3-1-97) అనునది ఉదాహరణము. పాణిని అచ్చను సాధనముతో, ధాతువు కంటె పరముగా 'యత్' అను ప్రత్యయమును విధించుచున్నాడు. ఇట, 'అచః' అనునది "ధాతోః" అను అధికార ప్రాప్తమునకు విశేషణము. అది యత్ప్రత్యయ విధానమునకు గరణము. కరణమనునది శాస్త్రమున, విశేషమే అగును. కాగా 'అచః' అను ధాతు విశేషణము 'అజంతమయిన'— అను అర్థమునకు బోధకము గాన, అజంతమగు ధాతువునకు పరముగా యత్ప్రత్యయమగును' అను అర్థము సిద్ధించును.

ఈ తదంత విధి 'ఇకోయణచి' 'దధ్యత్ర' 'మధ్వత్ర'— అను చోట ఏల ప్రవర్తింపలేదని ప్రశ్న. సూత్రమునందలి 'ఇకః'— అను పదము విశేషణము. ఇది శబ్దానుశాసన ప్రస్తావము గనుక 'శబ్ద స్వరూపస్య' అను విశేష్య మధ్యాహృతమగును. కాగా, ఇగంతమునకు యణాదేశమగునని యర్థమగుమ గాని ఇక్కునకు స్థానిత్వము లభింపదు అని తాత్పర్యము.

సమాధానమేమన— "అయిననేమి ? "అలోంత్యస్య" (1-1-52) అను పరిభాష కలదు గదా. అయ్యది షష్ఠీ నిర్దిష్టమగు దాని అంత్యాల్లున కాదేశము ప్రవర్తించునని బోధించును. కాగా ఇగంత శబ్దమగు 'దధి' అను దాని అంత్యాల్లగు ఇకారమునకే యణాదేశము సిద్ధించును గదా?

అనిన అట్లు అనే కాల్లులగు ఆదేశముల విషయమున కుదురదు. అయవాయావాదేశములు అనే కాల్లులు. అవి ఏజంతమునకు సర్వాదేశములు కావఁసివచ్చును. అపుడు, చయనమ్, జయనమ్— మున్నగు రూపములకు బదులుగా 'అయనమ్' అనియే కావలసివచ్చును. స్థానేఽర్థాభిధానయోగ్యమగు ఆదేశమపుడది కానేరదే ? అనిన అక్షాది శబ్దములందువలె ప్రకరణము వలన అర్థ నిర్ణయము చేసికొనవచ్చును. కావున ఏజంతమున కయాదేశాపత్తి తప్పదు.

కాని, ప్రకృత్యంశమున, తదంత విధి ప్రవర్తించినట్లు, ఆదేశాంశమున గూడ అది ప్రవర్తించిన, ఏజంతములకు అయాద్యంతము లాదేశములగునవి అర్థమేర్పడును. కాన ఆ దో[illegible]నారితమగును.

ఏచ్ సంబంధి కార్యము అయాదు లయినట్లు, అయాది సంబంధి కార్య మేదియు లేదు గదా ? అవియే కార్యములు = విధేయములు గదా ! తదంశమున, తదంత విధి యెట్లు ? అనిన, అపుడు సాధుత్వము విధేయమని సమాధానము.

ఇట్లుచట ఈ అనుపపత్తి పరిహృతమయినను, తదంత విధియు, తదాది విధియు ఉపస్థితములగు "అద్గుణః" (6-1-89) మున్నగు ఆదేశములలో వైరూప్యము కలుగును. "బహ్మ + ఇంద్రః" బ్రహ్మ+ఉదకమ్ అనుచో, అవర్ణాంత మగు శబ్దమునకు అజాది శబ్దము పరమగునపుడు గుణ మేకాదేశమగునని చెప్ప బడిన గుణము సముదాయాదేశము కావలసివచ్చును. స్థానషష్ఠీ నిర్దేశము లేనందున నట అలోంత్య విధి ప్రవర్తింపదు.

మరియు అంతరంగ బహిరంగ భావ వ్యవస్థయు వ్యత్యస్థమగును. 'స్యోనః' 'స్యో' 'నా' అను లక్ష్యములలో 'సివ్' అను ధాతువునకు బరముగ నౌణాదికమగు 'న' ప్రత్యయము, సివ్+న అను నవస్థలో గుణము, వలోపము, ఊడాదేశమును బ్రాప్తించుచుండ, గుణము నంతరంగత్వమువలనను, వలోపమును అపవాదత్వముచేతను బాధించి, 'ఊఠ్' అను నాదేశము ప్రవర్తించినది. సి+ఊ+న— అను నీ యవస్థలో యణాదేశ గుణాదేశములు ప్రాప్తించుచుండ, వర్ణ మాత్రాశ్రయ కార్యమగుటచే, యణాదేశము అంతరంగము గాన, అదియే ప్రవర్తించును.

"ఇకోయణచి" అను సూత్రమునందును, తదాది తదంత విధులు ప్రవర్తించిన యెడల వర్ణ మాత్రాశ్రయత్వము యణాదేశమునకు లేదుగాన, ఇక పరత్వమువలన గుణమే రావలసివచ్చును. 'ఊన' అను నజాది శబ్దమునంతను ఆశ్రయించిన యణాదేశముకంటె 'న' అనునది మాత్రము ఆశ్రయముగాగల గుణమే అంతరంగమగును. కావున ఈ విధముగ వ్యవస్థితపూర్వమైన అంతరంగ బహిరంగ భావమునకు అవ్యవస్థ యేర్పడును.

మరియు షష్ఠీ నిర్దిష్టమగుకాని అంత్యాల్లునకాదేశములు అలోంత్య సూత్ర బోధితములు అవి యిపుడు నియతముగ అంత్యాల్లునకే సిద్ధింపక పోవును.

'ద్యౌః' 'పంథాః' 'సః' అను రూపములను జూడుడు. "దివఔత్" (7-1-84) అను సూత్రముచే విధింపబడిన ఔకారము, అంత్యాల్లగు వకారమున కాదేశము కావలెను. ఈ సూత్రమునందును, శబ్ద స్వరూప విశేషాధ్యాహారముచే, 'దివ్' అను ప్రాతిపదికముయొక్క అంత్యాలంతమునకు ఔకారము వచ్చునని అర్థమయిన సముదాయమునకుగాని 'ఇవ్' అను భాగమ్మునకు గాని ఔకారాదేశము ప్రసక్తమగును.

'పంథాః'- అను స్థలమున "పథి మథి ఋభుక్షామాత్" (7-1-85) అని విహితమయిన ఆత్వమును నీ పక్షమున పంథ్యాలంతమునకు ప్రవర్తించిన, 'పథిన్' అను సముదాయమున కొక పర్యాయమును నింకొక తడవ 'థిన్' అను సముదాయమునకును, వేరొక పర్యాయము 'ఇన్' అను సముదాయము నకును కావలసివచ్చును.

'సః' అను స్థలమున "త్యదాదీనామః" (7-2-102) అను అత్వముగూడ అంత్యాలంత సముదాయమునకు ప్రాప్తించుచున్నది.

కావున ఈ సూత్రమును మార్చి, "ప్రకృతే తదంత విధిః" అని రచింపదగును. విశేష్యము ప్రస్తుతమగునపుడు, అనగా ప్రస్తావము కలది యగునపుడే తదంత విధి ప్రవర్తించును అని దాని యర్థము.

ఆ ప్రస్తావము సాక్షాత్తుగ గాని, అధికారమువలన గాని, ఆక్షేపము వలన గాని సంభవించును. అంతియే కాని శబ్దరూప విశేష్యమును గ్రహించి, ఇది సర్వత్ర ప్రవర్తింపదని భావము.

అట్లైన, ఆ విధముగ న్యాసమును జేయవలసి నదియేనా ? అనిన అక్కరలేదు.

'యేన విధిస్తదంతస్య' అను నీ సూత్రమున 'యేన' అను పదమునందలి తృతీయా విభక్తి కరణార్థకము. ఏ కరణముతో, కార్యము విధింపబడునో అది తదంతమునకు బోధకము.

కరణమనగా ఇట శబ్ద రూపమగు విశేషణమే అగును. "వ్యాపారవద సాధారణం కారణం కరణమ్"— కరణ మవశ్యము వ్యాపారవంతము గావలెను. విశేషణమునకు ఇతర నివృత్తియను వ్యాపారము సంభవించును. కాగా అదియే కరణము.

ఏదేని కార్య మొక సాధనముతో సంపాదింపబడును. యజ్ఞదత్తుడు దేవదత్తునకు భోజనమును సిద్ధము చేయుననిన వేనితో సిద్ధము చేయును ? మూకుళ్ళు మొదలగు పాత్రలతోను, ఓదనముతోను గదా ?

అట్లే ఆతడు దేవదత్తునకు సేనానిగనుండి, యాతని సంగ్రామమును నిర్వర్తించును. వేనితో నిర్వర్తించును ? ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, పదాతులు - అను నీ సాధనములతో నిర్వర్తించును.

ఆ తీరుననే, పాణిన్యాచార్యుడు ధాతువు కంటె పరముగ యత్ప్రత్యయ మను కార్యమును సంపాదించును. దేనితో ? అనగా అచ్చుతో అనుట. కాబట్టి, "అచోయత్" (3-1-97) అచః అను పంచమ్యంతమగు ధాతు విశేషణము, 'అజంతమగు' అను నర్థము కలదియై, 'చి', 'జి' మున్నగు అజంత ధాతువులకు పరముగా అచ్చప్రత్యయమును సిద్ధింప జేయును.

"అతఇఞ్" (4-1-95) అను సూత్రమున, అకారమను సాధనముచే ప్రాతిపదిక కంటె పరముగా 'ఇఞ్' అను ప్రత్యయమును పాణిని సాధించు చున్నాడు గాన, 'అతః' అను పదమునకు 'అదంతమగు' అను నర్థము సిద్ధించి నది. కాగా, తదంతవిధి విశేషణము చేతనే చేయబడును. విశేష్యముగాని నిమిత్తముగాని తదంత విధి ప్రయోజనములు గానేరవు.

ఆ విశేషణమును, శబ్దమువలన నుపస్థితమగునదియే ప్రత్యాసత్తి న్యాయ ముచే తదంత గ్రాహకమగును. కావున సూత్రన్యాసము నందెట్టి మార్పును ఆవశ్యకము గాదు.

ఇక ఈ సూత్రమునందు విచారింపబడు మొదటి ఆక్షేప వార్తికము **"యేనవిధి స్తదంతస్యేతి చేద్గ్రహణోపాధీనాం తదంతోపాధితా ప్రసంగః"** అనునది.

విశేషణము తదంతమునకు సంజ్ఞ యయిన యెడల, గ్రహణోపాధులు= ఆయా సూత్రములందు గృహ్యమాణమునకు విశేషణముగా గ్రహింపబడినవి, తదంతోపాధులు=తదంతమునకు విశేషణములు కావలసివచ్చును.

"ఉతశ్చ ప్రత్యయాదసంయోగపూర్వాత్" (6-4-106) అను సూత్రము, లోణ్మధ్యమైకవచనమగు హిప్రత్యయమునకు లోపమును విధించునది. 'ధిను' 'కృణు' మున్నగునవి యుదాహరణములు. ఇందు, గృహ్యమాణము ప్రత్య యోకారము. 'అసంయోగపూర్వాత్' అనునది దానికి విశేషణము. సంయోగ పూర్వకముకాని ప్రత్యయోకారము అంతమున గల అంగమునకు పరమైన 'హి' అను ప్రత్యయమునకు లుక్కు రావలెను. 'ఉతః' అనునది, 'అంగాత్' అను నధికార ప్రాప్తమునకు విశేషణము. అందువలన అది తదంత గ్రాహకము.

ఇక 'అసంయోగ పూర్వాత్' అను పర్యుదాసమునకు వ్యావర్త్య ములు, 'అక్షుహి' 'తక్షుహి' 'ఆప్నుహి' 'శక్నుహి' మున్నగునవి. అచట, 'ను' అను ప్రత్యయముయొక్క ఉకారము సంయోగ పూర్వకము.

తదంత సంజ్ఞవలన, 'ఉతః' అనునది 'ఉదంతమగు' అను అర్థము కలది యైన, దానికి 'అసంయోగ పూర్వాత్' అనునది విశేషణమై ఉకారము కాక, ఉకారాంతము సంయోగ పూర్వ మయినపుడే పర్యుదాసము ప్రవర్తించును. 'అక్ష్ణుహి' 'తక్ష్ణుహి' అనుచోట్ల 'ను' అనునది సంయోగపూర్వకము గాన నట లుక్కు రాదు. 'ఆప్నుహి' 'శక్నుహి' అనుచో నుకారమే సంయోగ పూర్వకముగాని, 'ను' అను ఉకారాంతము కాదు. కాగా అట పర్యుదాసము ప్రవర్తింపకపోవును. 'హి'కి లుక్కు రావలసివచ్చును.

అదే విధముగ "ఉదోష్ఠ్య పూర్వస్య" (7-1-102) అను సూత్రము, ఓష్ఠ స్థాన నిష్పన్నములగు వర్ణములు పూర్వమునందు గల దీర్ఘ ఋకార మునకు, అంగాంతమున, ఉత్వమును విధించుచున్నది. ఇందు, 'ౠతః' అను పదమనువర్తించును. అది గృహ్యమాణమనుట. దానికి విశేషణమగు 'ఓష్ఠ్య పూర్వస్య' అనునది గ్రహణోపాధి. అది తదంతోపాధియయిన, 'సంకీర్ణమ్' 'సంగీర్ణమ్' అను స్థలములందు, 'కౄ' 'గౄ' ధాతువులందలి ౠకారము మకార రూపమగు ఓష్ఠ్యము పూర్వమునందు గలది గనుక నట ఉత్వము సిద్ధించినను, "నిపూర్తాః పిండాః"- అనుచోట పౄ అను ౠదంత మోష్ఠ్య పూర్వము కానందున నుత్వము రాకపోవును.

వా॥ సిద్ధంతు విశేషణ విశేష్యయోర్యథేష్టత్వాత్" అని సమాధాన వార్తికము.

విశేషణ విశేష్య సంబంధము యథేష్టముగ నుండును. అట్టి కామ చారమువలన, "ఉతశ్చ ప్రత్యయాదసంయోగ పూర్వాత్" (6-4-106) అను సూత్రములో, "అసంయోగ పూర్వాత్" అను విశేషణముచే, ఉకారాంత మును విశేషింపక, ఉకారమే విశేషింపబడును. కాగా, అసంయోగపూర్వక మగు ప్రత్యయ ఉకారము అంతమున గల అంగముకంటె పరమగు, 'హి' ప్రత్యయమునకు లుక్కగును అనియే యర్థము.

ఆ విధముగనే, "ఉదోష్ఠ్య పూర్వస్య" (7-1-102) అను స్థలమునందును 'ఓష్ఠ్య పూర్వస్య' అనునది, ౠకారాంతమునకు గాన, ౠకారమునకే విశే షణము. కాగా ఓష్ఠ్యవర్ణము పూర్వమున గల ౠకారము అంతమందుగల ధాతువునకు ఉత్వమగును అను అర్థమే సమ్మతము.

గుణ ప్రధానములలో గుణము తనను తాను ముందు సంస్కరించుకొని తరువాత, ప్రధానోపకారకమగునను న్యాయమును పై యంశమునకు ఉపో ద్బలకము. "గుణః కృతాత్మ సంస్కారః ప్రధానాయోపకల్పతే" అని న్యాయము.

## ఇక తదంత సంజ్ఞా ప్రతిషేధ విచారము

**వా॥ "సమాస ప్రత్యయ విధౌ ప్రతిషేధః"**

సమాస విధాయక శాస్త్రములందును, ప్రత్యయ విధాయక శాస్త్రము లందును విశేషణము తదంతమునకు సంజ్ఞ కాదు అని చెప్పవలసి యున్నది.

సమాస విధిలో తదంత సంజ్ఞా నిషేధోదాహరణము "ద్వితీయా శ్రితా తీతపతిత గతాత్యస్త ప్రాప్తాపన్నైః" (2-1-24) సూత్రము ద్వితీయాంతము శ్రితాది ప్రకృతికములైన సుబంతములతోడనే సమసించుగాని శ్రితాద్యంత ప్రకృతికములతో సమసింపదు.

కష్టం శ్రితః=కష్టశ్రితః॥ 'నరకం శ్రితః = నరక శ్రితః' ఉదాహరణములు. తదంత సంజ్ఞా నిషేధమువలన 'కష్టం పరమశ్రితః' అనుచో సమాసము ప్రవర్తింపలేదు.

ప్రత్యయ విధిలో తదంత సంజ్ఞా నిషేధమున కుదాహరణము- "నడాదిభ్యః ఫక్" అను సూత్రము. ఉ॥ నడస్య అపత్యం=నాడాయనః॥- తదంత సంజ్ఞా ప్రతిషేధము వలన, 'సూత్ర నడస్య అపత్యం=సౌత్ర నాడిః' అనుచో 'ఫక్' ప్రత్యయము ప్రవర్తింపలేదు. 'ఇఞ్' ప్రత్యయము ప్రవర్తించి నది.

ఈ నిషేధము ప్రత్యయ విధులందెల్లను, నెట్టి విశేషమును బాటింపకయే ప్రవర్తించునా ? అనిన అట్లు కాదు.

**వా॥ "ఉగిద్వర్ణ గ్రహణ వర్జమ్"** అని వార్తిక శేషము.

'ఉగిత్' అను పదము సూత్రము నందు గల ప్రత్యయ విధులందును, వర్ణ మాత్ర గ్రహణము గల శాస్త్రము లందును దప్ప. తదితర ప్రత్యయ విధులందును, సమాస విధులందును దదంత గ్రహణము కలుగదని చెప్పవలెనని భావము.

"ఉగితశ్చ" (4-1-6) అను సూత్రము, ఉగిత్తగు ప్రాతిపదికమునకును, ఉగిదంతమగు ప్రాతిపదికమునకును బరముగా 'ఙీప్' అను స్త్రీ ప్రత్యయము విధించుచున్నది. కావున, 'భవతీ' 'మహతీ' అను ఉగిత్ప్రాతిపదికములకు పరముగన, 'అతిభవతీ' 'అతిమహతీ'— అను ఉగిదంతములకు పరముగను అది సిద్ధించుచున్నది.

వర్ణ గ్రహణ స్థలమున తదంత విధి ప్రతిషేధ వర్ణనమున కుదాహరణము- "అత ఇఞ్" (4-1-95). దక్ష అను నది అకారాంత ప్రాతిపదికము. అకార రూపము గాదు. అయినను అట తదంత విధి ప్రవర్తించుటచే, 'దాక్షిః' అనుచో 'ఇఞ్' ప్రత్యయము సిద్ధము.

కేవలాకార రూప ప్రాతికము నందు సూత్రము ప్రవర్తించుటకును నట్లది వ్యర్థము కాకుండుటకును నట్టి స్థలమేదియేని గలదా? అనిన లేకేమి? 'అ' అను ప్రాతిపదికమే కలదు గదా. అతసాతత్యగమనే అను ధాతువునకు 'డ' అను ప్రత్యయముచే 'అ' అను ప్రాతిపదిక మేర్పడును. సతతగామి = సర్వ వ్యాపకుడు విష్ణువు, అని అర్థము. "అస్య అపత్యం=ఇః" అని అగును గదా. అట సూత్రము సార్థకమగును కాన సామర్థ్యమువలన తదంత విధి 'అతఇఞ్' అనుచో ప్రవర్తించుననుట కుదురదు.

## తన్మధ్య పతిత న్యాయ విచారము

**వా॥ "అకచ్ శ్నమ్వతః సర్వనామావ్యయ ధాతు విధావుపసంఖ్యా నమ్"** అని వార్తికము.

సర్వనామ సంజ్ఞా వ్యయ సంజ్ఞలను విధించిన సూత్రములందు 'అకచ్' అను ప్రత్యయముతో గూడిన దానికిని, ధాతు సంజ్ఞా విధాయక సూత్రము లందు 'శ్నమ్' అను వికరణ ప్రత్యయ విశిష్టమునకును గ్రహణము కలుగువని చెప్పవలెను అని వార్తికార్థము.

'సర్వ' అనునది సర్వనామ. దానికి అజ్ఞాతాద్యర్థములందు అకచ్ అను ప్రత్యయము, సూ॥ "అవ్యయ సర్వనామ్నామకచ్ ప్రాక్టేః (5-3-71) అను సూత్రముచే విధింపబడినది. అది టి సంజ్ఞక భాగమునకు పూర్వముగ వచ్చును.

కాగా, సర్వ్+అక్ + అ = సర్వక అని యగును. అట్లే 'విశ్వక' అనునది.

ఇపుడకజ్విశిష్టము గూడ సర్వనామ కావలెను. కానిచో, 'సర్వకే' 'విశ్వకే' అను స్థములందు, "జసశ్శీ" (7-1-17) అను శీ ఆదేశము రాకపోవును. కావున 'అకజ్విశిష్టమునకును సర్వనామ సంజ్ఞ వచ్చును' అని చెప్పవలసి యుండును.

అట్లే 'ఉచ్చైః' 'నీచైః' అను చోట్ల సుప్పుకు లుక్కు వచ్చుటకు అవ్యయ సంజ్ఞ ఆవశ్యకము గాన అదియు వక్తవ్యము.

శ్నమ్విశిష్టమగు 'భినద్' అనునదియు ధాతవు కావలెను. 'భినత్తి' 'ఛినత్తి' — శ్నమ్విశిష్ట ధాతువున కంతోదాత్త సిద్ధ ప్రయోజనము.

వీనికాయా సంజ్ఞలు సిద్ధింప కుండుట కేమి కారణము ?

విశేషణమగునది, శాస్త్రమునందు తదంతమునకు గాని దానికే గాని గ్రాహకమగునని గదా అర్థము ? ఇవి తదంతములును కావు తద్రూపములును కావు.

వా॥ **"సిద్ధంతు తదంతాంత వచనాత్"** అని సమాధాన వార్తికము.

'సూత్రము, "యేన విధిస్తదంతాంతస్య" అని పఠింపబడును. కావున నాయాస్థలములందు సంజ్ఞలు సిద్ధింపవచ్చును, అని యర్థము

'తదంతాంతస్య' అన నేమి యర్థము ? తస్య అంతః = తదంతః = తదంతః అంతోయస్యసః = తదంతాంతః॥ తస్య తదంతాంతస్య॥ 'దాని యంతవర్ణము అంతమున గల దానికి సర్వనామాది సంజ్ఞ కలుగును' అని యర్థము. సర్వ శబ్దాంతము అకారము. అది అంతమున కలది సర్వక శబ్దము. ఇట్లంతటను జూచు కొననగును.

అట్లైన సూత్రమును మార్చి ఆ విధముగా పఠింపవలెనా ? అక్కర లేదు.

ఇట ను త్తరపదము లోపించినది. ఎట్లనగా, 'ఉష్ట్రముఖః' 'ఖరముఖః' మున్నగు సమాసములందువలెనే.

'ఉష్ట్రము యొక్క ముఖము వంటి ముఖము గలది' 'ఖరము యొక్క ముఖము వంటి ముఖము గలది' అని గదా యర్థము. ప్రకృతమునను, తదంతః అంతోయస్యసః = తదంతః॥ ఉత్తర పదమునకు వాచనికమగు లోపము. 'సర్వనామాద్యంత మంతమున గలది' అని యర్థము॥

అవయవము నందు సముదాయ రూపము నారోపించి చేయబడు నట్టి వ్యవహారములు, గౌణములు. గౌణార్థమును పురస్కరించుకొని,

శాస్త్రము నందును లోకమునందును వ్యవహరించుట తరచుగా గాన వచ్చును.

ఈతడు, ఛాత్రుడు, పార్శ్వకుడు, అయశ్శూలికుడు, దాండాజినుడు, శీతకుడు, ఉష్ణకుడు అని వ్యవహరింతురు. ఛాత్రుడనగా గురు ఛిద్రావరణము శీలముగా గలవాడు. ఛత్ర పదమునకు 'గురుచ్ఛిద్రావరణము' అను నర్థము గౌణార్థము. ఇట్లే, వక్రోపాయముచే నన్వేషించు వాడు, తీక్ష్ణోపా యాన్వేషి, దాంభికుడు, అలసుడు, శీఘ్రకారి — అని పార్శ్వకాది పదము లకు క్రమముగా అర్థములు.

వా "తదేకదేశ విజ్ఞానాద్వా సిద్ధమ్" అని సమాధానాంతరము.

వా=లేదా॥ తదేక దేశ విజ్ఞానాత్ = దాని యేక దేశమయినది, అదిగా గ్రహింపబడుచు గాన నిది సిద్ధము. మధ్య పాతులగు నకజాదులు, అవ్యయ సర్వ నామైక దేశ భూతములే కనుక తత్త్వ బుద్ధికి భంజకములు కావు.

గంగలో గలసిన నద్యంతరము గూడ 'గంగ' అనియే వ్యవహరింప బడును. అట్లే యమునా ప్రవిష్టనదియు యమున యనబడుచున్నది 'దేవదత్త' అని యొక స్త్రీ. ఆమె లోపల నున్న గర్భమును ఆ పదము చేతనే వ్యవహరింపబడును గదా. మధ్య పతితములగు నకజాదులును సర్వ నామాది శబ్ద వ్యవహార్యములు అగునని తాత్ప ర్యము.

కాని, పై దృష్టాంతోపన్యాస మిట సరిపడదు. ఏలయన — ఈ శాస్త్రమున, కొన్ని శబ్దములు, పరిచ్ఛిన్నమగు పరిమాణము గల యర్థములకు వాచకములుగా నుండును. సంఖ్యా శబ్దములును, పరిమాణ వాచక శబ్దము లును అట్టివి. 'అయిదు' 'పదు' మున్నగు సంఖ్యా శబ్దములు, తత్సంఖ్యా సంఖ్యేయములగు వానిలో ఒకటి తరిగినను ప్రవర్తింపవు. అట్లే, కుంచము, మరకము, పుట్టి మున్నగు పరిమాణ వాచకములు గూడ, అంత కంటె అధికమైన దాని యందు గాని న్యూనమగు దాని యందు గాని ప్రవర్తింపవు.

ఇక జాతి శబ్దములగు తైలము, ఘృతము మున్నగు నవియు, గుణ శబ్దములగు, శుక్ల, నీల, కృష్ణాది శబ్దములును, పరిచ్ఛేద్య మల్పము కానిండు, అధికము కానిండు, తావద్భాగమును బోధించును.

తైలమును, ఘృతమును కుంచెడయినను పుట్టెడయినను, తైలత్వ

శబ్ద స్వరూపార్థ్యమే. శుక్లనీలాది గుణశబ్దములును, ఆ గుణి హిమవత మయినను, మరి పిత్తనమయినను, వానినే బోధించును.

ఈ సర్వ నామాది సంజ్ఞలు, పరిచ్ఛిన్న పరిమాణములయిన సంజ్ఞి భూత శబ్దములకు విధింపబడినవి. ఇట పరిమాణమనగా ఆనుపూర్వీ విశేషము అట్టి యెడ అవి అధికము లందెట్లు ప్రవర్తించును? శబ్దములు నిత్యము లాయె. వికారము గాని ఉపజనము గాని వాని కుండవు గదా? కాగా, సర్వక శబ్దమును సర్వ శబ్దమే యని ఎట్లు చెప్ప నగును?

సమాధానము — అట్లైన, పాణిన్యాచార్యుని ప్రవృత్తి వలన తదేకదేశము అదియేగా గ్రహింపబడునని జ్ఞాపితమగును. అదిగా గ్రహింప బడుట యనగా, దానిని బోధించు శబ్దము చేతనే తద్విశిష్టమును గ్రహింపబడుట.

పాణిన్యాచార్యుడు, "నేదమదసోరకోః" (7-1-11) అను సూత్రము చేత కకార రహితములయిన, 'ఇదమ్' 'అదస్' అను వాని 'భిస్' ప్రత్యయము నకు 'ఐస్' అను నాదేశమును ప్రతిషేధించెను.

'ఇదమ్' 'అదస్' శబ్దముల భిస్ప్రత్యయమునకు ఐసాదేశమును నిషేధించును, అందు 'అకోః' అను పదముచే సుకారసహితముల భిస్సుకు ఐసా దేశ ప్రతిషేధమునకు ప్రతిషేధమును శాసించెను.

అది ఎట్లు జ్ఞాపకమనగా- కకార సహితములయినవనగా అకజ్విశిష్ట ములు. 'ఇదకమ్' 'అదకస్' అనునవి. ఇద మదశ్శబ్దములకు విధింపబడు కార్య మునకు, సహకారములయిన పై శబ్దములకు వచ్చుటకు ప్రసంగ మేమి గలదు?

తదేకదేశము గూడ, తద్గ్రాహక శబ్దముచే గ్రహింపబడునని, పాణి న్యాచార్యుడు గణించి కకార విశిష్టములకు, ప్రతిషేధమును శాసించెనని వ్యక్తముగదా!

## ఇక-నీ సూత్రమునకు ప్రయోజనములు

ఈ సూత్రమునకు ప్రయోజనములేమి? అని ప్రశ్న.

(1) వా॥ "ప్రయోజనం సర్వనామావ్యయసంజ్ఞాయామ్" అనునది మొదటి ప్రయోజన వార్తికము.

"సర్వాదీని సర్వనామాని" (1-1-27), "స్వరాది నిపాతమవ్యయమ్" (1-1-37) అను సర్వనామావ్యయ సంజ్ఞా విధాయకములందు, సర్వాద్యంతములను అవ్యయములు అని తదంతములకును సంజ్ఞలు సిద్ధించుట ప్రయోజనము. ఉదాహరణములు:

సర్వే, పరమసర్వే. ఉచ్చైః పరమోచ్చైః, నీచైః, పరమనీచైః అనునవి.

(2) వా॥ "ఉపపదవిధౌ భయాఢ్యాది గ్రహణమ్"- ఇది ద్వితీయ ప్రయోజనము.

"మేఘర్తిభయేషు కృఞః" (3-2-43) అను సూత్రముచే, భయాశబ్దముపపదమయినపుడు, విధింపబడిన ఖచ్ప్రత్యయము, భయశబ్దాంతమగు నభయ శబ్దము పరమగునపుడును ప్రవర్తించుట ప్రయోజనము.

"ఆఢ్య సుభగస్థూలపలిత నగ్నాంధ ప్రియేషు చ్వ్యర్థేష్వచ్వౌ కృఞః కరణే ఖ్యున్" (3-2-56) అను సూత్రముచే, ఆఢ్య శబ్ద ముపపదమగునపుడు విహితమయిన ఖ్యున్ ప్రత్యయము, 'స్వాఢ్య' శబ్దము పరమగునపుడును, ప్రవర్తించుటయు ప్రయోజనము. ఉ॥- భయంకరః-అభయంకరః॥ ఆఢ్యంకరణమ్-స్వాఢ్యంకరణమ్॥

(3) వా॥ "ఙీబ్విధావుగిద్గ్రహణమ్" ఇది తృతీయ ప్రయోజన వార్తికము.

"ఉగితశ్చ" (4-1-6) అను సూత్రమునందును ఈ తదంత సంజ్ఞ ప్రవర్తించుటవలన, ఉగిదంతములయిన, 'అతిమహత్' 'అతిభవత్' అనువానికంటెను బరముగా 'ఙీప్' ప్రత్యయము సిద్ధించుట ప్రయోజనము. ఉ॥ భవతీ-అతిభవతీ॥ మహతీ-అతిమహతీ॥

(4) వా॥ "ప్రతిషేధే స్వస్రాదిగ్రహణమ్"

"నషట్ స్వస్రాదిభ్యః" (4-1-10) అను సూత్రము స్వసృ మున్నగు వానికి ఙీప్ టాప్ ప్రతిషేధమును విధించునది. అది స్వస్రాద్యంతమునను సిద్ధించుట తదంతవిధి ప్రయోజనము. ఉదాహరణములు, స్వసా-పరమస్వసా॥ దుహితా-పరమదుహితా॥

(5) వా॥ "అపరిమాణ బిస్తాది గ్రహణఞ్చ"

"అపరిమాణ బిస్తాచిత కమ్బల్యేభ్యో నతద్ధితలుకి" (4-1-22) అను సూత్రము బిస్తాద్యుత్తర పదకద్విగువునకు జీవ్ నిషేధమును విధించుచున్నది. అయ్యది బిస్తాదంతోత్తర పదక ద్విగువునందును సిద్ధించుటయు ప్రయోజనమనుట. ఉదాహరణములు, ద్విబిస్తా-ద్విపరమబిస్తా॥ త్రిబిస్తా-త్రిపరమబిస్తా॥ ద్వ్యాచితా-ద్విపరమాచితా మున్నగునవి॥

(6) వా॥ "దితి"

"దిత్య దిత్యాదిత్య పత్యుత్తర పదాత్ ణ్యః" (4-1-85) అనునది ణ్య ప్రత్యయ విధాయకము. అది, దితి శబ్దముకంటెను, తదంతమగు అదితి శబ్దముకంటెను బరముగా ప్రవర్తించుట తదంత విధి లభ్యము. దానివలన ఇక సూత్రమునందు 'అదితి' శబ్దమును గ్రహింపనక్కరలేదు. అదితి గ్రహణా కర్తవ్యత యను లాఘవము ఫలము.

(7) వా॥ "రోణ్యా అణ్"

"రోణీ" (4-2-78) అని ఒక సూత్రము. అది 'అణ్' ప్రత్యయ విధాయకము రోణీ శబ్దాంతములు 'అజకరోణీ' 'సింహకరోణీ' మున్నగునవి. వానికంటె బరముగా అణ్ ప్రత్యయము సిద్ధించుటయు తదంత విధి ప్రయోజనమనుట. ఉదాహరణములు, 'ఆజక రౌణః' 'సైంహిక రౌణః' అను మున్నగునవి.

సరియే- కాని, కేవలము 'రౌణః' అను రూపమును అణంతము లభింపవలెనుగదా అది యెట్లు సిద్ధించును ? అను నాక్షేపమునకు సమాధానముగ- వా॥ "తస్యచ" అను వార్తికము పఠితము.

తదంతమాత్రమునకే గాక సూత్ర గృహీతమునకును నాకార్యము సిద్ధించుటకు, ఈ సూత్రమును, "యేనవిధిస్తదంతస్య తస్యచ" అని పఠింపవలెనని వార్తిక కర్త తాత్పర్యము.

"రౌణః" (రోణియను గ్రామమున పుట్టినవాడు) అనియు నేల సిద్ధింపదు? వ్యపదేశివద్భావముచే కేవల రోణీ శబ్దముకంటెను, తదంత విధిచే 'అజక రోణీ' 'సింహక రోణీ' శబ్దములకంటె బరముగ అణ్ ప్రత్యయము సిద్ధించును గదా ! న్యాసభేదముచే 'తస్యచ' అనియు పఠింప పనియేమి ? అని ప్రశ్న కలుగును.

కాని, "వ్యపదేశివద్భావోఽప్రాతిపదికేన" అనుటవలన సిద్ధింపదు. ప్రాతిపదికము, స్వరూపతః సూత్ర గృహీతమయిన పట్టులందు వ్యపదేశివద్భావము చెల్లదు' అని ఆవచనమున్న కర్థము. అసహాయమ్మగూడ ససహాయమువలె

కార్యములను బొందుట వ్యపదేశివద్భావము. 'రోణీ' అను ప్రాతిపదికమా సూత్రమునందిట స్వ స్వరూపముతో గ్రహింపబడినది. కావున దానికంటె ప్రత్యయము సిద్ధింపదు.

సూత్రగృహీత ప్రాతిపదికములు, ముఖ్య వ్యవహారవత్సదృశములు కావని యెందులకనవలెను ? అనిన,

"క్రతూక్థాది సూత్రాంతాట్ఠక్" (4-2-60), "తదస్మిన్నధికమితి దశాంతాడ్డః" (5-2-45) అను సూత్రములచే విధింపబడిన ప్రత్యయములు, కేవల సూత్ర శబ్ద దశన్ శబ్దములకంటె పరముగా రాకుండవలెను. అది వ్యపదేశివద్భావ నిషేధమునకు ప్రయోజనము.

ఆ ప్రయోజనమునకైన, వ్యపదేశివద్భావ నిషేధ మక్కరలేదు. ఆ సూత్రములందు 'అంత' అను శబ్దముగలదు. అది వ్యర్థము. అది లేకున్నను, తదంత విధిచే, తదంతముకంటెను, వ్యపదేశివద్భావముచే, కేవల సూత్ర శబ్ద దశ శబ్దములకును బరముగ నా ప్రత్యయములు సిద్ధించుట కవకాశముకలదు. ఇట్లుండ, వ్యర్థముగా గ్రహింపబడిన ఆ అంతశబ్దము, నియమార్థమై సూత్రాంతముకంటెనే ఠక్ప్రత్యయమగును, దశాంతముకంటెనే డప్రత్యయము, అని బోధించును కావున 'వ్యపదేశివద్భావోఽ ప్రాతిపదికేన' అను పరిభాషతో పనిలేదు.

అనిన- అట్లు కుదురదు. ఇట దశాంత సూత్రాంత శబ్దములకంటె ప్రత్యయములు, తద్విధాయకములందంతశబ్దము లేనిచో సిద్ధింపవు. తదంత విధి, సమాస ప్రత్యయ విధులందు ప్రవర్తింపదని యిపుడే చెప్పబడినదిగదా !

అయిన, నీ పరిభాష అపూర్వముగ జతసేయమనుటగదా ? కాదు. అపూర్వ వచనమక్కరలేదు. అది జ్ఞాపక సిద్ధము. పాణిన్యాచార్యుడు, "పూర్వాదినిః" (5-2-86) అను సూత్రముచే, పూర్వ శబ్దముకంటె బరముగా ఇని ప్రత్యయమును విధించి, 'పూర్వీ' అను రూపమును నిష్పాదించెను. తదుపరి, 'కృతపూర్వీ' అనునదిగూడ సిద్ధించుటకై "సపూర్వాచ్చ" (5-2-87) అను సూత్రమునుగూడ రచించెను. ఈ పరిభాష లేనియెడల, కేవల పూర్వ శబ్దముగూడ, వ్యపదేశివద్భావముచే సపూర్వమగునుగాన, 'పూర్వాత్' అను నంశము వ్యర్థము. కావున నది 'వ్యపదేశివద్భావోఽ ప్రాతిపదికేన' అను పరిభాషకు జ్ఞాపకమగును అని తాత్పర్యము.

కాని 'పూర్వాత్' అనునది వ్యర్థమయినగదా ! అది వ్యర్థముగాదు. పై సూత్రముచేత ఇని ప్రత్యయము సపూర్వములగునన్ని శబ్దములకంటెను

బరముగ రారాదు. సపూర్వమగు నొక పూర్వ శబ్దముకంటెనే 'కృతపూర్వీ' అనుచోట నది ప్రవర్తించుట సమ్మతము. కావున అది సార్థకము అందువలన జ్ఞాపకము కానేరదనవచ్చును. కాని, అట్లైన "పూర్వాత్సపూర్వాదినిః" అని ఏకయోగమునే చేయవచ్చునుగదా. అపుడు యోగ విభాగము వ్యర్థముగాన, నది జ్ఞాపకమనవచ్చును.

ఈ 'తస్యచ' అను వచనము 'రోణీ' అనుదానికి మాత్రమే శేషమా ?

కాదు. కాదు. అనుక్రాంతముగాని, అనుక్రమింపబడనున్నదిగాని ఏది యేదిగలదో దానిదాని కంతకును నిది శేషమే.

(8) వా॥ రథ సీతాహలేభ్యో యద్విధౌ" అని ఎనిమిదవ ప్రయోజన వార్తికము.

"తద్వహతి రథయుగ ప్రాసంగమ్" (4-4-76) అను సూత్రముచే విహిత మయిన యత్ప్రత్యయము, 'రథ్యః' అను స్థలమునందువలె 'పరమ రథ్యః' అనుచోట గూడ ప్రవర్తించుటయు, "నౌ, వయో, ధర్మ, విష, మూల, మూల, సీతా, తులాభ్యః, తార్య, తుల్య, ప్రాప్య, వధ్య, ఆనామ్య, సమ, సమిత, సమ్మితేషు" (4-4-91) అను సూత్రముచే విధింపబడిన 'యత్' ప్రత్యయము, 'సీత్యమ్' అను, కేవలమునందును, పరమ సీత్యమ్ అను తదంతమునను ప్రవర్తించుటయు,

"మత జనహలాత్ కరణ జల్పకర్షేషు"(4-4-97) అను సూత్రముచే విహిత మయిన యత్ ప్రత్యయము 'హల్యా' అను స్థలమునందును. పరమహల్యా అను తదంతమునను ప్రవర్తించుటయు, ప్రయోజనములు,

(9) వా॥ "సుసర్వార్థ దిక్ఛబ్దేభ్యో జనపదస్య"-

సు, సర్వ, అర్థ, దిక్ఛబ్దము- వీనికంటె బరమగు జనపద వాచకమునకు తదంత సంజ్ఞా సిద్ధియు ఈ సూత్రమునకు ప్రయోజనము.

సు—సుపాంచాలకః॥ సుమాగధకః॥

సర్వ—సర్వపాంచాలకః॥ — సర్వమాగధకః॥

అర్ధ—అర్థ పాంచాలకః॥—అర్థమాగధకః॥

దిక్ఛబ్ది—పూర్వ పాంచాలకః॥—పూర్వ మాగధకః

అపర పాంచాలకః॥—అపర మాగధకః

'తత్రభవః' అను నర్థమునందు, "జనపద తదవధ్యోశ్చ" (4-2-121) అను నధికారమున, "అవృద్ధాదపి బహువచన విషయాత్" (4-2-125) అను సూత్రముచే, ప్రాతిపదికము వృద్ధమైనను, జనపద వాచిగాని తదవధివాచి గాని అగుచు, బహువచన మాత్ర విషయమయిన, ఆ ప్రాతిపదికము కంటె పరముగా 'వుఞ్' అను ప్రత్యయము విధింపబడినది. 'ఆఙ్గకః' 'దార్వకః' మున్నగునవి ఉదాహరణములు.

అట తదంత విధి ప్రవర్తించి, సుపంచాల, సుమగధ- మున్నగు జనపద వాచ్యంత ప్రాతిపదికములకంటె పరముగ గూడ 'వుఞ్' ప్రత్యయ ప్రవృత్తి అభీష్టము. ఆ రూపములలో పంచాల, మగధ, అను నుత్తర పదములకు, "సుసర్వార్ధాజ్జనపదస్య" (7-3-72), సూ॥ "దిశోఽమద్రాణామ్" (7-3-73) అను సూత్రముచే నాదివృద్ధి.

## (10) వా॥ "ఋతోర్వృద్ధి మద్విధావవయవానామ్"-ప్ర॥ వా॥

ఋతువాచకములగు శబ్దములకంటె బరముగా వృద్ధి నిమిత్తములగు ప్రత్యయములను విధించిన, సందర్భములో, అవయవములకు తదంత సంజ్ఞాసిద్ధి ప్రయోజనము.

'పూర్వశారదమ్' 'అపరశారదమ్' 'పూర్వనైదాఘమ్' 'అపరనైదాఘమ్'- మున్నగునవి ఉదాహరణములు.

శరదృతువు పూర్వభాగము=పూర్వశరత్, అందు బుట్టినది=పూర్వ శారదము, "సంధివేలాది ఋతు నక్షత్రేభ్యోఽణ్" (4-3-16) అను సూత్ర ముచే అణ్ ప్రత్యయము. అది ఆదివృద్ధికి నిమిత్తము. ఋతువాచులగు, 'శరత్' నిదాఘ మున్నగునవి అంతమున గల 'పూర్వ శరత్' 'పూర్వ నిదాఘ' అనువానికంటెను పరముగా అణ్ ప్రత్యయము ప్రవర్తించుట ప్రయోజన మనుట.

## (11) వా॥ "ఠఞ్విధౌ సంఖ్యాయాః" అనునదియు, ప్రయోజన వార్తికము.

సంఖ్యావాచక శబ్దమునకు 'ఠఞ్' ప్రత్యయ విధాయక శాస్త్రమునందు తదంత సంజ్ఞ ప్రవర్తించుటయు ప్రయోజనము.

"ద్విషాష్టికమ్" 'పంచ షాష్టికమ్'- ఉదాహరణములు. ద్వేషష్టీ పరిమాణ మస్య=రెండు అరవైలు పరిమాణముగా గలది, అయిదు అరవైలు పరి

మాణముగా గలది అను నర్థమున "తద్ధితార్థోత్తర పద సమాహారేచ" (2-1-51) అని సమాధానమును, ప్రవర్తింపజేసిన పిదప, "ప్రాగ్వతేష్ఠఞ్" (5-1-18) అని ఠఞ్ ప్రత్యయము ప్రవర్తించినది. ఇట, "అర్హాద గోపుచ్ఛ సంఖ్యా పరిమాణాట్ఠక్" (5-1-19) అని ప్రాప్తించు ఠక్ప్రత్యయమునకు ఆ సూత్రమునందే కల "అగోపుచ్ఛ సంఖ్యాపరిమాణే" అను నిషేధము, సంఖ్యాంతములగు 'ద్విషష్టి' 'పంచషష్టి' అనువానికి గూడ సిద్ధించుట తదంత విధి ప్రయోజనము.

(12) "ధర్మాన్నఞః" ఇది చివరి ప్రయోజన వార్తికము

'నఞ్' కంటె బరమగు ధర్మ శబ్దము తదంతమునకు సంజ్ఞ అయి, "ధర్మంచరతి" (4-4-41) అను సూత్రముచే విహితమైన 'ఠక్' ప్రత్యయము, తదంతమగు, అధర్మ శబ్దమునకును సిద్ధించి, 'ధార్మికః'— అను రూపమువలె. 'ఆధర్మికః' అను రూపము సిద్ధించుటయు నీ తదంత సంజ్ఞకు, ప్రయోజనాంతరము.

అధర్మ శబ్దమునకును ఠక్ ప్రత్యయము లభించుటకై రచింపబడిన, "అధర్మాచ్చ" అను వార్తికముతో నిక బని లేదు గాన, తదకర్తవ్యత వలన లభించు లాఘవము అట విశేషము.

## ఇక పదాంగాధికార పరిభాషా విచారము

### వా॥ "పదాంగాధికారే తస్యచ తదుత్తర పదస్యచ"

పదాధికారమునందును నంగాధికారము నందును విహితములగు కార్యములు, సూత్ర గృహీతములకును, అవి యుత్తర పదముగ గల వానికిని గూడ ప్రవర్తించును. అని పరిభాషార్థము.

ఇది తదంత విధి కపవాదమగు, తదుత్తర పద విధి.

'ఇష్టకచితమ్' మున్నగునవి వక్ష్యమాణము లుదాహరణములు. పదాధికారమనగా నిట, "అలుగుత్తరపదే" (6-3-1) అను సూత్రమున నిర్దేశింపబడిన, షష్ఠాధ్యాయ తృతీయ పాదాంతమువరకు ననువర్తించు, 'ఉత్తరపదే' అను నధికారము.

వా॥ "ప్రయోజన మిష్టకేషీకామాలానాంచితతూల భారిషు" అనునది యుత్తర-పదాధి కారమున, తదుత్తర పదగ్రహణమునకు, ప్రయోజనమును ప్రదర్శించిన వార్తికము.

"ఇష్టకేషీకామాలానాంచిత తూలభారిషు" (6-3-65) అను సూత్రము త్తర పదాధికారస్థము.

'ఇష్టకా, ఇషీకా, మాలా, — అను నాకారాంతములకు, యథాక్రమముగ, చిత, తూల, భారిన్ — అను నుత్తర పదములు పరములగునపుడు, హ్రస్వము వచ్చును' అని యీ సూత్రమున కర్థము.

'ఇష్టక చితమ్' 'ఇషీక తూలమ్' 'మాల భారీ' ఉదాహరణములు.

తదుత్తర పదసంజ్ఞ వలన, 'పక్వేష్టక చితమ్' 'ముంజేషీక తూలమ్' 'ఉత్పల మాల భారీ' అను స్థలము లందును హ్రస్వము సిద్ధించును.

ఇట, తదంత విధి వలననే ఇష్టసిద్ధి కలుగును గదా ? పక్వేష్టకాదులును నిష్టకాంతములే ఆయె. అట్టియెడ, తదంత విధ్యతిరిక్తమగు నీ తదుత్తర పద విధిని గూడ నేల యంగీకరింప వలెను ? అని ఆక్షేపము కలుగ వచ్చును.

కాని, అపుడు "బహ్విష్టకాచితమ్" అను బహుచ్ పూర్వమును ఇష్ట కాంతమే కావున నట గూడ హ్రస్వము రావలసి వచ్చును. అచట హ్రస్వమని ష్టము. బహ్విష్టక యనగా ఈషదసమాప్తేష్టక. కొలదిగ కాలుపు తక్కువ ఇటుక.

అట, 'బహుచ్' ప్రత్యయము. బహ్విష్టకా అనునది సమాసము కాదు. ఉత్తర పదమనగా సమాసచరమావయవము. కాగా తదంత సంజ్ఞచేతనే ఉత్తర పదాధికారమున గతార్థత నంగీకరించిన, అతి ప్రసంగము కలుగును.

అంగాధికారమున నేమి ప్రయోజనము ?

వా॥ "మహదప్ స్వసౄనప్త్రాణాం దీర్ఘ విధౌ" అని ప్రత్యయ వార్తికము.

'మహాన్' అను స్థలమున ప్రవర్తించిన, "సాంతమహతస్సంయోగస్య (6-4-10) అను దీర్ఘము, 'పరమమహాన్' అను స్థలము నందును సిద్ధించుటయు,

'అప స్తిష్ఠంతి' అనుచోటవలె, 'స్వాప స్తిష్ఠంతి' అను స్థలమునను, 'స్వసా, స్వసారౌ, స్వసారః' అను స్థలము నందువలె, పరమస్వసా, పరమస్వసారౌ, పరమ స్వసారః అను చోటను,

'నప్తా, నప్తారౌ, నప్తారః'— అను చోటవలె, పరమనప్తా, పరమనప్తారౌ, పరమనప్తారః' అను స్థలము నందును గూడ, "అప్, తృన్, తృచ్, స్వసృ, నప్తృ, నేష్టృ, త్వష్టృ, క్షత్తృ, హోతృ, పోతృ, ప్రశాస్తౄణామ్" (6-4-11) అను ఉపధా దీర్ఘము సిద్ధించుటయు, అంగాధికారమునందు తదుత్తరపదవిధికి ప్రయోజనములు.

వా॥ "పద్యుశ్షన్మదస్మదస్థ్యాద్యనడుహోనుమ్" అని ప్రయోజనాంతర వార్తికము.

'పద్' అను వాదేశమును, యుష్మదస్మదాదాదేశములును, అస్థి, దధి మున్నగు వానికి విహితము అగు అనఙాదేశమును, అనడుహ్ శబ్దమున నుమాగమమును, తదుత్తర పదవిధికి ప్రయోజనములు, అని వార్తికార్థము.

"పాదఃపత్" (6-4-130) అను పదాదేశము, తదంతమగు 'ద్విపాత్' అను శబ్దమునకును ప్రవర్తించుటయు అంగాధికారమున నుత్తర పద విధికి ప్రయోజనము. "ద్విపదః పశ్య" అని యుదాహరణము.

ఇట నొక యాక్షేపము— సమాసము నందేకదా, సూ॥"పాదస్యలోపోఽహస్త్యాదిభ్యః" (5-4-138) అను సూత్రముచే పాద శబ్దాంతమునకు లోపము ప్రవర్తించునది ! కేవల 'పాద్' అనునది యుండుటకు అవకాశమే లేదు. కావున సామర్థ్యము వలననే తదుత్తర పదవిధి సిద్ధించును. అట్టియెడ, వార్తికమున, పద్గ్రహణ మెందులకు ?

ఔను. కేవల పాచ్ఛబ్దము పదియు లేదు ; అని అంగీకరింతుము. అందువలన, అంగాధికార విహిత పదాదేశ విషయమున ప్రయోజనము లేదు కాబట్టి, "హిమకాషి హతిషుచ" (6-3-54) అను నుత్తర పదాధికార విహిత పదాదేశము 'పత్కాషిణౌ' 'పత్కాషిణః' అను స్థలము నందువలె, 'పరమ పత్కాషిణౌ', 'పరమ పత్కాషిణః' అను చోటను ప్రవర్తించుట ఫలమని చెప్పబడినది.

ఉత్తర పదాధికారమునందు, పాద శబ్దమునకు తదంత విధి—అనగా తదపవాదమగు తదుత్తర పద విధి ప్రవర్తించుననిన, సూ॥ "పాదస్య పదజ్యాతిగోపహతేషు" (6-3-52) అని విధింపబడిన పాదశబ్ద స్థానికమగు పద, అను వాదేశమును, 'పాదేనోపహతమ్—పదోపహతమ్' అనుచోటవలె, 'దిగ్ధపాదేనోపహతమ్' అను స్థలము నందును రావలసి వచ్చునే ? అది అనిష్టము గదా ? యనిన,

అట్లైన అంగాధికారమునందే పదాదేశ విషయమున ప్రయోజనము. అట సామర్థ్యము వలన తదుత్తర పద విధి సిద్ధించును, కేవల పాచ్ఛబ్దము లేనందున పదాదేశ విధి వ్యర్థము కావలసి వచ్చును, అని యంటిరి గదా ? అనిన,

ఎందుకు లేదు ? ణ్యంతమగు పద ధాతువునకు 'క్విప్' ప్రత్యయము చేరగా నేర్పడిన 'పాత్' అనునది కలదు గదా. అట పదః, పదా, పదే అనుచో పదాదేశము సార్థకమగును గాన సామర్థ్యము వలన తదుత్తర పద విధి సిద్ధింపదు.

ఇక యుష్మదస్మదాదేశములు— 'యూయమ్' 'వయమ్' అను చోట్ల వలె, పరమ యూయం, పరమవయమ్ అనుచోగూడ యూయవయాదేశములు సిద్ధించుటయు ప్రయోజనము.

'అస్థ్నా', 'దధ్నా' 'సక్థ్నా' అనుచోటవలె, 'పరమాస్థ్నా' 'పరమ దధ్నా' 'పరమ సక్థ్నా' అను స్థలములందును, అనఙాదేశము ప్రవర్తించుటయు ప్రయోజనము.

అట్లే, 'అనడ్వాన్' అను స్థలము నందువలె, అనడుహోత్తర పదమగు 'పరమానడ్వాన్' అనుచోటను "సావనడుహః" (7-1-82) అను నుమాగమము సిద్ధించుట ప్రయోజనము.

**వా॥ "ద్యు, పథి మథి, పుం, గో, సఖి, చతుర్, అనడుహ్, త్రి-గ్రహణమ్**—అనునదియు ప్రయోజనాంతర వార్తికము.

ద్యౌః, సుద్యౌః,॥ పంథాః సుపంథాః॥ మంథాః పరమ మంథాః॥ పుమాన్, పరమ పుమాన్॥ గౌః, సుగౌః॥ సఖా, సఖాయౌ, సఖాయః, పరమ సఖా, పరమ సఖాయౌ, పరమ సఖాయః॥ చత్వారః - పరమ చత్వారః॥ అనడ్వాహః - పరమానడ్వాహః॥ త్రయాణామ్ - పరమ త్రయాణామ్॥

అను పై రూపములందు దానికిని తదుత్తర పదమునకును దత్తత్కార్య ప్రవృత్తి స్పష్టమగు ప్రయోజనము.

**వా॥ "త్యదాది విధి భస్త్రాది స్త్రీ గ్రహణంచ"** అను నిదియు ప్రయోజన వార్తికము. 'సః' అనుచోటవలె, 'అతిసః' అనుచోటను, త్యదాద్యత్వము ప్రవర్తించుట భస్త్రకా- భస్త్రికా- అను స్థలమునవలె, బహుభస్త్రకా-బహుభస్త్రికా, నిర్భస్త్రకా నిర్భస్త్రికా- అనుచోటను "భస్త్రైషాజాజ్ఞా ద్వాస్వానఞ్ పూర్వాణామపి" (7-3-47) అను ఇత్వ వికల్పము ప్రవర్తించుటయు, "స్త్రియాః" (6-4-79) అను నియఙాదేశము, స్త్రియౌ, స్త్రియః అనుచోట

వని. 'రాజస్త్రియౌ, రాజస్త్రియః' అను తదుత్తర పదమునను ప్రవర్తించు
టయు, ప్రయోజనములు.

**వా॥ "వర్ణ గ్రహణంచ సర్వత్ర" ఇదియు ప్రయోజనము**

సర్వత్ర అనగా నెచ్చటెచ్చట ?

అంగాధికారమునందును, ఇతరత్రయును అనుట. అంగాధికారమునందు గాని వేరొకచోట గాని అల్మాత్రము గ్రహింపబడిన నయ్యది తదంత విధి ప్రయోజకమగును.

"ఇకోఝల్" (1-2-9) ఇత్యాదులందు తదంత గ్రహణము, అంగాధికార భిన్న స్థలములందు ఉదాహరణముగా జెప్పబడినది.

ఇక నంగాధికారమున ప్రయోజనము - "అతో దీర్ఘోయఞి" "సుపిచ" (7-1-102) అను దీర్ఘము, 'అభ్యామ్' అను స్థలముననేగాక 'ఘటాభ్యామ్' అనుచోగూడ సిద్ధించుట.

**వా॥ "ప్రత్యయ గ్రహణం చాపఞ్చమ్యాః" అని వార్తికము.**

'ప్రత్యయ గ్రహణం తదంత విధిం ప్రయోజయతి' = ప్రత్యయము తదంత గ్రాహకమగుటయు ప్రయోజనమనుట.

కాని, "ప్రత్యయ గ్రహణే యస్మాత్సవిహిత స్తదాదే స్తదంతస్య గ్రహణమ్"- అను వచనముచేతనే ప్రత్యయ గ్రహణ స్థలములందు తదంత విధి సిద్ధించు చున్నది. కావున, 'అపంచమ్యాః' అను నిషేధమును బోధించుటకే యీ వార్తికము.

"యఞిఞోశ్చ" (4-1-101) అను సూత్రము 'ఫక్' అను ప్రత్యయమును విధించునది. 'యఞ్' 'ఇఞ్' ప్రత్యయములు అంతమునగల ప్రాతిపదికముకంటె పరముగా ఫక్ ప్రత్యయమగునని యర్థము. 'గార్గ్యాయణః'- 'వాత్స్యాయనః' 'దాక్షాయణః' అనునవి యుదాహరణములు. 'గార్గ్య' 'వాత్స్య' ఈ రెండును, యఞంతములు. 'దాక్షి' ఇఞంతము.

'పరమ గార్గ్యాయణః' 'పరమ వాత్స్యాయనః' 'పరమదాక్షాయణః'అనవియు నుదాహరణములు. అచ్చట గూడ, గార్గ్య, వాత్స్య 'దాక్షి'— అను వానికి పరముగనే ప్రత్యయము ప్రవర్తించినది కాని పరమ గార్గ్య, పరమ వాత్స్య, పరమ దాక్షి, — అను సముదాయము కంటె పరముగ ప్రవర్తింపలేదు. అట్లు

ప్రవర్తించిన, 'పారమగార్గ్యాయణః' 'పారమ వాత్స్యాయనః' 'పారమ దాక్షాయణః'— అని కావలసివచ్చును.

'అపఞ్చమ్యాః' అనుటకేమి ప్రయోజనము ?

'దృషత్తీర్ణా' - పరిషత్తీర్ణా' — అనునవి సిద్ధించుట. అదిత్వాప్లవన తరణయోః ఆను ధాతువు యొక్క క్తప్రత్యయాంతములు ప్రకృతిగా గల స్త్రీ ప్రత్యయాంత రూపములు.

"రదాభ్యాం నిష్ఠాతోనః పూర్వస్యచ దః" (8-2-42) అను సూత్రముచే రేఫ కంటే పరమగు నిష్ఠా ప్రత్యయ తకారమునకు నత్వమును తరువాత ణత్వమును అట ప్రవర్తించినవి ఆ సూత్రమున రదాభ్యాం అనునది పంచమి. దాని కంటె పరముయిన ప్రత్యయమనగా నిష్ఠా ప్రత్యయమగు 'త' అనునది. అచ్చట తదంత విధి ప్రవర్తించిన, రేఫ దకారముల కంటె బరమగు నిష్ఠాంత తదాది యొక్క తకారమునకు నత్వమగునని యా సూత్రమున కర్థమయ్యెడిది. అపుడు, 'దృషద్' అను శబ్దము నందలి చివరి దకారము కంటె పరమయిన నిష్ఠాంతము 'తీర్ణ' అనునది గాన ధాతుతకారమునకు నత్వము రావలసివచ్చును. అట తదంత విధిలేకుండుటకై, పంచమ్యంతము కంటె పరమయిన ప్రత్యయము కార్యాంతర విధానమునకు పరిగ్రహింపబడినపుడు తదంతవిధి ప్రవర్తింపదని, 'అపఞ్చమ్యాః' అనునది తెలియజేయును. అందులకై అది ఆవశ్యకము. అందువలన అట ధాత్వవయవ రేఫకంటె పరమైన క్త ప్రత్యయ తకారమునకే నత్వము సిద్ధించినది—

**వా॥ "అల్గ్రహణేష్వనర్థకేన తదంత విధిః"** అని వేరొక వార్తికము.

అనర్థకమయిన దానితో తదంత విధి ప్రసక్తమయినపుడు, ఆ అనర్థక మల్మాత్రమైననే అది ప్రవర్తించును గాని తదితరముతో ప్రవర్తింపదని చెప్ప వలెనని వార్తికార్థము॥

ప్రయోజనమేమి ? అనిన,

"ఇన్హన్ పూషార్యమ్ణాంశౌ" (6-4-12) అను సూత్రమునందలి 'హన్' అను దానిచే 'ప్లీహన్' అను హన్నంతము గ్రహింపబడ కుండుటయు, "ఉదఃస్థాస్తమ్భోః పూర్వస్య" (8-4 61) అను పూర్వ సవర్ణము 'గరుత్మత్ + స్థానమ్' అనుచోట ఉదంత స్థలమున ప్రవర్తింపకుండుటయు, "స్త్రియాః" (6-4-79) అను ఇయఙ్విధాయకము నందు, స్త్రీ గ్రహణముచే, శ(స్త్రీ), యను తదంతమునకు గ్రహణము లేకుండుటయును, "సంపరిభ్యాం కరోతౌ భూషణే" (6-1-37) అను సుడాగమము,

ఆ సూత్రమునం దలి 'సం' అను పదముచే, 'పాయసం' అను సమంతము గ్రహింపబడిన, 'పాయసం కరోతి'- అనుచోట ప్రవర్తింపకుండుటయు ప్రయోజనములు.

ఈ వచన మెందులకు ? దీని ప్రయోజనము, 'పదాంగాధికారే తస్యచ తదుత్తర పదస్యచ' అను వచనము చేతనే సిద్ధింపదా ? అని యాక్షేపము ప్రాప్తించుచున్నది.

'అలై వానర్థకేన'- అను నీ నియమమునకు, 'ప్లీహానౌ' ఇత్యాదులం దుపధాదీర్ఘము సిద్ధించుట ప్రయోజనముగదా. అది అన్యథా సిద్ధించును. ఇన్, హన్, పూషన్, అర్యమన్- అను దీనికి 'శి' ప్రత్యయము పరమగునపుడే ఉపధాదీర్ఘము ప్రవర్తించునను నియమము కలదుగదా. అందువలన 'వృత్రహణౌ' అనుచో దీర్ఘములేదు. కాని ప్లీహన్ శబ్దమునకు ప్లీహానౌ అని దీర్ఘఘటిత రూపమే సమ్మతము. అచట 'ఇన్ హన్' అను నియమమేల ప్రవర్తింపలేదనిన, అది అనర్థకమయినను, అల్రూపము కాదుగాన అట తదంత విధిలేదనిగదా సమాధానము చెప్పవలెను ? ఆ ప్రయోజనము పదాంగాధికార పరిభాషచే సిద్ధించును. ఎట్లనగా- 'ఇన్హన్' అను సూత్రము అంగాధికారములోనిది. 'ప్లీహానౌ' అనుచోట హన్ అనునది తత్తునుగాదు. అనగా అంగమునుగాదు సమాసమును కాదుగాన తదుత్తర పదమునుగాదు. కనుక తదంత విధికి ప్రాప్తిలేదు. 'శి' పరమైనపుడే అను నియమముండదు. కావున అట ఉపధాదీర్ఘము సిద్ధించును. "నచేదంతత్ నాపి తదుత్తరపదమ్".

అశ్లే, "స్త్రియాః" (6-4-79) అనునది అంగాధికారీయము.

'సం' గ్రహణము పదాధికారములోనిది. 'ఉదఃస్థా' అనునదియు నట్టిదియే పదాధికారమునందును అంగాధికారమునందును విహితములగు కార్యములు సూత్ర గృహీతమునకును, తదుత్తర పదమునకును ప్రవర్తించునని గదా యర్థము. పదమనగా కేవల పదమును ఉత్తర పదమునుగూడ గ్రాహ్యము. కాగా, 'అలై వానర్థకేన' అను వచనము పదాంగాధికార వచనముచే గతార్థమగునని ఆక్షేప తాత్పర్యము.

ఆ పదాంగాధికార పరిభాష అవక్తవ్యమగును. 'అలైవా నర్థకేన' అను వచనముచే అర్థవత్తుకు తదంత విధి యుండునుగదా ! కావున 'వృత్రహణౌ' సిద్ధించును. ప్లీహన్లో 'హన్' అనర్థకముగాన ప్లీహానౌ అను రూపమును నిరాబధము.

అయినను నిందేది యుక్తతరమగును ? 'యేన' విధిరితి తదంత విధియా ?

వార్తికోక్తమగుచున, 'ఉత్తర పదస్య' అను నంశముచే ఫలించిన తదంత విధియా ప్రశస్యతరము ? అనిన,

ప్రాథమ కల్పిక తదంత విధియే ఉచితము. అనియే 'అత్రైవ' అను వచనముచే నియమింపబడుచున్నది ఈ కల్పమున, పరమాతిమహాన్ అను పదియు సిద్ధమగును. అత్యంతం మహాన్=అతిమహాన్॥ పరమశ్చాసౌ అతిమహాంశ్చ=పరమాతి మహాన్; ఇట, 'పరమాతి మహాన్' అను సమాసము మహాచ్ఛబ్దమును గాదు మహచ్ఛబ్దోత్తర పదమును గాదు. అది అతిమహచ్ఛబ్దోత్తర పదము అందువలన 'సాంతమహతః' అను దీర్ఘము రాక పోవును.

వా॥ "అనినస్మన్ గ్రహణానిచ" - ప్రయోజన వార్తికాంతరము.

అన్, ఇన్, అస్, మన్- అనునవి గ్రహింపబడిన, "అల్లోపోఽనః" (6-4-134), "ఇన్హన్ పూషార్యమ్ణాం శౌ" (6-4-12), "అత్వసంతస్య చాధాతోః" (6-4-14), "మనః" (4-1-11) అను సూత్రములందును, అవి యర్థవంతము లయ్యును, అనర్థకములయ్యును, తదంత విధి ప్రయోజకములగును అని వార్తికార్థము.

కనుక అల్లోపము 'రాజ్ఞా' అనుచో సార్థకాన్నంతమునందును, 'సామ్నా' అను అనర్థకాన్నంతమునను ప్రవర్తించినది.

'దండి' అను సార్థకేన్నంతమునందును, 'వాగ్మి' అను నర్థకేన్నంతమునను, "సౌచ" (6-4-13) అను నుపధాదీర్ఘము ప్రవర్తించినది.

అట్లే, 'సుపయాః' అను నర్థవదసంతమునందును, 'సుస్రోతాః' అనుచో ననర్థకాసంతమునను, 'అత్వసంతస్య' అను ఉపధాదీర్ఘము సిద్ధించినది.

'సుశర్మా' అనుచో 'మన్' సార్థకము 'సుప్రథిమా' అనుచో నది యనర్థకము. మన్నునది, సార్థకానర్థకోభయ రూపములచేతను తదంత విధి ప్రయోజకమగుటచేతనే, "మనః" (4-1-11) అను ఙీబ్నిషేధముభయత్ర, ప్రవర్తించి

ఇక, తదంత విధి కపవాదమగు తదాది విధిని నిరూపించు వార్తికము. అది - వా॥ "యస్మిన్విధిస్తదాదావల్గ్రహణే" అనునది. "యేన విధిస్తదంతస్య" అని చెప్పినట్లే సూత్రకారుడు "యస్మిన్విధిస్తదాదావల్గ్రహణే" అనియును చెప్పవలసియున్నది అని యర్థము.

ప్రయోజనమేమి? అనిన, తదాది విధి లేనిచో, "అచి శ్ను ధాతు భ్రువాంయ్వోరియఙువఙౌ" (6-4-77) అను సూత్రముచే విహితములయిన ఇయఙువఙాదేశములు, శ్రియౌ భ్రువౌ అను స్థలములందే ప్రవర్తించునుగాని, 'శ్రియః' 'భ్రువః' అను అజాది ప్రత్యయము పరమగునపుడు సిద్ధింపకపోవును. 'యస్మిన్' అనునది సప్తమ్యంతములకు ఉపలక్షణము. కాగా, 'అల్బోధక సప్తమ్యంతము విశేషణమయినపుడు ఆరంభింపబడిన విధులు, తదంతములందు గాక తదాదులందు ప్రవర్తించును' అని అర్థము.

॥యేన విధి స్తదంతస్య॥

## వృద్ధిర్యస్యాచా మాదిస్త ద్వృద్ధమ్

ఏ ప్రాతిపదికమునందలి అచ్చులలో మొదటిది వృద్ధిసంజ్ఞ గల అచ్చుగా నుండునో, ఆ ప్రాతిపదికము 'వృద్ధ' సంజ్ఞ కలదియగును- అని సూత్రార్థము.

### పద కృత్య విచారము

ఇందు వృద్ధి పదమునకు ఏమి ప్రయోజనము? అని ప్రశ్న. అది లేనపుడు "యస్యా చా మాదిస్త ద్వృద్ధమ్" అనియే సూత్రమగును. అపుడు, 'అచామ్' అనునది నిర్ధారణషష్ఠి కాదు. సంబంధ సామాన్యషష్ఠియే యగును. ఆదిశబ్దమునకు 'పూర్వ సమీపము'=దగ్గరగానున్న ముందు వర్ణము అని యర్థమగును.

కాగా, ఏ ప్రాతిపదికమునందలి అచ్చుల పూర్వ సమీపవర్ణము, తద్విలక్షణమయిన హల్లగునో, ఆ ప్రాతిపదికము 'వృద్ధసంజ్ఞకము' అని యర్థము పర్యవసితమగును. అపుడు 'దత్త' 'రక్షిత' అనునవియు వృద్ధసంజ్ఞ కలవియగును. 'తత్సంబంధులు' అను నర్థమున 'ఛ' ప్రత్యయము వచ్చి, 'దత్తీయాః' 'రక్షితీయాః' అను నవిష్టరూపములేర్పడును. 'దాత్తాః' 'రాక్షితాః'- అను అణంతరూపములే సాధువులు.

'యస్య' అను పదమునకు ప్రయోజనమేమి?

అది వ్యపదేశార్థ మావశ్యకమగునని సమాధానము, అది లేనిచో "వృద్ధిరచామాదిస్త ద్వృద్ధమ్" అని సూత్రమగును. అపుడు 'తత్' అను పదము దేనిని ప్రత్యవమర్శించును? వ్యపదేశమనగా సంజ్ఞి నిర్దేశము. యస్య అను పదమునకు సముదాయస్య అని యర్థమై తత్పదమాసముదాయమును ప్రతినిర్దేశించు అవకాశము కలుగును.

## ఇక అజ్గ్రహణమునకేమిపని ?

"వృద్ధిర్యస్యాదిస్త ద్వృద్ధమ్" అని అంతమాత్రమే సూత్రమయిన, సముదాయాది, వృద్ధి వర్ణముగాగల, 'ఐతికాయన' 'ఔపగవ' అనువానికే ఆ సంజ్ఞ ప్రవర్తించును. 'ఐతికాయనీయాః' 'ఔపగవీయాః' అను రూపములు సిద్ధించినను, 'గార్గీయాః' 'వాత్సీయాః' అనునవి సిద్ధింపవు. గార్గ్యవాత్స్య శబ్ద ముల ఆదివర్ణము హల్లుగాని అది వృద్ధిగాదు.

ఇక ఆదిపదమున-కేమి ప్రయోజనమని ప్రశ్న.

"వృద్ధిర్యస్యాచాం తద్వృద్ధమ్" అని సూత్రముయిన, 'సభాసంనయనే భవః=సాభాసంనయనః' అనుచోగూడ సభాసంనయన శబ్దమునకు వృద్ధసంజ్ఞ ప్రసక్తమయ్యెడిది. 'అచామ్' అను షష్ఠ్యంత పదోపాదాన సామర్థ్యమువలన నాది శబ్దమున కధ్యాహారము కలుగవచ్చునుగాని, అది లేకున్నను, 'ఏ అవ యవి యచ్చులలో వృద్ధి వర్ణముకూడ నొకయవయవమో అది 'వృద్ధ'మగును అని యర్థముకావచ్చును. కావున ఆది శబ్దాధ్యాహారమునకు ప్రమాణము దుర్ల భము కాగా సూత్రమున తదుచ్చారణమే కర్తవ్యమని భావము.

**వా॥ "వృద్ధ సంజ్ఞాయామజ్సంనివేశా దనాదిత్వమ్"** అని ఆక్షేప వార్తికము.

వార్తిక తాత్పర్య మిది — హల్ ఘటితములు కాని అచ్చులు మాత్రమే సంనివిష్టములయి యుండు ప్రాతిపదికమునకే సంజ్ఞ ప్రవర్తించుట యుచితము. సూత్రము నందు 'అచామ్' అని కేవలాచ్సముదాయమే నిర్దిష్టము. అచ్చుల కట్టి సంనివేశము మాతృకా పాఠము నందు దక్క పదము నందును సంభవింపదు. అట వృద్ధ సంజ్ఞా ప్రయుక్త కార్యములకు ప్రసంగము లేదు. ఏ ప్రాతిపదికముయినను, అచ్ హల్ సముదాయ రూపమే. కాగా, 'అజ్మాత్ర సంబంధి సముదాయమునకాది వర్ణము, వృద్ధ్యతరమయిన నది వృద్ధమగును' అని చెప్పుటకు సంభవమే లేదు. కేవలాచ్చులకు సంనివేశమే పొసగదు గదా ?

సత్యమే, అచ్చులకు క్రమ సంనివేశము సంభవింపదు. కాని అచ్చులును హల్లులును గల సముదాయము నయినను, అది అచ్చే అయిన సముదాయము నకు వృద్ధసంజ్ఞ కలుగునని వివక్షింపబడును. కావున నా యాక్షేపము లేదు. 'అచామ్' అనునది నిర్ధారణషష్ఠిగదా.

అట్లర్థమును గ్రహించుట శక్యముగాదు. అట్లైన 'ఔపగవీయాః' అను చోటనే ప్రవర్తించి, 'గార్గీయా' అను స్థలమున బ్రవర్తింపకపోవును. ఏలయన,-

అచామ్ అనునది ఆది పదమునకు విశేషణము గాక ప్రధానమగు 'వృద్ధిః' అను దానికే విశేషణమగును.

అచ్చులలో ఆద్యరూపమగు వృద్ధి. ఏ సముదాయమునకాది వర్ణమయి యుండునో యది వృద్ధ సంజ్ఞకమగునని అర్థమగును. అపుడాకారమునకు వృద్ధ సంజ్ఞా నిమిత్తత్వము లేకపోవును. ఆ కార మచ్చుకాదు అది అతర సమామ్నాయికము కాదు గదా! అది 'అచ్చు' అనిపించు కొనకున్నను, గ్రహణకశాస్త్రము వలన అచ్కార్యములను పొందును. కాగా 'ఔపగవీయాః' అనుచో ఔకారము అతర సమామ్నాయికముగాన సంజ్ఞసిద్ధించినను 'గార్గీయాః' అనుచో సిద్ధింపదని భావము.

అట్లయిన ఏకాంతా దిత్వము వివక్షితమగునని సమాధానము.

ఏకాంతము లనగా నవయవములు. 'ఏ సముదాయమున కవయవము లయిన యచ్చులలో, ఆద్యచ్చు వృద్ధి వర్ణమగునో, ఆ సముదాయము వృద్ధము'— అని సూత్రార్థము. వృద్ధి వర్ణము సముదాయమునకాది కాబనిలేదు. కాగా, 'గార్గీయాః' అను స్థలమునకు సంజ్ఞ సిద్ధించును.

వా॥ "ఏకాంతాదిత్వేచ సర్వ ప్రసఙ్గః" అని మరల, ఆక్షేప సాధక వార్తికము.

'అపుడు,— అన్ని యచ్చులకును నాదియగునది వృద్ధి వర్ణమయిన'— అను విశేషాంశము లేనందున, మధ్యనుండు ఆకారము గూడ, ఇతరాచ్చుల దృష్టిలో జూచిన సర్వాచామాదియగును గాన, సభా సంనయన శబ్దమునందలి భకారాకారమును అట్టిది యగుటవలన ఆ పదము వృద్ధ సంజ్ఞకము కావలసి వచ్చును. కాగా ఛప్రత్యయ ప్రసంగము.

అట్లైన ఆది పదము వ్యర్థము గాదా యనిన, నది 'ఖట్వా' ఇత్యాదులందు ఆకారమంత్యమగునపుడు సంజ్ఞను వారించుటకు సార్థకమగును.

వా॥ "సిద్ధమజాకృతి నిర్దేశాత్" — అని సమాధాన వార్తికము.

ప్రాతిపదికము అచ్ హల్ సముదాయ రూపముగ నుండును. అయినను 'అచామ్' అను పదముచే అజాకృతియే గ్రాహ్యము.

ఏ శబ్దము నందలి, సకలాచ్చులలోను వృద్ధి వర్ణమాదిగా యుండునో, అది వృద్ధము.

"ఈ పంక్తిలో, బ్రాహ్మణులలో మొదటనున్న వానిని దీసికొనిరమ్ము" అనిన శూద్రాదులా నడుమ నున్నను వారిని వర్జించి, బ్రాహ్మణ జాతీయులలో, ప్రథమునే తీసికొని వత్తురు.

కాగా సర్వ ప్రసంగము కలుగదు —

**వా॥ "వ్యంజనస్యావిద్యమానత్వం యథాన్యత్ర"**— అన్యత్ర=స్వర విషయమున "స్వర విధౌవ్యంజన మవిద్యమానవత్"- కేవలాచ్కుల సంనివేశము సంభవ రహితము. కావున హల్లు లున్నను వానికవిద్యమానవద్భావము వక్తవ్యము. స్వర విషయము దృష్టాంతము.

దేవదత్తుని వారు, దేవదత్తీయులును, దైవదత్తులును నగుదురు. కావున ఆధునిక పౌరుష నామములగు, దేవదత్త యజ్ఞదత్తాదినామధేయములకు "వానామధేయస్య" అను వార్తికముచే వృద్ధ సంజ్ఞ వికల్పితము.

**వా॥ "గోత్రోత్తర పదస్యచ"** అని వేరొక యాక్షేప వార్తికము—

గోత్రమనగా అపత్యమని యర్థము. శాస్త్రీయ గోత్రము కాదు. అపత్య ప్రత్యయాంత ముత్తర పదముగ గల దానికిని వృద్ధ సంజ్ఞ వక్తవ్యమని వార్తికార్థము. "కమ్బల చారాయణీయాః" "ఓదనపాణినీయాః" "ఘృత రౌఢీయాః" అని యుదాహరణములు.

కంబల ప్రియుడగు చారాయణుని శిష్యులు, ఓదన ప్రియుడగు పాణిని శిష్యులు, ఘృత ప్రియుడగు రౌఢి ఛాత్రులు అని యర్థము.

ఇవి మూడు రూపములును "వృద్ధాచ్ఛః" (4-2-114) అను సూత్రముచే విహితమయిన ఛప్రత్యయ మంతమున గలవి.

చారాయణ, పాణిని, రౌఢి, అనునవి అపత్య ప్రత్యయాంతములు. తదుత్తర పదము లయినవి కంబల చారాయణ, ఓదన పాణిని, ఘృత రౌఢి — అనునవి.

**వా॥ "గోత్రాంతాద్వా అసమస్తవత్"** అని న్యాసాంతరము.

"గోత్రోత్తర పదస్యచ" అని వృద్ధ సంజ్ఞను విధింపకుండ, గోత్ర ప్రత్యయాంతోత్తర-పదములయిన, కంబల చారాయణాదులు, అసమస్తము లయిన-చారాయణ, పాణిని, రౌఢి — మున్నగు శబ్దముల వలెనే వృద్ధ సంజ్ఞా కార్యములను బొందును, అని యైన జెప్పనగును.

ఇందు, 'చారాయణ' అనునది వృద్ధ సంజ్ఞ కలది యగుటవలన చారా-

యుణుని ఛాత్రులు చారాయణీయులు అని వ్యవహరింపబడినట్లు, అది సమాస ఘటకమయినపుడు, వృద్ధత్వము లేకున్నను, తత్సంజ్ఞా కార్యములను బొందు ననుట. ఈ ఉపసంఖ్యాన వచనమునకును అవియే-యుదాహరణములు॥

ఈ అసమస్త పదతిదేశము, సకల గోత్రాంతోత్తర పదములకును తుల్యమేనా ? విశేషమేమయిన గలదా ? అనిన,

తుల్యము కాదు. వా॥ "జిహ్వాకాత్యహరిత కాత్యవర్జమ్" ఇందు కాత్య అనునది యఞంతము. వృద్ధ సంజ్ఞ కాని, అసమస్త పదాభావము కాని ఇట ప్రవర్తించిన, తచ్ఛాత్రులకు 'జైహ్వాకాతాః" 'హారితకాతాః'— అను వ్యవహారము సిద్ధింపకపోవును. జిహ్వాచాపల్యముగల కాత్యులు, హారితవర్ణము గల కాత్యులు, అర్థము.

ఇందేది యుక్తతరము ? వృద్ధ సంజ్ఞా వచనమా ? అతిదేశమా?

అతిదేశమే శ్రేయము. ఇపుడు, పిఙ్గల కాణ్వస్య ఛాత్రాః='పైఙ్గల కాణ్వాః' అనునదియు సిద్ధించును. వృద్ధ సంజ్ఞయే ప్రవర్తించిన, నట ఛప్రత్యయము దుర్వారమగును.

॥వృద్ధి ర్యస్యాచామాది స్తద్వృద్ధమ్॥—ముగిసినది॥

## "త్యదాదీనిచ" (1-1-73)

పూర్వ సూత్రము నందలి 'యస్యాచామాదిః' ఉత్తర సూత్రము లందనువర్తించునా ? అనువర్తింపదా ? అని ప్రశ్న.

ఎట్లైన నేమి ? అందేమి విశేషము గలదు ?

అనువర్తించుననిన, 'త్వత్పుత్రస్య ఛాత్రాః=త్వాత్పుత్రాః' 'మాత్పుత్రాః' అనుచోట గూడ వృద్ధసంజ్ఞ ప్రసక్తమయ్యెడిది. 'త్వదీయః' 'మదీయః' అను నిష్పన్నస్థలములందు లేకపోయెడిది.

'యస్య ఆదిస్త్యదాదిః తత్ వృద్ధమ్' అని అపుడర్థమగును.

'త్వత్పుత్ర' అను దాని ఆదియగు 'త్వత్' త్యదాది. కావున వృద్ధసంజ్ఞ ప్రవర్తించి, ఛ ప్రత్యయము రావలసి వచ్చును. త్వదీయ మదీయలలో అది, త్యదాది కాదు గాన రాకపోవును. 'అచామ్' అనునదిందనువర్తించినను, త్యదాది అచ్చులలో నాది యగుట అసంభవముగాన వాక్యార్థమున అన్వయము కలిగి కాదు. తదనువృత్తి కేవలము ఉత్తరార్థము.

యస్యాచామాదిగ్రహణ మనువర్తింపదగిన, ఏఙ్ ప్రాచామనుచో నయ్యది కర్తవ్యమగును.

అట్లైన ననువర్తించుననియే అందుము.

'త్యాతుప్రత్యా' 'మాతుప్రత్యాః'- అనునవి యెట్లు సిద్ధించును? అనిన, ఆ 'యస్యాదిః' అనునది, వృద్ధి పద సంబంధము ననురోధించునేగాని విడచి పెట్టదు. వృద్ధి గ్రహణ సంబద్ధమునకే అనువృత్తి గాన దానికి త్యదాదులతో సంబంధము కుదురదు. కలుగదు.

"వృద్ధి ర్యస్యాచామాదిస్తద్వృద్ధమ్" అచ్చులలో నాద్యచ్చు వృద్ధిగా గల ప్రాతిపదికము వృద్ధ సంజ్ఞకమగును అని దాని యర్థము. తరువాత, "త్యదాదీనిచ" అనునది. త్యదాదులును వృద్ధసంజ్ఞ కలవియగును. 'యస్యాచామాదిర్వృద్ధిః' అని ఇందనువర్తించుననుకొనుము. అయినను, త్యదాదులు అచ్చులు కావుగాన, "దేని యచ్చులలో నాది త్యదాదియో"- అను రీతిగా సంబంధమిట అసంభవము. ఆదిగ్రహణ మనువర్తించినను అది వృద్ధి గ్రహణ సంబద్ధమగుటచే "యస్యాదిర్వృద్ధిస్త్యదాదిః" అను నన్వయము పొసగదు.

'ఏఙ్ ప్రాచాందేశే' అను సూత్రమునందు 'యస్యాచామాదిః' అను నంతవర కనువర్తించి, వృద్ధిగ్రహణము నివర్తించును. స్వరితత్వ ప్రతిజ్ఞానము వలన 'యస్యాచామాదిః' అనునందిందే యనువర్తించునుగాని 'త్యదాదీనిచ' అను సూత్రములోని కనువర్తింపదు. అది యెట్లన- ఒక బాటసారి గహనమగు కాంతారమును దాటవలసి వచ్చినపుడు సాహ్యముకొరకు, తోడి బాటసారుల గుంపుననుసరించును. అడవిని దాటిన పిదప నా సంఘమును వదిలిపెట్టును. అట్లేయనుట.

॥త్యదాదీనిచ॥ సమాప్తము.

## "ఏఙ్ ప్రాచాందేశే" (1-1-74)

**వా॥ "ఏఙ్ ప్రాచాందేశే శైషికేషు" అని వార్తికము.**

ఏకార ఓకారములు ఆద్యచ్చులుగాగల ప్రాతిపదికము వృద్ధసంజ్ఞకమని యర్థము. 'ఏణీపచనము' 'గోనర్దము' భోజకటము మున్నగునవి దేశములు. ఆ పదములేజాదులు. వృద్ధసంజ్ఞా వికల్పముచే, ఛప్రత్యయమును, పక్షమున 'అణ్ ప్రత్యయమును వచ్చును. ఏణీపచనీయః-'ఐణీపచనః'మున్నగునవి యుదాహరణములు. అట్లే 'సేపురము' 'స్కో నగరము' అని రెండు వాహీక గ్రామములు. వాహీకమని దేశ విశేషము. అది ధర్మబహిర్భూత మగుటచే దానికా వ్యవహారము కలిగినది.

'సైపుర' సౌ్కనగర శబ్దములకు భావార్థమున వృద్ధసంజ్ఞ వలన "వాహీక గ్రామేభ్యశ్చ" (4-2-117) అని 'ఠఞ్' ప్రత్యయమును, 'ఞిఠ' అను ప్రత్యయమును రాగా, సైపురికీ సైపురికా. సౌ్కనగరికీ సౌ్కనగరికా అని రూపములగును. ఠఞంతము ఞిఠంతమును, 'ఞిఠ' ప్రత్యయాంతము టాబంతమును నగును. 'శైషిక ప్రత్యయార్థ విషయముననే వృద్ధసంజ్ఞ' యనుట వలన, అపత్య వికారార్థములందు వృద్ధలక్షణ ప్రత్యయము అగు 'ఫిఞ్' 'మయట్' ప్రత్యయములు ప్రవర్తింపవు. "ఏఙ్ ప్రాచాం దేశే"

నవమాహ్నికాంధ్ర వివర్తము సమాప్తము